# GREAT A CLOUD OF WITNESSES

(History of Godavari Delta Christian Assemblies)

by

K. Job Sudarshan

© Jeevan Jyothi Press, Narsapur

1st edition January 1986

All rights reserved. No part of this book
may be reproduced by any method
whatsoever, without permission in writing of
the copyright owner

Edited, Printed and published by K. Wilson
at Jeevan Jyothi Press & Publishers,
Narsapur 534 275, West Godavari Dt.
A.P. Phone: 107



# అంకితం

ఈ చరిత్రలో
భాగస్వాములైన
సాక్షి
సమూహానికి

# కృతజ్ఞత

పాలకొల్లు సంఘాల్లో విశేషంగా సేవచేసిన

**కీ.శే. ముప్పిడి జేకబ్ రాబర్ట్సు కాన్‌గారి**

స్మృతి చిహ్నంగా

వీరి సతీమణి

**శ్రీమతి ఎం. విలాసమ్మ రాబర్ట్సు కాన్‌గారు**

(నరసాపురం)

వీరి కుమారులు

**శ్రీ ఎం. పెర్సీపాల్‌గారు** (లండన్)

తదితర కుటుంబ సభ్యులు

అందజేసిన విరాళానికి కృతజ్ఞులం

— ప్రకాశకులు

# గొప్ప
# సాక్షి
# సమూహం

గోదావరి డెల్టా క్రైస్తవ
సంఘచరిత్ర

రచయిత
కె. జోబ్ సుదర్శన్

సంపాదకుడు
కె. విల్సన్

మూల్యం
రు. 30/-

ప్రకాశకులు
**జీవన్‌జ్యోతి ప్రెస్ అండ్ పబ్లిషర్స్**
మిషన్ హైస్కూల్ రోడ్
నరసాపురం 534 275,
ప.గో. జిల్లా (ఆం.ప్ర.)

ముఖచిత్రం :

సర్ ఆర్థర్ కాటన్
ధవళేశ్వరంలో నిర్మించిన
ఆనకట్ట దృశ్యం.

వెనక పేజీ :

పాలకొల్లు గోపురం. ఈ కూడలిలో నిలిచి
బౌడన్, బీర్, హీలిస్‌గార్లు
సువార్త ప్రకటించేవారు.

# నమస్కారం

ఈ గ్రంథ రచన నా రచనా జీవితంలోనేగాక నా విశ్వాస జీవితంలోనే ఒక మహోత్కృష్టమైన సంఘటన. ఈ చరిత్ర మీది. దీని గ్రంథస్థం చేసిన భాగ్యం నాది. ఇందుకు మన పరమ తండ్రియైన దేవునికి, రక్షకుడైన యేసుక్రీస్తుకూ, ఆదరణకర్తయైన పరిశుద్ధాత్మునికీ మనః పూర్వకంగా స్తుతులనర్పిస్తున్నాను. ఈ రచనకు నన్ను నియమించి ప్రోత్సహించిన జీవనజ్యోతి ప్రెస్ జి.డియం. హిస్టరీ కమిటీ వారికి నా వందనాలు.

మన జి.డి.యం. చరిత్రకు మార్గదర్శకుడు ఇ.బి. బ్రామ్లీగారే. మొదటి నూరేళ్ళ చరిత్రకు ఆధారం వీరు రాసిన "They were men sent from God" అన్న పుస్తకమే. ఈ పుస్తకంలో వీరు చెప్పక వదిలేసిన మన తెలుగు భక్తుల చరిత్రాంశాలను సి. జోనాగారు తన 62 పేజీల చరిత్ర పుస్తకంలో సవిస్తరంగా రాసిపెట్టారు. ఇవిగాక పాలకొల్లు, వీరభద్రపాడు, అత్తిలి, అంతర్వేదిపాలెం, ప్రత్తిపాడు తదితర సంఘాల చరిత్రను ఆ సంఘ పెద్దలే సంక్షిప్తంగా ఆయా సందర్భాల్లో రాసి ప్రచురించారు. ఇంకా ఆస్పత్రి, ప్రెస్ తదితర సంస్థల సావనీర్‌లుకూడా నాకు ఈ రచనలో ఉపకరించాయి. Echoes of Service వారు ప్రచురించిన Turning the World Upside down, The Challange of India అనే పుస్తకాలు, In His Name అనే న్యూజిలాండు మిషనెరీ సొసైటీ వారి పుస్తకమూ మిషనెరీల సేవను గురించిన వివరాలను అందించినాయి. ఈ చరిత్ర పుస్తకం పేజీల్లో ఎక్కడకక్కడ నేను విషయ సేకరణ చేసిన మూలం (Source) ను ఫుట్‌నోట్స్‌లో వెల్లడి చేసాను. చరిత్రాంశాల్లో పొరపాటులు దొర్లివుండవచ్చు. సమయం తక్కువగా ఉండడమే ఇందుకు కారణం.

ఒక వ్యక్తి ఒక గొప్ప పని చెయ్యాలంటే అంతకుముందు ఎందరో

గొప్పవాళ్ళ గొప్పతనాన్ని ఆసరా చేసుకుని నిలబడితేనేగాని చెయ్యలేడు. సర్కస్‌లో ప్రదర్శకులు ఒక మనిషిమీద ఒక మనిషి నిలబడతారు. చివరిగా అందరిమీదుగా ఎక్కి వాళ్ళ భుజాలమీద నిలబడి విన్యాసాలుచేసేవానినే అంతా మెచ్చుకుంటారు. కాని క్రింద వాళ్ళంతా లేకపోతే అతనికాపని సాధ్యం కాదు. ఈ చరిత్ర రచనలో ఎందరెందరో చేసిన ప్రయత్నాలను ఆసరాగా చేసుకుని దీన్ని రాయగలిగాను.

అలాటివారిలో ముఖ్యుడు గళ్ళా సమూయేలుగారు [ఎ.జి.డి.యం.ఏ మాజీ కార్యదర్శి]. 10 నోటు పుస్తకాలనిండా మన సంఘాలన్నీ దర్శించి ప్రస్తుత చరిత్రను శ్రమించి రాసి ఈ గ్రంథ రచనకు సోపానాలను సిద్ధపర్చిన యోగ్యుడీయన. వారి శ్రమఫలితమే ఈనాడు ఈ గ్రంథం మన చేతిలో ఉండడం. వారిని ఈ సమయంలో జ్ఞాపకం చేసుకోవడం మన విధి. నేను వ్యక్తిగతంగా కొందరిని కలుసుకుని విషయాలను సేకరించాను. వారందరి పేర్లను ఉదహరించడం సాధ్యంకాదు. వారందరికీ నా కృతజ్ఞతలు

సంఘపెద్దలు సి.జి. ప్రకాశరావుగారు, పి. జోబ్‌మోజెస్‌గారు, ఒ. ఫ్రాన్సిస్‌గారు, కె.ఎస్. జాక్సన్‌గారు, పి. లాజరస్‌గారు, టి.కె. జారి గారు, బి. థియోడోర్‌గారు, స్పర్జన్ పీటర్‌సన్‌గారు నా వ్రాత ప్రతిని చదవగా విని చేర్పులు, మార్పులు చేయడానికు సహకరించారు. ముఖ్యంగా చరిత్రకారుడు, గ్రంథకర్త ఫ్రాన్సిస్‌గారు నా పనిలో సహకరించడం నా అదృష్టం. పైని పెద్దలందరికీ వందనాలు. థియోడోర్‌గారు నా శైలిని భాషను సరిదిద్ది రచన సరళంగా సక్రమంగా ఉండేందుకు సలహాలనిచ్చారు. వారికి నా ప్రత్యేకమైన కృతజ్ఞతలు.

బ్రిటన్‌లో బ్రదరెన్ సంఘాల ఆవిర్భావం అన్న భాగానికి మూలం మిస్ ఆలివ్ రాజర్స్‌గారి పరిశోధనా వ్యాసం. ఇంతేగాక మిషనెరీల జీవిత చరిత్రలను సేకరించి వారు నాకందించి నా పనిని సులభం చేసారు. వారికి నా వందనాలు.

'గొప్ప సాక్షి సమూహము' అనే పేరును మన గోదావరి డెల్టా సంఘాల అధ్యక్షుడు సి.జి. ప్రకాశరావుగారు ఈ గ్రంథానికి ప్రతిపాదించడం, ఇది అందరికీ ఆమోదయోగ్యం కావడం ఎంతైనా సమంజసంగా సంతోష దాయకంగా ఉంది.

ఈ చరిత్ర గ్రంథ రచనా ప్రయత్నానికి ప్రాణం జీవనజ్యోతి ప్రెస్ డైరెక్టర్, మా మామగారు విల్సన్‌గారు. ఫలానా పాత్ర నిర్వహించినందుకు వారికి కృతజ్ఞతలు అని చెప్పడానికి వీలులేకుండా ఉంది. పరిశోధన, రచన, ఎడిటింగు, ఫోటోలు తదితర విషయ సేకరణ, ఆతిథ్యం, ఆర్థిక వ్యవహారాలు, ప్రూఫ్ రీడింగు, ఒకటనికాదు. అన్నిటికీ వారే భారం వహించి ఈ పుస్తకం ఇన్నేళ్ళకు వెలుగు చూసేందుకు దోహదం చేసారు. నేనేకాదు, గోదావరి డెల్టా విశ్వాసులంతా వారికి కృతజ్ఞులమై ఉన్నాము.

దీర్ఘకాలం నేను ఈ పుస్తకం రాస్తూ ఉండిపోయి నా తల్లి సంస్థ గ్రేస్ మినిస్ట్రీస్, సికింద్రాబాదుకు సంబంధించిన బాధ్యతల విషయాల్లో కొంత ఏమరుపాటు చూపినప్పటికీ సహృదయంతో క్షమించి అనుమతినిచ్చిన నా గురుతుల్యుడు జి.ఆర్. క్రో గారికి నా హృదయపూర్వకమైన కృతజ్ఞతలు.

ఈ చరిత్ర మనకు గర్వకారణం, అనుసరణీయం.

ఈ ధన్యకరమైన చరిత్రను రాయడానికి సర్వజ్ఞానియైన దేవుడు అల్పుడినైన నన్ను యోగ్యుడిగా ఎంచాడు. రాయించాడు. ఇంతకుమించి ఇంకా ఏమి చెప్పగలను. ఈ చరిత్రను ముందుగానే ఏర్పరచినవాడు, జరిగించిన వాడు, 150 సంవత్సరాల అనంతరం రాయించినవాడు మన ప్రభువైన యేసుక్రీస్తే. ఆయనకే సకల మహిమ, ప్రభావం చెందుతుందిగాక.

**కె. జోబ్ సుదర్శన్**

సికింద్రాబాదు.

ఉపమానం రీతిగా పెరిగి ఫలించి శాఖోపశాఖలుగా విస్తరించి మృగాలకు నీడ నిచ్చేదిగా ఆకాశ పక్షులకు ఆశ్రయాన్నిచ్చేదిగా మహా వృక్షంగా విస్తరిల్లింది. ఇందుకు మనమందరం సాక్షులం. ఈ మహిమాన్వితమైన సత్యాన్ని లోకానికి చాటి చెప్పేందుకే 1986 జనవరి 7వ తేదీనుండి 12వ తేదీవరకు గోదావరి డెల్టా సంఘాల శతవార్షికోత్సవం (150 సంవత్సరాల ఉత్సవాలు) ను జరుపుకుంటున్నాము. ఇది గోదావరి డెల్టా సంఘాల చరిత్రలో మైలురాయి.

ఈ సంగతులన్నిటినీ లిఖితపూర్వకంగా భద్రపరుచుకునే అపురూపమైన అవకాశం మనకు దక్కడం మనభాగ్యం. "ఈ సంగతులన్నియు దృష్టాంతములుగా వారికి సంభవించి యుగాంతమందున్న మనకు బుద్ధి కలుగుటకై వ్రాయబడినవి" అని పరిశుద్ధ లేఖనాల గురించి చెప్పబడిన దేవునివాక్యం ఈ పుస్తకానికికూడా వర్తిస్తుందనడంలో సందేహంలేదు. చరిత్రనుండి పాటాలు నేర్చుకోగలిగిననాడే మన జీవితాలు, మన సంఘాల ఉనికి క్షేమకరంగా ఉండేలా సరిదిద్దుకోగలం. ఈ చరిత్రద్వారా మనం నేర్చుకోదగిన పాటాలు అనేకం. ముఖ్యమైనదేమంటే మన పూర్వికులు సువార్తవ్యాప్తిపట్ల చూపిన ఉత్సాహం, ఉద్రేకం. సర్వసృష్టికి సువార్త ప్రకటించండి అన్న మన క్రీస్తు నాయకుని ఆజ్ఞవాళ్ళలో కలిగించిన ఉత్తేజం.

ఈ సందర్భంలో మన సంఘాల్లో యిప్పుడు కనిపించే పరిస్థితిని అందరూ పరిశుద్ధాత్ముని నడిపింపును పొంది ఆకళింపు చేసుకోవడం ముఖ్యం. ఒక దైవ సేవకుణ్ని ఎవరో అడిగారట. "అయ్యా అన్యజనులకు సువార్తను ప్రకటించకపోతే వారి గతి ఏమవుతుంది?" అందుకు ఆ భక్తుడు "అన్య జనుల సంగతేమోగాని వారికి సువార్త ప్రకటించలేకపోతే మనగతేమవుతుందో నని భయంగా ఉంది" అని జవాబిచ్చాడట.

జి.డి.యం. సంఘాలు తమకున్న రెండు బాధ్యలను స్పష్టంగా అర్థం చేసుకోవలసిఉంది. ఒకటి విశ్వాసుల సక్రమ పరిపాలన (క్రొత్తనిబంధన సంఘపు ఆదర్శాన్ని పాటించడం) రెండు సువార్త వ్యాప్తి. ఈ రెంటి మధ్య సమతూకాన్ని సాధించలేక మన సంఘాలు కర్తవ్య నిర్వహణలో తప్పటడుగు వేయకుండా చూసుకోవాలి.

పెద్దలు మనకి నేర్పించినవి, అవి సరైనవికావా అని మనం స్వంతంగా వాక్యంనుంచి సరిచూసుకున్న ఉత్తమ క్రైస్తవ సంప్రదాయాలను సంఘ

పాలనలో అనుసరించవలసిందే. మరోవైపు నిరాటంకంగా సువార్తీక కొనసాగవలసిందే. అయితే సువార్తీకరణలో తలమునకలైపో వాక్యానుసారంకాని "క్రొత్తబండి" సిద్ధాంతాలను సంఘంలో చొప్పించే అవి అభ్యంతరాలకూ, చీలికలకూ, దారితీస్తుందని తెలుసుకున్నా అలాగని దేవాలయం నాలుగు గోడలమధ్య ముక్కుమూసుకుని కూర బయటికి అడుగుపెడితే కాలికి మట్టి అవుతుంది అనుకోవడంవల్ల మొత్త సంఘప్రయోజనమే దెబ్బతింటున్నదని గ్రహించాలి.

యువకులు ఇప్పుడిప్పుడే ముందుకి వస్తున్నారు. ప్రతివారితో వ్యక్తిగతంగా మాట్లాడే దేవుడు మనకున్నాడు. ఎవరికున్న తలాంతు దైవప్రేరేపణ ప్రకారం యథార్థ హృదయంతో యువజనం దైవమార్గా అనుసరించాలి.

ముందుముందు రాబోయేవి గడ్డురోజులే. ఇంకా ఎన్నెన్నో ఆటంకా విశ్వాసాన్ని, ఆత్మనూ ఆర్పేసే క్రొత్త సిద్ధాంతాలు, జీవన విధానము క్రైస్తవ విశ్వాసికి ఎదురయ్యే రోజులు ముందున్నాయి. మన ప్రభు రెండవ రాకడకూడా రానుంది. ఈ చరిత్ర చదివిన నేటి తరం ఆ నిరీక్ష తోనే పెద్దల అడుగుజాడల్లో సాగిపోతూ మన తరతరాల విశిష్ట క్రైస్త సంప్రదాయానికి రక్షకభటులుగా, గోదావరి డెల్టా ప్రాంతపు సేవా వారసులుగా భూదిగంతాలకు సువార్త మోసుకువెళ్ళే శుభవార్తాహరులు వర్ధిల్లాలన్న మంగళ వాక్యంతో మన ప్రభువైన యేసుక్రీస్తు మహిమార్థ రచించబడిన ఈ చరిత్ర గ్రంథాన్ని మన సంఘాలకే అంకితంచేస్తూ ముగిస్తున్నాను

తండ్రియైన దేవునినుండియు, ప్రభువైన యేసుక్రీస్తునుండియు సమాధానమును, విశ్వాసముతోకూడిన ప్రేమయు సహోదరులకు కలుగును గాక. ఆమేన్.

జీవన్‌జ్యోతి ప్రెస్
నరసాపురం 1.1.1986.

కె.విల్సన్
డైరెక్టర్.

# విషయసూచిక

## ప్రస్తుతకాలం

# 1836 - 1886

# ఆరంభ కాలం

"మీరు పూర్వమందు చీకటియై యుంటిరి"
ఎఫెసీ 5:8.



జార్జి ముల్లర్



ఏంటోని నోరిస్ గ్రోవ్స్



ధవిళేశ్వరం ఆనకట్ట నిర్మించిన
సర్ ఆర్థర్ కాటన్



ధవిలేశ్వరంలో సర్ ఆర్థర్ కాటన్ హాజరైన ఆలయం.
ఇప్పుడిది జి. డి. యం. ఆలయం



ధవళేశ్వరం ఆనకట్ట



ఇప్పటి కాటన్ బేరేజీ



సువార్త వ్యాప్తికి కారణాలైన కాటన్‌గారి కాల్వలు





డి. సుబ్బన్నగారు

సువార్త కొరకు కాల్వలమీద మిషనరీలు వాడిన హౌస్ బోట్లు!



వెనుక: ఎం. అబ్రాహాంగారు



జాన్ విలియం బీర్

(జార్జి బీర్‌గారి పెద్దకొడుకు)



విలియం బౌడెన్



ఇ. ఎస్. బౌడన్ కుటుంబం
వెనుకనున్నవారు సి. జె. టిల్స్లీగారు
(మనుమడు)



విలియం బౌడెన్ సతి (వృద్ధాప్యంలో)



ఎడ్విన్ బౌడన్ కుమార్తెలు
లిలీబౌడన్ (టిల్స్లీ దొరగారి తల్లి)
హెన్రీట్టా బౌడన్
(శెట్టిపేట బాలికల బోర్డింగ్
నిర్వహించినవారు)



థామస్ హీలిస్ గారు



హీలిస్‌గారి గృహం "ది లాడ్జ్" నరసాపురం

# బ్రిటన్‌లో బ్రదరెన్ ఉద్యమం

బ్రదరెన్ మిషన్‌వారు మొట్టమొదటిగా స్థాపించిన మిషన్‌ఫీల్డు ఇండియా దేశంలోని ఉభయ గోదావరి జిల్లాల్లోని గోదావరి డెల్టా మిషనే. గోదావరి డెల్టా మిషన్‌కున్న ఒక ప్రత్యేకత ఏమిటంటే దీన్లో చేరినవారంతా నేరుగా హిందూమతం నుండి క్రీస్తును నమ్మి వచ్చినవారే. ఇతర ప్రాంతాల్లోని బ్రదరెన్ సంఘాల్లాగా వేరే సంఘాల్లోనుండి విడిపోయి ఇందులో చేరినవారుకారు. ఇక్కడ మనకి కనిపించే ఆరాధనా సరళి నేరుగా బ్రదరెన్ సంప్రదాయాలకు అనుగుణంగా చరిత్రలో వేళ్ళు పాతుకుని ఉంటుంది. కాని కాలం మారుతున్నది. వాక్యంలో కనిపించే అకాల సత్యాలను అన్వయించుకునే తీరు కూడా మారుతూ ఉండాలి. కాల గమనంలో ప్రతి తరం వారికీ ఒక బాధ్యత, హక్కు ఉంది. అదేమంటే దేవుని వాక్యాన్ని తనకుతానే తరిచి చూసుకుని దాని నిత్యసత్యాలను ఆచరించడం.

మన సంస్కృతి, సంప్రదాయం, ఆచారవ్యవహారాలు మనం దేవుని వాక్యాన్ని అర్థం చేసుకోవడంలో పాత్ర వహిస్తాయి. మన అనుభవాలు, పెంపకం, మన పూర్వాపరాలు, ఆవేశకావేషాలు ఇవన్నీ మన మనస్సులను ఒక రీతిలో నడిపిస్తాయి. అయితే సంప్రదాయపు వాసనలను వదిలించుకుని వాక్యాన్ని ఉన్నదున్నట్టు అర్థంచేసుకోవడానికి మనం మనస్ఫూర్తిగా ప్రయత్నించాలన్నది నిర్వివాదాంశం.

ఆదిమ బ్రదరెన్ వ్యవస్థాపకుల్లో జార్జి ముల్లర్ అగ్రగణ్యుడంటారు కొందరు. అయితే బ్రదరెన్ ఉద్యమపు స్వరూప స్వభావాలన్నీ పూర్తిగా ఆకళింపు చేసుకోగలిగితే ఆ స్థానం గ్రోవ్స్ మహాశయుడికి ఇవ్వాలేమో అనిపిస్తుంది. ఎందుకంటే గోదావరి డెల్టా మిషన్ స్థాపనకు ప్రోత్సాహమిచ్చింది ఈయనే. ఇంతేకాక గ్రోవ్స్‌గారు అనుసరించిన సిద్ధాంతాలు ఆయన ఆలోచనలే గోదావరిడెల్టా మిషన్‌ను ఎక్కువ ప్రభావితం చేసినాయి.

ఆయన 1825లో తన స్నేహితుడికి ఉత్తరం రాస్తూ ఇలా రాసాడు. "[illegible] మనకి అర్థంకాని అంశాలను మనలో అప్పటికే రూపు దిద్దుకుని [illegible] సంస్కారాల ప్రకారమో, లేక లౌకిక సాంప్రదాయాలకు అనుకూలంగానో [illegible] చేసుకోవడానికి ప్రయత్నిస్తాము. అయితే వీటి ప్రభావాలకు లోనుకాకుండా దేవుని వాక్యాన్ని అర్థం చేసుకోవాలంటే ఎవరి ప్రేరణ మూలంగా ఈ వాక్యం రాయబడిందో (పరిశుద్ధాత్మ) కేవలం ఆయన ఉద్దేశ్యం అర్థం చేసుకోవాలన్న గురితో మాత్రమే చదవాలి''.

* * *

[illegible]డెల్లా బిషప్ పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోబోయేముందు మనం అదే సమయంలో అంటే పందొమ్మిదవ శతాబ్ద ప్రారంభంలో ఇంగ్లాండు దేశంలో మొలకలెత్తిన బ్రదరెన్ ఉద్యమాన్ని గురించి కొంత తెలుసుకోవాలి.

ఐరోపా ఖండంలోనూ, బ్రిటన్‌లోను, చీకటికాలం (dark ages) పోయి వెలుగుకాలం నెలకొంటున్న రోజుల్లో (age of enlightenment) ఆధ్యాత్మిక మత వేదాంతానికి, జీవంలేని నమ్మకాలకూ పరిమిత [illegible] సంబంధమైన సంఘాలు వెలిసాయి. ఆంగ్లికన్ చర్చి పాలకుల నుండి ఒక సాంఘిక వ్యవస్థగానే ఉండేదిగాని, ఆత్మీయ విశ్వాసపూరితంగా ఉండేదికాదు. మామూలు మనుషులకి దాన్లోకి ప్రవేశం లేదు. ఇలాటి వాతావరణంలో మెథడిస్టు ఉజ్జీవం బయలుదేరింది. వెస్లీ ఆంగ్లికన్‌గానే ఉండిపోయినప్పటికీ, అతనిద్వారా ప్రభావితులైన [illegible] అంతాకలిసి 1784లో మెథడిస్టు సొసైటీగా రూపొందారు. చర్చి ఆఫ్ ఇంగ్లండులో నిమిత్తం లేకుండా బోధకులు నియమించబడ్డారు. ప్రభువు భోజన క్రమాన్ని నడిపించడం కోసం వెస్లీ తానే కొందర్ని నియమించాడు. 'క్రైస్తవ సేవ' అనే సిద్ధాంతపు లేత చిగుళ్ళు ఇక్కడే ప్రారంభమై బ్రదరెన్ ఉద్యమానికి మార్గదర్శకాలైనాయి.

ఇలా సామాన్య నిమ్నజాతుల్లో ప్రారంభమైన మెథడిస్టు ఉజ్జీవంతో పాటు (బహుశా ఈ ఉజ్జీవం మూలంగా) చర్చ్ ఆఫ్ ఇంగ్లండులో కూడా సువార్త ఉద్యమం మొదలైంది. క్లాప్‌హామ్ అనే దక్షిణ లండన్ ప్రాంతంలో ఆరోజుల్లో ప్రాబల్యం గల ధనిక ఆంగ్లికన్ క్రైస్తవులు

సమావేశమయ్యేవారు. వీరిని 'క్లాప్ హామ్ సెక్ట్' అన్నారు. ఈ ఉద్యమంలో ప్రధానపాత్ర వహించినది విలియం విల్బర్ ఫోర్సు. ఈయన పార్లమెంటు సభ్యుడు. ఈ సెక్ట్ సభ్యులంతా భక్తిభావం, చిత్తశుద్ధిగలవారై తమ దేశం కోసం,సాంఘిక సంస్కరణ కోసం పాటుపడ్డారు. వీరు చాలా అంశాలపై పార్లమెంటులో వత్తిడి తీసుకువచ్చి జైలు సంస్కరణలు, చిన్నపిల్లల వెట్టి చాకిరీ నిర్మూలన మొదలైనవి జరగడానికి కారకులయ్యారు.

1790–1820 మధ్య కొద్దికాలంలోనే ఈ క్రైస్తవులంతా కలిసి పనిచేసి బ్రిటన్‌లో ఒక సమగ్రమైన సాంఘిక విప్లవాన్ని తీసుకువచ్చే చట్టాలను రూపొందించడానికి దారి చూపారు. జాన్ న్యూటన్, థామస్ క్లార్క్‌సన్, విలియం పిట్ మొదలైనవారి సహాయంతో విల్బర్‌ఫోర్సు 1813లో పార్లమెంటు ద్వారా బానిసత్వనిర్మూలన చట్టాన్ని అమలులోకి తెచ్చాడు.

ఆ రోజుల్లోనే అంటే 1813లో క్లాప్‌హామ్ సెక్ట్‌కే చెందిన ఛార్లెస్‌గ్రాంట్ ఈస్టిండియా కంపెనీకి డైరెక్టరుగా ఉంటూ ఇండియాకి అన్ని దేశాలనుండి అన్ని శాఖలకూ చెందిన మిషనెరీలను వెళ్ళనివ్వడానికి అనుమతినిచ్చే చట్టాన్ని ఆమోదింపజేసాడు.

ఐరోపా అమెరికా ఖండాల్లో 19వ శతాబ్దపు ప్రారంభంలో అనేకమైన రాజకీయ, సాంఘిక, మత కల్లోలాలు చెలరేగినాయి. ఇందు మూలంగా ఫ్రాన్సు అమెరికా దేశాల్లో జరిగిన విప్లవాలమూలంగా కలిగిన వినాశనం బ్రిటన్‌లో కలగలేదు. ఎందుకంటే ఇక్కడ రేకెత్తిన మత పునరుజ్జీవం సాంఘిక సంస్కరణలకే దారితీసింది.

అయితే ఈ మత పునరుజ్జీవం ఊహించరాని మరొక అలజడిని రేపింది. అదేమంటే క్రైస్తవ సమాజం ఒకరంటే ఒకరికి పడని అనేకమైన చిన్నచిన్న గుంపులుగా విడిపోయింది. ఒకరంటే ఒకరికి గుర్తింపు కరువైంది. వేళ్ళు పాతుకునిఉన్న సంఘాల్లోనే ఆ సంఘ సిద్ధాంతాలు, నిర్మాణం మొదలైన విషయాల గురించి తీవ్రమైన అసంతృప్తి బయలుదేరింది. ఇలా క్రొత్తగా మేల్కొన్న సంఘ సభ్యుల్లోనేకాక సామాన్య ప్రజల్లో గలిబిలి కలిగించే క్రొత్త అలోచనా విధానాలు ప్రబలడంతో ఈ అలజడి మరింత

[illegible] ఉంది. ఆంగ్లికన్ చర్చి నుండి పుట్టిన ఆంగ్లో—కాథలిక్ సెక్టర్‌కి [illegible] ప్రెస్బిటేరియన్ సెక్ట్ ప్రారంభమైనది ఈ కాలంలోనే, ఈ [illegible] వాతావరణంలోనే. మొత్తంగా ఈ వాతావరణమంతటిలో నుండి [illegible] వెన్న పుట్టినట్టు బ్రదరెన్‌వారు తయారైనారు. [illegible] సంస్కరణలకు నాయకత్వం వహించినవారు వీరే. [illegible] వ్యక్తిత్వం, ప్రాబల్యంఉన్న నాయకులనుబట్టి [illegible] ఉద్యమం మొదలైంది.

[illegible], మన ప్రస్తుతాంశానికి సంబంధించిన వ్యక్తి, [illegible] అంతటికీ మూలవిరాట్టు అయిన వ్యక్తి ఒకరున్నారు. [illegible] పేరు ఆంథోని నోరిస్ గ్రోవ్స్.

ఈయన 1795 ఫిబ్రవరి 1న తేదీన ఒక ధనిక వర్తక కుటుంబంలో పుట్టాడు. లండన్‌లో రసాయనశాస్త్రం అభ్యసించిన తరువాత [illegible] (దంత వైద్యం, సర్జరీ) చేపట్టి 1813నుండి ప్లిమత్‌[illegible] ప్రాక్టీస్ ప్రారంభించాడు. ప్లిమత్‌లోను, అటు తరువాత 1816లో ఎక్సెటర్‌లో స్థిరపడిన తరువాతకూడా ఈయన మర్యాద, నుత [illegible] ఉండేవాడు. ఆ రోజుల్లో యువకుడుగా [illegible] ప్రబోధాలకు ఆకర్షితుడై తాను మిషనెరీ [illegible] వెళ్ళవలసి ఉన్నదన్న గట్టి అభిప్రాయాన్ని ఏర్పరచుకున్నాడు. [illegible] కిష్టంలేదు. అయితే మంచి క్రైస్తవులైనందున [illegible] పేదలకు ఇవ్వాలని నిర్ణయించుకున్నారు. [illegible] వేసుకొంది. ఈ విధంగా మొదటి సారిగా [illegible] ఉంటుందో ఆమె చూసింది. ఇది ఆమెను కలవర [illegible] రూ అప్పటినుండి క్రమక్రమంగా తను రాబడిలో [illegible] పేదలకి ఇచ్చేస్తూ వచ్చారు. చివరికి దేవుని సేవకు తనను [illegible] తప్ప తనుకు మరేదీ తృప్తి నివ్వలేదని గ్రహించారు. [illegible] పేదలకి ధనసహాయం చెయ్యడమేకాకుండా, అవసరంలో ఉన్న [illegible] ఇంట్లోకి ఆహ్వానించేవారు. చివరికి చర్చ్ మిషనెరీ సొసైటీ [illegible] స్వీకరించవలసిందిగా అప్లికేషన్ పెట్టుకున్నారు. అయితే [illegible] అభిషేకం పొందనిదే ఎవర్నీ ఇలా స్వీకరించరు.

ఈ విధంగా 1826లో నుంచి ఆదాయం ఉన్న తన ప్రాక్టీసును తన మేనల్లుడి పరంచేసి గ్రోవ్స్ తన కొరకు తన కొడుకుల కొరకు ఒక ఉపాధ్యాయుణ్ణి కుదుర్చుకుని, తన పాస్టరు అభిషేకం నిమిత్తం సిద్ధపడసాగాడు. గ్రోవ్స్‌కి బోధించిన ఈ ఉపాధ్యాయుడే ఆ తరువాత బైబిలు పండితుడిగా ఖ్యాతికెక్కిన డాక్టర్ జాన్‌కిట్టో. గ్రోవ్స్ ప్రతియేడూ ట్రినిటీ కాలేజికి వెళ్ళి తన అభిషేకం కోసం పరీక్షలు రాసి వస్తుండేవాడు.

ఆఖరి సంవత్సరంలో చర్చ్ మిషనరీ సొసైటీవారు గ్రోవ్స్, తన చదువుపూర్తి అయిన తరువాత కుటుంబతోసహా బాగ్దాద్ నగరానికి వెళ్ళాలని నిర్ణయించారు. కాని ఒక విచిత్రమైన సంఘటన ఆయన జీవితాన్ని మార్చేసింది. ఒక స్నేహితుడు గ్రోవ్స్ దగ్గరికివచ్చి తాను పనిచేస్తున్న ఆఫీసులో జరుగుతున్న ఒక పాటుమాటు వ్యవహారం గురించి ఆయన సలహా అడిగాడు. తన అధికారుల ఆదేశాలకు లోబడాలా లేక తన ఉద్యోగానికి రాజీనామా చెయ్యాలా? అందుకు గ్రోవ్స్ అతను తన మనసాక్షికి వ్యతిరేకంగా ఏమీ చెయ్యరాదని, ఉద్యోగానికి రాజీనామానివ్వడమే ఉత్తమమని చెప్పాడు. కొద్ది రోజులకే అదే మిత్రుడు గ్రోవ్స్‌ని మరొక ప్రశ్న వేశాడు. “మన శాంతిని కోరేవాడివికదా, మరి చర్చి ప్రతిపాదించిన 37 సూత్రాల్లో చివరిదైన క్రైస్తవ పురుషులు ఆయుధాలు ధరించి యుద్ధాల్లో పాల్గొనడం చట్టబద్ధమే అన్న సూత్రానికి కట్టుబడి ఎలా ఉండగలవు?” అప్పటికే గ్రోవ్స్ చర్చ్ ఆఫ్ ఇంగ్లండు వారి సిద్ధాంతాలను గురించి విమర్శనాత్మకంగా ఆలోచిస్తూ ప్రశ్నిస్తూ ఉన్నాడు. డబ్లిన్ నగరంలో జె.జి. బెల్లెట్ అనే తన స్నేహితుడి ఇంట్లో ఉన్న సమయంలో బెల్లెట్‌కికూడా ఇవే సందేహాలు, ప్రశ్నలు. ఆ రోజుల్లోనే ఆ ఇంట్లో వీరు జె.ఎన్.డాబేగారిని కలుసుకున్నారు. డాబేగారు ప్రెస్బిటేరియన్ చర్చి ద్వారా అభిషేకింపబడిన గురువు. ఈయన, మరికొంతమంది మత చైతన్యం గలవారూ అసలు మొత్తంగా క్రైస్తవ సంఘనిర్మాణం గురించిన పునఃపరిశీలనలో ఉన్నారు. క్రమేపీ ఈ క్రింది నిర్ణయాలకు దగ్గరవుతూ ఉన్నారు.

1. చర్చి అధికారాలన్నిటికీపైగా వాక్యాధికారాన్ని అంగీకరించాలి. వాక్యానికున్న అధికారం తిరుగులేనిది.

2. శిశువుగా అభిషేకం ఇచ్చే సంప్రదాయం బైబిల్లో ఎక్కడా కనబడదు.

3. సంఘ సభ్యులందరికీ ఆత్మ వరాలు ఇవ్వబడతాయి. సంఘక్షేమం కోసం వీటిని వాడాలి (విశ్వాసుల యాజకత్వం)

4. సంఘం అందరు పరిశుద్ధులతోకూడిన ఐక్య సహవాసం. ఇదే క్రొత్తనిబంధన బోధ.

ఈ అధ్యయనాలు గ్రోవ్స్‌మీద లోతైన ప్రభావాన్ని చూపించినాయి. ఆ నిర్ణయానికి రావలసిన సమయం ఆసన్నమైనప్పుడు ఇక సి.ఎం.ఎస్.తో సంబంధాలు తెంచుకుని, ట్రెయినింగు, అభిషేకం మొదలైన వాటికి స్వస్తి చెప్పాడు.

అంతకుముందు డబ్లిన్ సందర్శించినప్పుడు ఒకానొక సందర్భంలో గ్రోవ్స్ అన్నాడు, "అపొస్తలులకార్యములు, కొరింథీయులకురాసిన లేఖ మనం సరిగ్గా అర్థం చేసుకున్నట్లయితే అక్కడ క్రైస్తవులు ప్రతి ఆదివారం సమావేశమై ఆత్మ నడిపించిన రీతిగా ప్రభురాత్రి భోజనంలో పాలుపొందే వారుకదా. మనం అలా ఎందుకు చెయ్యకూడదు?" ఈ మాటలే తరువాతి కాలంలో ముఖ్యమైన బ్రదరెన్ ఆచారంగా రూపొందినాయి.[1]

క్రమేపీ ఈ విధంగా బ్రదరెన్ ఉద్యమం ఆరంభమైంది. అంతా ముందు వారి సంఘంలోవారు ఆరాధనకు హాజరై, ఆ తరువాత అందరికీ అనువైన ఏదో ఒక సమయంలో ఒకచోట సమావేశమై రొట్టె విరిచేవారు. క్రొత్త సంఘాన్ని స్థాపించాలనిగాని, ఉన్న సంఘాలను చీల్చాలనిగాని, అసలు అలాటి తలంపే ఎవరికీ లేదు.

క్రమంగా అక్కడక్కడా ఈ "రొట్టె విరిచే గుంపులు" లేచి కాల క్రమేణా తమ సంఘ సహవాసం నుండి దూరమవుతూ క్రొత్త సహవాసాలుగా ఏర్పాటు కాసాగినాయి. ఎందుకంటే తామంతా వేర్వేరు డినామినేషన్లకు చెందినవారు. తమ నందరినీ ఆహ్వానించే చర్చి ఏదీ వీరికి కనిపించలేదు. సి.ఎం.ఎస్.నుండి తెగతెంపులు చేసుకున్న గ్రోవ్స్ ఇలాటి చిన్న సహవాసానికి హాజరయ్యేవాడు. కాని తన జీవితకాలమంతటిలో ఎన్నడూ

[1] Anthony Norris Groves, G.H.Long Thynne & Co London 1939. pp 158

ఈయన స్థిరపడిఉన్న సంఘాలతోగాని, నిజమైన విశ్వాసులున్న ఏ సంఘంతో నైనా తెగతెంపులు చేసుకోలేదు.

ఇండియాకి తాను మిషనెరీగా వెళ్ళాలనిఉందిగాని సి.యం.ఎస్‌వారు తనని బాగ్దాదుకు పంపిస్తామని చెప్పారు కాబట్టి అక్కడికే వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. 1829 జూన్ 12న రష్యాలోని సెంట్ పీటర్స్ బర్గ్‌కు ఒక ఓడలో బయలుదేరాడు. గ్రోవ్స్ తండ్రినుంచి సంక్రమించిన డబ్బుతో ఈ ప్రయాణం సానుకూలమయింది. తన భార్య, ఇద్దరు పిల్లలు వాళ్ళ ట్యూటరు కిట్టో, జాన్ విసీపార్నెల్ మొదలైన వారితో కలిసి సెంట్ పీటర్సుబర్గ్‌మీదుగా బాగ్దాదు చేరాడు. అభిషేకం పొందలేదు. గనుక సి.యం.యస్‌వారు ఆర్థిక సహాయం ఏమీ చెయ్యరు. కేవలం విశ్వాసం మీదే ఆధారపడి దేవుడే పోషణాభారం వహిస్తాడన్న నమ్మకంతో గ్రోవ్స్ బయలువెళ్ళాడు.

ఈ మిషన్ ఘోరంగా విఫలమైంది. ముస్లిం ప్రజలు బోధకు అందనంత దూరంలో ఉన్నారు. అక్కడ కళ్ళ క్లినిక్ ఒకటి తెరిచి వైద్యం చేసినా సువార్తసేవకు ఆస్కారం లేకపోయింది. తిరుగుబాటు, యుద్ధం, వెనువెంటనే ప్లేగు వ్యాధి సంభవించినాయి. గ్రోవ్స్ భార్య, చిన్న కూతురు ఈ వ్యాధికి బలైపోయారు. నిస్పృహతో ఇంటికి తిరిగి వెళ్దామనుకుంటున్న గ్రోవ్స్ భవిష్యత్తు సరిగా అదే సమయంలో జరిగిన ఒక సంఘటనవల్ల పూర్తిగా మారిపోయింది.

1825లో గ్రోవ్స్ క్రిష్టియన్ డివోటెడ్‌నెస్ అనే కరపత్రికను రచించాడు. ఇహలోకపు అవసరాలన్నిటి కొరకు దేవునిమీదే సంపూర్ణంగా ఆధారపడాలన్నదే ఆ కరపత్రిక సారాంశం. బర్మాయుద్ధంలో ఇంజనీరుగా పనిచేస్తున్న లెఫ్టినెంట్ ఆర్థర్ కాటన్ (తరువాతి కాలంలో సర్ఆర్థర్ కాటన్) గ్రోవ్స్ బాగ్దాదు మిషన్ గురించి విని, ఆ కరపత్రిక మూలంగా ప్రభావితుడయ్యాడు. సెలవుల్లో బర్మానుండి బాగ్దాదుమీదుగా ప్రయాణం కుదుర్చుకుని 1833 ఏప్రిల్ లో బాగ్దాదు చేరాడు.

అక్కడ గ్రోవ్స్‌కు ఇండియాలో మిషనెరీల అవసరతను గురించి చెప్పి బలిమాలి ఒప్పించి తనవెంట బొంబాయికి తీసుకొని వచ్చాడు.

1833లోనే ఈస్టిండియా కంపెనీవారు ఏ దేశం నుండయినా ఎవరైనా మిషనరీలు స్వేచ్ఛగా ఇండియాకు వచ్చి పనిచేసుకోవచ్చని ప్రకటించడంకూడా గ్రోవ్స్ ఇండియా రావడానికి తోడ్పడింది. కాబట్టి 1833 జూలైకల్లా గ్రోవ్స్ బొంబాయి చేరుకున్నారు.

అక్కడ ఆంగ్లికన్ మిషనరీలకు క్రొత్తనిబంధన తరహా ఆరాధనా [illegible], వ్యక్తిగతంగా పరిశుద్ధాత్మశక్తిమీద ఆధారపడవలసిన ఆవశ్య[illegible] బోధించాడు. చాలామంది ఈ బోధను ప్రశంసించారు. [illegible] పనిచేస్తున్న జర్మన్ మిషనరీ రేనియస్‌కి సహాయం [illegible] తిరునెల్వేలికి పంపించారు.

గ్రోవ్స్‌కున్న ఆలోచనలే కలిగిఉన్న రేనియస్ స్వంతంగా తానే మిషనరీ[illegible] నియమిస్తున్నాడు. సి.యం.ఎస్ వారేమో కలకత్తా ఆర్చిబిషప్పు[illegible] ఆ అధికారం ఉన్నదంటారు. అసలు అభిషేక నియామకాలు [illegible] అన్న తన అభిప్రాయాన్ని అలా ఉంచి గ్రోవ్స్ రేనియస్‌కు [illegible]. సి.యం.ఎస్‌ను వదిలి బయటికి వచ్చెయ్యడం మంచిపని కాదని [illegible] చెప్పాడు. ఇదంతా 1833 డిసెంబరు నెలలో జరిగింది.

అక్కడినుండి కలకత్తా వెళ్ళి విలియం కేరీ, అలెగ్జాండర్ డఫ్ ప్రభృతులను [illegible]. ఈయనలో కనిపించే దైవజ్ఞానం దైవవ్యక్తిత్వానికి ఆకర్షి[illegible] యూరోపియన్ రాజ వంశీయులు, అధికారులు రిటైర్[illegible] తరువాత ఇంగ్లండునుండి బ్రదరెన్ ఉద్యమంలో చేరారు.

[illegible] కుటుంబంలో కలిసి జర్మన్, బ్రిటిష్ మిషన్ల కోసం క్రొత్త మిషనరీలను [illegible] ఉద్దేశంతో ఇంగ్లండుకు ప్రయాణం [illegible]. క్రొత్త మిషన్ స్థాపించే ఉద్దేశం అప్పట్లో గ్రోవ్స్‌కి లేదు. [illegible] యూరప్‌లో మిషనరీలకు పిలుపునిస్తూ పర్యటించాడు.

ఈ సమయంలో ఇంగ్లండులో డార్బీగారి ఆలోచనా ధోరణి క్రమంగా [illegible] అవుతున్నట్టు ఉత్తరాలద్వారా గమనిస్తూ ఎప్పటికప్పుడు తను [illegible] ఉత్తరాలద్వారా ఖండిస్తూనే వస్తున్నాడు. డార్బీ ఆలోచనా విధానం [illegible] 'బ్రదరెన్'లుగా ముందుకు వచ్చిన వారితో మాత్రమే, వీరి [illegible] ఏర్పాటుచేసుకున్న సంఘాల్లోనే సహవాసం చెయ్యాలి' అని. గ్రోవ్స్

అభిప్రాయమేమంటే క్రైస్తవులమధ్య ఐక్యతకు పునాది కేవలం క్రీస్తు పట్ల ప్రేమమాత్రమేనని, ఇతర విషయాలలో భేదాలను లెక్కచెయ్యకూడదనీ.[1]

ప్లిమతులో డార్బీ ప్రతిపాదించిన సిద్ధాంతాలు ప్రబలుతుండగా గ్రోవ్స్ ఆలోచనలకనుగుణంగా రెండు సంఘాలు స్థాపించబడినాయి. సార్వత్రికభావన నాశనం కాకుండా ఈ రెండుచోట్లా జాగ్రత్త తీసుకోవడం జరిగింది. వీటిలో ఒకటి బ్రిస్టల్‌లో జార్జిముల్లర్ స్థాపించిన బెతేస్థ ఛాపల్, రెండోది బార్న్‌స్టేపుల్‌లో రాబర్టు ఛాప్‌మన్‌గారి సంఘం. ఈ సంఘాన్ని స్ట్రిక్టు బాప్టిస్టు సంఘం అన్నారు. కాని ప్రభురాత్రి సంస్కారాన్ని స్వేచ్ఛగా ఆచరించడంలో బ్రదరెన్ తరహా ఇక్కడ అమలులో ఉంది.[2]

ఆర్థిక అవసరాలకోసం దేవునిమీదే ఆధారపడాలని గ్రోవ్స్ ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని గ్రోవ్స్ సోదరిని పెళ్ళాడిన జార్జిముల్లర్ అక్షరాల ఆచరణలో పెట్టడానికి పూనుకున్నాడు. ఆ కాలంలో ఇంగ్లాండు దేశంలో ఇది అత్యంత సాహసోపేతమైన నిర్ణయం. దేవుడు సజీవుడనీ అవసరాలకు ఆదుకుంటాడని అచంచలమైన విశ్వాసం ఉంటేగాని ఇది సాధ్యంకాదు..

బాగ్దాదు మిషన్ విఫలం కావడమూ, ప్రపంచవ్యాప్తంగా ఇతర మిషన్ ఫీల్డుల్లో కనిపిస్తున్న పరాజయాలూ డార్బీ ప్రతిపాదించిన మరో క్రొత్త సిద్ధాంతానికి దారితీసాయి. అద్భుతవరాలన్నీ ఆది సంఘం స్థాపించబడినప్పుడు (క్రొత్తనిబంధన కాలంలో) మాత్రమే ఇవ్వబడినాయనీ, ఇప్పటి కాలంలో అలాటి వరాలు ఉండాలని ఆశించడం తగదనీ ఈయన సిద్ధాంతం. ప్రపంచం పుట్టినది మొదలుకొని బైబిలులో ఉన్న చరిత్ర వివరణ ప్రకారం డార్బీ ఈ కాలం మొత్తాన్ని 7 డిస్పెన్సేషన్లుగా విభజించాడు. (డిస్పెన్సేషన్ అంటే దేవుడు మనుష్యులతో వ్యవహరించేతీరు అని అర్థం) దీన్ని ప్రతిపాదించిన వారిలో స్కోఫీల్డు కూడా ఒకరు. సువార్తలోని కొన్ని భాగాలు యూదులకోసం మాత్రమే నిర్దేశించబడినాయనీ అవి క్రైస్తవులకోసం కాదనీ, మరికొన్ని భాగాలు రాబోయేకాలంలో వర్తిస్తాయనీ ఈయన అభిప్రాయం.

---

1 History of the Bretheren Movement, F. Roy Coad, Paternoster Press, Exeter 1968 pp 20.

2 Origins of the Bretheren. Harold H. Rowden, Pickering and Inglis, Glasgow 1925 pp 144.

# 1

# గోదావరి డెల్టా ప్రాంతం

లకూ నాగరికతలకూ అవినాభావ సంబంధం ఉంది. సింధునది
నైలునది కానివ్వండి, నదులు పారినంతమేరా నేల సస్యశ్యామలంగా
సౌభాగ్యాన్ని ఇస్తుంది. సౌభాగ్యమున్నచోట ప్రజలు సత్ప్రవర్తన
్ో ఆసక్తి కలిగినవారై, ఆధ్యాత్మిక చింతన కలిగి ఉంటారు.

ల్లాగా చల్లగా మెల్లగా నిండుగా ప్రవహించే గోదావరి, పచ్చగా
ళూ కనుల పండుగచేసే పంట చేలు, టీవిగా తలలెత్తుకుని
వయ్యారాలుపోయే కొబ్బరిచెట్లు, మట్టిలోనుండి బంగారంతీసే
, ఏటేటా జాతరలు, ఊరూరికి గ్రామ దేవతలు, గిత్తల మెడల్లో
ాడిపంటలు—ఇదీ ఈ పుస్తకంలో వివరించబడనున్న విశేషాలన్నీ
ప్రదేశం. ఇటు కొల్లేరు సరస్సు దగ్గర మొదలై అటు కాకినాడ
బంగాళాఖాతం తీరాన మొదలై అటు భద్రాచలందాకా పరుచు
ునీత స్థలం. పరమ దేవుని పవిత్ర వార్తను పరమానందంగా
క్రైస్తవ సంప్రదాయాన్ని ఒకటిన్నర శతాబ్దాలక్రితమే స్థిరపరచు
వరి ప్రదేశం. గోదావరి డెల్టా ప్రాంతంగా వ్యవహరించబడుతున్న

కృతి సౌందర్యానికి ఈ ప్రాంతంతో పోటీకివచ్చే ప్రదేశాలు భారత
వేళ్ళమీద లెక్కబెట్టవచ్చు. కోనసీమ సౌందర్యం, తెలుగువారి
ర్యకారణం. ఎక్కడో పడమటి కనుమల్లో సెలయేరుగాపుట్టి
ూదుగా దూకుతూ,ఉరకలు పరుగులతో బయలు దేరిన గోదావరి,
నుముల్ని ఒరుసుకుంటూ మెలికలు తిరుగుతూ ప్రవహించి
ంతంచేరి వెంట తెచ్చిన ఒండ్రు మట్టినంతా ఈ డెల్టా తీర

ప్రాంతమంతా పచ్చగా పరచి అంతర్వేది దగ్గరనుండి యానాం దాకా బంగాళాఖాతం సముద్రంలో కలిసింది. వేసవి కాలపు వేడినెలల్లో ఆవిరులు ఎక్కడ చూసినా మైదానం, అక్కడక్కడా ఆకుపచ్చని సిటె చారలుతప్ప మరేమీ కనిపించవు. ఋతుపవనాలు మొదలైనప్పటినుండి వరద గోదావరి ఒడ్డులను ఒరుసుకుంటూ రైతులపాలిట వరప్రదాయినిగా మారుతుంది. మెళ్ళ కొద్ది కిందట్నున్న తీర ప్రాంతమంతా బెస్తవాళ్ళ పల్లెలు, ఇసుక తిన్నెలు, ఉప్పు మడ్డలు, మర్రితోటలు. ఇవి దాటి వెళ్తే పచ్చని పంటచేలు, కొబ్బరి తోటలు, కాలువలు, కోనసీమ సంస్కృతి రూపు దిద్దుకున్న ఊళ్ళు, వాటి చుట్టూ అసంఖ్యాకంగా పల్లెలు, ఇంకా ముందుకు వెళ్తే మెల్లమెల్లగా ఎదురయ్యే మెరక భూములు, సారవంతమైన నేల సముద్రంనుండి దాదాపు నలభై మైళ్ళ దాకా ఉంటుంది అక్కడినుండి మరో నలభై మైళ్ళదూరం ఈ మెరక. మెట్ట వ్యవసాయం ఆధారం. జన సాంద్రతకూడా తగ్గుముఖం పడుతుంది. తూర్పు కనుమలు కనుచూపు మేరలోకి వచ్చే సమయానికి సాగులో ఉన్న భూమి తగ్గిపోగా, అడవి ప్రాంతం మరింత స్పష్టంగా కనిపిస్తూ ఉంటుంది. దట్టంగా అడవులు కప్పిన కొండలు, కోయజాతులు—ఇదీ, గోదావరి ముఖంలో తీరంనుండి ప్రయాణంచేస్తే గోచరమయ్యే నైసర్గిక స్వరూపం. కృష్ణా, గోదావరి నదుల ప్రాంతం తెలుగు జాతికి, సంస్కృతికీ కేంద్రంగా చెప్పవచ్చు.

బ్రాప్లీగారి పుస్తకానికి ఉపోద్ఘాతంరాస్తూ ఏ.సి. రోజ్‌గారు ఇలా రాశారు. "రాబోయే పేజీల్లో మనం చదవబోతున్న చరిత్ర అపొస్తలులకార్యముల గ్రంథానికి అనుబంధంగా తదనంతరం రాయబడిన అనేకమంది ఆధునిక అపొస్తలుల చరిత్ర గ్రంథాలలో ఎన్నదగినది". (ఈ ఏ.సి. రోజ్‌గారు మన సెంటినరీకి వచ్చారు. వీరు అప్పట్లో యం.ఎస్.యం. రైల్వేకు జనరల్ మేనేజరుగా పనిచేసిన బ్రదరెన్ విశ్వాసి, ఉన్నతాధికారి. ఈయన మన జి.టి.యం శతవార్షికోత్సవాలకు హాజరైనారని పెద్దలమాటవల్ల తెలుస్తున్నది). హడ్సన్ టేలర్, డేవిడ్ లివింగ్‌స్టన్, హెన్రీమార్టిన్, విలియం కేరీ మొదలైనవారి కోవకు చెందిన బౌడెన్‌బీరు మహాశయులు గోదావరి ప్రాంతాల్లో చేసిన సాహసోపేతమైన ఆత్మీయ పోరాటాలతోనూ, దేవునిచే పంపబడిన ఈ మిషనెరీల జీవన విధానాలు, రాగ ద్వేషాలతోను, ఈ చరిత్ర ప్రపంచ క్రైస్తవ సంఘచరిత్రలోనే విశిష్టస్థానం సంపాదించుకున్నది.

వీరి ఒంటరితనం,కన్నీటి ప్రార్థనలు, స్థానికులతో వీరి సంబంధ బాంధవ్యాలు దేశంకాని దేశాన భాషతెలియని ప్రజలమధ్య, విగ్రహారాధనాంధకారంలో తామే క్రొవ్వొత్తులుగా ఆహుతునలై వైనం—చదవడం ముఖ్యంగా గోదావరి డెల్టా క్రైస్తవులకీ, ఆంధ్రులందరికీ ధన్యకరమైన అనుభవం. ఆ వెలుగు నందుకుని వారి జీవవార్తకు స్పందించి యేసుక్రీస్తుప్రభువును ఈ గడ్డ మీదికి ఆహ్వానించి తమ తోటి వారి నిరసనను అవహేళనలను లెక్కచేయక క్రైస్తవ సాక్ష్యాన్ని వ్యాపింపజేసిన గోదావరిడెల్టా ఆరంభ క్రైస్తవులు ధన్యులు. వీరి సంతానమైన ఈ తరాల వారికి వీరి చరిత్ర ఆదర్శప్రాయం. శిరోధార్యం. "ఇంత గొప్పసాక్షి సమూహము మేఘమువలె మనలను ఆవరించియున్నందున......"(హెబ్రి 12:1) అని రాయబడిన మాటలో క్రొత్త అర్థం కనిపించేలా చేస్తుంది ఈ చరిత్ర. వీరంతా లూథర్, లేక మరొక నాయకుని పేరు కలిగియుండి వివిధ రకాలైన గుంపులకు చెంది ఉండవచ్చు. లేక ఒక ప్రాంతపు అధికారిక సంఘ సభ్యత్వానికే పరిమితమై ఉండవచ్చు. అయితే వీరందరి మీద యేసురాజు ముద్ర ఉన్నది. వీరంతా కేవలం ఆయనకు మాత్రమే లెక్క అప్పగించవలసిన వారు" ఏ.సి. రోజ్.

క్రీస్తు సువార్త బోధన, మిషనెరీల రాక, క్రైస్తవమత వ్యాప్తి మొదలైన సంభవాలవల్ల చేకూరిన ఫలితాల్లో సాంఘిక వికాసం అతి ముఖ్యమైనది. ఆధునిక క్రైస్తవులకు పట్నవాసులకూ అంతగా తెలియక పోవచ్చును గాని, మన ప్రాంతాల్లో నిమ్నజాతుల పరిస్థితి ఎంత దయనీయంగా ఉండేదో చదువుతూ, వింటూ ఉంటే నమ్మశక్యంకాదు. మిషనెరీలు తెచ్చిన సువార్త తెలుగు భక్తులు, నాయకులు కొనసాగించిన సువార్త గోదావరి ప్రాంతపు ప్రజలకు నిత్యజీవాన్నే కాక, ఇహలోకంలో ఆత్మ గౌరవాన్ని, తమ సాటి ప్రజలమధ్య తలలెత్తుకుని తిరగగలిగే ఆత్మాభిమానాన్ని కల్పించింది. ముఖ్యంగా నిమ్న జాతులకు విద్య మిషనెరీలు పెట్టిన భిక్షే. సాంఘిక, విద్యా వికాసమేకాక ఆర్థికంగా కొంత నిలద్రొక్కుకునే సదుపాయాన్ని కలిగించినది ఈ ప్రాంతాల్లో క్రైస్తవ మతోదయమే. ఈనాడు ఉభయగోదావరి జిల్లాల్లో దాదాపు 80 గ్రామాల్లో ఇరవైవేలమంది లేసు ఉత్పత్తి, వ్యాపారాల మూలంగా ఆదాయం గడిస్తున్నారంటే దాదాపు నూరేళ్ళక్రితం ఈ కళను వీరికి పరిచయంచేసిన మిషనెరీలకు కృతజ్ఞులమై ఉండాల్సిందే.

ఇందులో గుర్తుంచుకోవలసిన విషయమేమంటే "అది క్రియల వలన కలిగినది కాదు గనుక ఎవడును అతిశయపడ వీలులేదు. మరియు వాటియందు మనము నడుచుకొనవలెనని దేవుడు ముందుగా సిద్ధపరచిన సత్క్రియలను చేయుటకై మనము క్రీస్తుయేసునందు సృష్టింపబడినవారమై ఆయన చేసిన పనియైయున్నాము" (ఎఫెసీ 3:9,10). ఈ సృష్టి, ఈ పని వివరాలు, విశేషాలు ఈ పుస్తకంలో రాయడం జరిగింది.

**రాజకీయ స్థితిగతులు:**

మహమ్మదీయ పాలకుల పరిపాలనలో ఈ ప్రాంతం ఉత్తర సర్కారు ప్రాంతంగా వ్యవహరించబడేది. రాజమహేంద్రవరం, ఏలూరు సర్కారు ప్రాంతాల్లో ముఖ్య పట్టణాలుగా ఉండేవి. 1758–59లో ఆంగ్లేయ సైనికాధికారి కల్నల్‌ఫోర్డ్ ఈ ప్రాంతాన్నీ, అప్పట్లో ఆంధ్రప్రాంతానికంతటికీ కీలక స్థానమైన మచిలీపట్నం కోటనూ స్వాధీనం చేసుకుని ఫ్రెంచివారిని దక్కను ప్రాంతంనుండి పూర్తిగా తరిమెయ్యడంలో కృతకృత్యులయ్యారు. 1769లో ఉత్తర సర్కారులను నిజాం నవాబు బ్రిటిష్‌వారికి ధారాదత్తం చేశాడు. రాజులూ, రంగప్పలూ ఏలిన ఈ ప్రాంతంలో సరైన ప్రభుత్వం స్థాపించడానికి ఆంగ్లేయులకు చాలాకాలం పట్టింది. చాలాకాలం మచిలీపట్నం, ఏలూరు, సామర్లకోట, విజయనగరం మొదలైనచోట ఆంగ్లేయ సైనిక స్థావరాలు ఉంచవలసి వచ్చింది. చెప్పాలంటే 1878దాకా ఈ సైనిక స్థావరాలను ఉపసంహరించడం సాధ్యం కాలేదు.

గోదావరికి దక్షిణాన మచిలీపట్నం ఎంత ప్రఖ్యాతినొందిందో ఉత్తరాన కాకినాడ రేవు అంత ప్రధానమైంది. ఇవిగాక గోదావరిజిల్లా నడి బొడ్డున ఉన్న పాలకొల్లు గొప్ప వ్యాపార కేంద్రంగా ప్రసిద్ధికెక్కింది. నర్సాపురం రేవుగా డచ్చివారి ఆధ్వర్యంలో ఇది ఆంధ్ర ప్రాంతమంతటిలోనూ పెద్దదైన వ్యాపార కేంద్రంగా ఉండేది. 1611నుండి మచిలీపట్నం, 1672 నుండి నర్సాపురం ఈస్టిండియా కంపెనీవారి వర్తక కేంద్రాలుగా ఫ్రెంచి, డచ్చి వర్తక సంఘాలతో పోటీ వ్యాపారాలు నడిచిన పట్టణాలు. మొదట్లో ఈ ప్రాంతాల పరిపాలనా వ్యవస్థ ఈస్టిండియా కంపెనీ వర్తకుల చేతిలోనే ఉండేది. 1794లో శిక్షితులైన కలెక్టర్లు, జడ్జిలను నియమించడం జరిగింది. ఇలాటి దైవభీతిగల అధికారులు ఈ ప్రాంతాల్లో క్రమబద్ధమైన

పరిపాలనా యంత్రాంగాన్ని స్థాపించడంవల్ల ఆటు తరువాత వచ్చిన మిషనెరీలు నెరీలు నిరాటంకంగా సులువుగా తమ పని సాగించుకో గలిగారు.

## బౌడెన్, బీరుగార్ల రాకకు పూర్వస్థితి

పాశ్చాత్య క్రైస్తవ వర్తకులు, క్రైస్తవ సైనికాధికారులు ఆంధ్ర ప్రాంతంలో ఎప్పటినుండో నివాసముంటున్నప్పటికీ తెలుగువారికి సువార్త నందించాలన్న ప్రేరేపణ అసలంటూ మొదటిసారి కలిగినది 1651లో. డచ్ ఈస్టిండియా కంపెనీవారు పాలకొల్లులోని తమ ఛాప్లెయిన్‌కు హటాత్తుగా వో ఆదేశాన్ని పంపించారు.డచ్చిహారి ఆత్మీయ కాపుదలేకాక స్థానిక ఆంధ్ర ప్రజలకు క్రైస్తవ్యాన్ని గురించి బోధించడంకూడా ఆయన కర్తవ్య నిర్వహణలో భాగమేనని దీని సారాంశం. ఒక ప్రాటెస్టెంటు అధికారం క్రింద ఇలాటి ఆదేశం లేక ఆలోచన ఇదే మొదటిది. దీన్ని ఎంతవరకు ఆచరణలో పెట్టారో తెలియదుగాని ఈ చరిత్ర పుస్తకంలో ఈ విషయం ఉదహరించడం ఎంతైనా సమంజసం. ఎందుకంటే ఈ పాలకొల్లులోనే కొంతకాలానికి ఉభయగోదావరి సంఘాలన్నిటికీ మాతృ సంఘం స్థాపించడం జరిగింది.

అటుపైన దాదాపు 55 సంవత్సరాలకు అంటే 1706లో ట్రాంకెబార్ రేవులో భారత దేశానికి మొట్టమొదటి ప్రాటస్టెంటు మిషనెరీలు ప్లట్‌షా, జిగెన్‌బాగ్‌లు వోడ దిగారు. వీరు డెన్మార్కుకు చెందినవారు.బర్తలోమస్ జిగెన్‌బాగ్ 12 సంవత్సరాలు సేవచేసి టైఫాయిడ్ వలన చనిపోయాడు. వచ్చిన మూడేళ్ళలోనే తమిళం ఇతనికి మాతృ భాషలాగా అయిపోయింది. తమిళం వ్యాకరణం, డిక్షనరీ రాయడమేకాక బైబిలును తమిళంలోకి అనువదించాడు. ఇది ఇండియా దేశపు భాషలోకి మొదటిసారిగా చేయబడిన బైబిలు అనువాదం.[1]

అటు తరువాత అందరికీ చిరపరిచితుడైన విలియంకేరీ 1793 నుండి 1799దాకా కలకత్తాలో వ్యాపారం చేసుకుంటూ, ఆతరువాత సేవలోకివచ్చి తనతోటి బాప్టిస్టులతో కలిసి చిరస్మరణీయమైన సేవచేసాడు.

---

1Turning the world upside down. Stunt WT et al Upperton Press, 1972

1806లో డాక్టర్ క్లాడియస్ బుఖనాన్ కలకత్తా నుండి మద్రాసుకు వెళ్తూ పూరీ జగన్నాథ రథోత్సవాన్ని చూసాడు. ఆ రథచక్రాల క్రింద ఆత్మాహుతి చేసుకుంటున్న భక్తుల్ని, నలిగి నజ్జవుతున్న శరీరాలను, ఫటేల్మని కొబ్బరికాయల్లా పగులుతున్న పుర్రెలను చూసాడు. ఆ రథం నడిచినంత మేర పుణ్యంకోసం రథం క్రిందపడి దారుణమైన మరణాన్ని పొందిన వందల కొద్దీ క్షత శవాల గుట్టల్నిచూసి చలించిపోయాడాయన. ఆ తరువాత విశాఖపట్నం, సామర్లకోట, మీదుగా రాజమండ్రి చేరుకున్నాడు. గోదావరి నదిలో కొంత ప్రయాణంచేసి, ఆ పైన ఏలూరు, మద్రాసులమీదుగా మలబారుతీరాన్నంతటినీకూడా సందర్శించాడు. తాను చూసిన దురాచారాలు అజ్ఞానాంధకారాలను కళ్ళకుకట్టినట్టు వివరిస్తూ ఆయన రాసిన 'క్రిస్టియన్ రీసెర్చెస్' అనే పుస్తకం అనేకమంది పాశ్చాత్యులను కదిలించింది. ఈ భయంకర దౌర్భాగ్యంనుండి భారతజాతిని విముక్తంచేసి క్రీస్తువెలుగు అందించాలన్న పట్టుదల చాలామందిలో కలిగింది.

అదే సమయంలో విలియం కేరీ ప్రోత్సాహంవల్ల 1805లో క్రాన్, డెస్‌గ్రేంజెస్ అనే ఇద్దరు మిషనెరీలు విశాఖపట్నంలో మిషను స్థాపించుకున్నారు. అయితే అక్కడ స్థానిక క్రైస్తవ సంఘాన్ని ఏర్పాటు చెయ్యడానికి 30 యేళ్ళు పట్టింది. తెలుగు వారికి మాతృ భాషలో బైబిలు ఉండాలన్న ఆకాంక్షకు బీజం పడింది. కాగా 1818లో మొదటిసారిగా తెలుగు క్రొత్త నిబంధన గ్రంథం (మొదటి ప్రచురణ) 2000 ప్రతులు వెలువడినాయి.

అదే సంవత్సరంలో తలవని తలంపుగా అదోనిరాం జడ్సన్ మచిలీపట్నంలో తెలుగు ప్రజలమధ్య కొన్ని వారాలు గడపడం తటస్థించింది. 1817 క్రిస్మస్ రోజున మరెక్కడికో వెళ్ళడానికి రంగూన్‌లో వోడ ఎక్కిన జడ్సన్ సముద్ర పవనాలు అనుకూలంగా లేకపోవడంతో మచిలీపట్నం తీరప్రాంతానికి చేరాడు. ఆ చిన్న వోడలో నీళ్ళు అయిపోయినాయి. ఆహార పదార్థాలు నిండుకున్నాయి. కొన్ని వారాలపాటు నూకల గంజిమీదే బ్రతికాడు జడ్సన్. విరోచనాలతో ఆకలి దప్పులతో క్షీణించి శవంలాగా తయారైనాడు. తీరం దగ్గిర పడిందని తెలిసి, శక్తినంతటినీ కూడగట్టుకుని, చిన్న చీటీ రాసి వోడ సరంగులచేత పంపించాడు. వోడ కిటికీలోనుంచి చూస్తుంటే

ఒక పడవలో ఎర్రని యూనిఫారంలో ఆంగ్లేయ సైనికుడు,తెల్లటి చొక్కాతో మరొక ఆంగ్లేయుడు రావడం కనిపించి పరమానందమైంది జడ్సన్‌కి. ఆ ఇద్దరికీ జడ్సన్‌ని చూస్తే కడుపు తరుక్కుపోయింది. ఈ ఎముకల గూడులో ఇంకా ప్రాణం ఉండడం చూసి ఆశ్చర్యపోయారు. తీరానికి (మచిలీ పట్నం) తీసుకువెళ్ళి కొంత బలం చిక్కేదాకా పరిచర్యలు చేసి ఆపైన మద్రాసుకు పంపించి రంగూన్ వెళ్లే ఓడ ఎక్కించారు.

అయితే వీరందరిలోకీ తెలుగు హృదయాలకు అతి సన్నిహితుడైన ఒక మహనీయుని జీవితగాథ కూడా ఈ సందర్భంలో చెప్పాలి. పై సంఘటన జరిగిన పదహారేళ్ళకి తూర్పుకోస్తా అంతటిలోకీ మొట్టమొదటగా ఒక అగ్ర కులజుడు క్రైస్తవుడయ్యాడు. ఈయనే పురుషోత్తమ చౌధరి. ఆంథోని నోరిస్ గ్రోవ్స్‌గారు ఈ వైనాన్ని తన డైరీలో ఇలా రాసుకున్నారు: శ్రీకాకుళం, గంజాం పరిసరాల్లోని పర్లాకిమిడిప్రాంతనివాసి అయిన పురుషోత్తం ఒక రోజున టోపీ పెట్టుకుని తిరుగుతున్న ఒక వ్యక్తిని చూసాడు. ఆ వ్యక్తి ఆయనకి ఒక కరపత్రాన్ని ఇచ్చాడు. (ఇది విలియం కేరీ రాసిన పత్రిక.) ఆయన దాన్ని ఒక పెట్టెలో భద్రంగా ఉంచాడు. అయిదేళ్ళు గడిచిపోయాయి. ఆ ప్రాంతాల్లో తలెత్తిన చిన్న అలజడిని అణచడానికి వచ్చిన సైనికాధికారి రస్సెల్ టోపీ పెట్టుకుని ఉండడం చూసిన పురుషోత్తం చౌధరిగారికి ఆ కరపత్రం గుర్తుకొచ్చింది. ఇంటికి వెళ్ళి పెట్టె తెరిచి దాన్ని చదివాడు. ఆయన ఆసక్తి మేల్కొంది. వెంటనే క్రైస్తవ్యాన్ని గురించి తనకు తెలుసుకోవాలని ఉందంటూ రస్సెల్‌కు ఒక లేఖ రాసాడు.

రస్సెల్ దానికి జవాబిచ్చాడు గాని వ్యక్తిగతంగా కలిసి వివరించలేకపోయాడు. పురుషోత్తంగారు శ్రీకాకుళం వెళ్ళి శ్రీమతి హెలెన్‌నాట్‌గారిని కలిసి కొంత సద్బోధను విన్నాడు. శ్రీకాకుళంలో రోమన్ కాథలిక్ వారి గుడిని దర్శించాడు పురుషోత్తంగారు. అక్కడి విగ్రహారాధనాచారాలు చూసి అలాటి అలవాట్లను క్రీస్తులోకి వచ్చాక విసర్జించానంటూ దాన్ని తృణీకరించాడు. తెలుగువారిమధ్య సేవ చెయ్యడంకోసం ఒక్క మిషనెరీకూడా లేని రోజులవి. అందువల్ల పురుషోత్తంగారు కటక్ వెళ్ళవలసి వచ్చింది. ఆయనకు గంజాంలో 1833 అక్టోబరు 6వ తేదీన బాప్తిస్మం ఇవ్వడం జరిగింది.

మేజక్ బ్రైట్ అనే సైనికాధికారితో కలిసి ఓడలో మద్రాసు వెళ్ళాడు. మౌంటు రోడ్డులో స్వచ్ఛమైన తెలుగులో క్రీస్తు సువార్త బోధిస్తూ ఉంటే తోటి ఆంధ్రుల చెప్పుదెబ్బలు తినవలసివచ్చింది. ఇక్కడ మొదలైంది పురుషోత్తంగారి 1300 మైళ్ళ సువార్త దండయాత్ర. ఒంటరిగా కాలి నడకన బెంగుళూరు, బళ్ళారి, అనంతపురం, మదనపల్లె, నెల్లూరు, గుంటూరుమీదుగా మచిలీపట్నందాకా ఆయన స్వరం మారు మ్రోగింది. ఇక్కడ వాట్సన్ అనే జడ్జిగారు పురుషోత్తంగారిని ఆదరించి దారి ఖర్చులకు 20 రూపాయలు ఆయన చేతిలో పెట్టారు. అక్కడినుంచి ఏలూరుమీదుగా హిందూ పుణ్యక్షేత్రమైన భద్రాచలం వెళ్ళారు పురుషోత్తంగారు. అక్కడినుంచి పడవలో దిగువకు ప్రయాణించి రాజమండ్రి చేరారు. సామర్లకోటమీదుగా విశాఖపట్నం చేరుకున్నారు.

తెలుగువారికి మొదటిసారిగా క్రీస్తుసువార్తను వినిపించిన తెలుగు స్వరం పురుషోత్తంగారిదే. పరమ భక్తుడు, మేధావి, కవి, సంగీత విద్వాంసుడు అయిన పురుషోత్తంగారి కలం నుండి తెలుగు క్రైస్తవులకు వారసత్వంగా సంక్రమించిన పాటలు భక్తిప్రపత్తుల ముత్యాల మూటలు.

జడివాన కురిసేముందు ఇక్కడో మెరుపు అక్కడో మెరుపు కన్పించినట్టు మన పాలకొల్లు ప్రాంతంలో ఈవిధంగా సువార్త జడివానకుముందు దైవశక్తి సందర్శనాలు జరిగినాయి. ఇక్కడ ప్రస్తావించిన దైవజనులందరూ ఈ కృష్ణా గోదావరి ప్రాంతాలను మనసులో ఉంచుకుని రక్షణకర్తయైన దేవునికి విజ్ఞాపనలు చేసారన్నది నిస్సందేహం కదా. మరి అనతికాలంలోనే దేవునిచే పంపబడ్డ సేవకులు ఈ ప్రాంతాన్ని వెతుక్కుంటూ వచ్చి స్థిరపడి జీవజలనదులు ఇక్కడ పారడానికి కారణభూతులు కావడంలో ఆశ్చర్యమేముంది?

# 2

# బార్న్‌స్టేపుల్‌లోని ఇద్దరు యువకులు

ఇంగ్లండులోని ఉత్తర డేవన్‌షైర్ ప్రాంతంలో 1832వ సంవత్సరంలో దేవుని కార్యం బహుబలంగా జరుగుతోంది. ఒక చిన్న గ్రామంలోని ఒక చర్చిలో దేవుని ఆత్మ బలంగా పనిచేస్తూ ఉన్నట్టు చూసిన వాళ్ళకెవరికైనా అర్థమవుతుంది. ఆ రోజున చదువురాని ఒక పేద విశ్వాసి తన మనసంతా విప్పి ఎలుగెత్తి ప్రార్థిస్తున్నాడు.అతనికి అసలే నత్తి,మాట్లాడుతున్న భాషకూడా భయంకరమైన యాసతో మాట్లాడుతున్నాడు. చాలామంది అతని ప్రార్థన వింటూ లోలోపల నవ్వుకుంటున్నారు. క్రొత్తగా ఆ చర్చికి హాజరైన ఒక యువకునికిమాత్రం ఆ ప్రార్థన వింటూ ఉండగానే అతని మనస్సులో పరిశుద్ధాత్మ శక్తి, ప్రేరేపణ సంపూర్ణంగా నిండి అక్కడికి అక్కడే తన జీవితాన్ని యేసుక్రీస్తుకు సమర్పించాడు. ఆ యువకుని వృత్తి చెప్పులు కుట్టడం. స్వగ్రామం బార్న్‌స్టేపుల్. తాత్కాలికంగా ఈ గ్రామంలో ఒకరైతు దగ్గర పనికి కుదిరాడు. ఇతని పేరు జార్జి బీర్. నాలుగేళ్ళ తరువాత గోదావరిడెల్టా ప్రాంతానికి మిషనెరీగా ఇతన్నే దేవుడు పంపించనున్నాడు.

అదే సంవత్సరం ఏప్రిల్ నెలలో రాబర్ట్‌చాప్‌మన్ అనే యువ న్యాయవాది లండన్ వీధుల్లో నడిచి వెళ్తున్నాడు. ఇంగ్లీషు సాహిత్యంలో అతనికి ఉన్న అభిరుచిచొప్పున ముందు ముందు సారస్వతంలో సాధన చేసి పేరు ప్రఖ్యాతులు గడించాలని అతని ఆకాంక్ష. లండన్‌లోని జాన్‌వీధిలో బెడ్‌ఫోర్డు మందిరం మీదుగా వెళ్తూఉంటే ఆ మందిరం డీకన్ ఇతన్ని ఆదరంగా చర్చిలోకి రమ్మని ఆహ్వానించాడు. ఆ చర్చిలో ప్రసంగిస్తున్న దైవజనుడు హేరింగ్‌స్టన్ ఇవాన్స్‌గారి సేవలో రాబర్ట్ చాప్‌మన్ ప్రభువును

రక్షకుడిగా అంగీకరించాడు. అంగీకరించడమేకాక మనస్ఫూర్తిగా సమర్పణ జీవితంతో ఆయన్ని వెంబడించాలని నిశ్చయించుకున్నాడు. తన ఆశలు, ఆశయాలన్నిటినీ వదిలేసి బోధకుని వృత్తి స్వీకరించాడు.

బార్న్‌స్టేపుల్‌లోని ఎబినేజరు ఛాపెల్‌కి ఒక పాస్టరు అవసరం కావడంతో రాబర్ట్ ఛాప్‌మన్ వారి ఆహ్వానాన్ని అంగీకరించి అక్కడ తన 70 యేళ్ళ పరిచర్యను ప్రారంభించాడు. ఈయన సువార్త సేవకు ప్రథమఫలం విలియం బౌడెన్ అనే యువకుడు. ఇతను రాతి పనివాడు. జార్జిబీరుకు గోదావరి డెల్టా మిషన్ సేవలో జతపనివాడు.

బీరు, బౌడెన్‌లు ఇద్దరూ ఎబినేజర్ ఛాపెల్‌లో దైవకృపలో క్రీస్తు సంబంధమైన జ్ఞానంలో అంతకంతకూ పరిపూర్ణులయ్యారు. ఛాప్‌మన్ పర్యవేక్షణలో వీధి ప్రసంగాలు, సువార్తసేవ కార్యక్రమాల్లో వీరిద్దరి ఆత్మ తీవ్రత, ఆత్మల సంపాదన భారం అధికమైనాయి. విదేశాల్లో ప్రభువుకోసం శ్రమలుపడుతున్న మిషనెరీల కథనాలను ఆసక్తిగా చదువుతూ ఉండేవారు. ముఖ్యంగా జడ్సన్ సాక్ష్యం బౌడెన్ హృదయంపై చెరగని ముద్రవేసింది. ఎట్టకేలకు కోతయజమానుడైన దేవుడు తూర్పు ఇండియాలో తమను సేవకులుగా పిలుస్తున్నాడన్న నమ్మకం ఈ ఇద్దరు యువకుల్లోనూ వేరు తన్నింది.

ఈలోగా ఈ ఇద్దరికీ దేవుడు యోగ్యులైన సాటి సహాయకురాళ్ళను భార్యలుగా దయచేసాడు. ఇద్దరిదీ ఒకటే పేరు. ఎలిజబెత్తు. ఒక ఎలిజబెత్తు శాంతంగల సుస్మిత మనస్కురాలుగాని కార్యదీక్ష గలది. రెండవ ఎలిజబెత్తు కార్యపటిమ కలిగి స్థిరమైన నమ్మకాలు, ఆశయాలు కలిగిన యువతి. ఈ రెండు జంటలూ దైవాశీర్వాదాలు పొంది ఆరోగ్యంతో సంతోషంగా ఉంటుండేవారు.

1835లో ఎ.ఎన్. గ్రోవ్స్‌గారు ఇండియానుండి ఇంగ్లండు తిరిగి వచ్చి బార్న్‌స్టేపుల్‌ని సందర్శించారు. ఇండియాలో మిషనెరీల అవసరత గురించి హెచ్చరిస్తూ యువకులను ప్రేరేపిస్తూ ఇక్కడికికూడా వచ్చారు. ఆయన రాకతో బౌడెన్, బీరుల సంకల్పం దృఢపడింది. అన్ని ఆటంకాలను దేవుడు తొలగించాలని ప్రార్థిస్తూ వచ్చారు. ముఖ్యంగా బౌడెన్ పనిచేస్తున్న

రాతిపలకల కంపెనీలో అతను ఇంకా రెండేళ్ళు పనిచేయాలని కాంట్రాక్టు ఉంది. అయితే కంపెనీ యజమానికి తన అభిలాషను వెల్లడి చేసేసరికి ఆయన బౌడెన్ వెంటనే వెళ్ళిపోవడానికి ఒప్పుకున్నాడు.

ఒక సంపన్న కుటుంబానికి చెందిన యువతి బంగారు చేతిగడియారాన్ని అమ్మి కానుకగా ఇచ్చింది. అందరూ విరివిగా విరాళాలు ఇచ్చారు. క్నోలో అనే ఆయన అప్పుడే మద్రాసులో పనిచేసి రిటైరై డేవన్‌షైర్‌లో స్థిరపడ్డాడు. ఆయన ఒకప్పుడు మచిలీపట్నంలో కూడా జడ్జిగా పనిచేసాడట. తెలుగువారికి ఒక మిషనెరీ ఎంతగా అవసరమో ఆయనకి కూడా తెలుసు. కాబట్టి బౌడెన్ బీరులు తెలుగునాడులో సేవచెయ్యడానికి సిద్ధపడితే వాళ్ళ దారి ఖర్చులు తాను భరించడమేకాక, సంవత్సరానికి 50 పౌండ్లు ఇస్తానని వాగ్దానం చేసాడు. ఈ విధంగా ఈ యువకులిద్దరూ గ్రోవ్స్‌గారివెంట ఇండియా వెళ్ళడానికి ద్వారం పూర్తిగా తెరుచుకుంది.

నోవహు ఓడలోనుండి జీవులన్నీ జంటలు జంటలుగా బయటికి వచ్చినట్టు ఆ రెండు జంటలూ 1836లో నోవహు వోడలాటి తమ బార్న్‌స్టేపుల్ ఛాపెల్‌నూ, సేవనూ, స్వగ్రామాన్ని వదిలి ఇండియాకు ప్రయాణమయ్యారు. అప్పటికి ఆ నలుగురి వయసూ దాదాపు 23 సంవత్సరాలు.

అనుభవం బొత్తిగాలేని ఈ రెండు జంటలూ గ్రోవ్స్‌గారితో కలిసి ప్రయాణం కావడం వీళ్ళ అదృష్టం. గ్రోవ్స్‌గారి పిలుపునందుకుని వీరిలాగానే మరికొంతమంది స్త్రీ పురుషులు వీరితో బయలుదేరారు. వీరితో ప్రయాణంచేసిన వాళ్ళలో హెర్మన్ గుండెర్ట్‌గారు ఉన్నారు. ఈయన కేరళ ప్రాంతంలో గొప్ప వైద్యుడుగా పేరు తెచ్చుకోవడమేకాక సకల భాషా ప్రవీణుడై మళయాళం ఇంగ్లీషు నిఘంటువు రచించడంద్వారా మళయాళ భాషకు ఎనలేని సేవ చేసినవాడు. ఈ మిషనెరీలతోబాటు గ్రోవ్స్‌గారి కుటుంబసభ్యులు కొందరు ప్రయాణమైనారు.

వీరంతా బ్రిస్టల్ నగరంలో కూడుకున్నారు. గిడియన్ ఛాపెల్‌లో జరిగిన వీడ్కోలు టీ సమావేశానికి బార్న్‌స్టేపుల్‌నుండి బౌడెన్, బీరు కుటుంబాలు చేరుకున్నాయి. ఈ సమావేశం 1836 ఫిబ్రవరి 26వ తేదీని

శుక్రవారంనాడు జరిగింది. సమావేశానికి జార్జిముల్లర్ అధ్యక్షత వహించారు. ఆ తరువాతిరోజు ముల్లర్‌గారి ఇంట్లో అందరికీభోజనాలు ఏర్పాటయినాయి. ఆదివారంనాడు అందరూ బెతెస్థఛాపెల్‌లో ప్రభువు బల్ల దగ్గర కూడుకున్నారు.

ఈ సమయంలో ముల్లర్ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన తన అనాథాశ్రమం నెలకొల్పే ప్రయత్నాలలో ఉన్నాడు. 1836 ఏప్రిల్ 21వ తేదీన ఇది స్థాపించబడింది.

* * *

మార్చి ఒకటవ తేదీన ఆదివారం మన బృందమంతా రేవుకు చేరుకున్నారు. ముల్లర్, ఆయన సతీమణితోపాటు చాలామంది వీరికి వీడ్కోలు ఇవ్వడానికి వచ్చారు. వందకుపైగా లెక్కతేలిన మన బృందంవారి సంచులు, పెట్టెలు అన్నీ జాగ్రత్తగా లెక్కచూసి వోడలో సర్దారు. ఆనందగానాలు మారుమ్రోగుతుండగా 'స్టార్' అనే పేరుగల ఆ ఓడ నదిలో ముందుకు కదిలింది.

బ్రిస్టల్ వదిలిన రెండు రోజులకి నదీముఖద్వారం దగ్గర ఉన్న మిల్‌ఫోర్డ్ హేవెన్ చేరుకున్నారు. అక్కడ వాళ్ళని ఎక్కించుకోవలసిన 'పర్‌ఫెక్ట్' అనే ఓడ పవనాలు అనుకూలంగా లేనందున రెండువారాలదాకా రాదని తెలిసింది. ఈలోగా ప్రయాణికులంతా కొందరు క్రైస్తవ విశ్వాసుల ఇళ్ళలోను హోటళ్ళలోను కాలక్షేపం చేసారు. 19వతేదీన ఆ నౌక రేవుకు చేరింది. ఈలోగా ఆ ఊళ్ళో బహిరంగ సాక్ష్యం ఇచ్చే అవకాశాన్ని జారవిడుచుకోలేదు మన బృందం. ఇక్కడ వేచిఉన్న సమయంలోనే గ్రోవ్స్‌గారు డాబేగారికి బ్రదరెన్ ఉద్యమానికంతటికీ చారిత్రాత్మకమైన ఉత్తరాన్ని రాసారు. డాబేగారు ఈ ఉత్తరాన్ని దానిలోని జ్ఞానయుక్తమైన సలహాను స్వీకరించినట్లయితే బ్రదరెన్ సంఘాల స్థితిగతులు నేడు వేరేవిధంగా ఉండేవి.*

ఎట్టకేలకు మన బృందమంతా 'పర్‌ఫెక్ట్'లోకి సామానంతా సర్దుకున్నారు. వోడ ప్రయాణంలో తమ ఆహారం తామే తెచ్చుకోవాలి. ఒక

*బ్రిటన్‌లో బ్రదరెన్ సంఘాల ఆవిర్భావం pp viii

సహోదరుడు స్కాట్‌లాండ్ వెళ్ళి వాళ్ళకి కావలసిన ఆహారం–40 గొర్రె పోతులు, 20 పందులు, ఆవులు, మేకలు, బాతులు తెచ్చి ఓడలోకి ఎక్కించారు. ఇదంతా చూసిన మన యువకులు వెంటనే ఆ ఓడకు నోవహు ఓడ అనే పేరు పెట్టేసారు. ఓడ కేవుకు 700 పౌండ్లు కావలసిఉండగా గ్రోవ్స్‌గారి దగ్గర అంత డబ్బులేని సమయంలో ముక్కు మొహం తెలియని వ్యక్తి ఒకతను వచ్చి 200 పౌండ్లు కానుకగా ఇవ్వడం నిజంగా అద్భుతమే. దేవుడు ఈ బృందానికెదురవుతున్న ఆటంకాలను ఎలా తొలగిస్తూ ఉన్నాడో చూడండి.

24వ తేదీ గురువారంనాడు అందరూ ఓడ ఎక్కారు. ఆదివారంనాడు గ్రోవ్స్‌గారు స్కాట్లాండు దేశస్థులైన నావికులకోసం తన మొదటి ఆరాధన కార్యక్రమాన్ని ఆ ఓడలో నిర్వర్తించారు. అయితే మంచి శుక్రవారం ఏప్రిల్ మొదటి తేదీన ఉత్తర పవనాలు మొదలైనాయి. మంచు కప్పిన భూభాగానికి వీడ్కోలు చెప్పి పర్‌ఫెక్ట్ నౌక లంగరు ఎత్తి సముద్రంలోకి కదిలింది. త్వరలోనే ఊగిసలాడే ఓడ ఊపులకి అందరికి వికారం, వాంతులు మొదలైనాయి. ఈస్టరు రోజుకి దాదాపు అందరూ కాస్తంత తేరుకుని లేచి తిరగగలిగారు. పాపం ఎలిజబెతు బీరుమాత్రం ప్రయాణం అంతటిలోనూ తన కేబిన్‌లోనుండి బయటికి రాలేకపోయింది. అసలు బ్రతుకుతుందో లేదో అని అందరికీ అనుమానం కలిగింది. ఇండియా చేరిన తరువాత ఇక మరెన్నడూ ఆమెను ఓడ ఎక్కించడం ఎవరికీ సాధ్యపడలేదు.

కొన్నాళ్ళకి ఊగిసలాటలు సద్దుమణిగి ప్రయాణం ప్రశాంతంగా సాగింది. ఇంతకు ముందెన్నడూ లేనంత తక్కువ సమయంలో ఇండియా చేరే అవకాశం కనిపించడంతో ఓడ నాయకుడు ఉత్సాహంతో గుడ్‌హోప్ అగ్రం దగ్గర ఆగకుండా ప్రయాణం కొనసాగించాడు. ఈ విధంగా ఈ ఓడలోని బృందం ఇంగ్లండు వదిలిన తరువాత మొదటిగా చూసిన తీరం సింహళం (శ్రీలంక) తీరమే. అయితే సముద్రం మధ్యలో ఎదురుపడిన ఓడలద్వారా ఇంటికి ఉత్తరాలు పంపించడం వీలయింది.

ఈ లోగా ఓడలో ఒక భాషాప్రవీణుడు గుండెర్ట్‌గారు ఉన్నందువల్ల మన మిషనెరీల బృందమంతా ఆయనకు విశ్వాసికంచేసి భారతీయ భాషలను

నేర్చుకోసాగారు. గ్రేవ్స్ సతీమణికీ కుమార్తెకూ స్విట్జర్‌లాండ్‌నుండి వస్తున్న స్త్రీలకు బెంగాలీ నేర్పించేవాడు. ప్రయాణం పూర్తయ్యేనాటికి వీరంతా బెంగాలీలో మాట్లాడగలగడం చూసి చాలా సంతృప్తిచెందాడాయన. గ్రేవ్స్‌గారికి అంతకుముందే అరబ్బీ పర్షియన్ భాషలు తెలిసి ఉండడంతో హిందూస్తానీ నేర్చుకోవడంలో ఆసక్తి చూపించాడు. బార్న్‌స్టేపుల్‌నుండి వస్తున్న బృందానికి గుండెర్ట్‌గారు తెలుగు పాఠాలు చెప్పారు.

ఇంగ్లీషులో 'మేన్' అనే మాటకి తెలుగులో 'మ–ను–ష్యు–డు' అని చెప్పేసరికి శిష్యులు ఏదో జోక్ విన్నట్టు చిరునవ్వులు నవ్వుతూ కూర్చున్నారు. గుండెర్ట్‌గారు తమను ఎగతాళి పట్టించడానికి ఇలా చెప్తున్నాడనుకున్నారు వారు. ఎందుకంటే మాన్ (MAN) అనే చిన్న పదానికి 'మనుష్యుడు' అనే ఇంత కఠినమైన పదప్రయోగం ఎందుకుంటుందీ అని వాళ్ళ ఉద్దేశం. చాలాసేపు ఈ పదాన్ని ఉచ్చరించడానికి వీరు ఒప్పుకోలేదు. గుండెర్ట్‌గారు తలపట్టుక్కూచున్నాడు. కొన్ని సంవత్సరాలు పోయిన తరువాత తాను అ, ఆ లు నేర్పించిన ఈ శిష్యులు తెలుగు భాషా ప్రావీణ్యంలో తనను మించిపోనున్నారని ఆయనకి తెలియదు.

ఆధ్యాత్మిక అలవాట్లు క్రమంతప్పక కొనసాగేవి. ప్రార్థనా సహవాసాలు, బైబిల్‌స్టడీలు, ఆదివారంనాడు ఆరాధన జరుగుతూ ఉండేవి. ఓడ కేప్టెన్ ఒకప్పుడు నెపోలియన్‌ను నౌకాయుద్ధంలో ఓడించిన నెల్సన్ దగ్గర పని చేసాడు. ఆ యుద్ధాల్లో పాల్గొన్నాడు. అతను అన్ని ఖండాల్లోనూ తనకి కలిగిన అనుభవాలు చెప్తూ ఉంటే శ్రోతలంతా నోరుతెరుచుకు వినేవారు. గ్రేవ్స్‌గారు ఓడ ప్రయాణికులకేగాక క్రింది భాగంలోని నావికులకుకూడా సువార్తనందిస్తూ తన నమ్రత, ప్రేమ నిండిన వ్యక్తిత్వంతో వాళ్ళ అభిమానాలను సంపాదించుకుని చాలామందిని క్రీస్తుమార్గంలోకి నడిపించగలిగారు.

మొత్తంమీద ప్రయాణం సరదాగా ఉన్నా అన్ని వారాలు భూమి అనేది కంటికి కనపడకుండా ఒకటే సముద్రం, చిన్న ఓడే ప్రపంచం, నక్షత్రాలే తోడుగా సాగిన ఆ రోజులు మన మిషనరీ బృందానికి కొంత విసుగుగానే అనిపించాయి. హిందూమహాసముద్రం ప్రవేశించి భూమధ్యరేఖ ప్రాంతాల్లో ఉన్నప్పుడు వేడిగా ఉక్కగా ఊపిరి సలపకుండా ఉండేది.

గుండెర్ట్‌గారికి ఓడలోని స్నానాల గదిలో స్నానాలు చెయ్యడంలో తృప్తి కలగలేదు. నీళ్ళలో దూకి ఈతలు కొడదామన్న ఆయన కోరిక ఒకరోజున ఫలించింది. ఆయన సముద్రంలోకి దూకగానే ఇతరులుకూడా ఆయన్ననుసరించారు. ఇది ఎన్ని రోజులు సాగేదో తెలియదుగాని మరుసటిరోజు ఉదయమే షార్క్! షార్క్! అని కేకలు వినిపించాయి. ఓ సొరచేపపిల్ల కనిపించింది. వెంటనే నావికులు గేలంవేసి దాన్ని పట్టుకుని చంపి వోడలోకి లాగారు. కొద్ది సేపటికే మరొక పెద్ద చేప కనిపించింది. దాన్నికూడా చంపి వోడలోకి లాగారు. దాని పన్నుమీద గుండెర్ట్ వేలు పెట్టేసరికి కస్సున తెగి రక్తం కారింది. కొన్ని రకాల షార్క్‌లు మనిషిని అప్పడాన్ని నమిలినట్టు నమిలివెయ్యగలవు మరి. గడగడా వణుక్కుంటూ మన బృందమంతా ఆ రోజున దేవుడు తమను సముద్రంలో దిగనియ్యనందుకు కృతజ్ఞతలు చెప్పారు.

గమ్యం దగ్గర పడుతున్నకొద్దీ సముద్రపవనాలు క్రమంగా ప్రతికూలంగా మారినాయి. రికార్డు బద్దలుకొట్టాలన్న హుషారు తగ్గిపోయింది. జూలై నాలుగవ తేదీన సింహళం ద్వీపపు పర్వతాలు కనిపించినాయి. 7వతేదీ సాయంత్రం మద్రాసురేవులో పర్‌ఫెక్ట్ లంగరు వేసింది. గ్రోవ్స్‌గారు వెంటనే కలకత్తా వెళ్ళవలసి ఉన్నప్పటికీ కొన్ని పనులవల్ల మద్రాసులో ఆగారు.

ఈ విధంగా 1836 జూలై 8వ తేదీన అంటే 14 వారాల ప్రయాణం అనంతరం మన మిషనెరీ బృందం క్షేమంగా మద్రాసు రేవులో దిగారు. 'పర్‌ఫెక్ట్' నౌక ఆ మరుసటిరోజు కలకత్తాకు ప్రయాణమై వెళ్ళిపోయింది.

# ౩

# మద్రాసు మచిలీపట్నం మజిలీలు

ఆకాలంలో మద్రాసులాంటి నగరంలో మిషనరీల కట్టుమర్యాదలు జీవిత విధానం మొదలైన వాటిని ఈ రోజుల్లో మనం ఊహించడం కష్టం. ఉదాహరణకు పురుషవాక్కంలో తమిళచర్చి కట్టించడానికి మూల కారకుడైన మిషనరీ వైజనుడు కార్నేలియస్ ట్రావెలర్‌గారు ఒకరోజున సముద్ర తీరంలో షికారుకువెళ్తూ సంప్రదాయప్రకారం టాప్ హేట్(పొడుగు టోపీకి) బదులు గడ్డి టోపీ పెట్టుకుని వెళ్ళాడట. పాశ్చాత్యుల వేషధారణ మర్యాదలను ఇంత ఘోరంగా మీరినందుకుగాను పాపం ఆయన్ని డిస్మిస్ చేసేవరకూ ఆయనమీద తోటి మిషనరీలకు రేగిన కోపం చల్లారలేదు.

గ్రోవ్స్‌గారు అంతకు మూడేళ్ళక్రితం అంటే 1833లో మొదటిసారిగా మద్రాసు వచ్చారు. ఇంతకుముందు ఏభైఏళ్ళక్రితం భారతదేశంలో క్రైస్తవ సాక్ష్యం ఎంతో దయనీయమైన స్థితిలో ఉండేది. బ్రిటిష్ ఉద్యోగులు, వర్తకసంఘాలవారు అనుసరించే నామకార్థ క్రైస్తవ్యం పూర్తిగా కుళ్ళిపోయిన స్థితిలో ఉండేది. నిజానికి బ్రిటిష్ సామ్రాజ్యం తరపున భారత దేశాన్నిపాలించే కంపెనీ అధికారులు హిందూమతాన్ని పరోక్షంగా ప్రోత్సహించారు. స్థానికులను మంచి చేసుకునేందుకు హిందూ పండగలకు ఉత్సానాలకూ పెద్ద ఎత్తున చందాలిచ్చేవారు. మిలటరీ మర్యాదలతో ఉత్సవాల్లో విగ్రహాలకు ముడుపులు చెల్లించేవారు. క్రైస్తవ మత కట్టు మర్యాదలను కొందరు పూర్తిగా ప్రక్కకు నెట్టేస్తే మరికొందరు బాహాటంగా హిందూ మతాన్ని కౌగలించుకున్నారు. ఇక్కడి సంప్రదాయాలననుసరించి పెళ్ళిమీద పెళ్ళిళ్ళు చేసుకుంటూ ఉంపుడు గత్తెలను పోషిస్తూ ఉంటే జిగెన్‌బాగ్ మొదలైన మిషనరీలు దక్షిణ భారతంలో చేసిన సేవ మాత్రమే ఆరోజుల్లోని

గాఢాంధకారంలో చిరు దివ్వె. అయితే వీరు స్థాపించిన సంఘాల్లోకూడా కులభేదాలు పొడసూపి సాక్ష్యాన్ని దెబ్బతీసిన సందర్భాలు ఉన్నాయి.

ఇలాటి సమయంలో దేవుడు చార్లెస్ గ్రాంట్ అనే ఉన్నతాధికారిని ఎన్నుకుని ఈయనద్వారా గొప్ప మత వికాసాన్ని ప్రారంభించాడు. ఈయన మొదటగా మారుమనస్సుపొంది తన అధికారం బలంవల్ల భారతదేశానికి నిష్ఠగల భక్తులైన వాళ్ళని కంపెనీ వారి పాస్టర్లుగా నియమించే ప్రయత్నాలు చేసాడు. భారతదేశంలో ఉద్యోగం చెయ్యడమంటే ఆ రోజుల్లో గొప్ప దర్జాతో కూడిన వ్యవహారం. ఒక పాశ్చాత్య ఉద్యోగి అతనెటువంటి వాడైనప్పటికీ, చదువుకున్నా చదువు లేకపోయినా బ్రిటిష్ సామ్రాజ్యంలో ఎక్కడికైనా వెళ్తే రాజభోగాలననుభవించేవాడు. ఇలాటి సుఖభోగాలకోసం ఇండియాకు పాస్టర్లుగా వచ్చే వ్యక్తులను అరికట్టి చార్లెస్ గ్రాంట్ నిజమైన దైవజనులు కొందరు ఇండియాకు నియమించబడేలా కృషిచేసాడు. ఈయన కాలంలోనే డాక్టర్ బుఖనాన్, హెన్రీ మార్టిన్, డానియెల్ కోరీ మొదలైనవారు మతాధికారులుగా వచ్చారు.

ఈ రోజుల్లోనే ఇవాంజెలికల్ మిషనెరీ సొసైటీలు అనేకం స్థాపించడం జరిగింది. సిరంపూర్ బృదం, అదోనిరామ్ జడ్సన్, తిరునల్వేలిలో సేవచేసిన రేనియస్, కలకత్తాలో సేవచేసిన డాక్టర్ డవ్ మొదలైనవారు ఆత్మల రక్షణలో బలమైన సేవచేసారు. ముఖ్యంగా బ్రిటిష్ సైనిక దళాలలో గొప్ప ఉజ్జీవం కనిపించింది. బెంగుళూరులో నియమింపబడిన సైనికదళాలనైతే 'పరిశుద్ధుల దళం' అని పిలిచేవారు. బ్రిటిష్ పార్లమెంట్‌లో 1833లో కంపెనీ చట్టాన్ని పునర్వ్యవస్థీకరించినప్పుడు మిషనెరీ సేవకు అడ్డంకులేవీ ఉండకూడదని నిర్ణయం జరిగింది. ఈ కాలంలోనే అమెరికన్ బాప్టిస్టు మిషన్, లూథరన్ మిషన్‌కూడా రంగంలో ప్రవేశించినాయి. ఆ రోజుల్లోమద్రాసు బిషప్ డాక్టర్ డానియెల్ విల్సన్ ఆ కాలపు క్రైస్తవ సంఘాల్లో కులసంబంధమైన అడ్డుగోడలను నాశనం చెయ్యడానికి విజయవంతమైన కృషి చేసాడు.

ఈ సంవత్సరంలోనే మద్రాసులో ఇండియన్ మిషనెరీ సొసైటీ స్థాపన జరిగింది. దక్షిణ భారత ప్రజలమధ్యకు మిషనెరీలను పంపడానికి ఏర్పాటైన సంస్థ ఇది. దీని ప్రసక్తి ఈ పుస్తకంలో మరోచోట వస్తుంది.

తన బాగ్దాదుసేవ విఫలంకాగా ఇటువంటి భారతదేశంలోకి అడుగు అడుగుపెట్టాడు గ్రోవ్స్. ఈయన భారతదేశానికి రావడంలో ముఖ్యపాత్ర వహించినది కాటన్ అనే మిలటరీ ఇంజనీరు. (తరువాతి కాలంలో ఈయనే జనరల్ సర్ ఆర్థర్ కాటన్ అయినారు) గ్రోవ్స్ ఎక్కడికి వెళ్ళినా డినామినేషన్ భేదం లేకుండా యూరోపియన్ల ఆదరాభిమానాలు లభించేవి. డేనియల్ కోరీ మద్రాసు బిషప్‌గా ఉన్నప్పుడు అంటే 1834 అక్టోబరు 24వ తేదీన మొదటిసారిగా గ్రోవ్స్ మద్రాసు వచ్చారు. బిషప్‌గారికి అతిథిగా ఉన్నారు.

* * *

తిరిగి మన కథలోకి వద్దాము. ఈ విధంగా రెండోసారి 1836లో బౌడెన్‌బీరు కుటుంబాలతో గ్రోవ్స్ మద్రాసు వచ్చారు.

గ్రోవ్స్ దంతవైద్యుడని ముందే తెలుసుకున్నాం కదా. ఓడ దిగగానే తన సహచరులూ తానూ నివసించేందుకు ఒక పెద్ద ఇల్లు అద్దెకు తీసుకుని అక్కడే డెంటిస్టుగా ప్రాక్టీసు పెట్టాడు. భారతదేశం చేరిన తరువాత ఈ బృందం గడిపిన మొదటి ఆదివారం వీరికెంతో పవిత్రమైంది. మద్రాసులోని విశ్వాసులలో బౌడెన్, బీరుల ఆత్మ తీవ్రత, స్నేహభావంవల్ల మంచి స్వాగతం లభించింది. సెంట్‌థామస్ మౌంట్ దగ్గర సైనికుల శిబిరాలకు దగ్గర్లో దాదాపు 40మంది విశ్వాసులతో ఒక చిన్న చర్చిని స్థాపించారు. ఆ సైనికులంతా దాదాపు 300 రూపాయలు చందా ఇచ్చి ఈ సహోదరులపట్ల తమకున్న అభిమానాన్ని కనపరిచారు.

ఆ రోజుల్లో విశ్వాసులైన బ్రిటిష్ సైనికుల క్రైస్తవ సాక్ష్యం గొప్పది. ఒక హిందూ ఊరేగింపుకు గౌరవార్థం బ్రిటిష్ సైనికులు గాలిలోకి తుపాకీలు పేల్చవలసివచ్చిన సందర్భంలో విశ్వాసులైన ఇద్దరు సిపాయిలు అందుకు నిరాకరించారు. వీరి నిరాకరణకు మద్రాసు సైనిక కమాండరు వారికి శిక్ష విధించవలసివుంది. అప్పటి కమాండర్ సర్ పెరెగ్రిన్ మెయిట్లాండ్ కూడా తన క్రైస్తవ మనసాక్షిని చంపుకోవడానికి ఇష్టపడక ఆ సిపాయిలిద్దరిని శిక్షించడానికి నిరాకరించి తన పదవికి రాజీనామా చేసేసాడు. దీనితో పెద్ద కలవరం బయలుదేరింది. ఇలా హిందూ ఊరేగింపులకు బ్రిటిష్ సైనిక దళాలు గౌరవవందనంచేయవలసిన ఆనవాయితీకి నిరసనగా రాబర్ట్ నెల్సన్

కూడా తన జడ్జి పదవికి రాజీనామా ఇచ్చారు. ఈ విధంగా 1841లో ఈ అందరి ధైర్యంవల్ల క్రీస్తుకు నమ్మకంగా నిలబడగలిగినందువల్ల ఈ ఆనవాయితీ తొలగించబడింది.

ఈలోగా మన మిషనెరీ కుటుంబాలు మాధవాయపాలెం (ప్రస్తుతం నర్సాపురంగా పిలవబడుతోంది) ప్రయాణ సన్నాహాల్లో మునిగారు. ఈ సమయంలో పార్నెల్‌గారు మన బృందానికి పరిచయ మయినారు.

జాన్ వీసీ పార్నెల్ రాజవంశానికి చెందినవాడు. భోగభాగ్యాల్లో పుట్టిపెరిగాడు. ఆగర్భ శ్రీమంతుడు. ఎడిన్‌బరా యూనివర్సిటీలో చదువుకుంటున్న రోజుల్లో మారుమనస్సుపొంది ప్రభువుకు పూర్తిగా సమ ర్పించుకున్నాడు. తన కులగౌరవం, ధనికుడినన్న అహంభావం ఈయనలో మచ్చుకైనా కనిపించవు. మురికిపేటల్లో ,సందుల్లో నిలబడి అవలీలగా క్రీస్తు సువార్తను బోధించగల నమ్మకమైన సేవకుడు. ఇహలోకం, దానికి సంబంధించిన భోగాలపట్ల ఈయనకు విముఖత. జూలై నెలాఖారుకి పార్నెల్‌గారు కుటుంబంతో సహా మద్రాసులో గ్రోవ్స్ బృందాన్ని కలుసు కున్నాడు.

శనివారం ఆగష్టు 13న బౌడెన్ బీరుకుటుంబాలు పార్నెల్ కుటుంబ ముతో కలిసి మద్రాసులో మచిలీపట్నానికి వోడ ఎక్కారు. పార్నెల్‌గారి పేరు ప్రతిష్టల మూలంగా ఎక్కడైనా ఆయనకు ఘనస్వాగతం లభిస్తుంది. ఆయన తోడుఉంటే మన రెండు మిషనెరీ కుటుంబాలు ఏ సమస్యాలేకుండా తాము ఎన్నుకున్న ప్రదేశంలో స్థిరపడడం వీలౌతుంది.

రెండు మూడు రోజుల ప్రయాణం తరువాత మచిలీపట్నం (లేక బందరు) చేరుకున్నారు. ఇది ఇంగ్లీషువారి అతి ప్రాముఖ్యమైన వ్యాపార రేవు. కాని అప్పటికే ఈ రేవు క్షీణదశ ఆరంభమైంది. అప్పటికి, మచిలీపట్నం జనాభా 60,000. వోడ లంగరు వేసినప్పుడు తాడిచెట తలలు కోటమీద ఎగురుతున్న బ్రిటిష్ జెండా తప్ప మరేవీ కనిపించలేదు. చిన్న పడవల్లో ఒడ్డుకు చేరుకున్నారు. తడి ఇసక బురదలో ఒకటి రెండు మైళ్ళు నడిచాకగాని మచిలీపట్నం ఊరు కనిపించలేదు. బ్రహ్మాండమైన మచిలీపట్నం కోటగోడలు అప్పటికే శిథిలమవుతూ ఉన్నాయి. చీలమండలోతు ఇసుకలో తాడిచెట్లు గవర్నమెంటు తుమ్మచెట్లు దాటుకుని ముందుకివెళ్ళి పేటలోకి

నివసించారు. 1611లో మొదటిసారిగా తూర్పుకోస్తాలో మచిలీపట్నంలో ఈస్టిండియా కంపెనీవారు కాలుమోపారు. అయితే ఆ అన్యవాతావరణం క్రైస్తవ ఆంగ్లేయవర్తకులమీద చూపించిన ప్రభావం ఎలాటిదంటే బందరులో అప్పట్లోవున్న ఇరవై హిందూదేవాలయాల్లో రెండు దేవాలయాలను బ్రిటిష్ అధికారులే కట్టించారు. అందాకా ఎందుకు పాలకొల్లులోని గోపురనిర్మాణాన్ని నిర్వహించిందీ, ధనసహాయం చేసిందీ డచ్చివారేనని చెపుతారు. ఎన్నోఏళ్ళుగా మచిలీపట్నంకు చాప్లిన్ (క్రైస్తవ గురువు) లేడు. ఆదివారం ప్రార్థన, ప్రసంగాలను సైనికాధికారి ఒకాయన చదివేవాడు.

అక్కడివారికి బౌడెన్ బీరు కుటుంబాలను పరిచయంచేసాడు పార్నెల్. తద్వారా లభించిన ఫలితాలు ఘనమైనవి. ఎలాగంటే జడ్జిగారు వీరికోసమని 200 రూపాయలు పంపించారు. చాలామంది ఈ రెండు కుటుంబాల కోసం గృహసామాగ్రి ప్రోగుచేసి ఇచ్చారు. బెంగాల్‌కి తన ప్రయాణం సాగించబోయే ముందు పార్నెల్ ఒక నెల రోజులు అక్కడే గడిపాడు. ప్రసంగాలు చూసి చదివే విధానానికి స్వస్తిచెప్పి పార్నెల్‌గారి ప్రసంగాలు వినే అవకాశానికి నోచుకున్నారు, మచిలీపట్నం విశ్వాసులు. ఇక్కడేగాక పార్నెల్‌గారు ఆయా సమయాల్లో కాలికట్, కన్ననోర్, మైసూర్, చిత్రదుర్గ, సికింద్రబాదు, కడప బెంగుళూరు మొదలైన చోట్ల సువార్తసేవ చేసిన ధన్యజీవి. మన రెండు మిషనరీ జంటల్లో ఒకరిగా చనిపోయిన బౌడెన్‌గారి మరణం తరువాత కొద్ది నెలలకు అంటే 1883 అక్టోబరు 23న పార్నెల్ ప్రభువులో నిద్రించాడు.

మచిలీపట్నంలోని యూరోపియన్లమధ్య ఉండడం సౌకర్యంగానేఉంది కాని బౌడెన్‌బీరులు వచ్చినది భారతీయులమధ్య సేవచెయ్యడానికిగదా. స్థానిక ప్రజలమధ్య స్థిరపడి తమ పనిలోకి ప్రవేశించడం మీదనే ఈ ఇద్దరు యువ మిషనరీల దృష్టి ఉంది. నర్సాపురంలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని ముందే నిర్ణయం అయిపోయింది. అయితే మచిలీపట్నం భాషనేర్చుకోవడానికీ, తెలుగు వాతావరణానికి అలవాటు పడడానికీ తగిన సౌకర్యాలున్న పట్టణం. అందువల్ల దాదాపు 8 నెలలు మచిలీపట్నంలో నిలిచిపోయారు. వారానికి రెండుసార్లు గృహప్రార్థనాకార్యక్రమాల్లో ప్రసంగాలు చేసేవారు.మచిలీ పట్నం వదిలి నర్సాపురంలో కాపురమున్న తరువాతకూడా అడపాదడపా అక్కడికి వెళ్ళి వస్తూఉండేవారు. ఆగష్టు 1841లో ఫాక్స్, నోబుల్‌గార్ల రాక తరువాత అక్కడికి వెళ్ళాల్సిన అవసరం పెద్దగా లేకపోయింది.

# 4

# నర్సాపురం

విక్టోరియారాణి సింహాసనం ఎక్కడానికి రెండు నెలలముందు, అంటే ఏప్రిల్ 1837 లో బౌడెన్ బీరు కుటుంబాలు నర్సాపురం చేరుకున్నాయి. వీరిని ఆదరంగా ఆహ్వానించడానికి బందరులోలాగా ఇక్కడ యూరోపియన్ కుటుంబాలేవీలేవు. అయితే నది ఒడ్డున వలందల రేవు (హాలెండ్ వార్ఫ్) దగ్గర ఖాళీగా పడిఉన్న డచ్‌హవున్ ఈ రెండు కుటుంబాలకు నివాసమైంది. డచ్చివారిని బుడత కీచులు అని పిలిచేవారు. ఆంగ్లేయులు వచ్చాక డచ్చివారు ఈ ప్రాంతాలన్నీ వదిలి వెళ్ళిపోయారు. పాలకొల్లు యుద్ధ పరికరాల ఫ్యాక్టరీనుండి ఎగుమతులకోసం డచ్చివారు ఈరేవును వాడుకునేవారు. దీనికి సంబంధించిన అధికారి డచ్చిహవుస్‌లో నివాసముండేవాడు. ఆయన వెళ్ళిపోయిన తరువాత ఈ బంగళా తలుపులు కిటికీలు పీకి అమ్మివెయ్యడం జరిగింది. పైకప్పు నాలుగు గోడలుతప్ప మరేమీ మిగల్లేదు. అయితే ఇంటిగదులు, ఆవరణ సౌకర్యంగా విశాలంగా ఉంది. అప్పుడప్పుడె నిష్క్రమిస్తున్న కరువు తాలూకు నీలినీడలు ఆ బంగాళా ఆవరణలో కనిపించాయి. కరువుకాలంలో ఆ ఆవరణలో తలదాచుకుని ఆకలి బాధకు చనిపోయిన వాళ్ళ అస్థిపంజరాలు బౌడెన్ బీరులకు స్వాగతం ఇచ్చాయి. వీధుల్లో ఎదురైన జనం ముఖాల్లో నీరసం, నిస్సత్తువ వ్యక్త మవుతున్నాయి.

* * *

గోదావరినది పశ్చిమ పాయను ఆనుకుని మచిలీపట్నంకు దాదాపు 40 మైళ్ళు ఉత్తరాన మెరక ప్రాంతంలో ఉంది నర్సాపురం. పురాతన చరిత్ర కాలంనాటినుండి నర్సాపురం రేవుకు మంచి పేరు ఉంది. ఈ ప్రాంతంలో

సముద్రం నుంచి లోతుగా ఉండి నోడల రాకపోకలకు అనువుగాఉండి. బొడెన్ బీరుల రాకకు కొద్ది సంవత్సరాలక్రితం దాకా కూడా ఆ ప్రాంతం సముద్రమంతా తెరచాప స్తంబాలమయంగా కనిపించేది. నదీ ముఖద్వారం దగ్గర అడ్డంగా విస్తరించి ఉన్న ఇసుక తిన్నె (Sand Bar) మూలంగా పెద్ద పెద్ద నౌకలు నది ఎగువకి రావడం వీలులేకపోయినప్పటికీ ఈ నదీ మార్గం చాలా కాలం ఎంతో ఉపయోగకరమైన వాణిజ్య మార్గంగా ఉంటూ వచ్చింది. ఈ ఇసుకతిన్నె క్రమంగా పెద్దది కావడంతో నౌకా వాణిజ్యం అంతా కాకినాడ రేవుకు మళ్ళింది. ( ఆ తరువాత కాలంలో అంటే 1933 లో విశాఖపట్నం రేవును నిర్మించిన తరువాత కాకినాడ ప్రాముఖ్యత కూడా తగ్గిపోయింది).

16వ శతాబ్దంలో నర్సాపురం గొప్ప నౌకానిర్మాణ కేంద్రంగా విలసిల్లింది. నది ఎగువన ఉన్న అరణ్యాలలో కలప దుంగలను నరికి నీటి వాలున వదిలేవారు. దీనికి తోడుగా నర్సాపురంలో ఇనుప పనివారు గొప్ప పేరు పొందారు. ఈ రెండింటి కలయికతో నాణ్యమైన నౌకలు ఇక్కడ తయారయ్యేవి. 1670 ప్రాంతంలో నర్సాపురం సౌభాగ్యం మిన్నంటింది. ఎలానంటే ఈస్టిండియా కంపెనీవారు మాధవయ్యపాలెం (అప్పటి నర్సాపురం) లో బట్టల ఫ్యాక్టరీ స్థాపించారు. (ఈ పల్లెను ఆంగ్లేయులు మేడపాలెం అన్నారు) ఇక్కడ తయారైన చేనేత వస్త్రం ప్రపంచ ప్రఖ్యాతిపొంది ప్రపంచపు నలుమూలలకీ ఎగుమతయ్యేది. ఈ వస్త్రాలను 'మేడపాలెంలు' అని పిలిచేవారు. దీనికి కావలసిన ప్రత్తి డెల్టా ప్రాంతంలో పుష్కలంగా పండేది. ఇక్కడినుండి రంగూన్ మొదలైన రేవు లకు ధాన్యం మొదలుకుని అన్ని రకాల ముడి సరుకులు ఎగుమతి అయ్యేవి.

అయితే ఐరోపాలో ఉత్పత్తి అవుతున్న ఫాక్టరీ బట్టలతో ఈ మేడపాలెం చేనేత పరిశ్రమ పోటీ పడలేకపోయింది. చివరికి 1827లో కంపెనీవారు ఈ ఫాక్టరీని మూసేసారు. దీనితో గోదావరి డెల్టా ప్రాంతం లోని వస్త్రపరిశ్రమకు తేరుకోలేని దెబ్బ తగిలింది. ఈ సమయంలోనే ిముఖద్వారం దగ్గరఉన్న ఇసుకతిన్నె పెద్దదై నౌకల ప్రవేశానికి అటంక ంది. క్రమేపీ నర్సాపురంలో నివాసమున్న యూరోపియన్లంతా నిష్క్ర ారు. వ్యాపారం పడిపోయింది. గిడ్డంగులు ఖాళీగా, వ్యర్థంగా పడి

ఉండేవి. మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టుగా 1833లోని దుర్భిక్షం ఈ ప్రాంతాన్ని చావు దెబ్బ తీసింది. ఉత్తర సర్కారులో ఇంత నికృష్టమైన క్షామం అంతకుముందుగాని, ఆ తరువాతగాని ఎన్నడూ రాలేదు.

బ్రిటిష్‌వారి రికార్డుల్లో ఈ క్షామం గురించి ఈ విధమైన వర్ణన ఉంది. "వేల కొద్దీ జనం మద్రాసుకు, తదితర ప్రాంతాలకు వలసపోయారు. మూటా ముల్లె సర్దుకుని జనం ప్రవాహంగా దక్షిణాదికి తరలి వెళ్ళారు. మార్గం మధ్యలో రాలిపోయే పిల్లలకు లెక్కలేదు. ఆకలిబాధకోర్వలేని చాలామంది తల్లిదండ్రులు చిక్కిశల్యాల్లా ఉన్న తమ కూతుళ్ళను హైదరాబాదు వర్తకులకు అమ్మేసారు. దారిపొడుగునా కొనప్రాణం ఉన్నవారు శవాలమధ్య చిందరవందరగా పడికనిపించేవారు. ఎండ కన్నెరుగని శ్రీమంతుల ఇంటి ఆడపడుచులు గుప్పెడు గింజలకోసం కఠినమైన చాకిరీ చేసేవారు. కొందరైతే ఇంత దీనస్థితికి దిగజారడం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకునేవారు. ప్రజల్లో నైతిక విలువలు పడిపోయినాయి. సిపాయిలు వెంట లేకుండా ధాన్యాన్ని ఒకచోటనుండి మరోచోటకి తీసుకువెళ్ళడం అసాధ్యమైపోయింది. పగలంతా నుగనాళ్ళు రోడ్లవెంబడి తిరుగుతూ తినదగ్గది ఏదైనా దొరుకుతుందేమోనని వెతుకులాడేవారు" ఈ కరువు దాదాపు ఒక సంవత్సరం ఉంది. రెండేళ్ళపాటు పరిస్థితులు మెరుగుపడినాయి. గాని 1836లో మరి కొన్నేళ్ళు అనావృష్టి మొదలైంది. మొత్తానికి 1830–40 కాలంలో ఈ ప్రాంతపు జన సంఖ్య 23 శాతం తగ్గిపోయింది.

దేవుడు మహా జ్ఞాని. ఇలాటి గడ్డుకాలంలో పాతికేళ్ళ వయసున్న ఈ నలుగురు వ్యక్తుల్ని ఆయన ఇంతదూరం ఇలాటి పరిస్థితుల్లోకి తీసుకురావడంలోని మర్మం మానవ హృదయానికి అగోచరం. బౌడెన్ బీరులు నర్సాపురంలో స్థిరపడిన కొద్ది రోజులకే పన్నెండేళ్ళకొకసారి జరిగే గోదావరి పుష్కరాలు వచ్చాయి. ఈ పన్నెండు రోజుల ఉత్సవాలకు గోదావరి తీరానికి జనం ఈగల్లాగా ముసిరారు. బౌడెన్ బీరులకు భాష అంతగా తెలియక పోయినా, కరపత్రాలు విరివిగా పంచిపెట్టగలిగారు. ఈ ప్రాంతంలో ఇంత పెద్ద మొత్తంలో సువార్త సామాన్య ప్రజల ఎదుటికి రావడం ఇదే మొదటి సారి. పుష్కరాలతోబాటు కరువువల్ల కృశించిపోయిన డెల్టా ప్రజలమీదికి

కలరా మహమ్మారి వచ్చి పడింది. మొదటిసారిగా బౌడెన్ బీరులు కలరా కాళరాత్రి ప్రళయాన్ని తమ ఎట్ట ఎదుట చూసారు. కరువునుండి బయట పడ్డ వాళ్ళని కలరా పొట్టనబెట్టుకుంది.

ఇది బౌడెన్ బీరులు నర్సాపురంలో అడుగుపెట్టినసాటి పరిస్థితి.

బౌడెన్ బీరులు క్రీస్తుకోసం నర్సాపురంలో స్థిరపడడానికి ప్రొఫెసర్ గారు వాడినమాట **'occupasion'**. అంటే ఆక్రమించుకోవడం. ఈ ఇద్దరూ 1837లో యేసు మహారాజు ప్రతినిధులుగా గోదావరి డెల్టాను ఆయనకోసం జయించేందుకు నాందిగా నర్సాపురం పట్టణాన్ని ఆక్రమించుకున్నారు. మిషనెరీలు ఏదైనా క్రొత్త ప్రదేశంలో సేవను ప్రారంభించడానికి వాడుకగా 'ఆక్రమించుకోవడం' అనే పదాన్ని వాడుతారు. ఇదిగదా నిజమైన పరిశుద్ధ శౌర్యం! క్రీస్తు యోధులుగా ప్రపంచపు నలు మూలల్లోనూ ఆయన ధ్వజాన్ని ఎగరెయ్యడాన్ని సూచించడానికి 'ఆక్రమించు కోవడం' అన్నమాటకంటే మంచిమాట ఏముంది?.

# 5

# ప్రారంభంలో పడరాని పాట్లు

గ్రోవ్స్‌గారి అనుచరులందరిలోనూ అంతకంతకూ నిరాశనిస్పృహలు తున్నాయి. బ్రదరెన్ మిషనెరీలెవరూ ప్రోత్సాహకరమైన స్థితిలో పార్నెల్, గుండెర్ట్, డాక్టర్ క్రోనిన్ మొదలైనవాళ్ళంతా అనేక ం గురై నిస్పృహచెంది ఉన్నారు. మద్రాసులో గ్రోవ్స్‌గారి సేవలో వీ కన్పించడంలేదు. బాగా దు మిషన్ పూర్తిగా మూతబడింది. ం సువార్త నందించడం నిజంగా దేవుని చిత్తానికి అనుకూలమైనదేనా ందేహాలుకూడా అక్కడక్కడా తలెత్తినాయి. గ్రోవ్స్‌మాత్రం ువుకు నమ్మకంగా వోర్పుతో,శోధనలను సహిస్తూ ఉన్నాడు.భారతీయుల గ్రోవ్స్‌గారి భారాన్ని, దూరదృష్టిని విజయవంతం చెయ్యడానికి మిగల్లేదు- బార్న్‌స్టేపుల్‌నుండి వచ్చిన ఆ రెండు పేద కుటుంబాలు "జ్ఞానులను సిగ్గుపరచుటకు లోకములోనుండు వెర్రివారిని దేవుడు కొనియున్నాడు. బలవంతులైనవారిని సిగ్గుపరచుటకు లోకములో ంలైనవారిని దేవుడు ఏర్పరచుకొని యున్నాడు" (1కొరింథీ 1:28, అంటూ పౌలుద్వారా దేవుడు పలికించిన మాటలను ఆయన బౌడెన్ విషయంలో మరోసారి ఋజువుచేసి చూపించాడు. బ్రదరెన్‌వారు మొదటిగా స్థాపించిన మిషన్ ఫీల్డు గోదావరిడెల్టా మిషనే.

అయితే అంతకుముందు బౌడెన్ బీరులిద్దరూ మాటిమాటికీ కరి ుద్ధిచెయ్యబడిన బంగారంలాగా పరీక్షల కొలిమిలో కాలవలసిఉంది. పోవు సువర్ణము అగ్నిపరీక్షవలన శుద్ధపరచబడుచున్నదిగదా? తేం అమూల్యమైన మీ విశ్వాసము ఈ శోధనలచేత పరీక్షకునిలిచినదై కీస్తు ప్రత్యక్షమైనపుడు మీకు మెప్పును మహిమయు, ఘనతయు

కలుగుటకు కారణమగును. (1 పేతురు 1:7). ఆ రోజుల్లో క్రొత్తగా పుట్టుకువచ్చిన సిద్ధాంతం ఇంగ్లండులో క్రమంగా వ్యాపిస్తోంది. డాబీగారి సిద్ధాంతం ప్రకారం అన్యులకు సువార్త ప్రకటించే భారం ప్రస్తుతం క్రైస్తవ సంఘానికి లేదు. అది రాబోయే మరోకాలంలో నెరవేరవలసిన దశ.* బాడెన్ బీరులకు ధనసహాయం చెయ్యడానికి ముందుకువచ్చిన సహోదరుడు ఈ సిద్ధాంతపు ప్రభావానికి లోనై, మిషన్లకు డబ్బు వెచ్చించడం దేవుని చిత్తంకాదన్న నిర్ణయానికి వచ్చాడు.

మన ఇదరు మిషనెరీలకు ఇండియా చేరిన తరువాత తొమ్మిది నెలలదాకా ఎలాటి ఉత్తరమూ రాలేదు. వచ్చిన మొదటి ఉత్తరం తమకు ధనసహాయం చేస్తానని మాట ఇచ్చిన క్ష్లాలో గారినుంచి. దాన్లో ఆయన తన వాగ్దానాన్ని ఉపసంహరించుకుంటూ ఆ నిర్ణయాన్ని బాడెన్ బీరులకు తెలియజేసాడు. అయితే ఈయన ఆ ఉత్తరంతోబాటు కొంత డబ్బు పంపిస్తూ "ఈ డబ్బును తిరుగు ప్రయాణానికిగాని, లేక మీకు ఏవిధంగా ఇష్టమైతే ఆవిధంగాగానీ ఉపయోగించుకోండి!" అని రాసాడు. ఆ డబ్బు అప్పటికి ముంచుకువచ్చిన అవసరాలకు సరిపోయింది.

అయితే నాగటిమీద చెయ్యివేసిన ఈ విశ్వాసవీరుల భవిషత్తు ఏమిటి? వెనక్కి తిరగవలసినదేనా? ఒక చర్చిగాని, ఒక కమిటీగాని, సొసైటీగాని, వ్యక్తిగాని ఎవరూ ఇంత డబ్బు పంపుతాము అని వాగ్దానం చేసినవారు లేరు. దేశంగాని దేశం! అయితే సమస్త సృష్టికీ పోషకుడైన దేవుడు వీరి హృదయాల్లో ఉంచిన విశ్వాసం గొప్పది. కేవలం విశ్వాసంమీద ఆధారపడి కృపమీద దృష్టి ఉంచి మిషన్‌ను కొనసాగించిన ధన్యత ప్రపంచంలో మొట్టమొదటిగా పొందిన పుణ్యపురుషులు వీరే. ఈ ఉత్తరం తరువాత మరొక 9 నెలలు ఇంగ్లండునుండి ఒక్క ఉత్తరం రాలేదు. ఈ ఒంటరితనం ఊహకందనిది. మాతృదేశాన్ని విడిచి ఇంత దూరాన, ఇలాటి పరిస్థితుల్లో మనసును చల్లబరిచే ఒక్క ఉత్తరానికి నోచుకోక ఈ రెండు కుటుంబాలు పడిన మానసిక వ్యథ ఎవరూహించగలరు?

డేవన్‌షైర్ ప్రాంతంవారు స్వతహాగా భోజనప్రియులు. పుట్టి

* ముందు పేజీ చూడండి

పాతికేళ్ళు పెరిగి అలవాటైన వాతావరణం, భోజన సదుపాయాలు ఇక్కడెలా దొరుకుతాయి ? రొట్టె, మాంసం, బంగాళాదుంపలు బౌడెన్ బీరు కుటుంబాల ప్రధానాహారం. ఇక్కడ బియ్యం, చేపలు, కోడిమాంసం, ఆంధ్ర కూరగాయలమీద బ్రతకవలసిందే. వీటితో కడుపునిండినా దీర్ఘకాలంలో ఇవి విదేశస్థులకు ఆరోగ్యం దిగజారిపోవడానికి దారితీస్తాయి.

జడ్జి థామస్, ఆయన సతీమణి నర్సాపురం సందర్శించిన సందర్భంలో బౌడెన్, బీరు కుటుంబాలకు రాజా నేటమాంసం, రొట్టె, కేకులు, కొంచెంగా ద్రాక్షాపళ్ళరసం కానుకగా ఇచ్చారు. మరో ఆంగ్ల ఉద్యోగి జెలికా గారు ఇలాటి కానుకలే మరో సందర్భంలో ఇచ్చాడు. బౌడెన్ బీరులు సేవించే దేవుని బిరుదు 'ఎల్ షద్దాయ్' కదామరి. ఇవన్నీకాక బౌడెన్‌కు ఇంగ్లండులో అజీర్తిరోగం ఉంటూఉండేది. ఇండియా చేరినప్పటినుండి ఏ సమస్యాలేదు. అవును. వారి దేవుడు 'యెహోవా—రోఫే— స్వస్థపరిచే దేవుడు.

ఇంతేకాదు, జ్ఞానాన్నిచ్చే దేవుడు ఈ నలుగురు మిషనెరీలకూ తెలుగు నుడికారం త్వరగా నేర్చుకోవడానికి సహాయంచేసాడు. బజార్‌లోకివెళ్ళి కరపత్రాలు పంచిపెడుతూ ఎదురైన వాళ్ళను పలకరిస్తూ, వాళ్ళతో స్వేచ్ఛగా కలిసిపోవడంద్వారా చాలామట్టుకు తెలుగు నేర్చుకో గలిగారు. తమ ఇంటి ఆవరణలో పిల్లల్ని పోగుచేసి వాళ్ళ మాటలను జాగ్రత్తగా గమనించేవారు. బీరు సతీమణి వోడ ప్రయాణమంతటిలో మంచానికి అంటుకుపోయిఉండి పాటూలేవీ నేర్చుకోనప్పటికీ, నర్సాపురంలో కాపురం పెట్టాక చాలా త్వరగా తెలుగులో మంచి ప్రవేశం సంపాదించ గలిగింది. ఒక సంవత్సరం గడిచేసరికి తెలుగువారితో మామూలుగా మాట్లాడ్డం వచ్చేసింది. రెండోయేటికి మత విషయాలను గురించి బోధించడం చేతనయ్యింది. స్థానికులు ఆసక్తితో వీరి మాటలు వినడం, భాషలో తప్పులుంటే సరిదిద్దడం చేస్తూ ఉండేవారు. కొన్నికొన్ని మాటలు నోరు తిరిగేవికాదు. అయితే చిన్నపిల్లల్లాగా ప్రతిదీ శ్రద్ధగా గమనిస్తూ సాధన చెయ్యడం, పుస్తకాలు చదువుతూ ఉండడంవల్ల త్వరగానే భాష నంటబట్టింది. వీరేకాక, వీరితరువాత వచ్చిన మిషనెరీలు కూడా పెద్దగా విద్యావంతులు కాకపోయినప్పటికీ స్వచ్ఛమైన తెలుగు భాష మాట్లాడ్డంలో త్వరలోనే కృతార్థులయ్యేవారు.

నర్సాపురంలో బౌడెన్ బీరులు స్థిరపడిన కొద్దికాలానికే జగ్గన్నపేట నుండి కొందరు సాలీలు నగరం ద్వీపంలో వీరిని కలిసారు. చాలారోజులు వీరితో ఉండి సువార్త విన్నారు.

పద్దెనిమిదేళ్ళ తరువాత జార్జి బీరు కాలంచేసాక ఒక గ్రామంలో బౌడెన్ ఈ బృందంలో ఒకతన్ని కలుసుకోవడం తటస్థించింది. అతను అక్కడ బౌడెన్‌ను బైబిల్లోని అనేక సందేహాలను అడిగి తెలుసుకున్నాడు. రెండు దశాబ్దాల క్రితం అతను విన్న వాక్యం ఇంకా అతని మనస్సులోనుండి చెరిగిపోలేదన్నమాట. మరో నాలుగేళ్ళకి అంటే జనవరి 1860లో ఈ బృందం సాలీతే మరో ముగ్గురు పాలకొల్లులో బౌడెన్‌ను కలిసారు. పశ్చాత్తాపం, విశ్వాసం మొదలైన వాటి అర్థాన్ని శ్రద్ధగా విచారించి తెలుసుకున్నారు.

బౌడెన్ మరణం తరువాత మరో పాతికేళ్ళకిగాని అంటే (1885 జూన్ నెలలో) బౌడెన్ కుమారుడు ఇ.ఎస్. బౌడెన్‌కు జగ్గన్నపేట సాలీల కులంలో అగ్రగణ్యుడనదగిన పింజార్ల మునలయ్యకు బాప్తిస్మమిచ్చే ఆధిక్యత దక్కింది. ఇతను స్వంతంగా విగ్రహాలకు ఒక రథాన్ని చేయించినవాడు. ఆ నవంబరు నెలలో జగ్గన్నపేట వాస్తవ్యులిద్దరికి ఆ గ్రామంలోనే హీలీస్ ద్వారా బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. అటుపైన వారి భార్యలుకూడా క్రైస్తవులయ్యారు. వీరితో మల్లమ్మ అనే స్త్రీ మంచి బైబిలు ఉపాధ్యాయినిగా రూపొందింది.*

థామస్ దంపతులు వచ్చివెళ్ళిన కొద్ది కాలానికే బౌడెన్ బీరులు తమలాగానే విశాఖపట్నం ప్రాంతంలో తెలుగువారిమధ్య మిషనెరీగా పని చేస్తున్న జేమ్సు విలియం గోర్డన్ గారికి నర్సాపురంలో స్వాగతమిచ్చారు. ఇతని తండ్రి జాన్ గోర్డన్‌కూడా తెలుగువారికి మిషనెరీగా ఎనలేని సేవ చేసాడు. విశేషించి ఈయన 1810లో విశాఖపట్నం చేరి తన సహచరుడు ప్రిచ్చెట్‌తో కలిసి 1818లో క్రొత్త నిబంధన తెలుగు తుర్జుమాను మొదటిసారిగా మద్రాసులో ప్రచురించాడు. మరో పదేళ్ళు గోర్డన్ తెలుగు వారిమధ్య సేవచేసాడు. అయితే ఒక్క ఆత్మకూడా రక్షింపబడడం చూడలేక పోయాడు. 1814లో అతని భార్య చనిపోవడంవల్ల కొడుకు జేమ్సు

*'క్రొత్త నీరు' అధ్యాయంలో

విలియం తెలుగువారి మధ్యనే పెరిగాడు. తెలుగు మాతృభాషలాగానే అలవాటు చేసుకున్నాడు. 1835లో ఇతను మిషనెరీగా సేవలో ప్రవేశించాడు. ఇతని రాక బౌడెన్ బీరులకు ఎంతో ప్రోత్సాహాన్నీ ధైర్యాన్నీ ఇచ్చింది. ఇతన్ని తోడు తీసుకుని మన మిషనెరీలిద్దరూ అంతర్వేది తీర్థానికి వెళ్ళారు.

ఈ తీర్థం సమయంలో ఆ గ్రామ జనాభాకు అంతకు 40–50రెట్ల జనసమూహం వచ్చి చేరుతారు. రకరకాల కోరికలతో వచ్చే భక్తులు, తిరణాలలో అంగళ్ళు తెరిచి వ్యాపారంచేసే వర్తకులు, వినోద ప్రదర్శన లివ్వడానికి వచ్చి చేరే గారడి, సర్కస్‌లవాళ్ళూ, బెల్లంచుట్టూ చీమల్లాగా మూగే బిచ్చగాళ్ళు వీళ్ళందరితో ఇసకవేస్తే రాలనంతమంది జనం ఆ సముద్ర తీరంలో హాజరవుతారు.

1838లో బౌడెన్ బీరులు మొదటిసారిగా ఈ తీర్థంలో వాక్యాన్ని అందించినప్పటినుండి క్రమం తప్పకుండా దాదాపు ప్రతియేటా ఈ తీర్థంలో ఆ కోలాహలం, అల్లరి, గందరగోళం మధ్య క్రీస్తుప్రభువు చల్లని పిలుపు వినిపిస్తూనే ఉంది. సందేశాన్ని అందించిన మనుషులు మారుతూ వచ్చారు గాని సందేశం ఒక్కటే. "నేనే మార్గమును, సత్యమును, జీవమునునై యున్నాను. నా ద్వారానే తప్ప ఎవడును పరలోకరాజ్యమును చేరలేడు". అభీష్టసిద్ధికోసం, మోక్షంకోసం తండోపతండాలుగా కూడివచ్చే అశేష ప్రజానికానికి వారి అవసరాలను తీర్చేనిజమైన దేవుడు ఎవరో చెప్ప బూను కునే ఈ తీర్థం సువార్తికులు నిజంగా ధన్యులు. మొదట్లో ఈ సేవనిమిత్తం బహూకరించబడిన డేరా చినిగిపోయినందువల్ల ప్రస్తుతం అంతర్వేది కర బృందంవారు కట్టించిన జి.డి.యం దేవాలయంలో పురుషులూ, పంచాయితీ సమితి స్కూలు భవనంలో స్త్రీలు ఉంటూ రెండుమూడు రోజులు ఈ సువార్తపని చేస్తున్నారు.

అయితే 1838లో మొదటిసారి సువార్తవాణి అంతర్వేది తీర్థంలో వినిపించిన తరువాత ఇన్నాళ్ళకి మొన్న 1984 జనవరిలో తీర్థం సువార్త దళానికి హిందూమతాభిమానులనుండి ప్రభుత్వ యంత్రాంగంనుండికూడా తీవ్రమైన అవరోధం కలిగింది. హిందువులు తమ ఉత్సవమేదో చేసుకుంటూ ఉంటే వెళ్ళి దానికి వ్యతిరేకంగా బోధించడం ఎంతవరకు సమంజసం అన్న వాదన క్రైస్తవుల్లో తలెత్తకపోలేదు.

నంగిడి గ్రామ పరిసరాలకు చెందిన గాథంచెట్టి సుమియోను ప్రభువు సంకీర్తించి 1856లో అంతర్వేది తీర్థంలో తన భక్తిరసాత్మక గీతాలతోను, ప్రసంగాలతోను సువార్తను వెదజల్లిన వైనం బ్రామ్లీగారు వివరించారు. అలానే 1851లో బీరు ఒంటరిగా అంతర్వేది తీర్థానికి హాజరై కరపత్రికలు పంచినట్టు డైరీలో రాసుకున్నారు. హిలీస్‌గారు షార్లెట్ డిబ్రాస్‌కు 1856 జనవరి 16వ తేదీన పెళ్ళి జరిగిన తరువాత వెంటనే సిక్విర్రా బౌడెన్ దంపతులతో కలిసి అంతర్వేది తీర్థానికి వెళ్ళారట. 1859లో హిలీస్‌గారు తన స్వంత పడవ 'హార్డింగర్'ను సంపాదించుకున్న తరువాత మొదటిసారిగా దాన్లో ప్రయాణం చేసింది అంతర్వేది తీర్థానికే. ఇక్కడ హిలీస్‌గారు సువార్త ప్రకటించే ఉత్సాహంతో ప్రతిఏట రథం ఊరేగింపు జరుగుతుండగా చదలవాడ ప్రాన్సిస్‌ను వెంట పెట్టుకుని ఊరేగింపు దగ్గరికి వెళ్ళాడట. అక్కడ తెల్లజాతివాణ్ణిచూస్తే అసలే పూనకంలో ఉన్న భక్తులు ఏం చేసేవారోగాని గతంలో హిలీస్‌ను ప్రతిఘటించిన ఒక వ్యక్తి చాకచక్యంగా హిలీస్‌ను తప్పించి క్షేమంగా పడవలోకి చేర్చాడట.

ఆ తరువాతి సంవత్సరంలోనే హిలీస్‌తో కలిసి మచిలీపట్నం మిషనెరీ షార్కీ ఆయన శిష్యులు అంతర్వేదిలో సువార్త చెప్పారు.

అంతర్వేదిలో క్రైస్తవ సువార్తికులకు ప్రతిఘటన ఇప్పుడు క్రొత్తగా వచ్చిపడిందేమీకాదు. జార్జి బీరు కుమారుడు జాన్ బీరు నర్సాపురం హైస్కూలు నడుపుతూ కొంతమంది విద్యార్థులను క్రీస్తు సత్యంలోకి నడిపించిన తరువాత 1867లో వారిలో కొందరు అంతర్వేది తీర్థంలో సాక్ష్యం చెప్పగలిగే ధైర్యాన్నిపొంది, బాహాటంగా తీర్థ ప్రజ ఎదుట క్రీస్తును ప్రకటించారు. అందుకు వీరు దూషణను, హింసను భరించవలసి వచ్చింది. అంతర్వేది తీర్థంలో మన ఆది మిషనెరీల అనుభవాలు విచిత్రంగా ఉంటాయి. హిలీస్‌గారిని తీర్థంలో అల్లరి మూకలు నానా తిప్పలు పెట్టేవారట. ఆయన టోపీ తీసేసుకుని దాన్లో ఇసుక నింపి మళ్ళీ ఆయన నెత్తిమీద పెట్టే వారట. బహు శాంతంగా ఆయన వాటిని సహించుకుని చిరునవ్వు చెక్కు చెదరకుండా బోధించేవాడట.

ఓసారి బౌడెన్, హిలీస్ తీర్థంలో సువార్త చెపుతుంటే బౌడెన్

గారిని కొందరు పోకిరీవాళ్ళు బాగా వేధిస్తున్నారట. గుంపుగావచ్చి ఆయన మీద పడుతూ బోధకు అడ్డు వచ్చారట. బౌడెన్‌గారు ఖచ్చితమైన మనిషి, ముక్కోపి అంటారు. ఇక సహించుకోలేక చేతులుచాపి దొరికిన నలుగురైదు గురు పోకిరి కుఱ్ఱవాళ్ళను బాహుబంధంలో ఇరికించి గట్టిగా తనకేసి అదుము కున్నాడట. ఆయన రవుద్రకార్యం. ఆ ఆరడుగుల ఎత్తు బలం, భల్లూకపు పట్టులా ఉక్కిరిబిక్కిరి చేసేస్తున్న ఆయన చేతుల్లో ఏమి జరిగిపోయేదోగాని దూరాన్నుండి హీలీస్‌గారు బౌడెన్‌గారివైపు వోసారి తీక్షణంగా చూసాడట. అప్పటికి గాని బౌడెన్ తన చేతుల్లో తొండల్లా గిలగిలా కొట్టుకొంటున్న నలుగురైదుగుర్ని వదల్లేదట.

ఆ తరువాత హీలీస్ బౌడెన్‌ను గద్దించాడట. "ప్రభుత్వం మనది. మనం అడిగితే ఇంగ్లీషు సైనికులు మనకి అండగా వస్తారుకదా. మనమీద ఈగ వాలనివ్వకుండా కాపలా ఉంటారుకదా? కాని మన ఆశయం అదికాదు. క్రీస్తు ప్రేమ సువార్తను అందించబూనుకున్న వారికి అసహనం, ప్రతీకారం తగునా" అని నిలదీసేసరికి బౌడెన్‌గారు దీనమనస్కుడై "అవును నేను తొందరపడ్డాను. ఇలాటిచోట సువార్తను ప్రకటించడానికి తగిన మానసిక బలం, సహనం నాకు లేవు" అని ఒప్పుకుని పశ్చాత్తాపపడ్డారట.*

అయితే మొదటి సందర్భంలో బౌడెన్, బీరు, గోర్డన్‌గార్లు అంతర్వేదిలో సువార్త ప్రకటించడంలో చూపిన ధీరత్వం గొప్పది. చాలామంది విన్నారు, చాలామందికి అర్థం అయిందిగాని నమ్మినవాళ్ళు ఎవరూలేరు. అటుపైన దాదాపు నూరేళ్ళ వరకు ఇలానే సాగిందని చెప్పాలి. యూరోపియన్ భారత క్రైస్తవ స్త్రీ పురుషులకు తీర్థంలో ఎదురైన దెబ్బలు, దూషణలు అంతాఇంతాకావు. అంతర్వేది గ్రామంలో యేటేటా సువార్త ధ్వని వినిపించింది. అయితే ఆ ప్రాంతంలోని నిమ్నజాతీయులు మొదటిసారిగా క్రైస్తవు లయ్యారు. 1909లో మొదటిసారిగా ఈ ప్రాంతంలో వీరిమధ్య మిషన్ స్కూలు స్థాపించడం జరిగింది. క్రైస్తవ ఉపాధ్యాయుడు నియమితు డయ్యాడు. ప్రతిదినం ఆ స్కూల్లో బైబిలు బోధన జరుగుతూ వచ్చింది. ఈనాడు అంతర్వేదిలో సుస్థిరమైన క్రైస్తవ సంఘం వుంది.

మొత్తానికి గోదావరిడెల్టా విశ్వాసులకు అంతర్వేది తీర్థం అప్పటికే

---

* వ్యక్తిగత సాక్ష్యం —సహో. కె. ఎస్. జాక్సన్ 1985

ఇప్పటికీ ఒక సవాలుగానే నిలిచింది. అయితే మారుతున్నకాలం, పరిస్థితుల కనుగుణంగా ఈ తీర్థంలో సువార్త ప్రకటన ఎలా పరిణమిస్తుందో చరిత్రే చెప్పాలి.

* * *

1838–39 సంవత్సరాల్లో బౌడెన్ బీరులకు కష్టాలు కొనసాగాయి. మొదట్లో వీరితో సంభాషించడంలోను,సువార్త వినడంలోనూఆసక్తిచూపించిన స్థానికులు క్రమేణా వీరిని పట్టించుకోవడం మానేసారు.క్రొత్తొక వింతగా వీళ్ళ చుట్టూ మూగిన స్థానికులు ఇప్పుడిప్పుడే వీరి తెలుగు భాషా పరిజ్ఞానం పెరుగుతున్న కొద్దీ వీరితో చర్చలకు, సంభాషణలకు రావడం మానేసారు. స్థానికుల్లో సత్యాన్ని గురించిన తహతహ బొత్తిగా శూన్యంగా అనిపించింది మన మిషనెరీలకి. ఈ యుగ సంబంధమైన దేవత కలిగించే గుడ్డితనం అలాటిది మరి.

1839 మే నెలలో నసుర్లీవిలో ఒక బ్రాహ్మణ కులస్థుడు తన చేతికి వచ్చిన ఒక కరపత్రాన్ని బీరు దగ్గరికి తెచ్చి దాని అర్థం వివరించమని అడిగాడు. బీరును అక్కడ ఒక బడి స్థాపించమనీ అది చాలామంది పిల్లలకు ఉపయోగకరంగా ఉంటుందనీ అడిగాడు. బౌడెన్ బీరులకు అప్పటిదాకా సహాయకరంగాఉన్న జడ్జి థామస్ దురదృష్ట వశాత్తు చిత్తూరుకు బదిలీ కావడం, ఇలాటి విషయాల్లో ఆసక్తిలేని మరొక జడ్జి అక్కడికి రావడంతో ఈ పథకం బెడిసికొట్టింది. మన స్నేహితులకు నిరాశే మిగిలింది.

అయితే ఇదే సమయంలో వీరిద్దరికి తెలియకుండా ఆంధ్రక్రైస్తవ చరిత్రకు మైలురాయివంటి సంభవానికి ఆరంభం జరిగింది. ఎలానంటే నసుర్లీవిలో పెరిగిన ఒక బ్రాహ్మణ పిల్లవాడు విశాఖపట్నం బంధువుల ఇంటికి చదువుకోసమని వెళ్ళాడు. ఎనిమిదేళ్ళ తరువాత క్రైస్తవుడుగా బాప్తిస్మం పొందాడు. ఉత్తర సర్కారు జిల్లాల్లో క్రైస్తవుడైన మొదటి బ్రాహ్మణుడు ఇతనే. ఇతని పేరు పులిపాక జగన్నాథం.

ఇది ఇలా ఉండగా ఈ తీరప్రాంతంలో సహజంగా సంభవించే ప్రకృతి వైపరీత్యం ఆ యేడు అక్టోబరు నెలలో డెల్టా ప్రాంతాన్ని నానా బీభత్సం చేసింది. నర్సాపురంనుండి విశాఖపట్నందాకా దాదాపు తీరంనుండి

రాజమండ్రిదాకా ఉన్న భూభాగన్నంతటినీ పెనుగాలులతో వరదలతో సర్వ నాశనం చేసింది. ఉప్పెన వచ్చి కాకినాడ, కోరంగి ప్రాంతాలు మునిగిపోయి నాయి. తీరాన ఉన్న పడవలు మొదలైనవి దాదాపు నాలుగు మైళ్ళు లోపలికి వచ్చి పడినాయంటారు. సామర్లకోట రాజమండ్రి దాకా ఇంటికప్పులు ఎగిరిపోయినాయి. ప్రాణనష్టం, ఆస్తినష్టానికి అంతులేదు. పశువులు అనేకం చనిపోయినాయి. ఉప్పు నీరు రావడంవల్ల సాగులో ఉన్న భూమి చాలామట్టుకు పనికిరాకుండా పోయింది. బావులన్నీ బురదమయమైనాయి.

1833 కరువు, 1836, 1837 అనావృష్టి, ఇవ్వాడీ ప్రకృతి వైపరీత్యం! ఇలా దెబ్బమీద దెబ్బవల్ల 1821–22లో గోదావరి జిల్లా జనాభా 7,38,308 ఉండగా 1840–41లో 5,33,836 కి తగ్గి పోయింది.

ఇలాటి కృంగదీసే పరిస్థితుల్లోనే జార్జి బీరు తప్పటడుగువేస్తే దురదృష్టకరమైన పరిణామం కూడా తటస్థించింది. విశ్వాసంతో కేవలం దేవునిమీదే ఆధారపడాలన్న పవిత్ర ఆదర్శంతో వచ్చిన బీరు తీవ్రంగా నిరు త్సాహ పడ్డాడు. ఇప్పటికే బీరు దంపతులకు మూడేళ్ళ పాప ఉంది. ఎలిజబెతు బీరు మళ్ళీ గర్భవతి. ఇంగ్లండులోని స్వజనం తమను పూర్తిగా మర్చిపోయారు. జార్జిముల్లర్ వీరికి ఇంకా కానుకలు పంపించడం మొదలు పెట్టలేదు. పరిస్థితుల వత్తిడికి బీరు దృఢనిశ్చయం, అచంచల విశ్వాసం బీటలువారినాయి.

కాని తూలిపడిన విశ్వాసి అలానే పడిఉంటాడా? ఎంత మాత్రంకాదు. నీతిమంతుడు ఎన్నిసార్లు పడిన తిరిగిలేస్తాడు.

కొందరు స్నేహితుల ప్రోత్సాహంతో బీరు విశ్వాసమార్గాన్ని విడనాడి ఇండియన్ మిషనెరీ సొసైటీలో మిషనెరీగా (జీతానికి) కుదిరాడు. అందు వల్ల 1840లో కుటుంబసమేతంగా మచిలీపట్నం తరలిపోయాడు.

బౌడెన్ తన కుటుంబంతో అయిష్టంగానే పాలకొల్లులో నివాసం ఏర్పరచుకున్నాడు. వీరిద్దరి కృషి ఫలితంగా ప్రథమఫలం కనిపించింది పాలకొల్లులోనే.

# 6

# వెలుగు రేఖలు

పాలకొల్లు పట్టణమంతటికీ ఆ రోజుల్లో, నేటికికూడా, కొట్టొచ్చి నట్టు కనిపించేది ఆలయగోపురం. గోదావరి చుట్టుప్రక్కల ప్రాంతాల్లో ఇంత పెద్ద గోపురం ఎక్కడాలేదని ఆ రోజుల్లో ప్రసిద్ధి. ఈ గోపురాన్ని ఇద్దరు మేస్త్రీలు కట్టారట. కట్టడంపూర్తయిన తరువాతచూస్తే గోపురం ఉత్తరానికి కొంచెంగా వంగినట్టు కనిపించిందట. దీన్ని సరిచెయ్యడం ఎలాగో అనేకమైన తర్జన భర్జనలు జరిగిన తరువాత గోపురాన్ని జాగ్రత్తగా పరీక్షించి లెక్కలువేసి ఆ మేస్త్రీలు తేల్చిన దేమంటే గోపురానికి దక్షిణం పక్కన కొన్ని గజాల దూరంలో ఇంత వైశాల్యంఉన్న చెరువు త్రవ్వాలని. త్వవ్వకం పూర్తయిన తరువాత బ్రహ్మాండమైన గోపురం దక్షిణానికి కొంచెంగా క్రుంగడంవల్ల నిటారుగా అయిందట.

బౌడెన్ కుటుంబం పాలకొల్లు దక్షిణ సరిహద్దుల్లో ఒక చిన్న ఇల్లు అద్దెకి తీసుకుని కాపురం పెట్టారు. జనసమ్మర్ధం ఎక్కువగా ఉన్నచోటు చూసుకుని బౌడెన్ క్రమం తప్పకుండా వారానికి రెండుసార్లు సువార్త బోధించేవాడు. అయితే శనివారం సంత బౌడెన్‌గారికిఎంతో ఇష్టమైన చోటు. చుట్టు ప్రక్కల గ్రామాలనుండి ప్రవాహంలా జనం సంతకు వచ్చేవారు. సువార్త నందించడానికి ఇది మంచి అవకాశం. బోధ ఏమన్నా ఆసక్తికరంగా ఉంటే కొందరు ఏదో సాకుతో సాయంత్రం ఇంటికి వెళ్ళి పోకుండా బౌడెన్‌గారితో ఆదివారంగూడా గడిపి అనేకమైన సందేహాలు ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకునేవారు.

పాలకొల్లులో మిగిలిన యూరోపియన్లంతా రోమన్ కాథలిక్కులు. మాతృభాష పోర్చుగీసు. వీరిలో కొందరు బౌడెన్ క్రైస్తవ సాక్ష్యానికి ప్రభావితులయ్యారు. స్థానికులింకా ఎవరూ క్రీస్తు మార్గంలోకి తిరగ

నప్పటికి ఈ యూరోపియన్ కుటుంబాల వారిని కొందరిని బౌడెన్ మార్చ గలిగాడు. ఈ సమయంలోనే బౌడెన్ కుటుంబం డి|బాస్ అక్కచెల్లెళ్ళు హెలీనా, చార్లెట్‌లను తమ ఇంట్లో పెట్టుకుని ఇంగ్లీషు నేర్పించారు. ఈ ఇద్దరు యువతులు తరువాతి కాలంలో బౌడెన్ స్థాపించిన స్కూల్లో ఎంతో సహాయం చేసారు.

అయితే తన సహచరుడు బీరు సహవాసం కరువైన బౌడెన్‌ను కష్టాలు మరింత క్రుంగదీసాయి. కొన్నిరోజులైతే ముతక బియ్యాన్ని తామే దంచుకుని దానితో గంజి మొదలైన వాటితో కాలక్షేపం చెయ్యవలసి వచ్చింది. "ఇవన్నియు మీకు కావలెనని మీ పరలోకపు తండ్రికి తెలియును" మత్తయి 6:32, అని క్రీస్తు చెప్పిన మాటలమీద ఎంత గురి! ఎంత నమ్మకం. ఇలాటి శ్రమల కాలాలే బౌడెన్ కుటుంబానికి మహత్తరమైన ఆశీర్వాద కాలాలైనాయి. వాటిని గురించి బౌడెన్ ఆ తరువాతి కాలంలో ఎంతో ఆనందంతో సాక్ష్యమిచ్చేవాడు. దారిద్ర్యంలో దేవుడు బౌడెన్‌ను ఆదరించి ఆదుకున్న సందర్భాలు, విశ్వాసాన్నిచ్చి అద్భుతమైన రీతిలో పోషించిన విధానమూ జార్జిముల్లర్ ప్రార్థనా విజయాలకు ఏమాత్రం తీసిపోవు.

విశాఖపట్నంలోను, నర్సాపురం—మచిలీపట్నంలోనుఉన్న మిషన్ స్టేషన్లకు తోడుగా 1840 ఫిబ్రవరి 26వ తేదీన నెల్లూరు ప్రాంతాన్ని అమెరికన్ బాప్టిస్టు మిషనెరీ డే గారు క్రీస్తు పేరిట ఆక్రమించుకున్నారు. అంటే మద్రాసువెళ్ళే దారిలో నర్సాపురం తరువాత మరొక క్రైస్తవ స్థావరం ఏర్పడిందన్నమాట.

ఆంధ్రులలో మొదటి క్రైస్తవ హతసాక్షి కథ 1840లోనే జరిగింది. విచిత్రం ఏమిటంటే ఈ హతసాక్షి ఒక ముస్లిం. అందులోనూ కర్నూలు నవాబు. అంతకుక్రితం యేడు పర్షియన్ హిందూస్థానీ భాషల్లో ఒక సువార్త కరపత్రం ఈయన చేతుల్లో పడిందట. అది చదివి ఈయనలో ఆసక్తి పెరిగి హిందూస్థానీ క్రొత్తనిబంధన సంపాదించి చదివాడు. చివరికి రెండు ఆదివారాలు క్రైస్తవ సంఘారాధనకు హాజరయ్యాడు. ఆ రోజు ఇంగ్లీషు ఆరాధన అయిపోయిన తరువాత తమిళంలో జరిగే ఆరాధనకుకూడా ఉండిపోయాడు నవాబుగారు. అంతా ఆయన చుట్టూ నిలబడి మాట్లాడుతూ ఉన్న సమయంలో ఒక ముస్లిం ఫకీరు వచ్చి ఆయనకు వంగి వంగి

చేతులు జోడించి నమస్కారం చేస్తూ దగ్గరకంటూ వచ్చాడు. ఒక్క ఉదుటున ముందుకి లంఘించి చేతులమధ్య ఉంచుకున్న చిన్న బాకుతో చాలాసార్లు పొట్టలో పొడిచాడు. వెంటనే ఆయన్ని ఇంటికి మోసుకుపోయారు. ఆ కొన ఊపిరిలోనే నవాబుగారు మిషనెరీని పిలువ నంపించి క్రీస్తులో తన నమ్మకాన్ని ప్రకటించి తనకు బాప్తిస్మం ఇమ్మని కోరాడు. ఆ స్థితిలో బాప్తిస్మం ఇవ్వడం మంచిదికాదని ఇవ్వలేదు. కొద్ది గంటలకే నవాబుగారు కన్ను మూసాడు. నవాబుగారు చనిపోయేముందు ముస్లింలు పఠించే కలీమాను ఉచ్చరిస్తూ ("దేవుడొక్కడే దేవుడు, అల్లా ఆయన ప్రవక్త") దేవుడొక్కడే దేవుడు అన్న మాటలనుమాత్రం పలికాడు. 'మహమ్మదు ఆయన ప్రవక్త' అనకుండా ఊరుకోవడంలో తన ముస్లిం విశ్వాసాన్ని చివరి క్షణాల్లో త్రోసిపుచ్చాడు. ఆయన్ని హత్య చేసిన ముస్లిం తాను సరైన పనే చేసాననీ, క్రైస్తవుడిగా మారి ఇస్లాంను విడిచిపెట్టిన నవాబుగారు మరణానికి పాత్రుడనీ వాదించాడు.

ఈలోగా బీరును దేవుడు మర్చిపోలేదు. ఆయన పనిచేస్తున్న సొసైటీ ఆయన చేరిన సంవత్సరానికే మూతబడింది. పైగా మచిలీపట్నంలో చర్చ్‌మిషనెరీ సొసైటీ (సి.యం.ఎస్.) వారు తమ తెలుగు మిషన్‌ను స్థాపించనున్నారని తెలిసింది. 1841 అక్టోబరు 28న తేదీన భక్తిపరులైన నోబుల్, ఫాక్స్ గార్లు బందరులో దిగారు. ఇది దేవుడు తనను తిరిగి నర్సాపురం పంపించడానికి ఎన్నుకున్న మార్గం అని బీరుకు నమ్మకం కుదిరింది. దీన్ని నిర్ధారించడానికన్నట్టు నర్సాపురం బంగాళాను గవర్నమెంటు వారు బీరుకు సంవత్సరానికి 40 రూపాయల చొప్పున అద్దెకు ఇవ్వడానికి ఒప్పుకున్నారు. 1861లో దీన్ని బీర్‌కి పూర్తిగా హస్తగతం చేసారు. గోదావరి ఒడ్డున మూడు ఎకరాల విస్తీర్ణంలో దృఢంగా కట్టబడిన ఈ బంగళా 1942 వరకు మిషన్ ఆధీనంలోనే ఉంది. ఇదే నేడు కేజిల్‌గా వ్యవహరించబడుతున్నది. ఇందులో ఆదివారం మీటింగులు జరపడానికి మగపిల్లల హాస్టలు, ఉన్నత కులాలకు చెందిన ఆడ పిల్లల హాస్టలు మొదలైన వాటికి చాలినంత జాగా ఉంది. 1841లో బీరు కుటుంబం నివసించిన ఈ బంగళా అప్పటినుంచి నూరేళ్ళు బీరు కుటుంబానికే నివాసంగా ఉంది.

అసలు ఆ గోదావరి తీరానఉన్న పెద్దపెద్ద భవనాలన్నీ అంటే

ప్రస్తుతం టైలర్ హైస్కూల్, వై.ఎన్. కాలేజి కలెక్టరు కచేరీ, మొదలైన వన్నీ డచ్‌వారు కాళీచేసి వెళ్ళిపోయిన తరువాత మిషనెరీలకు ఇవ్వడానికి ప్రభుత్వం సుముఖంగానే ఉండేది. అటుతరువాత ఆయా అవసరాలకు ఆ పాత భవనాలను ప్రభుత్వం తిరిగి తీసేసుకోవడం జరిగింది. 'కేజిల్' లోనే 1922దాకా నర్సాపురం సంఘారాధనలు జరిగేవి. నర్సాపురం మిషన్ హైస్కూల్ అక్కడే జరిగేది. 1922లో బేతని నిర్మాణం జరిగింది. అటు తరువాత అర్చిబాల్డ్ నేస్మిత్ గారు 'బ్యాలా' ను నిర్మించుకుని అందులోకి వచ్చేసిన తరువాత మిషన్ హైస్కూలును మిడిల్ స్కూలుగా చేసిన సందర్భంలో ప్రస్తుతం రాయపేటలో జోనారోడ్డు మిషన్ హైస్కూలుఉన్న చోటికి దాన్ని మార్చడం జరిగింది.

చార్లెస్ బీరుగారి సతీమణి చాలాకాలం కేజిల్‌లో ఉంటూఉండగా ఆమె పెద్దకూతురును లెప్రసీ ఆస్పత్రిలో పనిచేసిన టి. పేషెంటు చేసుకున్నారు. రెండవ కూతురు ఎడిత్ బీరును జె. యం.బోయిడ్ చేసుకున్నారు. ఈ విధంగా కేజిల్ బోయిడ్‌గారి ఆధీనంలోఉండి ఆయన తదనంతరం పనర్ పట్నా నేస్మిత్‌గారికి సంక్రమించింది. దాన్ని పదివేలకుఅమ్మకం పెట్టగా పెట్టుబడి లేకపోవడంవల్లనైతేనేమి మరి అన్యథా పొసగకనైతేనేమి మిషనెరీలు అందరూ ఉమ్మడిగా దీన్ని కొనుక్కోవాలన్న ప్రతిపాదన నెరవేర లేదు. అప్పుడు చదలవాడ జోసెఫ్‌గారు దీన్ని కొనుక్కున్నారు. తదనంతరం ఆయన భార్య డాక్టరు శిరోమణమ్మగారు దీన్ని తన బంధువులకు ఇచ్చెయ్యగా ఆమె తరుపు బంధువుడు అలెగ్జాండరుగారు దీన్ని పెంతెకొస్తు వారికి అమ్మే సాడు. అయితే ఈ బంగాళాఎప్పుడైనా అమ్మడం జరిగితే క్రైస్తవులకేఅమ్మా లన్న హామీని తీసుకుని అమ్మడం జరిగింది. ఈవిధంగా ఇన్నేళ్ళ గోదావరి డెల్టా చరిత్రను కడుపులో దాచుకున్న మిషన్ హౌస్ 'కేజిల్' ఆ చరిత్ర కంతటికి మూగ సాక్షిగ అలానే నిలిచి ఉంది.

బీరు కుటుంబం నర్సాపురం తిరిగి రాగానే మొదట తలపెట్టిన పని స్కూలు పునర్నిర్మాణం. ఆనాడు తిరిగి బీరుచే ప్రారంభించబడిన స్కూలు ఈనాటికీ నడుస్తూ ఉంది. అసలు 1826లోనే అంటే మిషనెరీలు రాక పూర్వమే ప్రయోగాత్మకంగా రాజమండ్రి, కాకినాడ, నర్సాపురం పట్టణాల్లో స్కూళ్ళు స్థాపించడం జరిగింది. పదేళ్ళు నడిచిన తరువాత వీటిని ఎత్తేసారు.

1842లో బౌడెన్ కుటుంబం మొదటి విహారయాత్రకని చిత్తూరులో గ్రోవ్స్‌గారిని కలుసుకోవడానికి బయలుదేరారు. ప్రయాణం ఖర్చులకు చేతిలో ఉన్న డబ్బు చాలదు. ఏది ఏమైనా నర్సాపురంలో వీరు కుటుంబంతో ఒకరోజు గడిపి మచిలీపట్నంమీదుగా చిత్తూరు వెళ్ళారు. ప్రయాణం ఆదిలోనే గ్రోవ్స్ సతీమణి పంపిన 70 రూపాయలు అందినాయి. చిత్తూరులో ఒక ఆఫీసరు వీరికి 200 రూపాయలు కానుక ఇచ్చాడు. తిరుగు ప్రయాణంలో గుంటూరును దర్శించారు.

కొద్దివారాల తరువాత తెలుగువారి మధ్య సేవకు అమెరికన్ ఇవాంజెలికల్ మిషన్ తరపున సి.యఫ్ హయ్యర్ గుంటూరుకు వచ్చాడు. ఈ మిషన్ తెలుగువారిమధ్య సేవ చెయ్యాలన్న దృష్టి వివారికి కల్గించడంలో గ్రోవ్స్‌గారి పాత్రకూడా ఉంది. ఈ విధంగా గుంటూరు, రాజమండ్రి కూడా క్రైస్తవ స్థావరాలయినాయి.

* * *

కన్నీళ్ళలో విత్తనాలు చల్లేవాడు ఆనందంతో పంట కోసుకుంటాడు. అది మిషనెరీల జీవితాలు విత్తనాలు చల్లడంలోనే గతించిపోయినాయి. ఈరోజుల్లోలాగా ప్రతి మీటింగులోనూ పదులు వందలు తీర్మానాలు జరగడనున్నది ఆ రోజుల్లో కనీవినీ ఎరుగని సంగతి. విశాఖపట్నంలో డే గారు 30 సంవత్సరాలు దీక్షలో శ్రమిస్తేగాని చిన్న విశ్వాసుల గుంపు తయారు కాలేదు. ఒంగోలు ప్రాంతంలో మొదటి తెలుగు క్రైస్తవుడు బాప్తిస్మం తీసుకోవడానికి ఇరవైయేళ్ళ శ్రమ అవసరమైంది. మరొక 18 సంవత్సరాలకు మిషనెరీ కార్యాల్లో మరపురాని రోజు ఒంగోలులో ఒకచోట, ఒకేరోజున 2,222 మందికి బాప్తిస్మం ఇచ్చిన రోజు వచ్చింది. 1857లో అంటే సువార్త విత్తడం ఆరంభించిన పదిహేనేళ్ళ తరువాత సి.యం.ఎస్ వారి కృషి ఫలితం కేవలం 49 మంది విశ్వాసులు. లూథరన్ మిషన్‌వారి కృషి ఫలితం 64 మంది.

గోదావరి మిషనెరీల విషయంకూడా ఇలాగే జరిగింది. పాలకొల్లు ప్రజల హృదయాలు సత్యానికి తావివ్వకుండా ఎంత కఠినమైపోయినాయంటే ఒకరోజు బౌడెన్‌గారు విసిగిపోయి పట్టపగలు నడిరోడ్డుమీద మోకరించి ఎలుగెత్తి అరిచాడు. "దేవా, ఈ ప్రజల్లో నీ వాక్యం పనిచెయ్యనివ్వు!" ఇదే బౌడెన్ కన్నీటి ప్రార్థన అయింది. "దేవా నేనిక్కడే కొనసాగడం

నిజంగా నీ చిత్తం అయితే సూచక క్రియగా నాకు కొన్ని ఆత్మలను అనుగ్రహించు. లేదా నన్ను వేరే ప్రదేశానికి పంపించు.'' వారం రోజులపాటు ఈ ప్రార్థన సాగింది.

ఉపవాసముండి చేసిన ఈ కన్నీటి ప్రార్థనకు వెంటనే జవాబు వచ్చింది. గతంలో ఒక యూరోపియన్ వ్యక్తి ఉంచుకున్న స్త్రీ కోల అచ్చమ్మ ప్రభువును అంగీకరించి తన ఇంటికి అగ్రకులాల స్త్రీలను ఆహ్వానించి క్రీస్తు సత్యాన్ని వాళ్ళకి వినిపిస్తూ గొప్ప సాక్షిగా నిలిచింది. చివరికి 1844లో బాప్తిస్మం పొందింది.

బౌడెన్ ప్రార్థనావారంలోనే పాలకొల్లు సమీపానగల సిద్దెలగూడెంకు చెందిన మార్లపూడి ఎంబేరు మన్నారులో ఆత్మకార్యం జరిగి జీవమార్గం గురించి తెలుసుకోవడానికి బౌడెన్ దగ్గరికి వచ్చాడు. అన్యాదులు గరగలు (ఘటాలు) ఎత్తుకుని నాట్యమాడుతూ ఉంటే ఈ ఎంబేరు వారిచుట్టూ డప్పులు వాయించేవాడు. ఇలా డప్పులు వాయిస్తూ బౌడెన్ బోధిస్తూ ఉండగా ముందే విని ఉన్నాడు. బౌడెన్ ప్రార్థనకు జవాబుగా జరిగిన ఈ సంఘటన చాలా ఆసక్తిదాయకంగా ఉంటుంది.

అంబాజీపేట దగ్గర కటార్లంకకు చెందిన చుట్టుగుల్ల పెనుమల్లు (ఫిలిప్పు) వోసారి పాలకొల్లు సంతలో భౌడెన్ చేస్తున్న బోధను విని ఆయన వెంట ఇంటికి వెళ్ళి సువార్తను సంపూర్ణంగా విన్నాడు. ఆ సువార్తను తన గ్రామానికి తీసుకువెళ్ళాడు. త్వరలోనే తిరిగి బౌడెన్ దగ్గరికి వచ్చి తన గ్రామస్తులు బౌడెన్‌గారినోట ఈ సత్యాలను వినడానికి సిద్ధంగా ఉన్నారని చెప్పి వెంటబెట్టుకు తీసుకువెళ్ళాడు. అక్కడ రెండు రోజులుండి ప్రాథమిక క్రైస్తవ సత్యాలను విప్పి చెప్పాడు. ఫిలిప్పు తన భార్యకాకుండా మరోకామెను ఉంచుకున్నందువల్ల ఈ వ్యవహారం తేలేదాకా అతనికి బాప్తిస్మం ఇవ్వడం కుదరదు. తిరిగి పాలకొల్లు వస్తూ ఇద్దరూ సిద్దెలగూడెంలో ఒక రాత్రి గడిపారు. అక్కడ ఫిలిప్పు తన తోటి జాతివారికి సువార్త చెప్పాడు. ఆ రాత్రి ఎంబేరులో ఆత్మకార్యం మొదలైంది. అందువల్లనే బౌడెన్‌ను వచ్చి కలిసాడు. వాక్యాన్ని హృదయపూర్వకంగా స్వీకరించి జీవితాన్ని పూర్తిగా మార్చుకుని, ఈ ప్రాంతాలలో మొట్టమొదటి బాప్తిస్మం పొందడం ద్వారా

విశాఖపట్నం, మద్రాసు మధ్య ప్రాంతానికంతటికి తెలుగు వారిలో ప్రథమ ఫలమైనాడు. స్వగ్రామం సిద్దెలగూడెంకు దారి ఏదీ లేక మోకాలులోతు బురదలో వెళ్ళవలసిరావడం వల్ల బౌడెన్ ఆ గ్రామాన్ని దర్శించి నప్పుడల్లా ఎంబేరు బౌడెన్‌ను తన భుజాలమీద ఎక్కించుకుని దాటించేవాడట.

ఎంబేరు తన ప్రజలమధ్య 36 ఏళ్ళు ఆదర్శప్రాయమైన విశ్వాస జీవితాన్ని గడుపుతూ మిషనెరీలకు కుడిభుజంగా ఉన్నాడు. కుక్క కరిచి 1878 మే నెలలో తనువు చాలించాడీ ధన్యజీవి. రేబీస్ వ్యాధి లక్షణాలు ముదురుతున్నప్పటికీ దేవుణ్ణి స్తుతిస్తూ ఘనపరుస్తూ చనిపోయే క్షణందాకా స్వస్థబుద్ధిలో దేవుణ్ణి కొనియాడుతూనే ఉన్నాడు ఎంబేరు. ఈయన పేరులోనే సిద్దెలగూడెం ఈనాడు ఎంబేరియన్‌పేటగా వ్యవహరించబడు తోంది. ఇతని కూతురు చెవిటి మార్తమ్మ 90యేళ్ళ వృద్ధాప్యంలో జి.డి.యం సంఘాల శతవార్షిక ఉత్సవ దినాల్లో అంటే 1836 ఫిబ్రవరి28న కన్నుమూసింది. ఎంబేరయ్యకు ఈమెగాక మరో ఇద్దరు కూతుళ్ళు చార్లెట్, ఫీబీలు ఉన్నారు. చార్లెట్ మల్లిపూడి యోసేపును వివాహమాడగా మల్లిపూడి మోషే, మిర్యాం తదితరులు జన్మించారు. ఈ మోషేగారు, మిర్యాంగార్ల సంతానమే ప్రస్తుతం ఈ ప్రాంతాల్లోని కొమానపల్లి, మల్లిపూడి పెంతెకొస్తు కుటుంబాలు. ఎంబేరయ్యగారికి మగ సంతానం లేదని అర్థమవుతున్నది. ప్రస్తుతం మార్లపూడి ఇంటిపేరుతో ఉన్న కుటుంబాలు (పాలకొల్లులో ఉంటున్న ఇశ్రాయేలు, నర్సాపురం మార్లపూడి న్యూటన్‌బాబుగార్లు తదితర కుటుంబాలు) ఎంబేరయ్య సోదరుల సంతానం అని గ్రహించవలసి వుంది.

మార్లపూడి ఎంబేరు మారుమనస్సు పొందిన సంవత్సరమే అతని భార్య కూడా యేసును రక్షకునిగా స్వీకరించింది. కాబట్టి ఆ యేట అంటే 1842లో బౌడెన్ మొదటిసారిగా బాహాటంగా బాప్తిస్మకార్యక్రమాన్ని వీరిద్దరికోసం నిర్వహించాడు. అది ఎంత ఆనందకరమైన సమయం! ఈ ఇద్దరితోబాటు డిబ్రాన్ కుటుంబసభ్యులు- తండ్రి మాథ్యూస్, తల్లి ఎలియువార్, కొడుకు లియోన్, కూతురు హెలీనాలకు కూడా బాప్తిస్మం ఇచ్చాడు. వీరు గోవాకి చెందినవారు. మరొకరెండేళ్ళు పోయిన తరువాతగాని కోల అచ్చమ్మ గత జీవితానికి స్వస్తిచెప్పి బాప్తిస్మం పొందడంద్వారా ఈ చిన్న మందలో చేరడం జరగలేదు. ఎంబేరు గోదావరిడెల్టా ప్రాంతంలో

బౌడెన్‌గారి జ్యేష్ఠ పుత్రుడు, ఆత్మీయ ప్రథమ ఫలమన్నమాట. ఈ విధంగా 1842లో పాలకొల్లు గోదావరిడెల్టా ప్రాంతానికి తల్లి సంఘంగా స్థిర పడింది.

ఆ యేడు క్రిస్‌మస్ పండగ బౌడెన్ బీరులు ఎలా గడిపారో తెలియదు గాని, వీరి తరువాత వీరిద్దరి అడుగుజాడల్లో ముందుకి సాగి గొప్ప క్రైస్తవ యోధుడుగా పేరు తెచ్చుకున్న జేమ్సు నార్మన్ మక్రేగారు స్కై ద్వీపంలో ఆ రోజునే జన్మించారు.

* * *

అటు తరువాత మూడు నాలుగు సంవత్సరాలు బౌడెన్ బీరులు వోపికతో నమ్మకంగా కష్టించి శ్రమించారు. ఈ కాలంలో పెద్దగా చెప్పుకో దగ్గ సంఘటనలేవీ లేవు. కాని ఆర్థికంగా గడ్డు పరిస్థితి అలానే కొనసాగింది. అంతకుక్రితం, కరువు, తుఫానులకు తోడు 1843లో భయంకరమైన వరదలు గోదావరి ప్రాంతాన్ని ముంచెత్తాయి.

1843 ఏప్రిల్ 14న జార్జి బీరు పెద్ద కొడుకు జాన్ విలియం బీరు మచిలీపట్నంలో జన్మించాడు. ఇతను తన తండ్రి తదనంతరం నర్సాపురంలోనే మిషనెరీగా మరపురాని సేవచేసాడు.

మచిలీపట్నం నోబుల్‌గారితో మన మిషనెరీలిద్దరి స్నేహం చాలా ఆత్మీయమైనది. వీరిద్దరు తరచుగా బందరు వెళ్ళవలసి వచ్చేది. 1844 నవంబరులో నోబుల్ బందరులో ప్రఖ్యాతిగాంచిన తన స్కూలు తెరిచాడు. బౌడెన్ బీరులు తమకు వచ్చిన చెక్కులు మార్చుకోవాలంటే బందరు వెళ్ళవలసివచ్చేది. సాయంత్రం చల్లబడుతుండగా కాలినడకన నర్సాపురంలో బయలుదేరి మరుసటిరోజు ఉదయానికల్లా బందరు చేరి నోబుల్‌గారితో కలిసి కాఫీ ఫలహారాలు పుచ్చుకునేవారు.

1844 లో జర్మన్ మిషనెరీ సొసైటికి (లూథరన్) చెందిన ఎల్.పి.యం. వాలెట్ పాలకొల్లు నర్సాపురంలను దర్శించాడు. ఇతనే ముందు కాలంలో బౌడెన్‌కు బావమరిది అయ్యాడు. బౌడెన్ చెల్లెలు ఏన్ భర్తను కోల్పోయి ఇండియా వచ్చింది. 1847లో వాలెట్ ఈమెను

వివాహం చేసుకున్నాడు. ఈ సంబంధం లూథరన్ మిషన్ వారికీ, మన బౌడెన్ బీరులకూ మధ్య సువార్త ప్రకటనలోకూడా సహాయసహకారాలకు దారితీసింది.

సంవత్సరమైనా తిరగకుండానే ఏన్ 1848 అక్టోబరు 29న కన్నుమూసింది.

ఎలిజబెతు బౌడెన్ కాన్పుకు రోజులు నిండినప్పుడు కుటుంబం అంతా బందరు వెళ్ళారు. అది 1844. బందరులో పదిహేను రోజులు గడిపారో లేదో నర్సాపూర్‌కి వెంటనే తిరిగివెళ్ళడం దేవుని చిత్తమన్నట్టు బౌడెన్‌కు అనిపించింది. అయితే పాలకొల్లు పరిసర ప్రాంతాల్లో మశూచికం విలయతాండవం చేస్తోంది. అందరూ వెళ్ళొద్దని వారించారు. కాని దేవుని ఆదేశానికి తలవంచక తప్పదు.

మార్గమధ్యంలో వారికంటబడిన దృశ్యాలు హృదయవిదారకంగా ఉన్నాయి. ఇల్లు చేరగానే వారింటి ఆవరణలో నిలబెట్టి ఉన్న రెండు రాళ్ళకు అక్కడి ప్రజలు పూజలు చెయ్యడం, నైవేద్యాలు పెట్టడం బౌడెన్ కంటబడినాయి. అలా చేస్తే దేవి శాంతించి మశూచికం తగ్గుముఖం పడుతుందని వాళ్ళ నమ్మకం. బౌడెన్ వెంటనే వారిని వారించాడు. ఆ రాళ్ళకుపూజలు చెయ్యడానికని వందల సంఖ్యలో జనం బయట కాసుకుని ఉన్నారు. జనం తనమాట వినకపోయేసరికి బౌడెన్ వాళ్ళందరి ఎదుట ఆ రాళ్ళను ఎత్తి పడేసి పగలగొట్టి, గొయ్యితీసి పాతిపెట్టాడు. ప్రజలు కోపంతో ఉడికిపోయారు. బౌడెన్ సంతానమంతా అంటువ్యాధి సోకి నశిస్తుందన్నారు. అయితే వ్యాధి సోకని కుటుంబం ఆ ప్రాంతాల్లో ఒక్క బౌడెన్ కుటుంబమే.

1844 నాటికి బౌడెన్ దంపతులకు నలుగురు సంతానం. అక్టోబరు 26వ తేదీన ఐదవ పిల్లవాడు ఎడ్విన్ స్కిన్నర్ బౌడెన్ పుట్టాడు. తన తండ్రి ఆరంభించిన పనిని కొనసాగించినవాడితనే. తండ్రీకొడుకులు కలిసి గోదావరి డెల్టా ప్రాంతంలో మొత్తం 88 సంవత్సరాలు సేవ చేసారు.

ఒకసారి బౌడెన్‌కు బాగా జబ్బుచేసి జ్వరంతో పడివున్నాడు. ఇంట్లో టీ పొడి నిండుకుంది. ఒక్కసారి టీ తాగడానికి మాత్రం వస్తుంది. ఎలిజబెతు

దాన్లో సగం పాడిని వాడి కొద్దిగా టీ పెడతానంది. అందుకు బౌడెన్ "వద్దు, మామూలుగానే తయారుచెయ్యి. దేవుడే చూసుకుంటాడు" అన్నాడు. ఇలా అంటుండగానే ఒక వ్యక్తి వచ్చి తనను జడ్జీగారు పరామర్శించి రమ్మని పంపాడనీ వారికోసం టీ, చిలకడ దుంపలు పంపిస్తున్నాడనీ చెప్పాడు.

మరోసారి టీతో బాటు కిరసనాయిలుకూడా అయిపోయింది. ఇంట్లో దీపం వెలిగించుకునే మార్గం లేదు. ఆదివారం ఉదయం నర్సాపురంలో బోధ చెయ్యడానికి బౌడెన్ బయలుదేరుతూ ఉండగా ఒక ఉత్తరం పట్టుకుని పోస్టుమాన్ వచ్చాడు. పోస్టుమాన్ ఆదివారం రావడం అంతకుముందుగాని తరవాతగాని ఎప్పుడూ జరగలేదు. దాన్లో ఒక చీటి, 30 రూపాయిలు ఉన్నాయి. "మీకిమ్మని దేవుడు ఈ డబ్బును నా చేతిలో పెట్టాడు" అని రాసి ఉంది. ఆ పంపినదెవరో తెలియదు.

కుటుంబం పెద్దదైనందువల్ల ఇల్లు ఇరుకైపోయింది. ఈ సమయంలోనే కేప్టెన్ ఒకిల్ బందరునుండి ఉత్తరం రాస్తూ "మీరు ఉన్న ఇల్లు చాలా ఇరుకుగా ఉందని నేను నా భార్యకూడా బాధపడుతున్నాము. ఇంకా గదులు కట్టించడానికి సహాయం చేస్తాము" అని రాసాడు.

అయితే చుట్టూరా తోట ఉన్న వేరే విశాలమైన ఇల్లు తీసుకోవాలని బౌడెన్‌కు అనిపించింది. పాలకొల్లు ఊరిమధ్యలో డచ్చివాళ్ళు కట్టించిన ఫ్యాక్టరీకి కొన్ని మార్పులు చేసి కట్టిస్తే తమకు కావలసిన ఇల్లు తయారవుతుంది. ఆ ఇంటిని 200 రూపాయలకు కొనుక్కుంటానని బౌడెన్ అధికారులకు అర్జీ పెట్టుకున్నాడు. ఈ విషయం పై అధికారులకు రాస్తే అలా వీల్లేదనీ దాన్ని వేలానికి పెట్టవలసిందనీ ఆదేశాలు వచ్చాయి. వేలం పాటలో 35 రూపాయలకే 8445 చదరపు గజాలస్థలం, చుట్టూ తోట, ఇదంతా పాలకొల్లు ఊరిమధ్యలో- ప్రస్తుతం వున్న బాలికల ఉన్నత పాటశాలకు సమీపంలో బౌడెన్ వశమయ్యాయి. 1845 ఆగస్టులో దీన్ని బౌడెన్ స్వాధీనం చేసుకున్నాడు.

త్వరలోనే దాన్ని తిరిగి కట్టించడానికి వెయ్యిరూపాయలు పోగైనాయి. జార్జిముల్లర్ 20 పౌండ్లు పంపించాడు.

ఈ కాలంలో పాలకొల్లు సంఘంలో నలుగురు వ్యక్తులుమాత్రం చేరడం జరిగింది. తొత్తరమూడి పేతురు నిష్ఠగల హిందువుగా ఉంటూ

వోసారి ఏదోపుణ్యక్షేత్రానికి ప్రయాణమై వెళ్తున్నవాడు బౌడెన్ ప్రసంగం విని ఆగిపోయాడు. అక్కడే ప్రభువును నమ్ముకున్నాడు. ఇతను తన కులవృత్తి చేసుకునేవాడు. ఇతని భార్య, కొడుకు జేమ్సుకూడా క్రైస్తవులయ్యారు. వీళ్ళ ముగ్గురికీ చార్లెట్ డ్రాన్‌కీ 1847 జూన్ 6వ తేదీన బాప్తిస్మం ఇచ్చాడు బౌడెన్.

ప్రస్తుతం పాలకొల్లులో పీటర్‌సన్ పేరున పిలవబడుతున్న కుటుంబాలకు మూలపురుషుడు ఈయనే. ఈయన 1864 జూన్‌లో కాలధర్మం చెందాడు. తరువాత జేమ్సు బౌడెన్‌గారికి సన్నిహితంగా మెలుగుతూ చిరస్మరణీయమైన సేవ చేసాడు.

తొత్తరమూడి పేతురు బ్రాహ్మణులకు సువార్త చెప్పాలని కంకణం గట్టుకున్నవారిలో ప్రథముడు. వారివెంటబడి ప్రతి బాపనయ్యకీ క్రీస్తులో రెండవజన్మ గురించి వినిపించనిదే పోనిచ్చేవాడు కాదు. ద్విజులని పిలువబడే బ్రాహ్మణులకు రెండోజన్మ గురించి చెప్పకపోతే ఎలా? ఒకసారి ఒక ఉన్నత వంశీయుడు అంతకుముందు ఎంతో కఠినంగా ప్రవర్తించి, చివరికెలాగైతేనేం పేతురువెంట బౌడెన్ సతీమణి దగ్గరికి వచ్చాడు. ఆమె దగ్గర పేతురు ఒక సువార్త పుస్తకాన్ని తీసుకుని దాన్ని ఆ వ్యక్తిముందు నేలమీద ఉంచి (తక్కువ కులం వాడు కాబట్టి చేతికి ఇవ్వకూడదు) "ఇది చదవండి. సత్యమని తోచిన దాన్ని గ్రహించి, చెడుగు ఏదన్నా ఉంటే వదిలెయ్యండి" అన్నాడట.

బ్రాహ్మలు, ఇతర అగ్రకులాలవారూ చదువుకుంటున్న బందరు నోబుల్ స్కూలుకు వెళ్ళి తన మాటలు అందరూ వింటారో లేదోనని ద్వారం దగ్గరే నిలబడి చేతులు అడ్డంగా చాపి, ఎవరూ తనను ముట్టుకోనిదే లోపలికి వెళ్ళనీయకుండా అందరికీ యేసు వార్త చెప్పాడు. పాముకున్న వివేకం, పావురానికున్న నిష్కాపట్యం ఇతనిలో మూర్తీభవించినాయి అని పేతురు గురించి నోబుల్ వ్యాఖ్యానించాడు.

నర్సాపురంలో బీరును కలుసుకోవడానికి వచ్చి బజారులో వాక్యం చెపుతుంటే పెద్దగుంపు ఇతనిచుట్టూ మూగారు. అది సిపాయిల తిరుగుబాటు కాలం. పేతురుచుట్టూ మూగిన అల్లరి జనం క్రైస్తవులందరికీ కాలం మూడిందనీ, వారూ వారి క్రీస్తూ ఏమైపోతారో అని బెదిరింపుగా

మాట్లాడారు. అందుకు పేతురు "స్నేహితులారా, ఈ మంటి శరీరానికి మీరు హాని చెయ్యవచ్చు. నా ఆత్మను మీరేమీ చెయ్యలేరు. అయితే నా శరీరాన్ని మీరేమైనా బాధిస్తే నా దేవుడు మీకు తగిన ప్రతీకారం చేస్తాడు" అన్నాడు. అతి విలువైన సాక్ష్యాన్ని తన తోటి విశ్వాసులమధ్య వదిలి 1864 జూన్‌లో ఈయన పరమపదించారు.

తెలుగు క్రైస్తవులు ఇంగ్లీషు మిషనెరీలకేగాక ఆ కాలంలో ప్రభుత్వ ప్రతినిధులుగాఉన్న ఇంగ్లీషు ఉద్యోగులకుకూడా ఎంతో ఋణపడి ఉన్నారని చెప్పాలి.

కొందరు ఇంగ్లీషు ఉద్యోగుల నిజాయితీ ఇక్కడి ప్రజల్లో గొప్ప ఆదర్శంగా నిలిచింది. రాజమండ్రిలో జరిగిన ఒక సంఘటన చాలా తమాషాగా ఉంటుంది. ఒక ఇంగ్లీషు కలెక్టరుగారి దగ్గరికి ఏదో పని చేయించుకుందా మని ఒక జమిందారు వచ్చారట. గోదావరి నదిమీద కట్టిన బంగాళాలో నదిమీదికి వాలిఉన్న వరండాలో ఇద్దరూ మాట్లాడుకుంటున్నారు. జమిందారు కానుక (లంచం)గా కొన్ని బత్తాయిలు తీసుకొచ్చాడు. మాట్లాడుతూ మాట్లాడుతూ కలెక్టరుగారు ఒక బత్తాయిని చేతుల్లోకి తీసుకునే సరికి చాలా బరువుగా అనిపించిందట. ఆయనకి అర్థమైపోయింది. ఏమీ అనకుండా మామూలుగానే మాట్లాడుతూ ఒక్కొక్క బత్తాయిని తీసుకుని తీరిగ్గా నదిలోకి విసిరేసాడట. జమిందారుగారికి ముచ్చెమటలు పోసేస్తున్నాయి. చేతులు నలుపుకుంటున్నాడు. ఇంతకీ విషయం ఏమిటంటే ఒక్కొక్క బత్తాయిలోనూ జమిందారుగారు ఒక్కొక్క బంగారు ఆభరణంపెట్టి లంచంగా ఇవ్వడానికి తెచ్చారన్నమాట.

ఈ ఇంగ్లీషు అధికారులు క్రైస్తవులైనా కాకపోయినా ప్రవర్తనలో నిజాయితీ కనిపించేది. ఇక వీరు మారుమనస్సుపొందినవారైతే చెప్పవలసిందే ముంది.

1847—48లో గోదావరి నదిపైన ఆనకట్ట నిర్మాణంకోసమని వచ్చి చేరిన వేలమంది కూలీలకు సువార్తనందించడంకోసం బౌడెన్ బీరులు ధవిలేశ్వరానికి తరలివెళ్ళారు.

సర్ ఆర్థర్ కాటన్ బర్మాయుద్ధంలో ఇంజనీరుగా పనిచేసి తిరుగు

ప్రయాణంలో వోడలో మారుమనస్సు పొందారు. గ్రోవ్స్‌గారు రచించిన కరపత్రం చదివి ప్రభావితుడై బాగ్దాదుకు వెళ్ళి ఆయన్ని కలిసి ఆయన ఇండియాలో సేవచెయ్యవలసిందని అభ్యర్థించి ఒప్పించడంద్వారా గ్రోవ్స్ గారు ఇండియా రావడానికి మూలకారణమయ్యాడు.

1844లో రాజమండ్రిలో ఇంజనీరుగా పని ప్రారంభించి దాదాపు ఏడేళ్ళు అక్కడ పనిచేసాడు. క్రైస్తవ మిషనెరీ సేవ అంటే కాటన్ గారికి ఎంతో ఇష్టం. ధవిళేశ్వరం ఆనకట్ట నిర్మాణం సమయంలోనూ ఆ తరువాత కూడా సువార్తికులైన బౌడెన్ బీరులకు ఏ లోటూ రానియ్యకుండా చూసుకున్నాడు.

ఆర్థర్ కాటన్ పేరు గోదావరి డెల్టా ప్రజలందరికీ, క్రైస్తవ, క్రైస్తవేతర ఆంధ్రులందరికీ చిరస్మరణీయం. ఆ మహనీయుని నైపుణ్యం, ఆంధ్రులపట్ల ఆయనకున్న అభిమానాలకు చిహ్నంగా గోదావరి ఆనకట్ట నేటికీ చెక్కుచెదరకుండా నిలిచిఉంది.

గోదావరి డెల్టా ప్రజలకు కాటన్‌గారిపట్ల ఉన్న కృతజ్ఞతాభావం అపారమైనది. గోదావరి డిస్ట్రిక్టు అసోసియేషన్ సభ్యుడు ఒకాయన కాటన్‌గారికి లేఖరాసూ "ఈ బ్రహ్మాండమైన ఆనకట్టను చూస్తూ మీ పేరు స్మరించుకోని వ్యక్తి ఈ గోదావరి ప్రాంతంలో ఎవరూ ఉండరు. మీ గోదావరి నీటితోనే ఈ ప్రాంతపు మనుషులు తమ పొలాల్లో విత్తనాలు చల్లుతారు. మీ గోదావరి నీటితోనే ధాన్యం పండించుకుంటారు. మీ గోదావరి నీటితోనే దాన్ని వండుకుంటారు, మీ గోదావరి నీటినే తాగుతారు" అని రాసాడు. ఈ నాటికీ గోదావరి నదిలో తీర్థస్నానాలు చేసే హిందూ భక్తులు 'సంకల్పం' మంత్రాలలో కాటన్ నామాన్ని ఉచ్చరించడంద్వారా ఆయనకు నివాళు లర్పిస్తారు.

కాటన్‌గారు 1803 మే 15న హెన్రీ కాల్వేలీ కాటన్‌కు పదవ సంతానంగా ఇంగ్లండు దేశంలో జన్మించారు. తన 15వయేట మిలటరీ సెమినరీలో శిక్షణపొంది ఇండియాకు కేడెట్‌గా వచ్చాడు. తన ప్రజ్ఞవల్ల పరీక్ష ఏమీ పాస్‌కావలసిన అవసరం లేకుండానే రాయల్ ఇంజనీర్ల బృందంలో నియమితుడైనాడు. క్రమంగా మిలటరీ ఇంజనీరింగు సర్వీసులో జనరల్ పధవికి ఎదిగాడు.

కాటన్‌గారు రిటైరైన తరువాతకూడా తాను నిర్మించిన కట్టడాల నిర్వహణకు ప్రభుత్వం ధనసహాయం చేసేలా పాటుపడ్డారు. ఈస్టిండియా పబ్లిక్‌వర్క్స్ విషయంలో ఈయనపై వచ్చిన అభియోగాలకు జవాబిచ్చేందుకు హౌస్ ఆఫ్ కామన్స్ సెలెక్ట్ కమిటీముందు రెండుసార్లు హాజరు కావలసి వచ్చింది. ఆ కమిటీతో ఆయన ఇలా అన్నారు—

"I never asked for an appointment or for any thing else except to be allowed to irrigate India. I never possessed property, never ever took a share in any speculation that I might have nothing to occupy my thought, or wrap my judgement but give myself up to my duty of helping to raise India in this particular point. It has pleased God to prosper the works I have been engaged in."

సర్ ఆర్థర్ కాటన్ తన 96 వ యేట అంటే 1899 జూలై 24న కాలధర్మం చెందాడు.*

కాటన్‌గారు ఒకమాట అంటూ ఉండేవారు. "ఈ దేశాన్ని ఉద్యాన వనంగా మార్చడానికి రెండు అవసరం. ఒకటి సహజ జలం, రెండు జీవజలం. మొదటిదాన్ని గవర్నమెంటువారి ఆధ్వర్యంతో నేను అందించడానికి కృషి చేస్తున్నాను. రెండోదానికోసం మిషనెరీలను అర్థిస్తున్నాను."

కాటన్‌గారి ధవళేశ్వరం ఆనకట్టపనిలో సహాయకునిగా నియమితుడైన మేజర్ జనరల్ ఫెలిక్స్ థాకరీ హేగ్ ఇండియాకు వచ్చిన తరువాత క్రీస్తును రక్షకునిగా అంగీకరించినవాడు. కాటన్‌గారి సతీమణికి చెల్లెలైన ఆనీ లియర్‌మౌతును పెళ్ళి చేసుకున్నాడు. 1852లో డెల్టా గన్నవరం దగ్గర గోదావరికి దాదాపు అరమైలు పొడవున వున్న ఆక్విడక్టును మూడు నెలల్లో నిర్మించి భారత ఇంజనీరింగు చరిత్రలోనే ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నాడు. దుమ్ముగూడెం ప్రాంతంలో పనులు చేపట్టి 500 మైళ్ళ పొడవున గోదావరి నదిని వ్యాపార రవాణాకు అనువైనదాన్నిగా చేసాడు.

దుమ్ముగూడెంలో ఉండగా హేగ్ తన తోటి ఇంజనీర్లను, ఆఫీసర్లను కూలీలను సమావేశపరిచి ప్రార్థనలు నడిపేవాడు. ఈ ప్రార్థనల్లో ఆ ప్రాంతపు క్షత్రియ కులపెద్ద ఐ. వెంకట్రామరాజు ప్రభువులోకి

*"Saviout from the scourge of famines"
'ది హిందు' ఆంగ్ల దినపత్రిక ప్రత్యేక వ్యాసం—ది. 2–7–1982 సంచిక నుంచి—

నడిపించబడి భార్యతోసహా మచిలీపట్నం వెళ్ళి షార్కీగారిద్వారా బాప్తిస్మం పొందాడు. హేగ్ 1881లో రిటైర్‌పోగానే ఆలస్యం చెయ్యకుండా వెంటనే దుమ్ముగూడెం వెళ్ళి అక్కడి మిషన్ స్టేషన్‌లో పని ప్రారంభించాడు. దుమ్ముగూడెంకు 80 మైళ్ళదూరంలోని బస్తర్ జిల్లాల్లో మిషన్ స్టేషన్‌ను స్థాపించాడాయన. కోయభాషలోకి లూకా సువార్తను, యోహాను రాసిన మొదటి లేఖనూ తర్జుమా చేసి అచ్చొత్తించాడు. ఈయన 94 సంవత్సరాలు బ్రతికి 1925 ఫిబ్రవరి 3వ తేదీన శాశ్వత నివాసానికి వెళ్ళిపోయాడు.

* * *

"ఈ నీళ్ళు బంగారం. రెండువేల చదరపు మైళ్ళ విస్తీర్ణం ఉన్న ఒంగ్రుమట్టి నేలను సస్యశ్యామలం చెయ్యడానికి అవకాశం ఉండికూడా ఈ జలనుంతా వ్యర్థంగా సముద్రంలో కలిసి పోతున్నది." ఇదీ సర్ ఆర్థర్ కాటన్ ఆవేదన. ఎందుకంటే అంగట్లో అన్నీ ఉన్నాయి, అల్లుడినోట్లో శని ఉందన్నట్టుగా, గంగానది తరువాత భారతదేశమంతటిలో అతిపెద్ద నది అయిన గోదావరి ఇటుగుండా ప్రవహిస్తూ ఉంటే ఈ ప్రాంతానికి కరువు కాటకాలు ఎందుకుండాలి? గోదావరి నాసిక్‌లో పుట్టి తూర్పుగా 1465 కిలోమీటర్లు ప్రయాణించి బంగాళాఖాతంలో కలుస్తున్నది. దీని ఉపనదులు మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి. శబరినదికూడా కలిసాక తూర్పు కనుమల్లో కేవలం 200–300 మీటర్ల వెడల్పున్న కనుమలగుండా గోదావరి ప్రవహిస్తూంది. పాపికొండలు అని పిలువబడే ఈ కనుమలో ఎండాకాలంలో దీనిలోతు 30–60 మీటర్ల వరకూ ఉంటుంది. తదుపరి పోలవరం దగ్గర 1.6 కిలోమీటర్లు, రాజమండ్రి దగ్గర 3 కిలోమీటర్లు, ధవళేశ్వరం దగ్గర దాదాపు 6కిలోమీటర్లు వెడల్పు ఉంటుంది. ధవళేశ్వరం దిగువన ఇది గౌతమి, వశిష్ట అనే పాయలుగా విడిపోతుంది. ధవళేశ్వరం దగ్గర గోదావరి ఇంత వెడల్పు ఉండడానికి కారణం అక్కడ 3 లంకలుండడమే. ఎడమవైపునున్న లంకకి పిచికలంక అనీ, మధ్యనున్న దానికి బొబ్బర్లంక అనీ, కుడివైపు ద్వీపానికి మద్దూరులంక అనీ పేర్లు. కోనసీమకు ఆరంభం ఈ బొబ్బర్లంకే. ధవళేశ్వరంకు ఎదురుగా గోదావరి అవతల ఉన్న గ్రామం విజ్జేశ్వరం. ఈ ధవళేశ్వరం, విజ్జేశ్వరం మధ్యను ఆనకట్ట నిర్మాణం తలపెట్టాడు సర్ ఆర్థర్ కాటన్. ధవళేశ్వరంవద్ద ఈ నీటిని అరికట్టి పంటపొలాల సాగుకోసం

ఉపయోగించేందుకు కాటన్‌గారు ప్రతిపాదించిన ప్లాను ఉన్నదున్నట్లుగా ఆమోదం పొందింది. హేగ్‌తో సహా నలుగురు అసిస్టెంటు ఇంజనీరు ఆఫీసర్లు, కూలీవాళ్ళను నియమించి అవ్యవహారాలు చూసుకోడంలో అప్పటి సబ్‌కలెక్టరు హెన్రీ ఫోర్బెస్ సహకరించారు. ఫోర్బెస్‌గారి కృషివల్ల త్వరలోనే 1000మంది కూలీలు, 500 మంది వడ్రంగులు, 500 మంది కమ్మరులు, పోగయ్యారు. 1847 ఏప్రిల్‌లో పని మొదలైంది.

పని 1300మంది కూలీలతో ప్రారంభమైంది. ఇంతకుముందెన్నడూ ఇలాటి పని చేసి ఉండనందువల్ల మొదట్లో కూలీలు ముందుకి రాలేదు. అయితే అధికారుల దయతో వ్యవహరిస్తూ కూలీ డబ్బును నమ్మకంగా ఇచ్చేస్తూ ఉండడంచూసి ఉత్సాహంగా ఒళ్ళువంచి పనిచేసారు. ఈ జిల్లాలోని ప్రతి తాలూకా తన విస్తీర్ణం,జనాభాలకు అనుగుణంగా కూలీలను పంపించాలనీ హెన్రీఫోర్బెస్ తాకీదులు పంపించాడు. గ్రామాధికారులు తమలో తాము సంప్రదించుకుని కొందర్ని ఎంచి ఆనకట్ట నిర్మాణానికి పంపేవారు. నెలాఖరులో క్రొత్త బృందంవెళ్ళి తమ ఊరి వాళ్ళను వెనక్కి పంపించే పద్ధతి అవలంభించబడింది.. ' **The noblest feat of engineering skill in British India'** అని ప్రస్తుతించబడిన ఈ ఆనకట్ట నిర్మాణాన్ని కాటన్‌గారు కేవలం అయిదేళ్ళలో 1,65,000 పౌండ్ల వ్యయంతో పూర్తి చేయగలిగారు.

ఈ ఆనకట్ట మొత్తంగా కాంక్రీటు లేక దానికి సంబంధించిన పదార్థాలతో కట్టినదికాదు. నది ఇసుకనే ఆనకట్టగా పేర్చి, దానిపైన చెక్కిన రాళ్ళతో తాపడం* చేసారు. ఈ ఆనకట్ట పునాదులు కేవలం ఆరు అడుగుల లోతుమాత్రమే ఉన్నాయంటే ఆశ్చర్యం వేస్తుంది. ఆ కాలంలోనే ఇండియాలో ఇతర ప్రాంతాల్లో ఇంజనీర్లు వాడుకగా 30, 40 అడుగుల లోతు దాకా పునాది వేసేవారు.

ఇంతమంది ఆనకట్ట పనికోసం దాదాపు 1852 దాకా అక్కడ నివసిస్తూ ఉంటే కాటన్‌గారు సువార్త అవసరాలను పట్టించుకోకుండా ఎలా ఉండగలడు? సువార్త ప్రకటనకు ఇంతకంటే మంచి అవకాశం మరెక్కడుంటుంది? దేవుని చిత్తం ఎలాగున్నదో అని ప్రార్థన చేస్తూఉన్నాడు కాటన్.

---

*** "saviour from the scourge of famine"**

'ది హిందూ' అనే ఆంగ్ల దినపత్రిక ప్రత్యేక వ్యాసం ది 2-7-1982—సంచిక ఆధారంగా.

ఒకరోజు ఎత్తుగా దృఢంగా ఉన్న ఇంగ్లీషు అతను కూలీలమధ్య తిరుగుతూ ఉండడం చూసాడు. అతని బట్టలు మురికిగా ఉన్నప్పటికీ కూలీలతో కలిసిపోయే చిరునవ్వుతో స్నేహపూర్వకంగా అతను మాట్లాడుతూ ఉండడం కాటన్‌గారి దృష్టిని ఆకర్షించింది. ఇదే దేవుని జవాబు! తెలుగు చక్కగా మాట్లాడగలిగిన సమర్థుడైన మిషనెరీ సువార్తికుడు! ఆయన్ని పిలిపించి విచారిస్తే గ్రోవ్స్‌గారి ప్రసక్తి వచ్చింది. కాటన్‌గారు పరమానందంతో బౌడెన్‌కు స్వాగతం ఇచ్చి ధవళేశ్వరంలో బౌడెన్ కుటుంబంతోసహా ఉండడానికి ఒక ఇల్లుకూడా చూపించి అక్కడే ఉండి కూలీలకు సువార్త అందించమని కోరాడు.

అలుపు ఎరుగని బౌడెన్ కూలీలకాంపులన్నీ తిరుగుతూ యేసుక్రీస్తు అందించే రక్షణ మార్గాన్ని అందరికీ ప్రబోధించాడు.

ఆదివారం తప్పనిసరిగా ఆనకట్టపని ఆగిపోయేది. ఆదివారం యూరోపియన్లకు ఆరాధన కార్యక్రమం నడిపించేవాడు. బౌడెన్‌కు యువకుడైన హేగ్ తోడయ్యాడు. కాటన్ దంపతుల ప్రోత్సాహం, సహాయం బౌడెన్‌కు కొండంత శక్తి నిచ్చాయి. విశేషమేమిటంటే నిర్మాణం జరిగినంతకాలం క్రొత్త కూలీలు వస్తూ పాత కూలీలు వెళ్ళిపోతూ ఉండేవారు. కాబట్టి గ్రామాలవెంట వెళ్ళి సువార్త చెప్పవలసిన కష్టం తప్పింది.

బౌడెన్ బీరుల గురించి కాటన్‌గారు గ్రోవ్స్‌గారికి ''ఇలాటి వ్యక్తులు ఇంకా ఎక్కువమంది ఉంటే ఇండియాకి ఎంత ఆశీర్వాదం!'' అని రాసారు.

ఆనకట్ట నిర్మాణం సమయంలో బౌడెన్‌గారిద్వారా సువార్తవిని ఆ తరువాత మురమండ గ్రామంలో నివాస మేర్పరచుకున్న బళ్ళ సుబ్బన్న (ఫిలిప్) కొంతకాలానికి గొల్లపల్లి నథానియేలును క్రీస్తులోకి నడిపించాడు. తూర్పుగోదావరి ప్రాంతంలో ఇతనిమూలంగా గొప్ప సేవ జరిగింది. ఆనకట్ట కూలిపోయే సూచనలేవీ ఇప్పటికీ కనిపించడంలేదుగానీ, దీని చివరి రాయి కూడా పిండిపిండై పోయి గోదావరిలో కలిసిపోయినప్పటికీ దీని నిర్మాణం సమయంలో పడిన ఆధ్యాత్మిక పునాదులు మాత్రం ఎన్నటికీ చెక్కుచెదరవు.

ఇక్కడ ఉంటున్న రోజుల్లోనే బీరు తన సహచరుడైన హేయిన్స్‌ని తీసుకొని సంయుక్త మిషనెరీ వాల్టర్‌గన్‌తో కలిసి పల్నాటిసీమను సందర్శించాడు.

ధవిళేశ్వరంలోఉన్న కాలంలోనే లూథరన్ మిషన్‌కి చెందిన వాలెట్ గారిని వివాహమాడిన బౌడెన్ సోదరి ఏన్ పెళ్ళయిన సంవత్సరానికే అకాల మరణం చెందింది. బౌడెన్ సంతానంలో చిన్నవాడైన రాబర్ట్ ప్రభువు సన్నిధికి వెళ్ళిపోయాడు. ఈ పిల్లవాడు మరణశయ్యమీద ఉండగా బౌడెన్ నెలవారి పాలకొల్లు యాత్రకు వెళ్ళవలసివచ్చింది. వెళ్ళాలా వద్దా. బాధ్యతే గెలిచింది. వెళ్ళి అక్కడ "ప్రభువా, నీ చిత్తమయితే నాకు చూపు ప్రసాదించు" అనే అంశంమీద ప్రసంగం చేసాడు. ఈ ప్రసంగం వింటున్న చదలవాడ ఫ్రాన్సిస్ అప్పటిదాకా నామకార్థంగా జీవిస్తున్నవాడు బలమైన పరిశుద్ధాత్మ ప్రేరేపణ పొంది క్రీస్తుకు సంపూర్ణంగా సమర్పించుకున్నాడు. ధవిళేశ్వరం తిరిగి వచ్చిన బౌడెన్‌కు తన చిన్ని కొడుకు రాబర్ట్ శవమే ఎదురైంది!

ఆ రోజున బౌడెన్ శరీర సంబంధమైన కొడుకును దేవునికిస్తే దేవుడతనికి చదలవాడ ఫ్రాన్సిస్‌ద్వారా ఒక ఆత్మ సంబంధమైన కొడుకును ఇచ్చాడు.

1849లో ఫ్రాన్సిస్ బాప్తిస్మం అయిన మరుసటి సంవత్సరం ఇతని సోదరుడు థామస్, ఒక చెల్లెలు బాప్తిస్మం తీసుకొన్నారు. 1852లో మరొక చెల్లి జేనమ్మకి బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. ఈమెను తొత్తరమూడి పేతురుగారి కుమారుడు జేమ్సుకిచ్చి ఈ ప్రాంతంలో మొదటి క్రైస్తవ వివాహం జరిపించారు. మరొక చెల్లెలు మార్తమ్మ, ఆమె భర్త కంకిపాటి దావీదులకు బీరు నర్సాపురంలో 1850లో బాప్తిస్మం ఇచ్చాడు. ఇక్కడే నర్సాపురం సంఘానికి నాంది జరిగింది. మరొక చెల్లి వెంకమ్మకూడా ప్రభువును విశ్వసించి తన అత్తగారి ఊరు బల్లిపాడులో గొప్ప సాక్షిగా నిలిచి తన భర్త తాడికొండ పరశురామయ్యను క్రీస్తుకోసం సంపాదించింది.*

ధవిళేశ్వరంలో తను ఆరవ సంతానం ఫ్రాన్సిస్ పుట్టగానే బౌడెన్ కుటుంబం తిరిగి పాలకొల్లు వచ్చేసారు. పాలకొల్లు చేరారో లేదో పెద్ద వరద వచ్చి వారి యిల్లు మునిగి పోయింది. ఇల్లు కూలిపోయి ఫర్నిచర్ అంతా సర్వనాశనమైనప్పటికీ ప్రాణనష్టం లేకుండా బయట పడ్డారు.

---

*"గోదావరి డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర" సి. జోనాగారి పుస్తకం నుండి.

ధవిళేశ్వరంలోనే 1849 ఏప్రిల్ 30వ తేదీన వీరు దంపతుల కనిష్ఠ సంతానం చార్లెస్ హెన్రీ పుట్టాడు. ఇతను తన తండ్రి అడుగు జాడల్లోనే నడిచి 50 ఏళ్ళు మిషనరీగా సేవ చేసాడు. తన తల్లితో నర్సాపురంలో 1921 దాకా ఉంటూ ఒక్కసారి కూడా తన మాతృదేశానికి సెలవుమీద వెళ్ళలేదీయన.

ఫ్రాన్సిస్ కొంతకాలం చుట్టుగుల్ల ఫిలిప్సుతో కలిసి ధవిళేశ్వరంలో కెప్టెన్ హేగ్ క్రింద కోల్‌పోర్టర్‌గా పనిచేసాడు. (ఊరూరా తిరుగుతూ పుస్తకాలు, బైబిళ్ళు అమ్మడం, పంచిపెట్టడం అన్నమాట.)

# 7

# గోదావరి డెల్టా మిషన్

ధవిళేశ్వరంలో బౌడెన్ బీరులు త్రికరణశుద్ధిగా చేస్తున్న క్రీస్తు సువార్త సేవను చూసి కాటన్‌గారి మనస్సులో వీరి పోషణార్థం తాను శాశ్వతప్రాతిపదికపై ఏదన్నా చెయ్యాలన్న ప్రేరేపణ కలిగింది. ఈవిధంగా 1847కల్లా కాటన్ స్టోక్స్, ఫాక్స్, నోబుల్- ఈ నలుగురూ మన ఇద్దరు పేద మిషనెరీలను ఆర్థికంగా ఆదుకునేందుకు కృతనిశ్చయులైనారు. వీరు లూథరన్ మిషనెరీలయిన హెయిన్, గన్‌గార్లతో కలిసి గుంటూరు, పల్నాడు సువార్త దండయాత్ర చేసిన సందర్భంలో స్టోక్సుగారికి ఈ ప్రేరేపణ కలిగింది.

ఈ విధంగా దేవుడు తన సేవకులను ప్రేరేపించి బౌడెన్ బీరులకు ధారాళంగా ధనసహాయం అందేలా ఏర్పాటు చేసాడు. మద్రాసులోని సహోదరులు ఈ నిధికి కోశాధికారులుగా వ్యవహరించారు. అయితే ఈ నిధిని ఏ పేరుతో వ్యవహరించాలి? ఇప్పటిదాకా బౌడెన్ బీరుల సేవకు "ది నర్సాపూర్ బాప్టిస్ట్ మిషన్" అని పేరు (ఇక్కడ గమనించవలసిందేమిటంటే బ్రదరెన్ ఉద్యమం ఇంకా ఇప్పుడిప్పుడే రూపు దిద్దుకుంటూ ఉన్నది. బ్రదరెన్ సంఘాలు లేక ప్రత్యేకమైన డినామినేషన్ అప్పటికి లేదు.) అయితే వీరి సేవ నర్సాపురంతోనే ఆగిపోలేదుగా. ప్రస్తుతం సేవంతా ధవిళేశ్వరంలో జరుగుతోంది. దాదాపుగా డెల్టాప్రాంతమంతా వీరిద్దరి మూలంగా సువార్త శంఖారావం వినిపిస్తోంది. కాబట్టి సహజంగా 'గోదావరి డెల్టా మిషన్' అనే పేరు స్థిరపడిపోయింది. ఈ పేరు ఎలాటి డినామినేషన్‌ని సూచించకుండా వీరి సేవ వ్యాపించిన ప్రాంతాన్ని తెలియజేస్తూ ఉండడం దీనిలోని విశేషం. ఈ పేరే ఇప్పటిదాకా వాడుకలో ఉంది. ఈ

విధంగా గోదావరి డెల్టామిషన్ ఫండును ఉనికిలోకి తెచ్చినవారు సి.ఎమ్.ఎస్. మిషనరీలైన నోబుల్, ఫాక్సు, ప్రభుత్వోద్యోగులు సోక్స్, కాటన్‌గార్లు.

మూడు నాలుగేళ్ళవరకూ ఈ నిధిలోని డబ్బు బౌడెన్ బీరుల కుటుంబ అవసరాలకు స్కూళ్ళ నిర్వహణ ఖర్చులకు సరిపోయేది. అయితే కరపత్రాల ముద్రణకు, సువార్త దండయాత్రలకు డబ్బు చాలేదికాదు. 1846లోనే డెల్టా ప్రాంతపుసేవ అవసరాల నిమిత్తం జార్జిముల్లర్ దేవునితో పెనుగులాడడం ఆరంభించి కొంత ఆర్థిక సహాయం చేయసాగాడు. అయితే నిస్వార్థపరత్వం, నీతి రూపుదాల్చిన బౌడెన్ ఈ నిధిలోని డబ్బును తన పిల్లల చదువుకోసం వెచ్చించడానికి నిరాకరించాడు. చదువులేక పిల్లలు పెద్దైపోతున్నారని గోలపెట్టే తన భార్యకు శాంతంగా, స్థిరంగా జవాబిచ్చే వాడు. "చదువుకోసం ప్రత్యేకంగా ఎవరన్నా డబ్బు పంపిస్తే అప్పుడు మన పిల్లలు చదువుకోవడం దేవునికి అంగీకారమేనని తెలుసుకుంటాము. అంతవరకూ ఇలా ఉండవలసిందే". అయితే త్వరలోనే అన్ని విషయాలను నిశితంగా ఆలోచించి అర్థం చేసుకునే కాటన్‌గారు పిల్లల చదువులకు ప్రత్యేకంగా ఒక ఫండును ఏర్పాటుచేసారు. దీని సహాయంతో బౌడెన్ కొడుకులిద్దరూ, వీరు పెద్ద కూతురు చదువుకోసమని మద్రాసు వెళ్ళారు.

ఈలోగా డార్బీగారి సిద్ధాంతాలచే ప్రభావితులైన ఇంగ్లండులోని అసెంబ్లీలు అన్యులకు సువార్తనందించడం తమ పనిగాదని, డబ్బు పంపించడం గాని, కొత్త మిషనరీలను పంపించడం గాని మానుకున్నాయి. మద్రాసు ఫండుకూడా హెచ్చు తగ్గులు చూపిస్తూ ఉండేది. గ్రోవ్స్‌గారు చివరిసారిగా ఆగష్టు 1852లో ఇండియా వదిలి వెళ్ళేటప్పుడు ఆయన హృదయం భారభరితమై ఉంది. ఇంగ్లండు చేరి బౌడెన్ బీర్ను, ఆరులప్పన్ (మద్రాసు ప్రాంతపు మిషనరీ) ల సహాయార్థం అసెంబ్లీలు భారం వహించేలా కృషి చేసాడు. గ్రోవ్స్‌గారి జీవితమంతా సంఘర్షణాపూరితమే. తోటి మిషనరీలు, వేదాంత పండితుల తగాదాలు తీర్చడం, పెడత్రోవలనుండి వారి మళ్ళించడానికి ప్రయత్నించడం, ఇలాటి మానసిక వేదనలతోబాటు చాలాకాలంగా కడుపు కాన్సర్‌కి లోనై బాధపడ్డాడు.

గాయపు దెబ్బలతో అనేక ఆత్మయుద్ధాల్లో విజయాన్ని వరించి తన రాజా సన్నిధికి చేరే సమయం ఆసన్నమైనప్పుడు గ్రోవ్స్‌గారు 1853

మే 20వ తేదీన జార్జిముల్లర్ ఇంట్లో యేసును తలుచుకుని పులకరిస్తూ ప్రశాంతంగా కన్నుమూసారు. ఆయన వయసు 58 సంవత్సరాలు.

బ్రదరెన్ మిషన్ పుట్టుపూర్వోత్తరాలతో సంబంధంఉన్న వ్యక్తుల్లో ముగ్గురు వ్యక్తులు మిగతా అందరికంటే ఈ ఉద్యమంపై తమ ఎక్కువగా ప్రభావాన్ని చూపారు. వీరిలో ప్రథముడు ఆంథోనీ నోరిస్ గ్రోవ్స్. క్రైస్తవ సహవాసం ఎల్లలెరుగనిదనీ, విమోచింపబడిన సహోదరులంతా ఏ విచక్షణా లేకుండా సార్వత్రిక సంఘంలోని అవయవాలనీ నమ్మినవాడు. మిషనెరీ ఉద్యమానికి ఊపిరి పోసినవాడు. రెండవ వ్యక్తి జార్జి ముల్లర్. గ్రోవ్స్‌గారి బావగారు అద్భుతాలను సాధించే విశ్వాసం, ప్రార్థనాశక్తిగల భక్తుడు. మిషనెరీ కార్యకలాపాలకోసం కేవలం దేవునిమీద ఆధారపడాలన్న సందేశాన్ని, ఆదర్శాన్ని మొదటిసారిగా ప్రపంచానికి చూపించిన మహనీయుడు. మూడవ వ్యక్తి రాబర్టు ఛాప్‌మన్. పై ఇద్దరికీ స్నేహితుడు. దేవుని పరలోక రహస్యాలను లోతుగా పరిశోధించిన పరిశుద్ధ జీవి.

అయితే ఒకమాట. గ్రోవ్స్‌గారు ఏ ప్రయోజనాన్ని ఆశించి తన జీవితకాలమంతా నిర్విరామంగా కృషిచేసాడో—అన్యులకు సువార్తనందించే ఆ ప్రయత్నాలలో ఈయన వోడిపోయాడనే చెప్పాలి. అయితే సమర్పణ ఆత్మలోను, క్రీస్తు ఆలోచనలను కలిగి ఉండడంలోనూ, దేవుని వాక్యంపట్ల నమ్మకంలోను, వీటన్నిటికి తోడు తరిగిపోని శక్తియుక్తులు, మితిలేని మేధస్సు, పాండిత్యంలోను ఈయనతో సరితూగే వారెవరూ ఈయన సమకాలికుల్లో లేరు. కాని ప్రపంచంలో ఎక్కడా గ్రోవ్స్‌గారు నేటివరకు కొనసాగుతూ స్వతంత్ర ప్రతిపత్తి సంపాదించుకున్న మిషన్ ఫీల్డ్సును స్థాపించలేక పోయారు.

గ్రోవ్స్‌గారు విఫలమైనచోట మన ఇద్దరు మిషనెరీలు విజయం సాధించారు. గ్రోవ్స్‌గారికున్న విద్యాబుద్ధులు, సమాజంలో ప్రతిష్ట వీరికి లేవు. అయితే నేటికీ కొనసాగుతున్న ఇంత మహత్తరమైన దైవసంఘానికి అంతటి బలమైన పునాదులు వెయ్యడం వీరికెలా సాధ్యపడింది.?

బ్రాడ్లీగారి అభిప్రాయం ఇది—''వీరిద్దరి అనామకత్వం, ఒంటరితనమే, వీరిపట్ల వరంగా పరిణమించింది. పరిశుద్ధతలోను, శ్రద్ధాభక్తులలోను

వీరు గ్రోవ్స్‌గారికి ఎంతమాత్రం తీసిపోరు. అయితే గ్రోవ్స్‌గారికి లేనిదీ వీరికి ఉన్నదీ ఏమంటే అనుకున్నది సాధించేదాకా బండతనంగా ఒళ్ళువంచి చాకిరీ చెయ్యడమే. ప్రజలకు వారి భాషలోనే సువార్త చెప్పేందుకు వారి మాతృభాషలో ప్రావీణ్యత సంపాదించడమే వీరి విజయానికి కారణం. ఈ విధంగా పూర్తిగా సన్నద్ధులై తిరుగులేని ఓపికతో, ఆశ్చర్యకరమైన సహనంతో పనిచేసారు.''

* * *

1849 సంవత్సరం మొదట్లో బౌడెన్ కుటుంబం తిరిగి పాలకొల్లులో స్థిరపడ్డారు. వీరు తిరిగి వచ్చాక మొదటగా బాప్తిస్మం ఇచ్చింది తుందుర్రుకు చెందిన గంటి చెల్లయ్యకు, అతని భార్యకు. వీరిద్దరే ఆ కులంలో మొదటిగా ప్రభువును నమ్ముకున్నవారు. 1849లో పాలకొల్లు విశ్వాసుల గుంపుకు గంటి చెల్లయ్య, చెదలవాడ ఫ్రాన్సిస్‌ల కుటుంబాలు కలిసినాయి. పాలకొల్లు చెదలవాడ ఇంటిపేరుతో అటు తరువాత వచ్చిన అనేకమంది విశ్వాసులు, భక్తులు సేవకులందరికీ మూల పురుషుడు ఫ్రాన్సిస్‌గారే. తరువాతి మూడేళ్ళకాలంలో బాప్తిస్మం పొందిన పదిహేనుమందిలో చాలా మంది ఈ కుటుంబానికి చెందినవారే.

వీరుగాక రాయపాడుకు చెందిన కంకిపాటి మామిడి, ఎంబేరు ప్రభువులోకి రావడానికి కారణమైన చుట్టుగుల్ల ఫిలిప్పు, మొదలైనవారితో పాలకొల్లు సంఘం అభివృద్ధి చెందింది.

రొట్టె విరిచే కార్యక్రమం సాయంత్రంవేళ జరిగేది. ఎందుకంటే మొదట్లో ఒంటరి మిషనెరీలు ప్రభువు బల్ల దగ్గర సహవాసానికి ఎవరూ లేకపోవడంవల్ల. బార్న్‌స్టేపుల్‌లోని తమ చర్చిలో రొట్టె విరిచే కార్యక్రమం జరిగే సమయంలోనే తామూ బల్ల దగ్గర కూడుకోవాలనీ, తద్వారా తమ వారు వేలమైళ్ళ దూరంలో ఉన్నప్పటికినీ కనీసం ఒకే సమయంలో రొట్టె విరవడంద్వారా వారితో సహవాసం చేసినట్టు తమకి కలిగే ఏదో మానసిక తృప్తికోసం ఇలా చేసారు. (ఇంగ్లండులో ఉదయం ఉన్నప్పుడు భారత దేశంలో సాయంత్రం అవుతుంది) ముఖ్యంగా బైబిలు చదవగలిగే విశ్వాసుల గుంపును తయారు చెయ్యడం బౌడెన్ బీరుల ప్రథమాశయం. అందువల్ల తమ సేవకు అనుబంధంగా స్కూలు నిర్వాహణ ప్రారంభించారు.

బౌడెన్ కుటుంబం ఆర్థిక పరిస్థితులు ఎంత ప్రతికూలంగా ఉన్నప్పటికీ అస్తమానమూ ఇంట్లో కొందరు పేదబాలికలను పెట్టుకుని వాళ్ళకి తిండి, బట లు ఇస్తూ తెలుగులోనే వాళ్ళకి బైబిలు, వాక్యాలను బోధించేవారు. అప్పటికే క్రొత్తనిబంధన,పాతనిబంధన మొదటి 5పుస్తకాలు, కీర్తనలు తెలుగు భాషలోకి తర్జుమా అయినాయి. ఇవే ఈ పిల్లలకు పాఠ్యగ్రంథాలు. అనుదినం ఒక భాగాన్ని కంఠతా పెట్టేవారు. ఇదికాక వాళ్ళకి ఇంగ్లీషు, లెక్కలు, కుట్టుపని నేర్పించేవారు (ఈ లేసు పని తరువాతి సంవత్సరాల్లో ప్రపంచ ప్రఖ్యాతి నొందింది).పదిహేనేళ్ళపాటు కేవలం నిమ్నజాతుల బాలికలే వచ్చేవారు. హెలీనా, చార్లెట్‌లు ఈ బడిలో బోధించేవారు. అన్యబాలికలను క్రీస్తులోకి నడిపించడానికి దేవుడు ఈ స్కూలును బలమైన సాధనంగా వాడుకున్నాడు

మందులు ఇచ్చే పనికూడా ఈ మిషనెరీసేవలో భాగమే. ఒక్కోసారి వైద్యంతో బౌడెన్‌కు ఇతర పనులకోసం తీరిక ఉండేదికాదు. ఎందుకంటే ఏ వైద్యుడూ తక్కువ కులాలవాళ్ళని పరీక్షించడం,మందులివ్వడం చేసేవాడు కాదు. ఆ కాలంలో నర్సాపురంకు అందుబాటులోఉన్న మందుల షాపు కేవలం 300 మైళ్ళదూరం మాత్రమే—మద్రాసులో ఉంది.

ఈ విధంగా బౌడెన్ హోమియోపతిలో నిపుణుడయ్యాడు.చాలామందికి తెలియదుగాని బౌడెన్ రెండు మందులను స్వంతంగా కనుక్కున్నాడు. ఇవి ప్రపంచమంతటా అమ్ముడైనాయి. ఎలిజబెతు బౌడెన్‌కు భర్తలాగా మందుల గురించి ఏమీ తెలియదు. మరి బౌడెన్ తన ప్రసంగాలకూ సువార్త యాత్రలకూ వెళితే ఇంట్లో ఉండి మందులివ్వవలసింది తానే కదా. ఈ సమస్యను ఈమె తెలిగ్గా పరిష్కరించగలిగింది. ఏ సీసాలో అయితే నిండుగా మందు ఉంటుందో ఆ మందు ఇచ్చేసేది! అయితే మందు ఇచ్చేముందు పరమ వైద్యుని గురించి పేషంటుకి చెప్పి, ఆ మందును దేవుడు దీవించాలని ప్రార్థించి మరీ ఇచ్చేది. ఆమె విశ్వాసాన్ని గౌరవించి దేవుడు ఆ పేషంట్ల వ్యాధులు నయం చేసేవాడు. అలాటి వాళ్ళంతా తిరిగివచ్చి ఆమెతో కలిసి ఈ 'మంచి దేవుడికి' కృతజ్ఞతలు చెప్పేవారు.

తమ చుట్టూ ఉన్న ప్రజలకూ ముఖ్యంగా అగ్రకులాలవారికి సాక్ష్యమివ్వడం నిర్విఘ్నంగా కొనసాగింది. వారు కొలిచే విగ్రహాలుగానీ మరేదిగానీ

వారిని రక్షించలేదనీ వారితో ఖచ్చితంగా చెప్పడం జరిగేది. దేవుడు, ఆత్మ సత్యం మొదలైన వాటిని గురించి బైబిలుకు వ్యతిరేకమైన అభిప్రాయాలు ఆ హిందూ ప్రజల్లో బలంగా నాటుకుని ఉండేవి. కుల భేదాలు అందరూ కలిసి సువార్త వినడానికి దాటరాని అవరోధం అయిపోయినాయి. ఆయా గ్రామాలకు చెందిన నిమ్నజాతి విశ్వాసులు బౌడెన్‌తో నిరంతరమూ ఉండడం కోసం పాలకొల్లులో మకాం పెట్టినందువల్ల వాళ్ళకి జీవనోపాధి కలిగించ వలసిన బాధ్యత బౌడెన్‌మీద పడింది. వాళ్ళలో కొందరిని ఇంట్లో పని వారుగా నియమించిన మరుక్షణం అప్పటిదాకా పనిలోఉన్న అగ్రకులాల సేవకులు కోపంతో బయటికి నడిచారట.

పెనుమదం గ్రామానికి చెందిన కొండయ్య తన నిజాయితీ, సత్యాన్వే షణలో ఉన్న ఆసక్తి మొదలైన లక్షణాలవల్ల బౌడెన్‌కు చాలా సన్నిహితు డైనాడు. ఇతన్ని క్రైస్తవుడవ్వకుండా నిరోధించడానికి బంధువులు తాము చెయ్యగలిగిందంతా చేసారు. ఇతను కమతానికి చేస్తున్న భూమికి సంవత్సరానికి 10 రూపాయిలు కట్టవలసి ఉండగా ఆ మొత్తాన్ని ఇతని మేనమామ ఇతనికి అప్పుగా ఇస్తూ ఉండడం వాడుక. అయితే కొండయ్య బౌడెన్ దగ్గరికి మాటిమాటికి వెళ్తుండడం ఇష్టంలేక ఆ మేనమామ 10 రూపాయల అప్పును ఇవ్వనని బెదిరించాడు. అయితే బౌడెన్ తానే ఆ మొత్తాన్ని ఇచ్చి కోతలు అయిపోయిన తరువాత తిరిగి తీసుకునే ఒప్పందంమీద కొండయ్యను ఆదుకున్నాడు. తక్కువ కులం వాళ్ళతో కలుస్తున్నాడని తప్ప కొండయ్య బంధువులకు వేరే అభ్యంతరం ఏమీ లేదు.

ఈ ప్రాంతంలో తరతరాలుగా వేళ్ళు పాతుకుపోయిన అంటరానితనం బౌడెన్ బీరులు రాక తరువాత వీరి కళ్ళ ఎదుటే మెల్లిమెల్లిగా వాడిపో సాగింది. వడ్రంగులు, కమ్మరివాళ్ళు మొదలైన కులాలవాళ్ళు మొదట్లో బౌడెన్ ఇంట్లో పనిచేస్తున్న సందర్భాలలో బౌడెన్ ఇంట్లో పనిచేసే నిమ్న జాతులవాళ్ళనుంచి వో గ్లాసెడు త్రాగే నీరు మాట అలా ఉంచి చేతులు కడుక్కోడానికైనా నీళ్ళు పుచ్చుకునేవారుకాదు.1854వ సంవత్సరం వచ్చేసరికి బౌడెన్‌గారు గమనించిన ఒక సంఘటన గురించి డైరీలో రాసుకున్నాడు. లేసు నాదులు చెయ్యడం కోసం బౌడెన్ ఇంటికి వచ్చిన కమ్మరి ఒకతను నిమ్నజాతి మ్మ ఆటుగా వెళ్తుండడంచూసి "జేమ్సు, ఈ అకురాయిని తడపాలి,కాస్త

నీళ్ళు తెచ్చిపెట్టారా బాబూ'' అన్నాడు. ఇదే పదేళ్ళ క్రితం అయితే ఇతను తనను ముట్టుకుంటాడనికాదు, కొన్ని అడుగుల సమీపానికైనా వస్తాడేమోనని మూలనుూలకి ఒదిగి నిలబడేవాళ్ళు ఈ అగ్రజాతులవారు.

క్రీస్తు సువార్త ఈ జాతులకు నిత్యజీవంతోపాటు ఆత్మగౌరవం, హుందాతనం, తలెత్తుకు తిరిగే నిబ్బరాన్ని కానుక ఇచ్చింది.

* * *

వాసా పంచాక్షరికి బీరు హోలెండు వార్ఫు దగ్గర 1850లో బాప్తిస్మం ఇవ్వడంతో మొదలైంది అగ్రకులజుల మధ్య మేలుకొలుపు. నీటిలోనించి బయటికి రాకముందే తన మెడలో ఉన్న బంగారు శివలింగాన్ని రుద్రాక్షమాలను గోదావరిలోకి విసిరేసాడీయన.

తిరుపతిపాడుకు చెందిన పాలీలకుటుంబంలో పుట్టి బహునిష్ఠగల వాడుగానేకాక లలిత కళల్లో ఆరితేరినవాడుగా ప్రఖ్యాతి చెందినవాడు పంచాక్షరి. నాటకాలలో స్త్రీ పాత్రధారిగా ఇతను నూజివీడు నుండి విజయ నగరం దాకా గొప్ప కీర్తి సంపాదించుకున్నాడు. పాలకొల్లులో నాటకం వెయ్య డానికి వచ్చి బౌడెన్ చేస్తున్న వీధి ప్రసంగం విన్నాడు. క్రీస్తు ప్రేమను పుర్తిగా అర్థం చేసుకున్నవాడై క్రైస్తవ సత్యాన్ని అక్కడికక్కడే స్వీకరించి క్రీస్తును వ్యక్తిగతంగా అంగీకరించాడు. బీరును నర్సాపురం నుండి పిలిపించి పంచాక్షరివెంట అతని ఊరికి పంపించడం జరిగింది. ఆ రాత్రి పంచాక్షరి మామూలుగా తన పుజాదికాలు ఆచరించలేదు. ఉదయాన్న తన బంధువు లను పెద్దలను సమావేశ పరచి తన విశ్వాసాన్ని ప్రకటించాడు. బంధువులకు నోట మాట లేదు. పెళ్ళయిన ఇద్దరు కుమార్తెలను వారి అత్తింటివారు తీసికెళ్ళిపోయారు. పంచాక్షరి తన ఇంటిని ఆస్తిని వదిలేసి భార్యతో ఇద్దరు కొడుకులు కోటయ్య, యోహానులతో నర్సాపురం వచ్చేసి బీరు ఇంట్లో దిగాడు. మిషన్‌స్కూల్లో తెలుగు పండిట్‌గా ఈయన్ను నియ మించారు. తిరుగుడుమెట్ట పాలీల క్రైస్తవ సంఘం స్థాపించినప్పుడు ఈయన్ని అక్కడికి కాపరిగా పంపించడం జరిగింది. ఈయన వెళ్ళాక ఈ సంఘం క్రైస్తవ సంగీతానికి పేరుగాంచింది. ఈయన మరణం తరువాత పంగిడికి చెందిన గాథంచెట్టి సుమియోను ఆ సంఘం బాధ్యత తీసుకున్నాడు.

పాస్ పంచాక్షరిగారి కుమారుడు పాస్ యోహానుగారిని గురించి రాబోయే పేజీల్లో చదువుతాం. పెద్దకుమారుడు కోటయ్యగారు శతవార్షికోత్సవంలో తన 90వ యేట పెద్దగా ఆ ఉత్సవాల్లో గౌరవనీయుడైన వృద్ధుడిగా అందరి గౌరవప్రశంసలకు పాత్రుడైనాడు.

గాదంచెట్టి సుబయ్యోను బలిజ శాఖకు చెందినవాడు. శివభక్తుడు, బాప్తిస్మంపొంది కులాన్ని త్రోసిపుచ్చిన తరువాత ఈయన అనేకమైన కష్టాలకు గురయ్యాడు. కొంతకు తరువాతి కాలంలో క్రైస్తవుడైనప్పటికీ భార్య కొన్నాళ్లు పనికిరాక ఈయన్ని అతిహీనంగా చూసింది. ఈయన స్వంత చెల్లెలే ఈయనకి భోజనం గడప ఇవతలకి తీసుకొచ్చి పెట్టేది. తన భార్య పిల్లలనుకూడా గ్రామస్థులు గ్రామంనుండి వెలివేస్తారేమోనన్న భయంతో సుబయ్యోను ఈ అవమానాలను సహించాడు. క్రీస్తుకోసం ఈ సిలువను ధరించడం ఈయన ఆత్మీయ జీవితానికి మరింత దోహదం చేసింది. పెద్ది సీమలో కోయలమధ్య సువార్తయాత్రల్లో బౌడెన్ బీరులకు ఈయన కుడిభుజంగా ఉన్నాడు.

తరువాత పేటలో క్రైస్తవులైన ప్రముఖులు ఎవరంటే సాలె కులానికి చెందిన దొరపల్లి థామస్, దురదల సమూయేలు (కాపు) మొదలైనవారు. ఈ ఇద్దరికీ రాజమండ్రి గోదావరిలో బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. తన కుటుంబాన్నికూడా తనవాళ్లు వెలివేస్తారేమోనని థామస్ బద్దెకంటి మార్కు క్రింద 16 నెలలు నివసించాడు. 1853 మలేరియా సోకి ఈయన అస్వస్థుడైన సందర్భంలోనే బీరు ఈయన యోగక్షేమాలు విచారించే నిమిత్తం అటు ఇటు తిరగడంతో బీరుకుకూడా వడదెబ్బ తగిలి మరణానికి దారితీసింది. థామస్ కూడా బీరుకంటే కొద్ది దినాలు ముందుగానే ప్రభుసన్నిధికేగారు. నిమ్నకులానికి చెందిన చదలవాడ దానియేలు క్రైస్తవుడైన తరువాత ఈ కుటుంబంలోనుండి ఎందరో క్రైస్తవనాయకులు, సేవకులు వచ్చారు. చదలవాడ దానియేలుకు సంతానం లేదు. నర్సాపురంలో జగద్విఖ్యాతిగాంచిన జోనా జోసెఫ్ లేసు వ్యాపార కుటుంబాలకు మూలపురుషులు ఈ దానియేలు, ఇతని అన్నకొడుకులు జోసెఫ్ వంబయ్యలు. దానియేలుకు 1850లో బీరు రాజమండ్రి దగ్గర బాప్తిస్మం ఇచ్చారు. నర్సాపురం జేతనీ పాస్టరు జఖర్యాగారికి

తండ్రి అయిన జోసెఫ్‌గారికీ, వీరు పెద్ద కూతురికీ, లంక ముత్యాలు, ఇతని భార్య, వీరందరికీ 1852లో తాళ్ళపూడిలో బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. ఈ విశేషాలన్నీ తరువాతి అధ్యాయంలో చూద్దాము.*

ఇది ఇలా ఉండగా భారతదేశంలో దాదాపు పదిహేనేళ్ళు గడిపిన తరువాత బౌడెన్ సతీమణి తన ముగ్గురు పిల్లల్ని తీసుకుని సెలవుమీద ఇంగ్లండుకు వెళ్ళింది. దేవుని కృప, కాపుదలలో క్షేమంగా బార్న్‌స్టేపుల్ చేరి రాబర్ట్ చాప్‌మన్ వాళ్ళకోసం సిద్ధంగా ఉంచిన ఇంట్లో దిగారు. ఆ తరువాతి రోజునే బౌడెన్ దంపతుల ఆఖరు కొడుకు ఆర్థర్ పుట్టాడు.

*'గోదావరి డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర' సి. జోనాగారి పుస్తకంనుంచి

# 8

# బీరు కార్యదీక్ష

బీరు దేహదారుఢ్యం, తరిగిపోని ఓపిక, శక్తి మరింక ఏ మిషనెరీకిగాని స్థానికుడికిగాని అందని ప్రత్యేకతలు. ఈయన గోదావరి డెల్టా ప్రాంతంలో పర్యటించిన కార్యక్రమాలు పరిశీలిస్తే నమ్మశక్యంగావు. బౌడెన్ ఎప్పటికప్పుడు తన అనుభవాలను రాసిపెట్టుకోగా బీరుమాత్రం తన కార్యక్రమాలను కాగితంమీద పెట్టడంలో అంత శ్రద్ధ చూపించలేదు. బహుశా 1851లో తన పర్యటన విశేషాలను మాత్రం బీరు రాసిపెట్టుకున్నాడు. దాన్ని ఉన్నదున్నట్టుగా అనువదించడం మంచిది.

"వీలైతే మొగల్తూరు, నగరం, ఉండి ఈమూడు తాలూకాల్లోని ప్రతిగ్రామాన్ని దర్శించాలన్న పట్టుదలలో బయలుదేరాను. మా స్టేషన్ల చుట్టూఉన్న ఈ తాలూకాల్లో దాదాపు 200 గ్రామాలున్నాయి. ఇలాటి పథకం వెయ్యడం ఎంతో అవసరమని నా మనసులో ఎప్పటినించోఉంది. దీన్ని పకడ్బందీగా గనక పూర్తిచేస్తే ఎంతో లాభం చేకూరుతుంది. ముందు మొగల్తూరు తాలూకాలోని 60 గ్రామాలు తిరిగాను. వీటిలో చాలా గ్రామాలు మేము ఇంతకుముందు తిరిగి బోధించినవే. చాలా గ్రామాల్లో వందలకొద్దీ కరపత్రాలు ఇప్పటికే పంచాము. కొందరు పరిచయస్థులుకూడా ఉన్నారు. ఈ గ్రామాలన్నీ మళ్ళీ తిరిగి కరపత్రికలు పంచాను. అంతలో అంతర్వేది తీర్థం రావడంతో అక్కడికివెళ్ళి అసంఖ్యాకంగా కరపత్రికలు, సువార్తలు పంచాను.

తీర్థం అయిపోయిన తరువాత దాదాపు 3 వారాలు తిరిగి నగరం తాలూకాలోని 50 గ్రామాలు దర్శించాను.

దారి పొడుగునా బోధిస్తూ కోటిపల్లికి చేరుకున్నాను. నది ఒడ్డున

గుడారం వేసుకున్నాను. ఆ తరువాతిరోజు ఆదివారం. వేలమంది జనం కోటిపల్లి తీర్థానికి వచ్చారు. రెండురోజులపాటు అక్కడివాళ్ళతో వాదిస్తూ సువార్త నందిస్తూ గడిపాను.''

బీరు చనిపోయిన తరువాత ఈ కరపత్రికలు పంచిపెట్టిన ఫలితాలు బౌడెన్ చూడగలిగాడు. ఎలాగంటే 1854లో ఉత్తరాన కోయదొరలను కలుసుకునేందుకు బౌడెన్ తిరుగుడు మెట్టనుండి గోకవరానికి బయలుదేరాడు. రాత్రి పదిగంటలకి బయలుదేరి వెన్నెల్లో ప్రయాణించి గోదావరి దాటి తెల్లారి 3గంటలవేళ రాఘవపురం సమీపిస్తూఉండగా ఒకవార్త తెలిసింది. అంతకుముందే అక్కడ ఒక పులిని చంపారు. అందుకని మరో పులి ఆ ప్రాంతాల్లోనే తిరుగుతున్నది. కాబట్టి అక్కడున్న కొండచుట్టూ తిరిగి వెళ్ళడం క్షేమంకాదు. వెనక్కి తిరిగి వెళ్ళాలంటే గ్రామం చాలా దూరం. అందుకని అక్కడే ఆరుబయట పక్కలువేసుకుని తెల్లారేదాకా నిద్ర పోయాడు. ఆ రోజంతా సంతకోసమనివచ్చిన కొండజాతులవారితో గడిపాడు. ఈ సమయంలో ఒకవ్యక్తి బౌడెన్‌తో అక్కడికి ఇరవై మైళ్ళ దూరంలో లూకా సువార్త ప్రతిని చూసానని చెప్పాడు. అది కోటిపల్లిలో బీరు పంచిపెట్టిన సువార్త ప్రతి.

బీరు కార్యక్రమానికి తిరిగి వద్దాము. కోటిపల్లినుండి ద్రాక్షారామం వెళ్ళాడు. అక్కడ కొందరు బ్రాహ్మణులకు చాలాసేపు సువార్తను బోధించాడు. వాళ్లెవరూ అభ్యంతరం చెప్పలేదుగాని చివరికి ఒక బ్రాహ్మణు డన్నాడు ''నేను తాడిచెట్టంత ఎత్తు ఉన్నాననుకుంటూ ఇక్కడికి వచ్చాను. మీరు నన్ను పురుగులాటి స్థితికి దించేసారు.'' దేవునివాక్యం విన్నవాళ్ళందరి అనుభవమూ ఇదేనని బీరు జవాబిచ్చాడు. అక్కడ తనకు తటస్థించిన అవకాశాలనుచూసి ఇలాటి కార్యక్రమాలను ముందే ఎందుకు ప్రారంభించలేదా అని బాధపడ్డాడు బీరు.

పెద్ద పెద్ద ఊళ్ళను దర్శించడంకంటే చిన్నిచిన్ని గ్రామాలకు వెళ్ళడంలో బీరుకు ఎక్కువ ప్రయోజనం కనిపించింది. ఎందుకంటే గ్రామ ప్రజలు కొందరు జీవితకాలమంతా తమ గ్రామ పొలిమేరలు దాటని వారుంటారు. గ్రామాల్లో ప్రజలు హడావుడిలేకుండా తీరికగా ప్రశాంతంగా

ఉంటారు. మంచిమాటలను శ్రద్ధగా అడ్డు ప్రశ్నలు వెయ్యకుండా వింటారు. అయితే చాలామంది తెల్లవాళ్ళు విగ్రహాలకు గౌరవం ఇస్తూ ఉండడం వాళ్ళు చూసి ఉన్నారు. మరి వీరు విగ్రహారాధనకు వ్యతిరేకంగా బోధించడం వాళ్ళకి ఆశ్చర్యం వేసింది. అందుకు వీరు రక్షణ పొందడానికి దేవుడొక్కడే మార్గమని, విగ్రహారాధికులు తెల్లవారైనా నల్లవారైనా నరకానికి పాత్రులేననీ జవాబిచ్చాడు.

ఒక తీర్థంనుండి మరొక తీర్థానికివెళ్తూ మధ్యకాలంలో గ్రామాల్లో సేవచేస్తూ నాడపల్లి ఉత్సవానికి చేరుకున్నాడు. అక్కడ కొక్కెం ఉయ్యాల ఆచారం ఉంది. అంటే ఇనుపకొక్కెం ఒకదాన్ని మనిషి వీపుకండరాలగుండా గుచ్చి ఏ చెట్టుకో వేలాడదీసి ఊపుతారన్నమాట. ఇలాచేస్తే పుణ్యమో లేక దేవి శాంతించి వరాలనిస్తుందనో నమ్ముతారు. ఈ దుష్కృత్యానికి వ్యతిరేకంగా వీరు వాళ్ళని హెచ్చరించాడు. ఈ ఆచారాలకంటే యోగ్యమైన మార్గం ఒకటుందనీ దేవునికి అసహ్యమైన ఇలాటి క్రూర ఆచారాలను విడనాడమనీ బోధించాడు.

ఇలా కొక్కెం ఉయ్యాల ఊగేవాడికి నొప్పి తెలియదట. మరో తమాషా ఏమిటంటే ఇలా తనకు బదులు డబ్బిచ్చి మరొక వ్యక్తిని ఇలా ఊగించవచ్చట. సాధారణంగా తక్కువ కులాలవాళ్ళే ఇలా ఊగుతారు. వాళ్ళు సేవించే గంజాయి, కల్లు ఈ బాధ తెలియకుండా పనిచేస్తాయి.

1860లో ఈ పండుగ సమయంలో ఈ ఆచారాన్ని తిలకించిన హీకిన్‌గారు దీన్ని గురించి వివరంగా రాసాడు. రోజుకు పదిహేను ఇరవై మందిని ఇలా ఊపుతారు. ఊగిన రోజున అంత బాధ ఉండదుగాని రెండుమూడు రోజుల తరువాత నరకయాతనే. కొందరి వీపులమీద గతకాలంలో ఊగిన గాయాల తాలూకు డజను మచ్చలదాకా కనిపించాయి. కొక్కేలు వీపు కండరాల్లో దించడానికి మంగలివాడికి పావలా, ఎత్తి ఊగే స్థంభానికి కట్టినవాడికి అణా చెల్లించుకోవాలి.

ఇదిక్కి ప్రస్తుతం నిషేధించబడింది. కొంతకాలం కొన్నిచోట్ల పిష్టిబొమ్మలతో ఈ ఆచారాన్ని కొనసాగించారు.

ఈవిధంగా బీరు ఒంటరిగా ఇన్ని సాహసయాత్రలుచేసి కాలినడకన డెల్టా ప్రాంతమంతా తిరిగి సువార్త బీజాలు చల్లాడు.

1850లోనే బీరు నర్సాపురంలో సంఘాన్ని స్థాపించగలిగాడు. రామన్నపాలెంకు చెందిన కంకిపాటి డేవిడ్, మార్తలకు బాప్తిస్మం ఇవ్వడంతో ఈ సంఘానికి పునాది పడింది. మార్త అంటే చదలవాడ ఫ్రాన్సిస్ సోదరి.

1848లో బౌడెన్ ధవళేశ్వరంలో గవర్నమెంటువారు తనకు కేటాయించిన స్థలంలో ఒకప్రార్థనామందిరం కట్టాడు. ఇద్దరు నిమ్నజాతుల వాళ్ళు మారుమనస్సుపొంది తమకు బాప్తిస్మం కావాలంటూ వచ్చారు. అయితే బాప్తిస్మం ఇవ్వకముందే అందులో ఒకతనికి కలరాసోకి చనిపోయాడు. చనిపోకముందు క్రీస్తు తన ప్రభువని ఒప్పుకుని తనను దహనం చెయ్యవద్దనీ పాతిపెట్టమనీ చెప్పాడు. మరొకతని భార్యకూడా కలరావల్ల చనిపోయింది. కాని విశేషమేమంటే అక్కడ కలరావల్ల చనిపోయిన కేసులు ఈ రెండే. అందువల్ల ఈ రెండు కుటుంబాలు విగ్రహారాధన మానేసి క్రైస్తవులైనందు వల్లనే జబ్బుచేసి చనిపోయారని పుకారు లేచింది.

అయితే ఈ కుటుంబాలుమాత్రం క్రీస్తులో స్థిరంగా నిలిచాయి. తమ ప్రజలమధ్య సాక్ష్యంగా ఉంటూ 1853లో తమతోబాటు మరొక కుటుంబాన్ని వెంటబెట్టుకుని పాలకొల్లు వచ్చేసారు. నక్కా థామస్ ఆధ్వర్యంలో అటుతరువాత ధవళేశ్వరం నుంచి సువార్త కేంద్రంగా మారింది.

1851 మార్చిలో బీరు తిరుగుడుమెట్ట వెళ్ళి అక్కడ కొంతకాలంగా క్రీస్తు సువార్తపట్ల ఆసక్తి చూపుతున్న ముగ్గురు వ్యక్తులను కలుసుకున్నాడు. వారిలో ఇద్దరు అగ్రకులాలవారు. శనివారంనాడు బీరు తాను మకాం వేసిన రాజమండ్రి రహదారి బంగళాకు వీరిని ఆహ్వానించాడు. 'నాల్గు పడగల హైందవ నాగరాజు' అని జాషువా కవి వర్ణించిన ఈ కులాభిమాన సర్పం ఇంకా వీరిలో బుసలు కొడుతూ ఉన్నదేమోనని బీరు సందేహం. వారందరు మొక్కుబడికోసమని పెంచుకున్న జుత్తును కత్తిరించి అందరికీ పంక్తి భోజనాలు ఏర్పాటుచెయ్యడం ద్వారా ఈ ప్రశ్నను పరిష్కరించాడు. మరుసటి రోజున నదిలో ఆ ముగ్గురికీ బాప్తిస్మం ఇచ్చి ఆ ఉదయమంతా భక్తిగీతాలు, వాక్య హెచ్చరికలు, ఆరాధనలతో వారిని

బలపరిచాడు. వీరు సాలె కులస్థుడైన దొరపల్లి థామస్, కాపు కులస్తుడైన దురదల సమూయేలు, చదలవాడ దానియేలుగార్లు.

అక్కడినుంచి 17 రోజులపాటు ఇంకా ఎగువనున్న 30 గ్రామాలను సందర్శించాడు. తిరుగు ప్రయాణంలో తిరుపుడుమెట్టు వచ్చి ఈ ముగ్గురూ తను గ్రామంలో దూషణలకు తిరస్కారాలకు గురవుతుండడంచూసి తనవెంట నర్సాపురం తీసుకుచ్చి వాక్యమనే పాలతో వీరిని బలపరిచాడు. నెలరోజుల తరువాత వీరు తిరిగి తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఇల్లు చేరగానే సమూయేలుకు రౌద్రాకారంలో ఉన్న తన కొడుకు ఎదురయ్యాడు. దుడ్డుకర్రతో కొట్టడానికి వచ్చాడతను. ఇంట్లో ఆడ వాళ్ళంతా ఒకటే ఏడుపులు. కులాన్ని కాదన్నందుకు పాలేర్లుకూడా సమూయేలు మొహంమీదే ఆయన్ని దుర్భాషలాడారు. సమూయేలు రెండు మూడు రోజులు బయటే ఉండి అన్నం తానే వండుకున్నాడు. కొద్ది రోజుల తరువాత ఇంట్లోకి రానిచ్చారు. అయితే వంటింట్లోకి వెళ్ళకూడదు. ఇంట్లో తన భార్యను, మనవల్ని ముట్టుకోకూడదు. మంగలివాడు ఈయనకు క్షవరం చెయ్యడానకు నిరాకరించాడు. ఈయన బట్టలు ఉతికితే మైల పడిపోతానని చెప్పి చాకలి నిరాకరించింది.

థామస్ పరిస్థితి కొంతవరకు నయమే. కాని బయట వాకిటి అరుగు మీదనే కాలం గడపాలి. భార్య ఇతనికి ఆ అరుగు మీదకే భోజనం తెచ్చి పెట్టేది. దానియేలుకు ఇబ్బందులేమీ లేవుగాని, తోటివారు ఇతన్ని చూసి ఎగతాళిచెయ్యడం అసహ్యించుకోవడం సాగించారు.ఈ ముగ్గురు మహనీయులు తమ స్వగ్రామంలో క్రీస్తు సిలువను మోసారు.

థామస్‌కి పనేమీ లేకపోయింది. ఇంట్లోకి వెళ్ళి మగ్గం ఎక్కడానికి వీల్లేదు. వాకిట్లో కూర్చుని భార్య తెచ్చిపెట్టే భోజనం తినడం, తోటికులం వాళ్ళు వచ్చి తనను నిందిస్తూ పలికే దుర్భాషలను వింటూ కూర్చోవడంతప్ప వేరే కాలక్షేపం లేదు. జుట్టు, గోళ్ళు విపరీతంగా పెరిగి పోతున్నాయి. మనిషి చిక్కిపోతున్నాడు. అయితే మనసులో మాత్రం జన్మ కంతటికీ చాలినంత ఆనందం నెమ్మది. అయితే చేతిలో ఏదో ఒక పని ఉండాలని ఆయన ఆరాటపడ్డాడు. ఇలా 16 నెలలు గడిపాడు థామస్,

బీరు వ్యక్తిగతంగా ఎంతో కృషిచేసి గూటాల అగ్రహారం భూస్వాముల నుండి తిరుగుడుమెట్ట కొండమీద కొంత భూమిని సంపాదించి మొదట థామస్‌కు అక్కడో ఇల్లు కట్టించి నేతమగ్గం మొదలైన ఏర్పాట్లు సమకూర్చాడు. దేవుని మహాకృపవల్ల త్వరలోనే థామస్ భార్య మంగమ్మ, కూతురు శేషమ్మ వచ్చి చేరారు. తరువాత సమూయేలుకు దానియేలుకు ఇళ్ళు ఏర్పాటయినాయి. తాను ఉండడానికి, ప్రార్థనాలయానికీ మరొక ఇల్లు నిర్మించాడు. పంచాక్షరిగారిని అక్కడ ఉంచి ఆ ప్రాంతంలో సువార్త వినిపించిన ఫలితంగా ఈ ముగ్గురి కుటుంబాల్లోనుంచి మరికొందరు క్రైస్తవులైనారు.

1852లో తాళ్ళపూడిలో బీరు తన పెద్దకూతురు మేరీ ఏనీకి చింతలపూడికి చెందిన లంకా ముత్యాలు, అతని భార్యకూ, దానియేలు అన్నకొడుకు జోసెఫ్‌కు బాప్తిస్మం ఇచ్చాడు.

1853లో విషజ్వరం సోకి తిరుగుడు మెట్టలో ఏర్పాటయిన చిన్న కాలనీలో కొన్ని మరణాలు సంభవించినాయి. దొరపల్లి థామస్‌నుకూడా ఈ జ్వరమే పొట్టన బెట్టుకుంది. బీరు ఈ సమయంలో కన్న తండ్రిలాగా ఈ సహోదరులకు పరిచర్య చేసాడు. వీరినిమిత్తం అస్తమానం నర్సాపురం నుండి తిరుగుడుమెట్టకు తిరుగుతూ ఉండడంవల్ల వడదెబ్బకు లోనై ఆరోగ్యాన్ని కోల్పోయాడు. ఈయనకు పరిచర్యలు చెయ్యడానికి · పాలకొల్లు నుండి బౌడెన్ వచ్చాడు. పరిస్థితి ప్రమాదకరంగా ఉండడంతో అతన్ని బందరు తీసుకెళ్ళడం మంచిదని నిర్ణయించారు.

బందరులో డార్లింగ్‌గారి ఇంట్లో ఉంచి పరిచర్యలు చేసారు. పరిస్థితి మెరుగుపడింది. ఈవిధంగా మనసు కుదుటబడ్డాక బౌడెన్ కెప్టెన్ హేగ్‌తో కలిసి ఎగువ గోదావరిలో పడవప్రయాణాల అనుకూలతను పరీక్షించడానికి వెళ్ళాడు. ఆ ప్రాంతపు ప్రజలను ఇంతకుముందు వీరెవ్వరూ కలుసుకున్నదిలేదు. అందువల్ల ఈ అవకాశాన్ని జారవిడుచుకోదలుచుకో లేదు బౌడెన్. తన ప్రియమిత్రుని దగ్గర సెలవు తీసుకుని బౌడెన్ 12 రోజులపాటు హేగ్‌తో కలిసి పర్యటనకు వెళ్ళాడు. తిరిగిరాగానే తెలిసిన వార్త ఏమంటే బీరు మరణించాడని!

తిరుగుడుమెట్ట ప్రాంతపు క్రైస్తవులను సందర్శించడానికని ఎండల్లో

కాలినడకన వెళ్ళినందుకు వడదెబ్బ తగిలి మూడు వారాలపాటు పడకమీద ఉండి తన 41వ యేట 1853 అక్టోబరు 30వ తేదీ సాయంత్రం కన్నుమూసాడు జార్జి బీరు. మరణానికి ముందు చివరి వారం రోజులూ మగతలో సంధిమాటలు మాట్లాడుతూ ఉండేవాడు. అప్పుడప్పుడూ తనవల్ల బాప్తిస్మం పొందిన వాళ్ళ గురించి అడిగేవాడు. తిరుగుడుమెట్ట క్రైస్తవులు ఎలా ఉన్నారు? అని అడిగేవాడు. ఒకసారి డార్లింగ్ సతీమణిని పిలిచి తన భార్యకు ఒక సందేశాన్ని రాసిపెట్టమని అడిగాడు. దాన్లో రెండు వాక్యాలను రాయించాడు. "నేను నమ్మినవాని ఎరుగుదును గనుక సిగ్గుపడను. నేను ఆయనకు అప్పగించిన దానిని రాబోవుచున్న ఆ దినము వరకు ఆయన కాపాడగలడని రూఢిగా నమ్ముకొనుచున్నాను."2తిమోతి 1:12, "మంచి పోరాటము పోరాడితిని, నా పరుగు కడ ముట్టించితిని, విశ్వాసము కాపాడు కొంటిని. ఇక మీదట నా కొరకు నీతి కిరీటముంచబడియున్నది. ఆ దినమందు నీతిగల న్యాయాధిపతియైన ప్రభువు అది నాకును, నాకు మాత్రమేగాకుండా తన ప్రత్యక్షతను ఆపేక్షించు వారందరికిని అనుగ్రహించును" 2 తిమోతి 4:7.

ఆ తరువాతిరోజు సాయంత్రం బీరు భౌతికకాయాన్ని భూస్థాపన చేసారు. బీరు సతీమణి, పిల్లలు భూస్థాపన కార్యక్రమం అయిపోయిన తరువాత చేరుకున్నారు.

ఈయన నిజంగా దేవుడు పంపిన మనిషి. జీవితాన్ని క్రీస్తు కొరకు ధారపోసాడు అనే మాటలు చాలామంది గురించి వింటూ ఉంటాము. దీనికి బీరు జీవితం మహోజ్వలమైన ఉదాహరణ. మాతృదేశాన్ని స్వజనాన్ని విడిచి సౌఖ్యాలను కాలదన్ని తెలుగువారి మధ్యకు వచ్చి ఎండనక వాననక కాలినడకన మైళ్ళకొద్దీ దూరాలను అధిగమిస్తూ, శ్రమిస్తూ, ఖండిస్తూ, క్రీస్తు ప్రేమను, ప్రేమసువార్తనూ పంచుతూ తరించిన ధన్యజీవి బీరు.

బౌడెన్ బీరులమధ్య మాటవరసకైనా ఒక్కసారి కూడా అభిప్రాయ భేదాలు వచ్చినట్టు ఎక్కడా ప్రసక్తి లేదు.

* * *

పదహారేళ్ళక్రితం ఈ జిల్లాలంతటిలో క్రీస్తును గురించి విన్నవాళ్ళు లేరు. ఇప్పుడైతే దాదాపు అందరూ కాస్తోకూస్తో వినియున్న వాళ్ళే.

తిరుగుడుమెట్ట, నర్సాపురం, పాలకొల్లు మిషన్‌స్టేషన్లలో 1854నాటికి బాప్తిస్మంపొందిఉన్న విశ్వాసుల సంఖ్య40 (తిరుగుడుమెట్ట 8, నర్సాపురం 5, పాలకొల్లు 27). ఈ మూడుచోట్లా దాదాపు వందమంది పిల్లలు అనుదినం బైబిలు పాఠాలు నేర్చుకుంటున్నారు. వందలు, వేల సంఖ్యలో జనం సువార్త వింటున్నారు. చాలామంది ఎంతో శ్రద్ధతో వింటున్నారు. నిజంగా కోత విస్తారంగా ఉంది కోత పనివాళ్ళు కొదువగా ఉన్నారు.

ఇంతకుముందు ఇద్దరు కోత పనివాళ్ళుండగా ఇప్పుడు దారీతెన్నూ తోచని దుఃఖాంధకారంలో ఒక్కడే ఒంటరిగా మిగిలాడు. మరోవైపు కన్నీరు మున్నీరుగా ఉన్న విధవరాలు, ఆమె కుటుంబం. అయితే బౌడెన్ ఆత్మ స్థైర్యం అంతులేనిది. గాభరాకి చోటివ్వలేదు. ఇలాటి ఆపత్కాలంలో ఆయన విశ్వాసం ఆయనకు బాసటగా నిలిచింది. ఇవి చాలవన్నట్టు ఎగువ గోదావరి ప్రాంతం యాత్రనుండి తిరిగి రాగానే బీరుకులాగా బౌడెన్‌కుకూడా వడదెబ్బ తగిలి ఆరువారాలు మంచం పట్టవలసివచ్చింది.

కాస్తంత ఓపిక చిక్కగానే బందరువెళ్ళి బీరు సతీమణిని కుటుంబాన్నీ వెనక్కి తీసుకువచ్చాడు. జాన్ బీరునుమాత్రం ప్రస్తుతానికి బందరులోనే నోబుల్‌గారి దగ్గర ఉంచేసాడు. ఇతను 1857లో పై చదువులకోసం ఇంగ్లండు వెళ్ళాడు.

ఆ తరువాత బౌడెన్ తిరుగుడుమెట్టకు వెళ్ళి అక్కడి విశ్వాసులను చేతనైనంతవరకు ఓదార్చాడు.

1854లో బీరు సతీమణి తిరిగి నర్సాపురం వెళ్ళి సేవను కొనసాగించింది. అప్పటికే అగ్రకులాల బాలుర స్కూలులో 50మంది ఉండగా, అగ్రకులం బాలికలకోసం మరొక స్కూలు ప్రారంభించింది.

పాలకొల్లులో చార్లెట్ డిబ్రాన్ మరొక స్కూలు తెరిచింది. మెల్లిమెల్లిగా ఇంగ్లీషు నేర్చుకోవాలన్న జ్ఞానం ప్రజల్లో పెరగసాగింది. ఇంతేకాక వీధిలో అంటరానివాళ్ళయిన నిమ్నజాతులపిల్లలతోబాటు కొద్దిమంది అగ్రకులాల పిల్లలు వచ్చి చదువు నేర్చుకోసాగారు.

బౌడెన్‌కి ఇదంతా అష్టావధానం అయింది. ఆదివారం ఉదయం పాలకొల్లులో ఆరాధన నడిపి సాయంత్రం ఆరాధనకు నర్సాపురం వచ్చేవాడు.

సోమవారంనాడు మళ్ళీ తిరిగి ఆ వ్యవహారాలు చూసేవాడు. నెలలో రెండు ఆదివారాలు తిరుగుడుమెట్ట వెళ్ళాలి. ఈ మధ్య రోజుల్లో పరిసర గ్రామాలు సందర్శించాలి.

ఆ పనులు, ఈ పనులు విస్తారంగా పెట్టుకుని సువార్త ప్రకటనను నిర్లక్ష్యంచెయ్యడం ఆ పరిస్థితుల్లో చాలా తేలిక. కాని మే నెల ఎండల్లోనహా బుచ్చెంపాలెంలో వో చింతచెట్టు నీడన బౌడెన్ గుడారం వేసుకుని కోయవాళ్ళకి సువార్త బోధించడానికి వెనుకాడలేదు.

ఒక రాత్రి తన తిరుగు ప్రయాణంలో కానూరులో ఆగి చాప పరుచుకుని పడుకున్నాడు బౌడెన్. ఒక వేదాంత పండితుడు తన శిష్యులతో వచ్చి బౌడెన్‌తో చర్చ ప్రారంభించాడు. అందరూ నిద్రపోగా తెల్లవారి 3 గంటలయ్యేదాకా ఇద్దరూ వాదించుకున్నారు. బౌడెన్ ఒక గంటమాత్రం నిద్రపోయి పొద్దెక్కేలోగా 23మైళ్ళు నడిచి ఇల్లు చేరుకున్నాడు. దారి పొడుగునా త్రవ్వకాలు—నర్సాపురం కాలువ అప్పుడే త్రవ్వుతున్నారు.

లండన్‌లో జూన్ 15న బౌడెన్ సతీమణి ఇండియా ప్రయాణానికి వోడ ఎక్కింది. ఆ సంవత్సరం వానాకాలం వరదల సమయంలో అంతకు ముందెన్నడూ లేనంత తీవ్రంగా కలరా వ్యాపించింది.

కొన్నివారాలపాటు పగలనక రాత్రనక బౌడెన్ పాలకొల్లు, నర్సాపురం ప్రాంతాల్లో కలరా రోగులకు పరిచర్యలు చేస్తూ తిరిగాడు. కలరావల్ల చనిపోయిన విశ్వాసులు మరణశయ్యలమీదనుండి చూపించిన విశ్వాసం, నిశ్చయత హృదయాన్ని పులకింపజేసినాయి. అక్టోబరుదాకా కలరా తాండవం చేసింది. ఆ సంవత్సరాంతంలోగా మరణించిన విశ్వాసుల ధైర్యం, ప్రాణానందాలను చూసి పాలూరి తాతయ్య, దుద్దే దుర్గయ్య వీరి కుటుంబాలు క్రైస్తవులయ్యారు.

ఈ విషమ పరిస్థితుల్లో కష్టాల కటిక చీకటిలోనే రవికోటితేజంగా ...డన్, ప్రిచ్చెట్‌గార్లకృషి ఫలితంగా 'పరిశుద్ధగ్రంథం' మొదటిసారిగా ...బువడింది.

...వీరు కన్నుమూసిన తరువాత సరిగ్గా 365 రోజులకు బౌడెన్ ...ణిని ఇంగ్లండునుండి తీసుకొచ్చిన 'ఆఫ్ఘాన్' నౌక మద్రాసు ...ది. తల్లితోబాటు తిరిగివచ్చిన విలియం బౌడెన్ జూనియర్‌ను చూసి

బౌడెన్ ఎంతో ఆదరణనొందాడు. భార్య ఇంగ్లండు వెళ్ళిన తరువాత జరిగిన మూడున్నర సంవత్సరాల్లో ఎన్నెన్ని మార్పులు!

బౌడెన్ జూనియర్ ఇంగ్లండులో తోళ్ళను శుభ్రపరిచే పరిశ్రమలో శిక్షణపొందాడు. క్రైస్తవులైన వాళ్ళలో ఎక్కువమంది ఈ వృత్తి చేసుకునే వారేకదా. ఇతని పర్యవేక్షణక్రింద ప్రస్తుతం పాలకొల్లు క్రిష్టియన్‌పేట ఉన్నచోటులో (మెరకపాలెంలో) ఈ పరిశ్రమకు చెందిన చిన్నచిన్న గుడిసెలు వెలిసాయి. 1860లో అతను చందప్రుపారం అజమాయిషీకోసం అక్కడికివెళ్ళాడు. తన నూతన వధువు మేరీ గిల్బర్ట్‌తో అక్కడ కాపురం పెట్టాడు. విలియం బౌడెన్ జూనియర్ అటుపైన ఏమి చేసాడోగాని వీరి ప్రసక్తి ఇక్కడితో ఆఖరైంది.

1855 మే లో వీరు పెద్దకూతురు మేరీ ఆనీకి తీవ్రంగా సుస్తీ చేసింది. స్కూలు పనిలో తన తల్లికి సహాయం చెయ్యాలని కాస్తంత నయం కాగానే తన చెల్లెలుతో సహా 'మలబార్' అనే వోడలో కాకినాడ రేవులో దిగింది.

వాళ్ళను తోడుకురావడానికి వెళ్ళిన బౌడెన్ అదే వోడలో ఆఫీసరుగా ఉన్న థామస్ హిలిన్‌ను కలుసుకోనడం తటస్థించింది.

# 9

# థామస్ హీలిస్

1847లో థామస్ హీలీస్ తన పదిహేనవయేట సముద్రయానంలో శిక్షణకోసం మలబార్ అనే వోడలో చేరాడు. దేవుణ్ణి గురించి పట్టించుకోని కౌమార్యదశ. కేప్టెన్ నాక్స్ అనే క్రైస్తవుడు ఆ వోడకు కేప్టెన్. హీలీస్ ఆ వోడలో నాలుగేళ్ళు పనిచేసి ఒక్కోమెట్టూ ఎక్కుతూ మూడో ఆఫీసర్ అయిపోయాడు.

వోడనంతటినీ ఊడ్చే భారతీయ పనివాడొకడు హీలీస్ దృష్టి నాకర్షించాడు. ఇతర నావికుల్లాగా పోకిరిమాటలు, త్రాగుడు ఇతనిలో కనబడలేదు. నెమ్మదిగా సంతోషంగా ఉండేవాడు. అతనిలో కనిపించే ఈ ప్రత్యేకతకు కారణం ఏమిటని హీలిస్ వోసారి అతన్ని అడిగాడు. తాను క్రైస్తవుడిననీ, దేవుణ్ణి సంతోషపెట్టడం తనకు ఇష్టం అనీ అతను జవాబు ఇచ్చాడు. ఊహించని ఈ జవాబు బాణంలా హీలిస్ గుండెల్లో దిగింది.

హీలిస్ ఆపిల్‌బీలో 1833లో ఒక పాస్టరు కుటుంబంలో పుట్టాడు విద్యాబుద్ధులు సంస్కారం చిన్నప్పటినుంచి అలవడినాయి.

అయితే ఇలా దేవుడంటే లెక్కలేకుండా బ్రతకడం ఎంత విపరీతం! దేవునికోపం వెల్లడయ్యేరోజున తన గతి ఏమవుతుందో. ఈ ఆలోచనల పరంపరలో తన పాపాల గురించి పశ్చాత్తాపపడి, స్వతహాగా తనకున్న జ్ఞానం వల్ల, కుటుంబస్థితిగతుల మూలంగా తననుతాను క్రీస్తుకు సమర్పించుకున్నాడు.

చల్లప్రాంతాల్లో నౌకల్లో పర్యటించే సువార్తసేవకునిగా వెళ్ళాలనే కోరిక హీలిస్‌కు ఉండేది. కాని దేవుడతన్ని ఇండియా ఎండలకోసం సిద్ధపరుస్తున్నాడు. సేలంలో సేవచేసిన రాబిన్‌సన్‌గారు 60 సంవత్సరాల

తరువాత హీలిస్‌గురించి ఇలా రాసాడు. ''ఈయన ఎదురులేని సువార్త యోధుడు. స్నేహశీలి, సరళస్వభావుడు. పాపులను పశ్చాత్తాపంలోకి తేవడం నుండి పెద్దపులుల్ని కాల్చిచంపడం వరకు గొప్ప నైపుణ్యం కలవాడు. ఈయనతో కలిసి సరిసమానంగా పనిచెయ్యడం అసాధ్యం. ఏభై యేళ్ళు ఎర్రటి ఎండల్లో పనిచేసి హీలిస్‌గారు మోషేలా తయారయ్యాడు. శరీరశక్తి ఉడిగి పోలేదు. చూపు మందగించలేదు. ఈయనతో కలిసి పనిచేద్దామని యువకులు కొందరు అప్పుడప్పుడూవచ్చి చేరుతూ ఉంటారు. త్వరలోనే శక్తంతా హరించుకుపోయి నీరసపడిపోయి మంచం పడతారు. శుభ్రంగా, ఆడపిల్లలాగా సుకుమారంగా కనిపిస్తాడీయన. ఆకాశంవైపుకి విరబూసి చిరునవ్వులు చిందే పువ్వులాగా, పసిపిల్లవాడిలా అమాయకంగా కనిపిస్తాడు. ఆజానుబాహుడు. అలసట, శ్రమ అనేది తెలియదు. పెద్ద పండితుడు కాదుగాని, మాతృ భాష కంటే తెలుగుభాష మరింత బాగా మాట్లాడగలడు. నూరేళ్ళకోసారి భూమ్మీద అవతరించే ఆధ్యాత్మిక నాయకుల కోవకు చెందినవాడు హీలిస్''. ఈయన చేతివేళ్ళు ఒక్కొక్కటీ పెద్దసైజు అరటిపండంత ఉండేవని చెపుతారు.

బీరు నిత్యనివాసానికి వెళ్ళిపోగా ఇక్కడ మిగిలిన శూన్యాన్ని హీలిస్ భర్తీ చెయ్యవలసిఉంది. ఆత్రుతగా సాటిసహాయం కోసం ఎదురుచూస్తున్న బౌడెన్ ప్రార్థనలకు జవాబుగా గోదావరి ప్రాంతానికి హీలిస్ రావలసిఉంది.

లండన్‌లో ఉన్నప్పుడు ఆర్చర్డ్ వీధిలోని దేవాలయానికి హీలిస్ హాజరైనప్పుడు గోదావరి ప్రాంతంలో సమర్థుడైన ఒక మిషనెరీకోసం యూవ్ అనే దైవజనుడు ప్రార్థన చేస్తూఉండగా ఇరవైయేళ్ళ హీలిస్ హృదయంలో దేవుడీ ప్రేరేపణను పుట్టించాడు.

* * *

ఈ విధంగా 1855 ఎండాకాలంలో 'మలబారు' నౌక భారత దేశానికి ప్రయాణిస్తూఉండగా హీలిస్‌లో మిషనెరీగా వెళ్ళాలన్న ప్రేరేపణ అధికం కాసాగింది. నౌక కేప్టెన్ అతని నిర్ణయానికి హర్షించాడుగాని తన ముఖ్యసహాయక ఆఫీసరును ఇంత అర్థాంతరంగా వదులుకొని రావడం ఇబ్బందే కదా మరి. మద్రాసు నుండి కలకత్తాదాకా అయా రేవుల్ని తాకుతూవెళ్ళవలసిన

వెళ్ళవలసిన ప్రయాణంలో హీలిస్‌తాను మిషనెరీగా వెళ్ళగలగడానికి దేవుడు ద్వారం తెరవాలని పట్టుదలతో ప్రార్థించాడు. ఈ సమయంలో కాకినాడ రేవులో బౌడెన్‌తో హీలిస్‌కు పరిచయం అయింది. వోడ రేవులో లంగరువేసి ఉండగా 3 రోజుల సెలవుమీద హీలిస్ బౌడెన్‌తో కలిసి ధవళేశ్వరం వెళ్ళాడు. అక్కడ జరిగే సేవను చూసాడు. తెలుగువారికి సువార్త అందించాలన్న పిలుపు ఆతనిలో ధృఢపడింది.

కాకినాడరేవుకు తిరిగిరాగానే రేవులో 'వర్ల్‌విండ్'అనే మరొకనౌక ఆగి ఉంది.అందులోని నావికులు కొందరు 'మలబారు' నౌకలో పనిచెయ్యడానికి ఒప్పుకోవడంతో హీలిస్ తన ఉద్యోగానికి రాజీనామా చెయ్యడం సాధ్యపడింది. అక్కడికక్కడే కేప్టెన్ అనుమతిపొంది తన పెట్టె సర్దుకుని, వోడమిత్రు లందరికీ ఆప్యాయంగా వీడ్కోలుచెప్పి చిన్న పడవలో మలబారు నౌకనుండి బయలుదేరి ఒడ్డు చేరుకున్నాడు.

తన పెట్టెను మొయ్యడానికి కూలీలను ఏర్పాటుచేసుకుని తాటాకు గొడుగువేసుకుని కాలినడకన పాలకొల్లు చేరుకున్నాడు. 1855 ఆగష్టు నెలాఖరుకి గోదావరి డెల్టా మిషన్‌లో మూడవ స్వతంత్ర మిషనెరీగా హీలిస్ వచ్చి చేరాడు.

శ్వేతజాతీయుడినన్న గర్వం పక్కకినెట్టి స్థానిక తెలుగు ప్రజలతో చాపమీద కూర్చుని ఇష్టాగోష్ఠులు జరిపేవాడు హీలిస్. ఒళ్ళువంచి అహోరాత్రాలూ తెలుగు భాష నేర్చుకోవడంలో కృషి చేసాడు. పదహారుమంది అన్యులకు బాప్తిస్మమిచ్చిన సందర్భంలోనే హీలిస్‌కుకూడా బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. చివరికి 1856 జనవరి 16వ తేదీన చార్లెట్ డిబ్రాస్‌ను పెళ్ళాడడంద్వారా హీలిస్ ఒక ఇంటివాడయ్యాడు. ఇంతకుముందు ప్రస్తావించినట్లు ఈ నూతన దంపతులు బౌడెన్‌తో కలిసి అంతర్వేది తీర్థానికి సువార్త సేవకనివెళ్ళారు. ఇదే వారి హనీమూన్! హీలిస్ ఆ తీర్థం నుండి తిరిగి వచ్చిన తరువాత ఇలా రాసుకున్నాడు "తెలుగు— క్షుణ్ణంగా నేర్చుకోవాలన్న తపన నాలో అంతకంతకూ ఎక్కువౌతోంది. పగలంతా తెలుగు భాషే నా మనసును ఆక్రమించుకుని ఉంటున్నది. రాత్రిళ్ళు కలలో కూడా తెలుగు భాషే.!"

ఒకవైపు విలియం బౌడెన్ జూనియర్ తన భార్యతో కలిసి పనిచేస్తూ ఉండగా, బౌడెన్ సతీమణి పాలకొల్లు సంఘ వ్యవహారాలు చూసుకుంటూ ఉండగా, వీళ్ళిద్దరికీ తోడు హీలిస్ పనిచేస్తూ ఉండగా బౌడెన్ తన చిరకాల వాంఛను నెరవేర్చుకోవడానికి సమయం దగ్గర పడిందని గ్రహించాడు.

ఎగువప్రాంతం కొండల్లోని గ్రామాలన్నీ తిరిగి కొండజాతులకు సువార్త నందించాలన్నదే ఈ కోరిక. అటునుంచి అటు భద్రాచలం ఉత్సవాన్నికూడా చూసుకుని తిరిగి రావాలని పథకం వేసాడు. నైజాం, నాగపూర్ ప్రాంతాలనుండి అసంఖ్యాకంగా ప్రజలు ఈ ఉత్సవాలకు వస్తారు. వాళ్ళందరూ ఇంతకుముందెన్నడూ సువార్త విని ఉండలేదు.

ఈ ప్రాంతలో మొట్టమొదటిగా ఒక ముస్లిం మతస్థుడు క్రైస్తవుడిగా మారడం జరిగినది ఈ సమయంలోనే. పాలకొల్లు దగ్గర పెమ్మరాజు పోలవరం గ్రామానికి చెందిన వైద్యుడు అలీ సాహేబు. పాలకొల్లు క్రిష్టియన్ పేట మొగదల ఉన్నతోటను సాయిబుగారి తోట అంటారు. ఇది అలీ సాహేబుదే. ఇతనిలోని ఆత్మ తీవ్రత, సువార్తను ప్రకటించాలన్న పవిత్రమైన అభిలాషనుచూసి బౌడెన్ వృద్ధ విశ్వాసి గాఢంచెట్టి సుమియోనుతోబాటు ఆలీసాహేబునుకూడా కొండజాతులమధ్య సువార్త దండయాత్రకు తీసుకు వెళ్ళడానికి నిశ్చయించుకున్నాడు. ఇది ఆలీ సాహేబు మొదటి సువార్త యాత్రేకాకుండా విశ్వాసంలోపరిపక్వమైనప్రౌఢ క్రైస్తవుడు సుమియోనుతో సన్నిహితంగా సహవాసం చేసే అవకాశం.

1856 ఏప్రిల్ మొదటివారం తెరుగుడుమెట్టలో గడిపి గోపాలపురం బుచ్చెంపాలెంల దారిన కోపల్లె చేరుకున్నారు. (కొయ్యలగూడెం దగ్గర). అక్కడినుండి పైకి అడవిదారి చాలా కష్టతరం అని తెలుసుకున్న బౌడెన్‌కు వృద్ధుడైన సుమియోను ఆ శ్రమను తట్టుకుని నిలబడలేడనిపించింది. ఆయన్ని గుర్రంమీద కొండలచుట్టూ తిరిగి చుట్టు దారిన రుద్రం కోట చేరుకుని తమకోసం ఎదురుచూడమని చెప్పి పంపించేసాడు. ఒక గైడును వెంటతీసుకుని సాధ్యమైనంత తక్కువ సామాన్లతో బయలుదేరాడు. బౌడెన్ ఆలీసాహేబులు ముంజలూరు, గిన్నెపల్లిలమీదుగా ప్రయాణించారు. అడివి

మరింత దుర్గమం అయింది. జనపదాలు మరింత చిన్నచిన్నవిగా, దూరం దూరంగా కనిపించసాగాయి.

ప్రమాదకరమైన కొండవాలు దిగి కొరుటూరు చేరుకున్నారు. అక్కడ గోదావరి రేవులో వాళ్ళని భద్రాచలం తీసుకువెళ్ళవలసిన పడవ జాడలేదు. ఒకవైపు చెప్పులు అరిగిపోయి కాలివ్రేళ్ళు బయటికి కనిపిస్తున్నాయి. చేసేదిలేక కాలినడకన నది ఒడ్డునపడి దిగువకు నడక సాగించారు. కొన్ని మైళ్ళు నడిచాక వాళ్ళు మాట్లాడుకున్న పడవ కనిపించింది. నది ఎగువకి వెళ్ళడానికి పడవ సరంగులు ఒప్పుకోలేదు. ధవళేశ్వరం వెళ్ళి మరొక పడవ మాట్లాడుకోవడం తప్ప వేరే దారిలేదు. ఇదంతా జరిగేసరికి భద్రాచలం ఉత్సవం కాస్తా అయిపోతుంది.

ఇక చేసేదిలేక రుద్రం కోటదాకావెళ్ళి వీళ్ళు రాలేదేమోనని ఆందోళన పడుతున్న సుమియోనుకు ధైర్యం చెప్పారు. అక్కడినుంచి నది దాటి రేకపల్లె సంతకు వెళ్ళారు. అక్కడికి కొందరు కొండజాతులవాళ్ళు వచ్చారు. ఇక్కడ బౌడెన్ ఒక కొండజాతి నాయకునితో పరిచయం చేసుకుని అతనికి క్రీస్తు చరిత్ర అంతా వివరించి కొన్ని కరపత్రికలు అతనికి ఇచ్చాడు. అక్కడినుంచి మంటూరు మీదుగా ఏప్రిల్ చివరివారంలో పాలకొల్లు తిరిగివచ్చారు.

హీలిస్‌భార్య చార్లెట్ డ్రబాస్‌కి జబ్బుచేసి బాగా కృశించిపోయి పెళ్ళి అయిన 18 వారాలకే అంటే మే 21వ తేదీన కన్ను మూసింది. తన 23వ యేట హీలిస్ భార్యను కోల్పోయిన వాడయ్యాడు.

ఈ పత్నివియోగ భారాన్ని హీలిస్ మరింత తీవ్రంగా తెలుగు భాషాధ్యయనం చెయ్యడంద్వారా మర్చిపోగలిగాడు. ఉన్నత కులీనులను ఆకట్టుకోవాలంటే స్పష్టంగా, ధారాళంగా స్వచ్ఛమైన తెలుగుభాష మాట్లాడగలిగి ఉండాలి కదా. అందుకని హీలిస్ తెలుగు ప్రౌఢ వ్యాకరణాన్ని, కొంత సంస్కృతాన్ని సాధనచెయ్యడమేకాక, ఇంగ్లీషుయాసతోగాక తెలుగును తెలుగుగా ఉచ్చరించడంలో కృషిచేసాడు. ఈ కష్టమంతా వృధాపోలేదు. వ్యవహారభాషలోను, గ్రాంథికంలోనూ పండితుడిగా మన్ననలు పొందగలిగాడు.

* * *

ఈలోగా నర్సాపురంలో జార్జినోబుల్ టేలర్‌సబ్‌కలెక్టరుగా పనిచేస్తూ విద్యకు ప్రాధాన్యతనిచ్చి పాఠశాలల స్థాపనను ప్రోత్సహిస్తూ వచ్చాడు. 1856లో ఈయన బదిలీఅయి వెళ్ళిపోయిన తరువాత స్కూలును నడిపించేందుకు సామ్యూల్ ఆగెర్ వచ్చాడు. బీరు సతీమణి ఇతనికి తన ఇంట్లో ఆతిథ్యం ఇచ్చింది. కొద్ది నెలల్లోనే ఆ ఇంటి పెద్దకూతురు మేరీ ఏన్‌ను పెళ్ళాడడం ద్వారా ఈయన బీరు సతీమణికి అల్లుడైనాడు. నర్సాపురం సంఘ సభ్యత్వం 14కు పెరిగింది.

1857 నాటికి బౌడెన్ సతీమణి ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. ఇంగ్లండు తీసుకవెళ్ళి విశ్రాంతి నివ్వడం అవసరంలా తోచింది. తప్పనిసరై బౌడెన్‌గారే ఆమె వెంట ఇంగ్లండు వెళ్ళడానికి సిద్ధపడ్డాడు. 1857 ఫిబ్రవరి 13న మద్రాసునుండి'గ్లోరియానా' నౌకలో బౌడెన్‌గారు మొదటిసారిగా స్వదేశానికి భార్యతోసహా ప్రయాణమయ్యాడు. అంటే ఇరవై సంవత్సరాలు తర్వాత మళ్ళీ మాతృదేశానికి వెళ్తున్నాడన్నమాట. దీనితో పూర్తి భారం హీలిస్‌మీద పడింది.

ఆ యేడు ఏప్రిల్‌నెలలో హీలిస్, ఫ్రాన్సిస్‌ని, ఆలీసాహెబునూ వెంట తీసుకుని కొండప్రాంతాలకు కొరుటూరు దాకా వెళ్ళాడు. పైడిపాక గ్రామం దగ్గర చిన్న గుడిసె వేసుకుని అక్కడినుండి చుట్టు ప్రక్కల ప్రాంతాలను దర్శించారు.

ఇక్కడ ఆలీసాహేబు చేసిన సేవ మరపురానిది. కోయలమీద ఇతనికి ప్రేమాభిమానాలు అవధిలేనివి. రాత్రి చాలా పొద్దుపోయేదాకా చిన్న లాంతరు వెలుగులో కొయల్ని చుట్టూ కూర్చోబెట్టుకుని మృదువుగా వోపిగ్గా వారికి యేసు కథ చెప్పేవాడు. తన హృదయపు లోతుల్లోనుండి పెల్లుబికే వాత్సల్యంతో పాపాలను మోసుకుపోయే దొర గురించి ఆ అమాయక ప్రజలకు చెప్తూ జీవమార్గాన్ని చూపిస్తూ గడిపేవాడు. కొండ ప్రాంతాలకు ఫ్రాన్సిస్‌గారి మొదటి యాత్ర ఇదే.

ఫ్రాన్సిస్‌గారు రాసిన లేఖ ఒకటి ఈ యాత్రను చక్కగా వర్ణిస్తున్నది. ఆ రోజుల్లో కోయప్రాంతాలకు వెళ్ళడమంటే మాటలుకాదు. ఆ ప్రదేశం అంతా దుర్భేధ్యమైన కొండలు, ఎడారులు, పులులు, ఎలుగులు మొదలైన క్రూరమృగాలతో నిండిన కీకారణ్యాలు. చలికాలంలో భయంకరమైన జ్వరాలు.

క్రూరమృగాలతో నిండిన కీకారణ్యాలు. చలికాలంలో భయంకరమైన జ్వరాలు ఆ ప్రాంతమంతా వికయతాండవం చేస్తాయి.

కోయలు సువార్తను శ్రద్ధగానే వింటారు. కొందరికి బాగానే అర్థమౌతుంది. చదువులేనివాళ్ళు కాబట్టి ఆదేమిటి, ఇదేమిటి అని వాదం పెట్టుకోరు.

ఆర్థర్ కాటన్‌కి అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేసిన కెప్టెన్ హేగ్ ఫ్రాన్సిస్ గురించి ఇలా రాసాడు. "రాత్రి ఇద్దరు పేదవాళ్ళతో నేను మాట్లాడుతుంటే ఫ్రాన్సిస్ అక్కడే ఉన్నాడు. వాళ్ళు వెళ్ళిపోతుండగా వాళ్ళ దారిద్ర్యానికి, ఆత్మీయ గుడ్డితనానికి చలించిపోయి వెక్కివెక్కి ఏడ్చేసాడు ఫ్రాన్సిస్. అతనితో మాట్లాడుతుంటే నాలోకూడా ఒకరకమైన చైతన్యం పుట్టుకొచ్చింది. అతనితో ఒంటరిగా చాలాసేపు మాట్లాడాలని నా చిరకాల వాంఛ. అతనినుండి నేర్చుకోవలసింది ఎంతోఉంది. అతని విశ్వాసం పసిపాప విశ్వాసం. తన జాతివాళ్ళ పట్ల అతనికున్న జాలి, ఆప్యాయత అంతులేనిది.అదే సమయంలో అతని తగ్గింపు స్వభావం ఆదర్శప్రాయమైనది. దేవుని దయవల్ల ఇతనికే గనక కాస్తంత చదువు అబ్బితే క్రీస్తు సువార్తను వ్యాపింపజెయ్యడంలో ఇతను మరింతగా ముందంజ వెయ్యగలడని నా నమ్మకం.

తన శక్తికిమించి ఆత్మల రక్షణకై పాటుపడే అలవాటు వల్ల ఫ్రాన్సిస్ అనేకసార్లు ఆరోగ్యాన్ని కోల్పోయి మంచం పట్టవలసి వచ్చేది. హానికరమని తెలిసికూడా మరికాస్త విశ్రాంతిగా తాపీగా, తన బాధ్యతను నెరవేర్చాలన్న ఆలోచనకు తావిచ్చేవాడుకాడు. ఫ్రాన్సిస్‌కు టి.బి. ఉండేది. ప్రభువులో మహాబలవంతుడైనప్పటికీ శారీరకంగా బలహీనుడు. చాలాసార్లు అతను యువకుడుగానే చనిపోతాడనుకున్న సందర్భాలు వచ్చాయి. త్వరలో చనిపోతా ఆలోచన అతన్ని మరింత ఆత్రుతగా పనిచేసేలా చేసింది. ఈ మిగిలి కాలంలోనే ప్రభువును సేవించాలన్న తపన అతనిలో కనిపించేది.

అయితే ప్రభువు దయవల్ల 43 యేళ్ళదాకా మరణం ఈయన్ని సమీపించలేదు. పెళ్ళాడి సంతానవంతుడై పండు వృద్ధాప్యంలో 1900 అక్టోబరు 24న ప్రభువు సన్నిధికేగాడు.

ఆరార్ సుందర్రావుగారు తన "ఆంధ్ర క్రైస్తవ కవులు" గ్రంథంలో నర్సాపురం కవివరేణ్యులు అన్న అధ్యాయంలో చదలవాడ ఫ్రాన్సిస్‌గారిని ఈ ప్రాంతపు సర్వోత్తమ కవిశేఖరునిగా భక్తశిఖామణిగా పొగిడారు. వీరితోబాటు చదలవాడ జఖర్యా, జోనాగార్లు వెనకటి కాలంలో క్రైస్తవ కవులుగా పేరు మోసారు. వీరు రచించిన గీతాలను జి.డి.యం సంఘాలవారు మక్కువతో పాడుకుంటారు.

హీలిస్, ఆలీసాహేబు, ఫ్రాన్సిస్‌లు కోయప్రాంతాలకు సువార్తయాత్ర చేసిన తరువాతి సంవత్సరాల్లో ఇలాటి ప్రయత్నం మళ్ళీ జరగలేదు. తెల్లవారిపట్ల ద్వేషం, దేశాన్ని స్వాతంత్ర్యం చెయ్యాలన్న రాజకీయ చైతన్యం కొందరిళ్లలో కలగడం ప్రారంభించింది. త్వరలోనే 1858లో సిపాయిల తిరుగుబాటు మొదలైన అవాంతరాలు వచ్చినాయి.

సైనికాధికారులు, సైనికులు, వీరి రక్షణక్రిందఉన్న ఆంగ్లేయ ప్రజలు క్షేమంగా ఉన్నప్పటికీ, ఆంగ్లసైన్యం రక్షణక్రింద లేని కొందరు మిషనెరీలు మొదలైన వాళ్ళకి ప్రమాదం దాపురించే పరిస్థితి వచ్చింది. ఉత్తరభారతంలో ఝాన్సీ లక్ష్మీబాయి, తాంతియాతోపేం నాయకత్వంలో జరుగుతున్న పోరాటం తాలూకు నీడలు కొద్దికొద్దిగా గోదావరి ప్రాంతంలో కనిపించాయి. సువార్తను ప్రజలు పట్టించుకోవడం మానేసారు. కొందరైతే 'ఇక క్రీస్తు, క్రైస్తవులూ మూటాముల్లే సర్దుకుని వెళ్ళిపోవలసిందే' అన్నారు. యూరోపియన్లందరినీ చంపేస్తారు అన్న పుకారుకూడా లేచింది. ఇలాటి స్థితిలో హీలిస్ ఒక పడవనూ చాలినంత ఆహారపదార్థాలనూకూడా సిద్ధబాటులో ఉంచాడట. అవసరమైతే యూరోపియన్లందరినీ ఆ పడవలో సురక్షిత స్థలానికి చేర్చాలన్న తలంపుతో సమయంకోసం కనిపెట్టి ఉన్నాడట. అయితే ఇంత దుస్థితి ఈ ప్రాంతాల్లో కలగలేదు.

చివరికి 1858 నవంబరు ఒకటవ తేదీన నర్సాపురం పురప్రముఖుల ఎదుట రాజశాసనం చదవడం జరిగింది. భారతదేశమంతటిమీదా విక్టోరియా రాణి పరిపాలనా బాధ్యతను కైవసం చేసుకుంది.

బౌడెన్ సతీమణి ఆరోగ్యం మెరుగుపడింది. 1858 ఆగష్టు 14వ తేదీన 'ఇండస్' నౌకలో తిరిగి భారతదేశానికి బయలుదేరారు

బౌడెన్ దంపతులు. మద్రాసుచేరి నెల్లూరు, బెజవాడల్లో తోటి మిషనెరీలను కలుసుకుంటూ పాలకొల్లు చేరారు.

* * *

1859 క్రొత్త సంవత్సరం పండుగ హీలిస్‌కి అత్యంత ప్రియమైన కానుకను తెచ్చింది. నావికుడుగా పనిచేసిన హీలిస్ "హార్బింగర్" అనే తన స్వంత పడవను సంపాదించుకున్నాడు. చేతిలో పడవఉంటే సువార్త యాత్రలకు ఎన్ని అవకాశాలు! ఆంగ్ల ఇంజనీర్ల- పుణ్యమా అంటూ గోదావరి ప్రాంతమంతటినీ వందలకొద్దీ మైళ్ళపొడవునా కాలువ రహదార్లు కలుపుతున్నాయి. ఇంతకుముందు రాసినట్టు ఈ పడవ చేసిన మొదటియాత్ర అంతర్వేదికి.

అయితే భద్రాచలం ఉత్సవానికి హాజరై వాక్యం వినిపించాలన్న ఆశ ఆశగానే మిగిలిందికదా. ఇప్పుడు స్వంత పడవఉంది గాబట్టి ఇక ఎదురేముంది. కాబట్టి బౌడెన్‌తో సంప్రదించి ఆలీసాసాబు, ఫ్రాన్సిస్‌లను వెంటబెట్టుకుని ఏప్రిల్ 6వ తేదీన బయలుదేరాడు హీలిస్. 140మైళ్ళ దూరాన్ని 4 రోజుల్లో పూర్తిచెయ్యాలన్న ఉద్దేశంతో పడవలో అన్నీ సమకూర్చుకుని బయలుదేరారు. అయితే నీటిలో మునిగిఉండే ఇసుక తిన్నెల మూలంగా ప్రయాణం కష్టంగాను, ఆలస్యాలతోను సాగింది. ఈసారికూడా భద్రాచలం చేరడం సాధ్యపడలేదు. గాని శ్రీరామగిరిదాకా వెళ్ళి అదే సమయంలో అక్కడ జరిగే ఉత్సవానికి హాజరు కాగలిగారు. క్రొత్తగా వీరినీ వీరు బోధించే సువార్తనూ ఆశ్చర్యంతో ఆసక్తితో జనం అంతా విన్నారు. అయితే దేవస్థానం బ్రాహ్మణులు మాత్రం కన్నెర్ర జేసారు. అప్పటికి భద్రాచలం ఇంకా ఆంగ్లేయుల స్వాధీనంలోకి రాలేదు.

అక్కడినుంచి ఈ ముగ్గురూ శబరీనది గోదావరిలో కలిసే కుద్రంకోట ప్రాంతానికి వచ్చారు. శబరి లోతులేనందువల్ల 'హార్బింగర్' ఏవ వెళ్ళలేదు. అందుకని కాలినడకన రేకపల్లెసంత చేరుకున్నారు.

అక్కడినుంచి దాదాపు 10గ్రామాలు దర్శించి ఐదోరోజున కాలేరు ారు. సీలేరువాగు, శబరి కలిసేచోటు ఇది. రేకపల్లె జమిందారీ సరిహద్దు. ది దాటితే సుంకుంరాజావారి భూమి. ఇక్కడి అరణ్యం కాకులు దూరని

కారడవి. కనుచూపు అందినంతమేరా ఆరులేక ఏడడుగుల గడ్డిదుబ్బులు పులులు, ఎలుగ్గొడ్లు దాక్కోవడానికి అనువైన చోటు. కోయగైడులను తోడుతీసుకుని ముందుకిసాగి ఒక కోయగ్రామం చేరారు. కొందర్ని పోగుచేసి వాళ్ళకి క్రీస్తును గురించి చెప్పారు. తెల్లవాణ్ణి మొదటిసారి చూడడంవల్ల వాళ్ళు ముందు భయపడ్డారు. వీళ్ళు దక్షిణప్రాంతపు కోయవాళ్ళలాగా లేరు. శరీరం అంతా అనాచ్ఛాదితంగా ఉంది. తెలుగు సరిగ్గా తెలియదు.

నదివెంటే ఇంకా 90 మైళ్ళు ఎగువకి వెళ్ళారు. తగిలిన ప్రతి గ్రామంలోనూ సువార్త ప్రకటించారు. దాదాపు అన్ని గ్రామాల్లోనూ కోయలు స్నేహపుర్వకంగానే ప్రవర్తించారు. శుభవార్తను చాలా ఆశ్చర్యంగా విన్నారు.

హీలిస్ దగ్గరున్న ప్రతివస్తువు, ముఖ్యంగా లాంతరు వాళ్ళని భలే ఆశ్చర్యపరిచేది. కొన్ని గ్రామాల్లో మృగాలు పశువుల్ని చంపి సగం తిని వదిలేసిన శవాలు కనిపించేవి. క్రూరమృగాలేకాక జమీందారులవల్లకూడా ఈ కోయలకు సమస్యలు ఉత్పన్నమౌతూ ఉన్నాయని వాళ్ళు చెప్పుకున్నారు.

చివరికి పోడివాయ్ పట్నం అనే ఊరు చేరారు. అక్కడ తెలుగు బాగా అర్థం చేసుకునే శూద్రకులం వాళ్ళు కొందరున్నారు. 200మంది ఒక షెడ్లో కూడుకుని దాదాపు రెండుగంటలసేపు హీలిస్ బృందంవారి ప్రసంగాలు విన్నారు. రాజా వారుండే ఊరు సుంకుం ఇక ఒకరోజు ప్రయాణమంత దూరంలోఉంది. కాని ఫ్రాన్సిస్ ఆరోగ్యం దెబ్బతిని నీరసించిపోయాడు. పైగా సుంకుం దాటిన తరువాత తెలుగు ఎవరికీ అర్థం కాదని తెలిసింది. అందుకని మళ్ళీ తిరుగు ముఖం పట్టారు మన ముగ్గురు మిత్రులు. కాలేరుచేరి పడవలో శబరి నదిలో రుద్రంకోట చేరారు.

కొండపైన పెద్దపెద్ద వృక్షాలవెనకఉన్న ఒక పల్లెకు అతికష్టంమీద ఎక్కివెళ్ళారు ముగ్గురూ. వీళ్ళని చూడగానే ఆ గ్రామం కోయలంతా ఎక్కడివాళ్ళక్కడ పారిపోయారట. పల్లపు ప్రాంతాలవాళ్ళు కొందరు ఆ సమయంలో అక్కడున్నందువల్ల వీళ్ళు పారిపోయిన కోయలందరినీ భయమేమీలేదని రమ్మని ధైర్యం చెపుతూ పిలిచారు. కాస్సేపటికి జంకుతూ

భయం భయంగా గూడెం నాయకుడు తిరిగి వచ్చాడు. అతనికి ధైర్యం చెప్పి మిగతావాళ్ళని తీసుకురమ్మని మళ్ళీ పంపించగా ఒక్కొక్కరే మెల్లిమెల్లిగా వచ్చి చేరారు.

మరొక కొండజాతివాళ్ళని ఈ గ్రామానికే పిలిపించారు. వాళ్ళు ఒక అరటిగెలను శాంతి ఒప్పందానికి చిహ్నంగాతెచ్చి బహూకరించి సువార్త విన్నారు.

మే నెల చాలామట్టుకు గడిచిపోయింది. ఎండలు మాడ్చేస్తున్నాయి. వెనక్కి తిరిగి రుద్రంకోట చేరుకుని పడవ ఎక్కారు. వెంటనే అందరూ భయంకరమైన జ్వరంతో మంచమెక్కారు. హీలిస్‌ను కొన ఊపిరితో రాజమండ్రికి తీసుకు వచ్చారు. ''నేను వెళ్ళిపోయి యేసుతో ఉంటానని నిశ్చయించుకుని నా మనస్సును ప్రశాంతంగా ఉంచుకున్నాను'' అని ఆ రోజుల్ని తలుచుకుంటూ రాసాడాయన. కాస్త స్వస్థత చిక్కాక నర్సాపురం చేర్చి పూర్తిగా కోలుకునేదాకా ఉపచారాలు చేసారు.

ఆ తరువాత వచ్చిన క్రొత్త సంవత్సరం పండక్కి బందరునుండి షార్కీగారితో కలిసి కొందరు యువకులు నర్సాపురం వచ్చారు. హీలిస్ వారిని అంతర్వేది తీర్థానికీ, ఇంకా కాకినాడ, కోరింగ, యానాంలమీదుగా కోటిపల్లి తీర్థానికి తీసుకు వెళ్ళాడు.

భద్రాచలం ఉత్సవం గురించిన పట్టుదల ఇంకా వదల్లేదు. ప్రాన్సిస్, అలీసాహేబుకూడా సరేనంటే సరే అన్నారు. అదృష్టవశాత్తూ ఈసారి 12 రోజులకే భద్రాచలం చేరుకోగలిగారు. దుమ్ముగూడెంనుంచి అప్పటికే కేప్టెన్‌హేగ్ అక్కడికి వచ్చిఉన్నాడు. అలయ పుజారులనుండి తీవ్రమైన ప్రతిఘటన ఎదురైంది మన సువార్తికులకి. అయితే ఎప్పటిలాగే సామాన్య పజలు ఆసక్తితో విన్నారు. ఈ యాత్ర తిరుగు ప్రయాణంలోనే హీలిస్‌కి పులి ఎదురైనది.

పడవలో వెళ్తుంటే ఒకచోట ఒడ్డున చాలా నెమళ్ళుండం చూసి ఆహారకోసం ఒకటి దొరుకుతుందేమోనని తుపాకీతో ఒడ్డుకి చేరాడు. హీలిస్. అన్నీ ఎక్కడివక్కడ చెల్లాచెదురైపోయినాయి. పొదల్లో వెదికే ఉద్దేశంతో లోపలికి చొరబడి అడివిలోకి కొంతదూరం నడిచాడు హీలిస్.

వందగజాలు నడిచాడోలేదో బ్రహ్మాండమైన పెద్దపులి ఒకటి ఎదుటికిదూకి భీకరంగా మూడుసార్లు గాండ్రించింది. దేవుడిచ్చిన నిబ్బరంతో హీలిస్ ఏమాత్రం తొట్రుపడకుండా తన తుపాకిని సూటిగా దానికేసి గురిపెట్టాడు. అది ప్రక్కకి తిరిగి మెల్లిగా నడుచుకుంటూ అప్పుడప్పుడూ హీలిస్‌కేసి చూస్తూ పొదల్లో అదృశ్యమయింది. వెంటనే హీలిస్ ఒక చెట్టెక్కి పడవలోనివారిని కేకలువేసి పిలిచాడు. వాళ్ళుకూడా పులి గాండ్రింపువిని ఉండడంతో పరిగెత్తుకుంటూవచ్చి క్షేమంగా చెట్టుదిగినవస్తున్న హీలిస్‌ని చూసి దేవునికి స్తోత్రాలు చెల్లించారు.

ఈ సేవకుడు తెలుగువాళ్ళ మధ్య మరో 50 యేళ్ళు పని చెయ్యవలసిఉంది. పెద్దపులికి ఆహారమైపోవడానికి దేవుడు సమ్మతిస్తాడా!

* * *

సిపాయిల తిరుగుబాటువేడి చల్లారుతూ ఉండగా ఇంగ్లండునుండి తిరిగివచ్చిన బౌడెన్‌కి తెలుగు ప్రజలు మరింత ఆసక్తితో సువార్త వింటున్నట్టు అనిపించింది. క్రైస్తవులన్నా, క్రీస్తుమతమన్నా ఇంతకు ముందులేని ఆదరణ కనిపిస్తోంది. తిరిగివచ్చిన వెంటనే పడవలో తిరుగుడు మెట్ట, ఉండి, అక్కడినుంచి గంటి చెల్లయ్య పని చెయ్యదలుచుకున్న పేటల గ్రామానికీ, చందపర్రులోని నిమ్నజాతులమధ్య సువార్త ప్రచురణ కేంద్రంగా ఉంటున్న చెల్లయ్య స్వగృహానికీవెళ్ళి విశ్వాసులను బలపరిచాడు. ఆటు తరువాతికాలంలో చందపర్రు జమీ వ్యవసాయపువంటు అంతటినీ సగంవెరాలు దగ్గరనున్న పెంకుళ్ళపాడులో పెద్దపెద్ద గాదెలుకట్టి అక్కడ [illegible] చేసారు. వీటికి కావలాగా పెనుమాక యోసేబు, పెనుమాక పౌలిసుగార్ల కుటుంబాలతో ఉండేవారు. అగర్తిపాలెంలో సువార్తపట్ల ఆసక్తి పెరుగు తున్నది. అరవల్లిలో అవకాశాలు ఇప్పుడిప్పుడే కనిపిస్తున్నాయి. ఇక్కడి ప్రతి ఆదివారం పన్నెండునుంది ఆరాధనకు సమావేశమవుతున్నారు. [illegible] చదవడం రాదు. కాని పాలకొల్లులో విస్వవాక్యం [illegible] అందరిలో [illegible] వారు. ఆలీసాహేబు ఈ బృందాన్ని సందర్శించిన [illegible] ఉజ్జీవం వీరిలో కనిపించింది.

ఈలోగా 1859లో సఖినేటిపల్లికి చెందిన [illegible] ముస్లిం ఏలూరి సుభాన్ సాహెబుకు బౌడెన్ బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. [illegible]

సంవత్సరమంతా బౌడెన్ ఆస్త్మావల్ల అంత చురుకుగా పనిచెయ్యలేక పోయాడు. ఈ కాలంలో జేమ్సు బౌడెన్‌కు కుడిభుజంగా నిలిచి సహాయ పడ్డాడు.

పాలకొల్లు ప్రాంతంలో బౌడెన్ బీరులు విత్తిన సువార్తపంటను అమెరికన్ బాప్టిస్టువారు, లూథరన్‌వారుకూడా కోసుకున్నారు. ఇదిగాక డెల్టా ప్రాంతంలోను, పరిసరాల్లోను ప్రస్తుతం ఉచ్ఛదశలో ఉన్న ఇతర సంఘాలుకొన్ని ఆది డెల్టా మిషనెరీలు స్థాపించిననే.

1857–58 కాలంలో ఈ ప్రాంతాల్లో పశువుల అంటువ్యాధి విలయతాండవం చేసింది. పశువులు వేల సంఖ్యలో చనిపోయినాయి. పశువులతోళ్ళు అసంఖ్యాకంగా మార్కెట్టుకు చేరినాయి. చవకగా దొరికే ఈ తోళ్ళు కొనుక్కు వెళ్ళడానికి నెల్లూరు మొదలైన దూరప్రాంతాల నుండి చర్మకారుల వ్యాపారులు రాజమండ్రి, మచిలీపట్నం మార్కెట్టులకు వచ్చారు. అంటువ్యాధి ఉన్న ప్రాంతాలన్నీ తిరుగుతూ చవకగా కొనుగోలుచేసి బండ్లమీద తమ ప్రాంతానికి తరలించేవారు. ఈ విధం గావ్యాపారులు కొందరు మన పాలకొల్లు క్రైస్తవులను కలుసుకోవడం తటస్థించింది.

1860లో జనవరి రెండవ ఆదివారంనాడు పాలకొల్లు ప్రార్థనా కూటంలో ఒంగోలునుండి వచ్చిన వ్యాపారి ఒకతను పాల్గొన్నాడు. అక్కడ సువార్త విన్నది మొదలు వారం రోజులు అక్కడేఉండి తన ఆత్మను సంతృప్తి పరుచుకున్నాడు. ఏలూరులో ఇతనికి అక్కడి మిషనెరీ అలెగ్జాండరుగారు వీధి ప్రసంగంచేస్తూ కంటబడ్డాడు. అక్కడే ఇతను కుటుంబంతో సి రపడి బాప్తిస్మంపొంది ఒంగోలు అబ్రాహాంగా పేరు మార్చుకున్నాడు.

ఒంగోలు తిరిగివెళ్ళి తన భార్య నాగమ్మతోసహా 1866లో బాప్తిస్మం పుచ్చుకున్నాడు. ఈవిధంగా చర్మకారుల్లోనుంచి గొప్ప జన సమూహం అక్కడి అమెరికన్ బాప్టిస్టు సంఘంలో చేరారు.

కనిగిరి దగ్గర తుళ్ళకొండపాడుకు చెందిన యెర్రగుంట పేరయ్య కూడా ఇదే రీతిగా 1862లో ఏలూరులో మొదట అలెగ్జాండరుద్వారా, తరువాత పాలకొల్లువచ్చి బౌడెన్‌ద్వారా వాక్యం విన్నాడు. ఇతను 1897లో మరణించేదాకా తన స్వగ్రామం ప్రాంతాల్లో ఆత్మల సంపాదనలో ప్రయాసపడ్డాడు. వీరంతా అమెరికన్ బాప్టిస్టు సంఘంలో చేరారు.

1860 మార్చిలో బౌడెన్ సతీమణి తన నలుగురు కొడుకులతో భారత దేశానికి తిరిగివచ్చింది. ఎడ్విన్ బౌడెన్ (ఐదవ సంతానం) మాత్రం చదువు పూర్తి చెయ్యడంకోసం అక్కడే నిలిచిపోయాడు.

ఆ ఎండాకాలం వడదెబ్బకు బౌడెన్ తీవ్రమైన అస్వస్థతకు గురయ్యాడు. ఆ యేడు ఎండలు విపరీతంగా ఉన్నాయి. అంత నీరసంలోనూ ఒక మహాసంతోషకరమైన విషయం భౌడెన్‌కు ఊరట కలిగించింది. రాజుల కులానికి చెందిన వాడపల్లి సుబ్బరాజు క్రీస్తు సువార్తను హత్తుకున్నాడు.

ఇతనిదీ ఆలీసాహేబులాగా పి. పోలవరం గ్రామమే. సువార్తవిని ఇతని మనస్సులో అలజడి రేగింది. ఈలోగా జబ్బుపడి వైద్యంకోసం మిషనెరీల దగ్గర చేరాడు. ఏప్రిల్ నెలలో క్రీస్తుకు తన జీవితాన్ని సమర్పించాలన్న తీర్మానానికి వచ్చాడు. బౌడెన్ పరిచర్యవల్ల, విశ్వాసుల ప్రార్థనలవల్ల స్వస్థతపొంది తన గ్రామానికి తిరిగివెళ్ళాడు.

తక్కువకులంవాళ్ళ మతంలో చేరినందుకు ఇతనికెదురైన తిరస్కారాలు చెప్పనలవికాదు. రాజులు ఇతన్ని ద్వేషించడమేకాక ఇతని పొలంలో పని చెయ్యడానికి కూలీలు దొరక్కుండాచేసారు. తక్కువకులాలవాళ్ళు కూడా రాజులతో చేరి సుబ్బరాజును దూషించారు. అయితే బొర్తల వెంకయ్య అనే పాలేరు అతని కుటుంబం ఇతనికి బాసటగా నిలిచి సమయానికి వ్యవసాయపు పనులన్నీ జరిగిపోయేలా తోడ్పడ్డారు. ఇతను తన స్థలంలో ఒక పాక వేయించి ఆ చుట్టుప్రక్కల ప్రాంతాల్లో సువార్త సేవకోసం వచ్చిన దైవసేవకులు అందులో ఉండేలా సదుపాయం ఏర్పరిచాడు.

1859 డిసెంబరునెలలో మచిలీపట్నం, రాజమండ్రి జిల్లాలు ఏర్పాటు చెయ్యడం జరిగింది. వీటితోబాటు గోదావరిజిల్లా ఏర్పాటయింది. పశ్చిమ డెల్టాకు ప్రధాన కేంద్రం అయిన నర్సాపురం లో రెవెన్యూ అధికారులుగా విశ్వాసులైన కెప్టెన్ ప్రీస్ట్లీ, మాస్టర్స్ అనే ఇద్దరు నియమించబడ్డారు. వీరి దగ్గర పనిచేసే బ్రాహ్మణ గుమాస్తాలు కొందరు సువార్త మీటింగులకు వస్తూ ఉండేవారు.

ఇలా ఉండగా 1860 మార్చి 4 ఆదివారం మద్రాసులో అరుంప్పన్ అధ్వర్యంలో గొప్ప ఉజ్జీవం జరిగింది. తిరునల్వేలి, తిరువాన్కూరుదాకా సి.యం.ఎస్ చర్చిల్లో దేవుని ఆత్మ బలంగా పనిచేసింది. ఈ వార్తలు వింటున్న మన గోదావరి మిషనెరీల హృదయాలు ఆనందంతో తలమునక లయ్యాయి.

నర్సాపురంలో బీరు సతీమణి నడుపుతున్న రెండు స్కూళ్ళలో అప్పటికి 130మంది చదువుకుంటున్నారు. 1861లో నర్సాపురంలో వచ్చిన ఉజ్జీవం ముఖ్యంగా బ్రాహ్మణకులంవారిలో ఎక్కువ ప్రభావం చూపింది. ఈ కాలంలో పురుషోత్తం చౌధరి ఈ ప్రాంతాన్ని దర్శించాడు. పాలకొల్లు సంతలో ప్రసంగించి, నర్సాపురంలో రైతులంతా జమాబందీకని గుమికూడిన సమయంలో ఇక్కడికి వచ్చాడు. ఆరుబయట ఈ రెండు రోజుల్లోను 5సార్లు మాట్లాడాడు. ఆదివారంనాడు నర్సాపురం క్రీస్తు సంఘంతోకలిసి దైవారాధనలో పాల్గొనే అవకాశం కలిగింది పురుషోత్తం చౌధరికి. విశాఖపట్నం సంఘాన్ని విడిచి 200మైళ్ళు ఈయన చేసిన ప్రయాణంలో కనిపించిన క్రైస్తవసంఘం ఇక్కడే. ఈ ప్రాంతాలను దర్శించినప్పుడు పురుషోత్తంగారు చదలవాడ ఫోస్సిన్‌గారింట్లో మకాం ఉండేవారు. ఫోస్సిన్‌గారి సతీమణి యానమ్మగారు గృహిణిగా ఎంతో ఆదరంగా పరిచర్యలు చేసేది. ఈమె పాలూరి మోషేగారి సోదరి. పాలకొల్లు సంఘ అధ్యక్షులుగా ఉంటున్న జోబ్‌మోజెస్‌గారి తండ్రే ఈ మోషేగారు.

ఈ రోజుల్లో హీలిస్‌గారు విరామం లేకుండా బ్రాహ్మణులతో కూర్చుని క్రీస్తు రక్షణలోని శ్రేష్టత్వాన్ని గురించి వారితో వాదిస్తూ వచ్చాడు.

1861లో చౌధరి పురుషోత్తం రాక నర్సాపురంలోని స్కూలులో జరిగేసేవ, ఇక్కడి హైందవ బ్రాహ్మణ సంప్రదాయంపై పెద్దపెట్టున దెబ్బ తీసింది.

జాన్ విలియం బీరు ఇంగ్లండులో తన చదువు ముగించుకుని ఇండియా తిరిగి వచ్చాడు. బెంగాలులో ఒక పెద్ద స్కూలు ఆధిపత్యం తీసుకొమ్మని ఇతనికి ఆహ్వానం వచ్చింది. ఇది మంచి జీతం, మంచి అవకాశం. కాని ఈ సమయంలోనే ఇతను ప్రభువును రక్షకునిగా స్వీకరించి తన

తండ్రి జార్జి బీరు ప్రారంభించిన పనిని కొనసాగించడమే తన ప్రథమ కర్తవ్యంగా భావించి నర్సాపురం వచ్చేసాడు. ఇర్మియా 45:5 లోని "నీ నిమిత్తము నీవు గొప్ప వాటిని వెదుకుచున్నావా? వెదుకవద్దు" అనే వాక్యంద్వారా దేవుడతనితో మాట్లాడాడు.తన 18వ యేట నర్సాపురంలో అగ్రకులాల పిల్లలకు ఇంగ్లీషు స్కూలు ప్రారంభించాడు. ఈ స్కూలులో ఎంతోమంది యువకులు క్రీస్తు సువార్తను నమ్మి హిందూమతాన్ని వదిలేసారు.

* * *

బౌడెన్ సతీమణి ఆరోగ్యం మళ్ళీ క్షీణించడంతో బెంగుళూరు పంపించవలసివచ్చింది. ఆమె అక్కడే ఉండిపోవలసిన అవసరం కనిపించింది. ఈ ప్రయాణానికిముందే హీలిస్ మిసెస్ హెలీనాకౌలింగ్‌ను పెళ్ళిచేసుకుని బీరు సతీమణి ఉంటున్న బంగళా పక్కనే మరొక బంగళాలో (లాడ్జి) స్థిరపడ్డాడు. జీవితాంతం హీలిస్ ఈఇంట్లోనే నివాసం చేసాడు. 1864కల్లా బౌడెన్ దంపతులు దేవుని దయవల్ల పాలకొల్లు తిరిగి వచ్చేసారు.

ఇది జరిగిన కొద్ది దినాలకే మచిలీపట్నంలో 30వేలమందిని పొట్టన బెట్టుకున్న తుఫాను ఆ పట్టణాన్ని తాకింది. వెంటనే హీలిస్ అక్కడికి ప్రయాణం కట్టాడు. తరువాత ఈ హృదయ విదారక దృశ్యాలను చూసిన నోబుల్‌గారు సంవత్సరం తిరక్కుండానే చనిపోయారు. త్వరలోనే షార్కీగారుకూడా ప్రభువు సన్నిధికి నోబుల్‌గారిని అనుసరించారు.

1865 క్రొత్తయేడు పండగ రోజున ముగ్గురికీ, 9వ తేదీన నూర్తేరులో మరొకరికీ బాప్తిస్మాలివ్వడం జరిగింది. మొదటి గ్రామీణ సంఘం ఇక్కడ స్థాపించడం బౌడెన్‌కు చిరస్మరణీయమైన సందర్భం.

ఆ ఎండాకాలంలో కలరా మళ్ళీ విజృంభించింది. పాలకొల్లు పరిసరాల్లో ఇది సృష్టించిన భయోత్పాతం పురపురానిది. ఊరంతా పాడుబడిపోయింది. నక్కలు పట్టపగలే ఊరి వీధుల్లో తిరుగాడుతూ ఉండేవి. క్రైస్తవుల్లోమాత్రం ఎనిమిదేళ్ళ బాలిక తప్ప అందరూ మృత్యువునుండి తప్పించుకున్నారు.

నర్సాపురం స్కూలు విద్యార్థి రావి వెంకటస్వామి అంతకుముందు సువార్త విన్నప్పటికీ విధేయత చూపించకుండా ఉన్నవాడు ఇప్పుడు మన సహోదరుల చెంతకి వచ్చి ఉపదేశాన్నిపొంది క్రైస్తవుడయ్యాడు. ఏప్రిల్ నెలలో ఇతని బాప్తిస్మం ఆగర్తిపాలెం సంఘానికి పునాది. 1867, 68 ప్రాంతాల్లో కోరుమిల్లి, ఆరవల్లి గ్రామీణ సంఘాల స్థాపన జరిగింది. అంతకుముందు కాలంలో పాలకొల్లులో, రామేశ్వరం తీర్థంలో విత్తబడిన వాక్య ఫలితాలు 1860–70 కాలంలో కనిపించాయి. 1859లో ఆరవల్లి, కొండేపాడు గ్రామస్తులు కొందరు పాలకొల్లులో వాక్యం విన్న ఫలితంగా తమ స్వగ్రామంలో ప్రతి ఆదివారం సంఘంగా కూడుకునేవారు. వీరంతా చదవడం రానివారు. వారి దేవత గుడి మంటపాన్నే ప్రార్థనాలయంగా మార్చుకున్నారు. ఇక్కడ ఆలీసాహేబు, బౌడెన్‌లు వాక్య పరిచర్య చేసారు. తిరుపతిపాడు చుట్టుప్రక్కలఉన్న కొండేపాడు, కోరుమిల్లి, ఒరిగేడు, చిలుకంపాడు గ్రామాల్లో చాలామంది వాక్యం విని ముందుకి వచ్చారు. కొండేపాడులో తుంపిరి మాతయ్య ప్రధానుడు.

ఆలీసాహేబు, జేమ్సు, ఫ్రాన్సిస్ గ్రామాల్లో తిరిగి సువార్త వ్యాప్తికి ఎంతో కృషి చేసారు. అగ్రకులస్థులు వోసారి జేమ్సును కొట్టడానికి వస్తే ఉండ్రాజవరపు మారయ్యా అనే అతను అడ్డుపడి ఆ దెబ్బలన్నీ తిని స్పృహతప్పి పడిపోయాడు. ఆ తరువాత జేమ్సునుకూడా బాగా కొట్టారు. తనను కొడుతున్న వాళ్ళకోసం జేమ్సు తీవ్రంగా ప్రార్థించి క్రీస్తు లక్షణాన్ని వాళ్ళమధ్య కనపరిచాడు. టి. పేతురుగారి కుమారుడైన ఈ జేమ్సుగారు ప్రస్తుతం పాలకొల్లు సంఘ అధ్యక్షులైన స్పర్జన్ పీటర్‌సన్‌గారి ముత్తాతగారు.

1868లో మద్దూరు, వేలివెన్ను సంఘాలుకూడా స్థాపించడం జరిగింది. ముప్పిడి యాకోబుగారి తల్లిదండ్రులు మొదట విశ్వసించడం ద్వారా మద్దూరు సంఘం స్థాపించబడి అటు తరువాత వాడపల్లిసంఘంలో కలిసిపోయింది. వేలివెన్నులో దుద్దే బ్రహ్మయ్య లేక నోవా ఎన్నదగినవాడు. ఇతను విగ్రహారాధికుడు, పూజారి. ఇతని తల్లికి పూనకాలు. 1867లో నత్తా రామేశ్వరం ఉత్సవంలో బౌడెన్‌ద్వారా సువార్త విన్నాడితను. కొంతకాలం తరువాత ఆలీసాహేబు వేలివెన్నులో ఎవరికో వైద్యం చెయ్యడానికి వెళ్ళి

అక్కడివారందరికీ సువార్త వినిపించాడు. ఇది బ్రహ్మయ్య హృదయంలో బలంగా పనిచేసింది. ఆపైన ఇతను చేసిన మొదటి పని ఏమంటే తన ఇంట్లో నిర్మించిన చిన్న గుడిని పగలగొట్టమని ఆలీసాహేబు చేతిలో ఒక గడ్డపలుగు ఉంచడం. అందులోని పరికారాలను ధ్వంసం చేయించి, తన ఇంట్లోని హిందూమతానికి సంబంధించిన వాటన్నిటినీ బయటపారేసి, తన తల్లిని ఒప్పించి, ఆమెకున్న జడలుపట్టిన జుట్టు కత్తిరింపించి క్రైస్తవ భక్తిగీతాలు సాధన చెయ్యడంలోను, అందరికీ క్రీస్తును గురించి చెప్పడంలోనూ ప్రయాస పడ్డాడు. ఆ యేడు రామేశ్వరం తీర్థంలో బ్రహ్మయ్య సాక్ష్యం బహుశా ఇదివరకెన్నడూ ఎవరూ విని ఉండరు. బౌడెన్, హీలీన్, ఆలీసాహేబు, జేమ్సు, ఫ్రాన్సిస్ మొదలైనవారంతా సువార్త వినిపిస్తూ ఉండగా బ్రహ్మయ్యలేచి కూడివచ్చిన ప్రజలతో "నేను పోయినేడు ఈ తీర్థానికివచ్చి ఇక్కడి బొమ్మలకు మొక్కినవాణ్ణి. ఈ సంవత్సరం అయితే పాపవిమోచకుడైన ఒక్కడే రక్షకుణ్ణి తెలుసుకుని ఆనందభరితుడిగా వచ్చాను" అని చెప్పాడు.

ఆ యేడే వేల్పూరులోని మొదటి దాసర్ల యువకుడికి బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. బౌడెన్ నడిపే పాటశాలలో చదువుకున్న చిన్నయ్య క్రైస్తవుడుగా మారి 1868లో వేల్పూరులో రాత్రి పాటశాలను స్థాపించి తననుతాను క్రైస్తవుడుగా బహిరంగంగా ప్రకటించుకున్నాడు. అందుకు ఇతన్ని తోటివాళ్ళు హింసించి, దొంగ నేరాలు మోపి పోలీసులకు అప్పగించారు. ఇతని బాప్తిస్మం తరువాత చాలామంది అతని జాతివారు క్రైస్తవులయ్యారు. ఆటుతరువాత 1870లో లూథరన్ మిషనెరీ హయర్ అక్కడికి వెళ్ళి బాప్తిస్మాలు ఇచ్చి వేల్పూరు లూథరన్ సంఘం స్థాపించారు.

ఆగర్తిపాలెం రావి వెంకటస్వామి బావగారైన విసుకుపాటి వెంకటస్వామి కూడా క్రీస్తు రక్షణ శక్తిని అనుభవించి సువార్త ప్రచారకునిగా మారాడు. ఇతను మంత్రగాడు. మంత్రాలు వేసి జబ్బులు పోగొడుతూ చాలా ధనం ఆర్జించేవాడు. ఆ తరువాతి కాలంలో పశ్చిమగోదావరిలో స్థాపించబడిన సంఘాలన్నిటినీ రాయాలంటే చోటు చాలదు. ఫ్రాన్సిస్‌మూలంగా క్రీస్తులోకి వచ్చిన మండపాక వాస్తవ్యుడు చెదలవాడ రామయ్య సాక్ష్యం గొప్పది. ఇతని కుటుంబం చాలాయేళ్ళు మిషనెరీలకు సహాయకులుగా ఉంటూ వచ్చారు.

ఇదే సమయంలో తూర్పుగోదావరిలో జరుగుతున్న ఆత్మల యుద్ధంలో క్రీస్తు పక్షాన పోరాడుతున్న యోధుడు గొల్లపల్లి నథానియేలు. తెలుగు సువార్తీకరణ చరిత్రలోకెల్లా మహా ఘనుడు. ఇతను మురమండకి చెందిన బళ్ళ సుబ్బన్న లేక ఫ్రాన్సిస్ మూలంగా క్రైస్తవుడైనందువల్ల బౌడెన్‌కు ఆత్మీయ మనవడన్నమాట.

ఇదెలా జరిగిందంటే బళ్ళ సుబ్బన్న లేక ఫ్రాన్సిస్ ధవిళేశ్వరంలో వాక్యం విని రెండేళ్ళు పాలకొల్లులో బౌడెన్‌తో కలిసిఉండి తిరిగి తన స్వగ్రామానికి వచ్చేసి కూలివాళ్ళను సరఫరాచేసే కాంట్రాక్టరుగా ఉంటూ క్రైస్తవ సాక్ష్యాన్ని అక్కడివాళ్ళతో పంచుకుంటూ ఉన్నాడు. ఇతని కొడుకు చనిపోతే ఆ పిల్లవాడిని ఫ్రాన్సిస్ విచారంగా పాతిపెడుతుండగా అతని దగ్గర పనిచేస్తున్న అప్పయ్య అనే యువకుడు వచ్చి "తగలబెట్టడానికి బదులు పాతిపెడుతున్నారేమిటి" అని అడిగాడు. అందుకు ఫ్రాన్సిస్ క్రైస్తవుడిగా తనకున్న పునరుత్థాన నిరీక్షణ ప్రకారం అలా చేస్తున్నానని జవాబిచ్చి, సద్బోధకోసం అతన్ని పాలకొల్లు పంపించాడు. అప్పటికి బౌడెన్ బెంగుళూరులో ఉండడంతో అప్పయ్య నర్సాపురం వచ్చి హీలిస్‌తో మాట్లాడి సువార్త సువిశేషాలు తెలుసుకున్నాడు. మారుమనస్సుపొంది అప్పయ్య తన పేరును నథానియేలుగా మార్చుకున్నాడు. ప్రతి ఆదివారం మురమండ నుంచి ఇరవై మైళ్ళు నడిచి రాజమండ్రి వెళ్ళి క్రైస్తవారాధనలో పాలుపంచుకునేవాడు.

అసలు వీరిది బొబ్బిలి సమీపంలోని గొల్లపల్లి. వీరి తండ్రి పేరు వీరనాయక్. నిష్ఠగల హిందువు అయిన ఈ వీరనాయక్ ధవిళేశ్వరం ఆనకట్ట కూలీలంతా పనిజేస్తుంటే గొంతెత్తి పల్లెసదాలు పాడి వారికి వినోదం కలిగిస్తూ ఉండేవాడు. కాటన్ సతి ఇతన్ని పిలిపించుకొని పాటలు పాడించుకునేదట. అప్పటికి అప్పయ్య (నతానియేలు) వయసు 16 ఏళ్ళు. పుట్టినది 1839లో. 1864లో బాప్తిస్మం తీసుకొని నతానియేలుగా పేరు మార్చుకున్నాడు. రాజమండ్రిలో పనిచేస్తున్న గ్రోయునింగ్ అనే మిషనెరీ ఇతనికి బాప్తిస్మం ఇచ్చి నీ స్వజనం మధ్యనే సేవ చెయ్యమని ఉపదేశించి పంపారు.

ఇతను క్రైస్తవుడైనందుకు తండ్రి ఇంట్లోంచి తరిమెయ్యగా

కాలేరువెళ్ళి అప్పగారింట్లో ఉన్నాడు. ఆ రాత్రే తనకు కష్టాలు రానున్నాయని కలలో హెచ్చరిక పొంది "దినదినమునకు దిక్కు నీవే నా దేవుడా—మనుష్యు కనిపెట్టి కాపాడనెపుడు కర్తనీవే" అనే గీతాన్ని రచించాడు. త్వరలోనే ఇతని జీవితాన్ని దుర్భరం చేసేసారు ఆ గ్రామస్థులు. తప్పుడునేరంమోపి బొండలో బిగించారు. ఆ తరువాత చేతికి బేడీలువేసి జైల్లో వేయించారు. ఇక్కడ మరో ప్రఖ్యాత గీతాన్ని రాసాడు నథానియేలు: "యేసుక్రీస్తుని గొల్వరన్న యే జగతిలోను యెవ్వరులేరు వానికన్న". ఇలా ఇతననుభవించిన కష్టాల మథనంలోనుండి గీతామృతాలు పుట్టినాయి.

ఇతని ప్రయాసల మూలంగా కొన్ని ఆత్మలను దేవునికిచ్చాడు. అయితే వాళ్ళకి బాప్తిస్మం ఎలా ఇవ్వాలో నథానియేలుకు తెలియలేదు. ఈలోగా మురమండకు లూథరన్ పాస్టరు ఒకాయన వచ్చి పాఠశాల స్థాపించాడు. ఫ్రాన్సిస్ తదితరులకు ఆయనకు బాప్తిస్మం పద్ధతి గురించి వివాదం వచ్చింది. చిలకరింపు బాప్తిస్మాన్ని వీరు ఒప్పుకోలేదు. కాబట్టి కొందరు పాలకొల్లు, నర్సాపురం వెళ్ళి, బౌడెన్, హీలిస్, జాన్‌బీర్‌లను కలిసి మాట్లాడి లేఖనాల సహాయంతో సందేహ నివృత్తి చేసుకున్నారు. బౌడెన్‌ను నథానియేలు చూడడం ఇదే మొదటిసారి. ఈ విధంగా మునుచడం బాప్తిస్మం వాక్యానుసారమని గ్రహించిన నథానియేలు, మురమండలో లూథరన్ పాటశాలలో టీచరుగా పనిచేస్తున్న యం. ఫిలిప్పు వీరి కుటుంబాలు 1866లో బౌడెన్‌చే కాకినాడలో బాప్తిస్మం పొందారు. అటు తరువాత ఫ్రాన్సిస్ (బళ్ళ సుబ్బన్న) ఇతని కుమార్తె. ఇంకా నథానియేలుద్వారా ప్రభువునెరిగిన అనేకమందికి బాప్తిస్మాలివ్వడం జరిగింది.

అలానే 1865 ఆగస్టులో ఒక కన్మ స్త్రీ కె. రాహేలమ్మతో సహా ఆరుగురికి మురమండలో బాప్తిస్మాలివ్వడం జరిగింది. ఈమెను పినతల్లి గారింట్లోనుండి వెళ్ళగొట్టేస్తే నర్సాపురం తీసుకొచ్చి హీలిస్ సతీమణి సంరక్షణలో ఉంచారు. ఈమె 21 సంవత్సరాలు సేవలోఉండి చనిపోయింది

త్వరలోనే అక్కడ చిన్న స్థలం కొనుక్కుని ప్రార్థనా మందిరం కట్టుకున్నాడు. 80సెంట్ల స్థలం కొనడానికి జార్జిముల్లర్‌ద్వారా ముట్టిన కొంత సొమ్మును బౌడెన్ నథానియేలుకు ఇచ్చాడు.

మురమండలో ఇతని స్నేహితుడు యం. ఫిలిప్సు, ధవళేశ్వరంలో నక్కా థామస్, కాకినాడలో థామస్ గాబ్రియేలు, ఇటు కొలేరులో గొల్లపూడి నథానియేలు ఈ నలుగురూ నాలుగు స్థంభాల్లాగా నిలిచి తూర్పుగోదావరిలో బహుగొప్ప సేవచేసారు. ప్రతి హిందూ ఉత్సవానికీ ఈ నలుగురూవెళ్ళి ప్రవక్తల్లాగా అక్కడి విగ్రహారాధన ప్రజలను హెచ్చరించేవారు. ఈ థామస్ గాబ్రియేలుగారు కాకినాడలో కేనేడియన్ బాప్టిస్టు మిషన్ పనికి వ్యవస్థాపకుడు. విశేషమేమంటే ఈయన నర్సాపురం మిషన్ స్కూల్లోనూ ఈయన భార్య బౌడెన్ సతీమణి నిర్వహించిన స్కూల్లో హేలిస్ సతీమణి ద్వారానూ చదువుకున్నారు. తదనంతరం రాజమండ్రిలో ఉద్యోగం నిమిత్తం వెళ్ళి అక్కడ లూథరన్ సంఘంలో చేరారు. టెలిగ్రాఫ్ డిపార్ట్మెంటులో తన ప్రతిభ కనపరచి ఆ రోజుల్లో అత్యధిక వేతనం 70 రూపాయిలు పుచ్చుకునే స్థాయికి ఎదిగాడు. 1867లో మద్రాసువెళ్ళి దాసు అంతర్వేదిగారి ప్రభావానికిలోనై అక్కడమునుచడం బాప్తిస్మంపొంది బాప్టిస్టులో కలిసాడు. వెనువెంటనే కాకినాడకు బదిలీ అయింది. తన ఖాళీ సమయాల్లో వీధి ప్రసంగాలకు వెళ్లేవాడు. వీరి సేవలో క్రైస్తవులైన వీరి సోదరి హెలీనమ్మ (బౌడెన్గారి స్కూల్లో చదువుకున్నది) ఆమె భర్త క్రి సమూయేలు, ఇతని సోదరులు పీటర్, జేకబు మొదలైనవారివల్ల ఆకివీడులో 'కెనేడియన్' బాప్టిస్టువారిసేవకు పునాది పడింది.

తన ఆత్మ తీవ్రతలో గాబ్రియేలు తన ఉద్యోగానికి రాజీనామాచేసి పెన్షన్ వగైరాలను వదులుకుని 1870లో స్ట్రిక్టు బాప్టిస్టులవల్ల అభిషేకంపొంది ఎంతోమంది రక్షణకు కారకుడయ్యాడు. ఆర్థిక ఇబ్బందులవల్ల ఇంగ్లండు స్ట్రిక్టు బాప్టిస్టులను ఆ సేవ తీసుకొమ్మని అడగగా వారు నిరాకరించారు. అందువల్ల కెనేడియన్ బాప్టిస్టువారిని కోరగా అంగీకరించి 1874 మార్చిలో మెక్లారిను దంపతులను ఆ ఫీల్డు వ్యవహారాలు చూసుకునేందుకు పంపారు. అదే సమయంలో కాకినాడలోఉన్న ఇ.యస్. బౌడెన్ దంపతులు మన జి.డి.యం సంఘ అధ్యక్షులుగాఉంటూ వీరికి ఆతిథ్యంఇచ్చి సేవలో స్థిరపడేందుకు సహాయంచేసారు. 1870నుండి అక్కడ ఉంటున్న ఇ.యస్. బౌడెన్ కలకత్తాకు తరలిపోగా కాకినాడ ప్రాంతమంతా కెనేడియన్ బాప్టిసు వారి సేవ వ్యాపించింది. మెక్లారిన్

వచ్చి సంవత్సరమైనా తిరగకుండా 1875 జనవరి ఒకటవ తేదీన థామస్ గాబ్రియేలు కన్నుమూసాడు.

నథానియేలుగురించి ఇలా హీలిస్‌గారు రాసారు. “నథానియేలు ఊటలాంటి వాడు. జీవజలం అతనిలోనుండి ఎడతెగక ప్రవహిస్తూఉంది. అతని మనస్సంతా క్రీస్తే. ఆ సంపూర్ణతలోనుండే అతని నోటిమాటలు వెలువడుతాయి”. ఇతని గురించి వర్ణించడానికి ఇక్కడ స్థలం సరిపోదు. అంతంవరకు నమ్మకంగా పనిచేసి 1914 ఏప్రిల్ నెలలో తన బహుమానాన్ని అందుకోవడానికి తరలిపోయాడీధన్యజీవి. తెలుగుభాష ఉన్నంతకాలం దానికి అలంకారాలుగా విలసిల్లే భక్తిగీతాలను తెలుగు క్రైస్తవులకు వారసత్వంగా వదిలి వెళ్ళిపోయాడు.

1866 మార్చి 19వ తేదీన కాకినాడ జి.డి.యం. మిషను ప్రార్థనాలయంలో ఇ.యస్. బౌడెన్‌గారు ఇండియన్ క్రిష్టియన్ ఆక్టు ననుసరించి మొట్టమొదటి క్రైస్తవ వివాహం జరిగించారు.

సంఘాల స్థాపన గురించి మరికొన్ని వివరాలు. 1869లో తణుకుకు చెందిన మార్లపూడి వీరయ్య తదితరులు బాప్తిస్మం పొందినందువల్ల అక్కడోసంఘం వెలిసింది. ఆకాలంలోనే చెట్టిఎలీషాగారి తాతగారైన చెట్టి గాబ్రియేలు, ఇతని భార్య మరియమ్మ బాప్తిస్మం తీసుకున్నందువల్ల చెట్టిపేట సంఘం స్థాపించబడింది. అడివి చిక్కాలలో ఒరిగేటి పేతురు (పద్దయ్య) ఈయన కుమారుడు ఇస్సాకు మొదలైనవారు హీలిస్‌గారి బోధవల్ల రక్షించబడినందువల్ల అక్కడ సంఘం ఏర్పడింది. ఇలా చిన్నతనంలోనే బాప్తిస్మంపొందిన ఇస్సాకును హీలిస్ నర్సాపురం తీసుకొచ్చి వడ్రంగం నేర్పిస్తూ సువార్తకు వెంటతిప్పుతుండేవారు. ఫ్రాన్సిస్‌గారి కుమార్తె మిరియమ్మను ఈయనకిచ్చి పెండ్లిచేసారు. ఇస్సాకు మిరియమ్మ గార్ల కుమారుడే ప్రస్తుతం పాలకొల్లు సంఘాధ్యక్షులు ఒ. ఫ్రాన్సిస్‌గారు. 1871లో వీరభద్రపాడు, మండపాక, మోగల్లు, పెరవలి గ్రామాల్లో సంఘస్థాపన జరిగింది. మాలదాసరి చిన్నయ్య బౌడెన్‌గారి స్కూల్లో చదువుకుని 1868లో బాప్తిస్మంపొంది వేల్పూరులో స్థిరపడడం ఇంతకు ముందే తెలుసుకున్నాం. ఇతని కులస్థులంతా మూకుమ్మడిగా మతం మార్చుకుంటామనికోరగా బౌడెన్‌గారు ఒప్పుకోలేదు. క్రొత్తగా జన్మించిన

వారుమాత్రమే సంఘంలో చేరడానికి అర్హులని ఆయన చెప్పినందువల్ల వారంతా రాజమండ్రి యు.ఎల్.సి.యం. మిషనెరీ హ్యాయర్‌గారికి అర్జీ పెట్టుకున్నందువల్ల ఆయన స్వయంగా 25 మందికి బాప్తిస్మాలిచ్చి అక్కడ లూథరన్ సంఘం స్థాపించారు. ఈ విధంగా మాలలు లూథరన్ మిషన్‌లో చేరినందువల్ల బౌడెన్‌హీలిస్‌లు మాదిగల మధ్య సేవను ప్రారంభించారు. తిరుగుడు మెట్టకు చెందిన చదలవాడ దానియేలు వీరభద్రపాడులో స్థిరనివాసం ఏర్పరచుకుని సేవ చేసారు. 1871లో ఉందుర్తి చెల్లమ్మ, ఆమె కుమారులు యోహాను, యాకోబు, కోడలు కరుణమ్మ, ఉందుర్తి మోషే, మల్లిపూడి సుబ్బమ్మ, మల్లిపూడి పేతురు మల్లిపూడి పెంటయ్య, జాలమ్మ అనేవారు హీలిస్‌చే బాప్తిస్మం పొందారు. ఆ సంవత్సరమే మండపాక లో ప్రథమఫలాలుగా చెదలవాడ రామయ్య ఆయన భార్య జాల్యమ్మ రక్షణ పొందారు. వీరిద్దరూ కె. ఒబేదుగారి తాత, అమ్మమ్మలు. ఈ రామయ్యగారు మొట్టమొదట ఫౌన్సిన్‌గారిద్వారా సువార్త విన్నాడు. హీలిస్‌తో సేవలో పాల్గొంటూ, మిగతాసమయంలోచదువుకుంటు ఉండేవారు. 1873 నవంబరు 6న హీలిస్ సతి దగ్గర ఉండగా మహానందంతో మోక్షభాగ్యాన్ని పొందాడు.

ఆటు తరువాత 1878 మే 12న మల్లిపూడి రామస్వామికి, 1879 జనవరి 14న పెంటయ్య, సూరయ్య, గురవయ్య, వెంకట్రామయ్య అనే నలుగురు అన్నదమ్ములకీ ఇ.యస్. బౌడెన్ బాప్తిస్మం ఇచ్చాడు. వేల్పూరులో బౌడెన్‌గారు 40–12 గజాల స్థలాన్ని అంతకుముందేకొని ఉన్నాడు. నిరుపయోగంగా పడిఉన్న ఆ స్థలాన్ని అమ్మి ఆ డబ్బుతో వీరభద్రపాడులో ఆలయనిర్మాణం జరిగించారు. మొదటిగా రక్షించబడి 8 కుటుంబాలకు బౌడెన్ కొంత స్థలాన్ని ఇచ్చినందువల్ల వారంతా ఇళ్ళు కట్టుకుని చిన్న క్రిష్టియన్‌పేటగా రూపొందారు. స్థానిక సంఘకాపరిగా చాలా యేళ్ళు పనిచేసిన మల్లిపూడి పేతురుగారు ఉండ్రాజవరం, రామేశ్వరం తీర్థాలో సువార్త ప్రకటించేవారు. అంతేగాక కాకిలేరు, మడుగుపోలవరం మొదలైన గ్రామాలపట్ల శ్రద్ధవహించారు.* 1879లో కోరుమామిడి, కురియాల గూడెం ఇంకా తక్కెళ్ళపాడుదాకా సంఘాలు వెలిసినాయి. అలానే

---

* శతవార్షికోత్సవము వీరభద్రపురము 1871–1971.

అత్తిలిలో, 1889లో ఖండవల్లిలో సంఘాలు కట డం
873లో ప్రత్తిపాడుకు చెందిన కొడమంచిలి పీరాస్వామి
1877లో తోలేరులో కొందరు విశ్వాసులు, 1878లో
కొందరు క్రీస్తులో విశ్వసించి బాప్తిస్మం పొందడంవల్ల
గాలు లేచినాయి.*1

పురానికి ఎదురుగా నది అవతలనున్న ప్రాంతం అంతర్వేదిదాకా
గారిమూలంగా క్రీస్తువెలుగు ప్రసరించింది.*2 ఈయన 1826
డు. పేర వోగూరి పుల్లయ్య అంతర్వేదిపాలెం గ్రామ కరణం
కేరుగా పనిచేసేవాడు. ఉయ్యూరివారి మెరకనున్న గంటావారి
గంగమ్మను వివాహమాడాడు. కరణం కొలువుతో అసంతృప్తి
య్య ఎవరితో చెప్పకుండా రంగూన్‌కు వోడకేవు (కాకినాడ
గాన్‌కు 9 రూపాయలు) సంపాదించుకుని రంగూన్ వెళ్ళి
క్కడ పనిచేసుకునే కాలంలో ఒక అమెరికన్ బాప్టిస్టు మిషనెరీ
వివి 1868 జనవరి 15న మారుమనస్సు పొంది మార్చి
స్మం పుచ్చుకున్నాడు. మరుసటి నెలలోనే ఇండియా తిరిగి
తన పేరును పౌలుగా మార్చుకుని మారిన తన జీవితాన్ని,
సూ అందరియెడలా కనపరుస్తూ ఉంటే తోటివారంతా పౌలును
తగా చెప్పుకునేవారట. భార్యచేతగూడా విగ్రహారాధన మొదలైన
మాన్పించి క్రీస్తులోకి నడిపించాడు. మాలకులానికి చెందిన ఈ
లు కొందరు మాదిగమతం అవలంబించాడని కోపంతో ఒకసారి
ఊళ్ళోలేని సమయంలో పౌలును దొమ్మిగా పట్టుకుని చెట్టుకు
ర్టారట. అందుకు పౌలు యేసు శిలువమీద నాకొరకు ఇంతకంటే
పొందాడు అని సాక్ష్యమిస్తూ విరిగి పడిపోయిన కర్రను మళ్ళీ
ట్టినవారి చేతికిస్తూ 'నన్ను ఇంకా కొట్టండి అడ్డు చెప్పను'
ంతంగా అన్నాడు. కొట్టినప్పుడల్లా యేసుప్రభువుకు స్తోత్రం
ంగమ్మ పుట్టింటికివెళ్తే మాదిగమతస్తురాలా అని నారు ఆమెను
వెళ్ళగొట్టి ఆమె నడిచినంతమేరా పేడ కళ్ళాపి చల్లుకున్నారు.

1 డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర' పి. జోనాగారి పుస్తకంలోనుంచి
2 పాలెం సంఘ శతవార్షిక చరిత్ర, సెంట్ పాల్ న్యూ చర్చి రజతోత్సవం
చరిత్ర — బి. పి. సమూయేలు 1972.

పెద్దకరణం తిరిగివచ్చి ప్రజలు పౌలును కొటినవైనం విని ఎంతో నొచ్చుకుని తన పొలం అంతటిపైదా అతన్ని నియమిస్తూ అతని పోషణకు కావలసినదంతా తన పొలంలోనుండి తీసుకొమ్మని అడిగితే, తాను దేవుని సేవలో ఉండడం దేవుని చిత్తమనీ, తన పోషణను దేవుడే చూసుకుంటాడనీ బహు వినయంతో జవాబిచ్చాడు. కరణం బొల్లాప్రగడ వెంకట పెద నర్సింహంగారు అతనిలోని సహనం, యేసుపై అతనికున్న అచంచల విశ్వాసాన్ని చూసి అబ్బురపడ్డారట.

క్రమేపీ పౌలుగారి ప్రవర్తన క్రైస్తవసాక్ష్యం ఊళ్ళోవారందరినీ ఆకట్టుకుంది. ఒకసారి కరణంగారి గేదె చనిపోయేస్థితిలో ఉండగా పౌలు ప్రార్థన చెయ్యగానే అది లేచి నిలబడింది. అప్పటినుండి, కరణాల ఇంటి ఆడవారు, మగవారు, పౌలుగారినిచూస్తే దండం పెట్టేవారట. గ్రామ ప్రజలంతా తమ ఇంటికి పిలిపించుకుని ప్రార్థన చేయించుకునేవారట. నర్సాపురంలో చార్లెస్ బీరు మొదలైనవారి సహవాసంలో బైబిలు శిక్షణ పొంది 1870 నుండి సంపూర్ణ సువార్తసేవలో ప్రవేశించి విరామం లేకుండా, ఆరోగ్యాన్ని లెక్కజెయ్యకుండా శ్రమించారు. ప్రతి ఆదివారం నర్సాపురంవెళ్తూఉంటే దారిలో సఖినేటిపల్లి రాజులు, కాపులు ఎన్నో కష్టాలు పెట్టేవారు. దారిలో అగ్రకులస్థులెవరన్నాఉంటే నిమ్నజాతులవారెవరూ ఆటుగా వెళ్ళకూడదు. ఫర్లాంగుదూరం చుట్టూ తిరిగి వెళ్ళాలి. ఈ కట్టు బాటును పౌలు మీరాడని బాసినిసెట్టి నాగన్న అనే గ్రామాధికారి బాగా దళసరి కర్రలో గొడ్డును బాదినట్టు బాదాడట. కేసు పెట్టడానికి పౌలు గారు ఒప్పుకోకపోయినా చార్లెస్‌బీరు పోలీసులకు రిపోర్టుచేస్తే గ్రామాధికారి ఇంకెప్పుడూ ఈ పని చెయ్యనని క్షమాపణ చెప్పుకున్నాడట.

అనేకమైన దెబ్బలు, గాయాలు హింస సహించాడీ ధన్యజీవి. ఆ సమయంలోనే పెద్ద భూస్వామి కొల్లాబత్తుల పెంటయ్య అతని కుటుంబం పౌలుగారి సాక్ష్యం వల్ల క్రైస్తవులైనారు. ఇతని భార్య పల్లమ్మగారే దీన్లో ప్రముఖపాత్ర వహించారు. ఊరివాళ్ళు ఈ కుటుంబాన్ని వెలివేసి పొలం పనులు జరగనీయకుండా, దుకాణాలు, నీరు మొదలైన సదుపాయాలన్నీ నిషేధించినప్పటికి, హీలీస్, బీరుగార్ల అండదండలవల్ల అంతర్వేదిపాలెంలో

ఈ విశ్వాసులు స్థిరంగా నిలబడ్డారు. ఈ విధంగా 1873 జనవరిలో పల్లమ్మ ఏప్రిల్‌లో సత్తియ్య (సత్యానందం), గంగయ్య (సంసోను), పెంటయ్యగార్లు హీలీస్‌గారిద్వారా బాప్తిస్మం పొందారు.ఫిబ్రవరి నెలలో అక్కడ స్కూలు స్థాపించబడింది. ఇక్కడ పాలపర్తి చార్లెస్‌గారు, బుడితి రామస్వామి గారు, సంధి లక్ష్మీనరసయ్యగారు పనిచేసారు. అంతర్వేదిపాలెం సంఘం 1872 డిసెంబరు 31న స్థాపితమైంది.

# 10

# క్రొత్త నీరు

తన తండ్రిలో ఉరకలువేసే అపారమైన దేహదారుఢ్యం, తన తల్లిదండ్రులు తెలుగు భాషను అభ్యసించిన పట్టుదలలోని నైపుణ్యం జాన్ బీరులో పదహారణాలా మూర్తీభవించినాయి. తెలుగు భాష మాట్లాడ్డంలోను రాయడంలోను ఈయన ప్రతిజ్ఞ అపారం. ఈయన యాజమాన్యంలో నర్సాపురం మిషన్ స్కూలు త్వరితంగా అభివృద్ధి చెందింది. ఈ స్కూలు నిర్వహణకు పునాది బైబిలు గ్రంథమే. ప్రతిదినం ప్రారంభ ప్రార్థనకు బయట నడచి వెళ్ళేవారు కూడా వరండాలో గుమికూడి ఆయన తేట తెలుగులో చేసే బైబిలు వ్యాఖ్యానాలను ఆశతో వినేవారట.

1866లో దుమ్ముగూడెంలో మార్గరెట్ ఏనీ మిడ్ ఫోర్డు జాన్ బీరుకు సహధర్మచారిణి అయింది. అప్పటిదాకా ఉదకమండలంలో ఉన్న బీరు దంపతుల కడగొట్టు సంతానం చార్లెస్ హెన్రీ బీరు తన అన్నగారిని వచ్చి కలిసాడు. ధవిళేశ్వరంలో పుట్టినది ఈయనే. ఈయన 1866లో తన 17వ ఏట ప్రారంభించి 55 సంవత్సరాలు నర్సాపురంలో సేవ చేసాడు.

1868 ఫిబ్రవరిలో మాతృమూర్తి ధీరవనిత బీరు సతీమణి పదిహేను రోజులు కాయిలా పడి కన్నుమూసింది. ఇంగ్లండులోని బ్రిస్టల్‌లో బౌడెన్ బీరు కుటుంబాలకు వీడ్కోలు ఇచ్చిన రోజుకు సరిగ్గా 33 సంవత్సరాల తరువాత ఈమె యేసు సన్నిధికి తన భర్తను కలుసుకోవడానికి వెళ్ళిపోయింది. ఇంగ్లండు వదిలి నర్సాపురంలో స్థిరపడిన తరువాత ఈ పతివ్రతురాలు ఒక్కసారికూడా స్వదేశానికి వెళ్ళలేదు.

1870లో జాన్ బీరు సాక్షి అనే పత్రికను స్థాపించాడు. 1877లో దీన్నే 'రాయబారి'గా మార్చడం జరిగింది. మన జి.డి.యం. పాటల పుస్తకాన్ని మొదటిసారిగా కూర్చినది జాన్‌బీరే. ఈయన సాహిత్య ప్రతిభను గుర్తించి వీరిని బైబిలు రివిజన్ కమిటీలో నియమించడం జరిగింది. వీటన్నిటికంటే జాన్‌బీరు సమయాన్ని ఎక్కువగా తీసుకున్నది మిషన్ స్కూలే. ఇక్కడ మెట్రిక్యులేషన్ పాసయిన వారెంతోమంది ఉన్నత వేతనాలమీద సర్కారు ఉద్యోగాలకు కుదిరారు. అయితే జాన్‌బీరు మనసులోని ఉద్దేశమేమంటే ఈ స్కూలు అన్నిటికంటే మించి సువార్తీకరణ ఆయుధంగా పనిచెయ్యాలని. ఈ రోజుల్లో జాన్ బీరు, హీలిస్‌లు అనేక సువార్త కరపత్రాలు రచించారు. "ప్రశ్నోత్తరములు" అనే చిన్న పుస్తకాన్ని రచించి,దీన్ని మిషన్ స్కూళ్ళలో పాఠ్యగ్రంథంగా నిర్దేశించి, పిల్లలు బాల్యదశలోనే బైబిలు మూలసూత్రాలను నేర్చుకునేలా పాటుబడ్డాడు జాన్ బీరు.

ఈ స్కూలుద్వారా ఒకరివెంట ఒకరు హైందవ విద్యార్థులు విగ్రహారాధనను అసహ్యించుకుని బాహాటంగా క్రీస్తునంగీకరించారు. వీరిలో చెప్పుకోదగినవాడు జంపా వెంకటస్వామి లేక వెంకటాచలం. ఈ స్కూల్లో మెట్రిక్ చదివి చెన్నపురి పరీక్ష పాస్ అయిన వాళ్ళకి మంచి ఉద్యోగాలు దొరుకుతున్న కారణంచేత ఈయన్ని ఈ స్కూల్లోనే చేర్పించారు వీరి తల్లిదండ్రులు. 1873 జూలైలో స్కూల్లో చేరిన వెంకటస్వామి మొదట్లో క్రైస్తవ సువార్తను తీవ్రంగా నిరసించాడు. ఒకసారి అతని చేతికి వచ్చిన క్రైస్తవ కరపత్రంపై 'ఇదంతా అబద్ధం' అని రాసాడట. త్వరలోనే ఈయనకి జబ్బు చేసింది. తన పాపాలను నివృత్తి చేయలేని హిందూ సంప్రదాయం గురించి ఇతనికి చాలా ఆందోళన కలిగింది. కోలుకున్న తరువాత మత గ్రంథాలన్నీ తిరగేసి చివరికి బైబిలును చదవడం మొదలుపెట్టాడు.

యోహాను 3:16 ఈయన కంటికి కొట్టొచ్చినట్లు ప్రత్యేకంగా కనిపించింది. దేవుడు వ్యక్తిగతంగా తనను ప్రేమిస్తున్నాడనీ తనకు శాశ్వత జీవాన్నిస్తాడనీ గ్రహించిన వెంకటస్వామి ఆనందానికి పట్టపగ్గాలులేవు. ఇతరులకు. సాక్ష్యమివ్వడం ప్రారంభించినప్పటినుంచి ఇతన్ని ఈ విశ్వాసం నుండి తప్పించాలని ప్రయత్నాలు మొదలైనాయి. అతని దగ్గరున్న బైబిలును

అతని ఇంట్లో వాళ్ళు తగలబెట్టారు. అయితే తన దగ్గర మిగిలిన క్రొత్త నిబంధనను అంతా నిద్రపోయాక రహస్యంగా చదువుకునేవాడు. ఈయన్ని బంధువులు బలవంతంగా వేరే ఊరికి తీసుకువెళ్తే తప్పించుకుని బీరు సోదరుల దగ్గరికి చేరుకున్నాడు. ఆ రాత్రే అంటే 1876 జనవరి 8న హీలిస్ అతనికి గోదావరిలో బాప్తిస్మం ఇచ్చాడు. ఆ తరువాత ఎనిమిదేళ్ళు స్కూల్లో టీచరుగా పనిచేస్తూ బెస్తకులానికి చెందిన బొడ్డు నారాయణుడు, తాటి కల్లు గీసే చెట్టిబలిజ కుటుంబానికి చెందిన రాచమిల్లి వెంకటస్వామి క్రైస్తవులు కావడంలో పాత్ర వహించాడు. బొడ్డు నారాయణుడు కాకినాడ వెళ్ళి బాప్తిస్మంపొంది కొంతకాలానికి తిరిగి నర్సాపురం వచ్చారు. వీరి పెద్ద కుమార్తె జీవరత్నమ్మను చదలవాడ జోనాగారు పెళ్ళిచేసుకున్నారు.

ఇరవైయేళ్ళు విశ్రాంతిలేక పనిచేసిన జాన్ బీరుకు 1884 ఏప్రిల్ నెలలో వడదెబ్బ తగిలి ఆరోగ్యాన్ని దెబ్బతీసింది. కుటుంబంతో సహా స్వదేశానికి పంపెయ్యాలని నిర్ణయం జరిగింది. అయితే ప్రయాణానికి జాన్ బీరు దగ్గర చాలినంత డబ్బులేదు. ఫ్రెడ్ బౌడెన్ దంపతులు అప్పుడే సెలవు మీద ఇంగ్లండు వెళ్తుండడంవల్ల వీరిని వెంట తీసుకవెళ్ళడానికయ్యే ఖర్చును భరించారు.నర్సాపురం తెలుగు ఇంగ్లీషు స్కూలు విద్యార్థులు తమ కృతజ్ఞతను వెల్లడి చేసేటందుకు ఈయన వెళ్తున్న బోటును నర్సాపురం నుంచి నిడదవోలుదాకా లాగి తమ ఋణం తీర్చుకున్నారు. తను ప్రియతమ ఉపాధ్యాయుణ్ణి, మార్గదర్శిని తిరిగి చూడగలమో లేదోనని భోరున విలపిస్తూ మరీమరీ వీడ్కోలు చెప్తూ వదల్లేక వదిలారు. నర్సాపురం విడిచివెళ్తూ జాన్‌బీరు సోదరుడు చార్లెస్‌తో అన్న చివరిమాటలేవంటే, "మతంలో ఏమీలేదు, గొప్ప స్కూల్లోగాని, ఘనమైన మిషన్‌లోగాని ఏమీలేదు. క్రీస్తు లేకుంటే దేన్లోనూ ఏమీ లేదు".*1

వీరు ఇంగ్లండు చేరిన వెంటనే 1884 అక్టోబరు 16న ఎక్సిటర్‌లో తనువు చాలించారు. వీరి భార్య 1888 మే 13న నర్సాపురంలో చనిపోయారు. వీరి మరణంతో రాయబారి పత్రిక ఆగిపోయింది. 1911లో ఇ.సి. ఆడమ్సు మళ్ళీ దీన్ని పునరుద్ధరించారు*2

* 1. రాయబారి ఏప్రిల్ 1965– 'అమరజీవి' వ్యాసంనుండి
* 2. 'గోదావరి డెల్టా, ఇండియా'—నుండి. రచయితలు ఇ.బి. బ్రామ్లీ, పి.సి.వైట్ హౌస్ గార్లు, ప్రకాశకులు– పికరింగ్ & ఇంగ్లిస్, లండన్

తన అన్నగారు చూపిన బాటలో స్కూలు అభివృద్ధికోసం చార్లెస్ బీరు తన శాయశక్తులా పాటుబడ్డాడు. ఇతని హయాంలో 1885లో ఆచంట నరసింహమూరి, 1890లో గోటేటి సాంబమూర్తి అనే ఇద్దరు బ్రాహ్మణులకు బాప్తిస్మాలివ్వడం జరిగింది. వీరిలో నరసింహమూర్తి 1880లోనే వెంకటాచలం ద్వారా మారుమనస్సు పొందాడు. బాప్తిస్మం ఇవ్వమని ముందుకు వచ్చినప్పుడు ఇతనికింకా వయసు రాలేదన్నారు. హీలిస్ బంగళాలో ఇతన్ని ప్రశ్నించడంకోసం పిలిపించారు. జనం అంతా గుమిగూడి వ్యతిరేకంగా అల్లరి చేస్తూ ఉండడంవల్ల తాసిల్దారునుకూడా అక్కడికి పిలువనంపించారు. ఈ తాసీల్దారుకూడా నరసింహమూర్తి బంధువులతో లాలూచీపడినందువల్ల ప్రశ్నించడం జరుగుతూ ఉండగా ఒక బంధువు నరిసింహమూర్తిని హటాత్తుగా ఒడిసి పట్టుకుని, మూసిఉన్న గేటుదాకా ఈడ్చుకువెళ్ళి బయట వేచిఉన్న జనంలోకి వేసిరేసాడు. నేను రాను, నేను రాను, నిజమైన రక్షణ ఏమిటో నాకు తెలిసింది అంటూ కేకలు పెడుతున్న కుర్రవాణ్ణి ఎక్కడికో తీసుకుపోయి కాపలాకింద ఉంచి అతని మనసు త్రిప్పేసేందుకు శతవిధాల ప్రయత్నించారు. అయితే సందుచూసుకుని అతను తప్పించుకుని హీలిస్ దగ్గరికిరాగా హీలిస్ వెంటనే ఆతనికి గోదావరిలో బాప్తిస్మం ఇచ్చారు. ఆ సమయంలో నర్సాపురం పోలీసు సూపరింటెండెంట్ ప్రెండర్‌ఘాస్టు నరసింహమూర్తికి మరింకేదీ హానిజరగకుండా కట్టుదిట్టం చేసాడు. బయట వీధిలోనూ బంగళాలోనూ పోలీసుబందోబస్తు ఏర్పాటయింది. చార్లెస్ హెన్రీబీరు మిడ్‌ఫోర్డు కుటుంబానికి చెందిన హెన్రిట్టాను 1876 అక్టోబరు 2న ఏలూరులో వివాహమాడారు. ఈ వివాహాన్ని అలెగ్జాండరు గారు నిర్వహించారు. జార్జిబీరుకు వారసుడుగా పేర్కొదగిన వ్యక్తి ఈయనే. ఎందుకంటే 55 యేళ్ళు నర్సాపురంలో మిషన్ స్కూలు అధినేతగాను నర్సాపురం అసెంబ్లీకి పాస్టరుగానూ ఉన్నారు. పాస్టరు వాసా యోహాను ఈయనకు కుడి భుజంగా ఉన్నారు. బీరు కుటుంబికులు నర్సాపురం బంగళా (ప్రస్తుతం కేజిల్) లో 1841 నుండి నూరేళ్ళపాటుఉండి సేవచేసిన ధన్యచరితులు. చార్లెస్ బీరు సతీమణి ఇంకా చాలా యేళ్ళు మిషనెరీ తల్లిగా అందరి మన్ననలుపొంది గోదావరి డెల్టా శతవార్షికోత్సవాల సమయంలో కూడా జీవించే ఉంది.

* * *

విలియం బౌడెన్ దంపతులు 1871లో ఇంగ్లండునుండి మళ్ళీ తిరిగి వచ్చారు. మద్రాసు కాకినాడల్లో తన కొడుకులతో కొంత సమయం గడిపి 1872 ఫిబ్రవరి 2న నర్సాపురం చేరుకున్నారు. వెంటనే అంతర్వేది తీర్థానికీ, అటుపైన పదిహేనురోజులు గ్రామాలు సందర్శించడానికీ బయలువెళ్ళి పాత విశ్వాసులను ఆదరిస్తూ, క్రొత్త విశ్వాసులను కలుసుకొంటూ పరిస్థితినంతటినీ మరోసారి ఆకళింపు చేసుకున్నారు.

హీలిస్ చేసిన కోటిపల్లియాత్ర గురించి ఇక్కడ ప్రస్తావించడం అవసరం. కోటిపల్లి తీర్థానికి బయలుదేరడం ఆలస్యం కావడంతో సాహసాలకు వెనుదీయని హీలిస్ తన పడవలో సముద్రంమీదుగా కోటిపల్లి చేరాలని సంకల్పించాడు. అంతర్వేది దగ్గరున్న ఇసుక తిన్నెదాటి సముద్రంలో ప్రవేశించగానే దాదాపు పడవలోనివారంతా వికారంతో వాంతులతో మూలన బడ్డారు. హీలిస్‌కుతోడు ఒక్కరూ లేకపోయారు. ఉదయం 5 గంటలనుండి రాత్రి 9 వరకు ఒక్కడే చుక్కాని దగ్గర నిలబడి ఛార్టులు చదవడం, దిక్సూచి చూడడం మొదలైనవన్నీ చేసుకోవలసి వచ్చింది. రాత్రి అయిపోయింది. కోటిపల్లిపాయ సముద్రంలో కలిసేచోటు ఇంకా కానరాలేదు. తన దగ్గరున్న పరికరాలసాయం తీసుకోవడానికి లైటు లేదు. ఒడ్డున కనిపిస్తున్న తెల్లని అలల నురుగు ఆధారంగా ఒడ్డుకు సమాంతరంగా పడవ నడిపాడు హీలిస్. ఒక దశలో ఇసుక తిన్నెలు చుట్టుముట్టి, రెండు అలల నురగల అంచులు కనిపించి చాలా తికమక పడ్డాడు హీలిస్. వెంటనే తెరచాప దించి లంగరు వేసాడు. కాని అప్పటికే ఆలస్యం అయిపోయింది. ఒడ్డుకు దగ్గరగా వెళ్ళిపోయి పడవ అలల తాకిడికి అటూ ఇటూ తూగసాగింది. మెల్లిమెల్లిగా పడవలో నీళ్ళు నిండుతున్నప్పటికీ అద్భుతమైన రీతిలో చాలాసేపు పడవ మునిగిపోలేదు. వేగుచుక్క పొడిచింది. మన ప్రయాణికుల్లో ఆశ చిగురించింది. మూడు పెద్ద పెద్ద అలలు పడవ మీదుగా పార్లిపారి అందరినీ నిలువునా తడిపి ముద్ద చేసినాయి. అక్కడే ఉండిపోవడంలో అర్థం లేదు. ఎక్కడాలేని బలంతో హీలిస్ తానొక్కడే లంగరుఎత్తి పడవ ఒడ్డుకు కొట్టుకుపోయేలా చేసాడు. ఒడ్డుకైతే చేరారుగాని నావ బద్దలైపోయింది. ఆలీసాహేబుకున్న సమస్తం, బట్టలు, పుస్తకాలు, మందులు సముద్రం పాలయ్యాయి.

ఈ ఆలీసాహెబు విశ్రాంతి లేకుండా అంతం వరకు ప్రయాస పడ్డాడు. ఆ మరుసటి సంవత్సరం నవంబరు నెలలో సముద్రపు ఒడ్డునున్న గ్రామాలన్నీ సందర్శించే నిమిత్తం బయలుదేరి తన సోదరి ఉన్న ఊరికి చేరాడు. అక్కడ ఇతనికి తీవ్రమైన సుస్తీ చేసింది. కాని ఇతను క్రైస్తవుడైనందువల్ల ఎవరూ ఏ సహాయమూ చెయ్యలేదు. చాలా రోజులు రివ్వునవీచే చలిగాలిలో ఒక కొట్టంలో అలా పడిఉన్నాడు. చివరికి ఆ గ్రామస్తులు ఇతని భార్యకు కబురంపారు. ఆమె వెళ్ళి ఆలీసాహెబును పడవలో నర్సాపురం తీసుకొచ్చింది. అప్పటికే ఆలీసాహెబు స్మారకం కోల్పోయాడు. ప్రొద్దు గ్రుంకుతుండగా నర్సాపురం చేరిన ఆలీసాహెబు అర్ధరాత్రివేళకి కన్ను మూసాడు. తన ప్రజలకు సువార్త మోసుకువెళ్ళడంకోసం తన ప్రాణాలను త్యాగం చేసాడు. ఈ విధంగా 1873లో ఆలీసాహెబు చేసిన ఫలప్రదమైన సేవ ముగిసింది. తన కిరీటంకోసం పరలోకరాజ్యానికి వెళ్ళిపోయాడు.

బౌడెన్ దంపతులుకూడా ఎప్పటిలాగా చురుకుగా పనిచెయ్యడానికి తమకు శక్తి సామర్థ్యాలు లోపిస్తున్నట్టు క్రమంగా గుర్తిస్తూ వచ్చారు. ఈ కాలంలోనే బౌడెన్ సతీమణి అగ్రకులాల బాలికలకోసం ఒక బడిని ప్రారంభించింది. బౌడెన్ తమ ఇంటిచుట్టూ షెడ్లువేయించి వయోజనులకు విద్య, వాక్యోపదేశాలు చేసేందుకు వసతి నేర్పరిచాడు. 1873లో వీరి స్నేహితుడు, విశ్వాసవీరుడు గ్రోవ్స్ జనవరి 12వ తేదీన బ్రిస్టల్‌లో కాలంచేసిన వార్త వచ్చింది.

బౌడెన్ ఏలూరు కాలవమీద బయలుదేరి ప్రత్తిపాడులో అప్పటిదాకా సువార్త వ్యతిరేకి అయిన ఒక భూత వైద్యుడికి బాప్తిస్మం ఇచ్చారు. పట్టిసీమ తాళ్ళపూడిదగ్గర తీర్థానికి హాజరై అక్కడినుంచి హీలిస్‌తోకలిసి గూటాల గ్రామంలో క్రొత్త నావ నిర్మాణంకోసం కలప కొనుగోలు చేసారు. దేవీపట్నందాకా వెళ్ళగా కోయల్ని మరోసారి సందర్శించే అవకాశం దొరికింది. తిరుగు ప్రయాణంలో చిక్కాల, దుద్దుకూరు గ్రామాల్లో ఏడుగురికి బాప్తిస్మాలు ఇచ్చారు.

ఈలోగా తయారైన క్రొత్తనావ 'హార్బింగర్'లో హీలిస్ బౌడెన్

దంపతులను కాకినాడ తీసుకువెళ్ళి ఇంగ్లండునుండి తిరిగివస్తున్న ఫ్రెడ్ బౌడెన్ దంపతులను కలుసుకునేందుకు తోడ్పడ్డాడు.

1874లో బౌడెన్ సతీమణి శ్వాసకోశాల వ్యాధితో మద్రాసులో గడపవలసివచ్చింది. ఆమెను తీసుకురావడానికి బౌడెన్ మద్రాసు వెళ్ళి అక్కడినుంచి కోయంబత్తూరు వెళ్ళాడు. మద్రాసులో ఒక స్టీమరు పట్టుకుని కేవలం రెండురోజుల ప్రయాణం అనంతరం నర్సాపురం చేరుకున్నారు.

అస్వస్థత క్రమక్రమంగా బౌడెన్‌కు అడ్డుబండ అయింది. వైద్యం కోసం మద్రాసు వెళ్ళి కడపలో కొంతకాలం గడిపి తిరిగి వచ్చాడు. 1874 అక్టోబరులో తన కొడుకు ఫ్రెడ్ బౌడెన్‌తో కలిసి వ్యాపారపు పనిమీద దుమ్ముగూడెం వెళ్ళడానికి శక్తి చిక్కింది. అక్కడ బజారుల్లోనూ చుట్టుప్రక్కల గ్రామాల్లోనూ సువార్త విత్తనాలు వెదజల్లాడు. తిరిగి రావడానికి సన్నద్ధులౌతుండగా ఫ్రెడ్‌కి మలేరియావచ్చింది. త్వరత్వరగా ఇల్లుచేరి, వైద్యంకోసం కాకినాడ తీసుకువెళ్ళాడు. అతన్ని అక్కడ ఉంచి తిరుగు ప్రయాణంలో చెట్టిపేటకు 12 మైళ్ళ దూరాన రెండు సంఘాలను కట్టడానికి పథకాలు సిద్ధపరిచాడు.

ఆ యేడు డిసెంబరులో బౌడెన్, ఒకసారి తన పడవలోకి ఎక్కుతుండగా కాలుజారి తల్లక్రిందులుగా పడిపోయాడు. తలకూ, కుడి చెంపకూ గాయాలైనాయి. కుడి తుంటెకూడా బెణికింది. అయితే పెద్దగా నొప్పి లేనందువల్ల అలానే పదిరోజులపాటు గ్రామాలు సందర్శించాడు. ఇంటికి తిరిగి వచ్చిన తరువాతకూడా తన సేవా ఫలితాల గురించి సంతోషంగా ఇతరులకు చెప్పాడుగాని తనకు తగిలిన దెబ్బల గురించి తేలికగా తీసిపారేసాడు.

జనవరి ఆరవ తేదీన వీరు ఇంట్లో చిన్న పిల్లల మీటింగులో మంచి కాపరివి గురించి చెప్పి యెషయా 40:10 వాక్యాన్ని రెండు మూడుసార్లు ఉదహరించాడు. "ఇదిగో తన బాహువే తన పక్షమున ఏలుచుండగా ప్రభువగు యెహోవా తానే శక్తి సంపన్నుడై వచ్చును. ఆయన ఇచ్చు బహుమానము ఆయన యొద్దనున్నది." ఈ వాక్యం ఆ రోజుల్లో ఆయన హృదయానికి అతి సమీపంగా ఉండేది.

ఆ రోజున ప్రసంగం ముగించి టీ తీసుకున్న తరువాత దవడ, కుంటె భాగాల్లో బాగా నొప్పిగా ఉందని చెప్పాడు. బొత్తిగా కదల్లేక పోవడంతో మోసుకు వెళ్ళవలసివచ్చింది. రెండురోజుల తరువాత ఫ్రెడ్ బౌడెన్ ఈయన్ని రాజమండ్రికి తీసుకువెళ్ళాడు. హిలీస్, బౌడెన్ సతీమణినీ హార్లెన్ బీరును తీసుకుని హడావుడిగా రాజమండ్రి చేరుకున్నాడు. 13వతేది రాత్రి 2 గంటలవేళ అక్కడికి చేరి బౌడెన్‌ఉన్న గది తలుపు తీసిచూస్తే కనిపించిన దృశ్యం హీలిన్‌ను కలచివేసింది. ఛిక్కిశల్యామైపోయి ప్రాణాలు కళ్ళల్లో పెట్టుకునిఉన్న బౌడెన్, సేవకుడు ఎత్తిపట్టుకున్న లాంతరు వెలుగులో ఆయన దవడగాయానికి కట్టు మారుస్తున్న ఆయన కోడలు కనిపించారు హీలిస్‌కి. అప్పటినుండి బౌడెన్ పరిస్థితి త్వరితగతిని దిగజారింది.

ఆ రోజుల్లో విలియం బౌడెన్ ఎక్కువ మాట్లాడలేదు. చెప్పరాని బాధను అనుభవించాడు. 5 రోజుల తరువాత అర్జెంటు పనిమీద ఫ్రెడ్ వెళ్ళిపోవలసివచ్చింది. కొడుకుతో "నా గురించి ప్రార్థించు, నీ గురించి నేను ప్రార్థిస్తాను. యేసుక్రీసు నిన్న, నేడు నిరంతరము ఏకరీతిగా ఉన్నాడు" అని చెప్పాడు.యెషయా 41:10 మొదలైన వచనాలను బిగ్గరగా చదువు తుంటే బౌడెన్ ముఖం ఆనందంతో విప్పారేది. 26వతేదీ సూర్యోదయం అవుతుండగా ఆ ముఖంలో ఎక్కడలేని ప్రసన్నత, సంతోషం చోటు చేసుకున్నాయి. అత్యద్భుతదర్శనాన్నిచూస్తున్నట్టు కళ్ళు మెరిసాయి. కోడలు "ఆకాశము తెరువబడుటయు, మనుష్యకుమారుడు దేవుని కుడిపార్శ్వమందు నిలిచియుండుటయు చూచుచున్నాను" అని పలుకుతూ ఉండగా తుది శ్వాస విడిచాడు. అప్పటికి విలియం బౌడెన్ వయసు 64 సంవత్సరాలు. అది 1876వ సంవత్సరం జనవరి నెల.

చనిపోబోయే పరిశుద్ధులకు ఆత్మ శరీరంనుండి వేరుకావడానికి కొద్ది క్షణాలముందు, చర్మ చక్షులకు పరలోకమహిమ, మనుష్య కుమారుని దర్శనం ప్రత్యక్షంగా కనిపిస్తాయి కాబోలు. స్తెఫను విషయంలో జరిగింది ఇదే కదా. ఇది చనిపోతున్న వ్యక్తికి గొప్ప ధన్యతను, వెనక విడవబడే ప్రియులకు గొప్ప ఆదరాన్ని చేకూర్చే దేవుని ఏర్పాటు.

మహిమా సందర్శనాన్ని సంపూర్ణానందంతో తిలకిస్తూ నోరు మెదపలేని ఆనందాతిరేకాలతో ఆనంద భాష్పాలతో విలియం బౌడెన్ తన సువార్త ఖడ్గాన్నీ డాలును దించి నిత్యవిశ్రాంతికి వెళ్ళిపోయాడు. భళా, నమ్మకమైన మంచి దాసుడా అంటూ తండ్రి ఈయన్ని కౌగిలించుకుని తనవారితో చేర్చుకునే మహద్భాగ్యానికి తరలిపోయాడు. తన 40 ఏళ్ళ సువార్త సేవలో మచ్చలేని మిషనెరీగా విశ్వాసంలో ఏమాత్రం చలించని సేవకుడుగా తరతరాలకు ఆదర్శప్రాయుడుగా జీవించాడు. జి.డి.యం. చరిత్రలోనేకాదు ప్రపంచ క్రైస్తవ చరిత్రలోనే ఇలాటి యోగ్యులు అరుదుగా కనిపిస్తారు.

* * *

తండ్రి మరణం కలకత్తాలో వ్యాపారంలో ఉన్న ఎడ్విన్ బౌడెన్‌కు ఆ స్థానాన్ని భర్తీ చెయ్యడానికి ప్రేరేపణ అయ్యింది. దైవచిత్తాన్వేషణ ఫలితంగా ఈ పిలుపును అందుకుని ఎడ్విన్ ఏప్రిల్ నెలలో తన వ్యాపారాన్ని వదిలేసి ముగ్గురు చిన్న పిల్లలతో గోదావరి ప్రాంతపు సేవకు తన్నుతాను సమర్పించుకున్నాడు. ఆ మరుసటి నెలలోనే చెట్టిపేటలో చిరకాలం సేవచేసిన హెన్రిట్టా బౌడెన్ పుట్టింది.

విశిష్టమైన వ్యక్తిత్వం, దేవుడిచ్చిన వివిధరకాలైన తలాంతులు ఉన్న ఇ.యస్. బౌడెన్ గోదావరి ప్రాంతానికి వరప్రసాదం. హీలిస్‌కు, బీరు సోదరులకు ఇతని రాక పరమానందమైంది. వచ్చీ రావడంతోనే పశ్చిమ డెల్టాలో తన తండ్రి శ్రమించిన సువార్త పొలాలవైపు ఇతని దృష్టి మళ్ళింది. తాను కుర్రవాడుగా రాబర్ట్ ఛాప్‌మన్ దగ్గర వాక్యంలోని మర్మాలను నేర్చుకున్నట్టే పాలకొల్లులో కొందరు మెరికల్లాటి కుర్రవాళ్ళను పోగుచేసి వాక్యంలోని శిక్షణనివ్వడం మొదలుపెట్టాడు. ఇంతేకాక వాళ్ళకి చదువు చెప్పడం, వడ్రంగం నేర్పించడంలోకూడా శ్రద్ధ వహించినాడు. 1885లో తన స్వహస్తాలతో 'వాటర్ లిల్లీ' అనే హవుస్ బోటును తన తండ్రి నిర్మించిన 'ఇఖో' అనే బోటు స్థానే నిర్మించాడు.

1885 జూన్ 28వ తేదీన జగ్గన్నపేటకి చెందిన పింజర్ల మునలయ్యకు బాప్తిస్మం ఇవ్వడంద్వారా తన తండ్రి 1837లో విత్తిన సువార్త బీజాల పంట కోసాడు ఎడ్విన్. ఆ తరువాత నవంబరులో హీలిస్

జగ్గన్నపేటలోనే కూర్మా మహాలక్ష్మికీ, అంకం చంద్రయ్యకు బాప్తిస్మం ఇచ్చాడు. మరికొన్నాళ్ళకి పింజర్ల కోటయ్యకు కూడా బాప్తిస్మం ఇవ్వడం జరిగింది. ఈ కోటయ్యగారు శతవార్షికం సందర్భం నాటికి బ్రతికే ఉన్నారు. వీరు మిషన్ హైస్కూలు మాజీ ప్రధానోపాధ్యాయుడు పి. ఆనందరాజుగారి తండ్రి. బొడ్డు నారాయణుడుగారి పెద్ద కుమార్తెను వీరు వివాహమాడారు.

తన తల్లికి ఇతను ముద్దుల కొడుకు. ఆమె వృద్ధాప్యంలో ఆపేక్షగా ఆమెను సేవించుకొన్నాడు.

బౌడెన్ సతీమణి వృద్ధాప్యం, అనారోగ్యాల కారణంగా ఏకాంతంగా విశ్రాంతిగా గడిపేది. ఈ సమయంలో ఈ తల్లి తన ప్రభువుతో ఎంతో సమయం ఏకాంత ధ్యానంలో గడిపింది. ఆమెతో కొంత సమయం ప్రతిదినం గడపడం హీలిస్ మొదలైనవారికి గొప్ప ఆదరణగా ఉండేది.

చివరికి తన 71వ ఏట 1883 జనవరి 9న ప్రశాంతంగా ప్రభువులో నిద్రించింది ఈమె. అప్పటికి ఆ ప్రాంతాల మిషనెరీలంతా ఆమెను ఆప్యాయంగా అమ్మా అని పిలిచేవారు. వీరు సతీమణి సమాధి ప్రక్కనే ఈమెను పాతిపెట్టారు. ఈవిధంగా తెలుగువారిమధ్యకు వచ్చిన నలుగురు విశ్వాసవీరుల్లో చివరిదిగా ఎలిజబెతు బౌడెన్ ఇహలోకయాత్ర చాలించి ప్రభువుతో ఐక్యమైంది.

చందవ్రరు జమీ వ్యవసాయం చూసుకుంటున్న సమయంలో ఇ.యస్. బౌడెన్‌గారికి చందవ్రరు జమీందారుకీ వివాదం వచ్చింది. బౌడెన్ తరుపున వాదించడానికి మద్రాసునుండి వచ్చిన లాయరు కోర్టులో బౌడెన్ గనక ఒక చిన్న అబద్ధం ఆడితే కేసు పగడ్బందీగా ఉంటుందనీ సూచించాడట. అయితే ఈ కోర్టులోఅబద్ధం ఆడడానికి బౌడెన్ నిరాకరించడంతోజమీందారు పక్షంగా ఈ కేసును కొట్టేసారు. నిజాయితీకి నిలబడడంలో బౌడెన్‌గారు ఎంత త్యాగమైనా చెయ్యడానికి సిద్ధపడ్డారు.ఆ విధంగా వందలాది ఎకరాలపంట భూమిని వదులుకున్నారు. వారి నైతిక విలువలు, సత్యసంధత అలాటివి మరి.

తల్లి మరణం తరువాత 3 నెలలకు ఎడ్విన్ బౌడెన్ ఇంగ్లండుకు సెలవుమీద వెళ్ళి 1884లో తిరిగి వచ్చాడు. రావడంతోనే చెట్టిపేట ప్రాంతాన్ని ప్రభువు పేర ఆక్రమించుకునేందుకు సన్నాహాలు ఆరంభించాడు.

తాను వ్యాపారం చేస్తున్న రోజుల్లో ఇక్కడ కొంత ఆస్తిని కొనుగోలుచేసి ఉన్నాడీయన. పశ్చిమ డెల్టా అంతటికీ కేంద్ర బిందువుగా జల రవాణా సౌకర్యం ఉన్న చోటు ఇది. 1886 ఎండాకాలంలో ఇక్కడ తన బంగళా నిర్మించాడు ఎడ్విన్.

ఒక రాత్రి గోదావరి పొంగి పేట అంతా మునిగిపోతే ఈ బంగళాలోకి ఎడ్విన్ ఇంకా గృహప్రవేశం చెయ్యకముందే 18 కుటుంబాలు ఆశ్రయం పొందాయి. ఇళ్ళల్లోకి నీళ్ళు వచ్చెయ్యడంతో బౌడెన్ పంపిన దోనెలు నేరుగా ఇంటల్లోకి వచ్చేసినాయట. అప్పుడు ఇంటి కప్పుమీద ఎక్కిన జనం నేరుగా ఆ దోనెలోకి దిగి బంగళాకు చేరుకున్నారట. వరద వెంటే కలరా వ్యాపించింది. ఈ సందర్భంలో ఎడ్విన్ బౌడెన్ శాయశక్తులా కృషిచేసి ఈ ప్రజలను ఆదుకున్నాడు. చివరికి ఎడ్విన్ తన కుటుంబంతో ఈ బంగళాలో కాపురం పెట్టే సమయానికి మిస్ టేలర్, బియార్న్, రేచల్ లిన్ వీరితో ఉన్నారు. వీరు ముగ్గురూ క్రిందటేడు నవంబరులో ఇండియాకు వచ్చారు. వీరి రాకతో అవివాహితులుగాఉండి గోదావరి ప్రాంతంలో పనిచేసిన స్త్రీ మిషనెరీల యుగం ప్రారంభమైంది.

1890లో చెట్టిపేటలో ఎడ్విన్ బాలికల బోర్డింగు స్కూలును ప్రారంభించాడు. మొదట్లో వీరి పెద్దకూతురు లిల్లీ దీని వ్యవహారాలు చూస్తూ ఉండేది. ఈమె నాలుగేళ్ళపాటు బోర్డింగుపనిచూసి 1894లో థామస్ టిల్స్లీని పెళ్ళాడడంకోసం ఇంగ్లండు వెళ్ళిపోయింది. (వీరు అప్పట్లో క్లేరెన్స్ హైస్కూలు, వెస్టన్ సూపర్‌మియర్‌లో టీచరుగా పనిచేసేవారు.* ప్రస్తుతం బెంగుళూరులో ఈ స్కూలుపేరుతోనే మరొక ప్రఖ్యాత పాటశాల ఉంది. అటుతరువాత జార్జిముల్లర్ స్థాపించిన అనాథాశ్రమానికి అసోసియేట్ డైరెక్టరుగా ఉన్నారు). ఈమె తరువాత ఆఖరి కూతురు హెన్రిట్టా (హెట్టా) చాలాకాలం బోర్డింగు స్కూల్లో పనిచేసి నిత్యవిశ్రాంతికి చేరుకోగా ప్రస్తుతం దీని యాజమాన్యం మిస్ ఇ.జె. హార్డింగు చూసుకుంటున్నారు. హెట్టా బౌడెన్ 1897నుండి 1956 వరకూ సుదీర్ఘకాలం చెట్టిపేటలో వెనకటి తరానికి ఈ తరానికీ వారధిగా నిలిచిన మహిళ.

ఈ సందర్భంలో మరొక ఆసక్తికరమైన విషయం ఏమిటంటే

లిల్లీ బౌడెన్, థామస్ టిల్‌స్లీ దంపతులకు జన్మించిన క్రాఫర్డు టిల్‌స్లీగారిని 1920లో మిషనెరీగా ఈ ప్రాంతానికి ఆహ్వానించిన సంతోషం తాతగారైన ఎడ్విన్ బౌడెన్‌కు దక్కింది.

ఎడ్విన్ బౌడెన్ తన 79వ యేట తన శక్తి సామర్థ్యాలన్నిటినీ ప్రభువుసేవలో వెచ్చించి క్రొవ్వొత్తి కరిగిపోయినట్టుగా తన పరమ యజమాని సేవలో అరిగిపోయి 1924 ఏప్రిల్ 23న కూనూరులో తనువు చాలించారు. ఇతని భార్య 1927 ఆగస్టు 15వ తేదీన చెట్టిపేటలో తన 87వ యేట ప్రభువు సన్నిధికి వెళ్ళిపోయింది.

* * *

జేమ్సు నార్మన్ మక్రే 1842 క్రిస్‌మస్ రోజున ఒక ఉన్నత వంశంలో పుట్టాడు. తండ్రి రెవరెండు జాన్ మక్రే నిష్ఠాగరిష్ఠుడైన పాదిరి. జేమ్సు మక్రే ప్రఖ్యాతినొందిన స్కూల్లో చదువుకుని 1862లో కలకత్తా వచ్చి అక్కడ కచార్ అనేచోట తోటం యజమానిగా మూడేళ్ళు పనిచేసాడు. మలేరియా సోకినందువల్ల స్వదేశం తిరిగివెళ్ళి గ్లాస్గోలో వ్యాపారంచేస్తూ నదేళ్ళు గడిపాడు. ఇక్కడ ఇతను మారుమనస్సు పొంది 1871లో పెద్ద మిషనెరీ మీటింగులో గోదావరి ప్రాంతానికి మిషనెరీల ఆవశ్యకత గురించి బౌడెన్ ప్రసంగిస్తూండగా విన్నాడు. అక్కడికక్కడే ఈ పనికోసం సమర్పించుకొని బౌడెన్ మరణం తరువాత 1876 డిసెంబరు 9వ తేదీన నర్సాపురం చేరుకున్నాడు.

నర్సాపురం, పాలకొల్లు పట్టణాల్లో హీలిస్ ఇ.యస్. బౌడెన్ సెలవులమీద ఇంగ్లండు వెళ్ళినప్పుడు వారిస్థానంలో 1876 నుంచి 1883 దాకా సమర్థవంతమైన సేవచేశారు. 1883నుంచి దాదాపు ఒక సంవత్సరం చెట్టిపేట సంఘాన్ని చూసుకున్నారు. వడదెబ్బవల్ల ఆరోగ్యం చెడిపోవడంతో 1885 నుండి 1889దాకా స్వదేశం స్కాట్లండులో విశ్రాంతి తీసుకున్నారు.

పాలకొల్లు క్రిస్టియన్‌పేట నివాసులకు దగ్గరగా నీరిమధ్యనే ఒక దేవాలయం ఉండాలన్న ఉద్దేశంతో బౌడెన్ వేసిన పునాది మీద హీలిస్ ఆలయాన్ని కట్టించారు. 1878లో ఇది కూలిపోయినందువల్ల 237 రూపాయల వ్యయంతో మక్రే దీన్ని కట్టించారు. మక్రే దంపతులు ఇక్కడ

కాపురంఉన్న రోజుల్లోనే మ్రకే సతీమణి అక్కడి క్రైస్తవ స్త్రీలక
అల్లిక పని నేర్పించి వాళ్ళ జీవనోపాధికి తోడ్పడింది. ఈ కళను తేః
ఉంచుకుని జాగ్రత్తగా జీవనోపాధి గడుపుకొమ్మని ఆమె ఆ (
హెచ్చరిస్తూ ఉండేదట. అయితే ప్రస్తుతం క్రైస్తవులకంటే.
క్రైస్తవేతరులే లేసు ఎగుమతి వ్యాపారంలో ధనికులైనారు. నిజ రక్ష
తెలుసుకుంటూ సద్భోధలో పెరుగుతున్న యువతులు తమ ఇ
ఇంకా అన్యులుగానే ఉన్న అత్తలు, తదితర స్త్రీలనుండి వత్తిడి ఎదు
గూడదన్న సంకల్పంతో మ్రకే సతీమణి వారిని తనతోనే ఉంచుకు
వారి భర్తల ఆదాయానికి చేదోడు వాదోడుగా ఉండేలా ఈ లేసు
నేర్పించిదట. ప్రస్తుతం పాలకొల్లు ఎమ్మాయు దేవాలయం ఉన్న చ
మిషనెరీల నివాసం ఉండేది.*

1881లో ఫ్రెడరిక్ నార్త్‌కోట్ మైల్స్ వచ్చాడు. ఇతను శ్రీ
రెండవ భార్య శ్రీమతి కౌలింగుకు మొదటి కళత్రంవల్ల కలిగిన కూ
రోడా కౌలింగును పెళ్ళి చేసుకున్నాడు. మ్రకే లేని సమయంలో
కష్టించి పనిచేసి అమలాపురం అవతల రెండు మూడు గ్రామాల్లో సం
స్థాపించారు. ధవళేశ్వరంలో కాపురం ఉంటూ తూర్పు, మధ్య
ప్రాంతాల్లో క్రీస్తుకోసం పాటుపడ్డాడు. కలరా మశూచికం వెంటవెం
ఇతనికి సోకినప్పటికీ తేరుకున్న వెంటనే మళ్ళీ సేవారంగంలోకి దూక

కోయలమధ్యకు 160 మైళ్ళ మేర ప్రయాణానికి హీలిస్ మై
వెంటబెట్టుకుని వెళ్ళాడు.

* * *

ఇక్కడితో ఈ చరిత్ర ప్రథమ అర్థశతాబ్దం పూర్తవుతుస్త
సహజంగా ఈ యాభైయేళ్ళు ప్రభువు మహిమను గోదావరి ద
ప్రాంతాల్లో ప్రకాశింపజేసిన ప్రధాన వ్యక్తులు విలియం బౌడెన్, జార్జి శ
థామస్ హీలిస్, ఆలీసాహెబు, ఫ్రాన్సిస్, జేమ్సు, గొల్లపల్లి నథానియే
మొదలైనవారు.

---

* పాలకొల్లు ఎమ్మాయు ఆలయ శతవార్షిక జ్ఞాపకార్థ చరిత్ర.,
ఒ. ఫ్రాన్సిస్‌గారి పుస్తకం నుండి.

ఈ ప్రాంతపు మొదటి సంఘం బౌడెన్ స్థాపించిన పాలకొల్లు. వీరు నర్సాపురంలోను, తిరుగుడు మెట్టలోను ఆ తరువాతి సంఘాలు స్థాపించాడు. హీలిస్ దాదాపు తన సేవ అంతటిలోనూ సంఘాల స్థాపనకుగాక సువార్తీకరణకే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు. 1836–1886 కాలంలో స్థాపించబడిన సంఘాలన్నీ దాదాపు అధికశాతం బౌడెన్ స్థాపించినవే.

# 1886 - 1936

# మధ్యకాలము

"చీకటిలో నడుచు జనులు గొప్ప వెలుగును చూచుచున్నారు" (యెషయా 9:2).

## ఇందులో

అధ్యాయము

# 11

# ఇరవయ్యోవ శతాబ్దం

1886–1936 కాలంలో గోదావరి డెల్టా చరిత్రను చర్చించే సందర్భంలో వివరణా పద్ధతిలో కొంతమార్పు అవసరం. ఎందుకంటే 1936 నాటికి దాదాపు 200 గ్రామాలలో 6000 మంది విశ్వాసుల మధ్య దాదాపు 90 మంది మిషనెరీలు పనిచేస్తున్నట్టుగా అంచనా వెయ్యబడింది.* వీరంతా సమర్ధవంతమైన కార్యనిర్వహణార్థం 8 లేక తొమ్మిది ప్రదేశాల్లో ఉండి కార్యకలాపాలను నిర్వర్తించారు.

ఒక్క నర్సాపురం మిషన్ స్కూలు మినహాయించి చాలామట్టుకు గోదావరి డెల్టా సంస్థలు ఈ 50 యేళ్ళ కాలంలో స్థాపించబడినాయి. లెక్కకు మిక్కిలిగా సంఘాలు నాటబడినాయి. ఇవన్నీగాక మొదటి యాభై యేళ్ళకూ, ప్రస్తుతం చర్చిస్తున్న రెండవ యాభైఏళ్ళకు మిషనెరీల్లోనూ స్థానికుల్లోకూడా విపరీతమైన మార్పు కనిపించింది.

ఆదిమిషనెరీలైన బౌడెన్ బీరు హీలిస్‌గార్లలాగా ఈ అర్థశతవత్సరపు (1886–1936) మిషనెరీలు ఒంటరివారు కారు. ఇతర డినామినేషన్లకు చెందిన యూరోపియన్లతో సఖ్యతగా ఉండవలసిన అవసరం పూర్తిగా తగ్గిపోయింది. స్థానికులమధ్య సేవలో ఉంటూ తరుచుగా మిషనెరీలు అంతా సమావేశమై మంచీ చెడ్డలు మాట్లాడుకునే సదుపాయం ఏర్పడింది. క్రొత్తగా వస్తున్న మిషనెరీలను ఆహ్వానించడానికీ, ఆరంభంలో వారికి సహాయం చెయ్యడానికీ చాలినంతమంది మిషనెరీలు ఉన్నారు.

అన్నిటికీ మించి గోదావరి ప్రాంతంలో సేవకు మిషనెరీలు ప్రేరేపణ నొందడానికీ, అలా తమనుతాము సమర్పించుకొని వచ్చిన మిషనెరీలు

---

*Turning the world upside down-Stunt et al Upperton press 1972

డబ్బుకు ఇబ్బంది పడకుండా నిర్విఘ్నంగా ఇక్కడ తమ సేవను కొనసాగించుకోవడానికి కారణమైనది ఇంగ్లండులో స్థాపించబడిన ఒక పత్రిక, దానికి అనుబంధంగా నడిచిన ఒక సంస్థ.

"సేవా ప్రతిధ్వనులు" **(Echoes of Service)**

గోదావరి డెల్టా ప్రాంతానికి వచ్చిన బౌడెన్ బీరులకు ఆర్థిక సహాయం గురించి ఆంథోని నోరిస్ గ్రోవ్స్ చాలా దిగులుపడుతూ ఉండేవాడు. బ్రిటన్‌లోని బ్రదరెన్ సంఘాలలో చెలరేగిన సిద్ధాంతపరమైన వివాదాలవల్ల అన్యదేశాల్లో సువార్త సేవ ప్రస్తుతం దైవచిత్తం కాదన్న అభిప్రాయం ఆ రోజుల్లో ప్రబలంగా ఉంది. అందువల్ల బౌడెన్ బీరులకు ఆర్థిక సహాయం చేస్తానని మాట ఇచ్చిన వ్యక్తి ఆ వాగ్దానాన్ని ఉపసంహరించుకున్నాడు. ఆ కాలంలో ఒక్క జార్జిముల్లర్,ఆయన అనుయాయులుతప్ప బౌడెన్ బీరులను ఆదుకున్నవారు లేరు.

అయితే బౌడెన్ బీరుల వ్యక్తిత్వాన్ని గమనించిన కొందరు చర్చ్ ఆఫ్ ఇంగ్లండు సభ్యులు (ముఖ్యంగా నోబుల్, ఫాక్స్, కాటన్, స్టోక్స్ మొ.) బౌడెన్ బీరుల తరుపున అందరికీ తాకీదులుపంపి తత్ఫలితంగా ఒక ఫండు ఏర్పాటయ్యేలా చూసారు. దీనికే గోదావరి డెల్టా మిషన్ అని పేరు పెట్టారు. ఇది బౌడెన్ బీరుల ఆర్థిక అవసరాలకు చాలాకాలం ఉపయోగపడింది. మద్రాసు సహోదరులు ఈ ఫండుకు కోశాధికారులుగా ఉన్నారు.

పైన చెప్పిన పరిస్థితులవల్ల బౌడెన్ బీరు కుటుంబికులుతప్ప మిషనెరీలు మరెవరూ గోదావరి ప్రాంతానికి రాలేదు.

1860లో గోదావరి డెల్టా మిషన్ ఫండు తరుపున వీరి విశేషాలను తెలియజేయడానికి 'ది ఇండియన్ వాచ్‌మన్' అనే పత్రిక ఇంగ్లండులో స్థాపించబడింది.

ఇదిగాక 1834లోనే జార్జిముల్లర్ బ్రిస్టల్‌లో స్క్రిప్చర్ నాలెడ్జి ఇన్‌స్టిట్యూషన్ అనే సంస్థను స్థాపించి చిన్నచిన్న కానుకలను ప్రపంచం నలుమూలలనున్న మిషనెరీలకు పంపేవాడు. 1870 నాటికి సాలీనా దాదాపు 2000 పౌండ్లను విదేశాల్లో పనిచేస్తున్న మిషనెరీలకు పంపించగలిగేవాడు.

ఇది ఇలా ఉండగా ఏ మిషనెరీ సొసైటికీ చెందకుండా 1829లో

మొదలైన మిషనెరీ సేవ 1871కెల్లా ప్రపంచం నలుమూలల వ్యాపించింది. వీరందరి అనుభవాలు, అవసరాలు అందరికీ తెలిసేలా ఒక పత్రిక ప్రారంభించాలి అన్న ప్రతిపాదన ఆమోదించబడి 1872 జనవరిలో "The Missionary Echo" అనే పత్రిక ఇంగ్లండులో స్థాపించడం జరిగింది. దీనిని స్థాపించినవారు తాము ఆ పత్రికకు ఎడిటర్లుగా పనిచెయ్యడమేకాక, ఆయా మిషనెరీలకు కానుకలు పంపదలిచినవారు పంపించే డబ్బుకు కోశాధికారులుగా కూడా వ్యవహరిస్తామని ప్రకటించారు. ప్రపంచనలుమూలల నుండి మిషనెరీలు ఈ పత్రికకు తమ అనుభవాలను వివరిస్తూ తమ లేఖలు రాయడం, ఈ పత్రికను చదవడంద్వారా ప్రేరేపితులైన విశ్వాసులు పత్రిక పేరన డబ్బు పంపడం, పత్రిక ఎడిటర్లు ఆ డబ్బును ప్రార్థనాపూర్వకంగా అవసరమున్న చోటికి పంపించడమూ జరుగుతూవచ్చింది. 1885 లో "The Missionary Echo" అనే పేరు తొలగించి "Echoes of Service" అనే పేరు పెట్టారు.

దీనికి మొదటి ఎడిటర్ గ్రోవ్స్‌గారి కుమారుడైన హెన్రీ గ్రోవ్స్. ఈయన 1872 నుండి 1891 దాకా ఈ బాధ్యత స్వీకరించారు. ఆటుతరువాత 14మంది ఈ బాధ్యతను వహించారు. 1969 నుండి ఇప్పటిదాకా స్టాన్లీ ఫ్రాన్సిస్ వారెన్‌గారు దీని ఎడిటర్, ట్రజరెర్‌గా ఉన్నారు. హెన్రీగ్రోవ్స్ తప్ప మిగిలిన వారందరూ బాత్ నగరంలో నివసించారు. గనుక ఈ పత్రిక ఫండు వ్యవహారాలు బాత్ నగరంలోనే జరుగుతున్నాయి.

"Echoes of Service" వారి రికార్డుల్లో వీరికి ఉత్తరాలురాసి. వీరితో సంబంధం కలిగి ఉన్న మిషనెరీలు దాదాపు 5వేలమంది ప్రపంచ వ్యాప్తంగా ఉన్నారు. ఇండియాలో పనిచేసినవారే దాదాపు 700 మంది ఉన్నారు. గోదావరి డెల్టా ప్రాంతాలకు చెందిన వారు కనీసం 95 మంది ఉన్నారు. వీరందరి పేర్లు, వీరు మిషనెరీలుగా పనిచేస్తూ "Echoes" తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ సహాయం పొందిన కాలం పూర్తి లిస్టు Echoes of Service శతవార్షికోత్సవం సందర్భంగా వీరు ప్రచురించిన "Turning the world upside down" అనే పుస్తకంలో ఇచ్చారు.

* * *

ఈ విధంగా ఆర్థికమైన ఇబ్బందులు పూర్తిగా తొలగిపోవడం, పెళ్ళిళ్ళూ ఇతర స్నేహాలకూ కాలక్షేపానికి తోటి మిషనెరీలు పుష్కలంగా ఇక్కడ ఉండడం, వీటన్నిటినీ మించి దేవుడు మరింత బలంగా స్త్రీ పురుషులను ప్రేరేపించడం మొదలైన వాటినిబట్టి 1886–1936 కాలంలో చాలా మంది మిషనెరీలు ఈ ప్రాంతానికి వచ్చి సేవచేసారు.

సంఘాలు, పాటశాలలు కుప్పలు తిప్పలుగా స్థాపించబడినాయి. కోస్తా ప్రాంతమంతటికీ గోదావరి ప్రాంతంలో క్రైస్తవులు భాగ్యవంతులు కావడానికి ఇక్కడి మిషనెరీల ప్రభావమే అంటే అతిశయోక్తికాదు. అయితే ఈ కాలంలో వచ్చిన మిషనెరీల వ్యక్తిత్వాలలో, దృక్పథాలలో అనేక రకమైన తేడాలు కనిపించేవి. కొందరు మిషనెరీలు కుష్టురోగుల్నీ, గుడ్డివాళ్ళనీ భుజాలమీద చేతులువేసి నడిపించేవారైతే, కొందరు స్థానికుల్ని పురుగును చూసినట్టు చూసినవారు. అమ్మగారు, మిసమ్మగారు, దొరగారు, దొరసాని గారు మొదలైన గౌరవ నామాలు బాగా అలవాటైన కాలం ఇదే. ఇప్పటికీ మిషనెరీ పేరు చెప్తేనే చేతులు జోడించేవారున్నారు.

అందరు స్త్రీలను పిలిచినట్టుగా ఆమె, ఆవిడ అని పిలిస్తే ముఖం చిట్లించే మిషనెరీ స్త్రీలు ఉన్నారు. స్థానికులు పొడుగు చేతుల చొక్కాలు వేసుకున్నా, లేక ఇన్‌షర్టు చేసినా అక్కడికక్కడ మిషనెరీలు వారిని మందలించి తీసెయించిన సందర్భాలు ఉన్నాయి. స్థానికులకు ఉన్నత చదువులు కావాలి అని కొందరంటే, ఐదవతరగతితో చదువు చాలించాలని నిర్బంధించేవారు కొందరు.

ఇదే సమయంలో మిషనెరీ ఏది చెప్తే దాన్ని గుడ్డిగా నమ్మే రోజులు పోయినాయి. స్థానిక క్రైస్తవ నాయకుల సంఘాల్లో స్థిరపడిన తరువాత మిషనెరీల అజమాయిషి సంఘపరిపాలనలోనూ, కార్యక్రమాల్లోనూ చాలామట్టుకు తగ్గింది.

మిషనెరీలకుకూడ కాలినడకన వెళ్ళి సువార్త చెప్పవలసిన అగత్యం తప్పింది. ఈ సందర్భంలో యిల్లులాగా నిర్మించిన బోటులోనే రోజుల తరబడి ఉండిపోవడానికి సదుపాయాలను ఏర్పాటు చేసుకుని వాటిల్లో ప్రయాణిస్తూ సువార్తసేవ చేయడం ఈ ప్రాంతాల్లో కనిపించిన ఒక ప్రత్యేకమైన సాంప్రదాయం. హవుస్ బోటులు తయారు చేసుకుని కాలవల్లో ప్రయాణిస్తూ గోదావరి ప్రాంతపు మామూలలకు

కూడా సువార్తను అందించారు ఈ కాలపు మిషనెరీలు. ఇంకా ఎద్దులబండి, గుర్రం మొదలైన ప్రయాణసాధనాలనుకూడా వాడేవారు.

మొదటి అర్థ శతాబ్దిలో మిషనెరీవెంట కొందరు స్థానికులుకూడా వెళ్ళి సువార్త ప్రకటించడం కద్దు. ఈ అర్థశతాబ్దంలో (1886–1936) నైతే స్థానికులు స్వతంత్రంగా బోధలకు వెళ్ళారు. కోల్‌ఫోర్టరులద్వారా లేఖన భాగాలు విరివిగా పంచిపెట్టడం జరిగింది.

స్కూళ్ళ స్థాపన అభివృద్ధి, ఆస్పత్రులు, హాస్టళ్ళు మొదలైన వాటిద్వారా సేవ బాగా జరిగింది. ప్రథమ క్రైస్తవుల సంతానం ఈ కాలంలో సువార్త భారాన్ని చేపట్టారు. ఈ విషయాలన్నిటినీ సవిస్తరంగా చూద్దాము.

* * *

ద్వితీయ అర్థ శతాబ్దిలో గోదావరి డెల్టా ప్రాంతంలో కనిపించిన మరొక ఆసక్తికరమైన ధోరణి ఏమంటే గ్రామగ్రామంలోనూ మిషనెరీలు ఎలిమెంటరీ స్కూళ్ళు స్థాపించి తాటాకులతోనో పెంకులతోనో ఒక చిన్న స్కూలు భవనాన్ని నిర్మించి దాన్నే ఆదివారంనాడు ఆలయంగా వాడుకునే పద్ధతి. ముఖ్యంగా నర్సాపురం, అడపాదడపా కాకినాడ తదితర పట్టణాల్లో ఏ ఎనిమిదో తరగతివరకో చదువుకునిసైటీచరు ట్రెయినింగు అయిన వారిని ఈ స్కూళ్ళలో టీచరుగాను, సంఘకాపరిగాను నియమించడం జరిగేది. వీరిలో చాలామంది మిషనెరీల పోషణలో పెరిగినవారు. కొంతమందిని పూర్తిగా మిషనెరీలే డబ్బు వెచ్చించి చదివించారు. వీరందరూ చిన్నప్పటినుండి వాక్యబోధలో పెరిగి విశ్వాసంలో స్థిరులై గ్రామాదుల్లో పనిచేసారు. మిషనెరీలపేర్లు, ప్రఖ్యాతిగాంచిన పెద్దపెద్ద సువార్తికుల పేర్లు చెప్పు కుంటాము గాని ఉపాధ్యాయ వృత్తిలోవుంటూ సంఘాలను కనిపెట్టుకుని ఉన్న ఈ దైవదాసులకు ఉండవలసినంత గుర్తింపు ఉండదు. గోదావరి డెల్టా ప్రాంతపు క్రైస్తవ ఉద్యమానికి వెన్నుముక వీరే. ఒక్కొక్కరు 40, 50 సంవత్సరాలు బహు నమ్మకంగా కాడిక్రింద మెడను వంచి శ్రమించారు. గుర్తింపుకు, పొగడ్తలకు, పదవులకు సంపదలకూ నోచుకోని త్యాగమూర్తులు వీరే. వీరు శ్రమించి, దున్ని, చల్లిన వాక్యపు విత్తనాలే, ఆదినుండి విశ్వాసుల పంటగా ఫలిస్తోంది.

జీతాలు తక్కువ. ఏటేటా మరొక ఊరికి బదిలీలు. సంఘస్తులు వీరిని ప్రేమించి దొడ్లో కాసిన బీరకాయలో, కొబ్బరికాయలో, అడపాదడపా ఏ కోడిగుడ్లో పంపిస్తూ అవసరాలకు ఆదుకునేవారు. క్రొత్తనిబంధన పద్ధతి ఇదే. పేదరికంలోనే తమ ఊరి విశ్వాసుల మందకు కాపరులుగా, బోధకులుగా, చిన్న బిడ్డలకు ఉపాధ్యాయులుగా పాటుపడిన ఈ అజ్ఞాతవీరులు నిస్సందేహంగా పరలోకపట్టణంలో ప్రథమ పౌరులుగా ఘనత పొందుతారు. ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు.

పాతకాలంవారు అప్పటి మిషనెరీల గురించి చెపుతూ గతకాలపు మిషనెరీలు బౌడెన్ బీరు నుండి హీలిస్, మక్రే, బ్రాడ్లీ గార్ల దాకా ఒక యుగమనీ, అటుతరువాత కొంతమార్పు వచ్చిందనీ చెప్తారు. 1886–1936 కాలపు మిషనెరీలు మానవపరమైన రాగద్వేషాలకు అతీతంగా మెలగలేకపోయారు. స్థానికుల్లో కొందర్ని ప్రేమించి కొందర్ని పట్టించుకోకుండా వదిలేసిన మిషనెరీలు ఉన్నారు. చాలామంది మిషనెరీల్లో ఇండియాను పరిపాలించే బ్రిటిష్‌వారి దర్పం కనిపించేది. మైళ్ళతరబడి నడిచి వచ్చిన పేద పంతులు గారు మిషనెరీ బంగళా చేరుకుని మిషనెరీగారితో మాట్లాడాలంటే అరుగు ఎక్కకుండా క్రిందే నిలబడి మాట్లాడాలి. చాలామంది మిషనెరీలు స్వదేశంలో విద్యాధికులు, సంపన్నులు కాదు. అయితే సేవకి సమర్పించుకుని ఇండియాకి వచ్చిన తరువాత ఇక్కడ కొందరి విషయంలో చూస్తే ముగ్గురు బట్లర్‌లు, అసంఖ్యాకంగా సేవకులు. వీరు నివాసమున్న గదుల్లోకి ఆ ఇద్దరు ముగ్గురు సేవకులు తప్ప ఇతరులు వెళ్ళడానికి వీలులేదు.

ఒక ప్రాంతంలో ఆ ప్రాంతపు మిషనెరీమాట వేదవాక్కు. మిషనెరీలు స్థానిక విశ్వాసులను లోతైన ఆత్మీయాను భవంలో నడిపించేవారు. మిషనెరీల బోధల ఫలితంగా అన్యుల్లో నుండి రక్షించబడి క్రైస్తవులైనవారు తమ తోటి ప్రజల ఎదుట చూపిన క్రైస్తవ ప్రవర్తన అసాధారణమైనది. ఆకాశం ఎర్రబడితే దేవుని రెండవ రాకడ వచ్చేసిందని ఆకాశంవంక చూసే విశ్వాసులు ఆ రోజుల్లో ఉన్నారు. తమ స్వాధీనంలో ఉన్న భూమిని రిజిష్టరు చేయించుకుని పకడ్బందీగా హస్తగతం

చేసుకోవడానికి కొందరు విశ్వాసులు అంతగా ఆసక్తి చూపేవారుకారట. ''ఎందుకు దేవుడొచ్చేస్తాడు కదా'' అనే వారట.

మిషన్ స్కూళ్ళన్నీ దాదాపు 1914లోనే ప్రభుత్వ రికగ్నిషన్ పొందినాయి. అంతకు ముందు అంతా టీచర్లకి మిషనరీలే జీతాలిచ్చేవారు. 1960 దాకా ఇవి వీరి ఆధీనంలో ఉంటూ గొప్ప సువార్త కేంద్రాలుగా గ్రామాలల్లో ఉపయోగపడినాయి. ఈ టీచర్లు సంఘకాపర్లుగా సంఘ సేవకులుగా చిరస్మరణీయమైన సేవ చేసారు. మిషనెరీలు సండేస్కూలు పిల్లలకు పరీక్షలు పెట్టి మంచి బహుమతులిచ్చేవారు. ఈ స్కూళ్ళను మిషనెరీవారు 1960లో ప్రభుత్వానికి అప్పగించెయ్యడంతో ఈ పద్ధతికి కోలుకోలేని దెబ్బ తగిలింది.

ఫ్రెడరిక్ నార్త్‌కోట్‌మైల్స్ హీలిస్‌తో కలిసి కోయలమధ్య సేవకు వెళ్ళి వచ్చిన కొద్ది వారాల్లోనే చలిజ్వరం, (మన్యజ్వరం) రక్తవిరేచనాలు వలన 1891 జూలై 29న నర్సాపురంలో అకాలమరణం పొందాడు. ఇతనికింకా 31 నిండలేదు. ఈయన ఇంత చిన్న వయసులో చనిపోవడం గోదావరి ప్రాంతానికే దురదృష్టకరం.

1889దాకా సెలవుమీద స్వదేశంలో ఉన్న మక్రే ఇండియాకి తిరిగిరాకముందే చర్చ్ మిషనెరీ సొసైటీ వారితో బేరసారాలు జరిపి సి.యం.ఎస్. వారి అమలాపురం సేవనూ, అక్కడ ఉన్న వారి కట్టడాలనూ స్వాధీనం చేసుకున్నాడు.

బస్తరు ప్రాంతాలకు లూథరన్ మిషన్‌వారికి సహాయార్థం హీలిస్ వెళ్ళి తన ప్రాణాలమీదకు తెచ్చుకున్న వైనం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. జర్మనీకి చెందిన మిషన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ బ్రెక్లమ్ ష్లెస్‌విగ్ హోల్‌స్టీన్ వారిచే పంపబడ్డ లూథరన్ మిషనెరీలు బస్తరులోని జగదల్‌పూర్‌లో మిషన్ స్టేషన్ స్థాపించగోరి 1882లో రాజమండ్రికి వచ్చారు. అంతకు క్రితం అక్టోబరు 2, 1843లో ఇక్కడికి వచ్చిన జర్మనీదేశానికి చెందిన రెవ. ఎల్.పి.యం. వాలెట్ బౌడెన్‌గారి సోదరి ఏన్ బౌడెన్‌ను వివాహమాడడం ఇంతకుముందే ప్రస్తావించాము. 1844 ఫిబ్రవరిలో వీరు రాజమండ్రిలో లూథరన్ మిషన్ స్థాపించారు. అటు తరువాత 1870

ఆగస్టులో రెవ. హాన్స్ క్రిషి యన్ ష్మిడ్‌గారు రాజమండ్రి వచ్చారు. బస్తరు ప్రాంతానికి హీలిస్‌ను తమతో రమ్మని డాక్టర్ ష్మిడ్ హీలిస్‌ను కోరారు. 1889లో డాక్టర్ ష్మిడ్, హీలిస్‌లు కలిసి కోరుకొండ ఉత్సవానికి కూడా హాజరై సువార్తను బోధించారు.*

జగదల్‌పూర్ పట్టణం ఇంద్రావతి నది ఒడ్డున ఉంది.ఇది రాజమండ్రికి సరళ రేఖ గీస్తే 150 మైళ్ళ దూరాన ఉంది. అంతా క్రూరమృగాలు విచ్చలవిడిగా తిరిగే కారడివి. అంతకు ముందెవరూ ఆ అడివిదాటి వెళ్ళలేదు. ఆ ప్రాంతాలతో కాస్తోకూస్తోపరిచయం ఉన్నది హీలిస్‌కేఅందువల్లేష్మిడ్ ఈయన్నికూడాతోడు రమ్మన్నాడు. మార్చి 15న బయలుదేరి 80 మైళ్ళు పడవ ప్రయాణంచేసి గోదావరి శబరి నదులు కలిసే చోటికి చేరుకోగలిగారు. బస్తరు దక్షిణ సరిహద్దు దగ్గరనుండి నలుగురూ కాలినడకను బయలుదేరారు. తెలుగు తెలిసినవాళ్ళు కనిపించేదాకా వాక్యం బోధిస్తూ వెళ్ళారు. మిగతా 120 మైళ్ళు ఏప్రిల్ 18 నాటికి పూర్తిచెయ్యగలిగారు. జగదల్‌పూరులో దాదాపు నెల ఉన్నారు. ఈ జర్మన్ మిషనరీలు అక్కడ స్థిరపడడానికి అక్కడి రాజావారు అడ్డంకులు పెట్టారు. చేరీ చేరడంతోనే హీలిస్‌కు వడదెబ్బ తగిలింది. అక్కడితో ఇక హీలిస్ ఏ పనీ చెయ్యలేకపోయాడు. ఒక స్ట్రెచ్చర్ కట్టి దానిమీద హీలిస్‌ను వేసుకుని మోసుకుంటూ తిరగవలసి వచ్చింది.

అయితే రోహిల్లాలు అని పిలువబడే బందిపోటు దొంగలే వీరి ప్రాణాలు కాపాడడంలో పాత్ర వహించడం విచిత్రం. రాజాగారి సోదరుడు వీరిని హతమార్చడానికి పన్నిన కుట్ర గురించి ఈ బందిపోట్లు వీరికి చెప్పారు. ఆ రాత్రికి రాత్రే ఆ రాజ్యం విడిచి పారిపోవటానికి వీరు సహాయంకూడా చేసారు. నీరసంగా పడివున్న హీలిస్‌ను మోసుకుంటూ 70 మైళ్ళు ప్రయాణించి కోరాపుట్ చేరారు. ఇక్కడ చల్లని వాతావరణంలో ఇద్దరు ఆగిపోయారు. మిగిలిన ఇద్దరు ఆ కొండలు దిగి వచ్చేసరికి భరించరాని ఎండలు వాళ్ళని ఉక్కిరిబిక్కిరి చేసినాయి. ష్మిడ్‌తప్ప అందరికీ జ్వరాలు కమ్మి సంధిమాటలు మొదలైనాయి. ఎలానో విజయనగరం చేరి కాకినాడకి స్టీమరు ఎక్కి 21వ తేదీన చేరుకున్నారు. ఇల్లు చేరిన హీలిస్ మళ్ళీ మామూలు మనిషి కావడానికి నెలలు పట్టింది.

---

* నర్సాపురం క్రైస్ట్‌చర్చ్(లూథరన్)గొల్డెన్ జూబ్లీ 1979 జ్ఞాపకార్థ సంచికలోనుండి

ఇంత కాయకష్టంచేస్తూకూడా హీలిస్ తన 75వ యేడుదాకా సువార్త సేవలో ముందడుగు వేస్తూనే ఉన్నాడు. ఎన్నడూ విశ్రాంతి కోసం నీలగిరి తదితర ప్రాంతాలకు వెళ్ళలేదు. తెలుగు బైబిలును సరిదిద్దే కమిటీలో పాల్గొనడానికిమాత్రం తప్పనిసరై అప్పుడప్పుడు వెళ్ళవలసివచ్చింది. తన 77వ యేట అంటే 1911 జనవరి 25వ తేదీన తన సేవ చాలించి పరలోకభాగ్యాన్ని పొందాడు. 55 ఏళ్ళు హీలిస్‌గారి భారీకాయం అన్నిరకాల వాతావరణాల్లో అతికటినమైన వ్యయప్రయాసలకోర్చి దుక్కుటెద్దులాగా తన పరమ యజమాని సేవలో కష్టించింది. ఇలాటి సేవకుడు మరి మన ప్రాంతంలో ఇక కన్పించడు. ఈయనతో ఆది మిషనేరీల శకం అంతరించింది.

మిషన్ ప్రారంభం నుండి ఈ సేవతో అతి సన్నిహితమైన సంబంధాలు కలిగియుండి ఇరవయ్యవ శతాబ్దాన్ని చూడగలిగింది ఒకే ఒక వ్యక్తి హెలీనా డి బ్రాస్. ఈమె విధవరాలు, ఈమెకు ఒక పిల్ల. హీలిస్ ఈమెను వివాహం చేసుకున్నాడు. చిన్నపిల్లగా బౌడెన్ ఇంట విద్యనభ్యసించి 1842లో మొదటిగా పాలకొల్లులో బాప్తిస్మం పొంది తల్లి సంఘంలో సభ్యురాలైన హెలీనా, బౌడెన్ బీరు సతుల మరణం తరువాత గోదావరి క్రైస్తవులందరికీ 'అమ్మ'గా అందరి ప్రేమకూ పాత్రురాలైంది. 40ఏళ్ళు హీలిస్‌కి సహధర్మచారిణిగా ఉండి తన 71వ యేట 1901 ఫిబ్రవరి 28న క్రీస్తులో నిద్రించింది.

గోదావరి సంఘ స్థాపనలో భాగం ఉన్న మరొక మహానీయుడు అప్పటికి ఇంగ్లండులో బ్రతికే ఉన్నాడు. రాబర్ట్ ఛాప్‌మన్ 1902 దాకా బ్రతికి నూరవయేట జూన్ 12న బార్న్‌స్టేపుల్‌లో తనువు చాలించాడు.

1886 దాకా ఆంధ్ర ప్రాంతంలో జరిగిన సేవను టూకీగా సమీక్షించడం సమంజసం.

1726లో హాల్—డేనిష్ లూథరన్ మిషన్‌కు చెందిన డాక్టర్‌షుల్జ్ మద్రాసులోని తెలుగువారిమధ్య సేవ చేసాడు. అటుపైన 1805లో లండన్ మిషనెరీ సొసైటీకి చెందిన క్రాన్, డీగ్రేంజెన్‌గార్లు విశాఖపట్నంలో స్థిరపడ్డారు. ఈ సొసైటీ వారే 1822లో కడపలో మిషన్ స్టేషన్ స్థాపించారు. 1836లో బౌడెన్ బీరులు నర్సాపురం వచ్చారు. 1839లో లండన్ మిషనెరీ సొసైటీవారే శ్రీకాకుళంలోకి సేవను విస్తరింపజేసారు.

1840లో డాక్టర్ సామ్యూల్ డే నెల్లూరులో బాప్టిస్టుల తరపున సేవను ప్రారంభించారు. అటుతరువాత 1841 అక్టోబరు 28వ చర్చ్ మిషనెరీ సొసైటీవారి మిషనెరీలు రాబర్ట్ టర్లింగ్టన్ నోబుల్, రెవ.హెచ్. డబ్ల్యు. ఫాక్స్‌గారు మచిలీపట్నం వచ్చారు. జూలై 31, 1842 లో డాక్టరు జాన్ క్రిష్టియన్ ఫ్రెడరిక్ హయర్ గుంటూరు చేరుకుని అమెరికన్ ఇవాంజిలికల్ లూథరన్ మిషన్ ప్రారంభించారు. రెవ. ఎల్.పి.ఎమ్. వాలెట్, రెవ. అగస్ట్ మైలియస్‌గారు 1845, 1865 సంవత్సరాల్లో రాజమండ్రి, సామర్లకోట పేటలో లూథరన్‌వారి సేవను మొదలుపెట్టారు. 1874 మార్చిలో జాన్ బి. మెక్లారిన్‌గారు కాకినాడలో సి.బి.యం. వారి సేవను ప్రారంభించారు. కాకినాడలో బౌడన్‌గారు 1870 నుంచి వుంటూ స్థాపించిన బ్రదరెన్ సంఘం ఆయన కలకత్తాకు తరలిపోతూ మెక్లారిన్‌గారికి అప్పగించగా సి.బి.యం వారి సేవ కాకినాడ ప్రాంతంలో విస్తరించింది. మెక్లారిన్ దంపతులు ఆరంభంలో ఇ. యస్. బౌడెన్‌గారితోనే వున్నారు.

# 12

# సువార్త కేంద్రాలు, మిషనెరీలు, ప్రాంతీయ పెద్దలు

## నరసాపురం

నర్సాపురం ప్రాంతంలో మొదటి అర్థ శతాబ్దినుండి రెండవ అర్థ శతాబ్దిలోకికూడ తమ సేవను కొనసాగించినవారు చార్లెస్ బీరు, వాసా యోహానుగార్లు. చార్లెస్ బీరు 55 ఏళ్ళు నిర్విరామంగా నర్సాపురం సంఘ పాస్టరుగా నమ్మకంగా తన బాధ్యతను నిర్వర్తించి 1921 జనవరి 9వ తేదీన నిత్యవిశ్రాంతి కేగారు.

ఈ అర్థశతాబ్దికాలంలో ఇక్కడ సంభవించిన ఒక ఎన్నదగ్గ పరిణామం జేతని సంఘస్థాపన, మిషనెరీల ప్రాబల్యం తగ్గడం. పాలకొల్లులాటి పట్టణంలో మచ్చుకైనా ఒక మిషనెరీ కాపురం వున్నట్టు కనిపించదు. ఒక్క మిషనెరీ సంస్థ అయినా అక్కడ స్థాపించబడినట్టు చూడము. మిషనెరీలు చాలామంది నర్సాపురంలోనే నివాసమున్నారు. అయితే సంస్థాగతమైన అధికారమేగాని సంఘపరిపాలన నిర్వహణ తదితర బాధ్యతలు స్థానికులే చేపట్టినట్టుగా అర్థమవుతున్నది.

చార్లెస్ బీరు గారికి ఎప్పుడూ సహకారిగా ఉన్న గొప్ప దైవసేవకుడు వాసా యోహానుగారు. వీరు మిషన్ సంఘాలన్నిటికీ సేవకుడైనప్పటికీ బైబిలు సొసైటీ కోల్పోర్టరుకావడంవల్ల బీరుగారితో ఎక్కువ సంబంధం కలిగి ఉండేవాడు. బీరు చనిపోయిన 17 నెలలకు 1922 మే 28వ అమలాపురంలో కలరావల్ల చనిపోయారు. ఈయన చిన్నతనంనుండి బీరుగారి కుటుంబంలోనే పెరిగారు. 1881 సెప్టెంబరులో హీలిస్‌ద్వారా బాప్తిస్మం పొందారు. కోల్పోర్టరుగా పనిచేస్తూ విసుగు విరామం లేకుండా పుస్తకాలను

అమ్మడంలో నైపుణ్యాన్నిపొంది చెన్న రాష్ట్ర రాజధానిలోఅందరికంటే అమ్మకాలలో మొదటివారుగా ఉన్నారు.వీరి సేవలో ఒక శ్రేష్టమయిన అంశం ఏమంటే తాను అమ్మే గ్రంథాలలోని దైవవాక్యంపట్ల తనకున్న భక్తి నమ్మకాలను తెలియజేస్తూ, ఎదురుపడిన వారందరితో మాట్లాడుతూ ఆ వాక్యంలో ఆశను పుట్టించేవారు. సిలువ వెయ్యబడి తిరిగి లేచిన క్రీస్తును కనపరుస్తూ ఆయనద్వారా కలిగే రక్షణను అందరికీ బోధిస్తూఉంటే కూడిఉన్న ప్రజలు నిశ్చేష్టితులై వినేవారు. ఈయన బోధలోని ముఖ్యాంశం సిలువే. ఈయన బోధిస్తూఉంటే తిరస్కారంతో ఈయన్ని ఎదిరించే గర్విష్టులు ఆయనలోని నిష్కాపట్యాన్నిబట్టే వోడిపోతూ ఉండేవాడు. సువార్త సేవలో గొప్ప సామర్థ్యం గలవాడు మాత్రమేగాక, సంఘకాపరిగా అధ్యక్షుడుగా వరం పొందినవాడై అన్నిటిలోనూ అమూల్యమైన సేవ చేసారు. ఈయన రహస్యం ప్రభువు సన్నిధిని మోకరించి ప్రార్థనవల్లను వాక్య ధ్యానంవల్లను శక్తిని పొంది వాక్యం బోధించేటప్పుడు వినేవాళ్ళనందరినీ కదిలించేవాడు. ఈయన వెళ్లే ప్రతి గ్రామంలోనూ సహోదరులు ఈయన్ని ప్రేమతో చేర్చుకునేవారు. ఎందుకంటే తమ సంతోషంలో, దుఃఖంలోకూడా సానుభూతి కలిగి సహాయంచేస్తూ, మంచి సలహాలనిస్తూ, సంఘంలోగాని, కుటుంబాల్లోగాని అవసరంఉండి అడిగిన ప్రతివారికీ సహాయం చేసేవారు. ఎవరన్నా ఏదన్నా సమస్యతెస్తే నిదానంగా శాంతంగా చివరివరకు నిశ్చలంగా జాగ్రత్తగా విని జవాబుగా వాక్యంలోని ఉదహరణలనుతీసి తగిన సలహాలిచ్చేవారు. ఆయన ముఖవైఖరిలో శాంతి, గౌరవనీయమైన టీవి గోచరించేయి. ప్రేమలోను, సానుభూతిలోను కోమల హృదయుడైనప్పటికిని, ప్రభువు నామానికి అవమానంతెచ్చే ఏ విషయమైనా ఎంతో భారం గలవాడై, అలాటి దుర్మార్గులకు తన మాటలు కష్టంగా ఉంటాయని తెలిసికూడా వాళ్ళను ఖండింతంగా గద్దించి బుద్ధి చెప్పడంలో భయపడక ఉండేవాడు. ఆయన సంపూర్ణమైన నిష్కాపట్యం యథార్థతగల ప్రవర్తన, నిశ్చలమైన ప్రేమ ప్రభువు సేవలోని ఆసక్తి అందరికీ తెలుసు గనక, అక్రమ కార్యాలు చేసేవారు కూడా ఆయనకు భయపడి గౌరవించేవారు. ఆయన్ని అనేక విషయాల్లో కష్టపెట్టిన వాళ్ళుకూడా ఆయన తదనంతరం ఆయనపట్ల హృదయంలో వాస్తవమైన గౌరవం కలిగి ఉండేవారు. వాసా యోహానుగారు గోదావరి ప్రాంతంలోని సంఘాలకు అనుగ్రహించబడిన బహు అరుదైన వరం. గత

నూరేళ్ళలో ఈ మిషన్ కనిన వారిలో ఈయన గొప్పవాడనీ, అలాటి ఆధిక్యతకు సమాన వారసుడు ఒక్క గొల్లపల్లి నథానియేలుగారేననీ చదలవాడ జోనాగారు తన గోదావరి డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర పుస్తకంలో రాసారు.

ఈయనకు అయిదుగురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు. నర్సాపురం బేతని సంఘంలో ముందుముందు పెద్దలుగా సువార్తికులుగా ఉన్నవారిలో అధికశాతం ఏదోవిధంగా వాసా యోహానుగారి సంతానమే. పెద్ద కుమార్తె దీనమ్మను చదలవాడ జఖర్యాగారు వివాహం చేసుకున్నారు. ప్రస్తుతం బేతనీ వయోవృద్ధులు. సి.జెడ్. కృపానందంగారు వీరి సంతానం. మరొక కుమార్తె ఎస్తేరమ్మను చిడిపి యాకోబుగారికి ఇచ్చి చేసారు. మూడవ కుమార్తె హెప్సిబమ్మను కూనవరపు తిమోతిగారి కుమారుడు కె.టి. సామ్యుయేలు గారు వివాహం చేసుకున్నందువల్ల ప్రస్తుతం బేతని పాస్టరు జాక్సన్‌గారు, గ్రేస్‌డార్లింగ్, స్పర్జన్‌గార్లు జన్మించారు. మరొక కుమార్తె చంద్రనీలమ్మను జార్జి సుకృతంగారికి ఇచ్చి వివాహం జరిపించగా ప్రస్తుతం బేతని పరిచారకుడు చంద్రశేఖర్‌గారు జన్మించారు. కుమారుడు మెఫీబోషెతుగారికి ప్రస్తుతం బేతని అధ్యక్షుడు జాన్ పంచాక్షరిగారు తదితరులు జన్మించారు. యోహానుగారి రెండవ కుమార్తె ఎస్తేరమ్మగారికి ఈ ప్రాంతాల్లో గొప్ప సువార్తికునిగా పేరుమోసిన చిడిపి యాకోబుగారు జన్మించారు. వీరుగాక ఎబినెజరు, నెహెమ్యా మొదలైనవారు వాసా యోహానుగారి సంతానమే. ఈ ఎబినెజర్‌గారికి బైబిలులో ఏ వాక్యం, ఏ రిఫరెన్సు కావాలన్నా తడుము కోకుండా చెప్పేసే ప్రజ్ఞ ఉండేది. అందుకే వీరిని ' Living Concordence' అని పిలిచేవారట. మెఫీబోషెతుగారు మంచి వైద్యుడుగా పేరు తెచ్చుకున్నారు. బేతనీ సంఘపెద్దగా, సువార్తికుడుగాకూడా వీరు సేవ చేశారు.

నర్సాపురం ప్రాంతాల్లో అప్పటికి ఉన్న సంఘాలు మూడు. అవి పాలకొల్లు, నర్సాపురం, అగర్తిపాలెం. ఆరవల్లి, కొండేపాడు, కోరుమిల్లి గ్రామాల్లోకూడా సంఘాలు పురాతనమైనవే.

నర్సాపురం సంఘానికి చార్లెస్ బీరు పాస్టరుగా ఉంటూ వాసా యోహానుగారి సహాయంతో నమ్మకంగా సేవచేసారు.వీరితో కలిసి మాముడూరి

సైమన్, చదలవాడ జఖర్యా, పింజర్ల కోటయ్య, తొత్తరమూడి జోన్సు, కూనవరపు తిమోతి, చదలవాడ జోనాగారు తదితరులు పనిచేసారు. 1900 సంవత్సరం ప్రాంతాల్లో క్రొత్త సంవత్సరం మీటింగులు పై మూడు సంఘాలమధ్య సహవాసార్థం హీలిస్‌చే ప్రారంభించబడినాయి. అవి ఇప్పటివరకు సగంచెర్వు గ్రామంలో కొనసాగుతున్నాయి. ఆ కాలంలో సగంచెర్వు బల్లకట్టుకు ఇవతల మెరకమీద హిలిస్‌గారి టెంట్ వేసి మీటింగులు నడిపారట. కొంతకాలం సంవత్సరానికి ఒక ఊరు చొప్పున ఈ మూడుచోట్ల ఈ మీటింగులు జరిగినాయి. 1915 నాటికి నర్సాపురంలో చార్లెస్ బీరు దంపతులు, బోయడ్ దంపతులు, బ్రామ్లీ దంపతులు సేవలో ఉన్నారు.

ఈ కాలంలో జరిగిన అతి ప్రాముఖ్యమైన సంఘటన ఏమంటే 1915లో డాక్టర్ చార్లెట్ ఇ. ప్రింగ్ నర్సాపురం స్త్రీల ఆస్పత్రి స్థాపించడం. ఈమెకు డెయిసీ ప్రిమ్టన్, కొద్దికాలం మార్గరేట్ హేమ్టన్ గార్లు సహాయపడ్డారు. 1930లో డాక్టర్ క్రిస్టీన్ వైన్, డాక్టరు ప్రింగ్‌కి తోడుగా వచ్చారు. మిస్ సిబిల్ టేలర్‌కూడా 1928లో ఆస్పత్రిలో సహాయకురాలిగా వచ్చి మూడేళ్ళ తరువాత హవుస్‌బోట్ ఇవాంజిలిజం చేపట్టి అమలాపురం ప్రాంతానికి వెళ్ళిపోయింది.

1923లో అంటే నర్సాపురం స్త్రీల ఆస్పత్రి ప్రారంభించిన ఎనిమిదేళ్ళకు జాన్ మెక్రిడ్ బోయిడ్ కృషి ఫలితంగా బేతెస్థ కుష్టురోగుల ఆస్పత్రి ప్రారంభించబడింది. వీరు 1911లో ఇండియాకు వచ్చి 1923లో చార్లెస్ బీరు కుమార్తె ఎడితు బీరును వివాహమాడారు. ఆరంభంలో నరసాపురం మిషన్ బంగ్లాలో డిస్పెన్సరీ నడిపారు. ఈయన వైద్య సంబంధమైన విద్య నేర్చుకొనప్పటికి భారం కలిగియుండి వ్యక్తిగతమైన త్యాగాలుచేసి ఈ ఆస్పత్రిని స్థాపించారు. డాక్టరు జె. ఇ. లాంగ్ 1920లో వచ్చి నాలుగేళ్ళపాటు వీరికి సహాయకులుగా ఉంటూ మగవారికి ఆస్పత్రి పెట్టారు.వీరు కుష్టురోగుల్ని,గ్రుడ్డివారినీ ఆదరంగా భుజంమీద చెయ్యివేసి నడిపించుకుని వచ్చేవారు. బోయిడ్‌గారు బూల జీవరత్నంగారికి మిరాజ్‌లో డాక్టరు శిక్షణనిప్పించి లాంగ్‌గారి దగ్గర అప్రెంటిస్‌గా నియమించారు. వీరే చిడిపి సామేలుగారు యేళ్ళ విక్టర్‌గార్లకు కాంపౌండరు శిక్షణ నిప్పించారు. ఈ రెండు ఆస్పత్రులను గురించి ప్రత్యేకంగా చదువుకుందాం.

బోయిడ్‌గారు, లాంగ్ కలిసి మగవారి ఆస్పత్రిని స్థాపించడంలో పాత్ర వహించారు.

1921లో ఎల్‌ఫ్రెడ్‌హిచ్‌కాక్ నర్సాపురం వచ్చారు. మొదటి ప్రపంచ యుద్ధంలో ఇజ్రేల్ దేశంలో వీరు మిలటరీ ఆఫీసరుగా పని చేసారు. బ్రామ్లీ పేటలో పంటకాలువ ప్రక్కన చిన్న ఇంట్లో నివాసముండి 1923లో భార్య ఆరోగ్యం సరిలేనందువల్ల బ్రామ్లీ కుటుంబం సెలవుమీద వెళ్తుంటే వాళ్ళతోకలిసి ఆమె వెళ్ళిపోయింది. భార్య అనారోగ్యం వల్ల హిచ్‌కాక్ స్వదేశం వెళ్ళిఅక్కడ ఛాప్లిన్‌గా పనిచేసారు. ఆమె మరణం తరువాత బ్రామ్లీగారి కూతురు మిల్లీని వివాహమాడాడు. 1957దాకా బ్రామ్లీ సతీమణి వీరితోనే ఉంటూ ఉండేది. హిచ్‌కాక్‌గారికి తెలుగువారన్నా వారిమధ్య సేవఅన్నా కడుప్రీతి. 80వ యేట తన మరణందాకా రాయబారి పత్రికను తెప్పించుకుని చదివేవారు. సెలవుమీద స్వదేశానికి వచ్చిన మిషనెరీలకు వరి అన్నం, కూర వండి వడ్డించేవారు. మిస్ హేమ్మన్, మిస్ ష్రిమ్టన్, మిస్ బ్లాక్‌గార్ల వైద్య సేవ సమయంలో హిచ్‌కాక్ ఇక్కడే ఉన్నారు. మిస్ హేమ్మన్, ష్రిమ్టన్‌గార్ల స్వభావాలనుబట్టి వీరిద్దరినీ తొందరమ్మ, శాంతమ్మ అని ఆయన వేళాకోళంగా పిలిచేవారు.

మిస్ ఎడితు మోర్గన్ 1914లో వచ్చి తన 84వ యేటదాకా నర్సాపురం చుట్టుప్రక్కల ప్రాంతాల్లో సువార్త సేవను బహునమ్మకంగా ప్రకటించింది. అగ్రకుల స్త్రీలు ఈమెను ముక్కువగా తమ గృహాల్లోకి ఆహ్వానించి సువార్త వినేవారు. ఈమె పాలకొల్లులో జేమ్సు పీటర్‌సన్ గారి ఇంట్లో మకాం వేసి స్త్రీల మీటింగులు ప్రారంభించి చాలా ప్రోత్సాహకరమైన సేవ చేసింది. ఒరిగేటి మిరియమ్మ, పెనుమాక ప్రుడెన్సమ్మ అనే స్త్రీలు ఈమెకు సహాయకురాళ్ళుగా ఉండేవారు. వీరు వృద్ధాప్యంలో తుంటి ఎముక విరిగి పడకమీదే కాలం గడిపారు. అప్పుడు డ్రైవర్ నాగన్న గారు చివరిదాకా ఈమెకు కొడుకుకంటె మిన్నగా చేదోడువాదోడుగా ఉన్నారు. నాన్నగారు ఈ మధ్యనే నర్సాపురంలో మృతిజెందారు.

1921లోనే జెస్సీవెబ్బ నర్సాపురం వచ్చి హిచ్‌కాక్‌తో కలిసి చుట్టుప్రక్కల ప్రాంతాల్లో అసెంబ్లీ స్థాపనకు కృషిచేసారు. ఈయన 1953 దాకా అమలాపురం, కడియం, ప్రత్తిపాడు ప్రాంతాల్లో మంచిసేవ

*personal communication - Eustace Hans Bromley

జరిగించారు. 1953లో నీలగిరికి వెళ్ళి అక్కడ చనిపోయారు. ఈయన గొప్ప బైబిలు టీచరు. తెలుగులో చాలా పుస్తకాలు వ్రాశారు. వీరి సతీమణి మార్జరీవెబ్బు 1958దాకా రాజమండ్రిలో సేవచేసారు. ప్రస్తుతం ఇంగ్లాండులో వుంటున్నారు. వయసు సుమారు 90 ఏళ్ళు.

1922లో మిస్ హెలెన్ మన్రోకూడా నర్సాపురంవచ్చి తెలుగు నేర్చుకుని తదుపరి బెండమూర్లంకలో మిస్ మార్గన్, మిస్ రాబర్ట్సన్‌లను వెళ్ళి కలిసారు. మిస్ ఎడితు మార్గన్ 1914లోను, మిస్ ఆర్ఫాడయాసన్ 1926లో వచ్చి నర్సాపురం ప్రాంతాల్లో హవుస్‌బోటుద్వారా సువార్త చెప్పారు.

ఇప్పుడు గోదావరి ప్రాంతాల్లో ముఖ్యంగా నర్సాపురం, తదుపరి కొయ్యలగూడెం ప్రాంతాల్లో శ్రేష్టమయిన సేవను చేసిన ఒక మహనీయుని చరిత్రను నెమరు వెయ్యాలి. మన సంఘాల్లో వెలువడిన అన్ని చరిత్ర గ్రంథాలకూ, ఈ 150యేళ్ళ చరిత్ర గ్రంథానికీకూడా, ఆధారమైన **They were men sent from God** నే గ్రంథ రచయిత యూస్టేస్ బి. బ్రామ్లీ. బీరు కుటుంబంచే నడిపించబడుతున్న నర్సాపురం స్కూలును కన్నబిడ్డలాగా సాకి ఈ ప్రాంతమంతటికీ విద్యా సుగంధాన్ని వ్యాపింపజేసాడు బ్రామ్లీ.

యూస్టేస్ బ్లేక్ బ్రామ్లీ, అక్క అమీనియాకుజ్‌నెర్ బ్రామ్లీ, వీరిద్దరి తల్లి కేట్ టాయ్‌యా బ్రామ్లీ, రైట్ ద్వీపంలో షాంక్లిన్‌లో ఉంటూ ధవిలేశ్వరంలో పనిచేసిన రాబర్ట్‌రాసన్‌గారి సాక్ష్యంవల్ల ప్రభావితులై గోదావరి ప్రాంతానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నారు. బ్రామ్లీ తన 21 యేట అప్పటికే టీచరు ట్రెయినింగు పొంది నర్సాపురం పాటశాలకు ప్రధానోపాధ్యాయుని అవసరం ఉన్నందున తన సోదరి, 57 సంవత్సరాల వయసున్న తల్లితోసహా 1903లో ఇండియా చేరుకున్నారు.

అన్నా ఎలిజబెతు హెర్వింగ్ జర్మనీ దేశస్తురాలు. బాలికగా నున్నప్పుడే మిషనెరీగా వెళ్ళాలన్న కోరిక ఆమె మనసులో ఉండేది. బేస్లర్ మిషన్‌వారు ఆమెను ఇండియా పంపడానికి నిశ్చయించి ఇంగ్లీషు నేర్చుకునేందుకు ఇంగ్లండు పంపారు. ఇక్కడ గోదావరి ప్రాంతంతో పరిచయముండున్న మిస్ మేక్నస్, హంటిగ్డన్ స్టోన్‌గార్లద్వారా ముంచడం బాప్తిస్మం పద తులు

తెలుసుకుని తన తల్లి సంఘాన్ని ధిక్కరించి బాప్తిస్మంపొంది, ఇంగ్లండులోని బ్రదరెన్‌వారితో కలిసి మెలిసిఉంటూ ఉండేది. ఎట్టకేలకు తన 25వయేట 1905లో అమలాపురం చేరుకుని మర్రికే దంపతులకు సహాయం చేసింది. 1907లో బ్రామ్లీగారిని వివాహం చేసుకుని ఇద్దరూ నర్సాపురం 'కాటేజి'లో కాపురం పెట్టారు. 1911లో మొదటిసారి వీరు రైట్ ద్వీపానికి సెలవుకని వెళ్ళిన సమయంలో బ్రామ్లీసోదరి క్షయవల్ల చనిపోయాక నరసాపురం వచ్చారు.

డిసెంబరునుండి ఫిబ్రవరి వరకు వచ్చే సెలవుల్లో తల్లి, భార్యతో కలిసి సువార్తసేవచేస్తూ తక్కిన కాలమంతా స్కూలు వ్యవహారాలు చూసుకుంటూ బ్రామ్లీగారు చాలా ప్రయాస పడ్డారు.

నర్సాపురం స్కూలును 1905లో హైయర్ ఎలిమెంటరీస్కూలు గాను 1921లో మిడిల్ స్కూలుగాను అభివృద్ధి చెయ్యడంలో వీరు కృషి చేసారు. స్కూలు అప్పట్లో కేజిల్‌లో ఉండేది. ఆవరణలో ప్రవేశించగానే కుడివైపున స్కూలు, ఎడమ వైపున ఆలయం ఉండేది. ఈ ఆలయాన్ని ఆదివారపు ఆరాధనకుతప్ప మరి ఏ పనికీ వాడేవారు కారు. లోపలి వైపున బాలికల పాటశాల ఉండేది. ప్రస్తుతం బ్రామ్లీపేటగా పిలవబడుతున్నచోట బాలురకు హాస్టలు, బ్రామ్లీగారు కాపురం ఉన్న కాటేజి ఉండేది. నాగాబత్తుల దేవానందం, బాలా యోహాను, కప్పల యాకోబుగార్లు తదితరులు ఈ కాంపౌండులో ఉంటూఉండేవారు.

1922లో బేతని ఆలయం కట్టిన తరువాత అక్కడి ఆలయం ఇటు తరలించబడింది. అలానే పాటశాలను మిడిల్ స్కూలు చేసిన సమయంలో స్కూలుకూడా జోనా రోడ్డులో ప్రస్తుతం ఉన్నచోటికి మార్చబడింది. బేతని ఆలయ నిర్మాణం ఎలా జరిగిందంటే— విశ్వాసులు పెరుగుతున్నకొద్దీ కేజిల్ ఆవరణంలోఉన్న ఆలయం ఇరుకైనందువల్ల పెద్ద ఆలయం కట్టించే ఉద్దేశంతో లేసు వ్యాపారంలో సంపన్నులైన క్రైస్తవులు చందాలు వేసుకోగా 1500 రూపాయలు పోగైనాయి. స్థలంకోసం అర్జీ పెట్టుకుంటే త్రిభుజాకారంలోఉన్న చిన్న పోరంబోకు స్థలం గ్రాంటు అయింది.

ఈ సమయంలోనే చదలవాడ జోసెఫ్‌గారికి టైఫాయిడ్‌వల్ల తీవ్రమైన సుస్తీ చేసి ఎంత కాలానికీ తగ్గలేదు. వైద్యులు లాభం లేదన్నారు.

ఇక ఆశలు వదిలేసిన సమయంలో భార్య వైడూర్యమ్మగారు తన భర్తకు బాగైతే నర్సాపురం సంఘానికి ఆలయం కట్టిస్తానని దేవునితో ఒప్పందం చేసారు. జోసెఫ్‌గారికి ఆప్తమిత్రులైన వాసా మెఫిబోషెతుగారి వైద్యంవల్ల అద్భుతమైన రీతిలో జోసెఫ్‌గారు కోలుకున్నారు. అప్పుడు వీరుపూనుకుని 25,000 రూపాయలు స్వయంగా ఇచ్చి అప్పటికే గ్రాంటు అయిన స్థలాన్ని ఆనుకునిఉన్న మరొక ఎకరం స్థలాన్ని కొని ఆలయాన్ని నిర్మించారు. జోసెఫ్‌గారు దాదాపు చనిపోయి మళ్ళీ బతికినందువల్ల, బేతనిలో యేసు లాజరును లేపిన సంఘటనను స్మరణకు తెచ్చేదిగా ఈ ఆలయానికి 'బేతని' అని పేరు పెట్టి 1923 మార్చి 7న ప్రతిష్ఠించారు. కంకిపాటి మత్తయిగారు ఈ ఆలయానికి బెంచీలను కానుక ఇచ్చారు. ఈ ప్రాంతాల్లో కారుమీద తిరిగిన మొదటి వ్యక్తి వీరే. వీరి భార్య జుత్తుగ యోహానుగారి కూతురు. ఆలయపు వింగ్‌లనుకూడా జోసెఫ్‌గారే కట్టించి1956డిసెంబరు12న ప్రతిష్ఠించారు.

చార్లెస్ బీరు వాసా యోహానుగార్లు పాస్టర్లుగా ఉండగా నైలా బత్తుల ఆనందం, మత్తి జోసెఫ్‌గార్లు నర్సాపురం ప్రాంతపు సువార్తికులుగా పనిచేసారు. 1924 ప్రాంతంలో పెద్దలు పరిచారకులను ఏర్పరిచే పద్ధతి వచ్చినప్పటినుండి నర్సాపురం సంఘానికి చదలవాడ జఖర్యా, మామూడూరి సైమన్, చదలవాడ జోనా, నేస్మితుగార్లు తదితరులు పెద్దలుగా వ్యవహరించారు వాసా యోహానుగారి తరువాత కన్నిపాముల మోషేగారిని కొల్పోర్టరుగా నియమించడం జరిగింది. వీరుగాక చాగల్లు జి.డి.యం. ప్రెస్‌లో పనిచేసిన భగవాన్ రాజుగారు తదితరులు బేతనిలో పరిచారకులుగా ఉన్నారు. ఆ రోజుల్లో చాలాకాలం స్థానికుల్లో మామూడూరి సైమన్‌గారికి మాత్రమే ఈ ప్రాంతాల్లో పెళ్ళిళ్ళ పట్టా ఉండేది. వీరి కుమారుడు మిషన్‌స్కూల్లో తెలుగు పండిట్‌గా పనిచేసిన కస్తూరి సాంబమూర్తిగారి కుమార్తెను వివాహమాడారు. సైమన్‌గారు హాలెండ్ వార్ఫ్ హాస్టలు వెనుక ఉన్న ఇంట్లో నివాసముండేవారు. వీరు గీత రచయితకూడా.

గోదావరి డెల్టా ప్రాంతపు స్కూళ్ళన్నీ బ్రామ్లీగారి పర్యవేక్షణలో ఉండేవి. సైకిలుమీద, పడవమీదావెళ్ళి వాటిని దర్శిస్తూ ఉండేవారు. తన హయాంలో 60 ఎలిమెంటరీ స్కూళ్ళను స్థాపించారు. ఈయన

చాలా కష్టజీవి. యవ్వనంలో ఇలా ఒళ్ళు దాచుకోకుండా పనిచేసినందువల్లనే గుండె బలహీనమైన వీరు తన 63వ యేటనే కాలం చేసారు. బ్రాహ్మీ సతీసుణి బాలుర హాస్టలును అజమాయిషి చేసేవారు. ఇంతేకాక హోమియోపతి వైద్యంలోకూడా ఈమె సిద్ధహస్తురాలు. ఇవన్నీకాక ఆరుగురు పిల్లలను సాకిన సహనమూర్తి. ఈమె జర్మనీకి చెందినది కాబట్టి మొదటి ప్రపంచయుద్ధం ప్రభావంవల్ల ఎండాకాలాల్లో కొండలకు వెళ్ళడం క్షేమం కాదని నర్సాపురంలోనే ఉండిపోయేది. ఎండ వేడిమివల్ల వీరి ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉండేది.

బ్రాహ్మీగారి తల్లి ఉదయం వేళల్లో స్త్రీలనుండి లేసు అల్లికలను పోగుచేసి వారి తరుపున ఇంగ్లండుకు ఎగుమతిచేసే వ్యవహారాలు పర్యవేక్షించే వారు. సాయంత్రంవేళ మారెమ్మ, రోసమ్మ అనే బైబిలు స్త్రీలతో నర్సాపురం పరిసర గ్రామాలకు బోటుమీదనో, బండిమీదనోవెళ్ళి సువార్త ప్రకటనలో పాలు పంచుకునేవారు.

బ్రాహ్మీగారు వోసారి అంతర్వేది తీర్థంలో వాక్యం ప్రకటిస్తుంటే కొండేటి బండవెంకట్రాజు అనే వస్తాదు వీరికి ఆటంకం కలిగిస్తూ సువార్త ప్రకటించడానికి వీల్లేదన్నాడట. బ్రాహ్మీగారు చాలాసేపు సహించి చివరికి వెంకట్రాజు చేతిని ఒక్కసారి దొరకబుచ్చుకున్నాడట. తన చేతిని విడిపించుకోవడానికి వెంకట్రాజు పెనుగులాడి ముచ్చెమటలుపోసి చివరికి బ్రాహ్మీగారిలోని దైవశక్తిని గుర్తించాడట. బ్రాహ్మీగారు "నాయనా ఇది దైవకార్యం. మానవులెవరూ అడ్డుతగలడానికి వీల్లేదని" చెప్పి అతన్ని పంపించారట..

1922లో బ్రాహ్మీగారు స్కూలు భారాన్ని నేస్మితుగారికి అప్పగించి హవున్‌బోటులో గ్రామాదులకు, దూరప్రాంతాలకు సువార్తసేవకని వెళ్ళడం ప్రారంభించారు. ఈ కాలంలోనే రెడ్డిసీమ కోయలమధ్య సంఘాలను నాటే పనికి దేవుడు తనను పిలుస్తున్నాడని గ్రహించాడు బ్రాహ్మీగారు. అప్పటికి ఆడమ్సుగారు నగరం ద్వీపంనుండి చాగల్లుకు మకాం మార్చుకుని ఈ ఉద్దేశంతోనే ఉన్నారు.

బ్రాహ్మీగారు కన్నాపురం, కొయ్యలగూడెం ప్రాంతాలను దర్శించి చివరికి సదుపాయంగా ఉంటుందని 1930లో కొయ్యలగూడెంలో ఒక

మిషనెరీ బంగళా నిర్మించాడు. కీలక స్థానాలైన గన్నవరం, చొప్పరామన్న గూడెం గ్రామాల్లో స్కూలు, ఆలయం నిర్మించడానికి సరిపోయిన స్థలాలనుకూడా కొనుగోలు చేసారు. ఈ విశేషాలన్నీ కొయ్యలగూడెం ప్రాంతాన్ని చర్చించే సందర్భంలో సవిస్తరంగా చదువుకుందాం.

బోయిడ్‌గారి ఆహ్వానం మేరకు స్కాట్‌లాండ్‌నుండి ఆర్చిబాల్డ్ నేస్మితు నర్సాపురం జూనియర్ సెకండరీస్కూలు బాధ్యతలు స్వీకరించేందుకు వచ్చారు. 1922లో వచ్చి 36 ఏళ్ళపాటు ఇక్కడ పనిచేసారు. బాలుర హాస్టలుకూడా నేస్మితుగారికి అప్పగించబడింది. ప్రస్తుతం మిషన్‌హైస్కూలు గ్రౌండులోఉన్న బ్యాలాలోకి నివాసం మార్చుకుని ఇక్కడే బాలుర హాస్టలు బిల్డింగు కట్టించి దాన్ని అజమాయిషి చేసారు. నర్సాపురం స్కూలు వీరి హయాంలోనే హైస్కూలుగా మారింది. నేస్మితుగారు సువార్త సేవకుల ఉపయోగార్థం స్వల్పకాలిక బైబిలు తరగతులను నిర్వహించారు.

ఇవన్నీగాక తెలుగు క్రైస్తవులకు ఈయన చిరస్మరణీయంగా ఎందుకు అయ్యాడంటే తెలుగులో మొదటిసారిగా బైబిలు విషయసూచిక (Concordence) ను వీరు ఏర్పికూర్చారు. మొదట క్రొత్తనిబంధనమీద దీనిని తయారుచేసారు. 1958లో రిటైరైన తరువాత ఇంగ్లండు కెనడా దేశాల్లో మంచి బైబిల్ టీచరుగా పేరుగాంచారు. ప్రస్తుం వీరికి 90 యేళ్ళు.. రక్త ప్రసరణ లోపంవల్ల యిటీవల్ల ఆపరేషన్‌చేసి కాళ్ళు రెండూ తీసేసారు. ఈ స్థితిలోఉంటూ పాతనిబంధన విషయసూచికకూడా వీరు పూర్తిచేసారు. ఇదే నాటికీ నేటికీ తెలుగు భాషలో ఏకైక బైబిలు ఆకారాదిపట్టిక. 1986లో నర్సాపురంలో జరుగుతున్న 150 సంవత్సరాల ఉత్సవాల్లో వీరి పెద్దకుమారుడు డా. జేమ్సు నేస్మితుగారు ప్రసంగికులుగా ఆహ్వానించబడ్డారు.

నేస్మితుగారు పాలకొల్లుకు సైకిలుమీదవెళ్ళి రాత్రి సువార్తకూటాలు నడిపేవారు. ఒకవైపు స్కూళ్ళ నిర్వహణ, సంఘ బాధ్యతలు మరొకవైపు దేశంలో నలుమూలలా ప్రసంగికుడుగా పేరుపొందారు. నేస్మితుగారు చాలాకాలం బేతనిలో పెద్దగా ఉన్నారు. అనేకమైన పుస్తకాలు రాసారు. రాయబారి పత్రికకు సంపాదకులుగా వున్నారు. వీరు వ్రాసిన కీర్తనలు కొన్ని నిత్యం మనం పాడుకొంటున్నాం. వారానికి రెండుసార్లు వీరు నరసాపురం సెంటరులో గడ్డిబజారులో ఎలుగెత్తి సువార్త ప్రకటించెవారు. వీరితో కలిసి ఈ కాలంలో సంఘ సేవాభారాన్ని నిర్వహించిన ప్రముఖుల విషయానికి వద్దాం.

చదలవాడ జోసెఫ్, సోఫియాగార్లకు ముగ్గురు కుమార్తెలు, ముగ్గురు కుమారులు. పెద్దకొడుకు థామస్‌గారు జోనా జోసెఫ్‌గార్ల తండ్రి. సమూయేలుగారికి సంతానంలేదు. మూడవ కుమారుడు జఖర్యాగారు. కుమార్తెల పేర్లు హానెమ్మ, ఓడియమ్మ, నవోమిగార్లు. హానెమ్మగారు కొమానపల్లి దానియేలుగారిని చేసుకొన్నారు. ఈమె ప్రస్తుతం నర్సాపురం పెంతెకోస్తు సేవకు పునాదివేసిన కొమానపల్లి సుదర్శనంగారి నాయనమ్మ. నవోమి ఖండవల్లి వారిని వివాహమాడగా విలాసమ్మగారు జన్మించారు. వీరు ముప్పిడి రాబర్ట్సనుగారిని చేసుకోగా ఇవాన్స్, జోయ్, ఆర్చి, ప్రస్తుతం ఇంగ్లండులో వ్యాపారంలోఉన్న పెర్సివాల్‌గారు జన్మించారు.

చదలవాడ జఖర్యాగారు 1876లో జన్మించి కుటుంబ పోషణార్థం వ్యవసాయంచేస్తూ ప్రైవేటుగా ప్రైమరీనుండి 7వ తరగతి వరకు రాగలిగారు. క్రిస్టియన్ పేటలోని బ్రాహ్మీగారి యాజమాన్యంలోఉన్న ఎలిమెంటరీస్కూల్లో పనిచేసేవారు. వాసా యోహానుగారి పెద్ద కూతురు దీనమ్మగారిని వివాహమాడారు. వీరికి జోనా, కృపానందం, రాజమ్మ, పుష్పమ్మ కమలమ్మ, విమలమ్మగార్లు జన్మించారు. జఖర్యాగారి సతి తన 30వ యేట మరణించింది. జఖర్యాగారు రచించిన 20కి పైగా భక్తి రసాత్మక కీర్తనలను డెల్టా సంఘాల్లో పాడుకుంటారు. ఇది గాక అడమ్సుగారితో కలిసి రాయబారి ఎడిటరుగా పనిచేసారు. బేతని సంఘ పాస్టరుగా, బేతనిట్రస్ట్ కమిటీకి సెక్రటరీ, ట్రెజరర్‌గా 50 ఏళ్ళు, నమ్మకమైన సేవచేసారు. పాలకొల్లు, మల్లవరం, ఆగర్తిపాలెం, పోలవరం, నవరసపురం, మొగల్తూరు తదితర ప్రాంతాలకు కాలినడకనవెళ్ళి సువార్తసేవ చేసేవారు. "భగవతు కుశల వార్త" మొదలైన సువార్త కరపత్రికలు రాసారు. కాలేయానికి సంబంధించిన వ్యాధి వల్ల 1951 మార్చి 31న తన ప్రయాసను ముగించి నిత్య విశ్రాంతికి చేరుకున్నారు.

వీరి సోదరులు థామస్‌గారు ముత్యాలపల్లిలో దైవసేవకులుగాఉంటూ ఉండగా థామస్ మంగమ్మగార్ల జ్యేష్ఠ పుత్రుడు జోనాగారు 1886 జూలై 23వ తేదీన జన్మించారు. వీరి తరువాత జోసెఫ్‌గారు జన్మించారు. వీరిద్దరుగాక థామస్‌గారికి జ్ఞానముత్యం, డేవిడ్, కాంతమ్మగార్లుకూడా జన్మించారు. థామస్‌గారు అమలాపురానికి సేవకుడుగా వెళ్ళడంవల్ల జోనాగారి

బాల్యం, విద్యాభ్యాసం అక్కడనే జరిగింది. నర్సాపురం, సామర్లకోట, రాజమండ్రిలో విద్య, ఉపాధ్యాయ ట్రెయినింగు ముగించుకుని అమలాపురం మిషన్‌స్కూల్లో 1906నుండి 1909 వరకూ పనిచేస్తూ అక్కడే రక్షణ పొందారు. అటుపైన 1908 జనవరి 14న నర్సాపురం వాస్తవ్యులు బొడ్డు నారాయణస్వామిగారి కుమార్తె జీవరత్నమ్మను వివాహమాడారు. 1909 తరువాత పాలకొల్లు, నర్సాపురం స్కూళ్ళలో పనిచేస్తూ ఈ ప్రాంతపు మిషన్ స్కూళ్ళ సూపర్‌వైజరుగా నియమితులైనారు.

ఈ కాలంలోనే ఈ వంశంవారి లేసు వ్యాపారం ఉన్నత దశకు చేరుకుంది. ఈ వ్యాపారానికి మిషనెరీలు అడ్డం చెప్పినందువల్ల 1911 నుండి ఉద్యోగం మాని తమ్ముడు జోసెఫ్‌గారితో కలిసి "జోనా అండ్ జోసెఫ్ బ్రదర్స్," అనే పేరుతో 42 సంవత్సరాలు లేసు వ్యాపారం చేసారు. వీరి కడగొట్టు కుమారుడు, బేతని సంఘాధ్యక్షులు సి.జి. జ్ఞానప్రకాశరావు గారి యాజమాన్యంలో ప్రస్తుతం ఈ కంపెనీ నడుస్తూ ఉంది.

జోనాగారు 1913లో నేటివ్ క్రిస్టియన్ ఇవాంజిలిస్టిక్ సొసైటీ స్థాపించి సువార్త సేవకై ప్రయాసపడ్డారు. ముస్కోపాలెంలో సంఘస్థాపన, ఆలయనిర్మాణం వీరి చేతుల మీదుగా జరిగినదే. చిడిపి యాకోబు, చదలవాడ జఖర్యా తదితరులతో కలిసి ఎర్నగూడెం ప్రాంతపు మన్య ప్రజలకు సువార్త బోధించారు. యువకులమధ్య సేవ, సండేస్కూలు సేవను ప్రోత్సాహించేవారు. వీరు మంచి కవి. కీర్తనల పుస్తకంలో భావగర్భితాలు, భక్తి ప్రేరణాలు అయిన వీరి రచనలెన్నో కనిపిస్తాయి. ఎన్నో వ్యాసాలు, రచనలు గాక 'యాత్రికుని పరమ సదని' అనే పుస్తకాన్ని రచించి 1933లో ప్రచురించారు. ఇది యాత్రికుని ప్రయాణం అనే పుస్తకానికి వ్యాఖ్యానం. 1948లో గోదావరి డెల్టా పాటల పుస్తకపు 11వ కూర్పు జోనాగారి ప్రయాసవల్ల వెలువడింది. అనేక సువార్త సభలకు ఆహ్వానించబడుతూ గంభీరంగా దైవవాక్యోపదేశం చేసేవారు. రాయబారి పత్రికకు సంపాదకులుగా కూడా పనిచేశారు.

1953లో చెట్టిపేట బైబిలు క్లాసుల్లో ప్రసంగించడానికి వెళ్ళి

ప్రభువు రెండవ రాకడగురించి ఉపన్యసించారు. రాత్రి భోజనంచేసి తన గదిలోకి వెళ్ళి బైబిలు చదువుకుని పడుకున్నారు. కొందరు మరుసటి ఉదయం వెళ్ళిచూస్తే మాట లేకుండా మంచంమీదనుంచి క్రిందికి పడిపోయి ఉన్నారట. షేర్ దొరగారు వెంటనే కారులో వీరిని నర్సాపురం చేర్చగా పక్షవాతంవల్ల తన 67వ యేట 1953 డిసెంబరు 31న ప్రభువు సన్నిధి కేగారు. ఈయన తన సేవలో, వాక్యపరిచర్యలో ఉదారస్వభావంతో విశ్వాసులకు ఆదర్శంగా నిలిచారు.

మామిడూరి సైమన్‌గారు నర్సాపురం మిషన్ సెంట్రల్ స్కూల్లో 8వ స్టాండర్డు చదివి అక్కడే టీచరుగా పనిచేసారు. ఇంకా అమలాపురం, పాతాళ్ళదిబ్బ, గ్రామాదుల్లో పనిచేసారు. ఉపాధ్యాయవృత్తి విరమించిన తరువాత జేతని సంఘాధ్యక్షులుగా, సంపూర్ణ సువార్త సేవకుడుగా పనిచేస్తూ సొంత హవుస్‌బోటుమీద గ్రామాలు తిరిగి సువార్త సేవ, సంఘ నిర్మాణాది కార్యక్రమాలు చేపట్టారు. ఉభయ గోదావరుల్లో ప్రథమంగా ప్రభుత్వం నుండి వివాహలైసెన్సుపొంది అనేక వివాహాలు చేసారు. అంతర్వేది తీర్థంలో వీరికి ప్రత్యేకంగా డేరా ఉండేది. వీరు తన 80వ యేట తనువు చాలించారు. జేతని చర్చికౌన్సిల్‌లో అగ్రగణ్యుడుగా, తగువులు తీర్చడం, సమస్యలను పరిష్కరించడంలో బహు నేర్పరి.

జగ్గన్నపేటకి చెందిన పింజర్ల మునలయ్యగారు విలియం బౌడెన్‌గారి సువార్తవిని 36 యేళ్ళ తరువాత కుమారుడు ఇ.ఎస్. బౌడెన్‌గారిచే బాప్తిస్మం పొందడం చదివాం. మునలయ్య, నాగమ్మగార్ల ఏకైక పుత్రుడు పింజర్ల కోటయ్యగారు. వీరికి బాల్యంలో వివాహమైనందువల్ల బండారు లంకలో మేనమామగారింట్లో ఉంటూ నర్సాపురానికి చదువుకోసమై వచ్చారు. భార్యను పంపించమని అడిగితే నువ్ మాలవాళ్ళ మతంలో కలిసిపోయావు. నా కూతుర్ని ఏలుకునేందుకు తగవు అని నిష్కర్షగా చెప్పేసాడట. ఆటు తరువాత కోటయ్యగారు బొడ్డు నారాయణుడుగారి కుమార్తె జానికమ్మను వివాహమాడారు. చార్లెస్ బీరుగారి ఆధ్వర్యంలో ఉపాధ్యాయుడిగా ఖామన్‌హీలిన్, బీర్‌లతో కలిసి మన్య ప్రాంతాలవరకు సేవచేసారు. జానికమ్మ గారు కాకినాడలోను, తదనంతరం నర్సాపురం అగ్రకుల బాలికల పాటశాల

లోనూ పనిచేసారు. దీనికి వీరి తండ్రి బొడ్డు నారాయణుడుగారే హెడ్మాస్టరు. కోటయ్యగారు సమ్మలదీవి ప్రాంతంలో సేవ ప్రారంభించి బెంజిమిన్ అనే సేవకుని అక్కడ నియమించడంవల్ల అక్కడ లంక యోహాను గారు కుటుంబసమేతంగా రక్షించబడ్డారు. జానికమ్మగారుకూడా అంకం మల్లమ్మగారితో కలిసి పీచుపాలెం తదితర గ్రామాలు పర్యటించి సేవచేసారు. కోటయ్యగారు 1953లో, భార్య జానికమ్మగారు 1945 డిసెంబరునెలలో చనిపోయారు.

కస్తూరి సాంబమూర్తిగారు బ్రాహ్మణ కులంలో పుట్టి మిస్ ప్రింగ్‌కి తెలుగు నేర్పించే సమయంలో ప్రభువును అంగీకరించారు. 8,9 ఏళ్ళ ప్రాయంగల కుమార్తెలతో వీరు నర్సాపురం వచ్చేసారు. వీరి సతీమణిని బంధువులు పోనియ్యలేదు. మిస్ ప్రింగ్ వీరి కుమార్తెలను మద్రాసు పంపించి చదువు చెప్పించారు. పెద్ద కుమార్తెను మానుడూరి సైమన్‌గారి కుమారుడు ఎం. ఆర్. సైమన్‌గారు వివాహమాడారు. సువార్తికునిగా చాగల్లు మిషన్ ప్రెస్‌లో ఆడమ్సుగారికి సహాయకుడుగా మూర్తిగారు ఎనలేని సేవ చేసారు. గ్రీకులోకూడా పాండిత్యం సంపాదించి అనేక హిందూమత గ్రంథాలను క్షుణ్ణంగా పరిశోధించి అనేక పుస్తకాలు రాసారుగాని ఇవన్నీ అముద్రితంగానే మిగిలిపోయినాయి.

వాసా కోటయ్య కరుణమ్మగార్లకు వాసా సమూయేలుగారు 1876లో జన్మించారు. వాసా కోటయ్యగారికి రెండో కళత్రంవల్ల వాసా పంచాక్షరిగారు 1901 ఆగస్టు 21న జన్మించారు. వాసా సమూయేలుగారు నర్సాపురం క్రిష్టియన్‌పేట స్కూల్లో, తరువాత 11 ఏళ్ళపాటు కనకాయలంకలో పనిచేసి అటుతరువాత లేసు వ్యాపారం చేసారు. చార్లెస్ బీరు నివాసం కేజిల్‌లో సంఘం ఉన్న రోజుల్లోనే సంఘ కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొంటూ సంఘపెద్దగా ఉన్నారు. వాసా ఎబినెజరు, మెట్టపల్లి ఎలీషాగార్లతో కలిసి అంతర్వేదిపాలెం, గొంది, రామేశ్వరం, మల్కిపురం మొదలైన ప్రాంతాల్లో సేవచేసారు. గొల్లపల్లి నథానియేలుగారిదగ్గర రాగాలు నేర్చుకుని మధురమైన స్వరంతో ప్రతి కీర్తనా చక్కగా గానం చేసేవారు. వీరి మరణ దినాన్ని దేవుడు వీరికి ఆశ్చర్యకరంగా వెల్లడి చేసాడట. ఆ విధంగా 1976 జూన్

15వ తేదీన ప్రశాంతంగా కన్నుమూసారు. వీరి సోదరుడు పంచాక్షరిగారు 1918లో మారుమనస్సు పొంది మిషన్ మిడిల్ స్కూల్లో టీచరుగా పనిచేస్తూ యువకుల మధ్య మంచి సేవను జరిగించారు. నర్సాపురం వై.యం.సి.ఎ.కు కూడా సెక్రటరీగా పనిచేసారు. ఆ కాలంలో నాగాబత్తుల దానియేలుగారు బందరులో చదువుకుంటూ తరుచుగా నర్సాపురం వచ్చి జోసెఫ్‌గారింట్లో మకాం ఉండి కంకిపాటి వోబేదు, పంచాక్షరి, జమాయమ్మ, చుక్కమ్మగార్లను వోబేదుగారింట్లో సమావేశపరిచి సమర్పణ జీవితం గురించి హెచ్చరికలు ఇస్తుండేవారు. కంకిపాటి వోబేదుగారు ఇందుమూలంగా ఉజ్జీవింపబడి తాటిపాకలో ఉంటూ నర్సాపురం వచ్చి చుక్కమ్మగారిని వివాహ మాడారు. ప్రస్తుతం నర్సాపురం క్రిష్టియన్‌పేటలో కాపురముంటున్న కంకిపాటి థియోడర్ పార్కర్‌గారు వీరి కుమారులే.

వీరి సంసోనుగారు యువ సమాజాన్ని జమాయమ్మగారు జోసెఫ్‌గారి భార్య వైడూర్యమ్మగారితో కలిసి స్త్రీల సమాజాన్ని (వై.డబ్ల్యు.సి.ఎ.) నడిపించారు. జమాయమ్మగారు చెట్టిపేటకు చెందిన చుట్టుగుల్ల మరియెయ్య, మార్తమ్మగార్ల కడగొట్టు సంతానం. తన 13వ యేట సాధు సుందర్‌సింగ్‌గారి ప్రసంగాలమూలంగా తనను తాను ప్రభువుకు సమర్పించుకుంది. కన్యగానేఉండి, తెల్లని బట్టలు వేసుకుంటూ ఆభరణాలు ధరించకుండా నిష్టగల జీవితాన్ని గడుపుతూ పూర్తిగా సేవకై అంకితమైనదీమె పిఠాపురం, నెల్లూరు, రాజమండ్రి ఆస్పత్రుల్లోనూ, ఇంకా ఆయా ప్రాంతాల కూటాల్లో గంభీరమైన సేవను జరిగించింది. ఈమె అన్ని డినామినేషన్లవారితో సంబంధం కలిగి ఉండేది. దేవేంద్రపాడులో ఈమె వాక్యోపదేశంవల్ల 50మంది కమ్మవారు మారుమనస్సు పొందారు. ఈమె జీవితంలో అనేకమైన అద్భుతాలు జరిగినాయని చెప్పుకుంటారు. ఈమె మంచి పోరాటం సలిపి తన 55వ యేట రాజమండ్రిలో ప్రభువు సన్నిధి కేగారు.

చదలవాడ జోసెఫ్‌గారి భార్య వైడూర్యమ్మగారు ఘనమైన సేవ చేసారు. వీరు అమలాపురం తాలూకా పాతాళ దిబ్బలోని సరెళ్ళవారి ఆడబడుచు. స్త్రీలమధ్య వీరి సేవాసక్తి పొగడదగినది. బేతని సంఘ నిర్మాణం వీరి సమర్పణ ఫలితమే. వీరు కాలధర్మం చెందిన తరువాత వాసా పంచాక్షరిగారు

పిఠాపురం సి.బి.యం. ఆస్పత్రిలో పనిచేస్తూ తన మూలంగా మారుమనస్సు పొందిన డాక్టర్ శిరోమణమ్మగారిని చదలవాడ జోసెఫ్‌గారితో వివాహం జరిపించారు.వీరు బేతనిలో ఆర్గన్ వాయిస్తూ యువతీయువకులకు ఇంగ్లీషు పాటలు నేర్పించేవారు.వై. డబ్ల్యు.సి.ఎ. కార్యక్రమాల్లో కూడాచురుకుగాపాల్గొనేవారు.

పంచాక్షరిగారు 1936 ఆగస్టు 5న వైలెటమ్మగారిని వివాహమాడారు. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు. ఈమెకూడా యువ్వన స్త్రీల సమాజంలో (వై.డబ్ల్యు.సి.ఎలో) సహకరిస్తూ షెర్టు సతీమణితో కలిసి హిందువులమధ్య సేవకు వెళ్లేవారు. వాసా ఎబినెజరుగారి అస్వస్థతమూలంగా పంచాక్షరిగారు చర్చి పాస్టరుగా ఉండేందుకు సమర్పించుకుని అప్పటిదాకా తాను చేస్తున్న లేసు వ్యాపారాన్ని వదిలి 17 సంవత్సరాలు యథార్థమైన సేవచేసారు. వీరువివాహపట్టాదారుకూడా. ప్రస్తుతం తన 80వ యేట సునస్సంధ్య జీవిస్తున్నారు.

కన్నిపాముల మోషేగారు అరపల్లిలో కన్నిపాముల ఎనోకుగారికి జన్మించారు. నర్సాపురం మిషన్ సెంట్రల్ స్కూలులో మూడవ ఫారం వరకు చదివారు. చెట్టిపేటప్రాంతపు శృంగవృక్షంలో పనిచేస్తూ ఆ సంఘాల్లో పనిచేసారు. మోగల్లుకు చెందిన గళ్ళా సుబ్బయ్యగారి కుమార్తె శాంతమ్మను వివాహం చేసుకున్నారు. బోయిడ్‌గారి యాజమాన్యంలో బైబిల్ సొసైటీకి చెందిన సువార్త పుస్తకాలను అమ్మే కొల్పోర్టరుగా వేలాది సువార్తలను గ్రామాలవెంట పంచుతూ సేవచేసారు.

వాసా యోహానుగారి కుటుంబీకుల గురించి మరి రెండు మాటలు. వీరి కుమార్తె ఎస్తేరమ్మను చిడిపి యాకోబుగారు 1900లో వివాహమాడారు.యాకోబుగారు తమ 18వ యేట మారుమనస్సు పొంది బాప్తిస్మం పుచ్చుకున్నారు. వీరు రాజులపాలెం దగ్గర నంది గ్రామానికి చెందిన పెదస్వామిగారి కుమారుడు. వీరు బేతనికి దాదాపు 40 యేళ్ళు పరిచారకులుగా ఉన్నారు. సంఘ సువార్తికుడుగా నవరసపురం, మొగల్తూరు సంఘాలు స్థాపించారు. అంతర్వేది మొదలు కోటిపల్లి, వాడ్రేవుపాలెందాకా అన్ని తీర్థాల్లో హీలిస్‌గారితోనూ, ఇతర మిషనెరీలతోనూ సువార్తను బోధించారు.

ఒకసారి హీలిస్‌తో కలిసి వాడ్రేవుపల్లి తీర్థంలో చిడిపి యాకోబుగారు ప్రసంగిస్తూఉంటే ఒక భూత వైద్యుడు వీటిని ఆటంకపరిచాడట.

వీరు బోధను ఆపకపోయేసరికి ఇద్దరినీ క్రరలతో కొట్టించి 7 రోజుల్లోగా చనిపోతారని మంత్రం వేసాడట. నర్సాపురం తిరిగివచ్చి7రోజులు ప్రార్థనలో గడిపారు. యాకోబు హీలిస్‌గార్లు పురుసటేడు అదే తీర్థానికి వెళ్ళి ఆ భూత వైద్యుడికి కబురంపితే అతను దుప్పటి ముసుగు వేసుకుని వచ్చి నిలబడ్డాడట. ముసుగు తొలగించిచూస్తే శరీరమంతా కుష్ఠుతో నిండి ఉందట. ఇతనికోసం ప్రార్థించి యేసుప్రభువును గురించి చెప్పారట. వీరు 1957 జూలై 12న కొత్తగూడెంలో తనువు చాలించారు. వీరి రెండవ కుమారుడు అగస్టీన్‌గారు కొత్తగూడెం సంఘపెద్దగా పనిచేసారు.

నాసా యోహాసుగారి కుమారుడు ఎబినెజరుగారు నర్సాపురం ఏలూరుల్లో విద్యనభ్యసించి క్రిస్టియన్‌పేట స్కూలుకు హెడ్మాస్టరుగా చాలాకాలం పనిచేసారు. వృత్తిలో రిటైరైన తరువాత బేతనిసంఘ పాస్టరుగా చాలాకాలం నమ్మకంగా సేవ చేసారు. ఈయన నెమ్మదస్తుడు, సాత్వికుడు. తనసుఖాను ఉపేక్షించుకుని ఇతరుల మేలుకై ప్రయాసపడేవాడు. పరిచార కుడుగా పెద్దగా పాస్టరుగా బేతనిలో వీరి అనుబంధం అపారమైనది. వీరికి వివాహపట్టా ఉన్నది. మిస్ హేస్టన్‌గారి కుష్ఠురోగుల క్లినిక్‌లోను గ్రామాల్లోనూ మెట్టుపల్లి ఎలీషాగారితో కలిసి సేవచేసారు..

1898 ఆగస్టు 15న మెట్టుపల్లి ఎలీషాగారు జన్మించారు. రాజమండ్రిలో టీచరు ట్రెయినింగు పాసై ముస్కోపాలెంలో 30 సంవత్స రాలు పనిచేసారు. పోలవరం, పాలకొల్లులోకూడా పనిచేసి సర్వీస్ విరమించి ప్రభువుకు జీవితాన్ని సమర్పించారు. మిస్ హేస్టన్‌తో కలిసి కుష్ఠురోగుల మధ్య ఘనమైన సేవ చేసారు. గళ్ళా యాకోబుగారి రెండవ కుమార్తె బంగారమ్మగారిని వివాహమాడారు. అనంతపురం, ఒంగోలు, తెనాలి, చీరాల బాపట్ల మొదలైన ప్రాంతాలుకూడా పర్యటించి అనేకమందిని ప్రభువులోకి నడిపించారు. రేడియోలో వర్తమానాలిచ్చేవారు. తణుకు, వీరభద్రపురం కులస్థులమధ్య సేవ చేసారు. 1971 జనవరి 24న రక్తపోటువల్ల ప్రభువులో నిద్రించారు. వీరి కుమార్తెను వేటపాలెం సుప్రసిద్ధ ఉపన్యాసకుడు ఎస్. ఆనందంగారికి వివాహం చేసారు.

కూనవరపు తిమోతి సుజ్ఞానమ్మగార్లకు 1897లో తాటిపాకలో జన్మించిన ఏకైక పుత్రుడు కె.టి. సమూయేలుగారు. తిమోతిగారు

పాస్తమండ, బెండమూర్లంక, కనకాయలంక సంఘాల్లో అడమ్సుగారి కాలంలో ఎన్నదగ్గ సేవ చేసారు. తిమోతిగారు చెట్టిపేట ప్రాంతంలో చిరస్మరణీయమైన సేవ చేసిన ఆబేలుగారి సోదరులు. తండ్రి ములగయ్యగారు. సమూయేలుగారు అమలాపురం బోర్డింగులో చదువుకుని, నర్సాపురం స్కూల్లో 3వ ఫారం పాసయ్యారు. వాసా యోహానుగారి కుమార్తె హెబ్సిబమ్మను పెండ్లాడారు. ఇ.ఎస్. బౌడెన్‌గారి పిలుపు మేరకు పెరవలిలో ఉపాధ్యాయుడిగా, సంఘకాపరిగా నియమించబడ్డారు. ఖండవల్లి, కాపవరం, కె. కుముదవల్లి ప్రాంతాల్లో సేవను కొనసాగించారు. ఇలా 15 ఏళ్ళు ఉండి తండ్రిగారి వృద్ధాప్యంలో క్రిష్టియన్‌పేట స్కూలుకు వచ్చారు. బేతనీ పేరిష్‌లో మెట్టపల్లి ఎలీషా, వాసా ఎబినెజరుగార్లతో కలిసి జీవితాంతం సేవ చేసారు. మిస్ మోర్గన్‌తో కలిసి సువార్తయాత్రకు వెళ్ళారు. వీరు మంచి గాయకులు. పాటలన్నిటినీ స్వరమెత్తి పాడేవారు. తన 69వ యేట 1966 జనవరి 26న నిత్యవిశ్రాంతి కేగారు.

పెదపూడి ముత్యాలుగారు ధవళేశ్వరంలో రాబర్ట్సు రాసన్‌గారి వడ్రంగం స్కూలులో శిక్షణ పొంది నర్సాపురం ప్రాంతంలో పనిచేసారు. మిషన్ ఆస్పత్రి, లెప్రసీ ఆస్పత్రుల మిషనెరీల భవనాల నిర్మాణం సందర్భంలో వీరు పాటుబడ్డారు. విశ్వాసులు చనిపోతే సమాధి పెట్టెలను ఉచితంగా తయారు చేసిపెట్టేవాడు. బూల యోహాను, దుద్దే సుబ్బన్న, చెట్టే ఎలీషాగార్లు వీరితో కలిసి వడ్రంగం నేర్చుకున్నారు. ప్రస్తుతం బేతని పరిచారకులుగా ఉన్న పి. లాజరస్‌గారు వీరి కుమారులు. లాజరస్‌గారి సోదరిని చిడిపి యాకోబుగారి కుమారుడు జాన్‌గారు వివాహమాడారు.

భీమవరం తాలూకా కాళ్ళకూరుకు చెందిన క్షత్రియులు వేగేశ్న వెంకటరంగరాజుగారి జేష్ఠ పుత్రుడు భగవాన్ రాజుగారు. వెంకట రాజుగారు బౌడెన్, హీలిస్ తదితరులద్వారా సువార్త విని ప్రభువును అంగీకరించి సి.బి.యం.లో బాప్తిస్మం పొందారు. వీరి కుటుంబ సభ్యులు వీరిని నానా హింసల పాలు చేసి భార్యను వీరితో కాపురం చెయ్యనివ్వక అయన్ని కాళ్ళకూరు నుండివెళ్ళగొట్టారు. సి.బి.యం.వారు వీరిని కాకినాడ పంపి బైబిలు ట్రెయినింగు ఇప్పించారు.ఆ థియొలాజికల్ స్కూలు ప్రిన్సిపాల్‌గా పనిచేసిన చెట్టె భానుమూర్తిగారి చెల్లెల్ని వివాహమాడారు. వీరికి నలుగురు కుమారులు, ఒక

కుమార్తె కలిగారు. కుటుంబమంతా రక్షణపొంది నర్సీపట్నం,కొత్తకోటకువెళ్ళి డేరా వేసుకుని సువార్త ప్రకటించేవారు. భగవాన్ రాజుగారు డాక్టరు చదువుకని వెళ్ళి, మానేసి కొంతకాలం మిలటరీలో ఉండి తిరిగివచ్చి లేసువ్యాపారం చేసారు. బొడ్డు నారాయుడుగారి కుమార్తెను వీరు వివాహం చేసుకున్నారు. అటుపై చాగల్లువెళ్ళి సంఘకాపరిగా జి.డి.యం. ప్రెస్ మేనేజరుగా ఉన్నారు. అక్కడి నుంచి నర్సాపురం బేతనికి వచ్చి జఖర్యాగారికి సహాయక పాస్టరుగా ఉన్నారు. వీరి కుమార్తెను పాల్‌గుప్త (ప్రొ|దాసు, హిందూస్థాన్ బైబిలు ఇన్‌స్టిట్యూట్) గారు వివాహం చేసుకున్నారు. భగవాన్‌రాజుగారు కేన్సర్‌వల్ల 1977లో దైవ సన్నిధికేగారు. ఇతరుల జీవిత విశేషాలు తరువాతి అర్థశతాబ్ది భాగంలో తెలుసుకుందాము.

## పాలకొల్లు:

ప్రస్తుత్తం క్రిష్టియన్‌పేటగా పిలువబడుతున్న ప్రాంతం మన ఆరంభ క్రైస్తవులకాలంనాటికి నిరుపయోగంగా పడిఉన్న ఖాళీస్థలం. దీనికి మెరకపురం, లేక మెరక పాలం అని పేరుండేది. ఆరంభంలో విల్యం బౌడెన్ గారు ప్రస్తుతం చిత్రాయగట్టుగా వ్యవహరించబడుతున్నచోట మకాం ఉంటూ దగ్గర్లో ఉన్న పెద్ద చింతచెట్టు క్రింద సువార్త ప్రకటించే వారు. క్రైస్తవులైనవారందరినీ ఒకచోట కూర్చడం విలియం బౌడెన్‌గారి ఆశయం. అందువల్ల 1850 తరువాతి కాలంలో దుద్దె వెంకయ్య, మంద నర్సయ్య, తాడికొండ పరుశురామయ్య, ఉప్పాటి (పాలూరి) తాతయ్య, పెనుమాక గంగయ్యగార్ల కుటుంబాలు మొట్టమొదటగా ఇక్కడ స్థిరపడ్డాయి. మరుసటేడు చదలవాడ ఫ్రాన్సిస్, గంటి చెల్లయ్య, కోడవల్లి మాణిక్యం, కంకిపాటి యోహాను, సుబ్బయ్య, స్టీవెన్, తొత్తరమూడి పేతురు, బలే తాతయ్యగార్ల కుటుంబాలు వచ్చి చేరినాయి. అప్పటినుండి ఇది క్రిస్టియన్ పేటగా రూపొందింది.*

1845లో విలియం బౌడెన్ 'ఊరిమధ్యనున్న ఒక ఇంట్లో ఉంటూ అక్కడ ఆరాధనలు జరిపిస్తూఉండగా క్రిస్టియన్‌పేట విశ్వాసులు అక్కడికి

* పాలకొల్లు ఎమ్మాయు ఆలయ శతవార్షిక చరిత్ర —ఒరిగేటి ఫ్రాన్సిస్ 1961

వెళ్తూ ఉండేవారు. అలాకాక వీరి నివాసం మధ్యనే ఆలయం ఉండాలని సంకల్పించి బౌడెన్‌గారు దిమ్మలమీద గడ్డికప్పుతో ఒక ఆలయాన్ని నిర్మించారు. ఈ స్థలాలన్నిటికీ 1861లో రెవెన్యూ సెటిల్‌మెంట్‌వారు పట్టాలు ఇచ్చారు. పాలకొల్లు ప్రార్థనాలయానికి థామస్ హీలిస్ పేరన పట్టా వచ్చింది. ఈ సంవత్సరాన్నే పాలకొల్లు సంఘస్థాపన సంవత్సరంగా భావించి 1961లో శతవార్షికోత్సవం జరుపుకున్నారు. బౌడెన్‌గారు వేసిన పునాదిమీదనే హీలిస్‌గారు కొంతమార్పుతో మరొక ఆలయం నిర్మించారు. ఇది వానలకు కూలిపోయినందువల్ల 1879లో 237 రూపాయల వ్యయంతో 3వసారి ఆలయ నిర్మాణం జరిగింది.దీన్ని మక్రేగారు కట్టించారు. ఈ ఆలయాన్ని ఆనుకునే మిషనెరీలు ఉండేందుకు నివాస సౌకర్యం ఉండేది. ఇక్కడ మక్రే దంపతులు, హీలిస్‌గారు కొంతకాలం కాపురమున్నారు. మక్రే సతి ఈ సమయంలోనే ఇక్కడి క్రైస్తవ స్త్రీలకు లేసు కుట్టుపని నేర్పించింది.

పాలకొల్లు సంఘానికి మొదటిపెద్ద చదలవాడ ఫ్రాన్సిస్‌గారు. వీరికి సహాయకులుగా దుద్దే వెంకయ్య, మామిడూరి పెంటయ్యగారు. వీరిద్దరూ చదువులేనివారు. ఫ్రాన్సిస్‌గారికి తోడుగా చుట్టుగుల్ల ఫిలిప్పు, కోల్పోర్టరుగా పనిచేసారు.వీరితో జేమ్సు పీటర్‌సన్‌గారు సువార్తీకరణలో పాటు బడ్డారు. ఫ్రాన్సిస్‌గారి తరువాత కంకిపాటి యోహాను, ముప్పిడి యాకోబు, ఒరిగేటి ఇస్సాకు, పాలూరి మోషేగార్లు పెద్దలుగా ఉన్నారు.

1870లో రెడ్డిసీమ చిక్కాలలో ఒరిగేటి పేతురుగారు, వారి కుమారుడు ఇస్సాకుగార్లు హీలిస్‌గారిద్వారా మారుమనస్సు పొందినందువల్ల అడవిచిక్కాల సంఘం ఏర్పడింది. హీలిస్‌గారు ఇస్సాకును నర్సాపురం తీసుకువచ్చి వడ్రంగం నేర్పించి ఫ్రాన్సిస్‌గారి కుమార్తె మిరియమ్మను వీరికిచ్చి పెళ్ళిచేసారు. పెళ్ళయిన కొద్దికాలానికి పాలకొల్లులోనే కాపురం పెట్టారు. వీరు ప్రతి శనివారం సంతలోను, రామగుండంకు ఈశాన్యంగా ఉన్న ఏనుగుల చింత దగ్గర సువార్త ప్రకటించేవారు. 1911లో తాడికొండ విలియమ్సు, పాలూరి యెలియేజరు, జుత్తిగ సభాపతి గార్లచే బాలబాలికల కొరకు 'క్రైస్తవ యత్న సమాజం' ఏర్పాటయింది. సంఘ పెద్దలు దీన్ని నిరసించారు. అయితే ఇస్సాకుగారు దీని భారం వహించి వాక్యపరిచర్య

చేసారు. వీరు 1913లో కాలధర్మం చెందారు. హీలిన్‌గారితో సువార్త సేవలో మన్య ప్రదేశాల్లో తిరిగారు.

1855లోనే పాలూరి మోషేగారి తండ్రి ఉప్పాటి (పాలూరి) తాతయ్యగారు బాప్తిస్మం పొందారు. మోషేగారుకూడా పాలకొల్లులో బాప్తిస్మం పొందారు. వీరు సువార్త సేవలో పట్టుదలగలవారు. బొయిడ్‌గారు స్కూళ్ళు, ఆలయాల నిర్మాణాన్ని వీరితో చేయించేవారు. పోలవరం, సిద్ధెలగూడెం సంఘాలకోసం ఎక్కువ ప్రయాసపడ్డారు. నగంచెరువులో ఆలయనిర్మాణం, ఇంకా విశ్వాసుల ఇళ్ళస్థలాల పంపిణీ విషయంలో బోయిడ్‌గారికి చేదోడువాదోడుగా ఉన్నారు. వీరు జోబు మోజెస్, ఎలియేజరుగార్ల తండ్రి. 1920లో తోలేరు ఓవారు బలుసులగొయ్యిలో కాలధర్మం చెందారు.

సంతులు యోహానుగారని పిలువబడిన జుత్తిగ యోహానుగారు 1868 నుండి 1890 దాకా పాలకొల్లు క్రిష్టియన్‌పేట స్కూల్లో టీచరుగా పనిచేసారు. 1890 నుండి 1935 దాకా సంఘకాపరిగా, అధ్యక్షుడుగా భారం వహించారు. యాకోబుగారు, మోషేగార్ల తదనంతరం వీరు ఒక్కరే ఓపికతో సంఘాన్ని మేపడంలోను, కాయడంలోను బహు ప్రయాసపడ్డారు. వీరు జేమ్సు పీటర్‌సన్‌గారి కుమార్తె జమాయమ్మ గారిని వివాహమాడారు. వీరికి ఆరుగురు సంతానం.

వీరు నిరాడంబర జీవి. సాత్వికంగలవాడు. వీరికి బాగా వృద్ధాప్యం వచ్చెయ్యడంతో బ్రామ్లీ, బోయిడ్‌గార్లు ఏడుగురు అనుభవంగల వ్యక్తుల్ని ఏర్పరచి వారిలో ఇద్దరిని పెద్దలుగా నియమించడానికి యోహానుగారికి అధికార మిచ్చారు. వీరిలో కంకిపాటి ఆబేలు, చదలవాడ బైటన్‌గార్లను పెద్దలుగాను, గంటి మలాకీ, ముప్పిడి హిజ్కియా, చదలవాడ బర్నబాసు, పెనుమాక అహరోను, జేమ్సు పీటర్‌సన్‌గార్లను పరిచారకులుగా నియమించడం జరిగింది. ఈ సంఘంలో పెద్దలు పరిచారకులు ఏర్పాటు చెయ్యడమన్నది వీరితోనే, అంటే 1924లో ఆరంభమైంది.

కంకిపాటి ఆబేలుగారు యోహానుగారి కుమారుడు. సండేస్కూలు సేవలో ప్రయాసపడ్డారు. కీర్తనలను కంఠంఎత్తి పాడుతూ సంఘాన్ని

నడిపించారు. 1942 జూన్ 2వ తేదీన నిండు వృద్ధాప్యంలో ప్రభువు సన్నిధి కేగారు.

ప్రథమ సంఘకాపరి చదలవాడ ఫ్రాన్సిస్‌గారి ఆఖరి కుమారుడు ప్రైటన్‌గారు. 1924లో పెద్దగా ఎన్నికచెయ్యబడి ఎనిమిదేళ్ళు నమ్మకమైన సేవ చేసారు. చెట్టిపేటలో కూనవరపు ఆబేలుగారు మరణించగా, 1932లో వారి స్థానంలో ప్రవేశించి పన్నెండేళ్ళు అక్కడ టెల్‌స్లీగారికి కుడిభుజంగా ఉండి అనారోగ్యంవల్ల సేవను ముగించి 1944 డిసెంబరు 27న స్వగృహంలో ప్రభువు సన్నిధికి వెళ్ళిపోయారు.

ముప్పిడి యాకోబుగారిది మద్దూరు. వీరి కుమారుడు హిజ్కియా గారుకూడా 1924లో పరిచారకుడుగా నియమితుడై జుత్తిగ యోహానుగారి మరణానంతరం పెద్దల లెక్కలో చేర్చబడ్డాడు. వాలమర్రు, జిన్నూరు, చింతపర్రు గ్రామాల్లోని సంఘాల భారం వహించారు. 1941లో తన ప్రయాస చాలించి నిత్య విశ్రాంతిలో ప్రవేశించారు.

జేమ్సు పీటర్‌సన్‌గారు తొత్తరమూడి పేతురుగారి ముని మనవడు. జేమ్సుగారికి మనవడు. వీరి తండ్రి పేరు సమూయేలు. వీరి జననం 1886 లో. వీరు 1974 నుండి 1940 దాకా పరిచారకునిగా ఉన్నారు. జిన్నూరు సంఘ బాధ్యత వహించి అక్కడ ఆలయానికి స్థలం తానే తెన్నేటి చినస్వామిగారి పేరన కొని, కన్నిపాముల యోసేపుగారితో సేవ జరిపించారు. 1940–60 కాలంలో బొంబాయిలో మాముడూరి గిద్యోను, యార్లగడ్డ యాసోనుగార్లతో కలిసి తెలుగువారిమధ్య సేవ చేసారు. తిరిగి పాలకొల్లు వచ్చి 1971వరకు సంఘ సేవలో పాల్గొన్నారు.వీరు గుల్లంకి దైవసహాయం గారి కుమార్తె జానమ్మను వివాహమాడారు. వీరి కుమారులు విల్సన్, సమూయేలు, దానియేలు, స్పర్జన్‌గారు. ఈ స్పర్జన్ పీటర్‌సన్‌గారు ప్రస్తుతం పాలకొల్లు సంఘపెద్దగా ఉన్నారు.

1934లో మరొకసారి పెద్దలు పరిచారకుల ఏర్పాటు జరిగింది. ఆబేలు, హిజ్కియా, మలాకీ గార్లు పెద్దలుగాను, బర్నబాసు, జేమ్సు పీటర్‌సన్, విలియమ్సు, యేసుదాసు, రాబర్టుకాసుగార్లు పరిచారకులుగాను నియమితులైనారు.

బౌడెన్‌గారి చందప్రరు వ్యవసాయక్షేత్రం వ్యవహారాలు చూచిన గంటి చెల్లయ్యగారి కుమారుడు మలాకీగారు పాలకొల్లు సంఘపెద్దగా ఉంటూ గ్రామాల్లో సంఘ స్థాపనకొరకు పాటుపడ్డారు. తండ్రి చార్లెస్. తల్లి జేమ్సు పీటర్సన్‌గారి కుమార్తె మేరమ్మ. కంకిపాటి మత్తయిగారి కుమార్తె సత్యవతమ్మగారిని వీరు వివాహమాడారు. రావిపాడులో పెనుమాక అహరోను గారితో కలిసి అక్కడి సంఘబాధ్యతను పూర్తిగా చేపట్టారు. ఆలయ నిర్మాణంకూడా వీరి చేతులమీదుగానే జరిగింది. రావిపాడు దగ్గరే వున్న గాళ్ళగుంట గ్రామంలో సువార్త ప్రకటించి సంఘస్థాపనకు కృషి చేసారు.

పాలకొల్లు సంఘ విశేషం ఏమంటే ఈ చుట్టుప్రక్కల ప్రాంతాల్లోని గ్రామాల్లో సంఘాల స్థాపనలో మిషనెరీలేమీ పాత్ర వహించినట్టు కనిపించదు. పాలకొల్లు పెద్దలు, పరిచారకులు, సువార్తికులే ఈ సంఘాలను స్థాపించారు.

అనగం దిబ్బలోకూడా మలాకీగారు సంఘం స్థాపించారు. గళ్ళా సమూయేలుగారు వీరికి సేవలో తోడ్పడ్డారు. మలాకీగారు 1950 అక్టోబరు 25న ప్రభువు సన్నిధికి వెళ్ళారు.

ఫ్రాన్సిస్‌గారి కుమారుడు చదలవాడ బర్నబాస్‌గారు 1912దాకా టీచరుగా పనిచేసి విరమించుకున్నారు. రెండేళ్ళు వై.యం.సి.ఎ. ప్రెసిడెంట్‌గా ఉండి యువకులమధ్య సేవ చేసారు. 1934నుండి పరిచారకుడుగా, 1942నుండి అధ్యక్షుడుగా పనిచేసాడు. వీరు 1949లో మరణించారు.

లంక యేసుదాసుగారు జెర్మియాగారి కుమారుడు. పూలపల్లిలో కాపురముంటూ సంఘ కార్యక్రమాల్లో పాల్గొనేవారు. తాడికొండ నోవహు గారి కుమారుడు విలియమ్స్‌గారు 1934నుండి పరిచారకుడుగా, 1942 నుండి పెద్దగా సంఘబాధ్యత నిర్వర్తించారు. ఇలపకుర్రు దగ్గరున్న చినదిబ్బ గ్రామాన్ని తరుచుగా దర్శిస్తూ సంఘాన్ని స్థిరపరిచారు. ఇక్కడ ఆలయ నిర్మాణంకూడా కావించారు.

ముప్పిడి రాబర్ట్సుకాసుగారు యాకోబుగారి కుమారుడు. 1930లో ఆలయనిర్మాణంలో పెద్దలకు చేదోడువాదోడుగా ఉన్నారు. 1934నుండి

పరిచారకులుగా నియమించబడ్డారు. హిజ్కియాగారితో కలిసి చింతపర్రులో సంఘాన్ని స్థాపించారు. ప్రస్తుతం ఇక్కడ రక్షణసైన్యంవారు సేవ చేస్తున్నారు. ఎలమంచిలిలోకూడా రాబర్టు కాసుగారు సంఘాన్ని స్థాపించి ఆలయ నిర్మాణంకూడా చేసారు. వుప్పాటి కృష్ణయ్యను, చదలవాడ జాన్ అనే సువార్తికులను అక్కడ నియమించారు. వీరు యూన్సీ పట్టణంలో మృతి చెందారు. శిరగారవల్లి సంఘాన్నికూడా వీరే స్థాపించారు. ప్రస్తుతం నరసాపురంలో వుంటున్న వృద్ధ సోదరి విలాసమ్మగారు వీరి భార్యే.

ఈ ప్రాంతపు సువార్తికులుగా చదలవాడ లూకా, గళ్ళా సమూయేలు, పెనుమాక అహరోను, గళ్ళా యాకోబుగార్లు పనిచేసారు. లూకాగారు, 1868లో ఫ్రాన్సిస్‌గారికి జన్మించి రంగూన్‌లో ఉంటూ కోల్పోర్టరుగా పనిచేసారు. పాలకొల్లు తిరిగివచ్చి ఉభయ గోదావరుల్లో పర్యటిస్తూ సువార్త ప్రకటిస్తూ పుస్తకాలను అమ్మేవారు. ఈ ప్రాంతంలో ఆడమ్సుగారితోను, తణుకు ప్రాంతంలో మిస్ లిన్‌తోను కలిసి సువార్త సేవ చేసారు. వీరి భార్య చిలకమ్మకూడా సువార్తలో ఆసక్తిగల స్త్రీ. ఈమె మిస్ లిన్, మిస్ మోర్గన్‌లతో కలిసి పనిచేసింది. లూకాగారి సేవా ఫలితంగా కాపవరంలోనూ పెనుగొండలోనూ అన్యులు కొందరు రక్షణ వెలుగులోకి వచ్చారు. అటుపైన ఇ.ఎస్. బౌడెన్‌గారి ఆహ్వానం మేరకు చెట్టిపేట ప్రాంతానికి వెళ్ళి 1934 దాకా టిల్‌స్లీగారికి కూడా సహాయకులుగా ఉన్నారు. శృంగవృక్షం, కొమ్మర, పెదవాడపల్లి గ్రామాల్లో టీచరుగా, సువార్తికులుగా పనిచేసారు. 1943 డిసెంబరు 11న మహిమలోకి ప్రవేశించారు. పెరవలి గ్రామానికి చెందిన గళ్ళా సమూయేలుగారు యువకులుగా ఉన్నప్పుడే పట్టుదలగా సువార్తను ప్రకటించాలనే ఆకాంక్ష కలిగియుండేవారు. ప్రజల అపహాస్యాలను పట్టించు కునేవారు గాదు. వీరు గంటి మలాకి గారితో తిరిగి సేవ చేసారు. వీరి పాట ''వినరండీ ఈ దివ్యబోధ'' వీరి సువార్త అనుభవాన్ని చాటి చెప్తున్నది. ఇప్పటికీ సువార్తికులు దీన్ని తమ సేవలో వినియోగించుకుంటారు. 1953 ఏప్రిల్ 14న వీరు యేసు సన్నిధికి చేరుకున్నారు. వీరి కుమార్తె తోలేటి సులక్షణమ్మగారు ప్రస్తుతం పాలకొల్లు క్రిష్టియన్ పేటలో కాపురముంటున్నారు. సుశీలమ్మ, సుమిత్రమ్మ అనే వీరి కుమార్తెలు యిటీవలే కాలంచేసారు,

1924లో పెనుమాక అహరోనుగారిని పరిచారకునిగా ఎన్నుకున్నప్పు

టికే సమ్మతించక స్వచ్ఛందంగా స్థానిక సంఘంలోను, పరిసర గ్రామాల్లోనూ సువార్తసేవ చేసారు. వీరుగాక మొగల్లునుండి వచ్చిన గళ్ళా యాకోబుగారు కొంతకాలం టీచరుగా పనిచేసి సువార్తికునిగా వచ్చారు. నర్సాపురం బ్రామ్లీ గారితో కలిసి కొయ్యలగూడెం ప్రాంతాల్లో సువార్త పనిలో శ్రమించారు.

పైన చర్చించిన కాలంలో బ్రామ్లీ, బోయిడ్, నేస్మితుగార్లు నర్సాపురంలో కాపురముంటూ పాలకొల్లు సంఘ వ్యవహారాలు చూసారు. డేవిడ్ పీటర్‌సన్‌గారు స్వతంత్రంగా సంఘాన్ని స్థాపించిన సందర్భంలో రేగిన అలజడి బ్రామ్లీగారు అతిచాకచక్యంతో పరిష్కరించారు. బోయిడ్ గారితో కలిసి ఈ సంఘ క్షేమానికి పాటు పడ్డారు. బోయిడ్‌గారికి ఈ సంఘంపట్లఉన్న ఆసక్తి మెండు. ప్రస్తుతం పాలకొల్లులో సబురిజిస్ట్రరు ఆఫీసు ఉన్న స్థలంలో ఒక ఆస్పత్రి కట్టించాలని పథకంవేసి లోతుగాఉన్న గొయ్యిని పూడ్పించారు. కాని ఏ కారణంవల్లనో ఆ పని విరమించుకుని నర్సాపురంలో జెతెస్డా ఆస్పత్రిని ప్రారంభించారు.

మక్రేగారు తాటాకులతో కట్టించిన ఆలయం పాతబడిపోగా బోయిడ్ గారు పూనుకుని అప్పటి పెద్దలు జత్తిగ యోహాను, కంకిపాటి ఆబేలు తదితరులతో కలిసి 500 రూపాయలు పోగుచేసారు. మిషనెరీ ఫండునుండి 300 మంజూరు చేయించారు. ఆలయం కప్పు విప్పిన నెల రోజులకు దురదృష్టవశాన బోయిడ్‌గారు అకాల మరణం చెందారు. స్థానిక విశ్వాసులే 1931లో పని ప్రారంభించి 1400 రూ. వ్యయంతో పెంకుటింటి ఆలయాన్ని నిర్మించుకున్నారు.

అలానే నేస్మితుగారుకూడా పాలకొల్లు సంఘాన్ని ప్రేమించి రాత్రి వేళల్లోసైతం సైకిలుమీద వచ్చి అనేకమంది యువకుల రక్షణ కారణమైన కూటాలు నిర్వహించేవారు. పెద్దలు పరిచారకుల నియామకంలో వీరు ప్రత్యేక శ్రద్ధ వహించారు

*　　*　　*

ప్రస్తుతం పాలకొల్లు క్రిష్టియన్‌పేటలో నివాసమున్న కుటుంబాల ఉత్పత్తి క్రమాల గురించి ఒరిగేటి ప్రాన్సిస్‌గారు తమ పాలకొల్లు ఎమ్మాయి ఆలయ శతవార్షిక చరిత్రలో సవిస్తరంగా రాసారు.

చివరిగా సిద్దెలగూడెం సంఘం విషయం చూద్దాము. ఇది మొదటి విశ్వాసి ఎంబేరయ్యగారి పేరులో వ్యవహరించబడింది. ఎంబేరయ్య తరువాత ఇక్కడ సంఘంలేదు. కొంతకాలానికి బ్రాన్లీ, బోయిడ్‌గార్లు భారం వహించి సేవ ప్రారంభించగా కొందరు ప్రభువును విశ్వసించారు. వీరికాలంలో చదలవాడ ఈసాకు, ఆనందం, కోడవల్లి తాతయ్య ప్రభృతులు సంఘ పెద్దలుగా సంఘాన్ని నడిపించారు. ఈ సంఘ అభివృద్ధి, పెద్దల జీవిత చరిత్రలు చివరి 50 ఏళ్ళకాలంలో చదువుకుందాము.

## ఆగర్తిపాలెం

ఈ ప్రాంతంలో పాలకొల్లు నర్సాపురం తరువాత స్థాపించబడిన సంఘం ఆగర్తిపాలెమే అని అర్థమవుతున్నది. రావి వెంకటస్వామి నర్సాపురం పాటశాలలో చదువుకునే రోజుల్లోనే సువార్త విన్నాడుగాని లక్ష్యపెట్టలేదు 1865లో ఈ ప్రాంతంలో సంభవించిన కలరావల్ల చాలామంది చనిపోతుంటే చూసిన వెంకటస్వామికి భయం పట్టుకుని నిత్యజీవాన్నిపొందే కోరికతో నర్సాపురం మిషనెరీల సహవాసానికి చేరి 1866 ఏప్రిల్ నెలలో బాప్తిస్మం పొందాడు. ఇదే ఆగర్తిపాలెం సంఘానికి పునాది. వీరి సోదరిని వివాహమాడిన విసుకుపాటి వెంకటస్వామికూడా హీలిస్‌గారి సువార్త పరిచర్యలో మారుమనస్సుపొంది తాను అప్పటిదాకా భూతవైద్యుడుగా డబ్బు గడిస్తున్న జీవితాన్ని విడిచిపెట్టి సువార్త ప్రచారకుడుగా మారాడు.

1850–55 మధ్యకాలంలో మత్తి యోసేపుగారి తండ్రి నథానియేలుగారు, తాతగారు మత్తి నారాయుడుగారు జార్జి బీరువల్ల రక్షణ సువార్త విని నర్సాపురంలోనే బాప్తిస్మం పొందారు. స్వగ్రామంలో హింసలు ఎక్కువైనందువల్ల ధవళేశ్వరం వెళ్ళిపోయి అక్కడ క్రైస్తవ జీవితంలో స్థిరపడి స్వగ్రామానికి తిరిగి వచ్చారు. అప్పటికి వాక్యం వింటూఉన్న మైలాబత్తుల పెద పనసరామయ్య (ఆనందంగారి తండ్రి) గారు, మేడిది అచ్చన్న,చంద్రయ్య, పడవల యాకోబు, కప్పల సుబ్బారాయుడు మొదలైనవారు రక్షణానుభవంపొంది బాప్తిస్మంకూడా తీసుకున్నారు. ఇక్కడ

జార్జిబీరు ఒక పాటశాలనుకూడా స్థాపించి ఈ చుట్టుప్రక్కల గ్రామాల్లో ప్రాథమిక విద్య స్థావరంగా అగర్తిపాలెం గ్రామాన్ని తీర్చిదిద్దారు. మత్తి నథానియేలుగారి పెండ్లిని జార్జిబీరు క్రైస్తవ సంప్రదాయానుసారం జరిపించారు. అటుతరువాత మత్తి యోసేపు, మైలాబత్తుల ఆనందం, వేదాల యోసేపు, కప్పల దావీదు, నతానియేలు తదితర సువార్తికులను ఈ గ్రామంనుండి ప్రభువు పిలుచుకున్నాడు. వీరిలో ఆనందం, మత్తి యోసేపుగార్లు అమలాపురం ప్రాంతంలో గొప్ప సేవను జరిగించారు.

కుంచెనపల్లి సుబ్బారాయుడుగారి కుమారుడు కుంచెనపల్లి వెంకటస్వామిగారు. ప్రస్తుతం సంఘ కాపరిగా ఉన్న ప్రకాశంగారు వెంకటస్వామిగారి కుమారుడే. ఆరంభ ప్రముఖుల్లో సంధి లక్ష్మీనరుసు, బుడితి రామమూర్తి, కుంచెనపల్లి వెంకటస్వామి, ఉండమట్ల వెంకటస్వామి, మైలాబత్తుల కృష్ణస్వామి, తోట లక్ష్మమ్మగార్లు ఉన్నారు. వీరుగాక మత్తి నతానియేలుగారు, బొంతు ప్రకాశంగారు సువార్త సేవ చేసారు. వీరంతా చించినాడ, మల్లవరం, కొప్పర్రు, ఏనుగువాని చెరువు, చినలంక, అగర్రు తదితర పరిసర గ్రామాల్లో తిరిగి సువార్తను ప్రకటించారు. సంఘాలు స్థాపించారు, తరువాతి కాలంలో లూథరన్ తదితర సంఘాలుకూడా ఇక్కడ స్థాపించబడినాయి. మొత్తంమీద అగర్తిపాలెంలో ఆరంభ క్రైస్తవులు, సంఘపెద్దలు అయినవారు మేడిది, కప్పల, మత్తి, మైలాబత్తుల, వేదాల, కుంచెనపల్లి మొదలైన వంశాలవారే.

* * *

ఈ అర్థశతాబ్దిలో ముఖ్యంగా స్థానిక విశ్వాసుల కృషిని దేవుడాశీర్వదించి అనేక సంఘాలు స్థాపించబడేలా కృప చూపించాడు. బ్రామ్లీ, బాయిడ్, నేస్మిత్, మిస్ మోర్గన్ తదితరుల అండదండలతో సువార్తికులు, పెద్దలు అయినవారు ఆయా గ్రామాల్లో సంఘాలు స్థాపించారు.

1922లో బోయిడ్‌గారు సగంచెరువు గ్రామంలో పాఠశాలను, క్రైస్తవ సంఘాన్ని స్థాపించారు. తుంపిరి సమూయేలు, సిర్రా లాబానుగారిని టీచర్లుగా నియమించగా వీరే సువార్తపని చూసుకునేవారు. ప్రారంభంలో ఉందుర్తి మోషే, తుంపిరి పుల్లమ్మగార్లు, వీరి కుటుంబాలు క్రైస్తవులైనారు. తరువాత సిర్రా నాంచారమగార్మి కుటుంబం సంఘంలో చేర్చబడి ఇక్కడ నివాసం ఏర్పరచుకున్నారు. బోయిడ్‌గారు ప్రభుత్వంనుండి కొంత స్థలం సంపాదించి తాటాకుల శాలను నిర్మించారు. ఏలూరి హిజ్కియా, నార్కిమెల్లి మోషే, సిర్రా దానియేలు, గళ్ళా సమూయేలుగార్లు సువార్తికులుగా సంఘపెద్దలుగా పనిచేసారు. ఆలయం ఆవరణలో ప్రతి యేడూ నూతనవత్సర కూటాలు జరుగుతూ వుండడం ఈ గ్రామం ప్రత్యేకత. ఈ కూటాలు బౌడెన్‌బీరుకాలంనుండే ప్రారంభమైనాయని చెపుతారు. హేరిస్ ఈ కూటాలను అభివృద్ధిచేసి సక్రమంగా నడిపించడానికి పునాది వేసారు.

శివదేవుని చిక్కాల గ్రామస్థులైన నార్కిమెల్లి యోహాను, గవరమ్మగార్ల కుమారుడైన నార్కిమెల్లి మోషేగారు సగంచెరువు, నర్సాపురం పాటశాలల్లో విద్య నేర్చుకుని వేమవరానికి చెందిన కొడమంచిలి మునియ్యగారి కుమార్తె సుందరమ్మను వివాహమాడారు. పింజర్ల కోటయ్యగారి ఆధ్వర్యంలో వీరు సమ్మలదీవికి సేవకులుగా వెళ్ళారు. ఎంబేరియన్ పేటలో టీచరుగా, సువార్తికునిగాను, నర్సాపురం బేతని సంఘం తరుపున పోలవరం, మొగల్తూర్రుల్లో సువార్తికుగాని నుపనిచేసారు. వీరితోబాటు ఏలూరి హిజ్కియాగారు పనిచేసారు. వీరు పాలకొల్లుకు చెందిన నిద్ర గన్యకమ్మగారిని వివాహమాడారు. బర్మానుండి తిరిగివచ్చి సగంచెరువు సంఘపెద్దగా నున్నారు. 1968లో వృద్ధాప్యంవల్ల నిత్య విశ్రాంతికిచేరుకున్నారు.

సిర్రా లాబానుగారు, సిర్రా షద్రకు, నాంచారమ్మగార్లకు 1900లో జన్మించి, నర్సాపురంలో చదువుకొని టీచరు ట్రేనింగ్ అయ్యారు. సగంచెరువు స్కూల్లో టీచరుగా సంఘసేవకునిగాఉంటూ . కొడమంచిలి మునియ్యగారి కుమార్తె జెస్సికమ్మగారిని వివాహమాడారు. వీరు సంఘపెద్దగా ఉంటూ అంతర్వేదితీర్థంలోకూడా సువార్త ప్రకటిస్తూ ఉండేవారు. 1952లో పరమపదానికేగారు.

శివదేవునిచిక్కాల గ్రామంలో బీరు, భౌడెన్‌గార్ల కృషి ఫలితంగా 1850లోనే సంఘస్థాపన జరిగినట్టు తెలుస్తోంది. ఆదిలో సిర్రా వెంకటేషు లాబానుగారి తండ్రి షద్రక్‌గారు ప్రభువును విశ్వసించారు. వెంకటేషుగారి కుమారుడు ఎలీషాగారు సంఘాన్ని నడిపించేవారు. వీరి తదనంతరం సిర్రా జఖర్యా, పెనుమాక సుంకరిగార్లు పెద్దలుగా ఉన్నారు.

చించినాడ గ్రామంలో సంఘం ఏర్పడిన విధానమేమంటే ఈద ప్రసాదరావు, కలిగితి రాజరత్నంగార్లు రంగూన్‌లో మారుమనస్సు, బాప్తిస్మం పొంది స్వగ్రామానికి తిరిగి వచ్చారు. అప్పటికే ఈ గ్రామంలో రహస్య క్రైస్తవులుగాఉన్న బూసి సుబుద్ధిగారికి వీరి రాకవల్ల బలం చేకూరింది. (సుబుద్ధిగారు ప్రస్తుతం నర్సాపురం మిషన్‌హైస్కూల్లో పనిచేస్తున్న కృపానందంగారి తండ్రి). వీరుగాక యోహాను, జొన్నల మరియమ్మ అనేవారు బహిరంగంగా బాప్తిస్మం పొందినందుకు అగ్రకులజులు వీరిని బాధలు పెట్టారు. అందువల్ల ఆగర్తిపాలెంనుండి వెళ్ళిన కుంచెనపల్లి ప్రకాశం తదితర విశ్వాసులు ఒకరాత్రి వాద్రేవుపల్లివెళ్ళి అక్కడవున్న వైట్‌హవున్‌గారికి తమ ఇక్కట్లు చెప్పుకున్నారు. వైట్‌హవుస్‌గారువచ్చి గ్రామంమధ్యనున్న గవర్నమెంటు పుంతలో ఆలయం, స్కూలుకోసం ఒక షెడ్డును నిర్మించి యిచ్చారు. అయితే ఆ ఊరి రాజులు ఒక రాత్రి ఆ ఆలయాన్ని నేలమట్టంచేసి తలుపులు కిటికీలను దూరంగా పారేసారు. అప్పుడు వైట్‌హవున్‌గారు జిల్లా కలెక్టరుగారికి రిపోర్టు చేసినందువల్ల వీరి జోరు కొంత తగ్గిందిగాని చాటుమాటుగా క్రైస్తవులను బాధలు పెడుతూనే వచ్చారు.బోయిడ్‌గారు ఆ ఊళ్ళో ఒక ఇంటిని కొని ఆ గ్రామపు సిఖబడి పంతులుగారికి కొంత సొమ్మిచ్చి దాన్ని మిషన్‌స్కూలుగా చేసారు. అక్కడ కుంచెనపల్లి ప్రకాశంగారిని నియమించారు.క్రైస్తవులకు ఆ ఊళ్ళో

ఏమాత్రం ప్రశాంతత లేకపోయింది. బ్రాన్లీగారి జోక్యం తరువాత ఈ గ్రామ విశ్వాసులకు అగ్రకులజుల బెడద తగ్గింది.

ఈ సమయంలో మత్తి యోసేపుగారు సువార్తికునిగా అక్కడికి వెళ్ళారు. 1925 మార్చి 11న బ్రాన్లీగారు మేడిది ఏలియాగారిని ఆ స్కూలు హెడ్మాస్టరుగా నియమించగా వీరు పాతికేళ్ళు ఆ గ్రామంలో నిలిచి సంఘాన్ని స్కూలును స్థిరపరిచారు. వీరు యలమంచిలి సంఘ స్థాపనలోకూడా ప్రయాసపడ్డారు. నేస్మితుగారుకూడా ఈ రెండు సంఘాలపట్ల శ్రద్ధవహించి అభివృద్ధి చేసారు. అటుతరువాత ఏలియాగారు కొప్పర్రు, మల్లవరం, సగంచెర్వు గ్రామాల్లోకూడా సేవ చేసారు.

కొప్పర్రులో నర్సాపురంనుంచి మామూడూరి సైమన్‌గారి కృషివల్ల తరపట్ల యోహానుగారు సేవచెయ్యగా 1920లో బద్దా లక్ష్మయ్యగారి కుటుంబం ప్రభువునంగీకరించి బాప్తిస్మం పొందారు. తరపట్ల సత్యానందం గారు వీరి కుమారుడే. వీరి ఆధ్వర్యంలో నడుస్తున్న స్కూలును మిషన్‌కి అప్పగించేసారు. ఈ గ్రామం సెంటరుగా నర్సాపురం ప్రాంతమంటిలోనూ జరుగుతున్న ధన్యకరమైన సేవను గురించి చివరి అర్థశతాబ్దిలో చూస్తాము. సరిపల్లి గ్రామంలోకూడా 1905లో ఈదావారి కుటుంబంమూలంగా మిషన్‌స్కూలు ఏర్పడింది. అలానే ముస్కెపాలెంలో వాసా యోహాను, చదలవాడ జఖర్యా, మామూడూరి సైమన్‌గార్ల కృషిఫలితంగా 1904 ప్రాంతాల్లోనే సేవ ప్రారంభమైంది. మొదట్లో ఉల్లంపర్తి వీరయ్య, దుద్దే వెంకటస్వామి, బాలం గోగులు, ఉల్లంపర్తి అంకాలు మొదలైనవారు క్రైస్తవులైనారు. 1912లో జోనాగారు ఈ సంఘాన్ని దర్శిస్తూ కొంత స్థలంకొని ఇటుక గోడలతో తాటాకు కప్పుతో ఆలయాన్ని నిర్మించారు. ఇక్కడ మెట్టపల్లి ఎలీషాగారు దీర్ఘకాలం టీచరుగా పనిచేసారు. చార్లెస్‌బీరు, చిడిపి యాకోబును, చెదలవాడ నోవహు, కంకిపాటి వోబేదు మొదలైనవారి సువార్త పరిచర్యవల్ల మొగల్తూరులో సంఘం ఏర్పడింది. కోడవల్లి తాతయ్య, మరియమ్మ, ముసునూడి పోలయ్య, వెంకమ్మ, కోడవల్లి వెంకటస్వామి, పద్దమ్మగార్లు ఆది క్రైస్తవులు. ప్రతి ఆదివారం నర్సాపురం నడిచివెళ్ళి బీరుగారి కాంపౌండులో ఆరాధనకు హాజరయ్యేవారు. చదలవాడ నోవహుగారు ఇక్కడొక చిన్న ప్రార్థనశాల నిర్మించారు.

పాత నవరసపురం (లేక చాకలివాని తిప్ప) గ్రామంలో చదలవాడ జఖర్యాగారు కాలినడకన వెళ్ళి సువార్త చెప్పిన ఫలితంగా వంగలపూడి సుబ్బారాయుడుగారు రక్షించబడి 1915లో బాప్తిస్మం పొందారు. తరువాత భార్య, సిలాసు, నర్సిమ్మమ్మలు, పౌలీసు అనే కుమారులు క్రైస్తవులైనారు. యాకోబు, ఎలీజాగార్లు కూడా కుటుంబసమేతంగా ప్రభువును అంగీకరించారు. యాకోబుగారి ఇంటి అరుగుమీదనే సమావేశాలు జరిగేవి. ఇక్కడికి జోనా జోసెఫ్‌గారుకూడా వచ్చి వాక్యపరిచర్య చేసేవారు. వంగలపూడి దావీదు దగ్గర స్థలంకొని అక్కడ ఆలయ నిర్మాణానికి దోహదంచేసినవారు జోసెఫ్‌గారే. ఆటుతరువాత వంగలపూడి యాకోబుగారు విద్యనభ్యసించి ఇక్కడ సేవను చేపట్టారు. వీరి మరణం తరువాత, భగవాన్ రాజు, చిడిపి యాకోబు, వాసా ఎబినేజరు, మెఫీబోషెతు, నేస్మేతు, నార్కిమెల్లి మోషే తదితరులు ఈ సంఘాన్ని దర్శించి వాక్య పరిచర్యచేస్తూ ఉండేవారు.

యేనుగువానిలంక పోలవరం గ్రామానికి 1925 నుండి గూటం సమూయేలుగారు వస్తూ వాక్యం బోధించగా మాడుగుల చెల్లయ్య (సీమోను) దిగుమర్తి బుల్లియ్య, కోడవల్లి మామిళ్ళు (మత్తయి), కోటా వెంకయ్య అనే నలుగురు రక్షణపొంది నర్సాపురం బేతనిలో బాప్తిస్మం పొందారు. మత్తయిగారి కొబ్బరితోటలో చిన్న పాకవేసి అందులో మెట్టపల్లి ఎలీషాగారిని టీచరుగా నియమించడం జరిగింది. వీరి తరువాత కుంచనపల్లి మోజెస్‌గారు కూడా ఇక్కడ పనిచేసారు.

లంకలకోడేరు, దగ్గులూరు, వేడంగి, యలమంచిలి, అంబాలచెరువు, ఇలపకుర్రు, సీరుల్లిపాలెం, బోళ్ళవారిపాలెం, వల్లూరు, గాళ్ళగుంట తదితర గ్రామాల్లో సంఘస్థాపన, సువార్తసేవ గురించి రాబోయే అర్ధశతాబ్దిలో చదువుతాము.

* * *

# 13

## చెట్టిపేట, తణుకు

1914లో చెట్టిపేటలో సేవచేస్తున్న సమయంలో మిస్ ట్రీలి తన స్వహస్తాలతో గోదావరి డెల్టా సేనను గురించిన సైనాన్ని ఫోటోలతో సహా ఆకర్షణీయంగా చక్కని దస్తూరితోరాసి తయారు చేసారు. దీన్లో ఆ కాలంలో ఉన్న సువార్త సేనాకేంద్రాలు ఏడింటిని ఈమె గుర్తించారు. అవి చెట్టిపేట, తణుకు,నర్సాపురం, తాటిపాక, అమలాపురం, బెండమూర్లంక ధవళేశ్వరం.

ఇ.ఎస్. బౌడెన్ 1876లో సేవలో ప్రవేశించి, 1886లో చెట్టిపేట మిషన్ బంగళా కట్టి అక్కడికి మకాం మార్చారు. ఈ విధంగా 1924దాకా 48 ఏళ్ళు చెట్టిపేటలో సేవచేసారు.

జలమార్గాలద్వారా సువార్తసేవకు ఉన్న గొప్ప అవకాశాలను గుర్తించి 6 కాలువలకూడలి అయిన చెట్టిపేటలో తన బంగళాలో ఉంటూ అక్కడ తన స్వహస్తాలతో నిర్మించిన "వాటర్ లిల్లీ" అనే బోటు సహాయంతో చుట్టుప్రక్కల గ్రామాల్లో సేవచేసారు. చెట్టిపేటలో బాలికల బోర్డింగు స్కూలును ఈయన 1890లో స్థాపించారు. కొద్దికాలం పెద్ద కుమార్తె లిల్లీ, ఆమె తరువాత 1898 నుంచి 1956దాకా ఆఖరు కుమార్తె హెన్రిటా బౌడెన్‌లు దీన్ని అజమాయిషి చేసారు. ఈమెతో కలిసి తాతపూడి వెంకమ్మ [వెంకప్ప] అనే సోదరి సన్నిహితంగా ఉంటూ ఇంగ్లీషువారిలాగానే వ్యవహరిస్తూ వారి బంగళాలో వారితోనే ఉంటూ ఉండేది. హాస్టలు మేట్రన్ గాను, సండేస్కూలు సూపరింటెండెంటుగాను గొప్ప పని చేసింది. జీవితాంతం అవివాహితగానేవుండి, వృద్ధాప్యంలో చెట్టిపేటలోనే కాలంచేసింది.

1914లో చెట్టిపేట బాలికల బోర్డింగులో 40 మంది బాలికలు

ఉన్నారు. వీరిలో చాలామంది క్రైస్తవ కుటుంబాలకు చెందినవారు. ఇక్కడ వీరు వాక్యాన్ని చదవడం నేర్చుకుని సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు నిరాక్షరాస్యులైన తమ తల్లిదండ్రులకు వాక్యాన్ని చదివి వినిపించడంద్వారా వాళ్ళకెంతో సంతోషం కలిగించేవారు. మిస్ భొడెన్ వీరి ఆహారం, బట్టలు, చదువు మొదలైన అవసరాలు చూడడమేకాక, నైతికంగా, శారీరకంగా ఆధ్యాత్మికంగాకూడా ఈ పిల్లలు క్షేమంగా ఉండడానికి ప్రయాసపడింది. తల్లిదండ్రులు నెంకి నాలుగు అణాల చొప్పున చెల్లించాలి. ఇది కేవలం నామమాత్రమే. ఇక్కడ బాలికలు ఇంటిపని, వంట, చదవడం, రాయడం, కుట్టు పని నేర్చుకునేవారు. మిస్ బొడెన్ వాక్యం, కుట్టుమాత్రం నేర్పేవారు. ఇద్దరు టీచర్లు ఉదయం 7 నుంచి మధ్యాహ్నందాకా, మళ్ళీ 2 నుండి సాయంత్రం 5 దాకా పాఠాలు చెప్పేవారు. పిల్లలకు వంట, తదితర ఆజమాయిషీ అంతా వెంకమ్మగారు చూసుకునేది. ప్రస్తుతం మన ప్రాంతాల్లో టీచర్లుగాను, తదితర ఉద్యోగాల్లో ఉంటున్న అసంఖ్యాకమైన క్రైస్తవ స్త్రీలు చాలామంది ఈ బోర్డింగులో చదువుకున్నవారే.

1891, 1892 సంవత్సరాలో సేవలో ప్రవేశించిన రాబర్ట్ డబ్ల్యు రాసన్ వీరి సతీమణి 1901 దాకా ఆయాచోట్ల పనిచేస్తూ చెట్టిపేటలోకూడా ఉన్నారు. మొట్టమొదటగా చెట్టి గాబ్రియేలు ప్రభువును నమ్ముకున్నందున ఇక్కడ సంఘం ఏర్పడింది. వీరి కుమారుడు దావీదు, మనవడు ఎలీషాకూడా దైవసేవకులే.

ఇక ఇ.ఎస్. బొడెన్ తన బంగళా కట్టుకున్న తరువాత పాతపేట నుండి కొన్ని కుటుంబాలు ఈ బంగళా సమీపంలో ఉంటూ క్రొత్తపేటగా రూపొందారు. ఇక్కడ ఈ కాలంలో ఎక్కువగా సువార్త సేవచేసినవారిలో చెట్టె బ్రహ్మయ్య, గళ్ళా చంద్రయ్య, మెరిపో వెంకయ్య, కూనవరపు ఆబేలుగారు, చెట్టె ఎలీషా, మెరుపో అబ్రాహాము, బొల్లిపో సాధువు, గళ్ళా జోయల్‌రాజు, చెట్టె యెషయ్య, చెట్టె ఆహోజు, మెరిపో పోతురాజు, చదలవాడ ఇశ్రాయేలు, ఇష్మాయేలు మొ.వారు స్త్రీల మధ్య సేవలో పాల్గొన్నవారు చెట్టె రూతమ్మ, మెరిపో నల్లవెంకమ్మ, బొల్లిపో మంగమ్మ, చెట్టె పెంటమ్మ మొదలైనవారు. చెట్టిపేటలో కాపురమున్న మాముడూరి రామయ్యగారి కుమారుడు బోయజగారు రంగూన్‌లో ఎ.బి.యం. ప్రెస్‌లో

పని విరమించుకొని చెట్టిపేట (క్రొత్తపేట) వచ్చి స్థిరపడ్డారు. రామయ్య గారి కుమార్తెను కూనవరపు అబేలుగారి కొడుకు ఎజ్రాకుఇచ్చి వివాహం జరిపించారు. ఈ ఎజ్రాగారు లేసు వ్యాపారంకోసం కలకత్తా వెళ్ళి అక్కడే స్థిరపడి ఉన్నత స్థాయికి చేరుకున్నారు. వీరుగాక దుద్దే అహరోను, చెట్టే ప్రకాశం తదితరులు సేవచేసారు. చెట్టే ప్రకాశంగారు కవి.

చెట్టిపేట చాగల్లు సంఘాల క్షేమాలను ఇ.యస్. భాడెన్‌గారు చాలాకాలం పర్యవేక్షించారు. 1886లో వీరు కట్టించిన మిషన్ బంగళా ఆ మిషన్ ఫీల్డంతటికీ కేంద్రబిందువు. వీరు శిక్షణనిచ్చిన యువకులను అక్కడక్కడ నియమించడంవల్ల వారు బహుయోగ్యకరమైన సేవ చేసారు. ముప్పిడి యాకోబు, చింతలచెరువు వీరాస్వామిగార్లను గ్రామ సంచార సువార్తికులుగా నియమించారు. ఈ వీరాస్వామికూడా నాసా సంచాక్షిగాలా రెడ్డిసీమ అంతటిలో గొప్ప నటుడుగా పేరుతెచ్చుకున్నాడు. నాషా యోహాను గారికిబాప్తిస్మం ఇచ్చిన వారం రోజులకు ఈయన 1881 అక్టోబరులో బాప్తిస్మం పొందారు. చెట్టిపేట బడిలో కూనవరపు అబేలుగారు ఉపాధ్యాయుడుగా పనిచేసారు. చుట్టుప్రక్కల ప్రాంతాల్లో కన్నిపాముల ఏనోకు తుంపిరి మాతయ్య, దుద్దే నోవహు, కోడి అబ్రహాము, కంకిపాటి స్తెఫెను, మల్లిపూడి రామస్వామి, పోసుపో వెంటయ్య, బ్రహ్మయ్య, గళ్ళా చంద్రయ్య లాజరుగార్లు సువార్త సేవ చేసారు.

చాగల్లు సంఘస్థాపనలో ప్రధానపాత్ర వహించిన బొర్లిపో మంగమ్మ వీరి సేవా ఫలితమే. ఈమె హిందూ ఆచారాలను బహు నిష్టలో పాటించేది. బాల్యంలోనే హేలిస్‌గారి బోధను విన్నది. ఈయన ఈ బాలిక చేతిని పట్టుకుని “ఈమె క్రీస్తు రాజ్యమునకు అలంకారముగా ఉండాలి” అని ప్రార్థించాడట. అయితే ఎదుగుతున్నకొద్దీ పూజలు, పుణ్యక్షేత్ర దర్శనాలలో మనస్సు లగ్నం చేసిందీమె. ఇలా చాలా యేళ్ళ తరువాత బ్రహ్మయ్యగారివల్ల సువార్త విన్నా మనసు కఠినపరచుకుని సువార్తకు ఎదురు తిరిగింది. అయితే పరిశుద్ధాత్మ దేవుడు ఈమెలో తన పనిని ఆరంభించి వాక్యానికి విధేయురాలినిగా చేసాడు. ఇదెలా జరిగిందంటే మంగమ్మ ఒకసారి జల్లిసీమ ప్రాంతానికి కోతలకని బయలుదేరింది. చిన్నపిల్లవాణ్ణి (సాధువుగారిని) చంకనేసుకుని నడుస్తూ ప్రత్తిపాడు గ్రామాన్ని చేరుకుంది. అక్కడ ఒక దైవసేవకుడు “ఎంత

పాపినైనా యేసు రక్షిస్తాడు.'' అంటూ వాక్యం ప్రకటిస్తూఉంటే మంగమ్మ తన పాపాలను గురించి తనకు రక్షణ అవసరమని గ్రహించింది. కోతలకు వెళ్లే ఆలోచనను అక్కడికక్కడ విరమించుకుని చెట్టిపేటకు నడక సాగించింది. అక్కడ ఇ.యస్. బౌడెన్ ఈమెకు మరింత తేటగా వాక్యోపదేశం చేసారు. కొడుకు సాధువు సంరక్షణ భారం ఆయనే వహించి మంగమ్మ సువార్త సేవలో తిరగడానికి అవకాశం కల్పించారు. సత్యాన్వేషణలో మంగమ్మ ఒక సువార్త పుస్తకం కొనుక్కొని చదువురానందువల్ల వారినీ వీరినీ బ్రతిమాలి చదివించుకుంటూ ఉండేది. వారింట్లో, వీరింట్లో ఒడ్లు దంచిపెట్టి ప్రతిఫలంగా ఈ సువార్తను చదివించుకునేది. చదువు లేకపోయినా గొప్ప జ్ఞాపకశక్తి ఉన్నది కావడంవల్ల చాలా వాక్యాలను కంటతాపట్టింది. 1904 డిసెంబరు 19న బౌడెన్‌గారిచే బాప్తిస్మం పొందింది. బంధుమిత్రులేకాక భర్త కూడా ఈమెను అనేకమైన దూషణలకు తిరస్కారాలకు గురిచేసాడు. భర్త ఒకసారి దారుణంగా కొడితే నర్సాపురం మిషన్ బంగళాలో ఈమెకు ఉపచారాలు చెయ్యడం జరిగింది. తన ఒంటిమీదనున్న గాయపు మచ్చలను తన ఆభరణాలుగా ఈమె భావించుకునేది. అగ్రకుల స్త్రీలుకూడా ఈమె బోధను శ్రద్ధగా వినేవారు. 13 సంవత్సరాలు పగలనక రేయనక చాగల్లు ప్రాంతంలోను, తదితర ప్రాంతాల్లోనూ క్రీస్తు ప్రేమ సువార్తను చాటి అనేకమందికి మార్గదర్శిగా నిలిచి 1917 ఆగస్టు 4వతేదీన యేసురాజు సన్నిధికి చేరుకుంది. ఆ దినాల్లోవున్న మిషనెరీ సోదరీలందరితో కలిసి సేవ చేసింది. గొంతు కేన్సర్‌తో ఈమె బాప్టిస్టు మిషన్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ కాలం చేసిందని మిస్ బ్రీలీ రాసింది. ఈమె సమాధి నర్సాపురం బేతని సంఘ సమాధుల్లో లంక ఆనందం, మిస్ రెవింగ్టన్ గార్ల సమాధుల మధ్య ఉన్నది.

ఈమెకు సత్తెమ్మ, పట్టెమ్మ అనే కూతుళ్ళు, సాధువు అనే కొడుకు ఉన్నారు. తర్వాత బొల్లిపో సాధువుగారు చెట్టిపేట మిషన్‌స్కూల్లో ఉపాధ్యాయుడుగా పనిచేసి రిటైర్ అయ్యారు. సత్తెమ్మకూడా తన తల్లిననుసరించి గొప్ప సేవకురాలుగ అందరికీ ఆశీర్వాదకరంగా ఉండేది.

చాగల్లు, చెట్టిపేట ప్రాంతాల్లోనేకాక డెల్టా ప్రాంతమంటిలోకి మహోత్కృష్టమైన జీవిత చరిత్రగల స్త్రీ కొడమంచిలి సత్తెమ్మ. గోదావరి

పుష్కరాల లెక్కనుబట్టి ఈమె 1880లో పుట్టింది. తల్లిదండ్రులు విగ్రహారాధికులు. తల్లిమాత్రం నిజ దేవుణ్ణి తెలుసుకుని తన వారిమధ్య గొప్ప సాక్షిగా బ్రతికిన బొర్లిపో మంగమ్మగారు. సత్తెమ్మమాత్రం మిగతా బంధువులతో ఏకమై తల్లిని దూషిస్తూ ఉండేది, యేసుప్రభువు లేకుంటే నరకానికి పోతావమ్మ' అని తల్లి ఎంత చెప్పిన వినేదికాదు. మంగమ్మగారు ఇల్లు వదిలి చెట్టిపేటలో మిషనెరీల దగ్గర ఉంటూ ఉండేది. పెళ్ళి అయిన తరువాత సుబ్రహ్మణ్య షష్టి రోజున ఈ సత్తెమ్మ చాగల్లులోని సుబ్రహ్మణ స్వామిని దర్శించడానికి వెళ్ళింది. నర్సాపురం , చెట్టిపేటనుండి వచ్చిన సువార్తికులు ప్రజలమధ్య నిలబడి పెద్ద స్వరముతో "ఆకాశము నా సింహాసనము, భూమి నా పాదపీటము" అని యెహోవా దేవుని మహిమను వివరిస్తూఉంటే సత్తెమ్మ ఈ మాటలు విని "అంత పెద్ద దేవుడున్నాడా?" అని ఆశ్చర్యపడి "ఆ దేవుణ్ణి నాకు చూపించగలరా" అని వారి నడిగింది. అందుకు ఆ సువార్తికులు దేవుడు ఆత్మ స్వరూపియనీ, అదృశ్యుడనీ జవాబిచ్చారు. సత్తెమ్మ వెంటనే విగ్రహారాధన తప్పని గ్రహించి వెంటనే తెచ్చిన పండ్లు గుడిలో అర్పించకుండానే ఇంటికి తిరిగి వెళ్ళిపోయింది. భర్త పాటియ్య ఈమెకేదో గ్రహపీడ పట్టిందనుకున్నాడు. ఆ రాత్రి ఆ గ్రామంలో జరిగిన ఒక మీటింగులో క్రీస్తు శ్రమలు గురించిన బోధ విని ఈమె కన్నీరు మున్నీరయింది. అప్పుడే "ఏ పాపమెరుగని యోపావనమూర్తి" అనే పాటను నేర్చుకుంది. అప్పటినుండి భర్తకు తెలియకుండా చెట్టిపేట కూటాలకు వెళ్తూ ఉండేది.

ఒక రాత్రి సత్తెమ్మ మంచం దిగి మోకాళ్ళూని ప్రార్థన చేసుకుంటూ ఉంటే భర్తచూసి కోపంతో ఊగిపోతూ జుట్టు పట్టుకుని బయటికి ఈడ్చి బాగా కొట్టాడు. చాలాసార్లు దళసరి పేడుతో కొట్టేవాడు. భర్త గనక ఆయనకు లోబడుతూ దెబ్బలన్నీ సహించేది గాని క్రీస్తును వదల్లేదు. స్వజనమంతా ఈమెను వెలివేసారు. బంధువులంతా ఈమెకి మతపిచ్చి పట్టిందని హింసలు పెట్టారు. ఒకరోజున పాటియ్య భార్యను గురించి ఊరి పెద్దలకు ఫిర్యాదు చేసాడు. వారు సత్తెమ్మను పిలువనంపారు. తనను ఇక చంపేస్తారనుకొని క్రీస్తుకోసం మరణించడం గొప్ప భాగ్యంగా ఎంచుకుని మంచి బట్టలు వేసుకుని ముస్తాబుగా గ్రామ చావిడికి వెళ్ళింది. గ్రామ

పెద్దలు విచారణచేసి క్రీస్తును వదలడానికి ఈమె ఒప్పుకోనందువల్ల తల్లి మంగమ్మ మొదలైనవారు అడ్డువచ్చినా వదలకుండా ఊరిబయట చెరువు గట్టుమీద కాళ్ళు చేతులు బొండలో బిగించారు. నీలాటి రేవున బొండ వేయబడిన సత్తెమ్మను చూడడానికి వందలాదిమంది స్త్రీ పురుషులువచ్చి "ఈ మతాన్ని విడిచిపెట్టమ్మా" అంటూ బతిమాలారు. కాని సత్తెమ్మ స్వరం కంటమెత్తి "దినదినమునకు దిక్కునీవే—నా దేవుడా" అనే పాట పాడుతూ 'యేసును నమ్ముకోండి' అని వచ్చిన వారందరితోను చెప్పింది. ఈమెనుచూసి ఇంకా కొందరు మతం మార్చుకుంటారేమోనన్న భయంతో గ్రామాధికారులు ఈమెను వదిలిపెట్టేసారు. తనకు తలవంపులు తెచ్చిందని పాపియ్య ఈమెను బాగా హింసించాడు.

కొంతకాలానికి భర్త ఈమెను యాదవోలుకు పంపించాడు. సత్తెమ్మ పినతల్లి మకాం ఈ ఊళ్ళోనే. ఈమె సోదెగత్తె. ఈమె కొడుకు బొల్లినేని సుబ్బారాయుడు. అంటే చొప్పరామన్నగూడెంలో సేవచేసిన బొల్లినేని వీరన్న మాస్టరు ఈమె మనవడన్నమాట. అక్కడ హిందూ దేవతకు మేకపోతును బలి ఇచ్చినందువల్ల ఆ మాంసాన్ని తినడానికి సత్తెమ్మ ఒప్పుకోలేదు. అంచేత మాణిక్యాలమ్మ అనే కాపు స్త్రీ వచ్చి సత్తెమ్మ కనురెప్పల వెంట్రుకలు పీకి సత్తెమ్మకు మతిపోయిందని తప్పు చెప్పింది. అక్కడి బంధువులు పది రోజులపాటు సత్తెమ్మను బలవంతంగా చెరువుకు తీసికుపోయి తలను నిమ్మకాయలతో రుద్ది బిందెలతో నీళ్ళు దిమ్మరించారు. కాని సత్తెమ్మ 'యేసు ప్రభువా' అని ఆలపిస్తూ ఉండగా చూసిన బంధువులు 'ఇది పిచ్చిగాదు, మతం' అన్నారట. అప్పుడు బెజవాడనుండి హిందూమత శాస్త్రజ్ఞుడైన ఒక బంధువును రప్పించి ఈమెకు ఉపదేశాలు చేయించారు. కాని ఎదురు ఆయనకే క్రీస్తునుగూర్చి సత్తెమ్మ సాక్ష్యమిస్తూ ఉండడంతో అతను వెళ్ళిపోయాడు. సత్తెమ్మను చాగల్లుకు తిరిగి పంపించారు.

భర్త అనుమతి లేకున్నప్పటికీ ఈమె కూనవరపు ఆబేలుగారు, తల్లి మంగమ్మ తదితరుల సమక్షంలో ఇ.ఎస్. బౌడెన్‌గారిచే బాప్తిస్మం పొందింది. ఇంటికిరాగానే బంధువులందరు పోగై భర్తమీదపడి ఏడవసాగారు. భర్త ఈమెను చావ చితకగొట్టాడు. హింసలలో ఈమెను ఆదరించడానికి తోటి క్రైస్తవులుగాని, మిషనరీలుగాని ఆ కాలంలో చాగల్లులో లేరు. ఇ.ఎస్.

బాడెన్‌గారు చాగల్లువస్తే ఆయనకి కర్ర రోలువేసి కూర్చోబెట్టేవారు. ఆయన ఇంట్లో ఉన్నంతసేపు పాటియ్యగారు పొయ్యి దగ్గర చాప వేసుకుని పడుకునేవాడు. బాడెన్‌గారు రొట్టె తెచ్చుకుని ఆ గ్రామంలో దొరికిన పాలలో ముంచుకుని తినేవారు. వెళ్ళిపోతూ "పాటియ్యగారూ వందనాలండీ" అనేవారు. అందుకు పాటియ్యగారు "మాకెందుకులెండి వందనాలు, మాకేమన్నా మీకులాగ లాగులా చొక్కాలా" అనేవాడు వ్యంగ్యంగా.

ఇలా ఉండగా ఇ.ఎస్. బాడెన్, బ్రయింట్‌గార్లు మరికొంతమంది సేవకులతో చాగల్లు వచ్చి 10 రోజులు ఉండి వాక్యం బోధించినప్పుడు ఆశ్చర్యకరంగా పాటియ్యను దేవుడు పట్టుకున్నాడు. సత్తెమ్మ సంతోషానికి అవధిలేదు. ఈ విధంగా శారీరకంగా అనేక హింసలు భరించి భర్తను, తన ఊరివారినెందరినో క్రీస్తువైపుకి మళ్ళించగలిగింది సత్తెమ్మ. ఈమె 60 ఏళ్ళపాటు 90 ఊళ్ళలో తల్లిని మించిన సువార్త సేవచేసింది. కారులోగాని, రైల్లోగాని, ఆస్పత్రిలోగాని, తాను ఎక్కడ ఉంటే అక్కడ ఎలుగెత్తి సువార్తను ప్రకటించేది. సత్తెమ్మ, కాబాల శేషయ్య, బొల్లిపో పెదబుచ్చియ్య, భార్య మంగమ్మ, సిద్దెల బుల్లియ్య, నేకూరి సూరమ్మ తదితరులు చాగల్లులో ఆదివారం చీకటితోనే 6 గంటంకి లేచి చెట్టిపేట వెళ్లేవారు. ఒక్కోసారి వీరు చేరుకునే వేళకి కూటం అయిపోయేది. బాడెన్‌గారు చాలా నొచ్చుకునేవారు. ఈమె పరిచర్యవల్ల చాగల్లులో కమ్మ కుటుంబికులు చాలామంది ప్రభువును అంగీకరించి సంఘసభ్యులైనారు. చాగల్లు జి.డి.యం. ఆలయం ఈమె, ఈమె తల్లి మంగమ్మగార్ల జ్ఞాపకార్థం నిర్మించబడింది.

క్రీస్తుకోసం మంచి పోరాటం సలిపి 1966 నవంబరు 11న చెట్టిపేటలో తన నీతి కిరీటాన్నందుకునేందుకు ప్రభువు సాన్నిధ్యానికి వెళ్ళిపోయింది. ఈమె యథార్థమైన క్రైస్తవ జీవితం ఎంతోమందికి ఆశీర్వాద కారణం, ఆదర్శప్రాయం అయింది. ఈమెకు ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. కొడుకు కొడమంచిలి కృపానందంగారు. జీవన్‌జ్యోతి ప్రెస్ డైరెక్టర్ విల్సన్‌గారికి తండ్రి. సత్తెమ్మగారి కుమార్తె అచ్చమ్మగారిని గళ్ళా చంద్రయ్యగారి కుమారుడు గళ్ళా జోయల్‌రాజుగారు వివాహమాడారు. వీరిరువురు చెట్టిపేట మిషన్‌స్కూల్లో ఉపాధ్యాయులుగా పనిచేసి రిటైర్ అయ్యారు. మరొక కుమార్తె కృపమ్మను చొప్పరామన్నగూడెం ప్రాంతంలో

సేవ చేసిన బొల్లిపో వీరన్నగారు వివాహమాడారు. నర్సాపురం కవివరేణ్యుడు బి. థియోడోర్‌గారు వీరి జేష్ఠ పుత్రుడు.

బొల్లిపో పెదబుచ్చియ్యగారు 1875లో చాగల్లులో జన్మించారు. విగ్రహారాధికుడుగా జీవిస్తూ బొల్లిపో మంగమ్మ, కొడమంచిలి సత్తెమ్మ గార్ల ద్వారా ప్రభువులోకి నడిపించబడి ఈ ప్రాంతానికి 3వ విశ్వాసి అయ్యాడు. కొన్నాళ్ళకు భార్య మంగమ్మకూడా రక్షణ పొందింది. వీరికి పెద బుల్లెమ్మ, చిన బుల్లెమ్మ, ఎస్తేరమ్మ అని ముగ్గురు కుమార్తెలు, ఆశీర్వాదం అనే కుమారుడు పుట్టారు. వీరు వ్యవసాయం చేసుకుంటూ చాగల్లు సంఘ స్థాపనకు, ఇంకా ఆ ప్రాంతంలో అనేక సంఘాలు స్థాపించడం లోనూ పాటుపడ్డారు. పాపికొండల్లో సువార్తయాత్రల్లో బ్రాష్లీగారితో కలిసి పనిచేసారు. చాగల్లులో ప్రారంభంలో విశ్వాసులు వీరి ఇంట్లోనే సమావేశమయ్యేవారు. ఆ ఊరి అల్లరిమూక క్రూరంతో వీరి ఇంటి మీదికి దొమ్మీగా వచ్చి గొడవ చేస్తుండేవారు. వీరు చాలా సంవత్సరాలు చాగల్లు ప్రాంతమంతటిలో బాప్తిస్మమిచ్చే పెద్దగా వ్యవహరించి తన 93వ యేట 1967 జనవరి 19న తనువు చాలించారు. వీరు ప్రస్తుతం చాగల్లు సంఘాధ్యక్షులుగా వ్యవహరిస్తున్న బుచ్చిరామన్నగారి మామగారు.

1920 నుండి చాగల్లు సేవను చేపట్టి సంఘాన్ని బలపరిచిన ఆధిక్యత ఇ.సి. ఆడమ్సుగారిది. ఈయన 1901లో ఇండియా వచ్చి తాటిపాకలో కొంతకాలం, ధవళేశ్వరంలో కొంతకాలం ఉండి 1920లో చాగల్లు వచ్చారు. తాటిపాకలో ఉంటూఉండగానే 1911లో రాయబారి పత్రికను పునరుద్ధరించి చాగల్లులోకూడా ఈ పత్రిక సేవను కొనసాగించారు. ఈయన తెలుగులో పండితుడు. మిషనెరీల తెలుగుభాష పరీక్షలకు అధికారిగా ఉండేవారు. 1925లో వీరు ఎండాకాలం నీలగిరి కొండలకు వెళ్ళి తిరిగివచ్చేసరికి వీరి బంగళా వరండాలో పెద్ద పార్శిల్ ఉంది. విప్పిచూస్తే ప్రింటింగ్ మిషన్ ఒకటి బయటపడింది. ఎవరు పంపారో తెలియదు. ఈవిధంగా చాగల్లులో జి.డి.యం.ప్రెస్ ప్రారంభించి అనేక కరపత్రాలు, తెలుగు పాటల పుస్తకం మొదలైనవి ప్రచురించారు. డిస్పెన్సరీ స్థాపించి వైద్యసేవ చేసారు. ఆడమ్సు దంపతులు గ్రామ సంఘాలను దర్శిస్తూ గొప్ప సేవ చేశారు. 1948లో ఇంగ్లండు వెళ్ళిపోయి 1949

సెప్టెంబరు 20వ తేదీన మరణించారు. వీరి సతి చాగల్లులోనే 1955 ఫిబ్రవరి 1వ తేదీన చనిపోయింది. ఆమెను ఆ కాంపౌండులోనే సమాధి చేసారు.

వీరి కుమార్తె గ్రేస్ ఆడమ్సు 1902లో తాటిపాకలో జన్మించింది. కొంతకాలం కూనూరులో చదువుకొని పన్నెండేళ్ళ ప్రాయంలో ఇంగ్లండు వెళ్ళి స్కూలు, బైబిలు కాలేజీ విద్య అభ్యసించింది. 1931లో తన తల్లిదండ్రులకు సహాయకారిగా వచ్చి వైద్యంలోను, సువార్త సేవలోను ఉత్సాహంగా పాటుపడింది. ఈమె ఫార్మసిస్టు డిగ్రీపొంది 39 ఏళ్ళు చాగల్లులోని మిషన్ కాంపౌండు ఆస్పత్రిలో పనిచేసారు. 1947లో మిస్ ఐవీ బర్నాడ్ చాగల్లు ఆస్పత్రిలో పనిచేసేందుకు వచ్చారు. మిస్ గ్రేస్ ఆడమ్సు అస్వస్థతమూలంగా స్వదేశం వెళ్ళిపోయి తన 70వ యేట 1972 ఫిబ్రవరిలో అక్కడే మరణించారు.

ఆడమ్సుగారి తరువాత కెవిన్ ఆస్‌బోర్న్, మిస్ సిల్వియా రైట్‌గార్లు, డేవిడ్ డ్రాన్‌గార్లు ప్రెస్‌పని చేపట్టారు. ఇది 1969లో విల్సన్‌గారి అజమాయిషీకి అప్పగించబడింది.

ఈ ప్రాంతంలో గొప్ప సేవకుడుగా ప్రఖ్యాతినొందిన మరొక వ్యక్తి పోసుపో పెంటయ్యగారు. వీరిది ప్రత్తిపాడు. వీరి భార్య బ్రహ్మమ్మగారి మరణానంతరంనే కుమార్తె ఫుల్మానమ్మ పనిచేస్తున్న గౌరీపట్నంలో వీరు నివాసండుంటూ, గౌరీ పట్నం, దుద్దుకూరు, చాగల్లు మొదలైన ప్రాంతాలలో సేవ జరిగించారు. చాగల్లు తదితర ప్రాంతీయ సంఘాల్లో బొల్లిపో సుబ్బన్న గారుకూడా బహు నమ్మకమైన సేవజేసారు. వీరు కొడమంచిలి సత్తెమ్మ, బొల్లిపో పెద బుచ్చియ్యగార్లమూలంగా రక్షణపొంది సేవలో పాల్గొంటూ పాపికొండల సువార్త యాత్రలకుకూడా వెళ్తూఉండేవారు. మిస్ బిడ్వెర్ గారు పెంచిన మహాలక్ష్మి అనే ఆమెను వీరు వివాహమాడారు. వీరికి ముగ్గురు కుమారులు, నలుగురు కుమారెలు ఉన్నారు. ఈ మహాలక్ష్మి సోదరి చంద్రమ్మ, సోదరుడు బచ్చురామన్నగార్ల తల్లిదండ్రులు వీరి బాల్యంలోనే కలరావల్ల చనిపోగా కొంతకాలం వీరు ముగ్గురూ పోసుపో పెంటయ్య కొడమంచిలి సత్తెమ్మగార్ల సంరక్షణలో ఉన్నారు. ఆటుపైన మిస్

హైండ్‌మన్, మిస్ ప్రిడ్జ్‌ల్‌గార్లు, ఆదెమ్మగారు వీరిని పెంచారు. ఆదెమ్మగారే వీరి పెళ్ళిళ్ళు జరిపించారు. బచ్చు రామన్నగారు ప్రస్తుతం చాగల్లు సంఘ పెద్దగా, ఈ ఫీల్డ్ ప్రెసిడెంట్‌గా, గోదావరి డెల్టా అసోసియేషన్ ఎగ్జిక్యూటివ్ మెంబరుగా ఉన్నారు.

చాగల్లు ప్రాంతపు పురాతన సంఘాలు అడివి చిక్కాల, దుద్దుకూరు, గౌరీపట్నం మొదలైనవి. 1900లోనే అడివి చిక్కాల సంఘం స్థాపించబడింది. దీన్ని ఒరిగేటి మోషేగారు, ఆ తరువాత ఒరిగేటి సూరయ్యగారు కాపరులుగా ఉండి నడిపించారు. ప్రస్తుతం సూరయ్యగారి కుమారుడు సత్యానందంగారు ఈ సంఘాన్ని చూసుకుంటున్నారు.

1910లో సోసుపో వెంకటయ్యగారి సేవా ఫలితంగా దుద్దుకూరు సంఘం వెలిసింది. ధవళేశ్వరం వాస్తవ్యులైన పిట్రా సుందరరావుగారు తన అత్తగారి ఊరైన దుద్దుకూరువచ్చి వాక్యపరిచర్య చేయసాగారు. కొంతకాలానికి గౌరీపట్నంలో టీచరుగా పనిచేసిన పుల్మానమ్మగారు ఇక్కడికి వచ్చి పాటశాలలో పనిచేస్తూ సంఘాభివృద్ధికి పాటుపడింది. ఈమె పెళ్ళి అయిన ఆరు నెలలకే భర్త చనిపోయారు. పెంపుడు కూతురు పద్మిని, భర్త చదలవాడ రామేశ్వరరావుగారు, పిట్రా సుందరరావుగారి కుమారులు. పౌలు, ఎజ్రా, వజ్రమ్మగార్లు, వీరుగాక పెదముత్తి యోహానుగారు తదితరులు ఈ సంఘ సేవలో భారం వహించారు. కొడమంచిలి సత్తెమ్మ, పుల్మానమ్మగార్లు ఆడమ్స్ అమ్మగారితో కలిసి సువార్తికురాండ్రుగా పనిచేశారు.

1906 చెట్టిపేటలో ఉజ్జీవ సంవత్సరం. ఇదేకాలంలో దాదాపు గోదావరి డెల్టా ప్రాంతమంతటిలోనూ పరిశుద్ధాత్మ బలంగా పనిచేసి మిషనెరీల దగ్గర్నుండి పెద్దలు, సామాన్యులదాకా అయాచోట్ల తమ పాపాలను బహిరంగంగా ఒప్పుకున్నారు. ఈ సంఘటనల గురించి ఇప్పటికీ చెప్పుకుంటారు. 1906లో చెట్టిపేట ఆలయంలో ఇ.ఎస్. బౌడెన్‌గారు ప్రార్థన చేస్తున్న సమయంలో సముంద్ర మరియమ్మతో మొదలై అంతా ఆత్మద్వారా కదిలించబడి పెద్దలు, మిషనెరీలు అందరూ ఒకరినొకరు హెచ్చరించుకుంటూ తమ తప్పిదాలను ఒప్పుకున్నారు. 1904లో పాలకొల్లు ఆలయంలో చదలవాడ చింతమ్మద్వారా ఇలాటి అద్భుతమే జరిగిందని

ఒరిగేటి ఫ్రాన్సిస్‌గారు (1961) పాలకొల్లు ఎమ్మాయి ఆలయ శతవార్షిక జ్ఞాపకార్థ చరిత్రలో రాసారు. ఈమె చదలవాడ లూకాగారి భార్య. చదలవాడ ఫ్రాన్సిస్‌గారి కోడలు. ఐర్లండులో మొదలై ప్రపంచవ్యాప్తంగా ఈకాలంలో ఈలాంటి ఉజ్జీవం వచ్చిందని చరిత్ర మూలంగా తెలుస్తున్నది.

చెట్టిపేటలో విశ్రాంతి దినాన్ని అతి పరిశుద్ధంగా ఆచరించేవారు. తలంట్లు పోసుకోవడం, ధాన్యం వగైరాలు దంచుకోవడం, కూలినాలి చెయ్యడం, ప్రయాణాలు చెయ్యడం మొదలైనవి నిషేధం. ఒకసారి ఉప్పు కావిడితో ఒకతను ఆదివారంనాడు గ్రామంలోకి వస్తుంటే ఒక విశ్వాసురాలైన స్త్రీ అతన్ని హెచ్చరించిందట: "నీకు ఈ రోజు బేరమేమీ ఉండదు, వెళ్ళవద్దు" అని. ఆ ప్రకారంగానే అతను ఎంతసేపు ఉప్పు అమ్మకం గురించి తిరిగినా ఎవరూ కొనలేదట. ఆదివారంనాడు ఉప్పుకూడ కొనేవారు కాదు. ఉప్పునావ నెలకోసారి వచ్చి గ్రామాల్లో ఉప్పు అమ్మేవారు. అప్పుడు కొనకపోతే యిబ్బందే. ప్రతి ఆదివారం చెట్టిపేట ఆలయానికి తాళ్ళపాలెం,నందమూరు, చాగల్లు, సింగవరం, మారంపల్లి, కోనాల, కాల్దరి, దమ్మెన్ను, వేలువెన్ను, జగన్నాథపురం, నడిపల్లికోట, కానూరు తదితర పరిసరాల గ్రామాలనుండి విశ్వాసులు వచ్చేవారు. స్త్రీలు చెట్టే దావీదుగారింట్లో కూడుకునేవారు. చెట్టే దావీదుగారి భార్య రూతమ్మగారు, ~~మెరిపో~~ వెంకమ్మగారు (మెరిపో అబ్రహాముగారి తల్లి), జుత్తిగ మహాలక్ష్మమ్మగారు స్త్రీలకు వాక్యపరిచర్య చేసేవారు.

మెరిపో ఎర్రవెంకయ్య (ఊనగట్ల), వెంకమ్మ [చెట్టిపేట చెట్టి సత్తెబ్బాయిగారి కుమార్తె] గార్లకు మెరిపో అబ్రహాముగారు 1889 ఏప్రిల్ 22న జన్మించారు. వీరి అన్న బులి వెంకయ్యగారు తాటిపాకలో ఆడమ్సుగారి దగ్గర వంటవాడుగా ఉంటున్నప్పుడు అబ్రహాముగారు ఆయన దగ్గరికి వెళ్ళి సహాయంచేస్తూ వచ్చారు. ఆడమ్సుగారితోపాటు ధవళేశ్వరం, అటుపైన చాగల్లు వచ్చారు. అబ్రహాముగారు 1912లో కనకాయలంక సిర్రా వెంకయ్యగారి కుమార్తె కృపమ్మను వివాహమాడారు. ఈ దంపతులకు ఎస్తేరమ్మ, గ్రేసమ్మ, జెస్సీకమ్మ, విజయమ్మ, థార్సుపాలు, జెడ్సన్‌గార్లు జన్మించారు. జీవన్‌జ్యోతి ప్రెస్ డైరెక్టరు విల్సన్‌గారు, చెట్టిపేట బైబిలు స్కూలు నడుపుతున్న చెట్టె జఫన్యాగారు ఈ అక్కాచెల్లెళ్ళ బిడ్డలే.

1924లో ఆదమ్సుగారు పెద్ద కోల్పోర్టరుగా నియమించారు.

1926లో ఆదమ్సుగారు స్వదేశం వెళ్ళిపోగా అబ్రహాముగారు చెట్టిపేటకు తిరిగి వచ్చేసారు. ఆ సమయానికి బ్రామ్లీగారు చెట్టిపేట బాధ్యతలు చూసుకుంటున్నారు. ఆ మరుసటి సంవత్సరమే బ్రామ్లీగారు టిల్స్లీగారికి ఈ బాధ్యతలను అప్పగించారు. టిల్స్లీగారు అబ్రహాముగారిని ఆయా సందర్భాల్లో వంటవానిగాను, సువార్తికుడిగాను, మేజిక్ లాంతరు ప్రదర్శకునిగాను, పాస్టరుగాను ఉపయోగించుకున్నారు. మొత్తంమీద 48 ఏళ్ళు మిషనరీ సేవలో చేతులు కలిపి పనిచేసారు. అబ్రహాముగారు వందలాదిగా వివాహాలు, బాప్తిస్మాలు నిర్వహించి తన 86వ ఏట 1975 అక్టోబరు 4న ప్రభువు సన్నిధికేగారు.

ఒకసారి చాగల్లులో అబ్రహాముగారు ప్రభువు శ్రమల వింత లాంతరు ప్రదర్శన చూపిస్తూ ఉంటే కొడమంచిలి కృపమ్మ అనే యువతి, "ప్రభువా ఇదంతా నా కొరకేనా" అని ఎలుగెత్తి ఏడుస్తూ ప్రభువును అంగీకరించింది. ఈమె తరువాత చెప్పరాయన్నగూడెం సంఘాధ్యక్షులు బొల్లిపో వీరన్నగారి భార్య అయింది.*

1922లో ప్రత్యేకంగా నంగవరం తూము దగ్గర వేసిన పందిట్లో చెట్టిపేట మహాసభలు జరిగినాయి.

జె.ఎస్. బౌడెన్ వ్యక్తిగతంగా చాగల్లు, చెట్టిపేట ప్రాంతాల్లో ఆత్మల రక్షణకోసం బహుగా ప్రయాసపడ్డారు. 1924 ఏప్రిల్ 23న పరలోకవాసులయ్యారు.

ఇప్పటికే థామస్ టిల్స్లీ, లిల్లీ [బౌడెన్] టిల్స్లీల కుమారుడు, జె.ఎస్. బౌడెన్ మనుమడు అయిన క్రాఫర్డు టిల్స్లీ 1920లో చెట్టిపేటలో స్థిరపడ్డారు . 1922లో మార్జరీకింగ్ని వివాహం చేసుకున్నారు. ఈమె తల్లిదండ్రులు బెంగుళూరులో 1902 నుండి 50 సంవత్సరాలు సేవ చేసినవారు. క్రాఫర్డు టిల్స్లీ, మార్జరీ, మిస్ టిల్స్లీగారు ప్రస్తుతం నర్సాపురంలో బాలికలకు హాలెండ్ హౌస్ హాస్టలు నడుపుతూ, సండేస్కూల్లు, స్త్రీల కూటాలు, 'జీవజలములు'

* టి. కె. ఎస్. అబ్రహాము, రాయబారి 1975 అక్టోబరు పేజీ 11

అనే రేడియో సేవలో సహకరిస్తున్నారు. ఈమెగాక క్రాఫర్డు టిల్‌స్లీగారికి మరొక కుమార్తె, కుమారుడు ఉన్నారు.

కుమారుడు కొలిన్ టిల్‌స్లీ 1935 జనవరి 23న రాజమండ్రి లూథరన్ హాస్పటల్‌లో పుట్టాడు. 1945లో ఈయన బాబ్‌స్టోక్స్ అనే మిషనెరీవల్ల మారుమనస్సు పొందాడు. 1965లో ఆస్ట్రేలియా, సిడ్నీ నగరంలో GLO [గాస్పెల్ లిటరేచర్ ఔట్‌రీచ్] ని స్థాపించి పలుదేశాలకు సువార్త దళాలను పంపి సువార్త సేవలో అనేక విధాలుగా ప్రయాసపడ్డారు. 1977లో తన తల్లిదండ్రులు పనిచేసిన భారతదేశానికి వచ్చి విస్తృతంగా పర్యటించి సువార్త ప్రకటించాడు.ఆయేడేఆగస్టులో పాకాళ్ళు పీకడం, నడుస్తుంటేకాళ్ళు తడబడటం మొదలైన లక్షణాలను గమనించి డాక్టరును సంప్రదిస్తే ఈయనకు టోటల్ మోటార్ న్యూరోన్‌వ్యాధి ఉన్నదని తెలిసింది. ఈ వ్యాధిరోగిని రోజురోజుకీ బలహీనుణ్ణిచేసి శరీరంలోని అవయవాలనన్నింటినీ క్రమంగా స్తంభింపజేసి చివరికి కటి పారేసినట్టు ఏ కదలికా లేకుండాచేసి ప్రాణం తీస్తుంది. ఇది వీరి కటుంబానికి సమ్మెట దెబ్బ. ఇలా మూడేళ్ళ దీర్ఘ అస్వస్థత తరువాత 1981 మార్చి 23న వీరు నిద్రలోనే కన్ను మూసారు. ఆరోజు వీరి తల్లిదండ్రుల వివాహవార్షికోత్సవం. వీరికి మిస్ సింథియాతో 1957 ఆగస్టు 24న టాస్మేనియాలో వివాహమైంది. వీరికి నలుగురు పిల్లలు. శ్రీమతి సింథియా టిల్‌స్లీగారు సిడ్నీలో వుంటూ భర్త ప్రారంభించిన పనిలో సహకరిసున్నారు.

చెట్టిపేట ప్రాంతంలో పెద్దలు, పరిచారకులు, సువార్తికులు, ఉపాధ్యాయులు, బైబిలు స్త్రీలకు మొట్టమొదటిగా బైబిలు తరగతులను నిర్వహించడం అనే సాంప్రదాయాన్ని స్థాపించింది క్రాఫర్డు టిల్‌స్లీగారే. మిస్ కోలిన్స్ వీరి కుటుంబంతో ఉంటూ ఈ ప్రాంతపు స్త్రీలమధ్య విశేషమైన సేవ చేసింది. ఈమెమీది గౌరవంతోనే ఈమె పేరు తమ కొడుక్కి పెట్టుకున్నారు టిల్‌స్లీ దంపతులు.

క్రాఫర్డు టిల్‌స్లీగారు యవ్వనప్రాయంనుండి డయాబెటీస్‌తో బాధ పడుతూఎవరికీ తెలియనిచ్చేవారుకాదు. ఎంతో చురుకుగా, హుషారుగా సేవా

కార్యక్రమాల్లో పాల్గొనేవారు. యువకులను ఎక్కువగా ప్రోత్సహిస్తూ ఉండేవారు. పాడుతున్న పాటల అర్థాలను వివరించి మరీ పాడించేవారు. 1947లో స్వదేశానికి సెలవుమీద వెళ్ళినప్పుడు భారతదేశానికి మిషనరీల ఆవశ్యకత గురించి ప్రసంగించినపుడు ఒక యువ డాక్టరు భార్యతోసహ గోదావరి ప్రాంతానికి వచ్చి నర్సాపురం లెప్రసీ ఆస్పత్రిలో సూపరింటెండెంటుగా పనిచేసారు. ఈయనే డాక్టరు ఎడ్వర్డు షార్టుగారు. ప్రస్తుతం నిడదవోలు హైస్కూలు హాస్టలును అజమాయిషీచేస్తున్న మిస్ హార్డింగుగారు కూడా టిల్‌స్లీగారివల్ల ప్రేరేపితురాలైనదే.

మూలనబడియున్న రాయబారి పత్రికను పునరుద్ధరించి 1964లో యువకుడు కె. విల్సన్‌గారికి దాని బాధ్యతను అప్పగించిన యోగ్యత టిల్‌స్లీగారిదే. 1964 తెలుగు కాన్ఫరెన్సులో ఈ నిర్ణయం జరిగింది. టిల్‌స్లీగారు ఆధ్యాత్మికంగానేకాక విశ్వాసుల ఆర్థిక సాంఘిక సంబంధమైన అభివృద్ధి విషయంలోకూడా శ్రద్ధ వహించేవారు. క్రైస్తవ స్త్రీల దగ్గర తానే లేసు కొని,ఎగుమతిచేసి వచ్చిన లాభాన్ని ఈ ప్రాంతంలో ప్రార్థనాలయాలను నిర్మించడానికి వెచ్చించారు. అనేక పాఠశాలలు స్థాపించి తెలివితేటలు గల యువతీయువకులను ఆర్థికంగా ప్రోత్సహించి ఉన్నత పదవులనలంకరించేందుకు దోహదం చేసారు. వ్యాధిగ్రస్తులు, వృద్ధులు, విధవరాళ్ళను ఆదరించేవారు. 87 గ్రామాలనుండి వచ్చి స్త్రీలు కుట్టుపనిలో పాల్గొనేవారు. మెకిషో ఆబ్రహాను, చెట్టె ఎలీషాగార్లు లేసు వ్యవహారాలు చూసుకునేవారు.

టిల్‌స్లీగారు సుమారు 100 సంఘాల భారం వహించి ఉన్నప్పటికీ, సువార్త కూటాల్లో ఎక్కువగా పాల్గొంటూ ఉండేవారు. నిడదవోలు బస్‌స్టాండు దగ్గర పాల్ సుధాకర్ మీనన్‌గారనే సువార్తికుని రప్పించి హైందవుల కోసం వేదాంత చర్చలు, సువార్త సభలు ఏర్పాటు చేయించారు.

చివరికి 1966 మే నెలలో తణుకులో జరిగిన అబ్దుల్‌హక్‌గారి మీటింగుల్లో పాల్గొని, విశ్రాంతికి జూన్‌లో కోటగిరి వెళ్ళారు. అక్కడ గుండెపోటువల్ల 1966 జూన్ 16 ఉదయం తనువు చాలించి ప్రభువు సన్నిధికి వెళ్ళిపోయారు. చనిపోయేముందు జుత్తిగ గ్రామ ఆలయం అగ్నిప్రమాదానికి గురైందనే కబురు అందుకొని ఆ గ్రామ విశ్వాసులకు సహాయం చెయ్యమని భార్యకు ఆదేశించారు. హవుస్‌బోటు సువార్తీకరణలో టిల్‌స్లీగారు

అందేవేసిన చెయ్యి అయినాడు. వీరి హయాంలోనే, ప్యారీ కంపెనీవారి భవనాలను కొని తమ నివాసాన్ని, బాలికల వసతిగృహాన్ని అక్కడికి మార్చారు. వీరి నివాసానికి 'బెరాకా' అని, బాలికల హాస్టలుకు హెబ్రోను హాస్టలు అని పేరు పెట్టడం జరిగింది. ప్రస్తుతం వి. లూకాగారు, చెట్టే జఫన్యాగార్ల ఆధ్వర్యంలో బైబిలుస్కూలు వీరి బంగళాలో నడపబడుతున్నది.

* * *

టిల్‌స్లీగారు బ్రతికిఉన్నంతకాలం కేవలం ఇంటి వ్యవహారాలు మాత్రం చక్కబెడుతూ వచ్చిన టిల్‌స్లీ సతీమణి భర్త మరణం తరువాత నడుంకట్టి సంఘాలన్నీ తిరుగుతూ స్త్రీల మీటింగులు నిర్వహించారు. టిల్‌స్లీగారు లేని లోటును భర్తీచేస్తూ, వారు చనిపోయారని నిరుత్సాహపడుతున్న ఆ ప్రాంతపు విశ్వాసులను బలపరుస్తూ, టిల్‌స్లీగారు తలపెట్టి ముగించలేకపోయిన కొన్ని పనులను ప్రార్థనామందిర నిర్మాణాలను పూర్తిచేసారు. ఈ విధంగా మూడేళ్ళుమాత్రం శ్రమించి 1969 ఏప్రిల్ 18న రక్తపోటుతో ప్రభువు సన్నిధికి చేర్చబడ్డారు.

మిస్ ఆడా జె. బ్రీలీ 1905లో ఇండియాకువచ్చి దాదాపు 1915 దాకా చెట్టిపేటలో స్త్రీలమధ్య సేవచేసారు. ఈమె అటుతరువాత ధవిలేశ్వరంలో చాలా ఏళ్ళు ఉండి మళ్ళీ 1950 ప్రాంతానికి చెట్టిపేట తిరిగివచ్చి కొంతకాలం ఉంది. ఈమె రాయబారి పత్రికలో 'వాక్యపరిశోధన' అనే శీర్షికక్రింద బైబిలు విషయాలను ప్రశ్నల రూపంలో ప్రచురించేది. దీనికి బహుమతులుకూడా ఇచ్చేది. 1914లో నర్సాపురం ఆస్పత్రి వ్యవస్థాపకురాలైన మిస్ ప్రింగ్ చెట్టిపేటలోనే ఉంటూ సెలవుమీద స్వదేశానికి వెళ్ళిందనీ అప్పటికే ఆస్పత్రి స్థాపించాలన్న భారం ఆమెలో ఉందనీ మిస్ బ్రీలి వ్రాతలవల్ల తెలుస్తోంది.

ఇ.ఎస్. బౌడెన్‌గారిద్వారా మారంపల్లి గ్రామంలో ఆకుమర్తి వరదయ్యగారు రక్షించబడి ఆదివారం ఆరాధనకు చెట్టిపేట వెళ్తుండేవారు. చెట్టిపేటనుండి మెరిపో అబ్రహాముగారి నాయకత్వంలో చెట్టే ఎలీషా, గళ్ళా జోయల్‌రాజు, చెట్టే యెషయి, చెట్టే బ్రహ్మయ్య, మెరిపో పోతురాజు తదితరులు వెళ్ళి సువార్త ప్రకటించేవారు. వరదయ్యగారిమూలంగా వీరి బావమరిది తాతపూడి సమూయేలుకూడా మారి ఇద్దరూ చెట్టిపేటలో బాప్తిస్మం పుచ్చుకున్నారు.

కాపు కులస్థులు పట్టా పల్లయ్యగారు, భార్య శేషమ్మగార్లు కూడా ప్రభువును నమ్ముకుని ఈ కాలంలో బౌడెన్‌పేటలో కాపురం ఉన్నారు. ఈయన పూర్వం చొప్పెల్లకు చెందిన పూజారి.

* * *

## తణుకు ప్రాంతం

1869లో మార్లపూడి వీరయ్య తదితరులు మారుమనస్సు పొందడంతో తణుకు సంఘం ప్రారంభం అయింది. వాడ్రేవుపల్లి ప్రాంతానికి ఇ.సి. ఆడమ్సుగారు రావడంతో మిస్ లిన్ అక్కడినుంచి 1910లో తణుకు వెళ్ళి సేవ ప్రారంభించింది. 1939దాకా కష్టించి క్రీస్తు సువార్తవ్యాప్తికి పాటుపడింది. ఈమె గుర్రంమీద ఒక ప్రక్కగా కూర్చుని ప్రయాణం చేసేది. అయితే ప్రకటించేదిమాత్రం గాడిదపిల్లను ఎక్కివెళ్ళిన క్రీస్తును గురించే. ఇంతేకాక బోటు సువార్తనుకూడా ఈమె చేపట్టింది. తన యవ్వన శక్తినీ, ఆస్తిపాస్తులనూ ఈ ప్రాంతపు క్రైస్తవులకోసం ధారపోసింది.

సండేస్కూలు సేవను ప్రోత్సహించి, విరామంలేక పిల్లలు, యువతీ యువకులచే వాక్యభాగాలను కంఠతా పెట్టించి వారికి బహుమతులనిచ్చేది. విధవరాళ్ళకు వస్త్రాలనిచ్చి ఆదరించేది. సేవలో ప్రయాసపడి ప్రతి పల్లె తిరుగుతూ కొందరు పోకిరీవాళ్ళు రాళ్ళతో కొట్టినప్పటికీ సహించుకుని వాళ్ళకోసం ప్రార్థించేది.ఈమెతో మార్లపూడి మంగమ్మ, మల్లిపూడి నవోమి, వల్లెకొండ రూతమ్మ, మల్లిపూడి భగీరథమ్మ అనే సువార్తికురాళ్ళు ఉండేవారు. వీరంతా తణుకు, వేల్పూరు, శివటం, మండపాక మొదలైన గ్రామాల్లో పరిసర ప్రాంతాల్లో మంచి సేవను జరిగించారు.

కొమ్మాయి చెరువుగట్టున బంగళాలో ఉంటున్న మిస్ లిన్ ఆధ్వర్యంలో పనిచేస్తున్న కూనవరపు ఆబేలుగారిని 1919లో చెట్టిపేటకు పంపించి పెదవాడపల్లిలో పనిచేసున్న చదలవాడ లూకాగారిని ఇక్కడికి రప్పించారు. (పాలకొల్లు చదలవాడ ఫ్రాన్సిస్‌గారికి చదలవాడ లూకా, టైటస్‌గార్లు కుమారులు) లూకాగారి భార్య చిలకమ్మ మిస్ మోర్గన్‌తోను, ధిద్దే

దుర్గమ్మ, మార్లపూడి మంగమ్మ తదితరులు మిస్ లిన్‌తోను కలిసి పని చేసేవారు. కొంతకాలానికి చదలవాడ బ్రైటన్‌గారిని పాలకొల్లునుండి రప్పించి తణుకు ప్రాంతపు సువార్తికునిగా నియమించారు. వీరే వీరభద్రపాడు స్టేషన్‌కు వెళ్ళారు.

మిస్ లిన్ మరణం తరువాత టెల్స్లీగారు దీని బాధ్యత నెత్తిన వేసుకుని బ్రైటన్‌గారు రిటైరైనందువల్ల వారిస్థానే ఖండవల్లి నుండి పాలూరి యెలియేజరుగారిని రప్పించారు. వీరు అదివరకే జుత్తిగ, ఖండవల్లి మొదలైనచోట్ల పనిచేసారు. 1961 జూన్ 16న యెలియేజరుగారు పరలోకగతుడైన తరువాత చిలుకంపాడులో సేవచేస్తున్న మార్లపూడి ఫిలిప్పు గారిని తణుకులో నియమించారు.

1870లో గళ్ళా లాజరుగారు పెదవాడపల్లినుండి వచ్చి పెరవలిలో సువార్తసేవ ప్రారంభించారు. బౌడెన్‌గారి కాలంలో రాపాక వెంకటస్వామి, సవరపు రామయ్యగార్లు,వారి కుటుంబాలు రక్షణ పొందడంద్వారా 1871లో సంఘం ఏర్పడింది. ఇక్కడ స్థాపించబడిన పాటశాలలో గళ్ళా సమూయేలు గారు పనిచేస్తూ సంఘభారం వహించారు. (వీరు తోలేటి సుబ్బారావుగారి మామగారు) కాకర్లమూడి స్వామి, తమ్మయ్య, కంకిపాటి యోహానుగార్లు పెద్దలుగా ఉండేవారు. స్కూల్లో చెట్టే ఎఫ్రాయిము, కూనవరపు సమూయేలు, మల్లిపూడి సమూయేలు, చెట్టే ఆనందం, సిర్రా దానియేలు గార్లు ఉపాధ్యాయులుగా, సంఘసేవకులుగా పనిచేసారు.

తణుకు సంఘంలో దిద్దే మలాకీ, చెట్టే ఆనందం, కంకిపాటి దావీదు, దిద్దే నోవహు, సిర్రా బోయజు, మార్లపూడి సత్యానందం, తవిటికి దైవకటాక్షంగారు టీచర్లుగా బోధకులుగా పనిచేసారు.

హీలిస్, బౌడెన్ కాలంలో తిరుగుడుమెట్టనుండి చదలవాడ దానియేలు వచ్చి వీరభద్రపురంలో స్థిరనివాసమేర్పరచుకొని ప్రభువు పక్షంగా శ్రమించారు. 1871లో వీరభద్రపాడు సంఘం లేచింది. వేల్పూరులో ఉన్న స్థలం అమ్మేసి వీరభద్రపురంలో ఇ.ఎస్. బౌడెన్‌గారు ఆలయంకోసం ఒక స్థలం కొన్నారు. దీన్ని 1891లో రిజిస్టరు చేయించారు.

1908-1928 కాలంలో మార్లపూడి ఫిలిప్పుగారు హెడ్మాస్టరుగా ఉంటున్న కాలంలో 1911లో 360 రూపాయలు వెచ్చించి ఉన్న స్థలంలోనే పక్కాగా ఒక ఆలయం కట్టించారు. అప్పటికి అది ఆ ప్రాంతాల్లోకల్లా పెద్దది. ఆలయానికి ఎదురుగా ఉన్న రెండో భాగాన్ని 8 మంది ఆరంభ క్రైస్తవ కుటుంబాలకు కేటాయించగా అక్కడ ఒక చిన్న క్రిస్టియన్ పేట ఏర్పడింది. ఇదంతా ఇ.యస్. హాడెన్‌గారి ఆధ్వర్యంలో జరిగింది. చందపర్రు స్టేషన్‌లో [illegible] ధాన్యాన్ని నిలవచెయ్యడానికి కట్టిన గాదెలను విప్పగా వచ్చిన కలపలో కొంత భాగాన్ని విశ్వాసులందరూ అక్కడినుండి మోసుకువచ్చి ఆలయ నిర్మాణంలో ఉపయోగించారు. యం. ఫిలిప్పుగారి కాలంలో ఎలిమెంటరీ స్కూల్లో వీరితో కలిసి పెదముత్తి వెంకన్న, యం. ప్రకాశం, యం. జాన్, సి. బాలకుగార్లు పనిచేసారు. 1928 నుండి 1939 వరకు యం. మోజెస్‌గారు హెడ్మాస్టరుగా ఉన్నారు. ఈ కాలంలో కె. కృపానందం, యం. రూబేను, యం. సమూయేలు, ఎన్. విలియంగార్లు పనిచేసారు. ఈ కాలంలో కూనవరపు ఆబేలుగారు, తదనంతరం చదలవాడ [illegible]గార్లు సిస్టర్లుగా పనిచేసారు.

మార్లపూడి ఫిలిప్పుగారు తణుకులో జేమ్సు జానకమ్మగార్లకు జన్మించారు. నర్సాపురం స్కూల్లో చదువుకుని వీరభద్రపాడులో 20 ఏళ్ళు టీచరుగా సంఘసేవకునిగా పనిచేసారు. ఆబోతు నర్సయ్య, సుజానమ్మ గార్ల కుమార్తె అన్నమ్మను వివాహమాడారు. కోడవల్లి, చెరుకువాడ, పెరవలి, వేలంక గ్రామాల్లోకూడా వీరు పనిచేసారు. అటుపైన సంపూర్ణ సువార్తికునిగా [illegible], పలుకంపాడు, తణుకు సంఘాల్లో పనిచేశారు. టిల్స్లీ గారు వీరి జీవితకాలమంతా జీతమిచ్చి పోషించారు. గొప్ప దైవజనుడుగా పేరుపొందిన వీరు తమ 75వ యేట ప్రభువులో నిద్రించారు. సిర్రా బోయజు గారు [illegible] ష్రదక్, నాంచారమ్మగార్లకు జన్మించి బ్రాప్లీ గారి బోర్డింగులో చదువుకుని టిల్స్లీగారి యాజమాన్యంలో తణుకు, కోడవల్లి, కాపవరం, మాముడూరు, వీరభద్రపాడు, కాకిలేరు, పెనుగొండ, కొత్తపాడు, అనువాజిపాలెం, మారెమ్మగూడెం తదితర గ్రామాల్లో దైవసేవకులుగా, టీచరుగా పనిచేసారు. వీరు 1959 జూలై 11న [illegible] తనువు చాలించారు.

ఆ కాలంలో తణుకు ప్రాంతంలో తణుకు, వీరభద్రపురం గాక కన్నాయకుముదవల్లి ముఖ్యమైనది. 1918లో మిస్ లిన్ పెరనలికి చెందిన గళ్ళా సమూయేలుగారు ఇక్కడ చేసిన వాక్య ప్రకటనవల్ల కండవల్లి ఆదమ్మ, చెల్లమ్మ, బుల్లెమ్మ, కొడమంచిలి పాపమ్మ, కండవల్లి సత్తెయ్య అనేవారు ప్రభువును విశ్వసించారు. 1918లోనే కండవల్లి అచ్చయ్యగారి ఇంట్లో పాకవేసి స్కూలు ప్రారంభించారు. ఇ.ఎస్. బొడెన్‌గారు దీని బాధ్యత స్వీకరించి నవుంద్ర నరసయ్యగారిని ఉపాధ్యాయునిగా ఇక్కడికి పంపించారు. అప్పటినుండి మార్లపూడి ఫిలిప్పు, ఆశీర్వాదం, సిరా బోయజు, మర్లపూడి గాబ్రియేలు, ఉప్పాటి దానియేలు, సిరా షద్రకు, చెట్టే ఆనందం, వెంకన్నగారు ఉపాధ్యాయులుగా దైవ సేవకులుగా ఇక్కడ సువార్తను ప్రకటించారు. ఈ ఊరికి చెందిన గాలింకి ప్లైటన్‌గారు, కొడమంచిలి మోషేగారు చెట్టిపేట ప్రాంతమంతటిలో తిరిగి సేవచేసారు.

ఇక్కడ 1922లో 20 సెంట్ల భూమిని సంపాదించి తాటాకుల షెడ్లను ఆలయంకోసం నిర్మిస్తే గ్రామస్తులు దాన్ని తగులబెట్టారు. 3సార్లు ఈ ఆలయాన్ని నిర్మించి చివరికి యెలియేజరుగారికాలంలో రేకు పెంకుతో ఆలయం కట్టారు.

ఈ ప్రాంతపు ఆరంభ క్రైస్తవులలో ఒకరైన మల్లపూడి పేతురు [రూబేనుగారి తండ్రి] గారు రక్షణపొందే సమయానికి 24ఏళ్ళ ప్రాయంలో ఉన్నారు. ఉండ్రాజవరం, రామేశ్వరం తీర్థాల్లో సువార్త ప్రకటించారు. ఆదివారం వీరభద్రపాడులో ఆరాధన ముగించుకుని కాకిలేరు, మడుగు పోలవరం, గ్రామాలమీదుగా వెళ్తూ కూటాలు జరిపి పాలకొల్లువెళ్ళి మళ్ళీ శనివారం రాత్రికి ఇల్లు చేరేవారు. ఇక్కడి విశ్వాసులు ఒకే కుటుంబంలాగా క్రీస్తులో అన్యోన్యంగా ఉంటూ ఉండేవారు. తరువాత లేచిన సంఘాల గురించి తరువాతి భాగంలో చదువుతాము.

మిస్ లిన్‌చే స్థాపించబడిన తణుకు స్కూల్లో మార్లపూడి సత్యానందంగారు, కాయలపాడు స్కూల్లో తవిటికి వెంకటస్వామిగారు పనిచేసారు.

ఇవిగాక మిస్ లిన్ సువార్త సేవా ఫలితంగా కాకుల ఇల్లెంద్రపర్రు మారంపూడి, కాయలపాడు తదితర సంఘాలు స్థాపించబడినాయి.

సుమ్మిడిపరంకు చెందిన తవిటికి మరిణియ్యగారి పెద్ద కుమారుడు వెంకటస్వామిగారు అంబాజీపేటలో స్థిరపడి మిషనెరీలకు దర్జీ పనివానిగా ఉంటూ ఉండేవారు. కాయలపాడు సంఘస్థాపనలో వీరు ప్రయాసపడ్డారు. వీరి పెద్ద కుమారుడు దైవకటాక్షంగారు నర్సాపురం మిషన్‌స్కూల్లో చదువుకుని టీచరు ట్రెయినింగుపొంది కాయలపాడులో, అటు తరువాత వీరభద్రపురంలో పనిచేసారు. మల్లిపూడి ఫిలిప్పుగారు వీరికి అసిస్టెంటుగా పనిచేశారు. దైవకటాక్షంగారు ఆటుతరువాత తణుకులో కొంతకాలం పనిచేసి నర్సాపురం రైలుమార్గంవేసే సమయంలో రైల్వే పి.డబ్ల్యు.డి లో చేరి పనిచేసారు. మళ్ళీ వేల్పూరులో టీచరుగా కొంతకాలం పనిచేసి వీరభద్రపాడు సంఘపెద్దగా సేవచేసారు. 1947 డిసెంబరు 11వ తేదీన పరమపదించారు. వీరికి తృతీయ సంతానంగా ప్రస్తుతం జీవజలములు రేడియో కార్యక్రమం డైరెక్టరు టి. కె. జార్జిగారు జన్మించారు.

## లోయర్ గోస్తనది

లోయర్ గోస్తనది ప్రాంతంలో అప్పటికి మోగల్లు, శృంగవృక్షం, కోరుకొల్లు, వేమవరం, కొండేభట్లచెరువు, బలుసులుగొయ్య మొదలైన సంఘాలుండేవి. ఆదిలోనే హీలిన్‌గారు ఈ గ్రామాల్లో సువార్త వినిపించారు. లచ్చమ్మ, ఆదమ్మ అనే ఇద్దరు స్త్రీలు ఒకే వ్యక్తికి భార్యలుగాఉండి ప్రభువులో విశ్వసించారు. తరువాతి కాలంలో కన్నిపాముల ఎనోకు [మోషే, యోసేపుగార్ల తండ్రి], మల్లిపూడి రామస్వామిగార్లు మోగల్లుకు సువార్తికులుగా వచ్చారు. ఈ సేవఫలితంగా కడిమి పెన్నేరమ్మ విశ్వసించి బాప్తిస్మం పొందింది. కంకిపాటి నాగమ్మకూడా ఈమెననుసరించింది. పెదవాడపల్లికి చెందిన గళ్ళా సుబ్బయ్యగారికి ఇది అత్తగారిల్లుకావడంతో వీరు మోగల్లులోఉంటూ తన ఇంటిలోనే చిన్న ప్రార్థనశాలను కట్టించి ఆరాధనను జరిపించేవారు. కోరుకొల్లుకు చెందిన కొల్లి నాగయ్యగారుకూడా వాక్యానికి విధేయుడై కుటుంబసమేతంగా ఈ కూటాలకు వస్తూఉండేవారు. సుబ్బయ్యగారికి యాకోబు, సత్యానందం దావీదు అనే కుమారులు, శాంతమ్మ, మరియమ్మ అనే కుమార్తెలు ఉండేవారు. వీరుగాక సిన్నెరిపురానికి

చెందిన తానేటి లక్ష్మయ్యకూడా ప్రభువును నమ్ముకున్నారు. వీరి కుమారుడు కుంటియ్యకూడా తండ్రిననుసరించి క్రైస్తవుడై నమ్మకమైన జీవితం గడిపారు. సిన్నెరపురంలో ప్రస్తుతం లూథరన్ సంఘం ఉన్నది. కంకిపాటి నాగమ్మ, ఆమె భర్త నతానియేలుగారు, సన్నమండ్ర యోబు మొదలైనవారు ఈ సంఘ విశ్వాసులు.

కంకిపాటి నాగమ్మ, నతానియేలుగార్ల కుమారుడు యోసేపుగారు. ఈయన పెదవాడపల్లికి చెందిన కరుణమ్మను వివాహమాడగా మోషే, దావీదు, నతానియేలు అనే ముగ్గురు కుమారులు కలిగారు. కంకిపాటి మోషే గారు నర్సాపురం బ్రామ్లీగారి బోర్డింగులోఉంటూ ఎనిమిదవ స్టాండర్డు పాసై చెట్టిపేట ఎలిమెంటరీస్కూల్లో టీచరుగా చాలాకాలం పనిచేసారు. వీరు గళ్ళా చంద్రయ్యగారి కుమార్తె వైడూర్యమ్మను చేసుకున్నారు. ఈయన కవి. టిల్స్లీగారికి ఆరంభంలో తెలుగు నేర్పించడమేగాక సేవలో ఆయనతో కలిసి పనిచేసారు. వీరి రెండవ కుమారుడు జోసెఫ్ సిడ్నీగారు గళ్ళా జోయల్‌రాజుగారి జ్యేష్ఠ పుత్రిక దీవెనమ్మగారిని వివాహమాడారు. సిడ్నీగారు కొంతకాలం పౌరవిమానశాఖలో, టెలికమ్యూనికేషన్‌లో ఉండి ప్రస్తుతం క్రిష్ణాజిల్లా గన్నవరం ప్రాంతంలో ఎనలేని సేవచేస్తూ ఉన్నారు.

మోగల్లులో కంకిపాటి దావీదుగారు టీచరుగా, కాపరిగా పనిచేసిన తరువాత తుంపిరి సమూయేలుగారు, ఉప్పాటి దానియేలుగారు,గళ్ళా దావీదుగారి కుమారుడు సమూయేలుగార్లు పనిచేసారు.

1920లో మోగల్లు సంఘభారం టిల్స్లీగారు చేపట్టేవరకూ ఈ సంఘ క్షేమాన్ని ఆర్.జె. బ్రయంట్‌గారు చూస్తుండేవారు. వీరి సేవ జీవిత విశేషాలు ప్రత్తిపాడు ప్రాంతం గురించి ప్రస్తావించినప్పుడు తెలుసు కుంటాము. 1932లో టిల్స్లీగారి సహాయంతో ఇక్కడ స్కూలు ఆలయం కొరకు విశాలమైన కట్టడం నిర్మించారు.

ఆ దినాల్లో యోగ్యమైన సేవ చేసిన వారిలో గళ్ళా దావీదు, కడిమి దావీదు మొదలైనవారున్నారు. గళ్ళా దావీదుగారు మోగల్లు సంఘ కాపరిగా చాలాకాలం నమ్మకంగా పనిచేసారు. ఉనికిలి, ఆరవల్లి సంఘాలకు వెళ్ళి వాక్యపరిచర్య చేసేవారు. తన 85వ యేట 1969 డిసెంబరు 15న అస్తమించారు. గళ్ళా దావీదుగారు, [జి.డి.యం. సంఘాల సాజీ కార్యదర్శి

కె.శే. గళ్ళా సమూయేలు, పాలకొల్లులో స్థిరపడిన మాజీ ప్రిన్సిపాల్ గళ్ళా సత్యానందదేవిడ్‌గారి తండ్రి).

శృంగవృక్షం గ్రామానికి చెందిన గంగోలు పుల్లయ్యగారు మోగల్లు బంధువుల ఇంటికి వస్తూ వాక్యం వినేవాడు. హీబెన్ శృంగవృక్షంలో వాక్యం, ప్రకటిస్తూ ఉంటే పుల్లయ్యగారు రక్షణ పొందారు. వీరి కుమారులు సీమోను. యెహోషువ. పుల్లయ్యగారితోబాటు ప్రత్తిపాటి ఫకీరు, వెంకటరెడ్డి, బలనేలుగార్లు బాప్తిస్మం పొందారు. చదలవాడ లూకా, పడాల యోసేపు, కన్నిపాముల మోషే, చెదలవాడ నోవహుగార్లు సువార్తికులుగాను, సంధి ఆనందం, సిర్రా సమూయేలు, మెరిపో యెషయా, గళ్ళా సమూయేలు, మల్లిపూడి సత్తయ్య గార్లు టీచర్లుగా బోధకులుగా ఉన్నారు.

కోరుకొల్లు సంఘానికి ప్రథమఫలం కొల్లి నాగయ్యగారు. వీరి కుమారులు పెద్ద పల్లయ్య, చిన్న పల్లయ్య సంఘ పెద్దలుగా పనిచేసారు. చినపల్లయ్య సాక్ష్యం వల్ల చేకూరి రామరాజు అనే కామందు ప్రభువును విశ్వసించి, దేవిడ్‌రాజుగా పేరు మార్చుకుని, కుటుంబంచే తృణీకరింపబడి ఈ ప్రాంతాల్లో గొప్పసాక్షిగా నిలిచాడు.

నేమవరంలో 1900 ప్రాంతంలో కొడమంచిలి స్వామిగారు ఇ.సి. బౌడెన్‌గారి వాక్యపరిచర్యవల్ల రక్షించబడి పరిసరప్రాంతాల్లో సేవచేసారు. స్కూలు, సంఘం స్థాపించి టిల్‌స్లీగారి సహకారంతో నడిపారు. ఇక్కడ గెద్దాడ సలాలియేలు, మైలాబత్తుల కృపావరం, నవ్వంద్రుడు విలియమ్స్‌గార్లు పనిచేసారు.

కొండేపల్లు సంఘం ఇ.ఎస్. బౌడెన్‌గారి ఆధ్వర్యంలో నార్కిమెల్లి వారి కుటుంబం రక్షణ పొందినందువల్ల ఏర్పడింది. ఇక్కడ మల్లిపూడి రూబేనుగారు సంఘకాపరిగా ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ సంఘాన్ని బలపరిచారు. నార్కిమెల్లి మోషేగారు ఆయా గ్రామాల్లో పనిచేస్తూ వీరికి సహాయకులుగా ఉన్నారు. అటుతరువాత సిర్రా దానియేలుగారు, సన్నమండ్రి నథానియేలు, కొడమంచిలి కృపానందం, గళ్ళా సమూయేలు, మల్లిపూడి పౌలుగార్లు ఇక్కడ పనిచేసారు. నార్కిమెల్లి మోషేగారు మల్లిపూడి రూబేనుగారి అల్లుడు.

బలుసులుగొయ్యి సంఘాన్ని ఉప్పాటి క్రిష్ణయ్య, ఉప్పాటి అబ్బేజు, ఏజర్ల సమూయేలు, ఉప్పాటి అబ్రాహాము, యాకోబుగార్లు నడిపించారు. ఏజర్ల సమూయేలుగారు నర్సాపురం బేతని సంఘాధ్యక్షుడు, ఫ్రాంక్లిన్‌గారి తండ్రి.

ఇక్కడ మల్లిపూడి రూబేను, దుద్దే సుబ్బన్న, సిర్రా దానియేలు, కన్నిపాముల సమూయేలు, నార్కెమెల్లి మోషేగారు సువార్తికులుగా వాసికెక్కారు. మల్లిపూడి రూబేనుగారు వీరభద్రపురంలో జన్మించి 3వ తరగతిదాకా కష్టపడి చదువుకున్నారు. బౌడెన్‌గారు ఈయన్ను కొండేభట్ల చెరువులో దైవసేవకునిగా నియమించారు. అటుపైన మామిడూరులో సువార్తికునిగాను, చెట్టిపేట ప్రాంతీయ ఎలిమెంటరీస్కూళ్ళ సూపర్‌వైజరుగాను పనిచేసారు. ఈ ప్రాంతమంతటిలోను వృద్ధాప్యందాకా నమ్మకమైన సేవచేసారు. టిల్‌స్లీగారికి వీరు కుడిభుజంలాంటివారు. దుద్దే సుబ్బన్నగారితో కలిసి సంఘాలను కట్టడంలో శ్రమించి 1946లో బ్రాహ్మణచెరువులో ప్రభువులో నిద్రించారు. దుద్దే సుబ్బన్నగారు కనకాయలంకలో 1888లో జన్మించారు. వీరి విద్యాభ్యాసం ఏలూరు, అమలాపురంలో జరిగింది. టిల్‌స్లీగారి యాజమాన్యంలో శృంగవృక్షం, వేలివెన్నుల్లో పనిచేసి టీచరు పదవిని వదిలి సంపూర్ణసువార్త సేవకునిగా ముందుకు వచ్చారు. 1932నుండి పాలమూరులో మల్లిపూడి రూబేనుగారితో జతపనివాడుగా ఉన్నారు. రూబేనుగారి మరణానంతరం లోయర్ గోస్తనది ప్రాంతమంతా సైకిల్‌పై ప్రయాణిస్తూ 35 ఏళ్ళు దైవసేవచేసారు. క్రొత్తసంవత్సరం మీటింగులు నవుడూరు జంక్షన్ దగ్గర జరిపించేవారు. 1964లో యువజన సభలు నడిపించారు. గోదావరి డెల్టా స్టీవర్డ్సు అసోసియేషన్ సభ్యునిగా తెలుగు కాన్ఫరెన్స్‌లోను పాఠశాలల అజమాయిషీలోను ఉత్సాహంగా పనిచేసారు. వివాహ రిజిస్ట్రారుగాను, తగవులు తీర్చడంలో నేర్పరిగాను, క్రమశిక్షణ అమలుజరిపే పెద్దగాను చిరకాలం పాటుపడ్డారు. రేడియో జీవజలముల ద్వారా సందేశాలుకూడా ఇచ్చారు. చివరికి 1967 జూలై 31వ రాత్రి ప్రభువు పిలుపునందుకుని పరలోకగతులైనారు.

వీరి చెల్లెలు కాంతమ్మను సిర్రా దానియేలుగారు వివాహమాడారు. 1924నుండి మామిడూరు, వీరభద్రపురం, అరవల్లి ఇంకా కొన్ని చెట్టిపేట ప్రాంతాలగ్రామాల్లో విస్తృతంగా సేవచేసారు.

# 14

# అమలాపురం

సి.ఎమ్.ఎస్ వారు 1875లో అమలాపురం ప్రాంతంలో సేవ ప్రారంభించారు. 1877లో నోబుల్‌గారి మూలంగా క్రైస్తవుడైన ఆచంట సుబ్బారాయుడు అనే బ్రాహ్మణుణ్ణి అక్కడికి పాస్టరుగా పంపారు. బెండమూర్లంకలో స్థిరాస్తులున్న కెప్టెన్ స్టొడ్డార్టు, టేలర్ ఈ సేవను ప్రోత్సహించి 300రూ. కానుకగా ఇవ్వడమేకాక తదుపరి బెండమూర్లంకలోని తమ ఆస్తినికూడా సేవకే ధారదత్తం చేసారు. వీరు ప్రభుత్వాధికారి. అక్కడ 1877లో ఒక బంగళాను కట్టించి ఉన్నత కులస్థులను ఆకర్షించే ప్రయత్నంలో ఒక ఇంగ్లీషు తెలుగు బడినికూడా స్థాపించారు. దాదాపు 4 మంది నిమ్న కులస్థులు ఇహలోక సంబంధమైన లాభాన్ని ఆశించి ముందుకి వచ్చారుగాని అలాటిదేమీ లేకపోవడంవల్ల వెనక్కి తగ్గారు. వీరిలో ఒక్క బాల సుబ్బయ్యగారుమాత్రం కేవలం క్రీస్తులో నిత్యజీవాన్నిమాత్రం ఆశించి ముందుకి వచ్చి 1879లో బాప్తిస్మం పుచ్చుకున్నారు. (వీరు నర్సాపురం మిషన్‌హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిన అజరయ్యగారి తాతగారు). పెద్దపట్నంలో హీటన్‌ద్వారా సువార్త విని నాగాబత్తుల వీరాస్వామిగారుకూడా విశ్వసించి బాప్తిస్మంపొంది ఈ ప్రాంతపు ప్రఖ్యాత సువార్తికునిగా పేరు తెచ్చుకుని చాలాకాలం సేవచేసి 1935లో తనువు చాలించారు. వీరు ప్రస్తుతం రేమెన్సు ఇవాంజిలికల్ ఫెలోషిప్పుకుచెందిన జాషువా డేనియల్‌గారి తాతగారు.

సంఘ ఆస్తులు, సేవ సి.ఎమ్.ఎస్. వారినుండి జి.డి.యం. కు బదిలీ చేయడం జరిగిన తరువాత మక్రే దంపతులు 1890 ఆగస్టు నెలలో అక్కడ నివాసం ఏర్పరచుకున్నారు. మిస్ రూతు లిన్ వచ్చి వీరితో కలిసింది. ఈమె సోదరి రేచల్ లిన్‌కూడా 1886లో వచ్చి చెట్టిపేటలో ఇ.ఎన్. బౌడెన్‌గారి కుటుంబంలో కొంతకాలముండి అక్కడినుంచి అమలాపురం,

తదనంతరం బెండమూర్లంక వెళ్ళి 1900దాకా సేవచేసింది. రూతు లిన్ 1902లో వ్రాడేవుపల్లి వెళ్ళకముందు అమలాపురం ప్రాంతంలో బహు యోగ్యమైన సేవ చేసింది.

అమలాపురం సేవకూ మ్రకేగారికీ అవినాభావ సంబంధంఉంది. వీరి సేవ ఫలితంగా 325మంది ప్రభువును నమ్ముకోగా వీరే ఈ క్రొత్త విశ్వాసులకు బాప్తిస్మాలు ఇచ్చారు. 8 గ్రామాల్లో సంఘాలు స్థాపించారు.

మ్రకేగారి టేబుల్‌మీద ఒక చిన్నవాక్యం రాసిఉన్న స్టాండు ఉండేదట. ఎప్పుడూ ఆయన కళ్ళఎదుటే ఈ వాక్యం కనిపిస్తూ ఉండేది. "ఈ పనిని యేసైతే ఎలా చేస్తాడు?" ఒక ఉత్తరం రాయవలసి వచ్చినా, ఒక వ్యవహారం నడపవలసివచ్చినా ఈయన యేసును ఆదర్శంగా పెట్టుకుని సరిచూసుకునేవాడు. అమలాపురం ఫీల్డును అన్నివిధాల పైకితెచ్చి 1914లో తన వృద్ధాప్యంలో కూనూరువెళ్ళి 1925 ఏప్రిల్ 23వ తేదీన తన 82వ యేట క్రీస్తులో నిద్రించారు. సరిగ్గా సంవత్సరంక్రితం ఇదేరోజున ఇ.ఎస్. బౌడెన్‌గారు మరణించారు.

బ్రాష్లీగారు తన గ్రంథంలో వీరిని **"The greatest Christian gentleman the Godavari has Known"** అని అభివర్ణించారు. మ్రకేసతి స్కాట్‌లాండుకు వెళ్ళి తన 84వ యేట 1935 సెప్టెంబరు 30వ తేదీన తన పతిననుసరించింది.

* * *

బూల సుబ్బయ్యగారి సంతానం బూల రెడ్డి, దానియేలు,సమూయేలు, యోహాను, జీవరత్నంగార్లు రక్షించబడి అమలాపురం సంఘానికి పునాది అయినారు. సి.యం.ఎస్. వారితో వచ్చిన ఆచంట సుబ్బారాయుడు, బోడి శీనయ్య, అల్లంకి వెంకటరెడ్డినాయుడుగార్లు అక్కడే నిలిచి సేవ చేసేవారు. మ్రకే దంపతులకు సువార్త సేవలో సహాయకులుగా చదలవాడ థామస్ (నర్సాపురం), నాగాబత్తుల పీరాస్వామిగార్లు వచ్చారు. వీరంతా కలిసి బెండమూర్లంక, ముమ్మిడివరం, సిరిపెల్లి, పాగాల, విలస, పాతాళదిబ్బ, చల్లపల్లి మొదలైన గ్రామాల్లో ఎలిమెంటరీస్కూళ్ళు స్థాపించారు.

ఆచంట సుబ్బారాయుడు తదితరులతోబాటు సక్కా తిమోతిగారు సి.ఎమ్.ఎస్. వారిచే నియమితుడై పెతాళదిబ్బ గ్రామంలో సేవనారంభించగా సరెళ్ళ అబ్రాహాముగారి కుటుంబ సభ్యులు—భార్య శారా, స్వామి, సత్తియ్య థామస్, లాజరు, జెర్మియా, బెంజమిన్, సోదరి సంగమ్మగార్లు, నోవహుగారి కుటుంబం షేము, హాము, యాపెతుగార్లు, ఈసాకుగారి కుటుంబం యాకోబు, ఆబేలు, మార్తమ్మ, రత్నమ్మగార్లు రక్షించబడ్డారు. సరెళ్ళ అబ్రాహాముగారి మనవడు రెవ. ఎస్. ఎస్. సుబ్బయగారు డోర్నకల్ డయోసిస్‌కు ఆర్చిడీకన్‌గా వచ్చారు. ఈ పదవికి నియమితులైన మొదటి భారతీయుడు ఈయనే.

బడుగురెడ్డిగారి కుటుంబసభ్యులు , పోతుల రెడ్డిగారి కుటుంబం సభ్యులు మక్కేగారి సేవవల్ల రక్షణ వెలుగులోకి వచ్చారు. వడ్డి చెరువు గట్టునఉన్న యేళ్ళ సర్వయ్యగారు, కుమారులు థామస్, నాగిన్నరెడ్డి, సోల్మన్, జీవరత్నంగార్లు, వోగూరి మంగమ్మ, రత్నమ్మ, పచ్చిమెళ్ళ రాజాయుడుగార్లు కూడా క్రైస్తవులైనారు.

1891 జనవరిలో తనువు చాలించిన అమలాపురం ప్రాంతపు పాకలగరువు కాపురస్థుడు ఆకుమర్తి వెంకయ్య రంగూన్‌లో తోటమాలిగా పనిచేస్తూ తన యజమానిమూలంగానే సువార్త విన్నాడు. అక్కడనుంచి తిరిగివచ్చి స్వగ్రామంలో తన విశ్వాసం సంగతి వెల్లడిస్తే అతని భార్య, అత్తగారు రహస్యంగా అతను తినే అన్నంలో మందు కలుపుతూ వచ్చారు. ప్రతి ఆదివారం అమలాపురం నడిచివెళ్ళి ఆరాధనలో పాల్గొనేవాడు. 1891 జనవరి రెండున ఇతనికి బాప్తిస్మం ఇచ్చారు. జూలై నెలనుండి బలహీనుడై మంచం పట్టాడు. బంధువులంతా నిత్యం శోధిస్తూ నిందిస్తూ ఉన్నప్పటికీ సంతోషంతో అందరికీ సాక్ష్యమిచ్చేవాడు. ఇతను మరణశయ్యమీద ఉండగా వరదవచ్చి ఇంటిలోకి నీళ్ళు ప్రవేశించినాయి. వెంకయ్య తన భార్య చేతిని పట్టుకుని "సీతా, ప్రభువుకూ మరిదేన్నీ అడ్డురానియ్యకు, ఎంత నష్టమైనాసరే ఆయన్ని వెంబడించు." అని చెప్పి కన్ను మూసాడు. వరదనీటి మట్టం పెరిగి ఆ యిల్లు మునిగిపోయింది. ఆ శవాన్ని పాతిపెట్టే అవకాశం లేకపోయింది. మక్కేగారి కాలంలోనే చల్లపల్లిలో చదలవాడ థామస్, నారాబత్తుల పేరాస్వామి, సరెళ్ళ ఆబేలుగార్ల సేవవల్ల బీర థామస్,

కృష్ణయ్య, యాకోబుగార్లు క్రీస్తును నమ్మి బాప్తిస్మం పొందారు. అటుపైన బీర థామస్, ప్రొద్దోకు వెంకన్న, నరెళ్ళ షేము, బడుగు ఇశ్రాయేలుగార్లు ఈ గ్రామపు స్కూల్లోను, సంఘంలోను పనిచేసారు.

1900–1925 కాలంలో ఎగరం ద్వీపంలో సేవ బాగా వ్యాపించింది. పశ్చిమడెల్టాలోకూడా విశ్వాసుల సంఖ్య విస్తరించింది. రెడ్డిసీమలోను, ఉత్తర ప్రాంతంలోని కాపు, కమ్మ, గొల్ల, భట్రాజుకులాల్లో విశ్వాసులను దేవుడు లేపాడు. ఉదాహరణకు అడివిచిక్కాలకుచెందిన గడ్డియ్య పదిహేనేళ్ళపాటు తన స్వగృహంలోఉంటూ అనేకమైన శ్రమలను సహించాడు. మూలస్థానానికి చెందిన వృద్ధ పాపమ్మ, కోరుమామిడికి చెందిన పీటర్సన్, పాపమ్మ, చొప్పెల్లకు చెందిన పూజారి పట్టా పల్లయ్య మొదలైనవారు కులస్థులు, సంపన్న గృహాలకు చెందినవారై ఉండి క్రీస్తుకు సాక్షులుగా స్థిరంగా నిలిచారు.

1896లో బెండమూర్లంకలో మిస్ లిన్ సేవ ప్రారంభించి కూనవరపు తిమోతీగారి సహకారంతో ఈడిగ కులస్థుడు పెచ్చేటి సుబ్బారాయుడుఅనే అతను 1901లో బాప్తిస్మం పొందడానికి పాటుబడింది. మిస్ రాబర్ట్సన్, మిస్ మార్షల్‌లు ఈ సేవను పాతికేళ్ళపాటు కొనసాగించారు. మక్రే దంపతులు బాలికల బోర్డింగుస్కూలు, అగ్రకులాల బాలికలకోసం ఒక స్కూలు, ఇంకా లెక్కకు మిక్కిలిగా పాటశాలలు స్థాపించి 1914లో రిటైరై కూనూరు (నీలగిరి)వెళ్ళిపోయారు.రాబర్ట్సన్,మార్షల్‌గార్ల సేవలో బూలా మహాలక్ష్మి, నాగాబత్తుల ముత్యాలు, తుమ్మలపల్లి సుంగమ్మ తదితరులుకూడా ప్రభువుతట్టు తిరిగారు. బెండమూర్లంకలో మిషనెరీ బంగళా బాలికల బోర్డింగుస్కూలు ప్రార్థనామందిరాల నిర్మాణం జరిగింది. 1922లో మిస్ రాబర్ట్సన్‌కు జబ్బుచెయ్యడంతో ఇద్దరూ స్వదేశానికి వెళ్ళిపోయారు.

1894 సెప్టెంబరు 11న వాడపల్లి సంఘం, 1901లో కూనవరపు తిమోతిగారి కృషివల్ల గంటిపెదపూడి సంఘం, 1905లో అనిడి గ్రామ సంఘం, స్థాపించబడినాయి. ఇక్కడి సేవలో మక్రేగారికి చదలవాడ థామస్‌గారు కుడిభుజంగా ఉన్నారు. థామస్‌గారు 1906 జూలై 27న కలరావల్ల చనిపోయారు. వీరు జోనా, జోసెఫ్ గార్ల తండ్రి.

ఈ కాలంలోనే తుమ్మలపల్లి మిషన్‌స్కూలు స్థాపించబడింది.

దీన్లో పోతుల వెంకన్నగారు ప్రథమంగా టీచరుగాసంఘ కాపరిగా వచ్చారు. ఆటుతరువాత గెడ్డం సమూయేలు, క్రాటు అర్జున్న, బిరుదుగంటి ధనునుగార్లు టీచర్లుగా పనిచేసారు. బెండమూర్లంక బడిలో పనిచేస్తూఉన్న నాగాబత్తుల దేవానందం, ఆంజటి ఆంద్రూ, బూలా దానియేలుగార్లు సంఘాల్లో ఆసక్తిగా సేవచేస్తూ వచ్చారు. ఈకాలంలో బెండమూర్లంక సంఘంలో క్రాటు మరిణియ్య, బొంతు వెంకటస్వామి, సబ్బితి జఖర్యా, రెడ్డిగార్లు సంఘపెద్దలుగా పనిచేసారు.

అనులాపురం ప్రాంతంలో బూలరెడ్డి, సరెళ్ళ లాజరు, బూలా దానియేలు,బూలా సమూయేలు,సరెళ్ళ థామస్‌గార్లు టీచర్లుగాఉంటూ పరిసర గ్రామాల్లో పర్యటించి సేవచేసారు. సరెళ్ళ అబ్రహాముగారి కుమారుడు బెంజమిన్‌గారు తీర్థాలు, సంతలు, పరిసర గ్రామాల్లో ఎనలేని సేవచేసారు. తరువాతి కాలంలో సేవాభారాన్ని వహించినవారు గూటం జాన్ తాతయ్య, ఎ. ఆంద్రూ,దేవరపల్లిసోమన్న,యేళ్ళ రెడ్డి,కొంకి ముత్యాలు,సరెళ్ళ వెంకటరత్నం కొంకి గాబ్రియేలుగార్లు. స్త్రీలమధ్య సేవలో ప్రసిద్ధులైనవారు బూల జెస్సమ్మ, బూల శాంతమ్మ, గండేపల్లి వెంకమ్మ, చింతపల్లి నాగమ్మ, కాశి సోమాలమ్మ, దేవరపల్లి కాంతమ్మ, కొల్లాబత్తుల నాగమ్మ, గూటం రూబేనమ్మ, పారకుళం శాంతమ్మ, కొంకి కృపమ్మ తదితరులు.

1925లో మిస్ స్టార్క్ మూరసానిలో స్కూలును ఏర్పాటుచేసి ఇంజేటి యోసేపుగారిని, ఆటుతరువాత యన్. హాముగారిని టీచర్లుగా నియమించారు. ప్రారంభంలో రాపాక మనోహరం, కాశి పౌలు, జాన్‌తాతయ్య తదితరులు మారుమనస్సునొందారు. మిస్ జేన్ ఎ. రోడ్స్ 1899లో ఇంగ్లండులో సేవకు సమర్పించుకుని గోదావరి ప్రాంతానికి వచ్చింది. అనులాపురం బాలికల స్కూలును ప్రారంభించినది వీరే . ఈమె 1918లో చనిపోయినప్పటినుంచి మిస్ ఎమిలీ స్టార్క్ ఈ స్కూలు నిర్వహణ బాధ్యతను చేపట్టింది. ముందు మిస్ స్టార్క్ 1952లో చనిపోయేదాకా మిస్‌హెలెన్ మన్రోతో కలిసి హవుస్‌బోటు సువార్తలో పాలుపంచుకున్నది.

మిస్ హెలెన్ మన్రో 1922లో నర్సాపురంలో తెలుగు నేర్చుకుని బెండమూర్లంకలో మిస్ మార్షల్, మిస్ మార్గరేట్, రాబర్ట్సన్ గార్లతో కలిసింది. కొంతకాలం మిస్ స్టార్క్‌కి సహాయకరంగా అనులాపురం బాలికల

స్కూల్లో టీచరుగా ఉంది. ఈమె 1960దాకా ఈ ప్రాంతంలో హవుస్ బోటులో గ్రామాలు దర్శిస్తూ సంవత్సరానికి దాదాపు వంద గ్రామాలలో పూర్తిగా సువార్తధ్వని వినిపించింది. వీరు "వాక్య పరిశోధన పత్రాన్ని" రాయబారిలో ప్రచురిస్తూ బైబిలు గ్రంథాలు బహుమతిగా ఇచ్చేవారు. అస్వస్థతకులోనై వెల్లూరులో మరణించింది. ఈమె ప్రయాణసౌకర్యాలులేని సముద్రతీర ప్రాంతాల్లో మిస్ డైసన్‌తో కలిసి పర్యటించి సేవచేసింది. మిస్ స్టార్క్ అమలాపురం స్కూలుకు రాకముందు ఆ ప్రాంతాల సువార్తీకరణలో మొదట చార్లెస్ బీరుకు, 1909లో థామస్ హీలిస్‌కు తోడ్పడింది. ఈమెతోపాటు వచ్చిన మిస్ కోరా న్యూపోర్ట్ హవుస్‌బోటు సువార్తలో 1907దాకా శ్రమించి టైఫాయిడ్‌వల్ల మరణించింది. మిస్ స్టార్క్ అమలాపురం స్కూలులో బాలికలనెందరినో క్రైస్తవులుగా మార్చింది. కాని వారిలో కొందరికి బాల్యవివాహాలు చేసి చదువు మాన్పించడం ఈమె పనికి ఆటంకంగా ఉండేది. ఆఖరు సంవత్సరాల్లో కీళ్ళవాతంవల్ల బాధపడుతూ 1952 నవంబరు 6న ప్రభువు సన్నిధికేగింది. కోరా న్యూపోర్ట్, ఎమిలీ స్టార్క్‌గార్లు నూజిలాండునుండి మన ప్రాంతానికి వచ్చిన మొదటి మిషనెరీలు.

అమలాపురంలో మక్రే దంపతుల సేవను కొనసాగించినవారు మ్యాత్యూ బ్రౌన్, వీరి సతీమణి లిల్లీ. వీరి హయాంలో అనేక సంఘాలు స్థాపించబడినాయి. వీరు 1904లో స్కాట్‌లాండ్‌నుండి వచ్చారు. అమలాపురంనుంచి వీరు 1920లో అంబాజీపేటకు మకాం మార్చారు. బ్రౌన్ సతి అక్కడ స్త్రీల ఆస్పత్రిని ప్రారంభించింది. బ్రౌన్‌గారు 1937లో కాలంచేసారు. వీరు బైబిలు బోధకునిగాను, సువార్త పనిలోను కూడా నమ్మకంగా సేవచేసారు. ఒకరోజు పోస్టాఫీసుకు వెళ్ళివచ్చి విశ్రాంతి తీసుకుని షెడ్‌లో కారు మరమ్మత్తుచేస్తూ హఠాత్తుగా ప్రభువు పిలుపునందుకుని మరణించారు.

బ్రౌన్‌గారి మరణం తరువాత వీరిసతి లిల్లీబ్రౌన్ 1939నుండి 1947దాకా సికింద్రాబాదులోని ఆర్మీ కేంపుల్లో సువార్త సేవ చేసింది. జేమ్సు స్ట్రీటులో డిస్పెన్సరీ పనిచేసింది. దీనికి ముందు నరసాపురంలో

డాక్టరు జీవరత్నంగారింట్లో అద్దెకుంటూ కుష్టురోగుల ఆస్పత్రిలో పనిచేసింది. అటుపైన మిస్ బ్లాక్‌తో కలిసి సఖినేటిపల్లిలో క్లినిక్కులను నడిపింది. వీరికి పిల్లలు లేరు.

జెస్సీ వెబ్‌గారు 1921లో ఇక్కడికి వచ్చి అమలాపురం ప్రాంతపు సంఘాలను ప్రభువులో స్థిరపర్చడానికి కృషి చేసారు. స్వల్పకాలిక బైబిలు తరగతులు నిర్వహించి సంఘస్థులను వాక్యానుభవంలో నడిపించారు. కడియంలో కూడా కొంతకాలం సేవచేసారు. వెబ్‌గారు మద్రాసు వెళ్ళి అక్కడి విశ్వాసులకుకూడా అడపాదడపా బైబిలు స్టడీలు చేసేవారు. హేండ్లీ బర్డ్‌గారు లేని సమయంలో వెబ్‌గారుగాని, జె. యం డేవిస్‌గారుగానీ అనుదిన బైబిలు స్టడీని నడిపించేవారు.1925 నుండి విలియం మోరిసన్ దంపతులు కొంతకాలం అమలాపురంలో వెబ్‌గారికి సహాయకులుగా ఉన్నారు. బ్రౌన్‌గారి మరణం తరువాత వారి సేవను మోరిసన్ దంపతులు అమలాపురంలో కొనసాగించారు. మోరిసన్ దంపతులు కొంతకాలం వెబ్ దంపతులకు సహకారులుగా ఉండి అటుపైన రాజమండ్రి వెళ్ళారు. వెబ్, మోరిసన్, కూపర్ సతీమణులు మిస్ మన్రోతో కలిసి, స్త్రీలమధ్య నమ్మకమైన సేవను జరిగించగా అనేకమంది అగ్రకులస్త్రీలు ప్రభువును విశ్వసించారు. వెబ్‌గారు1953లోచనిపోయారు.వీరి సతి ఇంగ్లండులో ఇంకాజీవించేఉన్నారు.

మిస్ అగ్రా డయాసన్ 1924లో న్యూజిలాండునుండి నర్సాపురం వచ్చి నేస్మీతు దంపతులలో ఉంటూ తెలుగు నేర్చుకుంది. కొంతకాలం మిస్ మోర్గన్‌తో కలిసి సేవచేసి అమలాపురం వచ్చి మిస్ మన్రోతో కలిసి హవుస్‌బోటు సువార్తీకరణ చేపట్టింది. వీరిద్దరి సేవ దాదాపు 20 ఏళ్ళు నిర్విఘ్నంగా కొనసాగింది. గ్రామాల్లో స్త్రీల కూటాలు ఏర్పాటు చెయ్యడం, కరపత్రాలు పంచడం, వాక్యం బోధించడం చేసేవారు. 1936లో వీరికి ఒక కారు సమకూరింది. సగటున సంవత్సరానికి 100 గ్రామాలచొప్పున వీరిద్దరూ దర్శించారు. అమలాపురం మాత్రమేకాక బెండమూర్లంక పరిసర ప్రాంతాలు కూడా దర్శించారు. 1950 సెప్టెంబరు 29న మిస్ డయాసన్ ఎఫ్.ఇ. కూపర్‌గారిని వివాహమాడారు. వెంటనే ఫిజీ ద్వీపాలకు తెలుగువారిమధ్య సేవ నిమిత్తం వెళ్ళిపోయారు.

1956లో కూపర్‌గారు మరణించగా కూపర్ సతీమణి ఇండియాకు తిరిగివచ్చి బెండమూర్లంక ప్రాంతపు సేవలో మళ్ళీ మన్రోతో వచ్చి చేరింది.

స్త్రీల బైబిలు స్కూలును కూడా వీరిద్దరూ నిర్వహించారు. వీరి సేవను రాబోయే 50 ఏళ్ళకాలం గురించి చర్చించేటప్పుడు కొనసాగిద్దాము.

అమలాపురం ప్రాంతల్లో 40 ఏళ్ళపాటు హవుస్‌బోటు సేవ చేసిన ఘనత మిస్ సిబిల్ టేలర్‌కి దక్కుతుంది.*న్యూజిలాండుకు చెందిన మిస్ టేలర్ 1924లో ఇండియాకు వచ్చి ఉర్దూ నేర్చుకుంది. 1927లో నర్సాపురంలో మిస్ ప్రింగ్‌కి తోడుగా ఆస్పత్రిలో సేవచేసి తెలుగు నేర్చుకుంది. హీలిస్‌గారి సువార్త సేవలో ఎంతో ఉపకరించిన హవుస్‌బోట్ "హార్బింగర్" మిస్ సిబిల్ టేలర్‌కి సంక్రమించింది. 1969 సం.లో తుఫాను తాకిడికి నిడదవోలు మడుగలో ధ్వంసం అయ్యేవరకూ దీనిని వాడుతూనే వున్నారు. 1931నుండి అమలాపురం ప్రాంతాల్లో హవుస్‌బోటు సేవను ప్రారంభించింది. కొందరు స్థానిక స్త్రీల సహాయంతో బోటుమీద వెళ్తూ కాలువకు దగ్గర్లోఉన్న గ్రామాలన్నీ తిరిగి వాక్యాన్ని ప్రకటించింది. 1934లో తాడేపల్లిగూడెం ప్రాంతంలో ఏ కారణంచేతనో స్థానికులకూ వీరికి బెడిసికొట్టిందట. స్థానికులు వీరిని బండబూతులు తిట్టారట. వీరు ఏమీ కోపపడి తిరుగు సమాధానం చెప్పకపోయేసరికి తరువాతి రోజున అందరూ ఇష్టంగా సువార్త విన్నారట. వీరి విషయంకూడా తరువాతి భాగంలో కొనసాగుతుంది.

ఈ ప్రాంతంలో సేవచేసిన స్థానిక భక్తుల జీవిత చరిత్రలు కొన్ని పరిశీలిద్దాము.

ఈదరపల్లికి చెందిన బూల సుబ్బయ్య దంపతులకు ఐదుగురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. బూల రెడ్డి పంతులుగారు వీరి ప్రథమ సంతానం. వీరి బాల్యంలో మక్రేగారు సుబ్బయ్యగారి కుటుంబానికి నివాసాలు ఏర్పాటుచేసారు. రెడ్డిగారు బందరులో చదువుకొని వాడపాలెంలో ఉద్యోగం చేస్తుండగా బ్రౌన్‌గారు వీరిని అమలాపురంలో సేవకునిగా నియమించారు. బోటు సువార్త చేస్తూ, అమలాపురం సంఘపెద్దగా ఉంటూ, మక్రే, నాగాబత్తుల వీరాస్వామి తదితరులతో సంతల్లో, తీర్థాల్లో సువార్త ప్రకటించేవారు. వీరు వివాహాల రిజిస్ట్రారు. 1962 డిసెంబరు 7న ప్రభువు వీరిని తన చెంతకు చేర్చుకున్నాడు. రెడ్డిగారి సతీమణి జెస్సమ్మగారు కూడా బోటు సువార్తీకరణలో పాల్గొంది. సుబ్బయ్యగారి ద్వితీయ పుత్రులు

*In His name. L. A. Marsh. GPH Society Ltd. 1974

డానియేలుగారు 1881 జూన్ 15న జన్మించారు.అమలాపురం విద్యాభ్యాసం. అమలాపురం, బెండమూర్లంకల్లో పనిచేసారు. మ్రక్కే, వీరాస్వామి, వాసా మోహానుగార్ల సేవ ఫలితంగా మారుమనస్సుపొంది 1902లో బాప్తిస్మం పుచ్చుకున్నారు. 1905లో శాంతమ్మగారిని వివాహమాడి తదనంతరం చింతపల్లి, సరిపల్లి, గంటిపెదపూడి, అమలాపురం గ్రామాల్లో పనిచేసి 1921లో సంపూర్ణంగా సువార్తసేవకు సమర్పించుకున్నారు. 50 ఏళ్ళు నిర్విరామంగా అమలాపురం సంఘానికి సేవకుడుగా, కార్యదర్శిగా ప్రభువును సేవించారు. 1968 అక్టోబరు 2న తన ప్రయాణం ముగించి పరలోక గతులయ్యారు. వీరి కుమార్తెనే గూటం జాన్ తాతయ్యగారు వివాహమాడారు.

మూడవ కుమారులు బూల సమూయేలుగారు. అమలాపురంలోనే చదువుకుని అంబాజీపేట స్కూల్లో టీచరుగా పనిచేసారు. వీరు ధవిలేశ్వరంకు చెందిన మిరియమ్మగారిని వివాహమాడారు. అమలాపురం సంఘానికి పరిచారకులుగా దీర్ఘకాలం నమ్మకమైన సేవచేసారు. ఈ వంశంలోని ఇతరుల జీవిత విశేషాలను తరువాతి భాగంలో చూద్దాము.

యేళ్ళ రెడ్డిగారు పాతాళదిబ్బకు చెందిన యేళ్ళ నర్సయ్యగారి రెండవ కుమారులు.అమలాపురం యస్. డబ్ల్యు. స్కూల్లో పనిచేస్తూ బూల రెడ్డి పంతులుగారి కుమార్తె రాజ పుష్పమ్మను వివాహమాడారు. వీరి కుమార్తె సలోమీగారిని నర్సాపురం మిషన్ హైస్కూలు హెడ్మాస్టరుగా పనిచేసిన అజరయ్యగారు (వరసకి మేనమామ) వివాహమాడారు. రెడ్డిగారు ఆ తరువాత లేసు వ్యాపారంచేస్తూ ఉద్యోగానికి స్వస్తిచెప్పి సంఘసేవలో ప్రవేశించి ఐనవిల్లిలంక తదితర గ్రామాల్లో సంఘ స్థాపనకు ప్రయాస పడ్డారు. రెడ్డిగారు 1954లో మరణించిన పిదప రాజపుష్పమ్మగారు భర్త సేవను కొనసాగించి ముక్తేశ్వరం, పడమటి పాలెంలో ప్రార్థనాలయాలు నిర్మింప జేసారు. ఈమె గొప్ప ప్రార్థనాపరురాలు. వృద్ధాప్యంలోవున్నా దివ రాత్రులు వాక్యపటనం, ప్రార్థనలో వుంటారు.

పాతాళదిబ్బకు చెందిన సరెళ్ళ లాజరుగారు అబ్రహాము శారమ్మగార్లకు 1889లో జన్మించారు. అమలాపురం చర్చి కాంపౌండులో మ్రక్కేగారితో ఉంటూ 5వ తరగతి పూర్తిచేసి, నర్సాపురంలో, అమలాపురంలోను, శిక్షణపొంది సరిపల్లి, పెదపూడి, వాడపాలెం, ధవలేశ్వరం,

జొండమూర్లంక మొదలైన గ్రామాల్లో లేబరు టీచరుగా ఉంటూ లేసు వ్యాపారంకూడా చేసారు. సంఘంలో వాక్య పరిచర్యచేస్తూ సంఘ పెద్దగ సేవచేసి 1949 జనవరి 14న తనువు చాలించారు.

గంటి. పెదపూడిలో గూటం అబ్బయ్యగారికి 1899లో గూటం జాన్ తాతయ్యగారు జన్మించారు. గంటిపెదపూడి, అమలాపురం, బందరుల్లో వీరి విద్యాభ్యాసం. అమలాపురం, పాలాళ్ళదిబ్బ గ్రామాల్లో టీచరుగా పని చేసారు. మొసలిపల్లి, బొడ్డుమెల్లిపాడు, కోడూరుపాడు, కేసనకుర్రు, వెంట్రకోసు, మినివెల్లి, గంటి పెదపూడి, వాడపాలెం, దేవరపల్లి, యేసుగు మహల్ మొదలైన గ్రామాల్లో సువార్త ప్రకటించి కొన్నిచోట్ల సంఘాలు నాటారు. బూలా దానియేలుగారి కుమార్తె రూబేనమ్మను వివాహమాడారు. వీరు రచించిన కీర్తనలు కొన్ని జి.డి.యం. కీర్తన పుస్తకంలో పొందుపరచ బడినాయి. అమలాపురం సంఘపెద్దగా పెళ్ళిళ్ళ సట్టాదారుగా చాలాకాలం సేవజేసి 1963 ఆగస్టు 20న దైవసాన్నిధ్యానికేగారు. వీరి కుమారుడు డేవిడ్‌గారు, నర్సాపురం మిషన్ హైస్కూల్లోను, ఆర్.జి. జర్మన్‌గారితో కొంతకాలము, సి.ఎల్. ఎస్‌లోను పనిచేశారు. నరర్డ్ విజన్ మద్రాసులో ప్రస్తుతం పనిచేస్తున్నారు. 1959లో జరిగిన మొట్టమొదటి జి.డి.యం. మహాసభ నిర్వహణకు కె.శే. జోసెఫ్‌గారికి వీరు చేదోడువాదోడుగా పనిచేశారు. జాన్ తాతయ్యగారు 'రాయబారి' పత్రికకు సంపాదకులుగాకూడా పనిచేశారు.

దేవరపల్లి సోమన్నగారు 1894 సెప్టెంబరు 11న అమలాపురంలో జన్మించారు. అక్కడే చదువుకుని అదే స్కూలుకు హెడ్మాస్టారుగా పని చేశారు. అటుపైన టీచరు వృత్తి మాని లేసు వ్యాపారంచేస్తూ సంఘపెద్ద గాను సెక్రటరీగాను పనిచేసారు. అమలాపురం మునిసిపాలిటీకి మొట్టమొదటి కౌన్సిలర్‌గా వీరు ఎన్నికై ప్రజాసేవ చేసారు. జి.డి.యం. అసోసియేషన్ మెంబరుగా, వైస్ ప్రెసిడెంట్‌గా సంఘాం క్షేమానికి పాటుబడి 1977 సెప్టెంబరు 12న నిత్య విశ్రాంతికేగారు.

సరెళ్ళ వెంకటరత్నంగారు, కొంకి గాబ్రియేలుగారు, యేళ్ళ సాల్మన్, విక్టర్‌గార్లు, కొంకి జాన్ పీటర్, అంబటి ఆంద్రూ, కొంకి ముత్యాలు, సరెళ్ళ దేవదానం, పారకుళం సత్యనాథం, కొల్లాబత్తుల యెషయ, బూల జీవరత్నం, బూల యోహానుగార్లు ఈ ప్రాంతపు ప్రముఖులు. వీరిలో కొందరి జీవిత చరిత్రలను అధునికులను చర్చించే సమయంలో చూద్దాము.

# 15

# ధవిళేశ్వరం

గోదావరి డెల్టా క్రైస్తవ చరిత్రలో ధవిలేశ్వరానికి ప్రత్యేకమైన స్థానం ఉంది. ఎందుకంటే బౌడెన్ బీరులు ఈ చుట్టు ప్రక్కల జిల్లాల్లో ప్రతి ఒక్కరికీ తిరిగి సువార్త చెప్పలేకపోయినా, దాదాపుగా ప్రతి గడపకూ వెళ్ళి లెక్కావారీగా సువార్తనందించినంత కట్టుదిట్టంగా ఈ ప్రాంతపు ప్రజలందరికీ క్రీస్తురాజ్య శుభవార్త అందింది. అందరికీ కాకపోయినా దాదాపు 80 శాతం ప్రజలైన పేదలకు,కూలీవారికీ సంపూర్ణంగా సువార్త సందేశం వినిపించబడింది. ఇదంతా జరిగింది ధవిలేశ్వరంలోనే. ప్రజలు తమంతట తామే వచ్చి ఈ ఊళ్ళో సువార్త విన్నారు. ఇదంతా ధవిలేశ్వరం ఆనకట్ట నిర్మాణంవల్ల సాధ్యపడింది.కాటన్‌గారికి గోదావరి ఆనకట్ట కట్టాలన్న తలంపు రావడం, ప్రభుత్వంవారు మంజూరు చెయ్యడం, ప్రతి గ్రామంనుండి ఒక పదిమంది చొప్పున బృందాలుగా పనివారు ధవిలేశ్వరం వచ్చి నెల రోజులపాటు పనిచేసి తిరిగి తమ ఊరికి వెళ్ళిపోగా, ఆ ఊరినుండి మరొక బృందం వీరి స్థానే రావడం. వీరందరికీ క్రమ పద్ధతిలో సువార్తనందించడానికి దేవుడు బౌడెన్ బీరులను పంపడం, వీరికి కాటన్, హేగ్‌గార్ల అండదండలుండడం ఇదంతా దేవుని అనాది సంకల్పంచొప్పున కలిసివచ్చిన సంభవమే.

ధవిలేశ్వరంలో ప్రభుత్వంవారిచ్చిన స్థలంలో 1948లో బౌడెన్ ఒక మీటింగుశాల కట్టించారు. చాలామంది నిమ్నకులస్థులు ఈ మీటింగులకు హాజరయ్యేవారు. ఇద్దరు మాలలు బాప్తిస్మంకోసం అడిగారు. అయితే వీరి మార్పు నిజమైనదా కాదా అని బౌడెన్ పరీక్షిస్తున్న కాలంలో కలరావల్ల వీరిలో ఒక వ్యక్తి చనిపోయాడు. అయితే చనిపోయేముందు తన విశ్వాసాన్ని ప్రకటించి తనను క్రైస్తవునిగా భూస్థాపన చెయ్యవలసిందని చెప్పి చనిపోయాడు. రెండవ అతని భార్యకూడా కలరావల్లనే చనిపోయింది.

మొత్తంమీద కలరా చావులు ఈ రెండే. అందువల్ల విగ్రహారాధనను మానుకుని కొత్తమతం పుచ్చుకున్నందువల్లనే ఇలా అయిందని అంతా అన్నారు అయితే ఈ రెండు కుటుంబాలు తమ విశ్వాసంలో స్థిరంగా ఉన్నారు.

ఈ కుటుంబాలు క్రీస్తు కృపలో అభివృద్ధిచెంది కొంతమందిని క్రీస్తుకోసం సంపాదించారు. 1853లో వీరంతా ఒకరొకరుగా పాలకొల్లు వచ్చారు. అటుతరువాత సక్కా థామస్ చేసిన సువార్త సేవా ధ్వనులు ఈ ప్రాంతమంతా మార్మ్రోగాయి.

ఆనకట కడుతున్న సమయంలో క్రైస్తవ శుభవార్త కూలీలందరిలోనూ గొప్ప ప్రభావాన్ని చూపింది. ప్రత్యక్షంగా 2 కుటుంబాలు తప్ప ఎవరూ క్రైస్తవులుగా మారకపోయినప్పటికీ, అందరి • హృదయాల్లోను వాక్యం విత్తనాలు పడినాయి. నీటిమీదవేసిన ఆహారం వదిలేకదా. చాలా రోజులకి అది తిరిగి కనిపిస్తుంది. .

ఆనకట్ట నిర్మాణం సమయంలో ఒక హిందూ ఉత్సవ సమయంలో రథం ఊరేగింపు జరుగుతూవుంది. చాలామంది కూలీలు భజనలు చేసుకుంటు ధవిలేశ్వరం వీధుల్లో రథంవెంట వెళ్తున్నారు. బ్రహ్మాండమైన ఎనిమిది కొయ్య చక్రాలు, ఒకదానిమీద ఒకటి చొప్పున ఆరు వేదికలుండి పై వేదిక మీద ఆరు చేతులు, క్రోధంతో ఎర్రబడిన కళ్ళు, ఎర్రటి నోరులో దేవతా విగ్రహం. విగ్రహంపైగ రంగురంగుల తెరలతో అలంకరించబడిన ఎత్తయిన గోపురంలాటి పైకప్పు. చుట్టూ వ్రేలాడుతున్న గంటలు. ఇది రథం స్వరూపం. దీని చుట్టూ శివమెత్తినట్టు నాట్యాలుచేస్తూ కేకలు, పెడబొబ్బలు పెడుతున్న జనసందోహం. కాటన్‌గారి కూతురు లేడీహోప్ తన చిన్నతనంలో జరిగిన సంఘటనలను రాస్తూ ఈ విషయాన్ని వివరించింది. ఆ చిన్నపాప కిటికీలోనుంచి రథం ఊరేగింపునుచూసి భయంతో పరిగెత్తు కుంటూవెళ్ళి తన మంచం క్రింద దాక్కుందట

కెప్టెన్ హేగ్ అంతకుక్రితమే క్రీస్తుకు తన జీవితాన్ని సమర్పించాడు. కాటన్‌గారింట్లో బైబిల్ స్టడీలో పాల్గొని చేతిలో క్రొత్త నిబంధనతో ఆనకట్టప్రాంతంలోఉన్న తన నివాసానికి తిరిగి వెళ్తున్నాడు. ఆనకట్టకూలీలతో నిండిన ఆ రథం ఊరేగింపు అతనికి ఎదురైంది. కటిక చీకటి హృదయాలతో

ఒళ్ళు తెలియకుండా ఉన్న ఆ జనసందోహాన్నిచూసి తనను తాను నిగ్రహించుకోలేకపోయాడు. రథానికడ్డంగా నిలబడి బైబిలును పైకెత్తి పట్టుకుని "ఇది ఎల్లదొరల దేవుని వాక్యం కాదు. ఈ దేవుడు ప్రపంచానికంతటికీ సృష్టికర్త. నిజమైన ఈ దేవుడు ఈ వాక్యంద్వారా మీతో మాటాడుతాడు. ఆయన మిమ్మల్ని ప్రేమిస్తున్నాడు. ఇలాటి అర్థం పర్థంలేని ఆచారాల్లో మీరు కొట్టుమిట్టాడడం ఆయనకిష్టంలేదు. యేసుక్రీస్తులో నమ్మకముంచి రక్షణ పొందండి. ఇదిగో లోకపాపములను మోసికొనుపోవు దేవుని గొర్రెపిల్ల" అంటూ అరిచాడు. రథంలో కూర్చున్న పూజారులు బిత్తరపోయి చూస్తున్నవారు కోలుకొని "వీడినోరు నొక్కెయ్యండి! ఎత్తి నదిలో పారెయ్యండి మన దేవుణ్ణి వీడు దుర్భాషలాడుతున్నాడు!" అంటూ కేకలు పెట్టారు. వెంటనే కూలీలంతా ముక్తకంఠంతో "పిల్లేడు ఈయన మంచివాడు. మాకు రావలసిన కూలి డబ్బంతా అణా పైసలతోసహా ఎప్పటికప్పుడు ఇచ్చేస్తూ ఉంటాడు. నిజాయితీపరుడు. ఈయన చెప్పే మాటలన్నీ యథార్థం, వింటాము" అన్నారు. నలుగురైదుగురు హేగ్‌ని ఒడిసి పట్టుకుని ఎత్తి రథంమీద నిలబెట్టారు. తనకు వచ్చిన తెలుగు మాటలన్నిటినీ కూడగట్టుకుని స్పష్టంగా రక్షణ సందేశాన్ని ఆ గుంపుకు వినిపించి క్రిందికిదూకి తన నివాసానికి వెళ్ళిపోయాడు. చాలామంది ఆ ఊరేగింపునుండి ఇంటికి వెళ్ళిపోయారు.

ఇంత విజయవంతంగా ధవిళేశ్వరంలో సేవ జరిగింది. అయితే చాలాకాలం మిషనెరీలు ఎవరూ అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకోలేదు. ఇంతకు క్రితం చెప్పినట్టు వాలెట్, హెయిన్ మొదలైన సి.యం.ఎస్.కు, లూథరన్ మిషన్‌కు చెందినవారు, రాజమండ్రికి వచ్చారు. 1897, 1892 సంవత్సరాల్లో వచ్చిన రాబర్టు రాసన్ దంపతులు ధవిళేశ్వరంలో స్థిరపడ్డారు. వీరు ఇక్కడ వడ్రంగం నేర్పించే సెంటరు ఒకటి తెరిచి చాలామంది క్రైస్తవ యువకులకు వడ్రంగం నేర్పించారు. చుట్టుప్రక్కల గ్రామాలు తిరిగి సువార్తసేవ చేసారు. వీరిద్దరూ 1901లో ఫిజీ ద్వీపాలకు వెళ్ళిపోయిన తరువాత ఇ.సి.ఆడమ్సు దంపతులు ఈ వడ్రంగం స్కూలును చూసుకుంటూ ఇక్కడ కొంతకాలంఉండి ఆటుతరువాత చాగల్లు వెళ్ళిపోయారు. ఈ కాలంలోనే [illegible] దంపతులు ధవిళేశ్వరంలో కొంతకాలముండి తరువాత

ప్రత్తిపాడులో స్థిరపడి ఈ ప్రాంతపు సంఘాల బాధ్యత వహించి సర్వతోముఖాభివృద్ధికి పాటుపడ్డారు. వీరుగాక న్యూజిలాండుకు చెందిన కెవిన్ ఆస్‌బోర్న్ 1948లో ధవిళేశ్వరంలో స్థిరపడి స్కూళ్ళ నిర్వహణ, గ్రామాలవెంట సువార్త ప్రకటనలో ప్రయాసపడ్డారు.

మిస్ గ్రీబీ 1906 చెట్టిపేటకువచ్చి తెలుగు నేర్చుకుంది. ధవిళేశ్వరం నుండి ఆడమ్సు దంపతులు చాగల్లు వెళ్ళిపోగానే ఈమె గ్రేస్ మోరిస్‌తో కలిసి ధవిళేశ్వరంవెళ్ళి అక్కడి స్కూలు భవనాన్ని మిషనరీ బంగళాగా మార్చింది. వీరిద్దరూ కలిసి చుట్టుప్రక్కల గ్రామాల్లో బోటులో పర్యటిస్తూ సువార్తను ప్రకటించారు. మిస్ మోరిస్ 1924లో వచ్చింది. వీరిద్దరూ ధవిళేశ్వరంలో స్త్రీలకు బైబిలు తరగతులుకూడా నిర్వహించేవారు. 1929లో కొంతకాలం బైబిలు స్కూలు నడిపారు. ఈ ప్రాంతపు స్కూళ్ళన్నిటినీ అజమాయిషి చేసేవారు. మిస్ గ్రీబీ టి.బి.వల్ల ఇంగ్లండు వెళ్ళిపోయి మళ్ళీ 1949లో తిరిగి వచ్చింది. ఇద్దరూ రిటైరై బెంగుళూరు వెళ్ళిపోయారు. 1960లో మిస్ గ్రీబీ చనిపోగా మిస్ మోరిస్ స్వదేశం వెళ్ళిపోయింది.

ఆదినాల్లో ఈ ప్రాంతం మిషనరీ సేవద్వారా ప్రారంభమైన సంఘాలు ప్రత్తిపాడు, అత్తిలి.

నర్సాపురంనుండి 1873లో బౌడెన్‌గారువచ్చి ప్రత్తిపాడులో వాక్యం ప్రకటిస్తూఉంటే కొడమంచిలి వీరాస్వామిగారు, తదుపరి గెడ్డం సుబ్బయ్య పేరి కుమారులు చిన గెరటయ్య, పెదగెరటయ్యగార్లు రక్షణ వెలుగులోకి వచ్చారు. వీరితో ప్రత్తిపాడు సంఘం ఏర్పడింది. అలానే 1883లో జాన్‌బీరు, ఇ.ఎస్. బౌడెన్‌గార్ల వాక్యపరిచర్యవల్ల అతిలిలో విశ్వాసులు బయలుదేరి డిసెంబరు నెలలో గెడ్డం బుల్లియ్య, అచ్చియ్య, తాతయ్య, నల్లయ్య, స్వామిగార్లు బాప్తిస్మం పొందారు.

ప్రత్తిపాడులో ఇ.ఎస్. బౌడెన్‌గారు తాటాకులతో ప్రార్థనశాలను కట్టించారు. 1900వరకు ఈ ప్రాంతపు సంఘాల బాధ్యతను వీరే వహించారు. 1901లో రాబర్ట్ జె. బయింట్‌గారు ప్రత్తిపాడువచ్చి ఈ బాధ్యతను స్వీకరించారు. వీరు 33 ఏళ్ళు తన సేవాకాలమంతటిలో ఈ ప్రాంతాల్లోనే పనిచేసారు. వీరికాలంలో చెట్టే బ్రహ్మయ్య, దుద్దే

సులాఖి, రాచర్ల వెంటయ్య, మాతంగి జీవరత్నం, మల్లిపూడి పౌలీసుగారు బ్రయంట్‌గారికి సువార్తీకరణలో సహాయపడ్డారు. బ్రయంట్‌గారు ప్రత్తిపాడులో ఒక లివాడీం కార్ఖానా ఆరంభించి అనేకమందికి శిక్షణ నిప్పించడమేకాక చాలా మందికి ఉపాధి సౌకర్యాలు కలిగించారు.

దుద్దే ధర్మయ్య, దుర్గమ్మలకు 1895 నవంబరు 17న దుద్దే మలాకీగారు జన్మించారు. పాలకొల్లు మంద నాగన్నగారి భార్యకూడా ధర్మయ్య, దుర్గమ్మగార్ల కూతురే. దుర్గమ్మగారు మిస్ లిన్‌తో కలిసి వాక్యోపదేశకురాలుగాను, ధర్మయ్యగారు బౌడెన్‌గారి బోటు సరంగుగాను ఉండే వారు. మలాకీగారు పాలకొల్లు క్రిష్టియన్‌పేట, తణుకు స్కూళ్ళలో పనిచేసి, నర్సాపురం మిషన్ ఆసుపత్రిలోను, ప్రత్తిపాడులో ద్వైపసేవకుడుగాను నియమించబడ్డారు. ప్రత్తిపాడులోని బ్రయంట్‌గారి లివాసీల ఫ్యాక్టరీలో టీచరుగా వీరు పనిచేసారు. 1934, 35ల్లో జగన్నాథపురం, వెంటపాడు గ్రామాల్లో సేవను జరిగించారు. అత్తిలి, తేతలి, ప్రత్తిపాడు, వల్లూరిపల్లి మొదలైన గ్రామాల్లో సేవచేసి అనేకమందికి బాప్తిస్మమిచ్చేవారు. కొంద్రుపోలు, పుల్లాయిగూడెం, కడియెద్ద, నారాయణపురం, పెదతాడిపల్లి మొదలైన గ్రామాల్లో సంఘాలు స్థాపించారు. మలాకీగారు అనేక క్రైస్తవ భక్తిగీతాలు రచించారు. గడియారాలు, మిషన్లు బాగుచెయ్యడం, డ్రైవింగు, ఫిడేలు వాయించడం తదితర విషయాల్లో బహుముఖ ప్రజ్ఞశాలి. వీరు ఇంగ్లీషులోకూడా ప్రసంగాలు చెయ్యడం, తెలుగులోకి అనువదించడం మొదలైనవి చేసేవారు. చివరికి 1961 డిసెంబరు 26న తాడేపల్లి గూడెంలోని తన స్వగృహంలో ప్రభువుసన్నిధికేగారు.

వీరి సతీమణి తణుకు సిరా రామయ్య, గంగమ్మగార్ల కుమార్తె. పేదలకు, కష్టాల్లో ఉన్నవారికి ఆదరంగా సహాయం చేసేది. ప్రార్థనా జీవితంలో ముందంజవేస్తూ ఇంటికి వచ్చినవారందరికీ ప్రభువునుగూర్చి సాక్ష్యమిస్తూ ఉండేది. ఈమె 1979 జూన్ 12న తేదీన తాడేపల్లి గూడెంలో నిత్యవిశ్రాంతికోసం వెళ్ళిపోయింది. వీరి కుమారుడు ప్రెయిజ్ గారు విజయవాడలో ఉంటున్నారు. కుమార్తె బ్యూలా తాడేపల్లిగూడెంలోని జి.డి.యం. సంఘ కార్యక్రమాల్లో శ్రద్ధకలిగివున్నారు.

అత్తిలి గ్రామంలో 1883లో సంఘం ఏర్పడినప్పటికీ 1837నుండే క్రైస్తవ విశ్వాసి ఒకరు స్థిరపడ్డారు.* నెల్లూరు ప్రాంతంలో తాతరాజనే క్షత్రియ యువకుడొకాయన సి.యం.ఎస్. మిషనెరీల దగ్గర సువార్త విని వారి దగ్గర ఒక క్రొత్తనిబంధన గ్రంథాన్ని తీసుకుని చదువుకుంటూ ప్రార్థిస్తూ ఉండేవాడు. ఇతని ధోరణి చూసి తల్లిదండ్రులు వెళ్ళగొట్టగా ఒంగోలు వచ్చి మేనమామలఇంట్లో ఉన్నాడు. అక్కడకూడా ఎంతోకాలం ఆశ్రయం దొరకలేదు. అక్కడినుంచి గ్రామగ్రామాలా సంచరిస్తూ ఏదోవిధంగా పొట్టపోసుకుంటూ 1836లో అత్తిలి చేరుకున్నాడు. అక్కడ స్థిరపడి చర్మకారుల కన్యను వివాహమాడారు. అప్పటికి ఆ గ్రామంలో వీరొక్కరే క్రైస్తవుడు. 1850నాటికి ఏడుగురు కుమారులు పుట్టారు. వీరిలో పెద్దకుమారులు బుల్లియ్య, అచ్చియ్యలు ప్రభువును విశ్వసించారు. 1865లో బుల్లియ్యకు కొడుకు పుట్టగా అతనికి తాతయ్య అని పేరు పెట్టారు. తాతరాజు కనిష్ఠ పుత్రులు ముగ్గురూ తండ్రితో కలహించి జగన్నాథపురం వెళ్ళిపోయి తమ క్షత్రియ కుల సంప్రదాయంప్రకారం మనుగడ సాగించారు. 1880లో తాతరాజు కాలధర్మం చెందారు. కాగా 1883లో గెడ్డం బుల్లియ్య, కొడుకు తాతయ్య, అచ్చియ్య, నల్లయ్య ప్రభృతులు జాన్‌బీరు, ఇ.ఎస్. బౌడెన్‌లచేత బాప్తిస్మం పొందారు. తాతయ్యగారు గెడ్డం విలియమ్స్‌గారి తండ్రి. ప్రత్తిపాడు ప్రాంతంలో టీచరుగా, వివాహపట్టాదారుగా సేవచేసిన గెడ్డం దానియేలుగారి తండ్రే నల్లయ్యగారు. అప్పటికే తాతయ్యగారు చదువు నేర్చుకుని ఉండడంతో సంఘంలో క్రొత్తనిబంధన చదివి వినిపిస్తూ ఉండేవారు. బౌడెన్‌గారు ఈ సంఘానికి పరిచర్య నిమిత్తం గళ్ళా చంద్రయ్య, లాజరు గార్లను పంపిస్తూ ఉండేవారు. నర్సాపురం నుండి వాసా యోహాను, అరవల్లినుండి కన్నిపాముల హానోకుగారుకూడా వచ్చి ఆదివారం ఆరాధన నిర్వహిస్తూ ఉండేవారు. 1890లో బుల్లియ్యగారి భార్య లక్ష్మి, తాతయ్యగారి భార్య లక్ష్మమ్మ, చెల్లి మంగమ్మ, నల్లయ్యగారి భార్య పోలమ్మ, స్వామిగారి భార్య, అచ్చియ్యగారి భార్య సత్తెమ్మ, నల్లయ్యగారి పినతల్లి సీమమ్మ, నూకాళమ్మ, తదితరులు బౌడెన్‌గారిచే బాప్తిస్మం పొందారు. మంగమ్మ తన 15వ యేట 5వ తరగతి చదువుకుని సండేస్కూలు నడిపేది. తాతయ్యగారు రాత్రి కూటాలుపెట్టి సువార్త చెపుతుండేవారు.

*అత్తిలి జి.డి.యం. క్రైస్తవ సంఘం శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర, 1983

బ్రయాంట్‌గారి హయాంలో ఈ సంఘాలను చూడడానికి తుంపిరి లాజరు గారిని నియమించారు. వీరు తుంపిరి నూతయ్యగారి కుమారులు. లాజరుగారు నెలలో ఒక ఆదివారం అత్తిలిలోను, మిగతారోజులు మోగల్లు, అరవల్లి, కోరుకొల్లు, కొండేపాడు, ఈదూరు, కొమ్మర మొదలైన గ్రామాల్లో గడిపేవారు. తాతయ్యగారు వీరికి కుడిభుజంగా వుండేవారు. లాజరుగారి భార్య పుల్లమ్మ కూడా స్త్రీల సమాజం స్థాపించడమే గాక సండేస్కూలులో కూడా సంగమ్మకు సహాయకరంగా ఉండేది. లాజరుగారు కొద్దికాలానికే చనిపోయారు. 'ఉన్నపాటున వచ్చుచున్నాను నీ పాద సన్నిధికో రక్షకా' అనే కీర్తన మొదటి చరణం పాడి చేతులు పైకెత్తి ''ప్రభువా, నా ఆత్మను నీ సన్నిధికి చేర్చుకో'' అని పలికి ప్రాణాలు విడిచారు. వీరి తరువాత కొద్దికాలం వీరి తమ్ముడు జాన్‌గారు వీరిస్థానే నియమించబడ్డారు.

తాతయ్యగారి అక్కను దాసుళ్ళ కుముదవల్లి (లేక డి. కోడవల్లి) కంకిపాటి బలిస్వామిగారికి ఇచ్చి పెళ్ళిచేసిన పిదప తాతయ్యగారు అత్తిలి సంఘస్థులలో కలిసి ఆసక్తితో ఆ గ్రామంలో సువార్తను బోధించగా తాతయ్యగారి అక్క ఆదెమ్మ, భర్త బలిస్వామి, వీరి పుత్రుడు రత్నం, వీరి భార్య లాదియమ్మ ప్రభువులో విశ్వసించి బాప్తిస్మం పుచ్చుకున్నందు వల్ల ఈ గ్రామంలో క్రైస్తవ సంఘం వెలిసింది.

బలిస్వామిగారి కుమార్తె కాంతమ్మను పాలూరు వాస్తవ్యుడు ఉప్పాటి సీమోనుగారికి ఇచ్చారు. అక్కడ తాతయ్యగారు, నర్సాపురంనుండి వచ్చిన కంకిపాటి వోబేదుగార్లు వాక్యపరిచర్య చేసినందువల్ల ఉప్పాటి పేతురు, భార్య లాదియమ్మ, సీమోను, కాంతమ్మగార్లు ప్రభువును అంగీకరించారు.

అలానే పాలి గ్రామంలో వోబేదుగారు సువార్త ప్రకటించగా వేడంగి సీమయ్య, వీరి భార్య, వేడంగి సుబ్బయ్య, భార్య బాపనమ్మ, సురోక సుబ్బయ్య, బొజ్జమ్మ, ఆమె కుమార్తె మరియమ్మ బాప్తిస్మం పొందారు.

1920లో తుంపిరి జానుగారి శరీరబలహీనత మూలంగా వారిని వాకపల్లి సంఘానికి మాత్రం నియమించి ప్రత్తిపాడులో పనిచేస్తున్న మాతంగి జీవరత్నంగారిని అత్తిలిలో నియమించారు. అత్తిలిలో ప్రతినెల మొదటి ఆదివారం బ్రయాంట్‌గారు వచ్చి కూటాన్ని నడిపించేవారు.

జీవరత్నంగారు కొండేపాడు, కొమ్మర, పాలూరు, కోడవల్లి, కొమల్లపాలెం సంఘాలనుకూడా చూసేవారు.

రాచర్ల వెంటయ్యగారు దువ్వ సంఘాన్నీ, మల్లిపూడి పోలీసుగారు ప్రత్తిపాడు సంఘాన్నీ, చెట్టే బ్రహ్మయ్యగారు సంఘాలన్నిటినీ అజమాయిషీ చేసేలా నియమించబడ్డారు. 1920లో ఆరవల్లి, మోగల్లు, కోరుకొల్లు సంఘాలను బ్రయంట్‌గారు టిల్‌స్లీగారికి అప్పగించారు.

బ్రయంట్‌గారు అత్తిలికాలువలో, ఏలూరుకాలువలోను బోటులో బయలుదేరి ఇరుప్రక్కల సంఘాలను దర్శిస్తూ, దూరగ్రామాలను మోటారు సైకిలుమీదనో, సైకిలుమీదనోవెళ్ళి దర్శించేవారు. బ్రయంట్‌సతి స్త్రీలకు లేసు పనిని నేర్పించేవారు. మగపిల్లల బోర్డింగును నిర్వహిస్తూ పేద బిడ్డలను ఉంచుకుని పోషించేవారు. ఒకసారి అత్తిలి క్రిష్టియన్‌పేటలో కాపురమున్న వసంతాడ సుబ్బమ్మ చనిపోయింది. శ్మశానంలో గొయ్యి త్రవ్వడానికి, సమాధిపెట్టె చేయించడానికీ బంధువులు వెళ్ళారు. సంఘకాపరి తాతయ్య తదితరులు కన్నీటితో ప్రార్థన చేస్తూ ఉన్నారు. అరగంటలో సుబ్బమ్మ కళ్ళు తెరిచి దాహానికిమ్మని సైగచేసింది. అంతా ఆశ్చర్యచకితులై ప్రభువును స్తుతిస్తూ శ్మశానంవెళ్ళినవారికి, పెట్టెకోసం వెళ్ళినవారికీ తిరిగి వచ్చెయ్యమని కబురుచేసారు. ఈమె, ఈమె భర్త వెంకన్నగారు ప్రభువును విశ్వసించి బాప్తిస్మం పుచ్చుకున్నారు. కృతజ్ఞతతో ఆలయంలో పది బల్లలు చేయించి ఇచ్చారు. వీరికి ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగారు. అటుతరువాత ఈమె 40 సంవత్సరాలు జీవించింది. వీరి కుమారుడు వి. మనోహరంగారు కాకినాడ స్టేషన్ సూపర్‌వైజరుగా పనిచేస్తున్నారు. ఈ అద్భుతం జరిగిన తరువాతి కాలంలో కంకిపాటి ఆదమ్మ, ఉల్లంపరి బ్రహ్మయ్యగార్లతోసహా అనేకమంది గెడ్డం, ఏజర్ల, నార్కిమెల్లి వంశాల వారికి పాస్టరు చెట్టె బ్రహ్మయ్యగారు బాప్తిస్మాలిచ్చారు.

కన్నిపాముల హనోకుగారి మరణం తరువాత ఆరవల్లి సంఘానికి చెందిన కొమ్మర షద్రకు, జఖర్యా గార్లను అత్తిలి సంఘస్తులే సేవకులుగా నియమించారు. వీరు కొమ్మర, పాలూరు సంఘాల భారాన్ని నిర్వహిస్తూ అన్యులమధ్య సేవచేసేవారు.

శృంగవృక్షం కాపురస్తుడైన ప్రతిపాడు బసవేలుగారు అత్తిలిలో ఉన్న అత్తగారు గెడ్డం సీమమ్మగారింటికివస్తూ చుట్టుప్రక్కల ఉరదాళ్ళపాలెం పాలూరు, కె. సముద్రగట్టు మొదలైన గ్రామాల్లో సువార్తసేవ చేసేవారు. అత్తిలి సంఘకాపరి గెడ్డం తాతయ్యగారిచెల్లెలు నయోమి వీరభద్రపాడుకు చెందిన మల్లిపూడి సమూయేలుగారిని వివాహమాడింది. సమూయేలుగారు వీరభద్రపురం, రేలంగి, పెరవలి మిషన్‌స్కూలు టీచరుగా పనిచేసి 1922లో మరణించారు. పాతికేళ్ళప్రాయంలో విధవరాలైన నయోమి మిస్ లిన్‌తోను ఆటుపైన మిస్ టేలర్‌తోను కలిసి 50 ఏళ్ళ నిందారహిత మైన సేవచేసి 78వ యేట ప్రభువులో నిద్రించింది.

అత్తిలి గ్రామానికి చెందిన గెడ్డం నల్లయ్య పోలమ్మగార్ల కుమారుడు గెడ్డం దానియేలుగారు 1904 జనవరి 1న జన్మించారు. నర్సాపురంలో 6వ తరగతిదాకా చదివిన తరువాత 1920లో ప్రత్తిపాడు స్కూలు మాస్టరుగా బ్రయంట్‌గారు వీరిని నియమించారు. 1922లో రేలంగికి చెందిన మార్లపూడి రామయ్యగారి కుమార్తెను పెళ్ళిచేసుకున్నారు. 1926లో కాకినాడలో ట్రెయినింగ్ పాసై జగన్నాధపురం, నుండపాక, పెంటపాడు, సీలాద్రిపురం గ్రామాల్లో టీచరుగాఉంటూ దైవసేవ జరిగించారు.

వల్లూరిపల్లికి చెందిన బాదంపూడి వెంకయ్య అచ్చమ్మలకు జన్మించిన వీరన్న రామన్నగార్లు మంచి సేవచేసారు. 1919లో బౌడెన్‌గారి సేవవల్ల ఈ గ్రామంలో జాలాది సుబ్బయ్య, మార్లపూడి పరమయ్య, బాదంపూడి వెంకయ్యగార్ల కుటుంబాలు రక్షించబడ్డారు. బ్రయంట్‌గారు ఈ గ్రామానికి పెనుమాక ఇస్సాకుగారిని టీచరుగా పంపించారు. బాదంపూడి స్వామిగారి పశువులపాకలోనేబడి, ఆరాధన జరుగుతుండేవి. 1923లో బాదంపూడి నుండి పెనుమాక వెంకన్నగారిని ఇక్కడికి పంపారు. ఆటుతరువాత చిన్న ఆలయం, స్కూలు నిర్మించడం జరిగింది. దీన్లో కన్నిపాముల యాకోబు గారు, గళ్ళా ఏలియాగార్లు పనిచేసారు. ఈ రోజుల్లో బాదంపూడి వీరన్న గారు సంఘపెద్దగా ఉన్నారు. వీరిని పాదిరి అని పిలిచేవారు. 1929లో టీచరుగా వచ్చిన మల్లిపూడి అంద్రెయ్యగారు, వీరన్నగారు పూనుకుని 20వేల ఇటుక కాల్పించి ఆలయం నిర్మింపజేసారు. అంద్రెయ్యగారి తరువాత

డ్డం జేమ్సుగారు ఇక్కడ పనిచేసారు. వీరన్నగారు సంఘాన్ని క్రమపద్ధతిలో
పింపించేవారు. 1924లో కలవచర్లకు చెందిన మామూడూరి గొయ్యమ్మ
రిని వివాహమాడారు. 1940 అక్టోబరు 8న వీరు అకస్మాత్తుగా
రణించి ప్రభువు సన్నిధికి చేరుకున్నారు.

అంద్రెయ్యగారు 1933లో మరలా వల్లూరుపల్లికివచ్చి ఆలయం
ద్దదిచేసే పనిలో పాల్గొన్నారు. 1838లో వీరిని ఉమామహేశ్వరం
లీచేసి గెడ్డం విలియమ్స్‌గారిని ఇక్కడ వేసారు. 1939లో బాదంపూడి
సున్నగారు, కొడమంచిలి మోషేగారు స్కూలు టీచర్లుగా వచ్చారు.
సున్నగారు 1933లో నవంబరు 11న చెట్టే బ్రహ్మయ్యగారిద్వారా
ప్తిస్మం పొందారు. తాడేపల్లిగూడెం, వల్లూరుపల్లి మొదలైన గ్రామాల్లో
సరుగా దైవసేవకునిగా ప్రయాసపడ్డారు. రిటైరైన తరువాత మలాకీ
తో కలిసి సేవలో పాల్గొంటూ గోదావరి డెల్టా మిషన్ అసోషియేషన్
క్యూటివ్ మెంబరుగాను, ప్రత్తిపాడు ప్రాంతీయ సెక్రటరీగాను
ష్ఠరు. వీరి కుమార్తె అశ్వినిని సిద్ధాంతంకు చెందిన డాక్టరు మునియ్య
వివాహమాడారు. డాక్టరు మునియ్యగారు ప్రభుత్వోద్యోగి అయినా
నజనుల సేవపట్ల విశేషాసక్తులు కలవారు.

మండపాకలో 1871లోనే చదలవాడ ఫ్రాన్సిస్‌గారి సేవమూలంగా
పాటి వోబేదుగారి తాతగారైన చెదలవాడ రామయ్యగారు, భార్య
య్యమ్మలు, రక్షించబడి హిలిస్‌గారిచేత బాప్తిస్మంపొందిన విశేషాలు
కుముందే చదివాము. ఈయన హిలీస్‌గారితో తిరిగి సేవచేస్తూ
సవుకు బహుప్రయోజనకారిగా ఉన్నారు. అయితే 1873 నవంబరు
తేదీన భార్యను చేరబిలిచి "అదిగో సిలువ, ప్రభువు నన్ను పిలుస్తున్నాడు
వా నేను వస్తున్నాను" అంటూ తల దగ్గర నిలబడిఉన్న హిలిస్ సతికి
ములు చెప్పి "ప్రభువైన యేసూ నీ చేతులకు నా ఆత్మను
స్తున్నాను" అని చెప్పి 2 గంటలైన తరువాత కన్ను మూసాడు.

బాదంపూడి గ్రామానికి బౌడెన్‌గారు కొందరు సువార్తికులతో వచ్చి
ప్రకటించినప్పుడు పెనుమాక వెంకయ్య, భార్య మునమ్మ క్రైస్తవు
య్యరు. వీరి తరువాత న్రి సత్తియ్య, భార్య మాతమ్మ, గెడ్డం

నారాయుడు, భార్య సుజ్ఞానమ్మ, పెనుపాక చంద్రయ్య, భార్య సోమమ్మ జుత్తుగ బంగారయ్య, భార్య మహాలక్ష్మి, జాలాది రామయ్య, భార్య వీరమ్మ మెటుకుర్తి సుబ్బయ్య, భార్య లక్ష్మమ్మ తదితరులు రక్షణ పొందారు. వీరు గాక షేక్ పీరాషి, ఆమె భర్త, కాపు కులానికి చెందిన కోటమ్మ, ఇతర కులస్థులు సూరమ్మ, సూర్యప్రకాశరావు, సత్యవతమ్మగార్లు సంఘంలో చేరారు. 1932లో గెడ్డం పీటర్‌గారు ఈ గ్రామానికి టీచరుగావచ్చి సంఘాన్ని అభివృద్ధి చేసారు. 1934–36 కాలంలో కొడమంచిలి కృపానందం, సంపతరావు, పోసుపో భూషణంగార్లు టీచర్లుగా పనిచేసారు.

పెంటపాడు సంఘం 1925లో స్థాపించబడింది. మాతంగి దానియేలు, కూచిపూడి ఇస్సాకు, పలివెల అబ్రాహాముగార్లు పెద్దలుగా ఉన్నారు. జగన్నాథపురానికి చెందిన సిస్టర్ మంగమ్మగారు 1900 సంవత్సరంలో చెట్టిపేటవెళ్ళి చెట్టే రూతమ్మ తదితరులవల్ల ప్రభువులోకి నడిపించబడింది. వీరి జీవితాన్నిబట్టి సోదరుడు ముప్పిడి పుల్లయ్య, గెడ్డం పెద గెరటయ్యగార్లు, వీరి కుటుంబాలు రక్షణ వెలుగులోకి వచ్చారు. 1917లో బ్రయంట్‌గారు జగన్నాథపురం సంఘాన్ని స్థాపించారు. ఆదివారం వాక్యపరిచర్య రాచర్ల పెంటయ్య, గెడ్డం జేమ్సుగార్లు చేస్తుండేవారు. మంగమ్మగారి మేనల్లుడు ముప్పిడి పెదవెంకటస్వామి, ఉప్పుమట్ల నాగమ్మ, నవాబుపాలెంకు చెందిన ఉద్రాజవరపు సుబ్బయ్య గార్లు ప్రభువును విశ్వసించారు. గళ్ళా ఏలియాగారు హెడ్మాస్టరుగా ఉండగా పెదవెంకటస్వామి, గెడ్డం దానియేలుగార పరిచర్యలో సంఘం అభివృద్ధి చెందింది.

# 16

# వాడ్రేవుపల్లి, ఇతర ప్రాంతాలు

ఈ ప్రాంతాల్లో మిస్ లిన్ సేవను గురించి ఇంతకుముందే చదివాం. 1875లోనే హిలిన్ వాడ్రేవుపల్లిలో ఆవిరిగడ్డతో మిషనెరీ బంగళా, ఆలయం కట్టించారు. 1870లోనే బౌడెన్ బీరు మక్రేగార్ల సేవవల్ల కనకాయలంకలో సిర్రా సుబ్బయ్య, అచ్చయ్య, తాతయ్య సోదరులు మొట్టమొదటిగా క్రైస్తవులయ్యారు. వీరి తదనంతరం అచ్చియ్యగారిసంతానం పెదవెంకటస్వామి, మారియ్య, గురవయ్య, గెద్దాడ పెదచిట్టియ్యగార్లు బాప్తిస్మం పొందారు. అటుతరువాత సిర్రా సుబ్బయ్యగారి కుమార్తె మాణిక్యమ్మ (గెద్దాడ స్వామి). దుద్దే గంగమ్మ, (భర్త దుద్దే స్వామి) సుబ్బయ్యగారి కుమారుడు సిర్రా వెంకటయ్య, పేరమ్మ, దుద్దే మాణిక్యమ్మ మొదలైనవారుకూడా బాప్తిస్మం పొందారు. వాసా సమూయేలుగారు లంకలో టీచరుగా ఉంటూ సేవ చేసేవారు. లంక విశ్వాసులంతా 1875 దాకా అన్నాలు మూట కట్టుకుని ఆదివారపు ఆరాధనకు నర్సాపురం వచ్చేవారు. వాడ్రేవుపల్లిలో బంగళా కట్టించినప్పటినుంచి అక్కడికి ప్రార్థనలకు కూడుకోసాగారు. వాసా సమూయేలుగారి తరువాత చీలి సంసోను సవరపు రామన్న కంకిపాటి నోవహుగార్లు లంకలో టీచర్లుగా బోధకులుగా పనిచేసారు. అటుతరువాత లంకలోనే స్థలంకొని ఆలయం నిర్మించడం జరిగింది. ఇ.సి. ఆడమ్సు 1901లో వాడ్రేవుపల్లికివచ్చి సేవచేసే సమయంలో అక్కడ తొత్తరమూడి జోన్సు, కూనవరపు తిమోతి మొదలైనవారు సేవకులుగా ఉన్నారు. లంకలో ముఖ్యంగా సిర్రా, గెద్దాడ, దుద్దే ఇంటిపేర్లుగల కుటుంబాలు ప్రథమంగా ప్రభువును నమ్ముకొన్నవారు.

ఆడమ్సుగారు సువార్తపని, వైద్యసేవకూడా ఈ ప్రాంతాల్లో

చేసారు. వీరితో మిస్ క్రో హాన్‌కూడా గ్రామాదుల్లో సువార్త సేవచేసేది. ఆడమ్సుగారు 1917లో వాడ్రేవుపల్లి సంఘాన్ని విడిచి ధవిలేశ్వరం ఆటుపైన చాగల్లు వెళ్ళిపోయారు.

పెర్సీ సి. వైట్ హవుస్ 1909లో బర్మింగ్‌హోములో సేవకు సమర్పితుడై ఇ.సి. ఆడమ్సుగారికి సహాయకుడుగా వాడ్రేవుపల్లికి వచ్చారు. వీరు ఆడమ్సు సతీమణికి సోదరులు. వీరు ఇంగ్లండులో ఒక యువతిని వివాహమాడగోరి ఆమెను అడిగితే ఇండియాకు మిషనెరీగా రావడానికి నిరాకరించింది. వైట్‌హవుస్‌గారు ఇండియా వచ్చేసి పదిహేనేళ్ళ తరువాత సెలవుమీద ఇంగ్లండువెళ్ళి ఆమె ఇంకా అవివాహితగా ఉన్నందున మళ్ళీ వివాహ ప్రతిపాదన చేశారు. రెండోసారికూడా ఆమె నిరాకరించడంతో ఇండియాకు తిరిగివచ్చి చనిపోయేదాకా ఆయన మరెన్నడు స్వదేశం వెళ్ళలేదు. ఈ ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకుని వీరు తన 85వ సంవత్సరందాకా అక్కడ ప్రజలనెంతో ప్రేమించి సువార్త పరిచర్యలు, సంఘస్థాపనలో పాటుపడ్డారు. ఎక్కడికి వెళ్ళినా సైకిల్‌మీద వెళ్లేవారు. 1965లో తాటిపాకలో వైట్‌హవుస్ పరమపదించారు. కూనవరపు తిమోతిగారు వీరికి సహాయకారిగాఉంటూ వీరు ఏర్పాటుచేసిన క్లినిక్‌లో కాంపౌండరుగాకూడా పనిచేశారు. వైట్‌హవుస్‌గారు గోదావరి డెల్టా మిషన్ సంస్థలు, మిషనెరీల ఆదాయవ్యయాలను ఆడిట్‌చేసేవారు. మిషనెరీవారి కమిటీకి సెక్రటరీగా ఉన్నారు.

ఇక్కడ ఉమ్మడిగా కొంతకాలం ఆరాధనలు జరిపిన తరువాత కనకాయలంక, కడలి గ్రామాల్లో ఆలయాలు కట్టుకుని ఆ గ్రామాల విశ్వాసులు వేర్వేరుగా సమావేశంకావడం ఆరంభించారు.

వాడ్రేవుపల్లి ప్రాంతపు మొదటి విశ్వాసులు పెదకందాలపాలెంకు చెందిన సికిలే వెంకటరెడ్డి, బద్దే ఆనందంగార్లు. వాడ్రేవుపల్లిలో సికిలే వెంకటరెడ్డిగారు క్రైస్తవుడైనందుకు ఆస్తిలో భాగంలేక, ఇంకా కాపురానికి రాని భార్య, రెడ్డిగారు బాప్తిస్మం పుచ్చుకునే పక్షంలో మరెన్నటికీ కాపురానికి రాదన్న పరిస్థితుల్లోకూడా వాక్యంద్వారా బలపరచబడి కూనవరపు తిమోతి గారి ద్వారా బాప్తిస్మం పొందారు. నానిమిత్తం తల్లినైనను,తండ్రినైనను

విడిచిపెట్టకపోతే నా శిష్యుడవు కానేరవని దేవుడు వీరిని వాక్యంద్వారా హెచ్చరించడంవల్ల బాప్తిస్మం తీసుకునే నిబ్బరం వీరికి చేకూరింది. వైట్‌హవున్‌గారు వీరిని ఆదుకుని చదువు చెప్పించి తన స్వగ్రామంలోనే టీచరుగా వేయించారు. 1917లో సంపూర్ణ సేవకు సమర్పించుకున్నారు. చాలా సంవత్సరాల తరువాత తల్లిదండ్రులు, అత్తమామలుకూడా క్రైస్తవులైనారు. భార్య మంగమ్మకూడా బాప్తిస్మం పొందింది. రెడ్డిగారు మోరి, పెదకందాలపాలెం, మోరిపోడు, చింతలమోరి, శంకరగుప్తం, సఖినేటిపల్లి, కడలి, మొగలికుదురు మొదలైన గ్రామాల్లో సేవలో ప్రయాసపడ్డారు. మొత్తం 3 జిల్లాల్లోని 67 సంఘాల్లో ఈయన రక్షణ సువార్తను చాటించారు. రెడ్డిగారికి ముగ్గురు కుమారులు, ఆరుగురు కుమార్తెలు ఉన్నారు. వీరు 1979 సెప్టెంబరు 27వ తేదీన నిత్యవిశ్రాంతికేగారు. వీరి సోదరుడు సికిలే వనమురాజుగారుకూడా యోగ్యమైన సేవ చేసారు.

బద్దే ఆనందంగారు సికిలే వెంకటరెడ్డిగారు ప్రభువులోకి రావడానికి సహాయపడినవారు. ఆనందంగారి జీవితమంతా ప్రభువు నిమిత్తం కష్టాలతోనే గడిచింది. ఒక చిన్న గుడిసెలో ఉంటూ సన్యాసిలాగా తన జీవితాన్ని గడిపి తనువు చాలించాడు. వీరి జీవితం క్రీస్తుకు ఒక సజీవయాగం.

కనకాయలంకలో వైట్‌హవున్‌గారు ముందు కొంత పెట్టుబడిపెట్టి ఆలయం కోసమని స్థలం కొన్నారు. ఆరంభంలోనూ అటుతరువాతనూ సిర్రా వెంకటస్వామి, సోదరుడు సిర్రా సూరయ్య, గెద్దాడ చిట్టియ్యగారి కుమారులు దావీదు, స్వామి, దుద్దే వెంకన్న, చింద్రిపు సూరన్న గెద్దాడ సలాతియేలు మొదలైనవారు సంఘాన్ని నడిపించారు. వీరిలో సిర్రా వెంకటస్వామిగారు ప్రస్తుతం నర్సాపురం బేతనీ సంఘాధ్యక్షులు సిర్రా ఆశీర్వాదంగారి తండ్రి. అలానే గెద్దాడ సలాతియేలుగారు నర్సాపురం జి.డి.యం బైబిలు స్కూల్లో పనిచేసిన గెద్దాడ సెంబాబుగారి తండ్రి.

కనకాయలంక ప్రాంతంలో చిరస్మరణీయమైన సేవచేసిన వారిలో ప్రథముడు సిర్రా జోసెఫ్‌గారు. 1900 జూలై 1వ తేదీన లంకలో సిర్రా వెంకయ్య పేరమ్మగార్లకు జన్మించి నర్సాపురంలో హయ్యర్ గ్రేడ్ ట్రైయినింగు పాసై లంకస్కూల్లో టీచరుగా సంఘ కాపరిగా పనిచేసారు.

1921లో గెద్దాడ పెద చిట్టియ్య, నాగమ్మగార్ల కుమార్తె రత్నమ్మను వివాహమాడారు. 1925లో దివాన్ చెర్వులో, 1928లో కాపవరంలో 1931లో శృంగవృక్షంలో తిరిగి 1934లో లంకలో పనిచేశారు. వీరు 1951 సెప్టెంబరు 2న తనువు చాలించారు. వీరు ప్రస్తుతం లంక సంఘపెద్దగారైన సిర్రా జీవరత్నంగారి తండ్రి. జోసెఫ్‌గారు కాపవరంలో పనిచేస్తున్న సమయంలోనే చదలవాడ లూకా, పెరవలికి చెందిన గళ్ళా సమూయేలుగార్ల వాక్యపరిచర్యవల్ల చెల్లు రాజయ్య అనే కాపు ప్రభువు నంగీకరించారు.

ఈ గ్రామానికి చెందిన గెద్దాడ మోషేగారు, గెద్దాడ స్వామి, మాణిక్యమ్మ గార్లకు జన్మించి బ్రామ్లీగారి బోర్డింగులో విద్య నభ్యసించి కనకాయలంక చిలకంపాడు, వేలివెన్ను, మోగల్లు, వెదుళ్ళగర్వు, వీరభద్రపురం తదితర గ్రామాల్లో టీచరుగా, దైవసేవకుడుగా శ్రమించారు. చించినాడ గ్రామంలో వైట్‌హవున్‌గారి సువార్త పరిచర్యకు బూసి సుబుది గారు ప్రథమ ఫలం. వీరు ప్రస్తుతం మిషన్ హైస్కూల్లో పనిచేస్తున్న కృపానందంగారి తండ్రి. చించినాడ గ్రామం గురించి నర్సాపురం ప్రాంతపు సేవలో చదివాం.

అంతర్వేదిపాలెంలో 1873 ఫిబ్రవరి మొదటివారంలో సండేస్కూలు రెండవ వారంలో బడి స్థాపించబడినాయి. దీనిలో పాలపర్తి చార్లెస్, బుడితి రామస్వామి, సంధి లక్ష్మనరసయ్యగారు 1890 వరకు టీచర్లుగా పనిచేసారు. ఆది విశ్వాసులకు 1890 నుండి 1895 వరకు టీచరుగా దైవసేవకుడుగా పనిచేసిన మత్తి ప్రకాశంగారు దైవవాక్యాన్ని అందిస్తూ స్కూలును అభివృద్ధి చేసారు. 1890లో 8 మంది సంఘంలో చేర్చబడ్డారు. 1892లో అడ్డాలపాలెంకు చెందిన చొప్పల దేవదాసుగారు సఖినేటిపల్లి నుండి కోట యెషయాగారు తదితరులు, రామేశ్వరంనుండి పిల్లి యోహాను గారు, పిల్లి గాబ్రియేలుగారు, గొందినుండి జిల్లెళ్ళ పౌలుగారు, తదితరులు మోరునుండి గెడ్డం నతానియేలుగారు, జిల్లెళ్ళ జాను, అబ్రాహాముగార్లు మల్కిపురంనుండి గంటా పౌలుగారు, వీరంతా సంఘంలో చేర్చబడ్డారు. 1895 జనవరి మొదటివారంలో కొల్లాబత్తుల వల్లమ్మగారి కుమారుడు గంగయ్య, తమ్ముడు పాలొవె- సు, వోగూరి సుబుద్ధి దానియేలు, గంటా

సమూాయేలు, అ బ్రహాము, కొల్లాబత్తుల ప్రకాశం, కొల్లాబత్తుల పెంటయ్య సంసోనుగార్ల సోదరుడు జ్ఞానప్రకాశంగార్లకు పౌలుగారు బాప్తిస్మం ఇచ్చారు. 1895లోనే కొల్లాబత్తుల గాబ్రియేలుగారి స్థలంలో ఒక తాటాకు పాకలో ఆరాధన, పాటశాల నడుస్తూ ఉండేవి. 1905నాటికి అంతర్వేది పాలెంలో 100 మందికి పైగా విశ్వాసులున్నారు.

1903లో వచ్చిన బ్రాహ్లీగారి సహాయంతో కొబ్బరితోట కాలవ గట్టున బీరా నారి యిళ్ళ దగ్గర ప్రభుత్వస్థలాన్ని సంపాదించి పాటశాల ఆరాధన నిమిత్తం ఏర్పాటుచేశారు. 1906లో మోరి గ్రామంలో జిల్లెళ్ళవారి ఇంటిదగ్గర, సఖినేటిపల్లిలో క్రాటువారి ఇంటి దగ్గర, రామేశ్వరంలో పిల్లివారి ఇంటి దగ్గర, కేశవదాసుపాలెంలో కొల్లాబత్తులవారి ఇంటిదగ్గర అంతర్వేదిపాలెంలో బుంగ పాపమ్మగారి ఇంటిదగ్గర, మల్కిపురం గంటా మారియ్యగారి ఇంటిదగ్గర సంఘాలు స్థాపించారు.

తన 85వ యేట సుమారు 50 సంవత్సరాలు అంతర్వేదిపాలెంనుండి అమలాపురందాకా క్రీస్తుకోసం బహు నమ్మకమైన సాక్షిగా జీవించి, ఈ ప్రాంతపు విశ్వాసులందరికీ మార్గదర్శకుడైన వోగూరి పౌలుగారిని దేవుడు తన సన్నిధికి పిలుచుకున్నాడు.

1910లో ఈ సంఘ మిషనెరీలుగా ఇ.సి. ఆడమ్సు వైట్‌హవుస్, గార్లు వాడ్రేవుపల్లిలో నివాసం ఏర్పరచుకుని సేవనారంభించారు. 1915లో అంతర్వేదిపాలెం స్కూలును హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుగా మార్చి బూల యోహానుగారిని హెడ్మాస్టరుగా నియమించడం జరిగింది.

1915 నుండి 1920 దాకా కె.పి. లాజరుగారు సువార్తికునిగాను, కొల్లాబత్తుల గంగయ్య, సొలోమోను, వోగూరి సుబుద్ధి, కొల్లాబత్తుల జ్ఞానప్రకాశం, గొల్లమందల జాన్‌గార్లు పెద్దలుగా పనిచేసారు. 1920 నుండి1930దాకా కొల్లాబత్తుల జ్ఞానప్రకాశం, ప్రకాశం, గంటా సమూాయేలు, వోగూరి దానియేలు, మేడిది ఇస్సాకు, గొల్లమందల జాను గార్లు పెద్దలుగా వ్యవహరించారు. 1921లో కొల్లాబత్తుల గంగయ్యగారి ఇంటిదగ్గర 23సెంట్ల భూమిని కొని ఆలయం కట్టడానికి నిశ్చయించు కున్నారు.

1928లో ఈ ప్రాంతపు క్రైస్తవ ఉద్యమానికి బాసటగా నిలిచిన కొల్లాబత్తుల ఎల్లమ్మగారు తన 85వ యేట తన బహుమానానికై తరలి పోయింది.

400 మంది విశ్వాసులున్న ఈ సంఘంలో ఆరాధనకు మిషన్ పాఠశాల సరిపోవడంలేదు. 1500 రూపాయలు పోగుచేసి కొల్లాబత్తుల జగన్నాథంగారి ఆధ్వర్యంలో ఆలయం కట్టాలని తీర్మానం అయింది. అయితే ఉన్నస్థలం అన్నిటికీ అనువుగా లేదని కొందరు అభ్యంతరం పెట్టారు. కలహం రేగి వేర్వేరుచోట్ల రెండు గుంపులు ఆదివారం సమావేశం కావడం ప్రారంభించారు. ఇలా రెండు మూడేళ్ళు జరిగిన తరువాత 1936లో పోలో గ్రామంలో మిషనరీల సమక్షంలో ఇరుపక్షాలవారు సమావేశమై ఒక ఒప్పందానికివచ్చి కొబ్బరితోటకాలవ ప్రక్కనే 20సెంట్ల భూమి కొనుగోలుచేసి అక్కడ ఆలయం కట్టాలని నిశ్చయించారు. ఈ స్థలం ఆది క్రైస్తవుడైన కొల్లాబత్తుల సంసోనుగారిది.

* * *

## కొయ్యలగూడెం

నర్సాపురంలో బేతని ఆలయం నిర్మాణం జరిగింది. చాలామంది మిషనరీలు అక్కడ నిలిచి సేవ చేస్తున్నారు. స్థానికులు సువార్త ప్రకటనలో సంఘ పరిపాలనలోను నిపుణులైనారు. సమర్థవంతులైన మిషనరీలు క్రొత్తగా వచ్చి చేరుతున్నారు. ఈ సమయంలో దేవుడు బ్రాష్లీగారిని కొయ్యలగూడెం ప్రాంతానికి సాక్షిగా పంపాలని సంకల్పించాడు.

పశ్చిమ గోదావరి జిల్లా రెడ్డి పోలవరం ప్రాంతానికి చెందిన ఏజన్సీ ప్రాంతంలో కొయ్యలగూడెం ఉన్నది. రెడ్డిసీమ కోయ ప్రాంతాలకు సువార్త అందించాలంటే కోయలగూడెం అనువైన ప్రదేశం. బ్రాష్లీగారు ఈ ప్రాంతాలన్నీ ముందుగా పర్యటించి కోయల గూడెంను స్థావరంగా ఏర్పరచుకోవాలన్న నిర్ణయానికి వచ్చారు.

ఇది మన్య ప్రాంతం. చెరువుల ఆధారంగా కొద్దిగా వరి పండేది. తక్కినవన్నీ మెట్ట పంటలే. అప్పటికీ, ఇప్పటికీ పేదలకు కూలీకూడా దొరకని పరిస్థితి. కరువు కాటకాలకు ఆలవాలమైన ప్రదేశం. ఇది ప్రత్యేకించి మలేరియా వ్యాధికి ఉనికిపట్టు. ఈ ప్రాంతాలకువెళ్ళి ఒకసారంటూ మలేరియా వ్యాధికి గురైన వారికి దాని మూలంగా చనిపోవడంతప్ప మరో విధమైన సంరక్షణ లేదు. మందులు దొరికేవి కాదు. కొంతకాలం తరువాత పోస్టాఫీసులో 'క్వినైన్' అమ్మేవారట.

ఈ ప్రాంతాల్లో ఇంతకుముందే హిలిస్‌గారివల్ల సువార్త ధ్వని వినిపించింది. అయితే దీని ఫలితంగా ఎవరూ క్రైస్తవులైన వైనం తెలియ రాలేదు. 1912 నుంచి మిస్ ఎమిలీ స్టార్క్ ఈ ప్రాంతాలను దర్శిస్తూ పత్రికలు పంచిపెడుతూ సువార్తను ప్రకటించింది. నర్సాపురంలో బయలుదేరి చెట్టిపేటకు పడవలోవచ్చి అక్కడినుండి ఎడ్లబండిమీద సత్తుపల్లిదాకా వాడవాడలా సువార్తను ప్రకటించింది. దారి ప్రక్కనే భోజనాలుచేస్తూ, రాత్రివేళల్లో ఆరుబయటనే అందరూకలిసి నిద్రపోయే వారు.* బుధవారం కన్నాపురం సంతలో ఆయాకాలాల్లో దైవసేవకులు కరపత్రాలు పంచిపెట్టేవారట.

1928లో బ్రామ్లీగారు కొయ్యలగూడెం తరలివచ్చి సుమారు 5 ఎకరాల స్థలంకొని తాటాకుల కప్పుతో ఒక ఇల్లు కట్టించి అందులో నివాసమున్నారు. చెట్టే ఎలీషా, బొల్లిపో గంగయ్యగార్లు చెట్టిపేటనుండి వచ్చి ఇంటిపనిలోను, తీరిక సమయాల్లో సువార్త సేవలోను సహాయం చేసేవారు. ఈ ఇంట్లో ఉంటూ బ్రామ్లీగారు మూడేళ్ళకాలంలో మిషనెరీ బంగళాను కట్టించాడు. ఈ బంగళాకు హిలిస్ సెంటినరీ భవనం అని నామకరణంచేసి 1933లో మిస్ బౌడెన్ దీన్ని ప్రతిష్ఠించారు. ఇటీవల ఈ బంగళాను క్రైస్తవేతరులు కొనుక్కున్నారు.

దీని నిర్మాణంలో పనిచేసిన బొబ్బర మంగయ్య, ముప్పిడి వెంకయ్యలు భవనం కట్టించే కాలంలోనే బ్రామ్లీగారిద్వారా వాక్యం విని రక్షణ పొందారు. ఆ మేడ దగ్గర గొయ్యి తీయించి నీటితో నింపి వీరిద్దరికీ బాప్తిస్మాలు ఇచ్చారు బ్రామ్లీగారు. ఈ ప్రాంతపు సంఘానికి పునాది ఇదే. అప్పటికే ఆ

---

*Travel Dairy of Emily Starck, Courtesy Mr. B. Theodore.

సమీపాన అంకాలగూడెంలో లూథరన్ మిషన్ సంఘం ఉంది. కొయ్యల గూడెంలో ఆరంభంలో గళ్ళా యాకోబుగారు కొల్పోర్టరుగా పనిచేసారు. జొన్నలు, చోళ్ళు, గంటెలు, కొర్రలు, కొండ జొన్నలు తదితర ధాన్యాలను పుచ్చుకుని బదులుగా బైబిలు గ్రంథాలను ఇస్తుండేవారు. పోసుపో పొలీసుగారు ఈ ప్రాంతీయ సంఘకాపరిగాను, సువార్తికునిగాను పనిచేసారు. బ్రామ్లీగారు ఒక మేప్ (Map) సహాయంతో రెండెడ్లబండిమీద డొంకలు, తుప్పలు కొండలమధ్య ఉన్న చిన్నచిన్న పల్లెటూళ్ళకు తిరిగి సువార్త ప్రకటించేవారు. మైలాబత్తుల ఆనందం, వాసా ఎబినెజరు, మెఫీబోషెతు, కంకిపాటి వోబేదు గార్లను బ్రామ్లీగారు పిలిపించి ఈ ప్రాంతంలో వాక్యపరిచర్య చేయిస్తుండే వారు.

గళ్ళా యాకోబుగారు కొయ్యలగూడెం ప్రాంతంలో ఘనమైన సేవచేసి వృద్ధాప్యంలో పాలకొల్లు వెళ్ళిపోయి తనువు చాలించారు. వీరు తుంపిరి జోన్సుసిడ్నీగారి తాతగారు. పొలీసుగారుకూడా దుద్దుకూరు వెళ్ళిపోయి మృతిచెందారు. వీరిద్దరూ బ్రామ్లీగారి కాంపౌండులోఉన్న ఇంట్లో కొంతకాలమూ, ఆటుతరువాత చర్చి కాంపౌండులోనూ కాపుర మున్నారు.

మాతంగి సత్యానందంగారు బట్లరుగాను, మాతంగి యోసేపు, మాదాసి మోషేగార్లు వంటపనివారుగానూ కొంతకాలం ఉన్నారు. మోషే గారు బైబిలువాక్య వివరణలో నైపుణ్యం గలవాడు. వీరు మాదాసి ఒత్నియేలు గారి తండ్రి.

* * *

మిస్ ఎల్సీ రెవింగ్టన్ 1928 నుంచి తన సేవకాలమంతటిలోను కొయ్యలగూడెం మొదలుకుని తూర్పు కనుమల ప్రాంతమంతటిలోను బహు వ్యయప్రయాసలకోర్చి సువార్త ప్రకటించారు. బైనగూడెం, సత్తుపల్లి, కామవరపుకోట, కన్నాపురం, అశ్వారావుపేట ప్రాంతాలన్నీ తిరిగి గ్రామ గ్రామానికీ సువార్తనందించారు.

మిస్ ఎల్సీ రెవింగ్టన్ 1914–18 కాలంలో జరిగిన మొదటి ప్రపంచయుద్ధంలో మందుగుండు, ప్రేలుడు సామాగ్రి సరఫరాచేసే శాఖలో

కల్నల్ హోదాలో పనిచేసారట. వీరి సోదరులిద్దరిని ఆ యుద్ధం పొట్టన బెట్టుకుంది. తదుపరి కొంతకాలం విద్యాశాఖలో ఉన్నత అధికారిణిగాఉంటూ క్రీస్తుకు తన బ్రతుకును సమర్పించింది. మొదటగా చెట్టిపేట వచ్చి మిస్ బౌడెన్‌తో కొంతకాలముండి, చాగల్లులో ఆడమ్సుగారి ఆధ్వర్యంలో తెలుగు భాష నేర్చుకున్నది.

పెదవాడపల్లికి చెందిన గళ్ళా లాజరుగారు బౌడెన్‌గారి ప్రోత్సాహం వల్ల చెట్టిపేటకువచ్చి స్థిరపడి పెరవలి, వీరభద్రపురం గ్రామాల్లోకూడా అటుతరువాత పనిచేసారు. వీరి కుమార్తె కృపమ్మను కోడి రత్నంగారు వివాహమాడారు. ఈ కోడి కృపమ్మగారు మిస్ రెవింగ్టన్‌కు సహాయకురాలుగా ఉండేది. వీరు చేసిన హవుస్ బోటు సేవ గురించి ఇతర ప్రాంతాలలోని సేవను సమీక్షించే సమయంలో తెలుసుకుంటాము.

ఈమె ఒక పెద్ద యిల్లులాటి బండిలో ఈ ప్రాంతాలు పర్యటించేది. ఈ 'కారవాన్' వో మాదిరి గది అంత విశాలంగా ఉండేది. నాలుగు టైర్ల చక్రాలు దీనికి అమర్చారు. రెండు ఎద్దులు దీన్ని లాగేవి. దీనికి బ్రేకులుకూడా అమర్చారు. ఈ కాబిన్‌లో మంచం, టేబులు, తదితర సౌకర్యాలు అన్నీ ఉండేవి. కొయ్యలగూడెంలో బంగళా కట్టినప్పుడు బసపర్తి వీరన్నగారు వాడిన జోడెద్దుల్ని ఈ బండికి వాడారు. ఈ బృందానికి మాదాసు జీవరత్నం గారు వంటలు చేసేవారు. రెవింగ్టన్‌గారు జీలుగుమిల్లి గవర్నమెంటు బంగళాలో మకాముండి చుట్టుప్రక్కల ప్రాంతాల్లో సువార్త ప్రకటించేవారు.

మిస్ రెవింగ్టన్‌ను దేవుడు ఆ ప్రాంతపు సువార్త వ్యాప్తికి అద్భుతంగా వాడుకున్నాడు. గ్రామగ్రామానికీ సాగిపోతూ అడవి మధ్యలోనే వంట, భోజనం, నిద్ర. జీలుగుమిల్లి దాటివెళ్తే నైజాం నవాబు పరిపాలన క్రింద ఉన్న భూభాగం వస్తుంది. ఆ ప్రాంతాల్లో రెవింగ్టన్ బృందం ప్రవేశించగానే నవాబు పరివారం వీరిని అడ్డగించారు. అప్పుడు మిస్ రెవింగ్టన్ ఆ ప్రాంతపు కలెక్టరుకురాసి నైజాం నవాబు దగ్గర కూడా అనుమతిపొంది ఆ ప్రదేశాల్లో సువార్త సందేశాన్ని అందిస్తూ ముందుకు సాగింది. మిస్ రెవింగ్టన్ ధీరవనిత. ఈమె విశ్వాసం అచంచలమైనది. "మనం యేసుప్రభువు పనిమీద తిరుగుతున్నాము. ఈ అడవిలో పాములు, పులులు మొదలైన జంతువుల నుండి, అన్ని ఆపదలనుండీ మనల్ని కాపాడే బాధ్యత ఆయనదే. మనం

నిశ్చింతగా ఉండవచ్చు" అనేవట. ఈమె సువార్త సేవ చేసిన కాలమంతా కోడి కృపమ్మగారు ఈమెకు కుడి భుజంగా ఉండేవారు. ఒకసారి కృపమ్మ గారు మిస్ రెవింగ్టన్‌తో "అమ్మా, అందరూ మీరు మగవారు అనుకొంటు న్నారు" అని చెప్పిందట. అప్పటినుంచి మిస్ రెవింగ్టన్ చీరె తప్ప మరేదీ కట్టుకునేవారు కాదట. భారతీయ వస్త్రధారణను ప్రోత్సహించిన ప్రథమ ఆంగ్లవనిత ఈమె. ఈమెకి అనేకసార్లు మలేరియా వచ్చినా లెక్కచేసేది కాదు. చివరికి 1936లో మలేరియావల్ల పరిస్థితి విషమించినప్పటికీ తన స్వస్థత, ఆరోగ్యం బాధ్యత దేవునిదే అని దృఢంగా నమ్మిన మిస్ రెవింగ్టన్ మందులు వేసుకోవడానికి నిరాకరించిందట. ఆమెను చెట్టిపేట తీసుకువచ్చి అక్కడనుంచి హౌస్‌బోటులో నర్సాపురం తీసుకువచ్చారు. నర్సాపురంలో జి.డి.యం. స్త్రీల ఆస్పత్రిలో ది. 3-12-1936 తేదీన ఆమె ప్రభువులో నిద్రించింది. రెవింగ్టన్ మిసమ్మగారు చనిపోయాక కోడి కృపమ్మగారు టైలర్ మిసమ్మగారితో చాలకాలం సేవచేశారు. ఆ తర్వాత విషజ్వరంతో రాజమండ్రి స్త్రీల ఆస్పత్రిలో ప్రభువు సన్నిధానానికి వెళ్ళారు. ధవిళేశ్వరంలో వీరి భూస్థాపన జరిగింది.

బ్రాష్లీగారు దూరదృష్టితో ఆ కాలంలోనే చొప్పరామన్నగూడెం నవరవరం గ్రామాల్లో, స్కూలు, ఆలయానికి సరిపడిన స్థలం కొనుగోలు చేసి రిజిస్టరు చేయించారు. సువార్త సేవ మాత్రమేకాక బ్రామ్లీగారు రోగులకు వైద్యంచేసి మందులిస్తుండేవారు. బ్రామ్లీగారు సువార్త యాత్రలకు వెళ్ళిన సమయంలో బ్రామ్లీసతి వైద్యసేవ చేసేది. ఈ కాలంలోనే ఒక రోగిమూలంగా ఈమెకుకూడా కంటి జబ్బు (Glaucoma) సోకి తరువాతి సంవత్సరాల్లో అంధత్వానికి దారితీసింది. బ్రామ్లీగారికి తరుచు గుండెనొప్పి వస్తుండడంవల్ల 1942లో నీలగిరి కొండల్లోని కూనూరులో స్థిరపడి 1945దాకా ఈ ప్రాంతాన్ని అప్పుడప్పుడూ దర్శిస్తూ వచ్చారు. ఇలా వస్తున్న సమయంలోనే 1946లో మద్రాసులో మూత్రపిండాలు చెడిపోయినందువల్ల బ్రామ్లీగారు కన్నుమూసారు. వీరిని మద్రాసు సెంట్ థామస్ చర్చి కాంపౌండులో సమాధి చేసారు.

చివరి రోజుల్లో బ్రామ్లీగారికి అనేకరకాలైన ఆందోళనలు ఎదురై నాయి. వీరి కుమారుడు హాన్స్ బ్రిటిష్ సైనిక దళాలలో ఉంటూ రెండవ

ప్రపంచ యుద్ధంలో జపాన్‌వారు అమెరికాకు చెందిన పెర్ల్ హార్బర్‌మీద దాడిచేసిన సమయంలో ఆ హార్బరులోనే ఉన్నాడట. ఆటుతరువాత చాలా కాలం హాన్స్ జాడ తెలియరాలేదు. హాన్స్ భార్య, వారి సంతానం ఇండియా వచ్చేసి బ్రామ్లీగారితో ఉండేవారట. యుద్ధం అయిపోయిన తరువాత హాన్స్ తిరిగి తన వారిని కలుసుకోగలిగాడు.

బ్రామ్లీగారి తరువాత బ్రామ్లీ సతి మద్రాసులోనే చాలాకాలంఉండి చెట్టిపేటవచ్చి ఆడమ్సుగారితోకలిసి కొయ్యలగూడెం వచ్చింది. అప్పటికే ఈమెకు కనుదృష్టి పోయింది. బ్రామ్లీ సతి చేసిన సువార్త సేవలో గెద్దాడ బుల్లెమ్మగారు సహాయకారిగా ఉండేది.

బ్రామ్లీ సతి ఆటుతరువాత ఇంగ్లండు వెళ్ళిపోయి అల్లుడు హిచ్‌కాక్ గారి సంరక్షణక్రింద ఉంటూ తన 88వ ఏట 1969 జనవరి నెలలో కాలధర్మం చెందింది.

* * *

కొయ్యలగూడెం సంఘస్థాపన 1931లో బొబ్బర మంగయ్య ముప్పిడి వెంకయ్యగార్ల బాప్తిస్మంతో జరిగింది. ఇంతకుముందే చదువుకున్న విధంగా గళ్ళా యాకోబు, పెనుపో పౌలీసుగార్లు ఈ ప్రాంతపు సువార్తికులు. 1932లో చొప్పరామన్నగూడెంలో ఆలయం నిమిత్తం 15 సెంట్ల భూమిని బ్రామ్లీగారుకొని స్కూలు, ఆలయం, టీచరు నివాసాలను కట్టించారు.

చొప్పరామన్నగూడెం సంఘస్థాపన బొర్లిపో వీరన్నగారి కృషి ఫలితంగా జరిగింది. వీరు కొవ్వూరు తాలూకా యాదవోలు గ్రామానికి చెందిన సుబ్బారాయుడు, రామమ్మగార్లకు 1905 జన్మించిన ఏకైక పుత్రుడు. బొర్లిపో మంగమ్మగారి చెల్లెలు వీరమ్మ కుమారుడే ఈ సుబ్బారాయుడుగారు. మిస్ హైండ్‌మన్, మిస్ బ్రిడ్జర్‌గార్లు వీరన్నగారి విద్యాభ్యాసానికి ధన సహాయంచేయగా నర్సాపురంలో 3వ ఫారం వరకు చదువుకుని అడివి చిక్కాలలో టీచరుగా ఉంటూ, నర్సాపురంవెళ్ళి ట్రెయినింగు పొందారు. చాగల్లుకు చెందిన కొడమంచిలి పాటియ్య, సత్తెమ్మగార్ల కుమార్తె కృపమ్మను 1926 మే 19న వివాహమాడారు. చెట్టిపేట చాగల్లు గ్రామాల్లో టీచరుగాఉంటూ చొప్పరామన్నగూడెం లేబరు స్కూలుకు

వచ్చారు. ఇక్కడ మోరిసన్‌గారి ఆహ్వానం అందుకుని తూ.గోదావరిలోని వెంగతోడు మిషన్‌స్కూల్లో పనిచేసి తిరిగి బ్రాష్లీగారి కోరికపై 1930లో చొప్పరామన్నగూడెంలో స్కూలును స్థాపించి సువార్తసేనను చేపట్టారు. వీరి సేవాఫలితంగా బొబ్బిలి చంద్రమ్మ, మద్రి గవరమ్మ, కంకటి దారమ్మ తదితరులు రక్షించబడి సంఘంగా ఏర్పడి సండేస్కూలు ప్రారంభించారు. వీరన్నగారు కొయ్యలగూడెం ప్రాంతమంతటికీ క్రైస్తవ పెద్దగా ఉంటూ బ్రాష్లీగారికి సహకారాన్నందిస్తూ ఈ గ్రామంలో విద్యను, సువార్తనుకూడా పంచిపెడుతూ దీర్ఘకాలం సేవచేసారు.

వీరన్నగారికి ఇంగ్లీషులోకూడా ప్రవేశం ఉండేది. అంచేత మిషనెరీలకు తెలుగు భాషకూడా నేర్పేవారు. బోడిగూడెంకు చెందిన పిడిపి యాకోబు, చొప్పరామన్నగూడెం మద్దిపాటి రామన్న మొదలైన వారె నెందరినో సిఫారసు చెయ్యగా బ్రాష్లీగారు వీరిని ఆదుకుని చదివించారు. వీరన్నగారికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. పెద్ద కుమారుడు థియొడోర్‌గారు నర్సాపురం మిషన్‌హైస్కూలులోను, రెండవ కుమారుడు ప్రెయిజుగారు ఏలూరులోనూ ఉద్యోగాలు చేస్తున్నారు. వీరు ఇద్దరూ చొప్పరామన్నగూడెం సంఘక్షేమానికై పాటుపడుతున్నారు. ప్రెయిజుగారు ఏలూరు బాప్టిస్టుచర్చి అధ్యక్షునిగా పనిచేసారు. కుమార్తె జెస్సీగ్రేస్‌గారు నర్సాపురం జీవనజ్యోతిప్రెస్ డైరెక్టరు కొడమంచిలి విల్సన్ గారిని వివాహమాడి ప్రెస్ పరిచర్యలో వీరికి సాటియైన సహాయంగా ఉన్నారు. ఆఖరు కుమార్తె సలోమిగారు టీచరుగా పనిచేస్తూ శ్రీకాకుళం జిల్లాలో కాపురమున్నారు.

వీరన్నగారు బాప్తిస్మాలివ్వడం, పెళ్ళిళ్ళు చెయ్యడం తదితర సేవా కార్యాల్లో ఆసక్తిగా పనిచేసి తన 72వ యేట 1977 నవంబరు 15న నర్సాపురంలో ప్రభువులో నిద్రించారు. కొయ్యగూడెం ప్రాంతమంతటిలోను తన జీవితకాలమంతా వీరు ధన్యకరమైన సేవచేసి సంఘాల క్షేమాన్ని గురించి ప్రయాసపడ్డారు. వీరి సమాధిరాయిమీద బర్టుగారు "A true shepherd to the Koyyalagudem area, a splendid example to follow" అని వ్రాయించారు.

కోయలగూడెం సంఘ స్థాపనకు ముందే చాగల్లునుండి బొల్లినే మంగమ్మగారు యాదవోలును సందర్శిస్తూ తన సోదరి కుమారుడు సుబ్బారాయుడుగారికి ప్రభువునుగూర్చి ప్రకటించేది. తత్ఫలితంగా సుబ్బారాయుడు, వీరి తమ్ముళ్ళు రక్షణపొంది చాగల్లు, చెట్టిపేట వెళ్ళి వాక్యం వినేవారు. బ్రాహ్మీగారి మూలంగా కొయ్యలగూడెంలో సంఘం ఏర్పడినందువల్ల అటుతరువాత ప్రతి ఆదివారం వాక్యకూటానికి కొయ్యల గూడెం వస్తుండేవారు. సుబ్బారాయుడుగారుకూడా తన అక్క కోడమంచిలి సత్తెమ్మగారిలాగా చాలా నమ్మకమైన దైవసేవకుడు. తన కులవృత్తి చేసుకుంటూ తన దగ్గరికి వచ్చినవారికి సువార్త చెప్పేవారు. యాదవోలులో ప్రస్తుతం సంఘం ఉన్నది. యాదవోలు, అటుతరువాత లేచిన సంఘాల గురించి చివరిభాగంలో చదువుతాము.

# 17

# శతవార్షికోత్సవం

## 1836–1936

పాడెన్, బీర్ దంపతులు క్రీస్తు ప్రభువు రక్షణ సువార్త ప్రకటించడానికి 1836లో ఆంధ్రదేశానికి వచ్చినట్లు మనం చదువుకున్నాం. అంచేత 1936 ఏప్రిల్ 1, 2, 3, తేదీల్లో అప్పటి మిషనెరీలు మరియు గోదావరి డెల్టా సంఘాల విశ్వాసులంతా నూరేళ్ళ పండుగ అత్యంత ఆనందదాయకంగా జరుపుకున్నారు.

సభాస్థలం — నరసాపురంలో ప్రస్తుతం సబ్ కలెక్టర్ బంగళా వున్న ప్రదేశం. అప్పుడా ప్రాంతంలో భవనాలు ఏమీలేవు. సుమారు 10,000 నుండి 15,000 వరకు ప్రజలు ఆ శతవార్షికోత్సవానికి పలు సంఘాల నుండి హాజరయ్యారని తెలుస్తోంది.

ముఖ్య ఉపన్యాసకులు : శ్రీ ఎ.సి. రోజ్, ఎం.ఎస్.ఎం.రైల్వే జనరల్ మానేజరు, మద్రాసు: బాగ్స్ దొరగారు, రామాయపట్నం వీరు విదేశీయులు. రెవ. డి. ఆరోగ్యంగారు, ఆంధ్రుడు, రామాయపట్నం. అనువాదకులు మైలాబత్తుల ఆనందంగారు, సి. జోనాగార్లు.

శతాధిక వృద్ధులు పింజర్ల కోటయ్యగార్ని(నరసాపురం),చెవిటి మార్తమ్మ గార్ని (సిద్దెలగూడెం పాలకొల్లు: జి.డి.యం. సంఘాల మొదటి విశ్వాసి మార్లపూడి ఎంబేరుగారి కుమార్తె) మహాసభ వేదిక మీదికి ఆహ్వానించి సన్మానించారు.

శతవార్షిక మహాసభ జరుగుతున్న దినాల్లోనే సహో. మార్లపూడి రామయ్యగారి భార్య (మార్లపూడి ఆశీర్వాదం మాస్టారి తల్లి, రేలంగి) త్రాచుపాము కాటువల్ల చనిపోయారు. వారి భూస్థాపన నరసాపురంలోనే జరిగింది. సభాకార్యక్రమం యథావిధిగా కొనసాగింది.

ఆ సభలో మైకులు లేవు. కంచుకంఠంతో ఉపన్యాసకులు

ఉపన్యసించేవారు. రాత్రి సమావేశాలకు యిప్పటిలా కరెంటు లేదు. పెట్రోమాక్సులైట్లు వాడారు. దూరప్రాంతాలనుండి వచ్చిన వారికి భోజన సదుపాయాలుగాని, హోటల్సుగానిలేవు. అందరూ తాటియాకుల బసల్లో వుంటూ ఎవరి భోజనాలు వారు తయారుచేసుకొన్నారు.

ఆ సమావేశాల్లో అందరినీ ఆకట్టుకొన్న అంశాల్లో ఒకటి పాటల పోటీ. కీర్తన పుస్తకంలోని కీర్తనలు శృతి,లయబద్ధంగా పాడాలి. పోటీని సహో. సి. జోనాగారు, సహో.జి. జాన్ తాతయ్యగారు నిర్వహించారు. పాలకొల్లు ఎమ్మాయు సంఘం యువకులు ఈ పోటీలో గెలుపొందారు. పాటలు పాడినవారు ఫ్రాన్సిస్, ఏప్రిల్ సైమన్ ప్రభృతులు

అప్పుడు పాలకొల్లు రిజిస్ట్రార్ ఆఫీసులో హెడ్‌క్లార్క్‌గా పనిచేస్తున్న సి.బి.యం. సంఘస్థుడు విలియమ్స్‌గారు వీరికి తర్ఫీదునిచ్చి, వీరికి హార్మోనియం వాయించారు.

ఈ శతవార్షికోత్సవాన్ని పురస్కరించుకొని 'శతవార్షిక నిధి' **(Centinary Fund)** ని ప్రోగుచేశారు. ఆ నిధితోనే నరసాపురం లోని మిషన్ హైస్కూలు ప్రధానభవనం, 'బౌడెన్ బీర్ మెమోరియల్ హాల్' నిర్మించారు.

1836–1936, ఈ నూరేళ్ళకాలంలో జి.డి.యం సంఘాల్లో జరిగిన సేవను గ్రంథస్థం చేశారు. ఆంగ్లంలో '**They were men sent from God**' అనే గ్రంథాన్ని ఇ.బి. బ్రామ్లీగారు, 'శతవార్షిక జ్ఞాపకార్థ చరిత్ర' అనే పుస్తకాన్ని సి. జోనాగారు వ్రాసి ప్రచురించారు.

బ్రామ్లీగారు శతవార్షికోత్సవాల వేదికమీదనుండి ఉపన్యసించేస్తూ యిలా అన్నారు. "మన సంఘాల్లో 10,000 మంది విశ్వాసులున్నారు. ఈ పదివేలమందీ పరిశుద్ధులే." ఆ దినాల్లో జి.డి.యం. సంఘ విశ్వాసులు విశ్వాసంలోను, పవిత్రతలోను, భక్తిలోను, నీతినిజాయితీలలోను క్రైసవులు అందరికీ ఆదర్శప్రాయమయ్యారు. మన మిషనెరీలు యితర మిషనెరీల్లాగ వున్నత విద్య, ఆస్తులు అంతస్తులు యివ్వకపోయినా పైన చెప్పిన లక్షణాలే జి.డి.యం. విశ్వాసులు ఆర్జించుకొన్న ఆస్తులు. అదే వరవడి యింకా కొనసాగుతోంది. ఈ మంచి సాక్ష్యం మన సంఘాలు జారవిడుచుకోవని నమ్ముదాం.

# 1936 - 1986

# ప్రస్తుత కాలం

"...అది (వెలుగు) లోకములోనికి వచ్చుచు ప్రతి
మనుష్యుని వెలిగించుచున్నది" (యోహాను 1:9)

## ఇందులో

అధ్యాయము

# 18

# మారిన కాలం - మారుతున్న మనుషులు

మార్పును ప్రతిఘటించడం మానవనైజం. అయితే మనిషికంటే కాలం గొప్పది. నిరంతరం మారుతూ ఉండేదేకాలం. ఆ మార్పును మనుష్యులమీద మెల్లమెల్లగా ప్రసరింపజేసి మారుతున్నామని తెలియకుండా తనతోబాటు మనుష్యుల్ని మార్చేస్తుంది కాలం. అందరూ ఎల్లకాలమూ మార్పును నిరోధించి అలా ఉండలేరు. మారేకాలంతోబాటు మారనివారు సమాజంలో ఒంటరివాళ్ళుగా మొండివాళ్ళుగా మిగిలిపోతారు. కాలంమాత్రం జరిగిపోతూనే ఉంటుంది.

మనిషికంటే మానవ చరిత్ర గొప్పది. చరిత్ర దేవుని వశం. చరిత్రను తమ ఇష్ట ప్రకారం నడిపించిన మనుషులు లేకపోలేదు. ఆయా సమయాల్లో ఆయావ్యక్తుల ప్రాభవంవల్ల చరిత్ర అనేకమైన మలుపులు తిరిగింది. రెండువేల ఏళ్ళక్రితం క్రీస్తు అనే చరిత్ర పురుషుడు మానవ చరిత్రను త్రిప్పిన మలుపులాటి మహోత్తరమైన మలుపు అంతకుముందుగాని అటుతరువాతగాని, ఇకమీదట మరెన్నడుగాని రాదు. కొందరు వ్యక్తులు అంతకుముందు, అటుతరువాత చరిత్రమీద కొంతవరకు తమ ముద్ర వేశారు. కాలగమనానికీ, చరిత్రకూ తమ రంగు పులిమారు. వేదాంతపు అంచులు, తడిమిన ప్లేటోలు, మత సంస్కరణలు తెచ్చిన లూథర్‌లు, రాజ్యాలేలిన విక్టోరియాలూ, విజ్ఞాన శాస్త్రాన్ని మానవాళి కళ్యాణార్థం ఉపయోగించిన న్యూటన్‌లూ, ప్రపంచాధిపత్యంకోసం తాపత్రయపడిన నెపోలియన్లూ, హిట్లర్‌లూ ఎందరెందరో కొంత చరిత్రను సృష్టించి కాలప్రవాహంలో కొట్టుకుపోయారు. చరిత్రకు నాథుడైన యేసుక్రీస్తు

చరిత్రమాత్రం మానవాళి రక్షణాధారమై యుగాంతాలవరకు నిలిచి ఉంది, ఉంటుంది.

రవి అస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యాన్ని లొంగదీసి భారతదేశం స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్నది. ఎక్కడ చూసినా మార్పు. అంటరాని తనపు కోట బురుజులు మెల్లమెల్లగా బీటలువారాయి. ఎవరు నమ్మిన మతాన్ని వారు స్వేచ్ఛగా ఆచరించవచ్చు, ప్రకటించుకోవచ్చు. ప్రథమ క్రైస్తవుల మనవలు, ముని మనవలు ఇప్పుడున్న తరం. క్రైస్తవులుగా ఉండడంవల్ల ఇప్పుడు కులస్థులనుండి, కుటుంబికులనుండీ పీడ లేదు. ఆది క్రైస్తవులకులేని ఆత్మ గౌరవం, సంఘంలో ప్రతిష్ట, సిరిసంపదలు ఈ కాలపు క్రైస్తవులకు ఉన్నాయి. దైవవాక్యం, సంపూర్ణ బైబిలు గ్రంథం విరివిగా ఎక్కడబడితే అక్కడ లభిస్తోంది. ప్రెస్‌లద్వారా, రేడియోలద్వారా రక్షణ సందేశం అందుతున్నది.

ప్రథమ క్రైస్తవులను పెంటకుప్పలమీద,వీధి అరుగులమీదా కూర్చోబెట్టి ఆకులో అన్నం వడ్డించిన సమాజం మార్పుకు తల ఒగ్గింది.

మారుతున్న కాలంతోబాటు క్రైస్తవులుకూడా మారారు. తమ పితరులను పవిత్రజీవనాన్ని గడపడానికి సహాయంచేసి నడిపించిన ఆత్మశక్తిని ఈ అర్థశతాబ్ది క్రైస్తవులు అంతగా ఆశ్రయించలేదు. అనేక రకాలైన బోధలు, ఆలవాట్లు, ధోరణులు, గ్రూపులు, ఆవేశాలు కనిపించసాగాయి. సంఘాలసంఖ్యకూడా పెరిగింది. అయితే గతంలో సంఖ్య పెరగడానికీ ఇప్పుడు పెరగటానికి స్వల్పమైన తేడా ఒకటుంది. గతంలో ఒక గ్రామంలో క్రొత్తగా అన్యులు క్రైస్తవులైతే అక్కడ సంఘం వెలిసేది. ఇప్పుడైతే ఉన్నసంఘం రెండుగా విడిపోవడమో, లేక వేరే డినామినేషన్‌వారు ఒక ఊళ్ళో సంఘం స్థాపించి అప్పటికే ఉన్న సంఘంలోని గొర్రెలను కొన్ని ప్రలోభాలకు లోనుచేసి దొంగిలించుకుపోవడమో జరిగి సంఘాల సంఖ్య పెరిగింది. దీన్లోని మంచి చెడ్డల మాట అలా ఉంచుదాము.

అయితే 1936–1986 కాలంలోకూడా గడిచిన నూరేళ్ళ మాదిరిగానే దేవుడు కొందరు మనుషుల్ని పంపుతూనే ఉన్నాడు. ఇంగ్లండు, న్యూజిలాండు, ఆస్ట్రేలియా, స్కాట్లాండు దేశాలనుండి వచ్చినవారు

కొద్దిమంది అయితే, తాము పుట్టి పెరిగిన చోటనే, తమ ప్రజలమధ్యనే క్రీస్తు వెలుగును ప్రసరింప జెయ్యడానికి దేవుడేర్పరచుకున్న మనుష్యులు మరి కొందరు. బ్రాహ్లాగారు తన పుస్తకానికి ' **They were men sent from God** 'అని పేరు పెట్టి (వారు దేవుడు పంపిన మనుష్యులు), ఈ పేరుకు న్యాయం చేకూరేలా మరొక దేశంనుండి దేవునిచే గోదావరి ప్రాంతానికి పంపబడిన మనుష్యుల గురించి మాత్రమే ఎక్కువగా రాసి, స్థానిక విశ్వాసులు, దైవసేవకుల విషయం పెద్దగా ప్రస్తావించలేదు. ఈ అర్ధశతాబ్దికి ఈ మాట వర్తించదు.

సువార్త సేవ, సంఘాల పరిపాలన పూర్తిగా స్థానికుల చేతిలోకి వచ్చిన అర్ధశతాబ్ది ఇది. మొదటి యాభై ఏళ్ళలో సేవంతా మిషనెరీలదే. రెండవ దశలో వారూ వీరూ చెయ్యి చెయ్యి కలిపి శ్రమించారు. అయితే 3వ అర్ధశతాబ్దిలో సేవాభారం, సంఘభారం వహించడంలో స్థానికులే ముందడుగు వేసారు. సంఘ స్థాపనలోకూడా ఇలానే జరిగింది. పైగా ఈ కాలంలో వచ్చిన మిషనెరీల్లో అధికశాతం సంస్థల్లో, ముఖ్యంగా వైద్య విద్య సేవ నిమిత్తం వచ్చినవారు. ఈ విధంగా స్థానికులకై పాటుబడుతూ దేవుని మహిమార్థం తమ జీవితాలను సేవకర్పించిన మిషనెరీలు ముఖ్యంగా సంస్థలద్వారా సువార్త సేవను జరిగించారు. క్రైస్తవ సాక్ష్యాన్ని పలువురికి చాటారు.

క్రైస్తవులు విద్యాధికులై అనేకరకాలైన ఉద్యోగాల్లో స్థిరపడ్డారు. లేసు మొదలైన వాటితో వ్యాపార వేత్తలు సంపన్నులై దాతృత్వం అనే వరాన్నిపొంది పేద క్రైస్తవులను ఆదుకోవడం, సంఘ నిర్మాణాలను చేపటడం మొదలైన కార్యాలను నిర్వర్తించారు. మధ్యదశలో అడపాదడపా రంగూన్‌లో కొంతకాలం ఉండివచ్చినవారు కన్పిస్తే ఈ కాలంలో ప్రతి ఊళ్ళోనూ కుప్పలు తెప్పలుగా అరేబియన్ గల్ఫ్‌లకువెళ్ళి అనతికాలంలో లక్షాధికారులైన క్రైస్తవులు లేచారు.

మిషనెరీల ప్రాబల్యం తగ్గింది. ఇప్పటికి పది పన్నెండేళ్ళనుంచీ పురుషమిషనెరీలెవరూ గోదావరి ప్రాంతంలో లేకుండాపోయిన పరిస్థితి ఏర్పడింది. దీనికి ముఖ్యకారణం ప్రభుత్వ విధానం. క్రొత్త మిషనెరీల

రాకను ప్రభుత్వం నిషేధించడంవల్ల పదవీ విరమణ చేసిన మిషనెరీలస్థానే క్రొత్తవారు రాని కారణంచేత విదేశ మిషనెరీల సంఖ్య బాగా తగ్గిపోయింది. కాని సంఘాలలో సేవ యింకా యింకా అభివృద్ధి చెందుతూనేవుంది.

చాలా నీరు గోదావరిలో ప్రవహించి సముద్రంలో కలిసిపోయింది. అలాగే చాలాచరిత్ర కాలప్రవాహంలోకి వెళ్ళిపోయింది జి.డి.యం.సంఘాలు 1936లో శతవార్షికోత్సవాన్నిజరుపుకొన్నాయి. 1986లో 150సం॥రాలు నిండిన సందర్భంలోనే ''గొప్ప సాక్షి సమూహం'' అన్న ఈ పుస్తకాన్ని వెలువరించడం జరుగుతూ ఉంది.

మరో విషయం. ఈ అర్థశతాబ్ది చరిత్ర రాయడం మరోవిధంగా కూడా కష్టం. ఏమిటంటే ఈ అర్థశతాబ్దిలో సేవను జరిగించిన వారు, చరిత్ర పుటల్లో స్థానం సంపాదించు కున్నవారూ అధికభాగం ప్రస్తుతం జీవితులే. అంచేత వీరిని గురించి, వీరి చర్యల గురించి సవిస్తరంగా వ్రాయడం సాధ్యంకాదు.

# 19

# సేవాయంత్రాంగం

## తెలుగుకాన్ఫరెన్స్

సేవ విస్తరించినకొద్దీ మారుమూల గ్రామాల్లో విశ్వాసులు సంఘాలుగా కూడుకొంటున్నకొద్దీ ఈ సంఘాలన్నిటిమధ్య పరస్పర అవగాహన ఉమ్మడి కార్యక్రమాలు, పరిపాలనావ్యవస్థ ఒకటి అవసరమైంది. ఈ విషయంలో గోదావరి డెల్టా ప్రాంత క్రైస్తవ సంఘాలు విలక్షణమైన సంప్రదాయాన్ని కలిగి ఉన్నాయి. ఎందుకంటే ఈ ప్రాంతం లోని సంఘాలన్నిటిలోకీ అతిపెద్ద సంఘం జి.డి.యం. సంఘమే. డెల్టా ప్రాంతం అంతటిలోనూ చిన్నచిన్న గ్రామాలు మొదలు పట్టణాలదాకా జి.డి.యం. సంఘాలు అల్లుకుని ఉన్నాయి. అయితే వీటన్నిటి స్థాపనకూ మూలకారణమైన వ్యక్తులు జార్జిబీరు, విలియం బౌడెన్‌లతో మొదలై ఒకే విశ్వాసాన్నీ, విశ్వాస సూత్రాలనూ చేపట్టిన కొద్దిమంది దైవజనులే. పైగా మరొక డినామినేషన్ ఉన్నచోట జి.డి.యం సంఘం స్థాపించి ఆ సంఘంలోనుండి జి.డి.యం. సంఘంలోకి విశ్వాసులను తీసుకురావడం అన్న సంప్రదాయం ఇంతవరకు మన జి.డి.యం. చరిత్రలో ఎక్కడా లేదన్న మాట జి.డి.యం. వారికి గర్వకారణం. నూతనంగా ప్రభువును అంగీకరించిన వారితోనే మన సంఘాలు ఆరంభమయ్యాయ్. ఇదే దేవుని ఉచితకృప.

ఇది ఇలా ఉండగా ముందుగా ఒక గ్రామంలో జి.డి.యం. సంఘం నెలకొని ఉన్నప్పుడు వేరొక సంఘంవారు అక్కడ ఆలయాన్నికట్టి విశ్వాసులు కొందర్ని అటు మళ్ళించడం అనే ప్రమాదం తలెత్తింది. కాగా ప్రతి జి.డి.యం సహవాసమూ స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉన్నదైనప్పటికీ అడపా దడపా ఇతర జి.డి.యం. సంఘాలతో సహవాసం తప్పనిసరైంది. ఒక జి.డి.యం. సంఘంనుండి చుట్టుప్రక్కల జి.డి.యం సంఘాలకు బోధకులు

పెద్దల్ని వెళ్తూ ఆదివారపు వాక్యకూటాలో ప్రసంగిస్తూ సహవాసంలో పాల్గొంటూ ఉండడం ముందునుంచి ఉన్నదే. దీనికితోడు అన్ని సంఘాల పెద్దలు, పరిచారకులు కనీసం సంవత్సరానికి ఒకసారి సమావేశమై సంఘనాథుడైన ప్రభువులో సహవాసం చెయ్యాలన్న తలంపు పెద్దలకు కలిగింది.

ఆరంభంలో గోదావరి డెల్టా మిషన్ పాటశాలన్నింటినీ ఇ.బి. బ్రౌన్లీ గారు అజమాయిషి చేసేవారు. ఈ పాటశాలల్లోని ఉపాధ్యాయులందర్నీ ఏడాదికోసారి వో చోటను సమావేశ పరచి వారికి ప్రత్యేక బైబిల్ తరగతులు ఆయన నిర్వహించేవారు. ఈ సమావేశాల్నే దరిమిలా 'తెలుగు కాన్ఫరెన్స్'గా పిలిచారు.

తెలుగు కాన్ఫరెన్స్ ఆరంభాన్ని గూర్చిన ఖచ్చితమైన వివరాలు అందుబాటులోలేవు. కానీ 1900 సంవత్సరం నాటినుంచే ఈ 'తెలుగు కాన్ఫరెన్స్' తరహా కార్యక్రమాలు అమలులోవున్నాయంటున్నారు.

ఆ దినాల్లో విదేశీ మిషనెరీలు ఏడాదికోసారి 'మిషనెరీ కాన్ఫరెన్స్' జరుపుకొనేవారు. ఆ సమావేశాలు సాధారణంగా మూడు రోజులపాటు ఆయా మిషన్ స్టేషనలో జరిగేవి. గోదావరి డెల్టా ప్రాంతంలోని మిషనెరీలంతా వో చోట సమావేశమయ్యేవారు. ఆ సమావేశాల్లో వాక్యపరిచర్య చేయడానకు సర్వసాధారణంగా ప్రత్యేక ఉపన్యాసకుణ్ణి పిలిపించుకొనేవారు. సంఘాలలో జరుగుతున్న సేవా వివరణలు, సమీక్షలు, సేవలో ఎదురైన సమస్యల్ని వారు చర్చించి వాటికి పరిష్కారాల్ని కనుగొనేవారు. ఆఖరు దినాన్న 'బిజినెస్ సమావేశం' వుండేది.

ఇదే పద్ధతిలో విదేశీ మిషనెరీలు, స్థానికసంఘనాయకులు, కాపరులు కలిసి సమిష్టిగా సమావేశాల్ని జరుపుకొంటే అది సంఘ సేవాభివృద్ధికి ఎంతో తోడ్పడుతుందని సహో. సి. జోనాగారు పట్టుబట్టారు. అందుచేత 1947–50 మధ్యకాలంలో 'తెలుగు కాన్ఫరెన్స్' అవతరించింది.

మూడుదినాలు మిషనెరీవారి కాన్ఫరెన్స్ జరిగేది. ఆ వెంటనే తెలుగు కాన్ఫరెన్స్ 3దినాలు జరిగేది. 'ఈ తెలుగు కాన్ఫరెన్సుకు స్థానిక మిషనెరీల్లో ఎవరో ఒకరు అధ్యక్షుడుగా వుండాలని తీర్మానించారు.

'తెలుగు కాన్ఫరెన్స్'కు మొదటి కార్యదర్శి సహో. సి.జోనాగారు. ఉపాధ్యాయులంతా ఈ సమావేశాలకు హాజరుకావడానికి అనుకూలంగా ప్రతి ఏడూ జనవరి (సంక్రాంతి) నెలవల్లో ఈ సమావేశాల్ని ఏర్పరిచేవారు. ఇప్పటికీ యిదేవిధంగా కొనసాగుతోంది.

తెలుగు కాన్ఫరెన్స్ లక్ష్యాలు : ఏ సంఘానికి ఆ సంఘం స్వతంత్ర ప్రతిపత్తి కలిగివున్నా, గోదావరి డెల్టా మిషన్ క్రైస్తవ సంఘాలన్నీ కలిసి సహవాసం చేయడానికి, ఒకే తాత్పర్యం, సిద్ధాంతం, సత్యంలో సమిష్టిగా కొనసాగడానకు యిది వుద్దేశించబడింది.

సంఘసేవ, సమస్యలు, అక్కరలు చర్చించి సహకరించడానికి, నూతన నిబంధన సంఘసత్యాలు నొక్కిచెప్పడానికి ఈ సమావేశాలు ఉద్దేశించబడ్డాయ్. ఇది సంస్థ కాదు. దీనికి ఆస్తిపాస్తులు లేవు. ఏ సంఘం మీదా దీని అజమాయిషి వుండదు.

తెలుగు కాన్ఫరెన్స్‌కు ఆయా సమయాల్లో

అధ్యక్షులుగా : సహో. ఎ. నేస్మిత్‌గారు, సహో. డి.బి. బర్ట్‌గారు సహో. సి. జోసెఫ్‌గారు, సహో. సి.కె. థామస్‌గారు వ్యవహరించారు.

కార్యదర్శులుగా : సహో. సి. జోనాగారు, సహో. టి. దేవదానంగారు సహో. జి. జోయల్‌రాజుగారు, సహో. జి. సామ్యేలు గారు వ్యవహరించారు.

కోశాధికారిగా : సహో. వాసా పంచాక్షరిగారు వున్నారు (సహో. థామస్ గారు అధ్యక్షులుగావున్నకాలంనుండే కోశాధికారి పదవి ఆరంభమైంది. వీరు ప్రథమ కోశాధికారి.)

సహో. మైలాబత్తుల ఆనందంగారు, పత్తి యోసేపుగారు నరసాపురం ఫీల్డు జి.డి.యం. సంఘాలన్నింటిలో ఫుల్‌టైమ్ వర్కర్స్‌గా వుంటూ గొప్ప సేవ చేశారు. అలాగే చెట్టిపేట ప్రాంతానికి కూనవరపు ఆబేలుగారు, చదలవాడ లూకాగారు ఫుల్‌టైమ్ వర్కర్స్‌గా నియమితులయ్యారు. వీరందరికీ మిషన్ ఫండ్స్ నుంచి ఆర్థిక సహాయం ముట్టేది.

ఈ తెలుగు కాన్ఫరెన్స్ ఆధ్వర్యంలోనే 1961వ. సంవత్సరంలో పాపికొండలకు కోయప్రజలమధ్య సేవచేయడానికు ఇద్దరు స్వదేశీ మిషనెరీలను పంపడం జరిగింది. ఆ ఇద్దరు మిషనెరీ కుటుంబాల పోషణా భాధ్యత తెలుగు కాన్ఫరెన్స్ద్వారా జి.డి.యం. సంఘాలు స్వీకరించాయి.

జోనాగారు 1953 డిసెంబరు 31వ తేదీన మరణించిన తరువాత సి. జోసెఫ్‌గారు తెలుగు కాన్ఫరెన్స్ అధ్యక్షులుగా వ్యవహరించి దీన్ని అభివృద్ధి లోకి తీసుకువచ్చారు. ఏటేటా డిసెంబరు నెలలో అనుభవజ్ఞులైన దైవసేవ కులను పిలిపించి వాక్యోపదేశాలు చేయించేవారు. 1955లో గళ్ళా సమూయేలుగారు ఈ కమిటీ కార్యదర్శిగా నియమించబడ్డారు. 1959లో జోసెఫ్‌గారికి సుస్తీ చేసినందువల్ల వీరు గళ్ళా జోయల్‌రాజుగారిని తాత్కాలిక ప్రసిడెంటుగా నియమించారు. అదే సంవత్సరం నవంబరు 30వ జోసెఫ్‌గారు నిర్యాణంచెందగా 1961 ఏప్రిల్ 12వ తేదీన సి. జోనాగారి పెద్ద కుమారులు సి.కె. థామస్‌గారిని ఏకగ్రీవంగా ప్రసిడెంటు పదవికి ఎన్నుకున్నారు. జోసెఫ్‌గారు, థామస్‌గార్లు కోశాధికారి బాధ్యతనుకూడా నెరవేరుస్తూ ఉండేవారు.

ఇలావుండగా 1976 డిసెంబరు 27న ఈ తెలుగు కాన్ఫరెన్స్‌ను "అసోసియేషన్ ఆఫ్ గోదావరి డెల్టా మిషన్ అసెంబ్లీస్" అనే పేరుతో గవర్నమెంటు వారిదగ్గర రిజిష్టరు చేయించడం జరిగింది. ఈ అసోసి యేషన్‌కు సి. జ్ఞానప్రకాశరావుగారు అధ్యక్షునిగా కోశాధికారిగా కార్యభారం నిర్వర్తిస్తూ ఉండగా 1977 జనవరి 12 నుంచి కె.ఎస్. జాక్సన్‌గారు కోశాధికారిగా నియమించబడ్డారు. 1975లో వైస్ ప్రసిడెంటుగా వ్యవహరిస్తున్న సి. జోబ్‌గారు కాలంచేయగా జి.సి. సమూయేలుగారిని వైస్‌ప్రెసిడెంటుగా వారిస్థానే నియమించారు. 1980 జనవరి 15వ తేదీనుండి డాక్టర్ సి.ఆర్. ప్రభాకర్‌గారు కోశాధికారిగా, కె.ఎస్. జాక్సన్ గారు సహాయకోశాధికారిగా వ్యవహరించారు. బేతని సంఘంలో చీలిక వచ్చినప్పటినుంచి కె.ఎస్. జాక్సన్‌గారే కోశాధికారిగా ఈ బాధ్యత తిరిగి చేపట్టారు. 1980నాటికి ఈ అసోసియేషన్ 9 ప్రాంతాల్లోని సుమారు 300 సంఘాలు, ఆ సంఘాలకు చెందిన 15000 మంది విశ్వాసులును

150 మంది సువార్త సేవకులు కార్యనిర్వహణలో సహాయపడుతూ ఎనలేని సేవాసాధనంగా ప్రభువు మహిమార్థం నడిచింది.

దీనిని అసోసియేషన్‌గా రిజిస్టరు చేయడానకు వివిధ కారణాలు తోడయ్యాయ్. ఈ అసోసియేషన్ ముఖ్యోద్దేశాలు; కార్యకలాపాలు:

1. జి.డి.యం. సంఘములు తొమ్మిది మండలములలోని సంఘములలో ఏవైనా సమస్యలు ఉద్భవిస్తే వాటిని చర్చించి, ఒకరినొకరు అర్థం చేసుకోవడంద్వారా పరిష్కరించుకోడానకు.
2. జి.డి.యం. ఆలయములను, సంఘముల ఆస్తులను పరిరక్షించ డానకు.
3. నరసాపురం మిషన్‌హైస్కూలు పాలన కొరకు
4. సంపూర్ణకాల సువార్తసేవకులకును, సంఘాల నిర్వాహణ కొరకును విరాళములు సేకరించుటకు.
5. పేదలకు, ఆర్థికంగా వెనుకబడినవారికి సహకరించడానకు, సాంఘిక సేవ చేయుడానకు.

## మహాసభలు

తెలుగు కాన్ఫరెన్స్ ఆధ్వర్యంలో నర్సాపురం మిషన్ హైస్కూలు గ్రౌండులో 1959, 1966, 1969, సంవత్సరాల్లోనూ, ఎ.జి.డి. ఎం.ఏ ద్వారా 1976, 1980, 1983 సంవత్సరాల్లో మహాసభలు జరిగినాయి. మొదటి నాలుగు సభల్లో డాక్టర్ అక్బర్ అబ్దుల్‌హక్ గారు, 1980లో రెవ. థియొడోర్ విలియమ్సుగారు, రెవ. రవి జోసఫ్‌గారు ముఖ్య ప్రసంగికులుగా వచ్చారు.1983లో సహో. రవి విల్సన్‌గారు,సహో.జార్జిడాసన్ గారు ఉపన్యాసాలు చేసారు. గిల్బా సమూయేలుగారి ''పవర్‌హవుస్'' ప్రార్థనా బృందం గొలుసు ప్రార్థన వల్లనూ, మిషనెరీలు, నర్సాపురం తదితర సంఘాల పెద్దల చిత్త శుద్ధితోకూడిన ప్రయాసవల్లనూ ఈ మహాసభలు విజయవంతంగా జరిగినాయి. కె. విల్సన్‌గారిచే ఏర్పాటు చేయబడిన గాయక బృందం వారి సంగీత పరిచర్య ఈ మహాసభలకు వన్నెతెచ్చింది.

మొదటి నాలుగు మహాసభలకు సి. జోసెఫ్‌గారు, సి.కె. థామస్‌గారు ఒకరి తరువాత ఒకరు అధ్యక్షులుగానూ, బి. లజరయ్యగారు కార్యదర్శిగానూ నడిపించారు. 1980లో జరిగిన మహాసభకు సి. జ్ఞానప్రకాశరావుగారు అధ్యక్షులుగాను, జి. సేంబాబుగారు కార్యదర్శిగాను ఉన్నారు.

1983లో జరిగిన సభ సి. జ్ఞానప్రకాశరావుగారి అధ్యక్షతన టి.కె. జార్జిగారు సెక్రటరీగా ఉండి నడిపించగా జరిగింది. 1959 నుండి బైబిలు తరగతులు, మహాసభలు మొదలైన సమావేశాల్లో అతిథి ప్రసంగికులు ఇంగ్లీషులో వర్తమానములను అందించగా ఆయా సమయాల్లో పి. ఆనందరాజు, కె. దేవసహాయం, బి.జె. పాల్‌గారు, ఒ.యం. ప్రసాదరావు గారు, వి. సేంబాబుగారు, డాక్టర్ కె. పాల్‌విల్సన్‌గారు తదితరులు తెలుగులోకి అనువాదకులుగా సహకరించారు.

ప్రస్తుతం శతార్ధవార్షికోత్సవ సమయంలో 1986 జనవరిలో జరగనై యున్న మహాసభలకు కెనడానుండి ఏ. నేస్మిత్‌గారి పెద్దకుమారుడు జేమ్సు నేస్మిత్‌గారు, ఆస్ట్రేలియానుండి ఎస్. డబ్ల్యుచేజ్‌గారు, ఇంగ్లండునుండి మైకల్ బ్రౌన్‌గారు, స్కాట్‌లాండ్‌నుండి జిమ్ నేస్మిత్‌గారు ముఖ్య ప్రసంగికులుగాను, డాక్టర్ కె. పాల్‌విల్సన్,బి. థియొడోర్, వి. సేంబాబు ఎ. అబ్రహాముగార్లు అనువాదకులుగాను ఉండాలని నిర్ణయమైంది. మహాసభల కమిటీకి సి. జ్ఞానప్రకాశరావుగారు అధ్యక్షునిగాను, టి.కె. జార్జిగారు కార్యదర్శిగాను, సి. జేమ్సుచంద్రన్‌గారు కోశాధికారిగాను కార్యభారాన్ని చేపట్టారు.

## తీర్థాల్లో సువార్త ప్రకటన:

అంతర్వేది, కోటిపల్లి, భద్రాచలం, వాడ్రేవుపల్లి తదితర తీర్థాల ప్రస్తావన ఆయాచోట్ల ఇప్పటికే వచ్చింది.

అంతర్వేది తీర్థంలో 1838లో జార్జిబీరు, విశాఖపట్నంనుంచి వచ్చిన జె. డబ్ల్యు. గోర్డన్‌గారితో కలిసి సువార్త ప్రకటించినది మొదలు క్రమం తప్పకుండా ఈ 150 సంవత్సరాలూ తరం వెంట తరం ఈ సేవనూ కొనసాగిస్తున్నారు.

అలానే కోటిపల్లి, భద్రాచలం తదితర తీర్థాలను హిలిన్, ఆలీసాహేబు వాసా యోహాను, ఫ్రాన్సిస్ మొదలైనవారు పట్టుదలతో దర్శిస్తూ సువార్త ప్రకటించారు. ఈ విషయాలుకూడ ఇప్పటికే సవిస్తరంగా చర్చించాము. మన చరిత్ర ప్రముఖుల్లోకూడా ఎందరో ఈ తీర్థాల్లో ప్రకటించినసువార్తవిని ప్రభువును స్వీకరించినవారే.

ఈ తీర్థాల్లో సువార్త ప్రకటించడం, రక్షణ సందేశాన్నందించే కరపత్రాలను పంచిపెట్టడమన్నది ఇప్పటిమాటకాదు. స్థానికుల సహాయం లేకుండా మిషనెరీలు కొంతకాలం తీర్థాలను దర్శించారు. ఆటుతరువాత చాలాకాలం స్థానికులు, మిషనెరీలు కలిసివెళ్ళి తీర్థాల్లో బహు శక్తివంతంగా యేసువార్తను చాటారు. కొద్ది సంవత్సరాలనుండి ముఖ్యంగా స్థానికులే తీర్థాలను దర్శిస్తున్నారు. తరతరాలుగా వస్తున్న సంప్రదాయాన్ని, అనేకులు రక్షించబడటానికి కారణమైన ఈ పద్ధతిని కొనసాగించడం ఈ తరం వారి విధి. అన్ని సంఘాలవారు కూడుకుని సమాలోచనలు జరిపి వీలైతే ఒక కమిటీగా ఏర్పాటై ఒక పథకం ప్రకారం గోదావరి డెల్టా ప్రాంతంలో పుష్కరాల్లో సంవత్సరం పొడుగునా వచ్చే జాతరలు, ఉత్సవాలు, తీర్థాలు మొదలైన హైందవ పర్వదినాల్లో ఆయా స్థలాల్లో సువార్తను వినిపించడం ఈ తరం వారికి ఆశీర్వాదకరం. ఈ సేవనుమాత్రం వుపేక్ష చేయకూడదు గాని, మారుతున్న పరిస్థితుల దృష్ట్యా సువార్త ప్రకటించడంలోనూ మార్పుల్ని అన్వేషిస్తూ పాపికి రక్షణార్థమైన సువార్తను ప్రతి వ్యక్తికీ యింటింటా అందించడం మన సంఘాల బాధ్యత.

## ఫీల్డు కౌన్సిళ్ళు

గోదావరి డెల్టా మిషన్ సంఘాలను 9 మండలాలుగా విభజించి వాటిని అప్పట్లో ఆయా మిషనెరీలు ఆయా ఫీల్డుసంఘాల సేవను పర్యవేక్షించేవారు. ఆ మండలాల పేర్లు : 1. నరసాపురం, 2. చెట్టిపేట 3. ప్రత్తిపాడు, 4. చాగల్లు, 5. కోయలగూడెం, 6. ధవిళేశ్వరం 7. అమలాపురం, 8. అంతర్వేదిపాలెం, 9. క్రొత్తపేట.

ఈ ఫీల్డులు ప్రతిదానికి ఫీల్డ్‌కౌన్సిళ్ళు సుమారు 1948లోనే ఏర్పాటైనాయ్. ఆయా ఫీల్డుల్లోవున్న మిషనెరీలే ప్రారంభంలో ఈ కౌన్సిళ్ళకు అధ్యక్షులుగా వుండేవారు. ఈ ఫీల్డు కౌన్సిళ్ళ ఏర్పాటుకుకూడా సహో. సి. జోనాగారు, డి.బి. బర్ట్‌గారు గట్టిగా కృషిచేశారు.

### వీటి ఉద్దేశాలు :

తెలుగు కాన్ఫరెన్స్ ఉద్దేశాలే వీటి ఉద్దేశాలుకూడా. ఫీల్డు సంఘాల ఏకీభావంకోసం, సంఘాల్లోవచ్చే తొందర్లు సరిచేయుడానకు, సేవను ప్రోత్సహించడానికే యివి గట్టిగా పనిచేస్తాయి.

మూడు నెలలకోసారి రెండవ శనివారంనాడు ఈ ఫీల్డు కౌన్సిళ్ళు, ఆయా ఫీల్డుల్లో జరుగుతాయి. ప్రతినెల రెండవ ఆదివారంనాడు వచ్చిన చందాను ప్రతీ సంఘం ఫీల్డు కౌన్సిలు సేవార్థం యివ్వాలి. ఆ వచ్చిన డబ్బును సువార్త సేవకులకు, తదితర పనులకు బట్వాడాచేసే బాధ్యత ఫైనాన్స్ కమిటీలకు అప్పగించబడింది. ఈ ఫీల్డు కౌన్సిళ్ళు దిగువ సభలు గాను, ఎ.జి.డి.యం.ఏ ఎగువ సభగాను పనిచేస్తున్నది. దీనిప్రస్తుత సభ్యులు.

| వరుస సంఖ్య. | ఫీల్డు పేరు. | సంఘాల సంఖ్య. | అధ్యక్షులు | కార్యదర్శులు | కోశాధికారులు |
|---|---|---|---|---|---|
| 1. | నర్సాపురం | | | | |
| | నర్సాపురం ప్రాంతం | 12 | సి.జి.ప్రకాశరావుగారు | టి.కె. జార్జిగారు | సి.జోబ్ మోజెస్‌గారు |
| | పాలకొల్లు ప్రాంతం | 31 | | | |
| 2. | చెట్టిపేట | | | | |
| | చెట్టిపేటప్రాంతం | 17 | సి.బారాకుగారు | | |
| | తణుకుప్రాంతం | 25 | ఉపాధ్యక్షులు: నై.కొర్నేలియస్‌గారు | టి.సామ్యేలుగారు | ఎం.గమాలియేలుగారు |
| | లోయర్ గోస్తనదీ ప్రాంతం | 17 | | | |
| 3. | ప్రత్తిపాడు | 25 | గెడ్డం విల్యమ్స్‌గారు | కలపాల దానియేలుగారు | కలపాల దానియేలుగారు |
| 4. | చాగల్లు | 30 | బి.రామన్నగారు | వి.వీరన్నగారు | బి.రామన్నగారు |

| వరుస సంఖ్య. | ఫీల్డు పేరు | సంఘాల సంఖ్య. | అధ్యక్షులు | కార్యదర్శులు | కోశాధికారులు |
|---|---|---|---|---|---|
| 5. | కోయలగూడెం | 17 | ఎన్.సత్యానందంగారు | ఎన్.జోసెఫ్ గారు | వి.చిరంజీవిరావుగారు |
| 6. | ధవిలేశ్వరం | 21 | ఎన్.నథానియేలుగారు | టి.జోసెఫ్ గారు | ఎం.జె.శాస్త్రిగారు |
| | Z.మేడపాడు | 3 | —————— | ఇ.సుబ్బారావుగారు | —————— |
| 7. | అమలాపురం | 15 | టి.సామియేలుగారు | ఎస్.దేవదానంగారు | జె. అప్పారావుగారు |
| | అంబాజీపేట | 11 | | | |
| 8. | కొత్తపేటప్రాంతం | 12 | ఎన్.చంద్రపాల్ గారు | కె.వీరయ్యగారు | సంగపు సుబ్బారావుగారు. |
| 9. | అంతర్వేదిపాలెం | —22 | కె.ఎం.జి.విజయంగారు | జి.కుటుంబరావుగారు | జి.ఎల్.పాల్ గారు |
| | వాడ్రేవుపల్లి | | కె.కుటుంబరావుగారు | ఎస్.చిట్టియ్యగారు | —————— |

# 20

# గోదావరి డెల్టా మిషన్ సంస్థలు

ఈ సంస్థలన్నీ మానవసేవమూలంగా దైవసేవచేసే ఉద్దేశంతో స్థాపించబడినవే. ముఖ్యంగా స్కూళ్ళు ఆసుపత్రులు అన్యుల సువార్తీకరణలో ఆరంభంనుండి ప్రాముఖ్యమైన పాత్ర వహించినాయి. ఇవన్నీ ఆదినుంచీ ప్రభువుకు నమ్మకమైన వ్యక్తులచే నడిపించబడుతూ సామాన్య ప్రజలకు సువార్తనందించే కేంద్రాలుగా ఉన్నాయి. వీటిల్లో జరిగే సేవను గురించి [illegible] తెలుసుకుందాము.

## నర్సాపురం మిషన్ స్కూలు, నర్సాపురం

'సిలువను భరించు, మకుటాన్ని ధరించు' అనే నినాదం కలిగిన మిషన్ స్కూలు గోదావరి డెల్టా సంస్థలన్నిటిలోకీ అతి పురాతనమైనది. ఆది మిషనరీ జార్జిబీరు 1839లో దీన్ని స్థాపించి 1853 వరకు దీన్ని నడిపించాడు.* బీరుగారి మరణం మూలంగా కొంత కాలవ్యవధివచ్చి 1854లో మళ్ళీ బీరు సతీమణి స్కూలును, దానితో బాటు అగ్రకుల బాలికలకు స్కూలును స్థాపించింది. ఈ సమయానికి నర్సాపురం స్కూల్లో 50 మంది పిల్లలు ఉన్నారు. తన 18వయేట 1861లో జార్జి బీరు జేష్ఠపుత్రుడు జాన్ విలియం బీరు దీని యాజమాన్యం చేపట్టి ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలుగా దీన్ని అభివృద్ధి చేసారు. వీరు స్కూలు ఉదయ ప్రార్థన సమయాన తేట తెలుగులో దైవవాక్యాన్ని బోధిస్తుంటే రోడ్డు వెంట వెళ్ళే జనం వరండాల్లో మూగి వినేవారు. వీరి హయాంలో స్కూల్లో

*A Brief History of our School, P. Ananda Raju, in The Mission High School Magazine 1956.



పాలపాల్లు గోపురం (బౌడెన్, బీర్, హీలిస్‌లు కంచుకంఠంతో సువార్త వినిపించిన కూడలి)



నిలుచున్నవారు : ఇ. యస్. బౌడన్ (చెట్టిపేట) మక్రేగారు (అమలాపురం)

కూర్చున్నవారు : బీరుసతి (నరసాపురం) బోయడ్‌గారి భార్య తల్లి బౌడన్ సతి – టిల్‌స్లీగారు వీరి కుమార్తె కొడుకు మక్రే సతి




ఆనాటి గోదావరి డెల్టా పటం



థామస్ టిల్‌స్లీ దంపతులు
(టిల్‌స్లీగారి తల్లిదండ్రులు. వీరి తల్లి బౌడన్‌గారి కుమార్తె)



చెట్టిపేట బాలికల హాస్టలు అజమాయిషీచేసిన
టి. వెంకమ్మ, బౌడెన్ మిసమ్మగార్లు



టిల్‌స్లీ సతి కుటుంబం
(కింగ్ దంపతులు, కుమారుడు,
బాల్యంలో టిల్‌స్లీ సతి - (చెట్టిపేట)



బౌడన్‌గారి బంగళా
(చెట్టిపేట)



చెట్టిపేట బాలికల హాస్టలు — 1914 లో



చెట్టిపేట బాలికల పాఠశాల - ఆరంభంలో



చెట్టిపేట బాలికల బోర్డింగ్ హాస్టల్
లోపలి భాగం



శెట్టిపేట బాలికల పాఠశాల,
ఉపాధ్యాయినీ ఉపాధ్యాయులు



శెట్టిపేట బాలికల హాస్టల్ విద్యార్థినుల శ్రమదానం



టిల్‌స్లీగారు (చెట్టిపేట) ఆరంభంలో సంఘాలను దర్శించుట



టిల్‌స్లీ దంపతులు (పెళ్ళి అయిన తరువాత)



చార్లెస్ బీర్ దంపతులు (నరసాపురం) (జార్జి బీర్ గారి ద్వితీయ పుత్రుడు నరసాపురం సంఘకాపరి)



డా. బి. జీవరత్నంగారు (అమలాపురం)



నరసాపురంలో బోయడ్‌గారు స్థాపించిన పురుషుల ఆస్పత్రి పనివారు
కూర్చున్నవారు బోయడ్ దంపతులు,
డా. బి. జీవరత్నం, డా. లాంగ్‌గార్లు



బోయడ్‌గారి కుటుంబం



శ్రీ డిస్నిగారు, శ్రీ హిచ్‌కాక్‌గారు. డా. లాంగ్‌గారు

పురుషుల ఆసుపత్రి - నరసాపురం



ఈ బిల్డింగ్‌లో ప్రస్తుతం నరసాపురం D. S. P. గారు వుంటున్నారు



కూర్చున్నవారు : డా. సి. ప్రింగ్‌గారు

నిలుచున్నవారు : మిస్ ఏట్స్, మిస్ ఆస్‌బోర్న్,

మిస్. హెడ్స్, శ్రీమతి బర్

మిస్. మోర్గన్,

కుడి వైపునున్నవారు మున్షీ రామమూర్తిగారు



మిస్ రాజర్స్, మిస్ హార్డింగ్‌లతో

హాస్టలు విద్యార్థినులు

గోషా ఆసుపత్రి — ఆరంభంలో



ఒక గదిలో డా. ఫ్రింగ్ మిస్. క్రిషింటన్ హేమ్మన్ వుంటూ మిగిలిన గదులన్నీ రోగులకొరకు, ఓ. పి. క్లినిక్ కొరకు వాడేవారు. అప్పుడు 2 పడకలు మాత్రమే వుండేవి.



బ్రామ్లీగారి కుటుంబం - 1922
వెనుక : హేన్స్, బ్రామ్లీగారు, మిస్. హెన్రీ, (బ్రామ్లీగా చెల్లెలు,)
2వ వరుస : బ్రామ్లీగారి తల్లి, ఫ్రేడ్, మిలీ, శ్రీమతి బ్రామ్లీ, ఆల్బిన్, పెర్సీ. మేరీ



బ్రామ్లీ కాంపౌండ్‌లో బ్రామ్లీగారి గృహం



అగ్రకులాల బాలికల పాఠశాల, ఉపాధ్యాయుడు



శ్రీమతి బాయిచ్ నిర్వహించిన అగ్రకులాల బాలికల పాఠశాల,
ఉపాధ్యాయులు, వెనుకనున్నవారు మిస్. ఎడిత్ బీర్



మిస్. బౌడన్, మిస్. బ్రీలే, శ్రీమతి ఏడమ్స్,
డా ప్రింగ్, శ్రీమతి బ్రౌన్



టిల్స్లీ కుటుంబంతో
డా. షార్టు దంపతులు (నరసాపురం
కుష్ఠరోగుల ఆసుపత్రి)



కూనూర్‌లో తీసిన ఫోటో

వెనుక : ఏడమ్స్ దంపతులు, బ్రామ్లీ దంపతులు, బోయిడ్ దంపతులు, బ్రౌన్ దంపతులు, మిస్ క్లార్క్ గార్లు

2వ వరుస: బ్రామ్లీగారి తల్లి, శ్రీమతి బౌడన్, మిస్. బౌడన్, మక్రే దంపతులు, శ్రీమతి బీర్, మిస్. బ్రీలీ, మిస్. కొలిన్స్ గార్లు



డా, బెట్టీ హోల్ట్‌గారు
నరసాపురం గోషా ఆసుపత్రి

) మంది చదువుకునేవారు. అందరికీ మంచి వేతనాలతో సర్కారు
గాలు దొరికేవి.

1884లో జాన్ బీరు స్వదేశానికి వెళ్ళిపోయి మరణించిన తరువాత
సోదరుడు చార్లెస్ బీరు దాన్ని చేపట్టాడు. వీరికాలంలో పులిపాక
్రథం, జంపా వెంకటస్వామి, ఆచంట నరసింహమూర్తి తదితరులు
, సువార్తను విని దానికి విధేయులైనారు. తరువాతి రెండు దశాబ్దాలలో
స్కూలు లోయర్ సెకండరీ స్కూలు నుండి ఎలిమెంటరీ స్కూలు
ుకి దిగజారింది.

తన 21వ యేట 1903లో బ్రాహ్మీగారు ఈ స్కూలు
గాంయిషి చేపట్టారు. 1905 కల్లా దీన్ని హైయర్ ఎలిమెంటరీ
లు స్థాయికి, 1920లో మిడిల్ స్కూలు స్థాయికి అభివృద్ధి
). ఆ సమయంలో వీరు గ్రామీణ ప్రాంతాల్లో ఉన్న 60 స్కూళ్ళ
తను నిర్వర్తించేవారు. 1921లో దీన్ని మిడిల్ స్కూలుగా మార్చారు.
్లిగారికి స్కూలు వ్యవహారాల్లో కుడి భుజంగా ఉన్నవారు కొప్పర్తి
మూర్తిగారు. బ్రాహ్మీగారి తదనంతరం మరో 20 యేళ్ళపాటు ఈ
లుకు భానుమూర్తిగారు హెడ్మాస్టరుగా సేవచేసారు.

1922లో నేస్మిత్‌గారు స్కూలు బాధ్యతను చేపట్టి 1945
హెడ్మాస్టరు, మేనేజరు, కరస్పాండెంటుగా పనిచేసారు. 1942లో
ౕరి కాంపౌండునుండి జోనా రోడ్డులో ప్రస్తుతం స్కూలు ఉన్న
కి దీన్ని తరలించడంలో నేస్మిత్‌గారు ప్రధానపాత్ర వహించారు.
9లో స్కూలు బాధ్యతను నేస్మిత్‌గారినుండి బర్టుగారు స్వీకరించారు.

ప్రభుత్వంవారి ఆదేశం మేరకు బి.ఇడి. చదివిన హెడ్మాస్టరును
ుంచవలసిన సందర్భంలో అప్పటికి కాకినాడ మెక్లారిన్ హైస్కూల్లో
స్తున్న పింజర్ల ఆనందరాజుగారిని 1946లో హెడ్మాస్టరుగా
ుంచడం జరిగింది. మిషన్ మిడిల్ స్కూలును హైస్కూలుగా
్చలని జోనాగారు తదితర స్థానిక క్రైస్తవులు ప్రోత్సహించడంతో
గారం డి. బి. బర్టుగారిమీద పడింది. 1952-53లో ఇది ఉన్నత
ాలగా మారింది. 1954లో చదలవాడ థామస్‌గారు దీని

కరస్పాండెంట్ బాధ్యతను కొంతకాలం స్వీకరించారు. వీరు 1950 నుండే మిషన్ హైస్కూలు కమిటీ ట్రెజరర్‌గా ఉన్నారు.

1936లో గోదావరి డెల్టా సంఘాల శతవార్షిక నిధితో ప్రస్తుతం జోనా రోడ్డులో ఉన్న స్థలం, లోపలివైపున ఉన్న విశాలమైన ఆటస్థలం, కొనుగోలుచేసి బౌడెన్ బీరు మెమోరియల్ అని పిలువబడుతున్న కట్టడాన్ని నిర్మించడం జరిగింది. అప్పట్లో చదరపు గజం అర్ధణా (3 నయాపైసలు) చొప్పున కొన్నారట. పైన చెప్పబడిన వాటన్నిటికీ ద్రవ్యసహాయం 85 శాతం గోదావరి డెల్టా ప్రాంతీయ సంఘాలనుండే విరాళాల రూపంలో వసూలు చేయబడింది. అయితే కాలం గడిచినకొద్దీ ప్రాంతీయ సంఘాలకు సంఘ ప్రతినిధులకూ ఈ స్కూలు యాజమాన్యంలో ఎటువంటి పాత్ర లేకుండా పోవడం శోచనీయం అని సంఘపెద్దలు విచారం వెలిబుచ్చుతున్నారు.

ఈవిధంగా బౌడెన్ బీరు మెమోరియల్ భవనాన్ని 1942లోను, బ్రాప్లీ మెమోరియల్ 1948లోను, జోనా మెమోరియల్ భవనం 1957 డిసెంబరు 6వ తేదీన, జోసెఫ్ మెమోరియల్ 1960 జూలై 20వ తేదీన ప్రారంభించబడినాయి. ఇవిగాక టిల్‌స్లీ మెమోరియల్, సేల్స్ డే బ్లాకులు తరువాత కట్టారు.

1969లో బర్టుగారు రిటైరైన తర్వాత చదలవాడ జ్ఞాన ప్రకాశరావుగారు కరస్పాండెంటు బాధ్యతను చేపట్టారు. 1972 మిషన్ హైస్కూలు మేగజైన్‌లో జూన్ 1971 పదవ తరగతి పరీక్షల్లో 90 శాతం విద్యార్థులు ఉత్తీర్ణులైనట్టు బి. అజరయ్యగారు రాసారు. ఆనంద రాజుగారి తరువాత స్కూలు హెడ్మాస్టరు పదవినలంకరించిన బూల అజరయ్యగారు 1979 వరకు ఈ బాధ్యతను సమర్థవంతంగా నిర్వహించారు.

వీరికాలంలో స్కూలు కమిటీలో తలెత్తిన వివాదాలు అటు తరువాతి కాలంలో గొప్ప ప్రభావాన్ని చూపించినాయి. ఈ అల్లకల్లోలం అంతటినీ సరిచేసే నిమిత్తం 300 సంఘాల పెద్దలు సమావేశమై కరస్పాండెంటు శ్రీ సి. జ్ఞానప్రకాశరావుగారికీ కమిటీవారికీ సామరస్యంగా ఒప్పందం కుదిర్చి అందరూ సంతకాలు చేసిన తరువాతకూడా అప్పటి స్కూలు కమిటీవారు ఏ కారణంవల్లనో ఆ ఒప్పందాన్ని గౌరవించలేదని తెలుస్తున్నది. అప్పటి

నుండి ఇంతకుముందు చెప్పినట్టు గోదావరి డెల్టా మిషన్ సంఘాలకు స్కూలుకున్న సంబంధం తెగిపోయింది. ఈ స్కూలు వివాదమే చివరికి నరసాపురం సంఘం చీలిపోవడానికీ నాంది అయ్యింది. జ్ఞానప్రకాశరావుగారి తదుపరి లిల్లీగారు, అటుతరువాత డాక్టర్ సి.ఆర్. ప్రభాకర్‌గారు కరస్పాండెంట్లుగా ఉన్నారు. అజరయ్యగారి పదవీ విరమణ అనంతరం ప్రస్తుతం సిర్రా జాన్‌గారు మిషన్ హైస్కూలు హెడ్మాస్టరుగా ఉన్నారు.

కమిటీ మెంబర్లుగా అయా సమయాల్లో క్రాఫర్డు టిల్‌స్లీ, నేస్మిత్, జోనా, చదలవాడ జోసెఫ్, యేళ్ళ విక్టర్, ఆనందరాజు ప్రభృతులు ఉన్నారు. ప్రస్తుతం ఈ కమిటీలో మిస్ టిల్‌స్లీ, డాక్టర్ ప్రభాకర్, కె. సత్యనారాయణ ఎస్.బి. భాస్కరరావు ఒ.యం ప్రసాదరావు, బి. అజరయ్య, ఎస్. జాన్‌గార్లు వున్నారు.

మిషన్ హైస్కూలులో యింకా ప్రతి ఉదయం ప్రార్థన జరుగుతోంది. మిషన్‌హైస్కూలు టీచర్లు పులిరామన్నగూడెంలో కోయల మధ్య సువార్త సేవకు వెళ్ళిన ఇద్దరు మిషనెరీల కుటుంబ పోషణా బాధ్యతను చేపట్టారు. మొదటి మిషనెరీ సేవకుడు పట్నం డేవిడ్ రాజుగారు. సైకిళ్ళపై సువార్త యాత్రలు జరిపే వాడుకను మొదలు పెట్టింది వీరే. వీరు, వీరి తరువాత ఎందరో పులిరామన్నగూడెం కేంద్రంగా చుట్టుప్రక్కల ప్రాంతాల్లో వాక్యం ప్రకటించారు. దిగమర్రుకు చెందిన మడికి వెంకన్నగారు అక్కడ సేవకునిగా ఉంటుండగా వైద్య సహాయంలేక వీరి భార్య మరణించింది. వెంకన్నగారు కోయలకు సన్నిహితుడై విజయవంతంగా సువార్త నందించే ప్రయత్నంలో భాగంగా వారిలో ఒకడుగా కలిసిపోయి భార్యామరణానంతరం ఒక కోయ స్త్రీని వివాహమాడి వారికి మరింత చేరువయ్యారు. బొబ్బిలి లాజరుగారుకూడా మిషన్ హైస్కూలు వారిచే పోషించబడుతున్న మిషనెరీసేవకుడు.

నర్సాపురం మిషన్ హైస్కూల్లో మాజీ హెడ్మాస్టరు అజరయ్యగారి తండ్రి! బూల యోహానుగారు గతకాలంలో 34 సంవత్సరాలు స్కూలు అభివృద్ధి నిమిత్తం పాటుపడ్డారు. స్కూలులో ఆయా సమయాల్లో చిరస్మరణీయమైన సేవచేసినవారిలో కప్పల యాకోబు, ఉల్లంపర్తి సమూయేలు, శ్రీమతి వాసా పంచాక్షరి, శ్రీమతి ఎ. మనోరమ బెంజిమన్, సిహెచ్ ఫ్రాన్సిస్, కప్పల సమూయేలు, సిర్రా దానియేలు, బి. థియొడోర్,

పి. లాజరు, ఎ. అబ్రాహాము, ఎస్.జి. విక్టర్, వి. ఎల్సీ, ఏ పద్మ అబ్రహాము గార్లు ఉన్నారు. వీరిలో కొందరు ఇప్పటికీ స్కూలులో పనిచేస్తున్నారు.

## చెట్టిపేట బాలికల బోర్డింగు స్కూలు:

చెట్టిపేటలో 1890లో ఎడ్విన్ బౌడెన్‌గారు బాలికల బోర్డింగు స్కూలు స్థాపించారు. ఆరంభంలో వీరి కుమార్తె లిల్లీ ఈ స్కూలును అజమాయిషీ చేసేది. ఈమె తరువాత పెళ్ళి చేసుకోడానికి యింగ్లాండు వెళ్ళిపోయినప్పుడు ఎడ్విన్ బౌడెన్‌గారి ఆఖరు కూతురు హెన్రిట్టా బౌడెన్ 1897 నుండి 1956 వరకు దీన్ని నడిపి నిత్య విశ్రాంతికి చేరుకున్నారు. ఆ తరువాత మిస్ ఒ. రాజర్స్, మిస్. హార్డింగుగార్లు ఇంగ్లాండునుండి వచ్చి ఈ బాలికల బోర్డింగ్ స్కూలు పనిని చేపట్టారు. ప్రస్తుతం ఈ స్కూలు ప్రభుత్వం చేతిలో ఉన్నది. హాస్టలు మాత్రం మిస్ ఇ.జె.హార్డింగ్ గారు చూస్తున్నారు. ఈ స్కూల్లో ఎందరో మహిళలు చదువుకుని ఉన్నత స్థితిగతుల్లోకి వెళ్ళడంమాత్రమేగాక, రక్షణపొంది చక్కని క్రైస్తవ సాక్ష్యాన్ని కలిగివున్నారు.

## నర్సాపురం క్రిష్టియన్ ఆస్పత్రి, నరసాపురం

1914 ప్రాంతంలో డాక్టర్ చార్లెట్ప్రింగ్ చెట్టిపేటలో ఉంటున్న రోజుల్లో నర్సాపురంలో ఆస్పత్రిని ప్రారంభించాలన్న భారం ఆమె మనస్సులో ఉండేది. అయితే అవి మొదటి ప్రపంచయుద్ధం ఆరంభవౌతున్న రోజులు. ప్రార్థన శక్తివల్ల గడ్డు పరిస్థితిని లెక్కచెయ్యకుండా డాక్టరు ప్రింగ్ 1915లో ఆస్పత్రిని తెరిచింది. మొదట ఇది 3 గదులతో ఆరంభమైంది. ఒక గది రోగవిచారణ గదిగాను, రెండవగది మందులివ్వడానికీ, మూడవది ఇద్దరు పేషంట్లు ఉండేందుకు వీలుగా రెండు పడకలతో ఉండేవి. శిక్షణ పొందిన సహాయకులు, సరియైన సదుపాయాలు లేకపోగా స్థానికుల మూఢ నమ్మకాలుకూడా డాక్టరు ప్రింగుకు అడ్డుబండలుగా నిలిచినాయి.* మిస్ హేమ్టన్ నర్సుగా మిస్ ప్రింగ్‌కు సహాయపడుతుండేది.

*గోల్డెన్ జూబిలీ సావనీర్ 1915–1965. స్త్రీల ఆస్పత్రి, నరసాపురం.

క్రమంగా ఈసేవ అభివృద్ధి చెందింది. వార్డు, డిస్పెన్సరీ, ఆపరేషన్ థియేటర్ మొదలైనవి నిర్మించబడినాయి. అప్పటిదాకా డాక్టర్ ఇళ్ళకువెళ్ళి పురుడుపోస్తూ ఉండేది.అయితే కొంతకాలానికి 1940లో ప్రసూతి వార్డును ప్రారంభించడం జరిగింది. గోషా ఆస్పత్రి, మిషన్ ఆస్పత్రి అనికూడా ఈ ఆస్పత్రిని వ్యవహరిస్తారు. డాక్టరు ప్రింగు పుట్టుకతోనే తుంటి ఎముకకు సంబంధించిన అంగవైకల్యంతో ఉన్నది. తన జీవితకాలమంతా చేతికర్ర సాయంతో కుంటుతూనడిచేది. అయితే ఈమెను దేవుడు తన చేతుల్లోని బలమైన సాధనంగా వాడుకున్నాడు. డాక్టరు మిస్ బెట్టీ డి. హోల్ట్ డాక్టరు ప్రింగుకి కుడిభుజంగాఉండి పనిచేసింది. 1946లో డాక్టరు ప్రింగు రిటైరైపోగా డాక్టరు బెట్టీ హోల్ట్ ఆమె స్థానంలో ఆస్పత్రి బాధ్యతను స్వీకరించింది.

డాక్టరు ప్రింగు నర్సాపురం 'లాడ్జిలో' ఉంటూ వైద్యసేవ విరమించుకున్న కొద్దికాలానికి తిరిగి స్వదేశం వెళ్ళిపోవాలని బయలుదేరగా ఆ రోజున రైలుబండి అందలేదు. డాక్టరు ప్రింగు ఇంటికి తిరిగివచ్చి ఆ రాత్రి తన కుర్చీలో కూర్చుని అలానే చనిపోయిందట.

మిస్ సిబిల్ టేలర్ 1928 నుండి డాక్టరు ప్రింగుకి సహాయకురాలిగా ఉంటూ 1931లో బోటు సువార్త సేవను చేపట్టింది.

అటుతరువాత డాక్టరు హోల్ట్ దాదాపు 30యేళ్ళ మెడికల్ సూపరింటెండెంటుగా ఆస్పత్రిని అన్నివిధాలా అభివృద్ధిలోకి తెచ్చారు. వైద్యంలో ప్రజలకు నమ్మకం పెరుగుతున్నకొద్దీ ఆస్పత్రికివచ్చే రోగుల సంఖ్య విపరీతంగా పెరిగింది. గేటుప్రక్కనేఉన్న డిస్పెన్సరీ చాలనందువల్ల తూర్పువైపున రోడ్డుకు రెండవవైపున కొంత స్థలంకొని 1956లో ఔట్ పేషంటు బ్లాకు కట్టించారు. వారానికి నాలుగు రోజులు నిర్వహించబడే ఈ క్లినిక్‌కు 80మైళ్ళ పరిధిలోఉన్న పరిసర గ్రామాలనుండి రోజుకి కనీసం 400మంది రోగులు వైద్య సహాయంకోసం వస్తూ ఉంటారు. 1957లో మరొక ప్రసూతి వార్డు నిర్మాణం జరిగింది. ఈవిధంగా 1944లో కేవలం 35 పడకలుండగా 1965 నాటికి అంటే మిషన్ ఆస్పత్రి స్వర్ణోత్సవం నాటికి 150 పడకలున్నాయి. ప్రస్తుతం ఈ ఆస్పత్రిలో 206 పడకలు, పిల్లలకు 90 పడకలు వున్నాయి.

1965 స్వర్ణోత్సవాల సందర్భంలోనే ఎలక్ట్రిక్ మోటారుద్వారా నీళ్ళుతోడి టాంకులో నిలువచేసే సదుపాయం నెలకొల్పారు.

మిస్ డొరిన్ యేట్స్ 1931 నుండి 1967దాకా 36యేళ్ళు ఈ ఆస్పత్రిలో నర్సింగు సూపరింటెండెంటుగా పనిచేసి 1967లో సేవ విరమించుకున్నారు. మిస్ యేట్స్ గుడ్డివాళ్ళు చదవగలిగే బ్రెయిలీ భాషను నేర్చుకుని క్రైస్తవ సాహిత్యాన్ని ఆ భాషలోకి తర్జుమా చేసేది. వీరు అదేయేట నర్సుల ట్రెయినింగు స్కూలుకు శంకు స్థాపన చేసారు. ఇది జూలై 1967లో ఆరంభించబడింది. దీనిలో మిస్ జోను ఇ. హాల్టుకు టి. ప్రభావతిగారు మూడేళ్ళపాటు తోడ్పడ్డారు. అటుతరువాత స్కూలు ఆఫ్ నర్సింగుకి డైరెక్టరుగా సిస్టర్ ఆశీర్వాదంగారు వచ్చారు. ఆయా సమయాల్లో డాక్టర్ శిరోమణమ్మ, డాక్టర్ కాంతాయమ్మగార్లు వైద్య సేవలో పాల్గొన్నారు. మిస్ బ్రార్డ్స్లే నర్సుగా రోగులకు అతిశ్రద్ధతో పరిచర్య చేసేవారు.

నర్సాపురం చుట్టుప్రక్కల ప్రాంతాల్లో చిరస్మరణీయమైన సేవ చేసిన మిస్ ఎడిత్ మోర్గన్ 1972లో మరణిస్తూ తన నివాసాన్ని ఆస్పత్రి కోసమని రాసి ఇచ్చింది. ఈమెతోబాటు ఈ బంగళాలోఉంటూ చాలాయేళ్ళు లెప్రసీ ఆస్పత్రిలో సేవచేసిన మిస్ విన్నిఫ్రెడ్ ఆస్‌బోర్న్ కీళ్ళవాతంవల్ల స్వదేశం వెళ్ళిపోయింది. వీరి నివాసాన్ని పురుషుల ఆస్పత్రిగా మార్చి 1975లో డాక్టరు షార్టు దీనికి ప్రారంభోత్సవంచేస్తూ అప్పటిదాకా ఒంటరిగా ఉన్న స్త్రీల ఆస్పత్రికి జంటగా పురుషుల ఆస్పత్రి వెలిసిందని చమత్కరించారు.*

డాక్టరు ఐరీన్ లీసర్ పద్నాలుగేళ్ళు ఈ ఆస్పత్రిలో పనిచేసి అంబాజీపేట వెళ్ళిపోయి అక్కడ ఆస్పత్రిని ఆరంభించింది. 1953నుండి డాక్టరు డోరతిమన్స్, 1963 నుండి మిస్ ఎనిడ్ వాగ్‌లాండు జనరల్ వార్డులో పనిచేస్తున్నారు. 1968 నుండి మిస్ హెలెన్ థామ్సన్ ప్రసూతి వార్డులో పనిచేశారు. 1974లో డాక్టర్ సి.ఆర్. ప్రభాకర్, వీరి సతీమణి మిరియంగారు ఈ ఆస్పత్రిలో సేవచేసేందుకు సమర్పించు

*డైమండ్ జూబిలీ 1915–1975, నర్సాపురం క్రిస్టియన్ ఆస్పత్రి సావనీర్.

కున్నారు. డాక్టరు ప్రభాకర్‌గారి సోదరి డాక్టర్ కళ్యాణి థామస్‌గారు 1973 నుండి ప్రసూతివార్డు వ్యవహారాలు చూసుకుంటున్నారు. 1975 నుండి డాక్టర్ ప్రభాకర్‌గారు ఈ ఆస్పత్రి మెడికల్ సూపరింటెండెంటుగా వ్యవహరిస్తున్నారు. యువకులైన డాక్టర్ పాల్ విల్సన్‌గారు కొంతకాలం ఇక్కడ పనిచేసి అందరి అభిమానాన్ని చూరగొన్నారు.

1975 నుండి ఎస్.ఎస్. రాజుగారు బిజినెస్ మేనేజరుగా ఆస్పత్రి నిర్వహణ బాధ్యతను స్వీకరించారు. దమయంతి, వినోలియమ్మ, రత్నమ్మ, దానమ్మ, రాజమ్మ, రాధాబాయిగారు తమ శాయశక్తులా బహు నమ్మకంగా ఈ సేవలో సహాయపడ్డారు. బైబిలు సేవకురాలిగా కాంతమ్మగారు 1975 వరకు పనిచేసారు.

1960లో నర్సులు, పేషంట్ల కొరకు గేటు సమీపంలో నర్సుల హాస్టలును ఆనుకుని ఒక ప్రార్థన హాలు నిర్మాణం జరిగింది. ఇక్కడ ప్రతి దినం ఉదయం ప్రార్థన, ప్రత్యేకమైన నియామక కూటాలు జరుగుతాయి. శనివారం రాత్రిళ్ళు అందరినీ ఆహ్వానించి ఫిల్మ్ ప్రదర్శనద్వారా సువార్త ప్రకటన జరుగుతుంది. కరపత్రాలు, సువార్త ప్రతులు విరివిగా అందించ బడుతున్నాయ్. ఆస్పత్రిలో చికిత్సపొందే స్త్రీ పేషంట్లకు బైబిలు స్త్రీలు వాక్యపరిచర్య చేస్తూ ఉంటారు.

మిషన్ ఆస్పత్రి సువార్తికులుగా వాసా ఎబినెజరు, బూల యోహాను కంకిపాటి దర్యావేషు, చదలవాడ మలాకీ, దిద్దే సుందరరావు, మైలాబత్తుల బెంజిమన్‌గార్లు ఆయా సమయాల్లో పనిచేసారు. మిషన్ ఆస్పత్రి నర్సు సహోదరీలు రుస్తుంబాద, శ్రీహరిపేట, పీచుపాలెం, కప్పలపేట, యెడ్లపల్లి వారితోట ప్రాంతాల్లో సండేస్కూళ్ళు ప్రారంభించారు.

## బెతెస్థ లెప్రసీ ఆస్పత్రి, నరసాపురం:

జె.యం. బోయిడ్‌గారు తాను స్వతహా వైద్యుడు కాకపోయినా ఈ ప్రాంతపు కుష్టురోగుల స్థితిని గమనించిన తరువాత వీరికోసం ఒక ఆస్పత్రి స్థాపించాలన్న భారం వీరి మనస్సులో మొదలైంది. స్నేహితులతో పరిచయస్తులతో ప్రార్థనాపూర్వకంగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి 1923

లో మూడెకరాల భూమిని సంపాదించి ఆస్పత్రి స్థాపించగలిగారు. తొమ్మిది మంది పేషెంట్లకోసం షెడ్లు వేయించి లెప్రసీ వైద్య సేవనారంభించాడు. ఇది జరిగిన ఎనిమిదేళ్ళకే బోయిడ్‌గారు టైఫాయిడ్‌వల్ల అకాల మరణం చెందాడు. ఇప్పటికి ఇక్కడ దాదాపు వందమంది పేషెంట్లు చికిత్స పొందుతున్నారు. ఈ సమయంలో డాక్టరు విలియమ్సు ఇక్కడ వైద్య చికిత్స చేస్తున్నారు.*

బోయిడ్‌గారి మరణంవల్ల ఏర్పడిన అగాధాన్ని అప్పటికే నర్సాపురం మిషన్ ఆస్పత్రిని నడిపిస్తున్న డాక్టరు ప్రింగు పూరించారు. వీరితోబాటు మిస్ హేమ్టన్ లెప్రసీ వైద్య సేవలో ప్రవేశించి గణనీయమైన సేవ చేసారు. మిస్ హేమ్టన్ కుష్టురోగులపట్ల చూపిన ఆదరం ఇంత అంత అని చెప్ప నలవికాదు. ఆటుతరువాత 30, 40 ఏళ్ళలో మిస్ ప్రిమ్టన్, మిస్ బ్లాక్, మిస్ హెడ్సు, మిస్ ఆస్ బోర్న్ మొదలైన మిషనెరీ సహోదరీలు దేవుని పిలుపునందుకుని కుష్టురోగులకు చికిత్సలో తమ శక్తియుక్తులను వినియోగించారు. ముఖ్యంగా మిస్ ఆస్‌బోర్న్ ఇరవైయేళ్ళకు పైగా తన శారీరక బలహీనతను బాధను లెక్కచెయ్యక కుష్టురోగుల పరిచర్యలో పాల్గొన్నారు.

డాక్టరు ప్రింగ్ మరణానికి ఒక నెల ముందుగా డాక్టరు షార్టు నర్సాపురంకు వచ్చారు. వీరి ముత్తాతగారు జార్జిముల్లర్ అనాథ శరణాల యంలో ఉపాధ్యాయునిగా పనిచేసారు. డాక్టరు షార్టు తెలుగు నేర్చుకుంటూనే 1953లో బెతెస్థ ఆస్పత్రి మెడికల్ సూపరింటెండెంటు బాధ్యతను చేపట్టారు. చార్లెస్ బర్ కొంతకాలం బిజినెస్ మానేజరుగా పనిచేసారు. మిస్ బార్డ్‌స్లే నర్సింగులో డాక్టరు షార్టుకి సహాయపడేది. వీరుగాక మిస్ షీలా వెయిట్, మిస్ జెన్నిఫర్ వైట్‌హస్ట్, మిస్ సాండ్రామెడ్‌లాండు, ఆయా సమయాల్లో ఈ ఆస్పత్రిలో పనిచేసారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ (డబ్ల్యు.హెచ్.ఒ.)కు చెందిన మిస్ ఐలీన్ రాజర్స్ ఫిజియోథెరపీ విభాగాన్ని ప్రారంభించారు. ప్రస్తుతం కె. చంద్రశేఖర్‌గారు ఈ బాధ్యతను నిర్వర్తిస్తున్నారు.

*బెతెస్థ లెప్రసీ ఆస్పత్రి, నర్సాపురం. గోల్డెన్ జూబిలీ.

బిజినెస్ మానేజర్లుగా బర్ గారి తరువాత మిస్ ఆస్‌బోర్న్, మేరీ షార్ప్, బర్టుగార్లు పనిచేసారు.

బేతెస్థ సేవలో పాలుపంచుకొన్న స్థానికులు ఎవరంటే డాక్టరు విలియమ్సు, డేనియల్, అగస్టీన్, నందనం, తాడిపర్తి దేవప్రసాదుగార్లు తదితరులు. నవీన జెఫన్యా కొంతకాలం నర్సుగా పనిచేసారు. ఈ ఆస్పత్రిలో సువార్తికునిగా తాడి పెంటయ్యగారు, నిత్యావసరవస్తువుల కొనుగోలుదారుగా మేడిది రామయ్యగారు దీర్ఘకాలం పనిచేసారు.

డాక్టరు షార్ప్ కుష్ఠరోగుల చికిత్సలో అతి నేర్పుతో వోపికతో ఎనలేని సేవచేసారు. వ్యాధివల్ల చేతులు కాళ్ళు కొంగర్లుపోయిన పేషంట్లను బాగుచేసి, వారి అవయవాలు తిరిగి ఉపయోగపడే నిమిత్తం షార్ప్‌గారు రోగి చేతులు, కాళ్ళకున్న నరాలస్థానే సరిక్రొత్త నరాలను అమర్చి బాగుచేసే ఆపరేషన్ పద్ధతి **(Tendon Transplantation)** ని 1955 నుంచి అభివృద్ధిచేసి ఈ ఆస్పత్రిలో విజయవంతంగా ఇలాటి ఆపరేషన్లనెన్నింటినో జరిగించి రోగులకు మేలు చేసారు. కనుచూపు పోయినవారికికూడా ఆపరేషన్‌ద్వారా తిరిగి చూడగలిగేలా చేసారు. ప్రస్తుతం గవర్నమెంటు డాక్టరుగా తణుకులో ఉంటున్న డాక్టరు మునియ్యగారు తదితరులు ఎందరో ఈ ఆస్పత్రిలో ట్రెయినింగు పొందారు. 1978లో షార్ప్‌గారు స్వదేశం వెళ్ళిపోయిన తరువాత బెన్‌వాకీగారు ఈ ఆస్పత్రి బాధ్యతను చేపట్టారు.వీరు స్వదేశం వెళ్ళిపోకముందు రాబిన్‌సన్‌గారు ఇక్కడ మేల్ నర్సుగా పనిచేసారు.

డాక్టర్ డి.ఎస్. మూర్తిగారు వేలకొద్దీ పేషెంట్లకు ఉచిత నేత్ర చికిత్స చేసారు. డాక్టరు షార్ప్‌గారితో కలిసి కంటి ఆపరేషన్లను సమర వంతంగా నిర్వహించేవారు. తనను కంటి ఆపరేషన్ల విషయంలో ప్రోత్సహించి శిక్షణ ఇచ్చినది డాక్టర్ మూర్తిగారేనని షార్ప్‌గారు వ్రాసారు.

మొదట్లో బోయిడ్‌గారు కొన్న మూడెకరాల స్థలంకాక 1935లో దీన్ని ఆనుకునిఉన్న 17 ఎకరాల భూమిని కొనడం జరిగింది. సిల్వర్‌జూబిలీ భవనం, ఇతర కట్టడాలు క్రమంగా వెలిసాయి.

1958లో గవర్నమెంటువారి గ్రాంటుతో ఆపరేషన్లకొరకు ప్రత్యేకమైన బ్లాకు, ఆస్పత్రి అంతటికీ విద్యుచ్ఛక్తి సదుపాయం ఏర్పాటు చేసారు. బ్రిస్టల్‌కి చెందిన డాక్టరు లింటన్ ప్రయోగ శాలకు చెందిన ఖరీదైన పరికరాలు బహూకరించారు. నర్సాపురం, పాలకొల్లు లయన్స్ క్లబ్బువారు దుప్పట్లు కంటి పరీక్షగది, స్త్రీల వార్డులకు రేడియో మొదలైన వాటిని ఇచ్చారు. లెప్రసీ మిషన్‌వారు ఔట్ పేషంటు డిపార్టుమెంటు భవనం, ఫిజియోథెరపి విభాగం, ఎక్సరే, ఆఫీసు గదులు, మొదలైన వాటికోసం ధనసహాయం చేసారు. ఆస్పత్రి నిర్వహణలో అయ్యే ఖర్చులో దాదాపు నాలుగున్నర శాతం లెప్రసీ మిషన్‌వారు, 9శాతం రాష్ట్ర ప్రభుత్వంవారు భరిస్తున్నారని 1973లో షర్టుగారు వ్రాసారు. ప్రార్థనల ఫలితంగా దేవుని పిల్లలు ప్రేరేపితులై పంపించే కానుకలవల్లనే మిగిలిన ఖర్చులకొరకు ధనం సమకూడుతున్నది.

ఆల్బర్ జె. లిర్లీగారు గాస్పెల్ లిటరేచర్ ఔట్‌రీచ్ కార్యక్రమం క్రింద మద్రాసువచ్చి ఇండియాలోనే ఉండిపోవడానికి నిర్ణయించుకుని నర్సాపురం బేతెస్థ ఆస్పత్రికి వచ్చి సేవలో స్థిరపడ్డారు. డేవిడ్ బర్టు స్థాపించిన ఎమ్మాయు కరస్పాండెన్స్ కోర్సు బాధ్యతను కొనసాగించారు. లిర్లీగారు బేతెస్థ ఆస్పత్రికి వచ్చిన తరువాత ఆస్పత్రి ఆవరణమంతా పచ్చగా కొబ్బరి చెట్లతో, కాయగూరల మొక్కలతో కళకళలాడింది. 1952 నుంచి కొడమంచిలి విల్సన్‌గారు ఆఫీసు రికార్డులను, ఆదాయ వ్యయ వివరాలను క్రమబద్ధం చేసారు. 1969లో వీరి రాజీనామా తరువాత కె. సత్యనారాయణగారు బిజినెస్ మానేజరుగా వచ్చారు. ప్రస్తుతం వీరు జనరల్ సూరింటెండెంటుగాను, కె. హోబన్నగారు బిజినెస్ మానేజరుగాను డా. కె. వందనంగారు సీనియర్ మెడికల్ ఆఫీసరుగాను వున్నారు.

నర్సాపురం బేతని వై.యం.ఇ.ఎఫ్. సేవవల్ల ప్రేరేపితులై ఈ ఆస్పత్రి ఉద్యోగులుకూడా బేతెస్థ వై.యం.ఇ.ఎఫ్. ను స్థాపించి గొప్ప సేవను జరిగించారు. నర్సాపురం ఫీల్డులోని సంఘాలన్నిటినీ దర్శించి వాక్య పరిచర్య చేసారు. డాక్టరు వందనం, కూర్మా చంద్రశేఖర్, వేడిది వెంకట్రావు, జమీర్ కంకిపాటి సమూయేలు, జేమ్సు, కె. హోబన్న, జె. మోహన్, ప్రభృతులు ఈ సేవాభారం నిర్వహించారు. వీరు సీతారామపురం, మటపర్రు,

తూర్పుతాళ్ళు, రుస్తుంబాద మొదలైన స్థలాల్లో సంఘం స్థాపించారు.

## సర్వే, ఎడ్యుకేషన్ అండ్ ట్రెయినింగ్ కార్యక్రమం (SET)

లెప్రసీ మిషన్‌వారి నిర్వహణలో ఎస్.ఇ.టి. కార్యక్రమం బెతెస్థ లెప్రసీ ఆస్పత్రి ఆధారంగా నడిపించడం జరుగుతున్నది. ఒక ప్రాంతాన్ని ఎన్నిక చేసుకొని దాన్ని అనేకమైన భాగాలుగా విభజించి ఒక్కొక్క భాగాన్ని శిక్షణపొందిన పారా మెడికల్ వర్కర్లు సర్వేచేసి మందులు ఇవ్వడం, అవసరమైన సందర్భాల్లో కేసులను ఆస్పత్రికి తోడుకురావడం జరుగుతున్నది. దీనికి జి. షిమ్యోనుగారు ప్రాజెక్టు మేనేజరుగా, వేడిది పాల్‌రాజుగారు సూపర్‌వైజర్‌గాను వ్యవహరిస్తున్నారు.

## లెప్రసీ క్లినిక్‌లు:

డాక్టరు షార్ప్‌వల్ల ప్రేరేపితురాలై మిస్ హేమ్టన్ ఈ లెప్రసీ క్లినిక్కులను ఆరంభించింది. గోదావరి ప్రాంతమంతటా ఈ వ్యాధి వ్యాపించి ఉన్నందువల్లనూ, రోగులైనవారు బస్సు తదితర ప్రయాణ సాధనాలను ఉపయోగించుకోవడానికి అవకాశం లేనందువల్ల ఈమె తానే వేర్వేరు స్థలాల్లో ఈ క్లినిక్‌లు నడిపి రోగులకు వైద్యం చేసేది. మిస్ హెడ్సుతో కలిసి తణుకులో కొమ్మాయి చెరువుగట్టున ఒక ఇంట్లో నివాసముంటూ పాలకొల్లు, మార్టేరు, తాడేపల్లిగూడెం, అత్తిలి, రేలంగి, పాలమూరు ఆరేడు, ఉప్పులూరు, అర్ధవరం, పంగిడి మొదలైన గ్రామాల్లో క్లినిక్‌లు నడిపారు వీరిద్దరూ. ఒక స్టేషన్‌వాగన్ వేన్‌లో సంచరిస్తూ ఆయా స్థలాలను క్రమంగా దర్శించేవారు. మిస్ హేమ్టన్ కుష్టురోగుల క్షేమం కోసం పడిన ప్రయాస చూపిన ఆదరణ అంతా ఇంతాకాదు. ఫలాన పేషంటు కోసం ఏమి చెయ్యాలా, ఎలా సహాయపడాలా అన్న తపనవల్ల ఆమెకి రాత్రిళ్ళు నిద్రపట్టేదికాదట. కొన్ని రాత్రిళ్ళు అలా పచార్లుచేస్తూ ఉండేదట. హిందూ కుష్ఠు నివారణ సంఘం ఆనరరీ సెక్రటరీ గారైన టి.ఎన్. జగదీశన్‌గారు తనకు తెలిసినంతవరకు కుష్టు

రోగులకు వైద్యునికీ మధ్య ఉన్న అడ్డుగోడను దూకి అవతలికి వెళ్ళిన మొదటి వ్యక్తి మిస్ హేమ్టన్ అని అన్నారు. మిస్ హేమ్టన్ 1963లో కొయ్యల గూడెం, పంగిడి తప్పించి మిగిలిన క్లినిక్‌లను డాక్టరు షార్ట్సుకు అప్పగించారు. బెతెస్థ ఆస్పత్రివారికి నర్సాపురంలో పనిభారం ఎక్కువైనందువల్ల ఈ క్లినిక్కులను వీరుకొనసాగించలేక పోయారు.

1970దాకా తాడేపల్లిగూడెం, పంగిడి క్లినిక్కులను మిస్ హేమ్టన్ నడిపించింది. ఇక్కడ రోజుకి 1500మంది పేషెంట్లదాకా చికిత్స పొందేవారు. ఈ సేవలో చెట్టె సమూయేలుగారు మిస్ హేమ్టన్‌కి సహాయపడ్డారు. 1970లో మిస్ హేమ్టన్ క్లినిక్‌లపని విరమించి చెట్టిపేట వచ్చేసారు. మిస్ టేలర్ ఈమెను నర్సాపురం తీసుకు వచ్చారు. 1971లో మిస్ హేమ్టన్ తన ప్రయాస ముగించి దేవుని సన్నిధికేగారు. మిస్ హెడ్సు 1975దాకా తాడేపల్లిగూడెం సెంటరులో క్లినిక్‌ను నిర్వహించారు.

## స్త్రీల ఆస్పత్రి, అంబాజీపేట:

బ్రౌన్ దంపతులు 1920లో అమలాపురం నుండి రాయుపూడి యోగానందంగారు అనే వైశ్యునికి చెందిన కొంత స్థలంకొని అక్కడ డేరా వేసుకొని నివసించారు. ఆ తరువాత అక్కడే ప్రార్థనాలయం ఆస్పత్రి భవనం నిర్మాణం గావించారు. బ్రౌన్‌సతీ, ఇక్కడ రోగులకు మందులిస్తూ వాక్యం ప్రకటిస్తూ ఉండేది. ఇక్కడ సువార్త ప్రకటించడానికి అమలాపురం నుండి బూల రెడ్డి, దానియేలుగార్లు వస్తూ ఉండేవారు. అవిడి గ్రామానికి చెందిన గెడ్డం ఏలీయాగారు చాలాకాలం అంబాజీపేటలో సువార్త పరిచర్య చేసినా ఫలితం కనిపించలేదు. బ్రౌనుగారి పనివారు, చింతా వెంకయ్య దంపతులు మాత్రం ఆరాధనకు సమావేశమయ్యేవారు, అమలాపురంనుండి ఆంబటి ఆంద్రూ, సోమన్న, జాన్ తాతయ్యగార్లు అటుతరువాతి కాలంలో వస్తూ సువార్త ప్రకటించేవారు.

బ్రౌనుగారి ఆకస్మిక మరణం తరువాత 1938లో మోరిసన్ దంపతులు అంబాజీపేటకు వచ్చారు. 1964 తరువాత బెండమూర్లంక నుండి కూపర్‌సతి, నర్సాపురంనుండి 1965లో, డాక్టరు లీజరుగార్లు వచ్చిన తరువాత ఇక్కడి వైద్య సేవ అభివృద్ధి చెందింది. బ్రౌనుగారు

కట్టించిన ఆస్పత్రిని డాక్టరు లీజరు తిరిగి పెద్దదిగా కట్టించారు. డాక్టరు లీజరు 1953లో వచ్చి దాదాపు పద్మాలుగేళ్ళు నర్సాపురం మిషన్ ఆస్పత్రిలో పనిచేసి 1966లో అంబాజీపేట వచ్చారు. వీరే ప్రస్తుతం ఈ ఆస్పత్రికి, ఈ ప్రాంతపు అసెంబ్లీల సేవకూ వెన్నెముకగా ఉన్నారు. వీరికి సహాయకులుగా మిస్ రైట్, మిస్ హాడ్జ్కిన్‌సన్ పనిచేసారు.. ఈ ఆస్పత్రికి బిజినెస్ మానేజరుగా యేసురత్నంగారు పని చేస్తున్నారు. లీజరుగారు 1977 జూన్ 25న స్థాపించిన క్రిష్టియన్ బుక్ రూమ్‌కు సహో. ఎస్. బెన్నీగారు బిజినెస్ మానేజరు. ఆ ప్రాంతంలోని సంఘాల, విద్యార్థుల వాఙ్మయ అక్కరలు తీర్చుటలో ఈ బుక్ రూమ్ విశేషంగా వుపయోగపడుతోంది. దీనిలో ప్రస్తుతం నలుగురు పనిచేస్తున్నారు. కొత్తపేట, అంబాజీపేట, అమలాపురం ప్రాంతాల్లోని జి.డి.యం. సంఘాల సేవకు ఈ మిషనెరీ సోదరి ఎనలేని ప్రోత్సాహాన్నిస్తున్నారు. అంబాజీపేటలో జి.డి.యం. ఆలయాన్ని డా. లీజర్‌గారే కట్టించారు. ఎస్. జోసెఫ్, జె. అప్పారావు ఎస్.ఎం. రాజు ప్రభృతులు సంఘపెద్దలు. ఈ సంఘం యువకులు హాస్పిటల్ వేన్‌లో అనేక ప్రాంతాలు తిరిగి సువార్త ప్రకటిస్తున్నారు.

## బైబిలు తరగతులు:

చెట్టిపేట—క్రాఫర్డు టిల్‌స్లీగారు చెట్టిపేట ప్రాంతంలోని సువార్త సేవకులు, ఉపాధ్యాయులు సంఘపెద్దలు తదితరులకోసం 1932లో చెట్టిపేటలో బైబిలు తరగతులు ప్రారంభించారు. ప్రతి సంవత్సరం డిసెంబరు నెలలో నాలుగైదు రోజులు ఈ తరగతులు నిర్వహిస్తూ అనుభవజ్ఞులైన దైవసేవకులతో బైబిలు బోధ చేయిస్తుండేవారు. టిల్‌స్లీ దంపతులు నిడదవోలు బెరాకాలో స్థిరపడిన తరువాతకూడా ఇవి కొనసాగినాయి. టిల్‌స్లీగారి మరణం తరువాత టిల్‌స్లీసతి 1969 వరకు ఈ తరగతులు నిర్వహించారు. ఆటుతరువాత ప్రాంతీయ పెద్దలు పూనుకొని ఈ తరగతులను కొనసాగిస్తున్నారు.

ఇదేవిధంగా అన్ని ఫీల్డుల్లోనూ ఆయా సెలవల్లో ప్రత్యేకమైన తరగతులు నిర్వహించబడుతున్నాయి. అలాగే స్త్రీలుకూడా ప్రత్యేకంగా స్త్రీల కూటాలు, బైబిలు తరగతులు జరిపించుకొంటున్నారు.

## బైబిలు స్కూలు:

హెర్మోను బైబిలుస్కూలు, ప్రత్తిపాడు. యువకులైన సువార్త సేవకులకు వాక్యంతో శిక్షణనిచ్చేందుకు 1964లో మూడువారాల బైబిలు స్కూలు ఆరంభమైంది. దీన్ని 1966లో అంబాజీపేటకు మార్చారు. ఆటుతరువాత మళ్ళీ 1969 వరకు ప్రత్తిపాడులోనే ఈ తరగతులను నిర్వహించడం జరిగింది. డి.బి. బర్టుగారి ఆధ్వర్యంలో ఈ బైబిలు స్కూలు వాడ్రేవుపల్లికి తరలించబడింది.

లైట్‌హవున్ బైబిలు స్కూలు, వాడ్రేవుపల్లి. 1970 లో ప్రత్తిపాడునుండి తరలించబడిన ఈ బైబిలుస్కూలు వాడ్రేవుపల్లి మిషన్ బంగళాలో నడిచింది. దాదాపు 50 తరగతులు నిర్వహించబడినాయి. ప్రతి తరగతికి 25మంది విద్యార్థులు, ఇద్దరు టీచర్లు, ఇద్దరు వంట పనివారు, ఒక వార్డెన్ పనిచేసారు దీనికి బర్టుగారు యాజమాన్యం వహించి నడిపించారు. కమిటీలో మెంబర్లుగా వి. లూకా, టి.బి సత్యం సి.కె. థామస్, ఎస్.వి. రెడ్డి, డి.బి. బర్టుగార్లు ఉండేవారు. ఎస్ వనమరాజు గారు ఆటుతరువాత మెంబరుగా చేరారు. ప్రస్తుతం డాక్టర్. సి.ఆర్ ప్రభాకర్, ఎస్.సి. రంగారావుగారు, వి. లూకా, టి.బి. సత్యంగార్లు ఉన్నారు. ఈ బైబిలు తరగతుల మూలంగా అనేకమంది యువకులు తమ జీవితాలను ప్రభువుకు సమర్పించుకొని సువార్తికులుగా ఆయాచోట్ల పని చేస్తున్నారు. ఈ తరగతుల్లో వి. లూకా, ప్రభుదాసు, డి.బి. బర్టు, ఎస్.వి. రెడ్డి, ఎస్. కృపానందం, ఎస్. ఆనందం, ఎస్. ఆనందరావు, ఎస్. వనమరాజు, సి. సుందర్రావు, ఒ.యం. ప్రసాదరావు, జి. సెంబాబు కె. ఐజక్, ఎస్. కృపావరం, పి. సెంబాబు, సి.కె. థామస్, జి. జోయల్ రాజు పి.జి. ప్రకాశరావు, పి. ఆనందరాజు, టి. వెంటయ్య, ఎస్. జోసెఫ్, వి. వెంకట్రావుగార్లు ఆయా సమయాల్లో బైబిలు బోధనను నిర్వహించారు. విద్యార్థులకు భోజనం, వసతి ఉచితంగా సమకూర్చబడుతున్నాయి. టి.బి. సత్యంగారు బైబిలుస్కూలు నిర్వహణా భారం వహించారు.

ఇదే ప్రస్తుతం నిడదవోలులో సహో. సి. జెఫన్యా,వి.లూకాగార్ల ఆధ్వర్యంలో

బెరాకా (లేక గోదావరి డెల్టా) బైబిలుస్కూలుగా వ్యవహరించబడుతోంది. ఇప్పటికీ దీనికి డి.బి. బర్టుగారే ఆర్థిక సహాయాన్ని అందజేస్తున్నారు. ప్రస్తుతం వీరు వృద్ధాప్యంలో ఆస్ట్రేలియాలో కేన్సర్ వ్యాధితో బాధపడుతున్నారని తెలుస్తోంది.

## గోదావరి డెల్టా మిషన్ బాలుర బోర్డింగ్, నర్సాపురం

1903లో బ్రాంప్లీగారు నర్సాపురంవచ్చి మిషన్‌స్కూలు యాజమాన్యాన్ని చేపట్టిన తరువాత యితర గ్రామాలనుంచివచ్చి ఈ స్కూల్లో చదువుకునే బాలుర సౌకర్యార్థం పెద్ద బాలుర బోర్డింగునుకూడా స్థాపించి నడిపించారు. ప్రస్తుతం బ్రాంప్లీపేటగా వ్యవహరించబడుతున్న ప్రాంతంలో ఈ బోర్డింగు ఉండేది. ఇప్పుడు మన సంఘాల్లోని విద్యావంతులైన వృద్ధులంతా దాదాపుగా ఈ బోర్డింగులో ఉండి చదువుకొన్నవారే.

1928లో బ్రాంప్లీ దంపతులు కోయలగూడెం వెళ్ళిపోయినప్పుడు ఈ బోర్డింగును బీరుగారి కాంపౌండులోకి మార్చి జె.యం. బోయిడ్‌గారు దీని యాజమాన్యం చేపట్టారు. 1942లో స్కూలును జోనా రోడ్డులోకి మార్చిన సమయంలో ఈ హాస్టలు నేస్మిత్‌గారి యాజమాన్యం క్రింద నేస్మిత్‌గారి కాంపౌండులోకి మార్చబడింది. అప్పుడే దీనికి బ్ర్యాలా బాలుర హాస్టల్ అని నామకరణం చేశారు. నేస్మిత్‌గారి బంగళా పేరునుబట్టి ఈహాస్టలుకు బ్ర్యాలా హాస్టలు అని పేరుపెట్టడం జరిగింది. 1949లో దీని బాధ్యతను బర్టుగారు చేపట్టారు. 1969లో బర్టుగారు తాటిపాక వెళ్ళిపోగా బి. అజరయ్యగారికి ఈ హాస్టలును అప్పగించడం జరిగింది. ఇంచుమించు ఒక సంవత్సరం తరువాత దీన్ని ఎత్తేసారు.

## తివాచీ పరిశ్రమ.

బ్రయంట్ దంపతులు 1901లో ఇంగ్లాండు నుండి వచ్చారు.

ప్రత్తిపాడులో నివాసం ఏర్పరచుకుని హవుస్ బోటుతో వీరు విస్తృతంగా కాల్వలమీద తిరిగి సువార్త ప్రకటించారు.

వీరు కంబళ్ళు, తివాచీలు నేయడాన్ని నేర్పించడంకోసం వీరి కాంపౌండులో మగ్గాలు బిగించి చాలామందికి ఈ వృత్తి నేర్పించారు. ప్రస్తుతం ఏలూరు మంచి తివాచీ ఉత్పత్తికేంద్రంగావుంది. అందుకు బహుశా వీరి కృషి నాందీకావొచ్చు.

## వడ్రంగం శిక్షణా కేంద్రము.

1897లో వచ్చిన రాసన్ దంపతులు ధవిలేశ్వరంలో వడ్రంగం స్కూలును స్థాపించి చాలమంది యువకుల్ని మంచి వడ్రంగులుగా తీర్చిదిద్దారు. వీరు 1901లో ఫీజీ దీవులకు వేళ్లేంతవరకు ఈ స్కూలును నిర్వహించారు.

## డిస్పెన్సరీలు.

ఇవి ముఖ్యంగా స్త్రీలకోసం ఆయా మిషన్ స్టేషన్లలో ఆయా మిషనెరీ సోదరీలద్వారా నెలకొల్పబడ్డాయ్. అనేకమంది స్త్రీలు యిక్కడ సువార్తవిని తమ యిళ్ళకు దానిని తీసుకుపోయారు. సువార్త ప్రచారానికి ఈ డిస్పెన్సరీలు మంచి సాధనాలయ్యాయి.

లంబాజీపేటలో శ్రీమతి బ్రౌన్‌గారు, ప్రత్తిపాడులో శ్రీమతి బ్రైంట్, శ్రీమతి ఫేక్, మిస్ హెంప్టన్, మిస్ హెడ్స్, శ్రీమతి డ్రౌన్‌గార్లు కొయ్యలగూడెంలో శ్రీమతి ఆజ్‌బోర్న్‌గారు, చాగల్లులో శ్రీ ఆడమ్సుగారు మిస్ గేస్ ఆడమ్సుగారు మిస్ ఐవీ బర్నాడ్‌గార్లు ఈ క్లినిక్స్ నడిపారు. ఇప్పుడివన్నీ మిషనెరీల నిర్గమంతో మూతబడ్డాయి.

## హాలెండు వార్ఫ్ బాలికల హాస్టల్, నరసాపురం

1955 జూన్ 19న మిస్ బి.జె.సి. టిల్‌స్లీ 24మంది బాలికలతో ఈ హాస్టలు స్థాపించారు. చదలవాడ జోసెఫ్‌గారికి చెందిన భవనంలో

ఈ హాస్టలు ఉండేది. ప్రస్తుతం దీన్ని లాడ్జి కాంపౌండులోకి మార్చారు. నర్సాపురం జి.డి.యం. హైస్కూలుకు అనుబంధంగా ఈ బాలికల హాస్టలును స్థాపించారు. గ్రామాల్లోని బాలికలు దేవుని వాక్యంతోబాటు విద్యనభ్యసించాలన్నది ఈ హాస్టలు ముఖ్యోద్దేశం. మిస్ టిల్స్లీగారు చెట్టిపేట మిషనెరీ టిల్స్లీ దంపతుల పెద్ద కూమార్తె. క్రైస్తవ, అన్య బాలికలు చాలామంది ఈ హాస్టల్లో తమ స్కూలు చదువు ముగించుకున్నారు. ఇక్కడ అనుదినం జరిగే వాక్య పరిచర్యవల్ల అనేకమంది బాలికలు లేత వయస్సులోనే తమ రక్షకుణ్ణి తెలుసుకున్నారు. ఈ హాస్టలు కమిటీకి శ్రీమతి సి.ఆర్. ప్రభాకర్‌గారు ఛైర్మన్‌గా ఉన్నారు. ఈ హాస్టలు నిర్వహణలో మిస్ టిల్స్లీకి సహాయకురాలిగా వి. మెర్సీగారు పనిచేసారు. హాస్టలుకు కొనుగోళ్ళు చెయ్యడంలో చెట్టే ఇశ్రాయేలుగారు చాలాకాలం సహకారిగా ఉన్నారు. వీరి మరణం తరువాత సనమండ్ర లాజరుగారు ఈ బాధ్యత నిర్వహించి రిటైరయ్యారు. ఈ హాస్టలు పూర్వ విద్యార్థిని శ్రీమతి ఎం. సంతోషం ప్రస్తుతం దీని ఆర్థిక విషయాలు చూస్తున్నారు.

## జీవజలముల రేడియో కార్యక్రమాలు.

1953 నీలగిరి కొండల్లో బ్రదరెన్ మిషనెరీల కాన్ఫరెన్సుకు డాక్టర్ షార్ప్ హాజరైన సందర్భంలో బొంబాయిలో సేవచేస్తున్న మెక్‌గ్రెగర్‌గారు ఇండియాలో రేడియో పరిచర్య ఆరంభించాలన్న ప్రతిపాదన చేసారు. 1954 జూన్ నెలలో మెక్‌గ్రెగర్‌గారు ఒక టేపురికార్డరుతో రాజమండ్రివచ్చి ఒక తెలుగు కార్యక్రమం రికార్డుచేసుకుని బొంబాయి తీసుకువెళ్ళి ప్రసారం నిమిత్తం శ్రీలంకకు పంపించారు. త్వరలోనే మూడు 'పెన్‌ట్రాన్' టేపు రికార్డర్లను బొంబాయి, నర్సాపురం, కలకత్తాలలో లివింగ్‌వాటర్స్ కార్యక్రమాలను రికార్డుచెయ్యడంకోసం మెక్‌గ్రెగర్‌గారే తెప్పించారు. 1954 ఆగస్టు నెలలో నర్సాపురంలోని లాడ్జికి పెన్‌ట్రాన్ రికార్డరును మెక్‌గ్రెగర్‌గారు తీసుకువచ్చి డాక్టరు షార్ప్‌గారికి అప్పగించారు. కొంతకాలానికి డాక్టర్ మన్స్ ఇచ్చిన విరాళం 1800 రూపాయలతో మరొక గ్రండిగ్ టేపు రికార్డరు కొనడం జరిగింది. దీన్ని కొయ్యల

గూడెంలో అప్పటికి నివాసమున్న కెవిన్ ఆస్‌బోర్న్‌గారు మద్రాసువెళ్ళి తీసుకు వచ్చారు. డాక్టరు షార్టు ఒకవైపు లెప్రసీ ఆస్పత్రిలో ఊపిరి పీల్చుకోలేనంత పనిభారం ఉండగానే రేడియో సిలోన్ ద్వారా జీవజలములు రేడియో కార్యక్రమాలను రికార్డు చేస్తూ ఉండేవారు. 1957లో మనిలా లోని ఫార్‌ఈస్ట్ బ్రాడ్ కాస్టింగ్ కార్పోరేషన్ (ఎఫ్.ఇ.బి.సి.) ద్వారా రేడియో ప్రసారాలు జరిగాయి. తర్వాత ఫిబా సీషెల్స్‌కు మార్చబడింది.

1962లో భారత నౌకాదళంలో రేడియో ఆఫీసరుగా పనిచేసి రిటైరైన టి.జె. సిడ్నీగారు రికార్డింగు బాధ్యతను డాక్టరు షార్టునుండి స్వీకరించారు. 1962లో లాడ్జి ఆవరణలో ఒక స్టూడియో నిర్మించడం జరిగింది. కొంతకాలం తరువాత భారత నౌకాదళం ఆఫీసరు టి.కె. జార్జిగారు స్టుడియో నడిపే బాధ్యతను చేపట్టారు. అంతేకాక ఆదాయ వ్యయాల లెక్కలు, శ్రోతలనుండి వచ్చే ఉత్తరాలకు జవాబులు మొదలైన పనులనుకూడా వీరే చూసుకుంటూ వచ్చారు.

1970 నాటికల్లావారానికి రెండు కార్యక్రమాలు పావుగంట కాలవ్యవధి గలవి, మరొకటి అరగంట కాలవ్యవధి గలది జీవజలములు కార్యక్రమాల్లో రికార్డింగు జరిగేవి. అరగంట కార్యక్రమం చిన్నపిల్లల సండేస్కూలు సేవకు సంబంధించినది. దీనిస్థానంలో ఆటుతరువాత వనితలు కార్యక్రమం ప్రవేశపెట్టారు.

1978లో స్టుడియో చెదలమూలంగా పాడైపోగా ఆల్బర్ట్ లిల్లీగారు దీన్ని పడగొట్టి క్రొత్త స్టుడియో నిర్మాణాన్ని నిర్వహించారు. సత్యా సమూయేలుగారు, చిరకాలం ఈ రేడియో కార్యక్రమాల్లో దైవసందేశాలను అందించారు. ఈ మధ్యకాలంలో జాన్ మోషే, శిఖామణిగార్లు వాక్యోపదేశంచేస్తూ ఉన్నారు. వనితలు కార్యక్రమంలో శ్రీమతులు భాషామణి,మార్త మ్యురియల్,వి. మెర్సి సేవ్‌బాబు గార్లు పాల్గొనేవారు. వీరుగాక అనేకమంది గాయనీ గాయకులు, మొదలైన వారు జీవజలముల రేడియో కార్యక్రమంలో సహకరిస్తున్నారు.

దీని సలహాసంఘ సభ్యులు, మిస్. బి.జె.సి. టిల్‌స్లీ, డా. సి.ఆర్ ప్రభాకర్, సహో. మోజెస్ సికిలే, సహో. బి. అజరయ్యగార్లు. సహో. జార్జిగారు దీనికి కార్యదర్శి.

మిస్ టిల్‌స్లీగారు 'హాలెండ్‌వార్ప్ బాలికల హాస్టలు'ను ప్రస్తుతం జీవ జలముల స్టుడియోవున్న "ది లాడ్జి"కాంపౌండుకు మార్చినందున జీవజలముల స్టూడియోను వేరే స్థలంలో ఆధునిక సదుపాయాలతో నిర్మించాల్సిన ఆవశ్యకత ఏర్పడింది. పాతకాలపు యంత్రాలతో నడుస్తున్న ఈ స్టుడియోను ఆధునీకరణం చెయ్యాల్సిన అవసరంకూడా వుంది. ప్రస్తుతం ఈ స్టుడియో నిర్వహణ ముఖ్యంగా డా. షార్టుగారి వ్యక్తిగత విరాళాలవల్ల కొనసాగుతోంది. ఇంగ్లాండులో వీరు తమ సంపాదనలో కుటుంబ కనీస అవసరాలకు కావాల్సింది తీసికొని మిగిలింది ఈ సేవకోసం త్యాగం చేస్తున్నారు. అలాగే విశ్వాసులు ఎందరో తమ అమూల్య కానుకలు పంపి సహకరిస్తున్నారు. తద్వారా ప్రతీరోజు అసంఖ్యాకంగా వచ్చే శ్రోతల వుత్తరాలకు వ్యక్తిగతంగా సమాధానా లిస్తూ, క్రైస్తవ సాహిత్యాన్ని పంపిస్తూ క్రీస్తు ప్రభువునుగూర్చి ఎక్కువగా తెలిసికోడానికి ఈ సంస్థ పాటుపడుతోంది. చాలామంది ఈ రేడియోద్వారా ప్రభువును స్వీకరిస్తున్నారు. ప్రస్తుతం వారానికి రెండు కార్యక్రమాలు ప్రసారం అవుతున్నాయి. ఒకటి ఫీబా సీషెల్స్‌నుండి రెండోది విశ్వవాణినుండి.

## జీవన్ జ్యోతి ప్రెస్, నరసాపురం

శ్రీ ఇ. చార్లెస్ ఆడమ్స్‌గారు 1901లో భారతదేశానికి మిషనెరీగా వచ్చారు. తాటిపాక, ధవిలేశ్వరం మిషన్ స్టేషన్స్‌లో కొంతకాలంఉండి 1920లో చాగల్లులో క్రొత్త మిషన్ కేంద్రాన్ని స్థాపించారు.

ఇదిలావుండగా 1927లో వీరు నీలగిరి కొండలకు విశ్రాంతికోసం వెళ్ళినప్పుడు ఏవో పెద్ద పెద్ద చెక్కపార్శిళ్ళు ఇంగ్లాండు నుండి వచ్చాయి. వాటిని పనివారు బంగళా వరండాలో భద్రపరిచారు. ఆడమ్స్‌గారు కొండల నుండి తిరిగి వచ్చాక పార్శిళ్ళు విప్పిచూస్తే ఒక ముద్రణా యంత్రం బయల్పడింది. దాన్ని ఎవరు పంపారో నేటికీ తెలీదు. ఆవిధంగా 1928లో ఆయన ఒక షెడ్డు ప్రెస్‌కోసం నిర్మించి దాన్లో ఈ యంత్రాన్ని బిగించి చాగల్లు సంఘంలోని కొందరు యువకులకు తర్ఫీదునిచ్చి ప్రెస్ పని ఆరంభించారు. అప్పట్లో కరంటులేదు. కాలితోతొక్కి లక్షోపలక్షలుగా

కరపత్రికలు, చిన్నపుస్తకాలు, రాయబారి మాసపత్రిక జి.డి.యం. కీర్తన పుస్తకం వెలువరించారు.

ఆడమ్స్‌గారు తెలుగుభాషలో అపారమైన పాండిత్యాన్ని సంపాదించారు ఆయనే స్వయంగా కరపత్రాలు, చిన్నపుస్తకాలు వ్రాసి ముద్రించారు. ఎ. నేస్మితుగారు, జె. వెబ్‌గారు, తదితర మిషనెరీలుకూడ ఈ ప్రెస్‌ద్వారా తమ రచనల్ని వెలువరించారు. ఈ ప్రెస్‌లో గళ్ళా గంగరాజు, మెరిపో వెంకన్న, ఆరంభంలో యం. రూబేను, బొల్లిపో తాతయ్య, మునియ్య ఆశీర్వాదం, పి. సుందర్రావు, ఒల్లియేలుగార్లు దరిమిలాను పనిచేశారు.

1949లో ఆడమ్స్‌గారు మృతిజెందాక కెవిన్ ఆజ్‌బోర్న్‌గారు కొంతకాలం, మిస్ రాజర్స్‌గారు కొంతకాలం, మిస్ ఎస్. రైట్ కొంతకాలం, ఆఖరుగా డేవిడ్‌డ్రెన్‌గారు ఈ పనిని అజమాయిషి చేసి 1969లో ఈ ప్రెస్ పనిని నిలిపివేశారు.

అదేవిధంగా 1965లో 'రాయబారి' అనే జి.డి.యం మాస పత్రికను ఆర్థికకారణాలవల్ల నిలిపివేశారు. ఇదే పత్రిక ఆరంభంలో అనగా 1870 లో "సాక్షి" అనే పేరుతో జాన్ విలియం బీర్‌గారు ఆరంభించారు. బౌడన్‌గారి మరణంవల్ల కొంతకాలం ఆగి 1877లో మళ్ళీ రాయబారి అనే పేరుతో ఆరంభమయ్యింది. కొంతకాలానికి నిలిచిపోయింది. దీన్నే మళ్ళీ ఆడమ్సుగారు 1911లో ఆరంభించారు. వీరి మరణంతో 1949లో యిది మళ్ళీ నిలిచిపోయింది. 1951లో మళ్ళీ కెవిన్ ఆజ్‌బోర్న్‌గారు దీన్ని పునరుద్ధరించి 1965వరకూ దీన్ని నడిపించి ఆర్థిక కారణాలవల్ల నిలిపివేశారు. అప్పుడు నరసాపురం బేతెస్థ కుష్ఠురోగుల ఆస్పత్రిలో ఆఫీసు మానేజరుగా పనిచేస్తున్న యువకుడు శ్రీ కె. విల్సన్ గారు 'రాయబారి' మాసపత్రికను సొంతపూచీమీద నడపడానికి తెలుగు కాన్ఫరెన్స్ పెద్దల అనుమతిని కోరారు. సభ్యుల్లో చాలామంది దాన్ని నిలిపివేయడం ఉత్తమం అని భావించినా, యువకుల్ని సేవలో విశేషంగా ప్రోత్సహించే మనస్తత్వంగల శ్రీ సి.జె. టిల్‌స్లీగారు ఈ 'రాయబారిని' విల్సన్‌గార్కి అప్పజెప్పడానకు అందర్నీ ఒప్పించి, దాన్ని ఆరంభించడానకు కావలసిన ఆర్థికసహాయాన్ని ఆయనే సేకరించి, మిస్ రాజర్స్‌గారిని కోశాధికారిగా ఏర్పరచి, రాయబారి సేవను ఆరంభించారు. సంపాదవర్గంగా

సి. జ్ఞాన ప్రకాశరావు, బి. అజరయ్య, ప్రభృతుల్ని ఏర్పరిచారు. సహో. డి. సత్యానందం, సహో. బి.జె. సంజీవరావు, సహో. ఎ.జె. లిల్లీగార్లు మిస్ బి.జె.సి. టిల్‌స్లీగారు కొంతకాలం సంపాదకవర్గంలో పనిచేశారు. ఎ. నేస్మిత్, సి. జోనా, జి. తాతయ్య, పి. ఆనందరాజు, జి. జోయల్‌రాజు గార్లుకూడా కొంతకాలం సంపాదకులుగా పనిచేసారు.

ఈ విధంగా రాయబారి పనిని కొనసాగిస్తున్న సహో కె. విల్సన్‌గారు బయటి ప్రెస్‌లలో జరుగుతున్న జాప్యాన్ని, ఆరిక ఒడుదుడుకుల్ని 1969 లో సంపాదకవర్గానికి నివేదించగా, చాగల్లు ప్రెస్‌లో దీన్ని ఎందుకు ముద్రించకూడదు? అన్న ప్రశ్న ఉత్పన్నమైంది. అప్పటికే చాగల్లు ప్రెస్‌ను నిలిపివేయాలన్న తీర్మానం ఉన్నందున సహో. కె. విల్సన్‌గారు లెప్రసీ హాస్పటల్లో చేస్తున్న ఉద్యోగానికి రాజీనామాచేసి, క్రైస్తవ వాఙ్మయం సేవలోకివస్తే ఆ ప్రెస్ పనిని ఆయనకు అప్పజెప్పడం జరుగుతుందని డేవిడ్‌డ్రాన్‌గారు మిషనెరీ కాన్ఫరెన్సులోని నిర్ణయాన్ని విల్సన్‌గారికి తెలియజేసారు.

ఆ విధంగా ఏభై యేళ్ళు నిర్విరామంగా పనిచేసి అరిగి పాడైన రెండు ట్రెడిల్స్, 12 అంగుళాల కటింగ్ మెషిన్, కొంత పాతటైపు 1969 ఏప్రిల్ నెలలో నరసాపురానికి తరలించబడింది. అప్పటికి స్టాకులోఉన్న కొంత పేపరు, బైబిళ్ళు, బేంక్‌లోవున్న రు.2000-లు ప్రెస్‌కు పెట్టుబడిగా యిచ్చారు. 1969 ఆగష్టు 15న. ఈ ప్రెస్ నరసాపురంలో అద్దెఇంట్లో నలుగురు ట్రెయినీస్‌తో ఆరంభమయ్యింది.

ఈ పదహారేళ్ళకాలంలో జీవన్‌జ్యోతి ప్రెస్ శ్రీ కె. విల్సన్‌గారి సారథ్యంలో ఎన్నో విధాలుగా అభివృద్ధి చెందింది. సొంత భవనాలు కొత్త పరికరాలు, ఆధునాతన యంత్రాలు ఈ ప్రెస్‌కు సమకూరాయి. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలోని క్రైస్తవ ముద్రణాలయాల్లోకెల్లా యిదే పెద్దది అని చెప్పుకోవాలి. రాయబారి, బాలరాయబారి, కరపత్రికలు, క్రైస్తవ సాహిత్యం యిక్కడ ముద్రించబడుతున్నాయ్. జీవన్ జ్యోతి ప్రచురణలకు ఆంధ్రలోని అన్ని క్రైస్తవ సంఘాల్లో విశేషమైన ఆదరణ వుంది.

ఇప్పుడు 30 మంది ఈ ముద్రణాశాలలో పనిచేస్తున్నారు.

ఈ ప్రెస్ ఇంతగా అభివృద్ధి చెందడానికు ముఖ్యకారకులు మిస్ ఒ. రాజర్స్‌గారు. 10.9.83న వారు భారత దేశంలోని మిషనెరీ సేవను విరమించుకున్నారు.

ఈ సంస్థకు మిస్. ఒ. రాజర్స్ చైర్‌పర్‌సన్, శ్రీ. కె. విల్సన్ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్, ఎస్.ఎ. డేనియల్, బి. థియొడోర్, మోజెస్ సికిలే, వి.యం. అబ్రహాము, ఎం. షేషాక్ ప్రభృతులు ప్రస్తుతం డైరెక్టర్లుగా కొనసాగుతున్నారు.

## యౌవన స్త్రీల బైబిల్ పాఠశాల.

మిస్ రాజర్స్‌గారు 1949 నవంబరులో, చెట్టిపేట బాలికల పాఠశాల చూడ్డానికీ, మిస్ హార్డింగు బాలికల హాస్టలు చూడ్డానికీ భారతదేశం వచ్చారు.

ఈ స్కూలు 1958లో ప్రభుత్వానికి అప్పగించబడింది. కానీ మిస్ హార్డింగ్‌గారుమాత్రం నేటికీ 'హెబ్రోన్' బాలికల హాస్టల్‌ను అజమాయిషి చేస్తూనే వున్నారు. ఈ సేవలో వీరికి ఆదినుంచీ ఆనందం, దేవదానం, మరియమ్మగార్లు సహాయం చేస్తున్నారు. ఇప్పుడు శ్రీమతి సి. నవీనాగారు హాస్టలు ఆర్థిక వ్యవహారాలు చూస్తూ మిస్ హార్డింగ్‌గారికి సహాయం చేస్తున్నారు. హాస్టలు పనిమాత్రమేగాక వీరు చెట్టిపేట సంఘాల్లో స్త్రీల పరిచర్య, సండేస్కూలు సేవ, వి.బి.యస్.లుకూడా జరిపిస్తూ, ఈ సేవల్ని విశేషంగా ప్రోత్సహిస్తున్నారు.

చెట్టిపేట బాలికల స్కూలు మూసివేసాక మిస్ రాజర్స్‌గారికి సరిపడినంత పని లేకపోయింది. అంచేత కొంతకాలం కొయ్యలగూడెం ఫీల్డు సంఘాలమధ్య సేవ చూడ్డానికీ, తరువాత చాగల్లు ప్రెస్ పని చూడ్డానికి వెళ్ళారు.

1963లో యువన స్త్రీలకు ఒక బైబిలు స్కూలు స్థాపించాలనే అభిప్రాయంలోనికి కలిగి నరసాపురంకు మకాం మార్చి కీ.శే. వి. భగవాన్ రాజుగారి

యిల్లుకొని అందులో కాపురంవుంటూ డెల్టా సంఘాల్లోని యవ్వన స్త్రీలకు సంవత్సరానికి ఆరు నెలలు బైబిల్ స్కూలు నడిపించారు. సెప్టెంబరు ఏప్రిల్ వరకు ప్రతీయేడూ దీన్ని నడిపేవారు. కారణం మార్చిలో పరీక్షతప్పి సెప్టెంబరుకు కూర్చున్నవారు మళ్ళీ జూన్ నెల వరకు యింటివద్ద ఖాళీగా వుండకుండా బైబిలు నేర్చుకునేందుకు వీలుగా దీన్ని స్థాపించారు. ఆలాగే చదువుపూర్తయి ఏ ఉద్యోగం లేకుండా ఖాళీగా వున్నవారుకూడా ఈ స్కూల్లో వాక్యం నేర్చుకోడానకు అవకాశం కల్పించారు. ఈవిధంగా ఎంతోమంది యవ్వన స్త్రీలు 6నెలలు క్రమబద్ధంగా ఈ బైబిలు స్కూల్లో వాక్యం నేర్చుకుని యిప్పుడు వారు ఎక్కడున్నా ప్రభువుకు సాక్ష్యార్థంగా జీవిస్తున్నారు.

మిస్ టిల్స్లీ, డా. హోల్ట్, ఎస్. వనమరాజు, ఒ.యం. ప్రసాదరావు దంపతులు, గెద్దాడ సేంబాబు దంపతులు తదితరులు ఈ స్కూల్లో ఉపాధ్యాయులుగా మిస్ రాజర్స్‌తో కలిసి పనిచేశారు.

1977లో వీరు హైద్రాబాదుకు మకాం మార్చేవరకు ఈ సేవ చేస్తూనే వున్నారు. ఆ తరువాత కళాశాల విద్యార్థులమధ్య సేవలో విశేషంగా నిమగ్నమై ఈ సేవకు ఎంతో చేయూత నిచ్చారు.

ఇప్పుడు వీరు మిషనెరీ సేవనుండి రిటైరై ఇంగ్లండ్‌లో యువతి యువకులమధ్య, సంఘాల్లో స్త్రీల మధ్య గణనీయమైన సేవ చేస్తున్నారు.

## గోదావరి డెల్టా బైబిల్ స్కూలు.

ఇటీవలి కాలంలో అందరికీ కొట్టవచ్చినట్టు కనిపించేలోటు, మన సంఘాలలో బైబిలు టీచర్లకు ఏర్పడిన కొరత. మన సంఘాలు గొప్ప బైబిలు టీచర్లను తరం వెంబడి తరం వుత్పత్తి చేశాయ్. బైబిల్ పరిజ్ఞానంలో మన సంఘవిశ్వాసులు గొప్ప పేరు సంపాదించుకున్నారు. మన సంఘాలలో ఇప్పుడు బైబిలు టీచింగ్ కొరతగా వుంది.

ఈ కొరతను తీర్చడానికే మన సంఘాలకు ఒక బైబిలు స్కూలు వుంటే మంచిదనే అభిప్రాయం కలిగింది. ఆస్ట్రేలియానుండి మిషనెరీగా వచ్చిన లిల్లీగారు 1979లో స్వదేశానికి వెళ్ళిపోతూ ది. 30.4.1979

తేదీన నరసాపురం బేతనీ ఆలయంలో జరిగిన ఎజిడిఎంఎ ఎగ్జిక్యుటివ్ కమిటీతో, గోదావరి డెల్టా సంఘాల తరపున ఒక బైబిలు స్కూలు ఆవశ్యకతను నిర్ధారించారు. నేటి యువకులే రేపటి సంఘనాయకులు గనుక వారికి సంఘ సేవలో, సువార్త సేవలో శిక్షణనియ్యడం అనేది ఈ స్కూలు లక్ష్యం.

ఈ స్కూలును నర్సాపురంలో మిషనెరీ నేస్మితుగారి బ్యాలా బంగళాలో ఏర్పాటు చేయించారు. కీ.శే. జి. సెంబాబుగారు ప్రిన్సిపాల్‌గా జి. సెంకుమార్‌గారు టీచరుగా నియమితులయ్యారు. సంవత్సరానికి రెండు సార్లు, ప్రతిసారి నాల్గు నెలల చొప్పున ఈ బైబిలు స్కూలును నడిపించాలి. సంవత్సరానికి నాల్గు నెలలు ఈ స్కూల్లోని యిద్దరు టీచర్లూ సంఘాల్లో తిరిగి స్కూలు నిర్వహణకు నిధులు సేకరించాలి. విద్యార్థుల్ని ఎంపిక చేసుకోవాలి. విద్యార్థులు నెంకు భోజనం, వసతికిగాను కట్టవలసిన రు. 60—ల్లో రు. 30—లు విద్యార్థులు కట్టాలి. మన సంఘాలు రు. 30—లు కట్టాలని తీర్మానము. ఉపాధ్యాయులిద్దరికీ ఆస్ట్రేలియా సంఘాలు (జి.ఎల్.ఒ) క్రమంగా జీతాలు యివ్వడానికి లిల్లీగారు ఏర్పాటు చేశారు. స్కూలుకు, హాస్టలుకు కావాల్సిన వస్తు సామాగ్రి, ఈ స్కూలు ఆరంభానికి అవసరమైన నిధులు లిల్లీగారే సమకూర్చారు.

ఈ స్కూలుకు ఒక కమిటీని ఏర్పాటు చేశారు. శ్రీ. సి. జ్ఞాన ప్రకాశరావుగారు చైర్మన్, డా.సి.ఆర్. ప్రభాకర్‌గారు కోశాధికారి, శ్రీ. కె. విల్సన్‌గారు కార్యదర్శి, శ్రీ. జి. సెంబాబుగారు ప్రిన్సిపాల్, శ్రీయుతులు కె.ఎస్. జాక్సన్‌గారు, టి.కె.జార్జి, బి. కృపానందం, ఒ.ఎం. ప్రసాదరావు, ఎం. లూథర్‌కుమార్‌గార్లు సభ్యులు.

ఈ స్కూలు తన లక్ష్యాల మేరకు ఎందరో యువకుల్ని యిప్పటికి తర్ఫీదు చేసింది. అయితే ఆరంభంనుండి బాలుర పోషణకు సంఘాలనుండి అనుకున్నట్టుగా నిధులు సమకూడక ఆర్థిక ఒడుదుడుకులకులోనై కష్టంగా కొనసాగుతోంది. 1981లో శ్రీ. జి. సెంబాబుగారి అకాల మరణం ఈ స్కూలు పరిచర్యకు తీరని దెబ్బతీసింది. తరువాత కొంతకాలానికి నరసాపురం బేతనీ ఆలయం రెండుగా చీలిపోవడంతో శ్రీ.బి. కృపానందం, శ్రీ.ఎం.లూథర్

కుమార్‌గార్లు తమ సభ్యత్వానికి రాజీనామా చేశారు. అసలే కష్టాల కడలిని ఈదుకొస్తున్న ఈ స్కూలుకు ఈ పరిస్థితులు తోడైనాయి.

ప్రస్తుతం జి. సేంకుమార్‌గారు ప్రిన్సిపాల్‌గాను, డి. సుగుణరావు గారు టీచరుగాను పనిచేస్తున్నారు. వీరికి మన సంఘాల ప్రోత్సాహం ఎంతో కావాల్సివుంది.

## సంపూర్ణకాల సువార్తికులు

జి.డి.యం. సంఘాలు ఆధ్యాత్మికంగా వున్నత శిఖరాల్ని అధిరోహించినా, దాతృత్వంలో చాల వెనకబడివున్నాయని విచారంతో చెప్పాల్సి వుంది. తద్వార సంఘాల పోషణమీద నమ్మకంగా పనిచేస్తున్న 100–150మంది సువార్తికుల పరిస్థితి అయోమయంగావుంది. చాలామంది సేవకులు ఆకలితో, అర్ధాకలితో, అనారోగ్యంతో, చినిగిన వస్త్రాలతో అలానే తమ సేవను కొనసాగిస్తున్నారు.

దేవుడు పిలిచిన వాణ్ణి ఆయనే తప్పకుండా పోషిస్తాడు అనే సిద్ధాంతం వల్ల ఈ సేవకులు తమ అక్కరలు ప్రభువుకే చెప్పుకోవాలిగాని వ్యక్తులకు చెప్పరాదు. అథవా చెప్పినా అది పొరబాటుక్రింద లెక్కించబడుతుంది. విశ్వాసులు మావైపు చూడకండి, దేవునివైపు చూడండి, మీకోసం ప్రార్థిస్తాం అని తప్పించుకోనూవచ్చు. ఈ ఆర్థిక యిబ్బందుల్ని ఆట్టే సహించుకోలేక ఫుల్‌టైమ్ యాచక వృత్తిని చేపటిన సేవకులూ లేకపోలేదు. అయితే ఈ సేవకుల పోషణ బాధ్యతను అందరూ స్వీకరించక పోవడంచేత సేవకుల పరిస్థితి దయనీయంగా వుంది.

గృహదర్శనాలు, యింటింటికి సువార్త, క్రైస్తవ వాఙ్మయాన్ని పంపిణీచేయడం, వీధి ప్రసంగాలు, తీర్థాల్లో సువార్త చెప్పడం, సుదూర ప్రాంతాలకు సైకిళ్ళమీద బృందంగావెళ్ళి అక్కడ గ్రామాల్లో సువార్త చెప్పడం వీరి సేవలో ముఖ్యమైన కొన్ని.

కొందరు సేవకులు తరచూ పర్యటిస్తూ స్థానిక సంఘాన్ని నిర్లక్ష్యం చేస్తున్నందున స్థానిక సంఘాలు వారిని గూర్చిన బాధ్యతను జారవిడుచుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోందన్న వో అభిప్రాయం వుండనేవుంది.

మన సంఘాలు ఏభై శాతం నిరుపేద సంఘాలు. అంచేతే ఈ ఆర్థిక దుస్థితి ఏర్పడింది అంటారు కొందరు. అది సరైన జవాబుకాదు. దేవుని సేవకు యివ్వడంలో బీద గొప్ప అనే తేడాయేలేదు. 1936 సంవత్సరం నాటికి మన సంఘ విశ్వాసుల సంఖ్య 10,000 అని కీ.శే. బ్రాష్లీగారు చెప్పారు. ఇప్పుడు కనీసం అది 30,000-50,000 మధ్య వుండొచ్చు. వీరంతా కూలీమీదే బ్రతుకుతున్నారు అనుకొందాం. ఇప్పుడు వ్యవసాయ కూలీలకు రు. 15–20 వరకు కూలి ముట్టుతోంది. వీరు రోజుకు 25 పైసలు ప్రభువు సేవకిస్తే నెలకు రు.7-50 అవుతుంది. 7.50×30,000=22,5000- వసూలౌతుంది. మన సంఘాల్లో భూస్వాములు, వ్యాపారవేత్తలు, విద్యావేత్తలు ఉద్యోగులు, యితర దేశాల్లో వున్నతోద్యోగాల్లోవున్నవాళ్ళు కోకొల్లలు. వీరంతావుదారంగా యిస్తే నెలకు కనీసం రు. 50,000 వసూలౌతుంది. కాని యివ్వడంలో క్రమశిక్షణలేదు. సేకరణ, పంపిణీలు చేయడానికి సరైన యంత్రాంగంలేదు. కార్యసాధకమైన యంత్రాంగంలేకే మన సంఘాలలో పనిచేస్తున్న మన సేవకుల్ని పస్తులు పడుకోబెడుతున్నాం. ఈ 150 సంవత్సరాల కాలంలో చేసిన పొరబాటును యిప్పుడు మన సంఘాలు సవరించుకొంటాయని ఆశిద్దాం.

## యూత్ గాస్పెల్ టీమ్.

నరసాపురంలో ఆయా ఉద్యోగాలు చేసుకొంటున్న కొందరు విశ్వాసులు తమ ఆదాయంలో కొంత ప్రతీనెలా క్రమంగా యిస్తూ 'యూత్ గాస్పెల్ టీమ్'గా రూపొందారు. వీరు ఆంధ్రలో అనేకచోట్ల పర్యటనచేసి, తమ ఖర్చు తామే భరించి గొప్ప సేవ చేశారు. ఈ బృందంలో ముఖ్యులు సి. మలాకీ, బి. ప్రకాశం, బి. కృపానందం, డి. సుందర్రావు, డి. రాజారావు, టి. పెంటయ్య, వి. మోజెస్, డి. ఆరోను, డి. యోహాను, కె. జోసెఫ్ గార్లు. నర్సాపురం బేతనీ సంఘంలో చీలిక రావడంతో ఈ టీముకూడా రెండు ముక్కలైంది. అయినా ఎవరిమట్టుకువారు గొప్ప సేవ సంఘాల మధ్య, గ్రామాదుల్లో చేస్తున్నారు. వీరు ఎక్కువగా యింటింటి సువార్త, తీర్థాల్లో సువార్త ప్రకటనను, బహిరంగ సమావేశాల్ని జరిపిస్తుంటారు.

## పాపికొండల్లో సేవ.

పాపికొండల ప్రాంతం ఎత్తయిన కొండలు, దట్టమైన అడవులు భయంకరమైన లోయలు, క్రూరజంతువులతో నిండియుంది. ఇక్కడ కొండరెడ్లు, కోయదొరలు, కమ్మర్లు అనే మూడు జాతులవాళ్ళు నివసిస్తారు. కొండదేవతలను పూజించి, వీరి దేవతలకు బలులు (ఒకోసారి నరబలులుకూడా) అర్పిస్తారు. వీరు చాల అనాగరికులు. జొన్న, కొర్ర, గంటిజావలు, చింతగింజల జావ, జీలిగిచెట్టుచెక్క జావ, పుట్టకొక్కులు, ఆకుకూరలు వీరి ప్రధాన ఆహారం.

ఇక్కడ వైద్యశాలలు, వైద్యులు, రహదారులు ఏమీలేవు. ఎక్కడికైనా నదిమీదగాని, కాలినడకనగాని వెళ్ళాల్సిందే. వీరి భాష కోయ భాష. తెలుగు కూడా యాసగా మాట్లాడుతారు. విల్లు, అలుగులు, చేతికత్తి వీరి ప్రధాన ఆయుధాలు.

నాకరిక ప్రపంచానికి దూరంగావున్న ఈ ప్రాంతాన్ని మన ఆది మిషనెరీలు, హీలిస్, బొడెన్‌లు దర్శించి సువార్త చెప్పారు. వాసా యోహాను అలీసాహెబ్ ఫ్రాన్సిస్ అనే మన పూర్వీకులు చాలసార్లు యిక్కడ సువార్త దండయాత్రలు జరిపారు.

అయితే కొయ్యలగూడెంలో ఆజ్‌బోర్న్‌గారు మిషనెరీగా వుంటున్నప్పుడు పాపికొండల సేవను మళ్ళీ పునఃప్రారంభం చేశారు. వో పెద్ద సేవకుల బృందంతో ఆయన ఈ ప్రాంతంలో చాల దినాలు మకాంవేసి సేవ చేశారు. సువార్త ప్రకటించారు.

1960 సంవత్సరంలో డి. కేసవరం దైవసేవకులు గొల్లపల్లి యాకోబుగారు, పదిమంది సేవకులతో, ఆజ్‌బోర్న్‌గారి ప్రోత్సాహంతో సేవార్థమై కొయ్యలగూడెంనుండి కన్నాపురం మీదుగా గడ్డపల్లివచ్చి ఆ పరిసర గ్రామాల్లో సువార్త ప్రకటించి కలపలారిమీద తిరిగివస్తూ కొరుటూరు దగ్గర ఎత్తయిన కొండమీదినుండి లారీ బోల్తాపడి ఆ ప్రమాదంలో ఆయన తలకు బలమైన గాయాలు తగిలి మరణించారు. పలువురు తీవ్రమైన గాయాలతో మిగిలారు.

1960లోనే మళ్ళీ నరసాపురానికి చెందిన సి. మలాకీగారి బృందం,

చాగల్లు ప్రాంతానికి చెందిన ఎస్. జోసెఫ్‌గారి బృందం ఈ ఆదివాసులకు రక్షణ సువార్తను ప్రకటించారు.

1961 సంవత్సరంలో పాపికొండలసేవకు మిషనెరీలను పంపడం అన్నది తెలుగు కాన్ఫరెన్స్ ప్రధానాంశం అయ్యింది. కీ.శే. సహో. సి. జాన్ గారు (డిగమర్రు) సహో. యం. రత్నకుమార్‌రాజుగారు (గొల్లెపరచెరువు) ఈ ప్రాంతపు సేవకు సమర్పించుకున్నారు. ఈ రెండు కుటుంబాలు శివగిరిలో మాదాసు వెంకన్నగారి యింట్లో మకాంవుండి రెండేళ్ళు సేవ చేశారు. వీరిక్కడ సేవచేస్తున్న సమయంలో డా. షెర్మ్ దంపతులు ఈ ప్రాంతాన్ని దర్శించి, సువార్త ప్రకటించి వెళ్ళారు. అయితే 1963లో కారణాంతరాలవల్ల సి. జాన్‌గారు ఈ సేవను విరమించుకున్నారు. ఆ కాళీని డి. కేసవరం నుండి వచ్చిన పి. సామ్యుయేలుగారువచ్చి భర్తీ చేశారు. వీరు, రత్నకుమార్‌రాజుగారు కలిసి మూడు సంవత్సరాలు సేవ చేశారు. అప్పుడే వీరు కొరుటూరులోను, శివగిరిలోను సంఘమును స్థాపించి, మందిరం కట్టారు. అలాగే టేకూరులోను, నది అవతలనున్న కొండమొదలులోనూ సంఘాలు స్థాపించారు. వీరు నదిని ఆనుకొనియున్న గ్రామాలు దర్శించ డానకు ఒక పడవ అవసరం అని కోరగా తెలుగు కాన్ఫరెన్స్ వీరికి ఒక పడవను సమకూర్చింది. దీనిమీద వెళ్ళి వీరు ఆయా గ్రామాల్లో మంచి సేవచేశారు.

1965 సం.లో సహో. యం. రత్నకుమార్‌గారు ఈ సేవను విరమించుకొని ఉపాధ్యాయవృత్తికి వెళ్ళిపోయారు. అప్పుడు కొయ్యలగూడెం నుండి మిస్ ఒ. రాజర్స్, మిస్. వైట్ గార్లు, ప్రత్తిపాడు నుండి డ్రౌన్ దంపతులు, నరసాపురంనుండి బర్ట్ దంపతులు వచ్చి ఈ ప్రాంతంలో పర్యటించారు.

1966లో రత్నకుమార్‌రాజుగారు వదలివెళ్ళిన కాళీని భర్తీ చేయు చేయుడానకు నరసాపురంతాలూకా "ఎలమంచిలి" సంఘం నుంచి సహో. టి. భాస్కరరావుగార్ని కొరుటూరుకు పంపారు. ఆ సంవత్సరంలోనే రాజమండ్రినుంచి ఆర్.జి. జర్మన్‌గారు సహో. పి. సత్యానందంగార్ని శివగిరికి పంపించారు. కాని ఆరుమాసాల్లోనే వీరి ఆరోగ్యం క్షీణించి సేవ విరమించారు. ఆ వెంటనే సహో. టి. భాస్కరరావుగారుకూడా కొరుటూరు సేవను వదలి వెళ్ళారు. సహో. పి. సామ్యుయేలుగారుమాత్రం భార్య,

పిల్లలతో ఒంటరిగా సేవచేస్తుండగా మిస్ హేంప్టన్, మిస్ టేలర్లు ఈ ప్రాంతాన్ని దర్శించి వెళ్ళారు.

నరసాపురం బేతనీ ఆలయం పక్షంగా సహో. టి.ఇ. మనోహరంగారు తరచూ తను బృందంతో ఈ ప్రాంతాన్ని దర్శించి సువార్త ప్రకటించడం ఆరంభించారు. 1967 సంవత్సరంలో వీరితో యిక్కడ సేవ చేయడానకు సహో. ఎస్. యూనియాగారు వచ్చారు. ఆ బృందం అంతా అక్కడి సేవకోసం, సేవకులకోసం ఆవేదనతో ప్రార్థించుచుండగా దేవుని ఆత్మ సహో. యూనియాగార్ని ప్రేరేపించింది. 1968లో తెలుగు కాన్ఫరెన్స్ ప్రోత్సాహంతో, అప్పటి అధ్యక్షులు, కీ.శే. సి.కె. థామస్‌గారి సహకారంతో సహో. ఎస్. యూనియాగారు, వీరి భార్య ఉద్యోగాలకు రాజీనామాచేసి పాపికొండల సేవకు కుటుంబసమేతంగా సమర్పించుకున్నారు. సహో. సి. సముయేలుగార్లు, సహో. ఎస్. యూనియాగార్లు ఒకరికొకరుచేదోడు వాదోడుగా మూడు సంవత్సరాలు సేవచేసి కొరుటూరు, శివగిరి, కొండమొదలు టేకూరులోని సంఘాల్ని బలపరిచారు. నూతనంగా ఆవలనున్న సోమలపాడు, నడిపూరు, కతనపెల్లి, మెట్టగూడెం, పెద్దగుడెం, కొక్కిరిగుడెం, తాడివాడ, తాళ్ళూరు, యివతలనున్న తెల్లదిబ్బలు, చిరవాక, చీడూరు, బొర్నగొంది, మొదలగు గ్రామాల్ని సొంతపడవలో దర్శించి సువార్త ప్రకటించారు.

1970లో సహో. సి. సముయేలుగారు ఆరోగ్యకారణాలవల్ల, కుటుంబ సమస్యలవల్ల ఈ సేవను విరమించుకోవాల్సి వచ్చింది. వీరిని మలేరియా జ్వరం భయంకరంగా పీడించసాగింది. భార్య జమాయమ్మకు గుండె బలహీనత, 5వ.ఏట పెద్దకుమారుని మరణం యివి ఈ నిర్ణయానికి నడిపించాయి.

1970నుండి 1973 వరకూ సహో. యూనియా కుటుంబం ఒంటరిగా ఈ అడవిలో సేవచేసింది. ఈ కాలంలో మిస్ బి.జె.సి.టిల్‌స్లీ నరసాపురం, మిస్ హార్డింగ్, నిడదవోలు, మిస్ ఐ. బర్నాడ్, చాగల్లు, ఎ.జె. లిల్లీ దంపతులు, నరసాపురం వీరు ఈ ప్రాంతాన్ని దర్శించారు. తెలుగు కాన్ఫరెన్స్‌వారు, వారు సమకూర్చిన పడవ బాగా పాడైపోగా దానికి మరమతులు చేసి అమ్మివేశారు.

1973లో తెలుగు కాన్ఫరెన్స్‌వారు, దాని అధ్యక్షులు కీ.శే. సి.కె. థామస్‌గారు పి. పోలవరం సంఘాన్నుండి సహో. సి.హెచ్. దేవదానంగారిని సహో. యూనియాగారికి తోడుగా పంపించారు. వీరు కుటుంబ సమేతంగా టేకూరుతో ఇల్లు కట్టుకొని మందిరం నిర్మించి పరిసర గ్రామాల్లో సేవ ఆరంభించారు. 1974లో వీరి భార్య ఎమేల్యమ్మకు విషజ్వరంవచ్చి, నర్సాపురం స్త్రీల ఆస్పత్రికి తరలించగా, అక్కడ ఆమె అకాల మరణం చెందింది. సహో. దేవదానంగారు అధైర్యపడక, ఆత్మబలంతో ఈ ప్రాంతీయ సేవను కొనసాగిస్తూ, సేవలో చేదోడువాదోడుగా వుండటంకోసం 1975లో మరో సోదరిని పెండ్లిచేసికొని ఇక్కడ మంచి సేవచేస్తున్నారు.

చాగల్లు ప్రాంతానికి చెందిన ధర్మవరం సంఘ సేవకుడు. సహో. కె. తాతారావుగారుకూడా రెడ్డిపోలవరంలోని కోండ్రుకోట, తెల్లవరం తోటగొందు ఉడతపెల్లి, సూదాపురం యిత్యాది గ్రామాల్లోని కోయ ప్రజలమధ్య పై యిద్దరు సోదరులతో కలిసి గొప్ప సేవచేసి సంఘాలు కట్టారు. ఈ పాపికొండల ప్రాంతీయ సంఘాల సభ్యుల సంఖ్య పురుషులు 50, స్త్రీలు 100, పిల్లలు 200. (1980 సం. లెక్కల ఆధారంగా)

# 21

# ఆదిసంఘాలు - నర్సాపురం ఫీల్డు

ఈ అర శతాబ్దిలో ఈ ఫీల్డులో దాదాపు 80 మందికి పైగా మిషనెరీలు ఉండి పనిచేసారు. వీరిలో అధికశాతం నర్సాపురం మిషన్ ఆస్పత్రి, బేతెస్థ కుష్టురోగుల ఆస్పత్రిల్లో పనిచేసినవారే. పైగా బర్టుగారు, షోర్టు గారు, లిల్లీగారు తదితరులు తప్ప దాదాపు అందరూ ''మిసమ్మ''లే. వివాహం మాని సంపూర్ణంగా ఇండియాలో సేవకని తమ జీవితాలను క్రీస్తునాథునికోసం సమర్పించుకున్న స్త్రీలు. అవివాహితులే.

వీరిలో చాలామంది గురించి సంస్థల విషయం ప్రస్తావించినప్పుడు తెలుసుకున్నాం.

లాడ్జిలో హేరిస్ చాలా యేళ్ళు కాపురముండి దాన్ని తన మేనగోడలు లినోరా డిబ్రాస్‌కి వదిలి చనిపోయాడు. ఈమె బహుశా చార్లెట్ హెలీనాల సోదరుని కుమార్తె అయిఉండవచ్చు. ఈమె లాడ్జిలో నివసించేది. ఈమె పోషణాభారాన్ని నర్సాపురం మిషనెరీలే చూసుకోవాలని తీర్మానం జరిగింది. కారణాంతరాలవల్ల లాడ్జి ఆవరణలో కొంతభాగం అన్యుల పరమైంది. మిగతాదికూడా పరుల హస్తగతం కాకముందే మిస్ హేమ్టన్, డాక్టర్ ప్రింగ్‌లు చొరవ తీసుకుని లాడ్జిని తమ హస్తగతం చేసుకున్నారు. మిస్ డి. బ్రాస్ పోషణా బాధ్యతను తాము తీసుకున్నారు.

అంతకుముందు మిస్ ప్రింగ్, మిస్ మోర్గన్‌లు ప్రస్తుతం స్టేషన్‌కి వెళ్లే దారిలో చిన్న బ్రిడ్జి దగ్గర మూలన ఉన్న భవనంలో నివసించేవారు. మిస్. మోర్గన్ మిషన్ ఆస్పత్రి దగ్గర బంగళా నిర్మించుకుని దాన్లోకి వెళ్ళిపోయింది. అటుతరువాత దీన్ని పురుషుల ఆస్పత్రికి ఇచ్చేసింది. మిస్ ప్రింగ్ లాడ్జిలోకి తమ నివాసం మార్చుకుంది.

ప్రత్యేకించి ఈ అర్ధశతాబ్దిలో నర్సాపురం సేవపై తమ వ్యక్తిగత ప్రభావం చూపిన మిషనెరీలు ఇద్దరిని చెప్పుకోవచ్చు. వీరు డేవిడ్ బర్ట్సు, డాక్టరు ఎడ్వర్డు ఎస్. షార్టుగార్లు.

డేవిడ్ బి. బర్ట్సు, 1934లో న్యూజీలాండు నుండి ఇండియా వచ్చి జెంగుళూరు క్లారెన్స్ హైస్కూలు ప్రిన్సిపాల్‌గా పనిచేసారు. వీరు తమ పోషణార్థం మిషనెరీ సొసైటీలనుండి ధనసహాయం పొందని మిషనెరీల కోవకి చెందినవారు.*ఈ ప్రత్యేక తరగతి మిషనెరీలు ఎవరంటే ఉపాధ్యాయులు ఇతర వృత్తివిద్య నేర్చినవారు, మెకానిక్కులు. వీరు సేవకు సమర్పించుకుని ఇతర దేశాలకువెళ్ళి అందరు మిషనెరీల్లాగానే సేవచేసినవారు. అయితే తమ జీవనోపాధికి కావలసిన ధనాన్ని తామే సమకూర్చుకుంటారు.

బర్ట్సుగారు, ఫెయిర్‌గారు ఒకే సమయంలో నర్సాపురంవచ్చి కేజిల్‌లో శ్రీమతి చార్లెస్ బీరు సంరక్షణక్రింద ఉండి తెలుగు నేర్చుకున్నారు.

1937లో బర్ట్సుగారు గోదావరి ప్రాంతానికి తరలివచ్చి నేస్మిత్‌గారికి పరిసరగ్రామాల సువార్తీకరణలోనూ, స్కూళ్ళ అజమాయిషీలోనూ సహాయపడ్డారు. తెలుగు నేర్చుకుని సంఘాల్లో వాక్యబోధ చేసారు. సంవత్సరానికోసారి వారు నిర్వహించిన 5 రోజుల బైబిలు తరగతులకు 200మంది హాజరయ్యేవారు. బర్ట్సుగారు స్థానిక సేవకులతో కలిసి గ్రామాల్లోనూ, అంతర్వేది మొదలైన ఉత్సవాల్లోనూ సువార్త సేవకు వెళ్ళేవారు. సైకిల్ మీద తిరిగేవారు. వోసారి ఐదు వారాలపాటు టిల్స్లీగారితో కలిసి హవుస్ బోటులో 40 గ్రామాలు తిరిగారు. 1943లో ఒక సంవత్సరంపాటు ఒక హవుస్‌బోటును అద్దెకు తీసుకుని తూర్పుగోదావరి నర్సాపురం ప్రాంతాల్లో సువార్త ప్రకటిస్తూ సంఘాలను దర్శిస్తూ తిరిగారు.

డిసెంబరు 15, 1943లో మిస్ కేథరిన్ ను వివాహమాడి నర్సాపురంలో కాపురం పెట్టారు. రెండవ ప్రపంచయుద్ధం ముగించిన వెంటనే చాలామంది మిషనెరీలు సెలవులకు స్వదేశం వెళ్ళడంవల్ల బర్ట్సుగారికి ఊపిరి సలపనంత పనిభారం నెత్తినబడింది. 30 సంఘాల క్షేమాన్ని చూసుకోవాలి, 30 గ్రామీణ ఎలిమెంటరీ స్కూళ్ళ యాజమాన్యాన్ని

*In His Name, L.A. Marsh. GPH Society Ltd. 1974.

నిర్వహించాలి. ఒక బోర్డింగు హాస్టలు బాధ్యత చూడాలి. ఈ సమయంలో మిషన్ సెకండరీ స్కూలుకు పింజర్ల ఆనందరాజుగారిని హెడ్మాస్టరుగా నియమించినందువల్ల అసెంబ్లీల పని మరింత శ్రద్ధగా చూసుకోవడానికి సమయం చిక్కింది. 1949లో బర్టు దంపతులు కొంతకాలం కొయ్యలగూడెంలో ఉన్నారు. 1950లో తిరిగి వచ్చి నేస్మిత్‌గారినుంచి సెకండరీ స్కూలు అజమాయిషిని పూర్తిగా పుచ్చుకున్నారు. బర్టు సతి బాలుర బోర్డింగును నడిపించింది. అప్పటికి దీన్లో 50 మంది బాలురు ఉన్నారు.

1953లో మళ్ళీ స్కూలు వ్యవహారాలనుండి తప్పుకుని ఎడ్వర్డు షార్టుగార్కి లెప్రసీ ఆస్పత్రిలో కొంత సహాయం చేసారు బర్టుగారు. 5 ప్రాంతాల్లో వరసగా నాలుగు రోజుల బైబిలు తరగతులను నిర్వహించారు. ఇది 1954 అంతా సాగింది. 1957లో డాక్టరు షార్టుగారు సెలవులకు వెళ్ళిన సమయంలో బర్టుగారు లెప్రసీ ఆస్పత్రి యాజమాన్యం చేపట్టారు. 1960లో గ్రామీణ ఎలిమెంటరీ స్కూళ్ళ నిర్వహణ అంతా ప్రభుత్వపరం చెయ్యడం జరిగింది. ఈ స్కూళ్ళను బర్టుగారు నిర్వహించే సమయంలో కొడమంచిలి విల్సన్, చదలవాడ మలాకీ, దుద్దే సత్యానందం తదితరులు వీరికి సహాయంగా ఉన్నారు.

బర్టుగారు 1960 నుండి 1965 దాకా ఎమ్మాయు బైబిల్ కరస్పాండెన్సు కోర్సులను స్థాపించి 1965 దాకా నిర్వహించి, అభివృద్ధిలోకి తీసుకు వచ్చారు. 1965లో 4000 మంది కొత్తగా ఈ కోర్సులో చేరడంవల్ల దీనికి ఫుల్‌టైమ్ సేవకులు అవసరమైంది. దీనికి దుద్దే సత్యానందంగారు సహాయపడ్డారు.

డేవిడ్ జె. డ్రౌను 1959లో నర్సాపురంవచ్చి తెలుగు నేర్చుకుని గ్రామీణప్రాంతాల్లోను, అంతర్వేది తీర్థంలోను సువార్త ప్రకటించారు. 1961లో కొయ్యలగూడెంవెళ్ళి ఆస్‌బోర్న్‌గారికి సహాయం చేసారు. 1962లో వీరికి వివాహమైంది. నర్సాపురం తిరిగివచ్చి హైస్కూలుకు అనుబంధంగాఉన్న హాస్టలును కొంతకాలం నడిపారు. బేతని ఆలయంలో జరిగిన బైబిలు తరగతులలో బోధించారు. ఆటుతరువాత సంఘపెద్దలు

పరిచారకులకు జరిగిన బైబిలు తరగతుల్లో బోధించారు. 1963లో బర్టు గారికి లిలీ హాస్టలు బాధ్యతనప్పగించి ప్రత్తిపాడు వెళ్ళిపోయారు. తరువాత 1966లో సెలవునుండి తిరిగివచ్చి ఎమ్మాయి బైబిలు కరస్పాండెన్స్‌కోర్సుల పనిని చేపట్టారు.

ప్రత్తిపాడులోని బైబిలు స్కూలును క్రేనుగారు కొంతకాలం నడిపాక డీసీ వ్రద్దేవుపల్లికి తరలించడం జరిగింది. ఆ తరువాత దాన్ని చెట్టిపేటకు తరలించారు.

వ్రద్దేవుపల్లిలోని వైట్‌హవుస్ బైబిలు స్కూలును బర్టుగారు చేపట్టి కొంతకాలం నడిపారు. బర్టుగారు 1973లో 'టాస్మేనియాకు' వెళ్ళి వృద్ధాప్యంలోకూడా సేవచేస్తున్నారు.

డాక్టరు ఎడ్వర్డ్ షార్టు డాక్టర్ మిస్ ప్రింగ్‌గారి మరణానికి ఒక నెల ముందు నర్సాపురం చేరుకున్నారు. తెలుగు నేర్చుకుంటూనే లెప్రసీ ఆసుపత్రి బాధ్యతను స్వీకరించారు. వీరి సేవా విశేషాల గురించి సంస్థల విషయం రాసిన అధ్యాయంలో ప్రస్తావించాము. 1953లో మెక్రేగర్‌గారిచే స్థాపించబడిన 'లివింగ్ వాటర్స్' రేడియో ప్రసారాలలో భాగంగా షార్టుగారు తెలుగు ప్రసారాలను నర్సాపురంలో ఆరంభించారు. లాడ్జిలోని తన కాంపౌండులో ఒక స్టుడియోను నిర్మించి స్థానికుల సహాయంతో వీటిని నిర్వహించారు. తుంపిరి జోన్సు సిద్ధీగారు, తదనంతరం తవిటికి జార్జిగారు ఈ సేవను చేపట్టారు. 1978లో షార్టుగారు స్వదేశానికి వెళ్ళిపోగా జెన్ వాకీగారు లెప్రసీ ఆస్పత్రి బాధ్యతను స్వీకరించారు.

షార్టు సతి మేరీ షార్టుగారు తమ బంగళా ''లాడ్జి''లో హైందవ బాలబాలికలకు పెద్ద సండేస్కూలు నడిపేవారు. దీనిలో కె. విల్సన్ డి. సత్యానందం, కె. వోబన్న, బి. మోషే, మిస్ టిల్‌స్లీ, పి. సంతోషం, జి. సుగుణ, రాజ్యలక్ష్మి, బి. అన్నమ్మగార్లు తదితరులు సహాయపడ్డారు. అలాగే హైందవ బాలికలకోసం నిర్వహించిన 'బాలికల రేలీ'లో శ్రీమతులు జేష్ఠిక నందనం, కెప్సీ జాన్‌పాల్‌గార్లు సహకరించారు. సుమారు 1963 నుండి డెల్టా సంఘాలన్నిటికీ ఒకే సండేస్కూలు ప్రణాళికను పరిచయంచేసి (Ceefi) సంఘాల సండేస్కూలు సేవకు వీరు ఎనలేని ప్రోత్సాహాన్నిచ్చారు. లోపిక్కిడి ఫీల్డుల్లోనూ సండేస్కూలు వర్క్‌షాపులు నిర్వహించి వందలాది

సండేస్కూలు ఉపాధ్యాయులకు చక్కని శిక్షణనిప్పించారు. ఈ శిక్షణా తరగతుల నిర్వహణలో వీరికి సహకరించినవారు కె. విల్సన్, డి. సత్యానందం, కె. శోబన్న, టి.జె.సిడ్నీ కీ.శే. జి. సేంబాబు, మిస్.టిల్స్లీ, పి. సంతోషం, కె. గ్రేస్, జి. సుగుణ, మనోహరం, ఎస్. సూరయ్య ప్రభృతులు.

వాకీగారు B.M.M.F. సంస్థ మూలంగా 1978లో నర్సాపురం కుష్టురోగుల ఆస్పత్రిలో పనిచెయ్యడానికి వచ్చారు. వీరు మొదట్లో వెల్లూరులో పనిచేసారు. 1982లో రిటైరై స్వదేశానికి వెళ్ళిపోయారు. రాబిన్‌సన్‌గారు కుటుంబసమేతంగా 1981 నుండి 1983దాకా ఆస్పత్రిలో మేల్ నర్స్‌గా సేవచేసారు.

నర్సాపురంలో వైద్యసేవలో ఉంటూ సువార్త సేవచేసిన మిషనెరీ సోదరీల విషయమంతా సవిస్తరంగా ముందే ప్రస్తావించాము.

మిస్ పాట్రీషియా ప్రిచర్డ్ 1963లో ఈ ప్రాంతానికివచ్చి 1967నుంచి హోలెండ్‌వార్ఫ్ హాస్టలులో సహాయం చేసింది. షార్టు సతీమణి మేరీషార్టు లాడ్జిలో హిందూ బాలికల రాత్రిలు, సండేస్కూళ్ళు నిర్వహించే వారు. లాడ్జిలో అన్యులుగాఉండి క్రైస్తవులైన వారికోసం ఒక సంఘం ఉండాలన్న ప్రతిపాదన ఈ రాత్రిలమూలంగానే వచ్చింది. తదనంతరం నాసా పంచాక్షరిగారు, ఆనందరాజుగారు కొంతమంది హైందవులకు వలందల రేవులో బాప్తిస్మం ఇచ్చి లాడ్జిలోని ఇమ్మానుయేలు సంఘానికి పునాది వేసారు. వీరు బేతని సంఘ అనుమతి లేకుండా దీన్ని నిర్వహించారు. ఇక్కడ లెప్రసీ ఆస్పత్రి ఉద్యోగులు షిమ్యోను, శోబన్నగార్లతో కలిసి కొండేటి మహేశ్వర ప్రసాదుగారు పెద్దలుగా ఉన్నారు. అయితే ప్రసాదుగారు యిటీవలే కాలం చేశారు. ప్రస్తుతం దీన్లో అన్నికులాలవారూ సభ్యులుగా ఉన్నారు.

మిస్ ఇ.జె. హార్డింగు, మిస్ ఆలివ్ రోజర్సుగార్లు 1949లో వచ్చారు. మిస్. రాజర్సు చెట్టిపేటలో తెలుగుభాష నేర్చుకుని మిస్ బౌడెన్‌కి సహాయకారిగాఉంటూ వారు పని విరమించుకున్న తరువాత చెట్టిపేట స్కూలు, హాస్టళ్ళ బాధ్యతను నిర్వహించారు. 1958లో కొయ్యలగూడెం వెళ్ళి సంఘపెద్దలు, సువార్తికురాళ్ళకోసం స్వల్పకాలిక బైబిలు తరగతులను

నిర్వహించారు. 1963లో నర్సాపురంవచ్చి యువతుల బైబిలు స్కూలు స్థాపించి కొంతకాలం నడిపారు. ఆటుతరువాత జీవన్‌జ్యోతి ప్రెస్ అజమాయి షిషీ చేపట్టి కొడమంచిలి విల్సన్‌గారితోకలిసి ప్రెస్ సర్వతోముఖాభివృద్ధికి కృషిచేసి ఈ ప్రాంతానికంతటికీ పెద్ద ప్రెస్‌గా దీన్ని తీర్చిదిద్దారు. 1972 నుండి UESI లో స్టాఫ్ మెంబరుగా ఉన్నారు. స్టడీ సెంటర్లను నిర్వహిస్తూ కేంపుల్లోను రిట్రీటుల్లోను బోధకురాలిగా సేవచేశారు. 1984లో రిటైరై స్వదేశానికి వెళ్ళిపోయి బైబిలు టీచరుగా సేవను కొనసాగిస్తున్నారు.

ఆల్బర్ట్ జె. లిర్లీగారు 1966లో ఇండియా వచ్చారు. గాస్పెల్ లిటరేచర్ ఔట్‌రీచ్ పథకంక్రింద మద్రాసువచ్చి ఇండియాలోనే నిలిచి పోవడానికి నిశ్చయించుకుని నర్సాపురం వచ్చేసారు. వీరు బహుముఖ ప్రజ్ఞాశాలి. ముఖ్యంగా లెప్రసీ ఆస్పత్రిలో పనిచేస్తూ దాన్ని అన్నివిధాలా అభివృద్ధిలోకి తెచ్చారు. వీరు కొంతకాలం నరసాపురం మిషన్‌హైస్కూలు కరస్పాండెంటుగా పనిచేసి విరమించుకున్నారు. మహాసభల్లో తన్నుతాను తగ్గించుకుని అందరితో కలిసిపందిరి నిర్మాణానికై పనిచేసేవారు.మహాసభలకు హాజరైనవారి సౌకర్యార్థం విద్యుచ్ఛక్తి, నీరు మొదలైన సదుపాయాలను కల్పించేవారు. దివిసీమలో వచ్చిన ఉప్పెన సమయంలో అక్కడ తుఫాను బాధితుల సంక్షేమ కార్యక్రమాల్లో ఎనలేని సేవచేసారు. డేవిడ్ బర్టుగారు స్థాపించిన ఎమ్మాయు బైబిల్ కరస్పాండెన్స్ కోర్సును కొనసాగించారు. సాంఘిక సంక్షేమ కార్యక్రమాల్లో వీరు చాలా ఆసక్తి చూపించారు. యువకులకు నాలుగు నెలల బైబిలు కోర్సులను స్థాపించి స్థానికులను టీచర్లుగా నియమించారు. స్వదేశం వెళ్ళిపోతూ దీని నిర్వాహణ బాధ్యతను AGDMA కు అప్పగించారు. ఈ స్కూలు ప్రస్తుతం బ్యూలా లో జరుగుతున్నది. వీరి సతి షార్లు సతికి హిందూ బాలికల రాలీలో సహాయపడేది.

మిస్ బి.జె.సి. టిల్‌స్లీగారు క్రాఫర్డు టిల్‌స్లీగారి కుమార్తె. 1954లో ఇంగ్లండు నుండి తన తల్లిదండ్రుల దగ్గరికి చేరుకొని తెలుగుభాష నేర్చుకుని 6 నెలలోనే నర్సాపురం వచ్చేసి జూన్ 1955లో హాలెండ్‌వార్ఫ్ హాస్టలు ప్రారంభించారు. ఈ హాస్టలులోఉండి చదువుకున్న బాలికలను దైవసంబంధమైన జీవితంలో నడిపించడంలో ఈమె నిర్వహించిన పాత్ర గొప్పది. ఈ మధ్యనే 'లాడ్జి' బంగళాను కొన్ని మార్పులుచేసి హాస్టలును

...ల్లోకి మార్చారు. ఇక్కడ ప్రస్తుతం 175మంది బాలికలున్నారు. గ్రామాల ...వార్తీకరణలోను, బైబిలు బోధలోను వీరు ఎక్కువ సమయాన్ని గడుపు ...న్నారు. షార్టు సతికి మిస్ టిల్స్లీ హిందూ బాలికల సండేస్కూలులో ...హాయకరంగా ఉన్నారు. లాడ్జి బంగళాలో ప్రస్తుతం నడుస్తున్న ...మ్మానుయేలు సంఘానికి ఈమె చేదోడు వాదోడుగా ఉంటున్నారు.

* * *

ఐ.ఇ. మెక్లీరీగారు 1958లో నర్సాపురం వచ్చి తెలుగు నేర్చుకుని ...తని సండేస్కూలు సేవలో ఉత్సాహంగా పనిచేశారు. 1960లో రాజమండ్రి వెళ్ళిపోయారు. 1961లో వీరి వివాహమైన మరుసటి దినమే హెపటైటిస్ (కాలేయానికి సంబంధించిన వ్యాధి) వల్ల తీవ్ర అస్వస్థతకు ...నై నీలగిరి కొండలకు వెళ్ళిపోయి అటుపైన న్యూజిలాండు వెళ్ళిపోయారు. 1963లో ఇండియాకు తిరిగివచ్చి మద్రాసు హిందూస్తాన్ బైబిల్ ఇన్స్టిట్యూట్‌లో చేరారు.

1922లో బేతని ఆలయం కట్టిన రోజుల్లో నర్సాపురం క్రిష్టియన్‌పేట విశ్వాసులు బేతనికి రావడానికి కాలవదాటవలసి వచ్చేది. ఇందుకు బేతని పెద్దలే ఒక నావను ఏర్పాటు చేశారు. (అటుతరువాత దీన్ని ప్రభుత్వంవారు తీసేసుకున్నారు) దాదాపు పాతికేళ్ళ తరువాత ఇక్కడ ఒక వంతెన ఉండాలన్న సంకల్పం కలిగి, అప్పటి మద్రాసు రాష్ట్ర పి.డబ్ల్యు.డి. శాఖామాత్యులైన డేనియల్ థామస్‌గారు నర్సాపురం వచ్చిన సందర్భంలో బేతని పెద్దలు, క్రిష్టియన్‌పేట ప్రముఖులంతా కలిసి పేటలో ఆయనకు సత్కారం, విందుచేసి, ఈ అవసరాన్ని వారికి నివేదించగా 1949లో థామస్ బ్రిడ్జి నిర్మాణం జరిగింది. ఈ విషయంలో అప్పట్లో పంచాయితీ బోర్డు మెంబరుగాఉన్న సి.జెడ్. కృపానందంగారు, క్రిష్టియన్‌పేట పెద్దలు కె.టి. పార్కర్‌గారు తదితరులు పూనుకుని ఈ బ్రిడ్జి నిర్మాణం జరిగేందుకు ప్రయాసపడ్డారు.

ఈ కాలంలో ప్రసిద్ధులైన కొద్దిమంది జీవిత చరిత్రలను క్లుప్తంగా పరిశీలిద్దాము.

పింజర్ల ఆనందరాజుగారు కోటయ్యజానికమ్మగార్లకు 1903 నవంబరు 24న జన్మించి నర్సాపురం, మచిలీపట్నంలో చదువుకుని బియ్యే

పాస్సైనారు. నర్సాపురం కోర్టులో పనిచేస్తూ కాకినాడ మెక్లారిన్ హైస్కూలుకు 1929లో వెళ్ళి కొంతకాలం పనిచేసి 1946 జూలై నెలలో నర్సాపురం మిషన్ మిడిల్ స్కూలుకు హెడ్మాస్టరుగా వచ్చారు. వీరి హయాంలోనే ఇది హైస్కూలుగా అభివృద్ధి చెందింది. పదవీవిరమణ అనంతరం మ॥ దాసు హిందూస్తాన్ బైబిల్ ఇన్స్టిట్యూట్‌లో ఇంగ్లీషు టీచరుగా తొమ్మిదేళ్ళు పనిచేసారు. 1973లో రిటైరై నర్సాపురంవచ్చి మిషన్ హైస్కూలు కమిటీ మెంబరుగా బేతని సంఘపెద్దగా బేతని ట్రస్టు కమిటీ మెంబరుగా ఉన్నారు. వీరు ఆజన్మాంతం అవివాహితులుగా నుండి ది. 13-1-1982 తేదీన మరణించారు.

వాసా మనోహరంగారు వాసా సమూయేలు కరుణమ్మగార్లకు 1913లో జన్మించారు. నర్సాపురం, గుంటూరుల్లో విద్యాభ్యాసం. మారుమనస్సుపొంది, పాస్టరు జకర్యాగారిచే బాప్తిస్మంపొంది బేతని పరిచార కుడిగానియమించబడ్డారు. వీరు పట్టువరం సంఘ స్థాపనకు దర్యావేషుగారి సహాయంతో పాటుబడ్డారు. లేసు వ్యాపారం చేసుకుంటూ బేతని సండేస్కూలుకు ఐదేళ్ళు సూపరింటెండెంటుగా సేవచేసారు. వీరు కీర్తనలను కంటమెత్తి పాడడంలో దిట్ట. 1966 జూన్ 14న ఉండి గ్రామంలో మణులు మాణిక్యములున్న అనే కీర్తన పాడుతూ ప్రక్కకు ఒరిగి కన్ను మూసారు. వీరి కుమారులు ముగ్గురు అమెరికాలో ఉన్నారు.

జకర్యాగారి కుమారుడు సి.జెడ్. కృపానందంగారు దీర్ఘకాలం బ్రహ్మచారిగా తన జీవితాన్నంతటినీ ప్రభువు సేవలో, మానవసేవలో వెచ్చించారు. వీరు గోదావరిలో చార్లెస్ బీరుగారిచే బాప్తిస్మం పొందారు. టేలరు స్కూలు, తరువాత టేలర్ హైస్కూల్లో చదివి 3 నెలలు గవర్న మెంటు ఉద్యోగంచేసి జోనా జోసెఫ్‌గార్ల కంపెనీలో పదిహేనేళ్ళు, అటుతరువాత మిషన్‌హైస్కూల్లో పదిహేనేళ్ళు గుమస్తాగా పనిచేసారు. బేతనికి పరిచారకుడుగాఉండి ఇప్పటి వరకు పెద్దగా ఉంటున్నారు. ఇదిగాక బేతని ట్రస్టు కమిటీ సెక్రటరీగాకూడా ఉన్నారు. బోధించడంలో, సంఘ సంబంధమైన తగవుల్ని పరిష్కరించడంలో అనుభవం గలవారు. వీరు తన 81న యేట ఇంకా బేతని సంఘంలో పెద్దగాఉండి అందరికీ ఆదరణగా ఉన్నారు. వీరి సోదరి లిలియాపుష్పంకూడా కన్యగానే ఉంటూ ప్రభువు నామానికి మహిమార్థంగా జీవించింది. ఫీల్డు కౌన్సిలు మొదలైన సమావేశా

లకు వచ్చే అతిథులకు ఆదరంతో పరిచర్యలు చేసేది. 1977 జూన్ 22న ప్రభువు పిలుపునందుకుని నిత్య విశ్రాంతికి వెళ్ళిపోయింది.

యార్లగడ్డ క్రిష్ణయ్య, పల్లమ్మగార్లకు యార్లగడ్డ యాసోను గారు జన్మించారు. జున్నూరులోఉంటూ పాలకొల్లు వెళ్ళి చదువుకున్నారు. 1924లో పెదవాడపల్లి గ్రామస్తులైన గళ్ళా సుబ్బయ్యగారి కుమార్తె కాంతమ్మగారిని వివాహమాడారు. వీరికి 16 మంది సంతానం. సగంచెరువులో పదహారేళ్ళు నివసించి నర్సాపురంలో స్థిరపడ్డారు. రంగూన్‌వెళ్ళి ప్రభువు నెరిగి అక్కడే బాప్తిస్మం పొందారు. బొంబాయిలో లేసు వ్యాపారంచేస్తూ విక్టోరియా గార్డెన్స్ దగ్గరఒక హాలు అద్దెకు తీసికొని కూటాలు జరిగించేవారు. వీరు బైబిల్లోని కొన్ని వాక్యాలను పుస్తకంగా అచ్చువేయించి అందరికి పంచి పెట్టేవారు. తన 85వ యేట 1979 మే 7వ తేదీన వృద్ధాప్యంవల్ల మరణించారు. వీరి సతి కాంతమ్మగారుకూడా తీర్థాల్లోనూ హిందూ గృహాల్లోనూ సువార్తను ఆసక్తిగా ప్రకటించి ఈ మధ్యనే ప్రభువు సన్నిధి కేగారు. ఈమె సిర్రా కృపమ్మ, సుబ్బలక్ష్మమ్మగార్లతో కలిసి మిస్.మోర్గన్‌కు సువార్త ప్రకటనలో సహాయం చేసింది. సిర్రా కృపమ్మగారు ప్రస్తుతం మిషన్ హైస్కూలు హెడ్మాస్టరు సిర్రాజాన్‌గారి తల్లి.

సిర్రా ఆశీర్వాదంగారు కనకాయలంకలో సిర్రా వెంకటస్వామి, వెంకమ్మగార్లకు 1901లో జన్మించారు. లంక ఎలిమెంటరీ స్కూల్లో వాసా సామ్యేలు, చీలి సంసోనుగార్ల దగ్గర, తదుపరి ధవిలేశ్వరంలోను విద్య నభ్యసించారు. ధవిలేశ్వరంలో మిస్ హైండ్‌మన్, మిస్ బ్రిడ్జర్‌లు వీరిపట్ల శ్రద్ధ వహించారు. 1920లో బౌడెన్‌గారిద్వారా చెట్టిపేటలో రక్షణ పొందారు.

బర్మావెళ్ళి అక్కడ ఎ.బి.యం. స్కూల్లో పనిచేస్తూఉండగా బ్రాష్లీ గారు వీరిని పిలిపించారు. బ్రాష్లీగారితో కొయ్యలగూడెంలో, ఆడమ్సుగారితో చాగల్లులోను, చాలాకాలం పనిచేసి నర్సాపురం తిరిగివచ్చి మిస్ ప్రింగ్ దగ్గర బోయడ్‌గారి దగ్గరా డ్రైవరుగా పనిచేసి విరమించుకుని ఇప్పుడు పెద్ద లేసు వ్యాపారవేత్తగా ఉన్నారు. సండేస్కూలు సేవలో ఆసక్తిగలవాడై బేతనిలో వాక్య పరిచర్య చేస్తూ కనకాయలంక సంఘాన్ని కూడా దర్శిస్తూ ఉండేవారు. ఆడమ్సు, వెంకయ్య భగవాన్‌రాజుగార్లతో గ్రామాలు తిరిగి సేవ

చేసారు. వీరు ప్రస్తుతం తన వృద్ధాప్యంలో బేతనీ సంఘాధ్యక్షుడుగా నర్సాపురంలో కాపురమున్నారు.

నర్సాపురం బేతని సంఘంలో మునుపెన్నడూ లేనంతగా సేవ అభివృద్ధి చెందింది. మహాసభలు, సువార్త యాత్రలు, ఫుల్ టైమ్ సేవకులను పంపించడం మొదలైన వాటినిబట్టి సేవ నిర్విరామంగా కొనసాగింది. బేతని సంఘంలో వాసా పంచాక్షరి, సి.జెడ్. కృపానందం, సి. దర్యావేషు, తొత్తరమూడి మనోహరం, బూల అజరయ్యగార్లు పెద్దలుగాను, సి. జ్ఞాన ప్రకాశరావుగారు పెద్దగా, తెలుగు కాన్ఫరెన్సు ప్రసిడెంటుగాను ఉన్నారు. సి. మలాకీ, వాసా జాన్ పంచాక్షరి, ఎస్.సి. రంగారావు, కె.ఎస్. జాక్సన్, ఎస్. జాన్‌గార్లు పరిచారకులుగాను ఉన్నారు. కొంతకాలానికి పంచాక్షరిగారి స్థానంలో కె.ఎస్. జాక్సన్‌గారిని పెద్దగా, పాస్టరుగా నియమించారు.

చడలవాడ జ్ఞానప్రకాశరావుగారు నర్సాపురం బందరు, గుంటూరులో విద్యాభ్యాసం చేసారు. ఎస్.ఎస్.ఎల్.సి. చదువుతుండగా 1935 ఏప్రిల్ 21వ తేదీన ఇ.ఎల్.క్యిర్క్‌గారి వాక్యపరిచర్యవల్ల మారుమనస్సుపొందారు. 1947 మే 30వ తేదీన మద్రాసు సౌతు ఆర్కాట్ ప్రాంతానికి చెందిన మేరీ అనసూయగారిని వివాహమాడారు. జ్ఞానప్రకాశరావుగారు 1959లో జోసెఫ్‌గారి మరణానంతరం నర్సాపురం తిరిగివచ్చి లేసు వ్యాపారం చూసుకుంటూ నర్సాపురంలో దైవసేవను ఆరంభించారు. వీరు తెలుగు కాన్ఫరెన్స్ అధ్యక్షునిగాఉంటూ చట్టబద్ధమైన భద్రతకోసమని తెలుగు కాన్ఫరెన్స్‌ను అసోసియేషన్ ఆఫ్ గోదావరి డెల్టా మిషన్ అసెంబ్లీస్ **AGDMA** గా రిజిస్టరు చేయించడంలో ప్రముఖపాత్ర వహించి ఇప్పటి వరకు దీని ప్రసిడెంటుగా కొనసాగుతున్నారు. బేతని ట్రస్టుకు అధ్యక్షునిగాను బేతని సంఘపెద్దగాను ఉంటూ సంఘాలను సక్రమమైన బోధలో నడిపిస్తూ ఉపదేశించడంలోను, ఖండించడంలోను నమ్మకమైన సేవచేస్తున్నారు. అనేక గ్రామీణ సంఘాలకు విరాళాలిచ్చి ఆలయ నిర్మాణాలను ప్రోత్సహించారు. 150 సంవత్సరాల ఉత్సవాల సందర్భంగా జరిగే మహాసభల కమిటీకి అధ్యక్షులుగా తమ బాధ్యతలను నెరవేరుస్తున్నారు. లేసు వ్యాపారం నిమిత్తం వీరి ఇంటికి వచ్చిన స్త్రీలకు ఆయా రోజుల్లో జోబ్, బర్నబాసుగార్లచే వాక్యపరిచర్య చేయించేవారు.

కంకిపాటి దర్యావేషుగారు 1945లో కాకినాడలో డేనియల్‌గారి రిట్రీటులో రక్షణ పొందారు. నర్సాపురం క్రిష్టియన్‌పేట స్కూల్లో చాలాకాలం హెడ్మాస్టరుగా పనిచేసారు. వీరు చిట్టవరం, నర్సాపురం ప్రాంతాల్లో సేవచేసి అనేకమంది అన్యులను ప్రభువుతట్టు నడిపించారు. బొంతుప్రకాశంగారితో కలిసి లిఖితపూడి, కొప్పర్రు, కంసాల బేతపూడి, గ్రామాల్లో సేవ చేసారు. వీరు సి. తిరపయ్య, కె.యం.సి. ప్రసాద్‌గార్లతో కలిసి ఈ ప్రాంతాల్లో మైకులో సువార్త ప్రకటిస్తూ తిరిగేవారు. తొత్తర మూడి మనోహరంగారు 1952లో జోనాగారిచేత బాప్తిస్మంపొంది మొగల్తూరు ప్రాంతంలో సేవచేసి ఆలయంకూడా కట్టించారు. 1962 నుండి బేతని వై.యం.ఇ.ఎఫ్. తరుపున సుమారు 18సార్లు పాపికొండలకు సువార్త దండయాత్ర జరిపారు. కొండేటి మహేశ్వరప్రసాదుగారు 1969లో సంపూర్ణసేవకునిగా సమర్పించుకొని బేతని సంఘం తరపున 1975వరకు పోలవరంలో సంఘాన్ని నడిపారు.

వీరుగాక ఈ కాలంలో సువార్తసేవలో ప్రసిద్ధికెక్కినవారి విశేషాలు చూద్దాము. రావూరి అమ్మనమ్మగారు ఈ ప్రాంతానికి మొదటి క్రైస్తవ హతసాక్షిగా స్మరణకు వస్తున్నది. ఈమె లక్ష్మనేశ్వరంకు చెందిన హైందవ కుటుంబంలో పుట్టింది. అల్లిన లేసును జోనా జోసెఫ్ బ్రదర్స్ కంపెనీలో ఇచ్చే నిమిత్తం వచ్చి రక్షణ సందేశం విని ప్రభువును తెలుసుకున్నది. బంధువులు ఈమెను వెలివేయగా మిషనరీలు, జోనాగారి కుటుంబం, తదితరులు ఈమెను ఆదరించారు. మిస్. మోర్గన్‌తో కలిసి, స్వతంత్రంగాను సేవచేసింది. వీరి కుమారుడు రావూరి వెంకటనారాయణ, బంధువుడు రావూరి నాగన్నగార్లు కుటుంబసమేతంగా ఈమె సువార్త పరిచర్యవల్ల ప్రభువు వెలుగులోకి వచ్చారు. 1971 ఆగస్టు 10న నర్సాపురం పోలీసు స్టేషన్లో సువార్త చెప్పడానికి వెళ్ళి అక్కడే హటాన్మరణం చెందింది. వంగలపూడి యాకోబుగారు జీవితకాలమంతా నవరసపురం, పోలవరం, ఆంబాల చెరువు తదితర గ్రామాల్లో సేవచేసారు. ఈదా యేసుదాసుగారు సరిపల్లి సంఘపెద్ద.తంబురపై రాగాలు పాడుతూ సువార్త సేవకు బయలుదేరేవారు. వీరు నర్సాపురం మిషన్‌హైస్కూల్లో పనిచేసిన సుందర్రావుగారి తండ్రి.

నర్సాపురం బేతని సంఘం ఈ కాలంలో ఈ ప్రాంతపు సేవంతటికీ

నాయకత్వం వహిస్తూ ముందడుగు వేస్తూ ఉండగా 1982 ఆగస్టులో పెద్ద అవాంతరం వచ్చిపడింది. బేతని ట్రస్టు డీడ్‌లోని నిబంధనలనుమీరి సిద్ధాంతపరమైన విభేదాల మూలంగా బేతని విశ్వాసులు కొందరు సహవాసం నుండి వేరైపోయి మిషన్‌హైస్కూలు మెయిన్‌హాల్లో సహవాసం కావడం ఆరంభించారు. ఇందువల్ల గోదావరి డెల్టా ప్రాంతమంతటిలో గొప్ప అలజడి రేగింది. వేరైపోయినవారు అన్ని డినామినేషన్లమధ్య సహకారం ఉండాలని వాదిస్తున్నవారు. బేతని సంఘాన్ని అంటిపెట్టుకుని ఉన్నవారు ఇంటర్ డినామినేషనల్ సహకారం వాక్యానుసారం కాదని నమ్మేవారు.

సంఘం విడిపోయిన తరువాత బేతని అధ్యక్షులుగా వాసా పంచాక్షరి, సి.జడ్. కృపానందం, సి. జ్ఞానప్రకాశరావు, కె. ఎస్. జాక్సన్, వాసా జాన్ పంచాక్షరి, సిరా ఆశీర్వాదంగార్లు పరిచారకులుగా జాన్‌పాల్, జేమ్సుచంద్రన్ కె. చంద్రశేఖర్, వై. ఫ్రాంక్లిన్, పి. లాజరస్, కె .స్పర్జన్‌గార్లు వ్యవహరిస్తున్నారు.*

కె.ఎస్. జాక్సన్‌గారు పాస్టరుగా సంస్థ కార్యక్రమాలను నడిపిస్తున్నారు వీరు 1942లో బాప్తిస్మం పొంది 1965 వరకు మిలటరీలోఉంటూ రిటైరైన పిదప బేతనిలో పరిచారకునిగాను, 1976లో అధ్యక్షునిగాను నియమితులైనారు. బాల్యంనుండీ వీరు నిర్దోషమైన జీవితాన్ని గడిపారని డబ్బు విషయంలో బహునమ్మకంగా యథార్థతతో వ్యవహరిస్తారనే మంచి సాక్ష్యం గలవారు. బేతని ట్రస్టు మెంబరుగా, ఎ.జి.డి.యం.ఎ. ప్రథమ కోశాధికారిగా ఇప్పటివరకు సేవచేస్తున్నారు. సంఘాలలో తగవులు పరిష్కరించడంలోను, కేంపుల్లో, తీర్థాల్లో వాక్యపరిచర్య చెయ్యడంలోను సహాయ పడుతున్నారు.

చంద్రశేఖర్‌గారు మట్టపర్రు, రుస్తుంబాద సంఘాలభారం వహిస్తూ సేవచేస్తున్నారు. బేతనీసంఘ సండేస్కూల్ సూపరింటెండెంటుగా ఆ సేవను జరిపిస్తున్నారు. వీరు గళ్ళా సామ్యుయేలుగారి తరువాత మహాసభల ప్రేయర్ సెక్రటరీగా ఆ బాధ్యతను చేపట్టారు. వై. ఫ్రాంక్లిన్‌గారు తాలూకా ఆఫీసులో రికార్డు అసిస్టెంటుగా ఉంటూ ప్రభువుకు నమ్మకమైన సాక్షిగా జీవించారు. మిలటరికివెళ్ళి రిటైరై ప్రస్తుతం బేతని విశ్వాసులమధ్య

*బేతనికాక నర్సాపురంలో ఉన్న ఇతర అసెంబ్లీల విషయం ప్రస్తావించకూడదన్నది ఎడిటర్ల నిర్ణయం.

పాటుపడుతూ ఇతర సువార్త కేంపుల్లో వాక్యం ప్రకటిస్తూ సేవచేస్తున్నారు.

సి. లాజరస్‌గారు బేతని వై.యం.ఇ.ఎఫ్. అధ్యక్షులుగా యువకుల మధ్య నుంచి సేవను జరిగిస్తూ, అంతేకాక నరసాపురం, పోలవరం అంబాల చెరువు, సరిపల్లి తదితర గ్రామాలను దర్శిస్తూ సువార్తయాత్రల్లో పాల్గొంటున్నారు. వీరు 30 యేళ్ళపాటు సండేస్కూలు సేవలో భారం వహించి పనిచేసారు.

బేతని సువార్త సేవకులుగా వాసా జాన్ పంచాక్షరిగారు వీరికి సహాయకులుగా సూర్యప్రకాశరావుగారు ఉంటున్నారు. వీరు నర్సాపురం పరిసరగ్రామాల్లో విస్తృతంగా సేవచేస్తున్నారు. వీరికి సహాయంగా ఆయా సమయాల్లో కె. స్పర్జన్, సి. లాజరస్, వై. ఫ్రాంక్లిన్, సి. తిరపయ్య, కె. చంద్రశేఖర్‌గార్లు వెళ్తూ ఉంటారు. స్పర్జన్‌గారు 1984లో పరిచార కులుగా నియమించబడ్డారు. వీరు సారస, అంతకుముందు కాజ తదితర గ్రామాల్లో సేవచేశారు. సి. జేమ్సుచంద్రన్‌గారు 150 సంవత్సరాల ఉత్సవాలకు కోశాధికారిగా నియమించబడ్డారు. వీరు సి. జ్ఞానప్రకాశరావుగారి జేష్ఠపుత్రులు.

బేతని చర్చి కౌన్సిల్ సెక్రటరీలుగా జఖర్యా, ఎబినెజరు, పంచాక్షరిగార్లు ఆయాసమయాల్లో పనిచేసారు. ప్రస్తుతం జాక్సన్‌గారు ఈ బాధ్యతను చేపట్టారు. యువకులు సికిలే హొజెస్‌గారు బేతని సంఘ సభ్యులుగా సంఘ కార్యక్రమాలకూ పేదలనిధికీ ధారాళంగా చందాలిస్తూ సేవను ప్రోత్స హిస్తున్నారు. వీరు అంతర్జాతీయ వ్యాపారవేత్త.

## బేతనీ యువజన సమాజం:

1918 సంవత్సరంలో సహో. కె. వోబేదు, సహో. చదలవాడ జోనయ్యగార్లు (సి. జఖర్యాగారి కుమార్లు) ఏలూరులో జరిగిన క్రైస్తవ విద్యార్థుల కేంప్‌కు వెళ్ళారు. తిరిగివచ్చి నరసాపురం బేతనీ ఆలయంలో కూడా ఆలాంటి యువజన సమాజం వుంటే బావుంటుందని చెప్పి కొత్తగా బేతని వై.యం.సి.ఎ. ను స్థాపించారు. యువజనుల రక్షణకొరకు, ఆధ్యాత్మిక ఎదుగుదలకొరకు, పరిసరగ్రామాల్లో సువార్త ప్రకటన కొరకు సంఘ పెద్దలకు అన్ని విషయాల్లో సహకరించి సంఘ సేవలో తర్ఫీదు పొందుటకు

యిది ఏర్పాటు చేయబడింది. ఈ యువజన సమాజం కమిటీకి శ్రీయుతులు సి. జోనా, సి. జోసెఫ్, వి. ఎబినేజరు, వి. పంచాక్షరి, వి. మెఫీబోషెతు, బి. జాన్ గార్లు సభ్యులు. ఆరంభంలో శ్రీ సి. జోసెఫ్‌గారు అధ్యక్షులుగాను శ్రీ కె. వోబేదుగారు కార్యదర్శిగాను వున్నారు. 1959లో ఈ సమాజాన్ని వై.యం.ఇ.ఎఫ్. అన్నారు.1943లో ఈ సమాజం సిల్వర్‌జూబిలీ చేసుకొంది. ఆ తర్వాత శ్రీ. కె. థామస్‌గారు అధ్యక్షులుగా, శ్రీ బి. అజరయ్యగారు కార్యదర్శిగా, శ్రీ కె. దర్యానేషుగారు ఉపకార్యదర్శిగా చాలాకాలం పనిచేసి సమాజాన్ని అభివృద్ధి పరిచారు.

1964లో శ్రీ సి.జి ప్రకాశరావుగారు అధ్యక్షులుగా, శ్రీ బి. అజరయ్యగారు కార్యదర్శిగా, శ్రీ డి.. సత్యానందంగారు ఉపకార్యదర్శిగా పనిచేసిన కాలంలో యువజన ప్రత్యేక సమావేశాలు ఏర్పాటుచేసి సహో. జాషువా డేనియల్‌గారిని ఉపన్యాసకుడుగా పిలిపించారు. వీరికాలంలో 1968లో ఈ సమాజం స్వర్ణోత్సవం జరుపుకుంది. స్థానిక మిషనెరీలు చార్లెన్‌బర్, మెక్లారీ, శ్రీమతి షార్ప్, మిస్ టిల్‌స్లీగార్లు బాలుర, బాలికల రేలీల్లో సహాయం చేశారు. అనేకమంది యువకులు ఈ పరిచర్యలద్వారా ప్రభువునంగీకరించారు.

1972లో శ్రీ ఎస్. జాన్‌గారు అధ్యక్షులుగా, శ్రీ ఎ. అబ్రాహాం గారు ఉపాధ్యక్షులుగా, శ్రీ పి. లాజరస్‌గారు, కార్యదర్శిగా శ్రీ ఎస్. నార్మన్ నోవా కోశాధికారిగా ఈ సేవను కొనసాగించారు. శ్రీ బి. థియోడర్‌గారు సలహాదారుడుగా వ్యవహరించారు.

1976లో శ్రీ వి. జాన్‌పంచాక్షరిగారు అధ్యక్షులుగాను శ్రీ ఎస్. పెర్సీపాల్ కార్యదర్శిగాను వున్నారు. 1980లో ఈ సమాజాన్ని పూర్తిగా యువకులకు అప్పగించబడింది. డా. పాల్‌విల్సన్‌గారు రిట్రీట్ డైరెక్టరుగా చాల సమర్థవంగా పనిచేశారు. ఆ రిట్రీట్‌లో 49మంది యువతీయువకులు ప్రభువునంగీకరించారు.

ప్రస్తుతం సహో. పి. లాజరస్‌గారు అధ్యక్షులుగా, సహో. టి. అరుణకుమార్ గారు కార్యదర్శిగాను, సహో. సి. స్వర్ణకుమార్‌గారు కోశాధికారిగానుండి ఈ సేవలో సహకరిస్తున్నారు.

ఇంచుమించుగా ఇదేకాలంలో యువ్వన స్త్రీల సమాజం వై.డబ్ల్యు.సి.ఎ. ఆరంభమైంది. వీరు ప్రత్యేకంగా తమ కార్యక్రమాలు జరుపుకునేవారు. శ్రీమతులు సి. జీవరత్నమ్మ, సి. వైదూర్యమ్మ, డి.బి. బర్టు, ఎ. నేస్మిత్ వి. పంచాక్షరి, సి. జోసెఫ్, వాసా కాంతమ్మగార్లు ఆయా సమయాల్లో ఆయా కార్యభారాలు వహించి ఈ సమాజాన్ని ఆధ్యాత్మికంగా ఎంతో అభివృద్ధి పరిచారు.

ఇటీవలి కాలంలో శ్రీమతులు సి. ఫ్లారెన్సు థామస్, సి. మేరీ అనసూయ జ్ఞానప్రకాశం, జె. విమలమ్మ, విజయఆర్థర్, పి. కెస్సీఫ్లారెన్సు మాముడూరి భారతి, ఎ. పద్మా అబ్రహాము, వంగరపు కమలమ్మగార్లు కార్యకర్తలుగా వున్నారు. శ్రీమతి లీలావతి జాక్సన్‌గారు ఐదేళ్ళు ఈ సమాజానికి కార్యదర్శిగా పనిచేశారు.

కొమానపల్లి నవోమి, ఉల్లంపర్తి కమలమ్మ, యార్లగడ మరియమ్మ, మాముడూరి మరియమ్మగార్లు ఈ సమాజం తరపున సువార్తికురాండ్రుగా సేవచేశారు.

ప్రతీ మహాసభల్లోనూ చౌక భోజనశాల ఈ స్త్రీల సమాజం సహోదరీలే కడు సమర్ధవంతంగా నిర్వహించి ఎంతో సహకరిస్తున్నారు. అయితే పాలకొల్లులో 1910లోనే సి.ఇ.ఎస్. (క్రిష్టియన్ ఎన్‌డీవర్స్ సొసైటి) అనగా క్రైస్తవయత్న సమాజం అనే యువజన సమాజాన్ని సహో. తాడికొండ విలియమ్స్, జుత్తిగ సభాపతి, పాలూరి ఎలియాజరు గార్లు స్థాపించారు. అది యింకనూ కొనసాగుతూనేవుంది.

నర్సాపురం పట్టణంలో బ్రదరెన్ సంఘాలుగా చెప్పుకునే సంఘాలు ఒకటికి మించి ఉండడం బేతని పెద్దలకు అభ్యంతరకారణంగా ఉన్నది. అయితే ఈ సంఘంనుంచి విడిపోయి లాడ్జిలోను, మిషన్‌హైస్కూలులోనూ సమావేశవుతున్న విశ్వాసులతో సహ కొందరు విదేశీ మిషనెరీలు కూడుకొంటూ ఒకే పట్టణంలో ఒకటికంటె ఎక్కువ అసెంబ్లీలు ఉండడంతో తప్పలేదని అభిప్రాయపడుతున్నట్టుంది. ముఖ్యంగా బేతనిలో వచ్చిన చీలికవల్ల నర్సాపురంలోని క్రైస్తవులకేగాక గోదావరిడెల్టా సంఘాలన్నిటికీ విపరీతమైన అసౌకర్యం, అయోమయ పరిస్థితి కలిగినాయి.

* *

నర్సాపురం చినమామిడిపల్లికి చెందిన మంగం యెషయాగారు ఈ పేటలోని ఏకైక బేతని సంఘ సభ్యులు అని బేతని పరిచారకులు తెలియజేస్తున్నారు. యెషయగారి కుమారుడు బాలసుందరంగారు ప్రస్తుతం నర్సాపురం మున్సిపల్ కౌన్సిలర్‌గా ఉంటున్నారు. వీరి సతిమణి ఆగ్నేసమ్మ గారు ఆదర్శ గృహిణి.

పెదమామిడిపల్లి సంఘాన్ని సహో. కంకిపాటి నోవహుగారు స్థాపించారు. అప్పట్లో సంఘం వో యింటి అరుగుమీద సమావేశ మయ్యేది. చదలవాడ జోబుగారుకూడా ఈ సంఘస్థాపనకు కృషిచేసిన వారిలో ఒకరు. ఆ గ్రామ విశ్వాసి వుందుర్తి దావీదు(పూర్వం నామధేయం నరశింహులు) గారు ఆలయం కొరకు 5 సెంట్ల స్థలాన్ని దానం చేసారు. అప్పుడు స్థానిక సంఘస్థులు దాన్లో ఆలయం కట్టుకున్నారు. ఈ ఆలయ నిర్మాణానికి దానియేలుగారి పెద్ద కూతురు తెన్నేటి పెద మరియమ్మగారు విశేషంగా ఆర్థిక సహాయంచేసి, యిటీవలే కాలం చేశారు. సంఘానికి కాపరులుగా వుందుర్తి దావీదుగారు తెన్నేటి దేవానందంగారు, వుందుర్తి యేసురత్నంగారు వుండేవారు. వీరు కాలం చేసాక ప్రస్తుతం వి. దానియేలు గారు తెన్నేటి జీవరత్నంగారు, వై. అబ్రహాముగారు ఈ సంఘ సేవను అజమాయిషి చేస్తున్నారు.

నగంచెరువు సంఘం ఈ కాలంలో మంచి అభివృద్ధిలో ఉంది. ఈ సంఘంలో యోగ్యమైన సేవచేసినవారు యేలూరి హిజ్కియాగారు వీరుగాక సిర్రా డేనియల్, గళ్ళా సమూయేలు, ఈదా సుదర్శనం, కొట్టుగుళ్ల వెంకట్రావు, ఉందుర్తి రాజరత్నం ఉందుర్తి సుదర్శనంగారు సంఘ బాధ్యతలను నెరవేర్చారు. ఉందుర్తి రాజరత్నంగారు కొందరు అన్యుల్ని ప్రభువు కొరకు సంపాదించి కొంతకాలం వారిని ప్రభువులో నడిపించి తన మరణానికి ముందు తిరిందరిని తల్లి సంఘంలో చేర్చారు. ప్రస్తుతం నగంచెరువు సంఘ పెద్దలుగా మోసుగంటి జాన్, సన్నమండ్ర లాజరు, ఈదా సమూయేలు, సిర్రా జారి విక్టర్‌గార్లు, తదితరులు ఉన్నారు.

ఆగర్తిపాలెం సంఘంఈ 50 యేళ్ళకాలంలో కొంత క్షీణదశను అనుభవించింది. ఈ గ్రామంలో లూథరన్, సెవెంతుడే, జెహోవా విట్నెస్ తదితర శాఖలు వచ్చి చేరినాయి. ఈ గ్రామంలో జి.డి.యం. విశ్వాసులు

చాలామంది ఇతర సంఘాల్లోకి వెళ్ళిపోవడంవల్లను, మరికొంతమంది గ్రామం విడిచి ఆయా ప్రాంతాలకు వలస పోవడంవల్లనూ ఇక్కడి జి.డి.యం. సంఘం దెబ్బ తిన్నది.

నర్సాపురం ప్రాంతీయ సంఘాల పెద్దలు ఎవరంటే సరిపల్లి సంఘానికి ఈదా యేసుదాసుగారి మనుమడు సతానియేలుగార్ను, కొప్పర్రు సంఘానికి బొంతు ప్రకాశంగారు, గాళ్ళగుంట సంఘానికి దుద్దే అహరోను గారు, దగ్గులూరు సంఘానికి కొడమంచిలి జోసెఫ్‌గారు, చినదిబ్బ సంఘానికి దిగుమర్తి యోహానుగారు, వేడంగికి వి. మిల్టన్‌గారు, ఇలపకుర్రుకు ఎస్. గమానియేలుగారు, యలమంచిలికి బాడతల యోబుగారు, సీతమ్మ చెరువు, పోలవరం, నవరసపురం అంబాల చెరువు సంఘాలకు (సేవకుడుగా) టి. సంతరావుగారు బోళ్ళవారిపాలెంకు టి. లాజరుగారు, సీతారామపురం సంఘానికి ఇరుసుమండ జాన్‌గారు, మామిడి కుదురుకు దీపాటి డేవిడ్‌గారు, పెమ్మరాజు పోలవరంకు మైలాబత్తుల జ్ఞానప్రకాశంగారు, పారవకు యిన్నపురెడ్డి, వర్ధనపు అజరయ్యగార్లు, రుస్తుంబాద సంఘానికి జె. మోహన్ గారు, దగ్గులూరు, పి. పోలవరం గ్రామాల్లో కె. జోసెఫ్, యం. జ్ఞాన ప్రకాశంగార్ల సేవ ఫలితంగా అనేకమంది రాజులు మొదలైన హైందవులు క్రైస్తవులై సంఘంలో చేరారు.

ఏగువాని చెరువు సంఘం బాతిరెడ్డి వసంతం వంగలపూడి ఎలీషాగార్లు ప్రభువునంగీకరించడంతో స్థాపితమైంది. ఈ సంఘాభివృద్ధికి సహకరించిన వారు ఆదుర్తి జేమ్సుగారు, మల్లవరం లంక, తరపట్ల ప్రకాశం, తరపట్ల యోహాను (మల్లవరం) వేదాల బెంజమిన్‌గార్లు (కొప్పర్రు), చాలా కృషిచేసి దీన్ని అభివృద్ధి చేసారు. చదలవాడ నోవహు, వి. మెఫీబోషెతు, వి. ఎబినేజరు కంకిపాటి నోబేదు, వి. నెహెమ్యాగార్లుకూడా ఈ సంఘాభివృద్ధికి సహకరించారు.

లంకలకోడేరు సంఘాన్ని స్థాపించడంలో సిర్రా జఖర్యాగారి భార్య సిర్రా శాంతమ్మ, పెనుమాక సుంకరిగార్లు ప్రధాన పాత్ర వహించారు. సిర్రా శాంతమ్మగారు 1944లో సువార్తసేవ ప్రారంభించి మూడేళ్ళలో కొందరిని ప్రభువుతట్టు తిప్పగలిగింది. అటుతరువాత సుంకరిగారు వీరితో సహకరించగా నాలుగు కుటుంబాలు రక్షణ వెలుగులోకి వచ్చాయి.

1950లో బర్చుగారు వీరికి బాప్తిస్మమిచ్చారు. వీరిలో ప్రత్తిపాటి యాకోబు గారు బైబిలుస్కూల్లో శిక్షణపొంది దైవసేవకునిగా నియమించబడ్డారు.

శివదేవుని చిక్కాల సంఘస్థాపన గురించి ముందే తెలుసుకున్నాము. ప్రస్తుతం ఈ గ్రామపు ప్రార్థనాలయం నిమిత్తం సిర్రా సేతురుగారు భారం వహించి విశాలంగా నిర్మించడంలో ధనసహాయం చేసారు. వీరి సోదరులు సిర్రా జాన్‌గారు విద్యాభ్యాసం ముగించిన తరువాత మిస్. బ్రీలీ, మిస్ మోరిసన్‌గార్ల యాజమాన్యంలో ధవలేశ్వరం ప్రాంతపు దండు కేశవరం జి.డి.యం. స్కూల్లో 1947నుండి 1950 వరకు పనిచేసారు. ఈ కాలం లోనే పరిసర గ్రామాల్లో సువార్త సేవచేసారు. వీరు ప్రస్తుతం కాకినాడలో కాపురముంటూ అన్యులమధ్య సువార్త ప్రకటిస్తూ సంవత్సరానికోసారి యూత్ గాస్పెల్ టీమ్ వారిని రప్పించి ఈ ప్రాంతాల్లో సేవ చేయిస్తున్నారు. శివదేవునిచిక్కాల గ్రామవాస్తవ్యులు పెనుమాక సుంకరిగారు 1926లో బోయడ్‌గారివల్ల బాప్తిస్మంపొంది లంకలకోడేరు, దగ్గులూరు గ్రామాల్లో సంఘస్థాపనకు తోడ్పడ్డారు. వీరు తన సేవలో హింసనుకూడా సహించి సంఘసేవను కొనసాగించారు.

సుంకరిగారు భార్య సమేతంగా 1945లో దగ్గులూరులో సేవ ప్రారంభించగా తత్ఫలితంగా 1950 డిసెంబరు 11న పదకొండు కుటుంబాలు బర్చుగారి మూలంగా బాప్తిస్మం పొందినాయి. నేస్మిత్, బర్చు గార్లు ఈ సంఘాన్ని దర్శించేవారు. ఆలయానికి కొంత ధనసహాయంకూడా నేస్మిత్ దంపతులు అందించారు. పాలకొల్లుకు చెందిన యం. సైమన్ గారు రాత్రిపాఠశాల నడిపారు. కె. జోసెఫ్‌గారిని ఈ సంఘంనుండి ప్రత్తిపాడు బైబిలు స్కూలుకు పంపించారు. 1968లో పెద్దల సహాయం వల్ల ఈ సంఘ విశ్వాసులు ఆలయాన్ని పునర్నిర్మించుకున్నారు.

కొవ్వూరు సంఘం ఈ కాలంలో ఎక్కువగా అభివృద్ధి చెందింది. బొంతు ప్రకాశంగారు గ్రామ పాఠశాల హెడ్మాస్టరుగా చాలాకాలం పనిచేసి సంఘపెద్దగా సేవచేసి ఉద్యోగ విరమణ తరువాత ఉత్సాహంగా ప్రభువు కార్యాలపట్ల ఆసక్తి కలిగి ఉంటున్నారు. వీరు నర్సాపురం ఫీల్డు ఉపాధ్యక్షులుగా సంఘాల క్షేమం చూస్తున్నారు.

పాలకొల్లునుండి ఒరిగేటి ఫ్రాన్సిస్, ముప్పిడి సైమన్‌గార్లు వేడంగి గ్రామంలో సువార్తసేవ ప్రారంభించారు. అప్పటికి వెంకటనర్సమ్మ అనేవారు విశ్వాసులుగాఉంటూ జీవిస్తున్నారు, చాకిరేవుగుంట గ్రామాలకు ప్రార్థన నిమిత్తం వెళ్తుండేవారు. 1958లో ఫ్రాన్సిస్ సైమన్‌గార్ల సేవాఫలితంగా ముసలయ్య (మిల్టన్) పల్లయ్య, వరి పదినుందికి జోబు మోజెస్‌గారు బాప్తిస్మం ఇచ్చారు. మిల్టన్‌గారు ప్రత్తిపాడు బైబిలుస్కూల్లో శిక్షణపొంది వచ్చిన తరువాత ఆ సంఘసేవకునిగా నియమించబడ్డారు. మెక్లేరీ, లిల్లీ, డాక్టర్ ప్రభాకర్‌గార్లు ఆయా సమయాల్లో కొంత ధనసహాయంచేయగా సి. జ్ఞానప్రకాశరావుగారు సుమారు 15 వేల రూపాయలు వెచ్చించి మందిర నిర్మాణం గావించి దీనికి 'ఎలీము' అని నామకరణం చేసారు.

యలమంచిలి సంఘానికి పాలకొల్లునుండి యం.జె.ఆర్. కాసుగారు మరికొందరు సహోదరులతోవెళ్ళి వాక్యపరిచర్య చేయగా తెన్నేటి అమ్మినీడు చుట్టుగుల్ల వెంకన్న, చినవెంకన్న అనేవారు మొదటగా రక్షించబడి బాప్తిస్మం పొందారు. కాసుగారే ఆలయం కట్టించి సంఘకాపరిగా ఉన్నారు. ప్రస్తుతం కాసుగారి కుమారుడు పెర్సీపాల్‌గారు ఇంగ్లండులోఉంటూ ఈ సంఘ బాధ్యత వహించి ధనసహాయం చేస్తుండగా బాడతల యోబుగారు దీనికి కాపరిగాఉండి నడిపిస్తున్నారు.

1934లో నంగలపూడి యాకోబుగారు లంబాలచెరువు గ్రామంలో సేవ ప్రారంభించగా కోడవల్లి నారియ్య ప్రభువునంగీకరించారు. వీరి పరిచర్యవల్ల కండవల్లి సూర్యప్రకాశం, భార్య నరజమ్మగార్లు రక్షించబడి బాప్తిస్మం పుచ్చుకున్నారు అటుతరువాత ఈ ప్రాంతంలో చిట్టూం ముసలమ్మ, కొండేటి సంతోషమ్మ, చెదలవాడ శారమ్మ, బాలం అన్నమ్మ, కొండేటి మామ్మాళ్ళమ్మ, మాకమ్మగార్లు రక్షించబడ్డారు కె.యం.వి. ప్రసాద్‌గారు 1975 వరకు ఈ గ్రామంలో నిలిచి సువార్త సేవ చేసారు. అప్పటినుండి గళ్ళా సామ్యుయేలుగారు సేవనారంభించగా కోడవల్లి గంగమ్మ, వెంకమ్మ, కొండేటి రామారావు, చినవెంకమ్మగార్లు రక్షణ పొందారు.

ఇలపకుర్రు గ్రామంలో 1915లో పాలకొల్లుకు చెందిన డేవిడ్ పీటర్‌సన్‌గారు స్వతంత్ర సువార్త సేవాసంఘం అనే పేరుతో సంఘాన్ని

స్థాపించగా ఇది 1930లో నేస్మిత్‌గారికి అప్పగించబడింది. అప్పటినుంచి సి. జోబ్, పి. జోబ్‌మోజెస్‌గార్లు తరుచువెళ్ళి సేవచేసారు. థామస్, బర్ట్ షార్ట్, లిల్లీ, జ్ఞానప్రకాశరావుగార్లు సంఘాన్ని అప్పుడప్పుడూ దర్శిస్తూ వచ్చారు. సి. మలాకీగారు టీచరుగాఉంటూ సంఘ బాధ్యత చూసుకునేవారు. పైన చెప్పిన పెద్దల సహాయంతో 30వేల రూపాయల వ్యయంతో ఇక్కడ మంచి ఆలయం కట్టారు. ఉండ్రాజవరపు సాముయేలు, దానియేలు, బాలం యేసుకృప సంఘ నాయకులుగా ఉన్నారు. మలాకీగారి తరువాత యన్. పరదేశి, పెనుమాక సాముయేలు, ఎస్. గమానియేలుగార్లు టీచర్లుగా పనిచేసారు. 1976లో నికోలస్ పీటర్‌సన్‌గారు దావా వేసి సంఘ ఆస్తిని స్వాధీనం చేసుకోగా బాలం యేసుకృపగారు వీరికి సహకరించారు. తదనంతరం ఈ గ్రామంలో వేరే స్థలాన్ని సి. జ్ఞాన ప్రకాశరావుగారు కొని ఆలయాన్ని నిర్మించి సంఘాన్ని పునరుద్ధరించారు.

నీరుల్లిపాలెంలో 1940లోచదలవాడ జోబ్‌గారు సేవ ప్రారంభించగా చింతపల్లి సత్యానందంగారు భార్య సమేతంగా రక్షించబడి బాప్తిస్మంపొంది తన కొబ్బరితోటలో ప్రార్థనా మందిరం నిర్మించారు. పి. జోబ్ మోజెస్, సి. జ్ఞానప్రకాశరావు, సి. మలాకీ, బి. కృపానందం బి. ప్రకాశం తదితరులు ఇక్కడ తరుచుగా వాక్యపరిచర్యచేస్తూ వచ్చారు. యన్. గమానియేలుగారు సంఘ బాధ్యత వహించగా బాలం సంపతరావు, కాసుగార్లు సహాయకులుగా ఉన్నారు. లూక్‌సన్, చింతపల్లి బులివెంకన్నగార్లు పెద్దలుగా ఉన్నారు.

బోళ్ళవారిపాలెం సంఘంలో 'జోబుద్వయం' సి. జోబ్, పి. జోబ్ మోజెస్‌గార్లు వాక్యపరిచర్య చేసారు. ఆరంభంలో కండవల్లి ముసలయ్య గారు వీరి కుమారులు రాజారావు, యోసేపు, మలాకీ, లాజరస్, కండవల్లి వెంకయ్య, చెదలవాడ బులివెంకన్నగార్లు రక్షించబడ్డారు. అటుతరువాత జిన్నూరు వాస్తవ్యులు తెన్నేటి లాజరస్‌గారు ఇక్కడ సేవచేస్తున్నారు. ప్రార్థనాలయం నిర్మాణంలో సి.జి. ప్రకాశరావు, బర్ట్, షార్ట్ సి.కె.థామస్, డా. ప్రభాకర్‌గార్లు ధనసహాయంచేసారు. ఆలయంకప్పు విషయంలో లిల్లీ గారు ఆర్థికసహాయంచేయగా తెన్నేటి లాజరస్‌గారు శ్రమదానంచేసి ఆలయ నిర్మాణానికి తోడ్పడ్డారు. ప్రస్తుతం వీరే ఈ సంఘభారం వహించి పాటు

పడుతున్నారు. ఈ సంఘం పెద్దలు కండవల్లి రాజారావు, ఉందుర్తి మహాలక్ష్మిగారు, చదలవాడ మహాలక్ష్మిగారు తదితరులు. వల్లూరు గ్రామంలో కూడా 'జోబ్ ద్వయం' వల్ల సువార్త సేవ ఆరంభించబడింది. కండవల్లి జీవరత్నం, వెంకన్న, సంపతరావు, చెదలవాడ ఆశీర్వాదం తదితరులు కుటుంబ సమేతంగా రక్షణ పొందారు. యస్. గమానియేలుగారు ఇక్కడ ఆదివారం ఆరాధనలు, రాత్రి కూటాలు జరిపిస్తూ సేవచేసారు. చెదలవాడ ఆశీర్వాదం, కండవల్లి జీవరత్నంగారు పెద్దలుగా ఉన్నారు. గాలింకి టైటస్‌గారు కొంతకాలం సేవలో సహకరించారు.

ఎస్. గమానియేలుగారు శృంగవృక్షం, కె.బి. చెర్వు, అనువాజిపాలెం పి. పోలవరం, గ్రామాల్లో 1957 వరకు, చించినాడలో 1971 వరకు టీచరుగా సువార్త సేవకునిగా ఉన్నారు. కొమ్ముచిక్కాల సంఘస్థాపనకు పాటుపడ్డారు. వీరు పి. పోలవరం సంఘాన్ని అతి నేర్పుగా క్షీణ దశనుండి అభివృద్ధిలోకి నడిపించారు. రిటైరైన తరువాత ఇలపకుర్రులో మకాం ఉంటూ నీరుల్లిపాలెం, బోళ్ళవారిపాలెం తదితర సంఘాలు చూసుకుంటూ అక్కడ యేటేటా ఉజ్జీవ కూటాలుకూడా నడిపిస్తున్నారు. గాళ్ళగుంట గ్రామానికి చెందిన దుద్దే అహరోనుగారు 1959లో సి. జోబ్, పి. జోబ్ మోజెస్‌గార్ల వాక్యపరిచర్యవల్ల రక్షణపొంది యూతుగాస్పెల్ టీములోచేరి సేవచేసారు. పరిసరగ్రామాలైన చినదిబ్బ, రావిపాడు, చాకలిదిబ్బ, ప్రాంతాల్లో సేవ చేస్తున్నారు.

గాళ్ళగుంట గ్రామంలో గంటి మలాకీ, సి. యోబుగార్లు సువార్త ప్రకటించగా దుద్దే గాబ్రియేలు, చెవ్వేటి భూషణం, దానియేలుగార్లు తదుపరి దుద్దే జీవరత్నం, వీరయ్యగారు రక్షణ పొందారు. అటుతరువాత దుద్దే అహరోనుగారురక్షించబడ్డారు. వీరే ఈ సంఘాన్ని అభివృద్ధి చేసారు. ఇక్కడ లిల్లీ షార్టుగార్ల మూలంగా 1500 రూపాయల సేకరణ జరగగా సి. జ్ఞానప్రకాశరావుగారు 6000 వెచ్చించి 5 సెంట్ల స్థలం కొనుగోలు చేసి ఆలయ నిర్మాణానికి దోహదం చేసారు. అహరోనుగారు సంఘకాపరిగా దుద్దే గాబ్రియేలు, సి. దానియేలుగార్లు పెద్దలుగా ఈ సంఘం నడుస్తోంది.

* * *

పాలకొల్లు ఎమ్మాయు ఆలయానికి చెందిన పెద్దలు పరిచారకులు

సువార్తికులు పాలకొల్లు చుట్టుప్రక్కల ప్రాంతాల సంఘాలస్థాపనకు,సువార్త ప్రకటనకు సహాయపడ్డారు. ఈ సంఘపు పెద్దలు, పరిచారకుల నియామకాలు 1942, 1948 సంవత్సరాల్లో దశలవారీగా జరిగినాయి.

ఒరిగేటి ఎబినేజరుగారు ఈసాకుగారి కుమారులు. వీరు 1942లో పరిచారకులుగాను, 1948లో పెద్దలుగాను నియమించబడి 1952వరకు సేవచేసి ప్రభువుతో ఉండేందుకు వెళ్ళిపోయారు. ఈయన బ్రహ్మచారి. యువకుల మధ్య నుంచిసేవను జరిగించారు. పాలూరి ఎలియాజరుగారు మోషేగారి పెద్ద కుమారుడు. 1937నుండి సంఘములలో పరిచారకులుగా ఉంటూ 1940లో సువార్తికునిగా పిలుపునందుకుని టెల్స్లీగారి ఆధ్వర్యంలో 21 సంవత్సరాలు సేవచేసారు. వీరు రంగూన్‌లో ఉన్నరోజుల్లో అక్కడి పాలకొల్లు యువకులను సమకూర్చి 'పాలకొల్లు సంఘ క్రైస్తవ సోదర సమితిని' ఏర్పరచి 1932లో ఆరాధన ఉపకరణాలను సంఘానికి బహూకరించారు. ఈయన శాంతమూర్తి. 1961 జూన్ 16న ప్రభువులో నిద్రించారు.

యేడిది చార్లెస్‌గారు జత్తిగ యోహానుగారి అల్లుడు. కొంతకాలం పరిచారకునిగా పనిచేసి ప్రస్తుతం ఇండియా మిషన్ పాస్టరుగా ఉంటున్నారు. నంద సింగయ్యగారి కుమారుడు నాగయ్యగారు 1948లో పరిచారకుడుగా ఏర్పరచబడి 1956 ఆగస్టు పదిహేనున కాలధర్మం చెందారు. కోడవల్లి ఆశీర్వాదంగారు 1948నుండి 1954 వరకు మెరిపో ఎజ్రాగారు, పాలూరి సుందరరాజు, చుట్టుగుల్ల దేవదానంగార్లు 1948 నుండి కొద్ది సంవత్సరాలు పరిచారకులుగా ఉన్నారు. కంకిపాటి డేవిడ్‌గారు 1942నుంచి పరిచారకునిగాను, 1948నుంచి పెద్దగాను సేవచేసారు. గుంపర్రు సంఘ స్థాపనలో విలియమ్స్‌గారికి సహకరించారు. వడ్లవారిపాలెంలో సంఘాన్ని స్థాపించారు.

పాలూరి జోబ్ మోజెస్‌గారు ఉపాధ్యాయులుగాఉంటూ 1942 నుండి పరిచారకులుగాను, 1948నుంచి పెద్దగానూ సంఘభారం వహించారు. వీరు మోషే శారమ్మగార్లకు జన్మించారు. 1953 నుండి సేవకు ప్రత్యేకించబడి అదే సమయంలో నర్సాపురం ఫీల్డు కౌన్సిలులోను, స్టూవర్డ్సు అసోసియేషన్ సేవకులుగానూ పనిచేస్తున్నారు. 1960లో

జి.డి.యం. స్కూళ్ళను గవర్నమెంటువారు తీసుకోకముందు సుమారు రెండేళ్ళు సూపర్‌వైజర్‌గా పనిచేసారు. సమయాన్ని పాటించి కార్యక్రమాలను చక్కబెట్టడంలో నిపుణతగలవాడు. హెచ్చరించడంలో జర్నబాలాటివాడని వీరితోటివారు వీరిని గురించి సాక్ష్మమిస్తున్నారు. వీరు ప్రస్తుతం వయో వృద్ధులుగా మనమధ్య జీవిస్తూ, నర్సాపురం ఫీల్డు కౌన్సిలు కోశాధికారిగా ఉన్నారు. సంఘాల ఐక్యతకొరకు హెచ్చరిస్తూ, సాత్వీకుడుగా పేరొంది అందరికీ ఆశీర్వాదకారణంగా ఉంటున్నారు.

తోలేటి సుబ్బారావు, ఒరిగేటి ఆశాహేలుగార్లు 1955నుండి పరిచారకులుగా నియమించబడ్డారు. మంద యోహాను, చింద్రిపు తాతయ్య ముప్పిడి సైమన్, పాలూరి సిమ్యోనుగార్లు 1957నుంచీ, చెట్టే ఆనందంగారు 1959నుంచీ పరిచారకులుగా ఉన్నారు. తోలేటి సుబ్బారావుగారు బ్రాహ్మణవంశంలో తోలేరు గ్రామకరణంగారికి జన్మించారు. కె. విజయరత్నంగారి మూలంగా రక్షణ సువార్తను విని మారుమనస్సు పొందారు. గళ్ళా సమూయేలుగారి కుమార్తె సులక్షణమ్మగారిని వివాహమాడారు. 1953లో పాలకొల్లు సంఘంలో చేరారు. 1955నుంచి పరిచారకునిగా 1971నుంచి పెద్దగా సేవ చేసారు. వీరు పరిసర గ్రామాదుల్లో ప్రభువుకు మంచి సాక్షిగా ఉంటున్నారు. సులక్షణమ్మగారు స్త్రీల మధ్య ఆసక్తితో సేవను జరిగిస్తున్నారు. ఈమె రచనలో అనుభవం గలవారు. ముప్పిడి సైమన్‌గారు ఆరవల్లి గ్రామంనుండి వచ్చి పాలూరి యెలియేజరుగారి కుమార్తె మిరియమ్మను వివాహమాడారు. వీరు సంఘపెద్దగా, ఫీల్డు కౌన్సిలు సెక్రటరీగా ఉంటూ దగ్గులూరు సంఘంపట్ల శ్రద్ధవహించి ఆ సంఘాభివృద్ధికి తోడ్పడ్డారు. అక్కడి ఆలయ నిర్మాణం విషయంలోకూడా ప్రయాసపడ్డారు. వీరు బర్ట్‌గారికి అతిప్రియులు.

ఒరిగేటి ఫ్రాన్సిస్‌గారు ఒరిగేటి ఈసాకు, మిరియమ్మగార్లకు జన్మించి 1907 నుండి ఉపాధ్యాయ వృత్తిని స్వీకరించారు. చెట్టిపేట ప్రాంతంలోను తదుపరి రంగూన్‌లో టీచరుగా ఉంటూ సువార్త సేవచేసారు. రంగూన్ సేవలో వీరు ఎలియేజరుగారికి సహకారిగా ఉన్నారు. జిన్నూరు, లంకలకోడేరు, వేడంగి, ఉల్లంపర్రు మొదలైన గ్రామాల్లో రాత్రి కూటాలు నిర్వహించి యువకులను ప్రోత్సహించారు. 1948నుంచి పరిచారకులుగా, 1957

నుంచి పెద్దగా ఉంటూ సంఘ కార్యదర్శిగా, ఫీల్డు కౌన్సిలు ఉపాధ్యక్షులుగా కూడా ఉన్నారు. వీరు గద్య పద్య కవితల్లో ప్రవేశమున్నవారై, చరిత్రాంశాలలో ఆసక్తి కలిగి ఎమ్మాయియు ఆలయ శతవార్షికోత్సవ సమయాన ప్రచురింపబడిన చరిత్ర పుస్తకాన్ని రచించారు. ప్రస్తుతం ఈ 150 ఏళ్ళ చరిత్ర గ్రంథ రచన సమయంలోకూడా వీరు పూనుకుని అనేక రీతుల్లో సహాయం చేసారు. వీరుకూడా వృద్ధాప్యంలో ఇంకా సంఘ బాధ్యతలను నెరవేరుస్తూ ఉన్నారు.

స్పర్జన్ పీటర్సన్‌గారు 1936 జనవరి 13న జేమ్సు, జేనమ్మ పీటర్సన్ గార్లకు జన్మించారు. 1952లో సి.ఇ.యస్. అధ్యక్షునిగాను, అటుతరువాత సండేస్కూలు సూపరింటెండెంటుగాను పనిచేసి ఇప్పటికీ సండేస్కూలుసేవలో కొనసాగుతున్నారు. 1971లో సంఘ పరిచారకులుగా నియమించబడ్డారు. వీరి సువార్త సేవ ప్రథమంగా హైందవులమధ్య ఆరంభించి ఒక కాపు కుటుంబాన్ని ప్రభువులోకి నడిపించారు. అడవిపాలెం, వరిధనం, బోయినపల్లి గ్రామాల్లో సేవ నారంభించి సంఘాలు స్థాపించి డాక్టర్ ప్రభాకర్, డాన్సన్‌రాజు, సిలా ఎలీజా గార్ల సహాయంతో ఆలయ నిర్మాణం గావించారు. 1981లో సంఘపెద్దగా ఎన్నికైనారు. తన వాక్యపరిచర్యవల్ల నూరుసునస్సుపొందిన అన్ని కులాలకు చెందిన అన్యులకు వీరే బాప్తిస్మమిచ్చారు. సంఘంలో వీరు వాక్యం ప్రకటించే సమయంలో వీరి వాక్యానుభవం, నిర్మొగమాటంగా వాక్యానుసారంకానిదాన్ని ఖండించే విధానంచూసి వీరి పూర్వికుడైన తొత్తరమూడి పేతురుగారి లక్షణాలు వీరిలో మూర్తీభవించాయని ఒరిగేటి ప్రాన్సిస్‌గారు వీరిని గురించి సాక్ష్యమిచ్చారు.

సంగిరెడ్డి లక్ష్మిరెడ్డిగారు కడపజిల్లా పులివెందుల తాలూకా సింహాద్రిపురంలో జన్మించార . తన 16వ యేట రక్షణ సువార్తనువిని ప్రభువునంగీకరించారు. అనంతపురం ఐ.టి.ఐ లో చదువుతుండగా అగ్రిప్ప గారివల్ల బలపరచబడి 1953 మే నెలలో బాప్తిస్మం పొందారు. 1956 వరకు బెంగుళూరు హిందూస్థాన్ ఎయిరోనాటికల్ లిమిటెడ్ కంపెనీలో ఉద్యోగంచేసి విరమించుకొని 1960లో పాలకొల్లులో స్థిరపడి స్థానిక సంఘ సభ్యునిగా చేరారు. 1954లో పాలకొల్లుకు చెందిన దుద్దే

శాంతారావుగారి కుమార్తెను వివాహమాడారు. 1974నుంచి సంఘ పరిచార కులుగా నియమించబడ్డారు సువార్తలో ఆసక్తి కలిగి పెనుమదం సంఘ స్థాపనలో కృషిచేసారు.

వీరభద్రపాడు వాస్తవ్యుడు తవిటికి దైవకటాక్షంగారి కుమారుడు తవిటికి జార్జిగారు. పాలకొల్లులో సిరికొట్ల వైడూర్యమ్మగారి కుమార్తె కేసరీబాయిని వివాహమాడడంద్వారా వీరికి పాలకొల్లు సంఘంతో సంబంధం ఏర్పడింది. సంఘ పరిచారకునిగా నియమించబడ్డారు. కొంతకాలం నౌకా దళంలో పనిచేసి బొంబాయి మొదలైన నగరాల్లో ప్రభువు సాక్షిగా ఉంటూ నర్సాపురంలో జీవజలములు సంస్థలో పనిచేస్తున్న తుంపిరి జోన్స్ సిడ్నీగారు విరమించుకున్న పిదప ఈ సేవను చేపట్టారు. గ్రామాల్లో విస్తృతంగా పర్యటిస్తూ వాక్యపరిచర్య చేస్తున్నారు. మహాసభల కార్యదర్శిగా, నర్సాపురం ఫీల్డు కార్యదర్శిగా పనిచేస్తూ ప్రస్తుతం నర్సాపురంలో కాపురముంటున్నారు.

చదలవాడ జాసన్‌గారు టైటస్‌గారి కుమారులు. సంఘపరిచార కునిగాఉంటూ 1984లో మృతి చెందారు.

చుట్టుగుల్ల ఆల్బర్‌గారు దేవదానంగారి కుమారుడు. చుట్టుగుల్ల ఫిలిప్పుగారి మనుమడు. 1980లో సంఘ పరిచారకునిగా నియమించబడ్డారు. వీరికి సేవలో అన్నగారైన ఫ్రెడ్డీ డిక్సన్‌గారు, బావగారైన తుంపిరి జోన్సు సిడ్నీగారు సహకరిస్తున్నారు. వీరు స్వచ్ఛందంగా సేవచేస్తూ దొడ్డిపట్ల మొదలైన గ్రామాల్లో సంఘాలు స్థాపించారు.వీరు క్రైస్తవుల ఉపయోగార్థం క్రొత్త సమాధుల దొడ్డిని మునిసిపాలిటీనుండి శాంక్షన్ చేయించడంలో ప్రయాస పడ్డారు.

చార్లెస్‌గారి కుమారుడు మాముడూరి అగస్టీన్‌గారు, మంద దానియేలుగారు, రాపాక జోనాగారు, మంద విక్టర్‌గార్లు 1980లోను మంద జోసెఫ్‌గారు 1984లోను పరిచారకులుగా నియమించబడ్డారు. దుద్దే శాంతారావుగారు ఈ ప్రాంతంలో స్వచ్ఛందసేవ చేశారు. గంటి మలాకీగారి కుమారులు గంటి డేవిడ్‌గారు కొద్దికాలం సండేస్కూలులోను సి.ఇ.ఎస్. లోను సహకరించారు. ఎమ్మాయు శతవార్షిక జ్ఞాపకార్థ చరిత్రను ప్రచురించడానికి వీరు ధనసహాయం చేశారు.

పాలకొల్లు ప్రాంతీయ సంఘాలనేకం ఎమ్మాయు ఆలయానికి చెందిన విశ్వాసులచే స్థాపించబడినాయి. రాసిపాడును గంటి పులాక్షీ, పెనుమాక అహరోనుగార్లు, గాళ్ళగుంట, ఆసగలదిబ్బ సంఘాలను గంటి మలాకీ, గళ్ళా సమూయేలుగార్లు, చింతలదిబ్బను తాడికొండ విలియమ్సు, కంకిపాటి డేవిడ్‌గార్లు, వరధనంను—మామూడూరి ఆపొల్లో, బ్రామ్లిగార్లు, దిగమర్రును—ముప్పిడి హిజ్కియాగారు, పోలవరంను పాలూరి మోషేగారు, అటుతరువాత తిరిగి నూతనంగా నేస్మిత్, భగవాన్‌రాజు, నోబేదుగార్లు, జిన్నూరును పాలూరిమోషే, జారియమ్మగార్లు, చాకిరేవుగుంటను—జేమ్సు పీటర్‌సన్, ముప్పిడి హిజ్కియాగార్లు, వాంపర్రును ముప్పిడి హిజ్కియా గారు, చింతపర్రును రాబర్ట్సు కాసుగారు, నేలంగిని ఒరిగేటి ఫ్రాన్సిస్, ముప్పిడి సైమన్‌గార్లు, వడ్లవారిపాలెంను కంకిపాటి డేవిడ్‌గారు, దగ్గులూరును జోబు మోజెస్, పుట్టుగుల్ల దేవదాసంగార్లు, లంకలకోడేరును యార్లగడ్డ సాలమన్ డేవిడ్ ఒరిగేటి ఆశాహేలుగార్లు స్థాపించారు. వరిధనం, అడివి పాలెంలో స్పర్జన్‌పీటర్‌సన్‌గారు సంఘాంను స్థాపించి స్థిరపరిచి సక్రమమైన రీతిలో నడిపిస్తున్నారు. అడివిపాలెంలో యలమర్తి క్రిష్టయ్య (క్రిష్టొఫర్) పాలమూరి నాగేశ్వరావు (శాంతారావు) కలికిలి ఆలీస్, మునపూడి యోహాను గార్లు పెద్దలుగ ఉన్నారు. యువకులమధ్య యలమర్తి మోహన్‌రావు, సుధాకర్‌బాబు, ఉల్లంపర్తి వెంకటేశ్వరావు (ఇమ్మానుయేలు)గార్లు కార్యక్రమాలను నడిపిస్తున్నారు. వరిధనం సంఘంలో తెన్నేటి తాతయ్య, తెన్నేటి నారాయణరావు, నతానియేలుగార్లు పెద్దలుగా ఉన్నారు.

జిన్నూరు చాకిరేవుగుంట సంఘ బాధ్యతను జేమ్సుపీటర్‌సన్‌గారు కొంతకాలం నిర్వహించారు. ఆరంభంలో తెన్నేటి పెదస్వామి, చినస్వామి, సూరయ్య, చంద్రయ్యగారు పెద్దలుగాఉండి నడిపించారు. ఆలయంలేని సమయంలో 1955 ప్రాంతంలో తెన్నేటి జక్రయ్యగారు స్థలాన్ని ఇచ్చి అక్కడ ఆలయ నిర్మాణంకూడా కావించారు. వీరికాలంలో చీలి వెంకట్రావుగారుకూడా పెద్దగా ఉన్నారు. జకరయ్యగారు 1969లో మృతిచెందగా వీరి కుమారుడు తెన్నేటి లాజరస్‌గారు ఫీల్డు పనివానిగా సంఘంపెల్లి నియమింపబడి సంఘ బాధ్యతను చేపట్టారు. 1978–79లో ఆలయం పైకప్పు పాడైపోగా లిల్లీగారు ఆర్థిక సహాయంతో లాజరస్‌గారి

ఆధ్వర్యంలో ఈ పైకప్పునిర్మాణం పూర్తయింది. ప్రస్తుతం జిన్నూరు సంఘ పెద్దలుగా తెన్నేటి యోనా, తెన్నేటి సంసోనుగార్లు ఉంటున్నారు.తెన్నేటి లాజరస్‌గారు ఈ సంఘంలోనే కాకుండా పరిసర గ్రామాల్లోకూడా వాక్య పరిచర్య చేస్తున్నారు.

ఇంతకుముందే ప్రస్తావించినట్లుగా తాడికొండ విలియమ్సు, పాటూరి ఎలియేజరు, జత్తిగ సభాపతిగార్లు క్రైస్తవయౌవ్వ సమాజాన్ని 1911లో స్థాపించారు. యార్లగడ్డ సాలమన్ డేవిడ్‌గారు దీని అభివృద్ధికి పాటుపడ్డారు. స్త్రీల సమాజాన్ని బ్రాహ్మీ సతి పాలకొల్లు సంఘంలో ప్రారంభించింది ఈ కూటాలను మిస్. మోర్గన్ కొంతకాలం భారం వహించి నడిపించింది. క్రమేణా పెద్దవారితోబాటు యువతులుకూడా చేరడంతో యవ్వన క్రైస్తవ సమాజంగా ఏర్పడింది. దీనిని ముప్పిడి సిరాసమ్మ, తాడికొండ కాంతమ్మ గార్లు నడిపించేవారు. నేస్మిత్, బర్న్స్ సతీమణులు దీని అభివృద్ధికి కృషి చేశారు. చివరికి మిస్. టిల్‌స్లీ ఈ సమాజంపట్ల శ్రద్ధవహించడంవల్ల వై.డబ్ల్యు.సి.ఎ. ప్రత్యేక ప్రార్థనా కూటం నడుపుకోవడం, తీర్థాల్లో సువార్త ప్రచారం తదితర కార్యక్రమాలను చేపట్టడంలో ముందంజ వేస్తున్నారు. ప్రస్తుతం దీన్లో బాధ్యత వహించి సేవ చేస్తున్నవారు తోలేటి సులక్షణమ్మ, ముప్పిడి మిరియమ్మ, తుంపిరి నవామణి, ముప్పిడి కమలమ్మ, మాముడూరి హైమావతి, గంగిరెడ్డి రమణమ్మ, చదలవాడ జెస్సీబాయి, కండవల్లి కృపామణి, మందకృపమ్మ, మామూడూరి అమ్మాణి, దుద్దే సరోజిని, మైలాబత్తుల కమలమ్మ, రేపాక జోయ్ మొదలైనవారు. పుల్లమ్మ (దయావతి), భద్రమ్మ (సలోమి) గార్లు అన్యులలోనుండి రక్షించబడి ప్రభువుపక్షంగా నుంచి సాక్ష్యులుగా ఉంటున్నారు.

ఎమ్మాయి ఆలయం 5వసారి 1949లో 8000 రూపాయల ఖర్చుతో రీమోడలింగు చేయబడింది. 1961 శతవార్షికోత్సవ సందర్భాన ఆరవసారి గోడలను ఎత్తుచేయించి మంగుళూరు పెంకులతో కప్పించడానికి 4,319 రూపాయల వ్యయం అయింది. ఈ పుస్తకం రాస్తున్న సమయంలో ఏడవసారి ఈ ఆలయాన్ని మరింత విశాలంగా ఆధునికంగా కట్టడంకోసం ప్రయత్నం జరుగుతున్నది. శతార్థవార్షికోత్సవాల సమయానికి అన్ని హంగులతోనూ ఆలయ నిర్మాణం పూర్తిచేసి ప్రతిష్ఠించాలని విశ్వాసులు

నిశ్చయంతో ఉన్నారు. మిషనెరీవారినుండి ఎదురుచూసిన సహాయం సకాలానికి అందనందువల్ల ఈ నిర్మాణం కొంత ఆలస్యమైనదని తెలుస్తోంది.

ఈ కాలంలో ఎంబేరియన్‌పేట సంఘం గురించి బాధ్యత వహించి దాన్ని అన్నివిధాలా అభివృద్ధిలోకి తెచ్చినవారు చదలవాడ దానియేలుగారు. వీరు 1913లో జన్మించారు. వీరికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. 1973నుండి పెద్దగా ఉంటూ ఆలయాన్ని రీమోడలింగు చేయించారు. మంచినీళ్ళ చెరువుచుట్టూ గోడ కట్టించారు. ఈ సంఘంలో పెద్దలుగా సేవచేసిన వారెవరంటే—సంఘస్థాపనకాలంలో చదలవాడ ఇస్సాకు, ఆనందం, కోడవల్లి తాతయ్య, తానేటి సుదర్శనం, చీలి అప్పలస్వామిగార్లు, తరువాతి దశలో చదలవాడ యోబు, గంగోలి చిట్టియ్య, కోడవల్లి రాజారావు చదలవాడ పోలీసుగార్లు, తృతీయ దశలో కోడవల్లి చినరామన్న, తానేటి పల్లియ్య, చదలవాడ ఆశీర్వాదం, చదలవాడ ఏలీయా, చదలవాడ సమూయేలు గార్లు. 1975లో చదలవాడ డాన్సన్‌రాజుగారు, స్పర్జన్ పీటర్‌సన్ సంద్యాల కాశీ విశ్వేశ్వరరావు, రాపాక సతార్‌సింగ్, దిగుమర్తి సువర్ణరాజు, యార్లగడ్డ రమేష్ మొదలైనవారు సంఘ కార్యక్రమాలనూ, యూత్ ఫెలోషిప్పును నడిపించారు. ఈ కాలంలోనే యువతీయువకులు చక్కని క్వయర్‌ను ఈ సంఘంలో ఏర్పాటు చేసారు.

ప్రస్తుతం ఎంబేరియన్‌పేట సంఘానికి చదలవాడ పోలీసు, యోహాను యాకోబు, తిరపయ్యగార్లు తదితరులు సంఘ బాధ్యత వహించి సేవ చేస్తున్నారు. సి. తిరపయ్యగారు నర్సాపురంలో ఉంటూ ఈ సంఘంపట్ల భారం కలిగి క్రమంగా దర్శిస్తూ సంఘ కార్యక్రమాలకు విశేషంగా చేయూత నిస్తున్నారు.

# 22

# అమలాపురం

మిస్ మన్రోతో కలిసి మిస్ డయాసన్ హవున్‌బోటు సువార్తీకరణలో అమలాపురం పరిసరాలను సందర్శిస్తూ, కరపత్రికలు పంచిపెడుతూ 20 ఏళ్ళు సేవచేసిందనీ 1950లో ఎన్.ఇ. కూపర్‌గారిని వివాహమాడి ఫిజీద్వీపానికి వెళ్ళిపోయిందనీ తెలుసుకున్నాము. 1952లో వోసారి ఇండియా వచ్చి తిరిగి న్యూజిలాండు వెళ్ళిపోయి 1956దాకా ఈ దంపతులు అక్కడనే ఉండిపోయారు. ఆ యేడు సెప్టెంబరు 25న కూపర్‌గారు మరణించారు. 1959లో కూపర్‌సతి తిరిగి ఇండియాకువచ్చి బెండమూర్లంక పరిసరాల్లోని జనాభా అంతటికీ సువార్త ప్రకటించడానికి పూనుకున్నారు. మళ్ళీ మిస్ మన్రోతో కలిసి చిన్న పిల్లల మధ్య సేవ, స్త్రీలకు బైబిలు స్కూళ్ళు నడిపించడంలో కృషిచేసారు. 1960నుండి స్త్రీలకు జరిపిన బైబిలు తరగతులవల్ల గొప్ప ప్రయోజనం కనిపించింది. గ్రామాల్లోనూ ఉత్సవాల్లోనూ వేలకొద్ది కరపత్రికలు పంచడం జరిగింది. 1963లో కూపర్‌సతి అంబాజీపేట వెళ్ళిపోయింది.

మిస్ మన్రో (1922–1960), మిస్ ఎమిలి స్టార్క్ (1904–1952) మిస్ రోడ్స్ (1899–1952), జెస్సీవెబ్ (1921–1953), మోరిసన్ (1925–1951), మాత్యూబ్రౌన్ (1904–1937) తదితరులు ఈ ప్రాంతంలో చేసిన సేవను గురించి ముందే తెలుసుకున్నాము. వీరుగాక సి.హెచ్. బర్‌గారు 1950లో ఇండియా వచ్చి నర్సాపురంలోని కుష్టురోగుల ఆస్పత్రి, స్త్రీల ఆస్పత్రుల్లో ఇంజనీరింగు వ్యవహారాలను కొంతకాలం చూసుకున్నారు. కొంతకాలం అమలాపురంవచ్చి మిషన్ బంగళాలో ఉండి సేవచేసారు.

* * *

ప్రస్తుతం అమలాపురం సంఘాన్ని కొంకిముత్యాలు, ఎ. సుందరం, తాళ్ళ సామియేలు, యేసయ్య, పి.యస్ సత్యనాథంగార్లు పెద్దలుగా ఉండి నడిపిస్తున్నారు. కె. జాన్‌పీటర్, ఎన్. అంజేష్, ఎ. సామ్యేలుగార్లు, పరిచారకులుగా ఉన్నారు. మూడునెలలకోసారి ప్రాంతీయఫీల్డు కౌన్సిలు సంవత్సరానికి ఒకసారి బైబిలుక్లాసు మహాసభలు జరుగుతున్నాయి. తాళ్ళ సామ్యేలుగారు సంఘ ప్రసిడెంటుగాను, జాన్‌పీటర్‌గారు సెక్రటరీగా, అంజేష్ గారు కోశాధికారిగా ఉన్నారు.

కొంకి ముత్యాలుగారు ఎన్. కొత్తపల్లి గ్రామానికి చెందిన కొంకి పెంటయ్య, గంగమ్మగార్ల పుత్రుడు. 1897లోనే వీరితల్లిదండ్రులు ప్రభువునంగీకరించి అమలాపురంవచ్చి మిషనెరీవారి సహాయంతో పిల్లలను చదివించారు. గాబ్రియేలు, స్తోత్రం, సత్యవతమ్మ, శారమ్మగార్లు వీరి తోబుట్టువులు. అమలాపురం, నర్సాపురం బాప్టిస్టు బోర్డింగులో ముత్యాలు గారు చదువుకుని నర్సాపురం హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో, అమలాపురం, పాతళ్ళదిబ్బ, మోరిపాడు స్కూళ్ళలో పనిచేసారు. ఈ ప్రాంతా లన్నిటిలో వీరు బహు ఘనమైన సేవ చేసారు. వీరు అమలాపురం సంఘాధ్యక్షులుగాను, ఎ.జి.డి.ఎం.ఎ. కు ఎగ్జిక్యూటివ్ మెంబరుగాను ఉన్నారు. వీరి సోదరులు గాబ్రియేలుగారు అమలాపురం స్కూల్లోనే పనిచేస్తూ భార్యతో కలిసి సువార్త యాత్రలు చేసారు. వీరి పెద్ద కుమారుడు కొంకి జాన్‌పీటర్‌గారు స్కూళ్ళ డిప్యూటి ఇన్‌స్పెక్టరుగా అమలాపురం, కొత్తపేట ప్రాంతాల్లో పనిచేస్తూ ప్రభువును విశ్వసించి బాప్తిస్మంపొంది అమలాపురం సంఘ కార్యదర్శిగా ఉంటూ పనిచేస్తున్నారు. వీరి భార్య లోరా సండేస్కూలు టీచరుగా పనిచేస్తూ ఎనలేని సేవ చేసారు.

అంబటి ఆండ్రూగారు విలస గ్రామంలో అంబటిస్వామి అచ్చమ్మ గార్లకు జన్మించిన ఏకైక పుత్రుడు. వీరు నర్సాపురం హైయర్ ఎలిమెంటరీ స్కూలులోను, అమలాపురంలోనూ టీచరుగా పనిచేసారు. వీరు అగ్రకులాల వారిని రక్షణవెలుగులోకి తెచ్చేందుకు ప్రయాసపడ్డారు. వీరు గొప్ప బైబిలు టీచరు. శాంతమూర్తి. ఒకసారి చొప్పరామన్న గూడెంలో బొల్లిపో వీరన్న గారిని వ్యతిరేకిస్తూ కొందరు పెద్ద అలజడిని రేపితే అంబటి ఆండ్రూగారు

మరొక సంఘపెద్దతో కలిసి అక్కడికివెళ్ళి బహుసమర్థవంతంగా ఆ వివాదాన్ని పరిష్కరించారు. ఆండ్రూగారు 1968లో తనువు చాలించారు.

పాతళ్ళదిబ్బ సంఘంలో 1935లో మోరిసన్‌గారి కృషివల్ల పోతుల పెంటయ్య, పోతుల నరసింహం, పోతుల వెంకన్న, మడకల సత్యంగార్లు, వారి కుటుంబాలు బాప్తిస్మం పొందారు. ఇక్కడ కొంకి ముత్యాలుగారి కృషి వల్ల ఆలయం నిమిత్తం గట్టి కట్టడం పైన ఆకుతో కుట్టించారు. సరెళ్ళ దేవదానం, యేళ్ళ విక్టర్ పెంటయ్యగార్లు చందాలు సమూలుచేసి పెంకులతో కప్పువేయించారు. ప్రస్తుతం ఈ సంఘంలో సరెళ్ళ దేవదానం అబ్రహాము, పోతుల పెంటయ్య, మెండు రాజారావు, ముడకల సత్యం, రామమూర్తిగార్లు సంఘభారం వహించి సేవచేసారు. యేళ్ళ విక్టర్‌గారు పాస్టరుగా, మడకల సత్యంగారు సండేస్కూలు టీచరుగాను సేవ చేసారు.

సరెళ్ళ దేవదానంగారు 1906లో జన్మించారు. వీరి తల్లి డోరమ్మ గారు. అమలాపురం అగ్రకుల బాలికల స్కూల్లో టీచరు, జి.డి.యం. బాలుర పాటశాలలో టీచరుగా పనిచేసేవారు. వీరు నర్సాపురం, అమలాపురంలో శిక్షణపొంది పాతాళ్ళదిబ్బలో టీచరుగా పనిచేస్తూ సంఘసేవ సండేస్కూలు సేవను చేపట్టారు. 1964లో రిటైరైనతరువాత సంపూర్ణ సువార్త సేవకునిగా సమర్పించుకుని స్థానిక సంఘంలోను, చల్లపల్లి సరిపల్లి మొదలైన గ్రామాల్లోని సంఘాలను క్రమంగా దర్శిస్తూ సేవచేస్తున్నారు. వీరు ప్రస్తుతం పాతళ్ళదిబ్బ సంఘకాపరిగాను, ఎ.జి.డి.యం ఎ. లో మెంబరుగా ఉన్నారు

యేళ్ళ విక్టర్‌గారి తండ్రి మరణించగా వీరి తల్లి రమణమ్మగారు పిల్లలను వెంటబెట్టుకుని అమలాపురంవచ్చి ఆండ్రూగారి ఆధ్వర్యంలో మిషన్‌స్కూల్లో పనిచేశారు. అమలాపురం సంఘపెద్దగాను, నర్సాపురం మిషన్‌హైస్కూలు కమిటీ మెంబరుగా, స్టూవర్డు అసోసియేషన్‌కు సభ్యులుగా ఉన్నారు. యేళ్ళ సాల్మన్‌గారు నర్సయ్య, సుబ్బమ్మగార్లకు జన్మించారు. సంఘాల్లో వాక్య పరిచర్య తరుచుగాచేస్తూ, ప్రస్తుతం ప్రభువు సన్నిధికేగారు.

పారకుళం మునిస్వామిగారిని మక్కేగారు మద్రాసునుండి బట్లరుగా

తీసుకువచ్చి పాలకొల్లులో మందవారి ఆడబడుచునుఇచ్చి పెళ్ళిచేసారు. వీరికి సత్యనాథంగారు జన్మించారు. అమలాపురంలో టీచరుగా ఉంటూ వాక్యపరిచర్య చేసేవారు. వీరు నడవపూడిలో సంఘాన్ని స్థాపించారు.

కొల్లాబత్తుల యేసయ్యగారు నర్సాపురం కొల్లాబత్తుల ముత్యాలు మేరీగార్లకు జన్మించి కొంతకాలం మిలటరీలో ఉండి అమలాపురం సంఘంలోను, పరిసర గ్రామాల్లోను సేవచేస్తున్నారు.

తుమ్మలపల్లికి మిస్ బ్లేక్ వైద్యసేవ నిమిత్తం, మిస్ కూపర్ సువార్తసేవ నిమిత్తంవచ్చి బెండమూర్లంక సంఘం క్షీణించినందువల్లనూ ఆలయం గాలి వర్షాలకు కూలిపోయినందువల్లను, ఆ మిషన్ బిల్డింగు సామాగ్రి తెప్పించి తుమ్మలపల్లిలో ప్రార్థన మందిరం పెంకుల కప్పుతో కటి ంచారు. అప్పటికి 20యేళ్ళక్రితమే మిస్. రాబర్ట్సన్, మిస్. మార్షల్‌లు స్వదేశానికి వెళ్ళిపోయారు. తుమ్మలపల్లిలో ఈ కాలంలో నల్లి వెంకటరెడ్డి బొంతు లక్ష్మయ్య, రాపాక సోదరులు, ధనుము సోదరులు ప్రభువును నమ్ముకున్నందువల్ల సంఘం అభివృద్ధి చెందింది. కొమరగిరిపట్నం మిలటరీ కాలనీలో గవర్నమెంటువారిచ్చిన స్థలంలో ఆలయం నిర్మించిన తరువాత అర్జున్నగారు, ధనుముగారు, బుల్లి వెంకన్నగారు, దానియేలుగారు, సికిలే వెంకన్నగారు, తుమ్మలపల్లినుండివెళ్ళి వాక్యం ప్రకటించేవారు. అన్నికులాల వారు ఆ కాలంలో ఆరగట్లపాలెం, బెండమూర్లంక తదితర గ్రామాలనుండీ తుమ్మలపల్లికివచ్చి ఆరాధనలో పాల్గొనేవారు. ప్రస్తుతం తుమ్మలపల్లి సంఘంలో కె. హృదయరాజుగారు వై.యం.సి.ఎ. ను నడిపిస్తున్నారు. క్రొట్టు దానియేలు, బులివెంకన్న, సికిలే వెంకన్న నల్లి వెంకటరెడ్డిగార్లు సంఘకాపరులుగాను: సామ్యేలు, వడ్డిరాజు, క్రొట్టు మోషే, సూర్యరావు, శ్రీనివాసరావు, ఆనందరావు తదితరులు పరిచారకులుగాను ఉండి సంఘాన్ని నడిపిస్తున్నారు.

క్రొట్టురెడ్డి గంగమ్మగార్లకు దానియేలుగారు 1914లో జన్మించారు. తుమ్మలపల్లి, అల్లవరంలో ప్రాథమిక విద్య ముగించుకుని కాకినాడలో టీచరు ట్రెయినింగు పాసై తుమ్మలపల్లి, బెండమూర్లంక కాపవరం (తణుకు) సోమేశ్వరం (రామచంద్రపురం) గ్రామాల్లో టీచరుగా పనిచేసారు. బెండమూర్లంకకుచెందిన కులస్థులు, ఆరగట్ల పాలెంకు చెందిన

చింతలపూడి ముత్యాలమ్మ, కొల్లాటి వెంకట్రావు, నాగరత్నమ్మగార్లు వీరి పరిచర్యమూలంగా ప్రభువును విశ్వసించి వీరివల్ల బాప్తిస్మం పొందారు. 1971 నుండి సంపూర్ణ సువార్త సేవకునిగా ఈ ప్రాంతాల్లో విస్తృతంగా వాక్యపరిచర్య చేస్తున్నారు.

ముక్తేశ్వరం గ్రామంలో జె.యం. దానియేలుగారు సేవ ప్రారంభించగా 13 మంది విశ్వసించారు. బూల దానియేలుగారు వీరికి బాప్తిస్మ మిచ్చారు. వీరు నక్కా వెంకటస్వామి, పెయ్యల నతానియేలు, గుమ్మడి అబ్రహాము, యేళ్ళ మరియమ్మ, పెయ్యల రూతమ్మ, జుత్తుగ పార్వతమ్మ, జుత్తుగ అన్నమ్మ, గుమ్మడి శారమ్మ, రేవు కరుణమ్మ, ముత్తాబత్తుల గ్రేసమ్మ, గెడ్డం జఖర్యా, గెడ్డం ఎలీసబెత్తమ్మ, మోకా సంతోషమ్మ అనేవారు. కొంకి ముత్యాలు, జె.యం. దానియేలుగార్లు మరికొందరికి బాప్తిస్మాలిచ్చారు. జె.యం. దానియేలుగారు కాకినాడ జిల్లా పరిషతు ఆఫీసులో గుమస్తాగా పనిచేస్తూ భార్య ముక్తేశ్వరంలో గవర్నమెంటు ఆస్పత్రిలో నర్సుగా పనిచేస్తున్నందువల్ల ఈ ఊళ్ళో సేవ ప్రారంభించారు. 1966లో రిటైరై ఈ సంఘ క్షేమం కొరకు సంపూర్ణ సేవకునిగా పాటుపడుతున్నారు.

ముక్తేశ్వరం పడమటిపాలెం సంఘంలో కొంకి ముత్యాలుగారు టీచరుగాఉంటూ పిల్లలకు సండేస్కూలు నడుపుతుండేవారు. మిషనేరీలను అమలాపురంనుండి బోధకులను రప్పించి వాక్య పరిచర్య చేయించేవారు. ఈవిధంగా 10మంది బాప్తిస్మం పొందారు. యేళ్ళ విక్టర్, కె. యోషయు టి. సామ్యేలు, రాజమ్మ, నాగమ్మగార్లు తరుచు వచ్చి వాక్యపరిచర్యచేసి వీరిని బలపరిచారు. యేళ్ళ రెడ్డిగారి జ్ఞాపకార్థం వారి భార్య రాజ పుష్పమ్మ గారు 10వేల రూపాయల వ్యయంతో ఆలయం నిమిత్తమై పెంకుటి శాల నిర్మించారు. రాజపుష్పమ్మగారు, అటుతరువాత అజరయ్యగారు కలిసి వర్ధనపు సంజీవరావుగారిని ఇక్కడ సేవకునిగా నియమించారు.

కొమరగిరి పట్నంలో యేళ్ళ విక్టర్, కాట్రు అర్జునగార్లు 1948లో సేవ ప్రారంభించగా ఆయా ప్రాంతాలకు చెందిన మిలటరీవారు ఇక్కడ సమావేశం కాసాగారు. తుమ్మలపల్లినుండి కొంకి ముత్యాలు,అంబటి ఆండ్రూ మోరిసన్, వెబ్‌గార్లు, మిస్. మన్రో తదితరులు వచ్చి వాక్యం వినిపించేవారు.

పేతురు, ఆనందం, విక్టర్, గెడ్డం సొలోమోను, యార్లగడ్డ దానియేలుగార్లు ఈ సంఘంలో సేవ చేస్తున్నారు. ఈ సంఘస్థులంతా క్షంచుమించు అందరూ రిటైర్డైన మిలటరీ ఉద్యోగులే.

కేసనకుర్రు గ్రామంలో 1940లో మిషనెరీలు పెద్దలు అమలాపురంనుండివెళ్ళి వాక్యం బోధించారు. మోరిసన్‌గారి సహాయంవల్ల అంబటి ఆంద్రూ, కొంకి ముత్యాలుగార్లు చిన్న ఆలయం నిర్మించి కూటాలు జరిపించ సాగారు. ఆ కాలంలో చిట్టియ్య, సామ్యేలు, మత్తయి .యోసేపు, మార్కు, యార్లగడ్డ వెంకటరెడ్డి మొదలైనవారు ఇక్కడి ప్రథమ విశ్వాసులు. ఆటుపైన మరొక 20మంది బాప్తిస్మం పొందారు. మోరిసన్ మిస్ లీజరుగార్ల ధనసహాయంతో ఇటుకల గోడలమీద తాటాకుల కప్పుతో ప్రార్థనాలయం నిర్మించడం జరిగింది. ముమ్మిడివరంనుండి కె. వెంకట్రావు గారు తరుచుగావెళ్ళి వాక్యపరిచర్య చేస్తుండగా లంక బుల్లియ్య, ప్రభుదాసు గార్లు సహాయపడుతున్నారు. దీన్నే ఐలండ్ జి.డి.యం. సంఘం అని కూడా అంటారు.

ముమ్మిడివరం సంఘ ఆలయానికి జోసెఫ్‌గారు కొంత ధనసహాయం చేసి మర్రేగారుకొన్న 10సెంట్ల స్థలంలో ఆలయం కట్టించారు. ఆటుతరువాత వంగలపూడి లాజరు, సి. జోబు మోజెస్‌గార్ల ప్రయత్న ఫలితంగా మిస్. లీజరు, అమలాపురం పెద్దలు, నర్సాపురం పెద్దలు, పాలకొల్లు స్త్రీల సమాజం చందాలు వేసుకొని పెంకుడు కప్పుతో ఆలయాన్ని విశాలంగా కట్టించడం జరిగింది. వెంకట్రావు, విలియంగార్లు సంఘ భారం వహించారు. విలియంగారి భార్య యునైసమ్మగారు సండేస్కూలు నడిపిస్తున్నారు.

చదలవాడ థామస్‌గారు 1890లో అమలాపురంలో ఉంటూ 1894లో ముమ్మిడివరం వచ్చి కొన్నాళ్ళు ఇక్కడ టీచరుగాను, సంఘుకాపరి గాను పనిచేసారు. ఆ అభిమానం చొప్పున చదలవాడ జోసెఫ్‌గారు, సతీమణి వైడూర్యమ్మగారితో ఈ గ్రామాన్ని దర్శించారు. ఈ సంఘంలోని సహోదరులసేవ ఫలితంగా అగ్రకులంవారిలోనుండి రెడ్డి సోమాలమ్మ, రెడ్డి అన్నేలమ్మ అనేవారు రక్షణపొంది కొంకి ముత్యాలుగారివల్ల 1974లో బాప్తిస్మం పొందారు. పై పేరాగ్రఫ్‌లో చెప్పిన కొండేపూడి వెంకట్రావుగారు



మౌంట్‌బాన్ బ్రదరెన్ కాన్ఫరెన్స్ - మే 1951



వాసా యోహానుగారు

నరసాపురం



వాసా మెఫీబొషెతుగారు

నరసాపురం



పి. జోనాగారు
నరసాపురం



సి. జ్ఞానప్రకాశరావుగారు
నరసాపురం



పి. జోసఫ్‌గారు
నరసాపురం



పి. కె. థామస్‌గారు
నరసాపురం



మిస్. షీలావేయిట్    డా. కె. వందనం

బేతెస్ద కుష్ఠరోగుల ఆస్పత్రి, నరసాపురం



డా. సి. ఆర్. ప్రభాకర్

నరసాపూర్ క్రిస్టియన్ హాస్పటల్



వాసా సాముయేలుగారి కుటుంబం
నరసాపురం



బోయిజ్. దంపతులతో కలిసి సేవచేసిన ఎస్. ఆశీర్వాదందంపతులు
(నరసాపురం)



ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నరసాపురం
లేసు అల్లకాన్ని వృత్తివిద్యగా
1890లో నేర్పించిన మక్రే దంపతులు



శ్రీమతి మక్రే



కుటుంబ పోషణార్థం లేసు అల్లకం



కుటీర పరిశ్రమగా లేసుఅల్లకం



అమలాపురం మక్రేదంపతుల బంగాళా



గోదావరి పుష్కరస్నానాలు



మిస్ బ్రీలీ నడిపిన బైబిల్ స్కూలు విద్యార్థినులు]
ధవిళేశ్వరం



అమలాపురంలో మిషన్ బాలికల వసతిగృహం శిథిలాలు



బ్రౌన్ దంపతులు [అంబాజీపేట]



కొంకి ముత్యాలుగారు
అమలాపురం



సికిలే వెంకటరెడ్డిగారు
తాటిపాక



అంబటి అంద్రూగారు
అమలాపురం



మిస్ బ్రీలీ, మిస్ మోరీస్
ధవళేశ్వరం



వెబ్ దంపతులు [ధవిళేశ్వరం]



రానన్‌గారు ధవిళేశ్వరంలో నడిపిన వడ్రంగం పాఠశాల శిథిలాలు



...యేలుగారు, వీంలమూరు



కె. సథానిమేలుగారు, మోగల్లు



నారికిమెల్లి మోషేగారు, జుత్తిగ



టిల్‌స్లీగారి కుటుంబం – ఇంగ్లాండ్



చెట్టిపేట పెద్ద ఉపాధ్యాయుల బైబిలు తరగతులు



వాసా ఎబినేజరుగారు
నరసాపురం



కంకిపాటి ఓబెదుగారు
నరసాపురం



పింజర్లవారి కుటుంబం — నరసాపురం

వెనుక : శ్రీ బొడ్డు సద్గుణరావు, శ్రీ కూర్మా ప్రసాదరావు

కూర్చున్నవారు : శ్రీ పింజర్ల కోటయ్య, జానకమ్మ, శ్రీ పింజర్ల ముసలయ్య నాగమ్మగార్లు

3వ వరస : కంకిపాటి సుదర్శనం, కంకిపాటి రాజరత్నం, పి.ఆనంద రాజు, పి.సుందర్రాజు, కంకిపాటి రాజమ్మ, మిన్నమ్మ



వైట్‌హౌస్‌గారు
[తాటిపాక]

సతీసమేతంగా రక్షించబడి ఈ సంఘంలో క్రమం తప్పకుండా వాక్యపరిచర్య చేస్తున్నారు.

కొండేపూడి వెంకట్రావు, వి. విలియమ్స్‌గార్ల సేవాఫలితంగా ముమ్మిడివరం సమీపానగల పల్లిపాలెంలో ఇద్దరు రక్షించబడి 1979 జనవరి నెలలో బాప్తిస్మం పొందారు. శ్రీవారు సోమదేవరపాలెంలో కొంకి ముత్యాలు, అంబటి ఆంద్రూ, జాన్ తాతయ్యగార్ల వాక్యపరిచర్యవల్ల సుమారు 20 మంది విశ్వసించి బాప్తిస్మం పొందారు. జె. దానియేలుగారి ద్వారా 1979లో సుమారు ఐదుగురు బాప్తిస్మం పొందారు. అప్పటినుంచి వి. విలియమ్, వెంకట్రావుగార్లు ఈ సంఘాన్ని బలపరుస్తున్నారు. ప్రస్తుతం ఈ సంఘాన్ని ఉందుర్తి సత్యానందం, బాలరాజుగార్లు నడిపిస్తున్నారు.

1976లో సరెళ్ళ నతానియేలుగారు భట్లుపాలెంలో సేవ ప్రారంభించగా కొందరు అగ్రకులాలవారు రక్షణపొందారు. ఆలయ నిర్మాణానికి మిస్ లీజరు సహాయం చేసారు. మెండు రాజారావుగారు వడ్డిచెరువునుండి అప్పుడప్పుడు వెళ్తూ వాక్యపరిచర్య చేస్తున్నారు. నతానియేలు గారివృద్ధాప్యంలో వీరి కుమారుడు మైకల్‌రాజుగారు సంఘక్షేమం చూసుకుంటున్నారు. వీరు నంగవరంలో 1940 ఫిబ్రవరి 6న జన్మించారు. 1969లో అంబాజీపేట మిషన్ ఆస్పత్రిలో ఎలక్ట్రీషియన్‌గా చేరారు. 1960లోనే మారుమనస్సుపొంది పాతాళ్ళదిబ్బలో ఆంద్రూగారివల్ల బాప్తిస్మం పొందాడు. తీరిక వేళల్లో పరిసర గ్రామాల్లో సేవ చేస్తున్నారు.

గురివింతగుంట గ్రామానికి 1969లో పాతాళ్ళదిబ్బనుండి పెద్దలు వెళ్ళి సువార్త ప్రకటించగా కొందరు రక్షణ పొందారు. యేళ్ళ విక్టర్‌గారు ఇటుకలతో పునాది వేయించారు. ఆలయనిర్మాణం ఇంకా జరగలేదు.

అయినవెల్లిలంకలో యేళ్ళరెడ్డిగారు 1953లో సువార్త సేవ ప్రారంభించారు. రక్షణానుభవంపొందిన ఆరుగురికి రెడ్డిగారు బాప్తిస్మంఇచ్చి చిన్న ఆలయం కట్టించారు. కె. ముత్యాలు, సత్యనాథం, గాబ్రియేలు, బాల దానియేలు, ఆంద్రూ, జె.యం. దానియేలుగార్లు ఈ సంఘాన్ని దర్శిస్తూ వాక్య పరిచర్య చేసేవారు. కొంతకాలానికి ఆలయాన్ని మరొక చోటకు మార్చవలసిన సమయంలో చల్లపూడి వెంకటరెడ్డిగారు 3 సెంట్ల

భూమి దానంగా ఇవ్వగా మిస్ లీజరు సుమారు 14వేల రూపాయలు వెచ్చించి ప్రార్థనా మందిరం కట్టించారు. చల్లపూడి వెంకటరెడ్డిగారు సంపూర్ణ సేవకునిగా ఈ సంఘబాధ్యత వహించగా అంబాజీపేటనుండి జె. అప్పారావు, సంజీవరావుగార్లు వెళ్ళి వాక్యపరిచర్య చేస్తున్నారు. .

## అంబాజీపేట ప్రాంతం:

1937 నవంబరు నెలలో ఎం. బ్రౌన్‌గారి అకాల మరణం ఆ ప్రాంతంలో అప్పుడప్పుడే మొగ్గతొడుగుతున్న సంఘాల పనికి దెబ్బ తగిలింది.

రాజమండ్రి ఆల్‌కట్ గార్డెన్స్‌లో అద్దె యింట్లోవుండి ఆ ప్రాంతంలో అప్పుడు డబ్ల్యు.ఎ. మోరిసన్ దంపతులు, వెబ్ దంపతులు సేవచేస్తున్నారు. 1938 సంవత్సరంలో మోరిసన్‌గారు భార్య, వో బాబు, పాపతో అంబాజీపేటవచ్చి, బ్రౌన్‌గారు ప్రారంభించిన సేవను కొనసాగించారు. అప్పటికి ఆ మిషన్ కాంపౌండులో ఒక బంగళా, వో డిస్పెన్సరీ భవనం వుండేవి. ఈ డిస్పెన్సరీ భవనం సగం ప్రార్థనా మందిరంగా వినియోగించే వారు. శ్రీమతి బ్రౌన్‌గారు ఆ తరువాత ఆయా స్థలాల్లో సేవచేశారు. 1951 ఆగస్టు నెలలో అనారోగ్య కారణాలవల్ల మోరిసన్‌గారు స్వదేశానికి కుటుంబసమేతంగా వెళ్ళిపోయారు. సువార్త దండయాత్రలుజేస్తూ ఆయా ప్రాంతాలు తిరిగి డేరాలు వేసుకొని వీరు సేవచేసేవారు. టిల్‌స్లీగారి, టేలర్ మిసమ్మగారి హవున్ బోట్లు ఎరువు తీసుకొని వానపల్లి, అమలాపురం కాల్వల్లో తిరిగి ఆ ఫీల్డుల్లో గణనీయమైన సేవచేశారు.

1951 నుండి 1963 వరకు ఆ ప్రాంతంలో, ఆ బంగళాలో మిషనెరీలు ఎవరూలేరు. సహో. ఎస్. జోసెఫ్ ఆ మిషన్ బంగళాను, పొలాల్ని అజమాయిషిచేస్తూ, సహో. గెడ్డం ఏలియాగారి సహకారంతో అంబాజీపేట సంఘాన్ని చూస్తుండేవారు.

అప్పుడు శ్రీమతి కూపర్, మిస్ మన్రో, మిస్ బ్లాక్ అమలాపురం నుండి బెండమూర్లంకకు తరలివెళ్ళి అక్కడ సేవచేస్తుండేవారు. 1963లో మన్రో మిసమ్మగారి అకాల మరణం తరువాత శ్రీమతి కూపర్, మిస్ బ్లాక్

వచ్చి అంబాజీపేట మిషన్ బంగళాలో మకాం పెట్టారు. బ్లాక్ మిసమ్మ గారు డిస్పెన్సరీ నడిపేవారు, శ్రీమతి కూపర్ సేవ చేస్తుండేవారు.

ఇదిలావుండగా 1965 సంవత్సరంలో డా. లీజర్‌గారు నరసాపురం నుండి అంబాజీపేట వెళ్ళి ఈ మిషన్ కాంపౌండులో పేర్గాంచిన స్త్రీల ఆస్పత్రిని స్థాపించి దాన్ని ఎన్నో విధాలుగా అభివృద్ధి చేశారు. ఈ ఆస్పత్రినిచూస్తూ కొత్తపేట, అమలాపురం అంబాజీపేట ప్రాంతీయ సంఘాల్లోని సేవకు వీరు ఎంతో ప్రోత్సాహాన్నిస్తూ, నూతన సంఘాల్ని స్థాపిస్తూ, నూతన ఆలయాలు కడుతూ, సండేస్కూలు, యువజనులు, స్త్రీల పరిచర్యలను బలపరుస్తూ గొప్పసేవ చేయుస్తున్నారు.

1971 లో హాస్పటల్‌కు బయట స్థలంకొని 1972 ఏప్రిల్‌లో డా. లీజర్‌గారు ఆలయాన్ని కట్టించి అంబాజీపేట సంఘానికిచ్చారు. ఈ సోదరి, మిస్ రైట్‌ల కృషివల్ల, ఈ ప్రాంతంలో సంఘాలు అధికంగా కట్టబడ్డాయి. గతంలోని పురుష మిషనెరీలకంటే ఈ డాక్టరమ్మగారు అధికమైన సేవ చేయుస్తున్నారు, చేస్తున్నారు.

భట్లుపాలెం మెండి రాజారావుగారు, మైకల్‌రాజుగార్లు చూస్తున్నారు

మొసళ్ళపల్లి— సత్తిరాజుగారు, వేదునూరు— కె. జాన్‌గారు, బండార్లంక—జె. రామారావు, గన్నవరం— యోహాను, యు. పట్టాభి, కొంకపెల్లి—కె. కృపాసందం, అద్దంకివారిలంక— సిహెచ్. ప్రసాద్‌గారు స్థాపించారు.ప్రస్తుతం సేవ జరుగుటలేదు.మాసయిపేట-సిహెచ్.ప్రసాద్‌గారు చూస్తున్నారు. నాగుల్లంక—ఎస్. బెన్నీగారు చూస్తున్నారు.యిక్కడ విశ్వాసులు అందరూ స్త్రీలే. లప్పనపల్లి—వరసాల వెంకట్రావు గారుచూస్తున్నారు.

# 23

# చెట్టిపేట ఫీల్డు

## చెట్టిపేట ప్రాంతం:

1966లో క్రాఫర్డు టిల్‌స్లీగారు, అటుతరువాత 1969లో వీరి సతీమణి పరలోకగతులైనారు. అటుతరువాత ఈ ప్రాంతంలో ఇప్పటివరకు నిలిచి సేవచేస్తున్న మిషనెరీ వనిత మిస్. ఇ.జె. హార్డింగు గారు.

చెట్టిపేట ఫీల్డును సేవాసౌలభ్యంకోసం మూడు ప్రాంతాలుగా విభజించారు. ఇవి చెట్టిపేటప్రాంతం, తణుకుప్రాంతం, లోయర్‌గోస్తనదీ ప్రాంతం. చెట్టిపేట ప్రాంతంలో 17 సంఘాలు, తణుకు ప్రాంతంలో పాత సంఘాలు 25, క్రొత్తవి 3, లోయర్‌గోస్తనది పాతవి 17, క్రొత్తది 1. మొత్తం ఈ ఫీల్డులో ఇప్పుడు 63 సంఘాలువున్నాయ్. గోదావరి డెల్టా ఫీల్డులు అన్నింటిలోకెల్లా యిది పెద్ద ఫీల్డు.

చెట్టిపేట ప్రాంతీయ సంఘ విశ్వాసులు ఈ ప్రాంతపు సేవ అంతటికీ నాయకత్వం వహించి అనేక సంఘాలు స్థాపించబడేందుకు కృషిచేసిన వైనం ఇంతకుముందే తెలుసుకున్నాం. మిషన్ పాఠశాలల్లో పనిచేసిన ఉపాధ్యాయులు సంఘసేవలో విశేషంగా కష్టించి సంఘపెద్దలతో కలిసి సంఘాలు కట్టారు.

చెట్టిపేటప్రాంతపు సంఘాల్లో ఈ కాలంలో సేవచేసినవారిలో ముఖ్యులు చెట్టే ఎలీషాగారు, మెరిపో అబ్రాహాముగారు, చదలవాడ ఇష్మాయేల్‌గారు, యం. ఫిలిప్పు మొదలైనవారు. ఉపాధ్యాయులు జి.జోయల్ రాజుగారు. బొల్లిపో సాధువుగార్లు, చెట్టిపేట సంఘపెద్దలు: చదలవాడ

ఇశ్రాయేలు, చెట్టే అహాజు, మెరిపో పోతురాజు, చెట్టే బ్రహ్మయ్య, చెట్టే యెషయ్య, మెరిపో సామేలుగార్లు తదితరులు ప్రాంతీయ సంఘాల్లో గణనీయమైన సేవచేశారు. సహోదరీలు చెట్టే పెంటమ్మ, దేవరపల్లి వీరమ్మ (దేవరపల్లి జానుగారి భార్య), చెట్టే మరియమ్మ, కోడి కృపమ్మ గార్లు బైబిలు స్త్రీలుగా గొప్ప సేవ చేశారు.

సహో. సి. జెఫన్యాగారు (చెట్టే ఎలీషాగారి మనవడు) 1979లో ప్రభువుసేవకు సంపూర్ణంగా సమర్పించుకుని కుటుంబ సమేతంగా నరసాపురం నుండి యిక్కడికి వచ్చి వీరి తాతగార్లు చేసిన సేవను చేపట్టారు. మెరిపో అబ్రాహాంగారి మరణానంతరం చెట్టే సుందర్రావుగారు మిగిలిన సంఘపెద్దలు ప్రాంతీయ సేవకులు ఈ సంఘాన్ని కాసారు. 1982 సంవత్సరం వరకు పాతపేట, కొత్తపేట విశాస్వులు కలిసి చెట్టిపేట ప్రార్థనాలయంలో ఆరాధనలు జరుపుకొనేవారు. అయితే దూరభారం కారణంగా పాతపేట విశ్వాసులు పాతపేటలోనే ఆలయం నిర్మించుకొని ఆరాధనలు జరుపు కుంటున్నారు. ఈ రెండు సంఘాలు ఒకదానితో ఒకటి సామరస్యంగా సహకరించుకొంటూ ముందుకు సాగుతున్నాయి. కొత్తపేట సంఘానికి పెద్దలు సి. జెఫన్యా, కె. జీవరత్నంగారు, ఎన్. ఇమ్మానుయేలుగారు గెడ్డం జాన్‌విక్టర్‌గార్లు, పాతపేట సంఘపెద్దలు చెట్టే సుందర్రావు, చెట్టే దానియేలు, కంకిపాటి దేవదానం, కండవల్లి సంసోను, చదలవాడ పుష్పరాజుగార్లు.

చెట్టిపేట ప్రాంతంలో కాల్దరి, వేలివెన్ను, దమ్మెన్ను, మోర్త, ఉండ్రాజవరం, కొనాల మొదలైన సంఘాలు అభివృద్ధిలో ఉన్నాయి. నవుడూరు సంఘకాపరిగాఉన్న చెవ్వాకుల రూబేసుగారు లూథరన్ సంఘస్థుడుగా ఉంటూ దుద్దే సుబ్బన్నగారిద్వార హెచ్చరికలునొంది జి.డి.యం సంఘభారం వహించి ప్రస్తుతం సేవచేస్తున్నారు. గెద్దాడ ఆనందరావుగారు గెడ్డం చిట్టమ్మ తదితరులుకూడా సంఘ కార్యకలాపాల్లో పాల్గొంటున్నారు. ఉండ్రాజవరం గ్రామంలో మార్లపూడి ఫిలిప్పుగారు వాక్యం ప్రకటించగా ఉందుర్తి కోటయ్య అనే వ్యక్తి ప్రభువునంగీకరించి 1950దాకా భార్యతో సహా చెట్టిపేట వెంగదుర్రు గ్రామాలలో కూటాలకు హాజరవుతుండేవారు. అప్పటినుండి వీరి ఇంట్లోనే సమావేశాలు జరిగేవి. 1955నుండి ఆబోతు

అబ్రహాముగారు ఈ సంఘంలో బహు ప్రయోజనకరమైన సేవ చేశారు. 1966నుండి అబ్రహాముగారు సంపూర్ణంగా సువార్త సేవకు సమర్పించుకుని ఈ సంఘంలోను, పరిసరాల్లోనూ సేవచేస్తున్నారు.

## మోర్త

యం. ఫిలిప్పుగారి సేవవల్ల ఈ సంఘం ఆరంభమైంది. ప్రస్తుతం నారికిమెల్లి జేమ్స్ రూబేనుగారు దీన్ని చూస్తున్నారు.

## దమ్మెన్ను:

మావుడూరి సైలస్‌గారి సేవాఫలితం. వీరు పాలకొల్లు గ్రామస్థులు. వీరు సిద్ధాంతంలోనూ సేవ చేశారు. ప్రస్తుతం టి. తుమ్మన్నగారు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

## వేలివెన్ను:

టిల్‌స్లీగారు, చెట్టే ఎలీషాగార్ల కృషిఫలితంగా ఈ సంఘం వెలిసింది. ఈ సంఘాభివృద్ధికి చెట్టిపేట సంఘపెద్దలు చాల కృషిచేశారు.

ఇక్కడి మిషన్‌స్కూల్లో గెద్దాడ మోషే, డి. సుబ్బన్న, సి మార్కు యం. ఆశీర్వాదం, గాలింకి టైటస్, మందపల్లి సాముయేలుగార్లు ఉపాధ్యాయులుగా పనిచేస్తూ సంఘకార్యక్రమాన్ని చూచారు. ఆబోతు మోషే, ఆబోతుఅబ్రహాము, మాముడూరి రామయ్య, పుల్లంపర్తి పౌలీసుగార్లు సంఘపెద్దలుగా పనిచేశారు. ఇటీవల ఇక్కడ సంఘం కారణాంతరాలవల్ల రెండుగా చీలిపోయింది. ఇప్పుడు మన సంఘానికి చెట్టే సుందర్రావు, యు. సాలొమోనుగార్లు సంఘపెద్దలు.

## చిలకపాడు:

టిల్‌స్లీగారి దగ్గర సువార్తసేవకుడుగా పనిచేసిన మల్లిపూడి ఫిలిప్పు గారి నమ్మకమైన పరిచర్యవల్ల ఏర్పడిన సంఘాల్లో చిలకపాడు ఒకటి.

ఇక్కడి మిషన్ పాఠశాలలో గెద్దాడ మోషే, నవుడూరి విల్యంస్‌గార్లు ఉపాధ్యాయులుగా పనిచేస్తూ సంఘాన్ని చూచారు. దరిమిలా సి.హెచ్.వెంకన్న గారు ఆ స్కూల్లో పనిచేస్తూ అకాల మరణం చెందారు. ఇప్పుడ టి. తుమ్మన్న మాస్టారు, వై.ఆనందరావుగార్లు ఈ సంఘాన్ని చూస్తున్నారు

## నడిపెల్లికోట:

గంగోలు డేవిడ్, సవరపు యెహోషువాగార్ల సహకారంతో, మెరుపో అబ్రహాముగారి నమ్మకమైన సేవవల్ల ఈ సంఘం ఏర్పడింది. ప్రస్తుతం భూషణంగారు (దమ్మెన్ను) సుందర్రావు, (నడిపల్లికోట) ఈ సంఘాన్ని చూస్తున్నారు. ఈ సంఘాభివృద్ధికి శ్రీమతి సవరపు సత్యవతి, (కీ.శే. సవరపు యెహోషువాగారి భార్య), మరియమ్మగార్ల కార్యదీక్ష, త్యాగాలు ముఖ్యకారణాలు. ఇటీవల ఈ సహోదరీల కృషి, మిస్. హార్డింగ్, సహకారం టి. తుమ్మన్న, రాజరత్నం, సి. జెఫన్యాగార్ల పర్యవేక్షణలో ఒక చక్కని ఆలయం యిక్కడ పునర్నిర్మించబడింది. ఈ సంఘ విశ్వాసుల పరిచర్యవల్ల ఈ గ్రామానికి చెందిన కొన్ని సంపన్న కమ్మ కుటుంబాలు ప్రభువును అంగీకరించాయి. వీరిలో కొందరు బైబిల్ మిషన్‌లో చేరిపోయినా, మిగిలిన వారింకా ఈ సంఘానికే హాజరవుతున్నారు.

## కలవచర్ల:

చెట్టిపేట ప్రాంతపు సువార్తికులు గళ్ళా ప్రకాశం, చదలవాడ ఇష్మాయేలు, నవుడూరి వుల్యంస్‌గార్ల సేవవల్ల ఈ సంఘం కట్టబడింది. ఇపస్తుతం దైవసేవకుడు జత్తిన రాజరత్నం నాయకత్వంలో సహో. కె. బుల్లియ్య, డి. ఆనందరావు, మల్లిపూడి రామన్నగార్లు ఈ సంఘాన్ని చూసుకుంటున్నారు.

## సమిశ్రగూడెం:

చెట్టిపేట సంఘ సేవకులు చెట్టే ఏలీషా, మెరుపో అబ్రహాము చదలవాడ ఇష్మాయేల్‌గార్ల సేవవల్ల యిక్కడ సంఘం ఏర్పడింది. వీరే

ఈ సంఘాన్ని ఆదిలో అజమాయిషి చేస్తుండేవారు. ప్రస్తుతం బత్తిన రాజరత్నంగారు ఈ సంఘాన్ని చూస్తున్నారు. సుబ్బారావు, యు. బొజ్జారావుగార్లు వీరికి సహకరిస్తున్నారు.

## కానూరు:

ఇక్కడ సంఘం ఆరంభం కావడానికి టిల్‌స్లీగారివద్ద సువార్తికులుగా పనిచేసిన చెట్టే ఎలీషా, మెరుపో అబ్రాహాముగార్లు కృషిచేసారు. సహో. బత్తిన రాజరత్నంగారు సంఘాభివృద్ధికి పాటుపడ్డారుకాని ఈ సంఘం ఆ మధ్య కొంతకాలం బదరెన్ మిషన్, రాజమండ్రివారి అజమాయిషి క్రిందవుంది. ఇప్పుడు మళ్ళీ ఈ సంఘస్థులే దీని వ్యవహారాలు చూసుకొంటున్నారు.

## సింగవరం:

చెట్టే ఎలీషా, అబ్రాహాముగార్ల సేవాఫలితం ఈ సంఘం. చెట్టిపేట పెద్దలు క్రమంగా ఈ సంఘాన్ని దర్శించి సంఘాభివృద్ధికి పాటుపడ్డారు. ప్రస్తుతం కైకరపు రాజారావు, చదలవాడ రాజరత్నంగార్లు సంఘపెద్దలుగా, శ్రీమతులు ఎలిజబెత్తు, చుక్కమ్మ, మరియమ్మగార్లు సంఘ సండేస్కూలు, స్త్రీల సేవలో విశేషంగా సహకరిస్తున్నారు. చెట్టిపేట నిడదవోలు సంఘాల విశ్వాసులు ఈ సంఘం పురోభివృద్ధికి పాటుపడుతున్నారు.

## తిమ్మరాజుపాలెం:

టిల్‌స్లీ, మెరుపో అబ్రహాం, లక్ష్మికాంతమ్మగార్లు ఈ సంఘస్థాపనకు గట్టి కృషిచేసారు. సహో.కసుమూరి సామియేలుగారు సంఘపెద్దగా సహకరించారు. వీరి పరిచర్య ఫలితంగా కాపుకులంనుంచి పడాల సత్యంగారు వారి సోదరి నాగమ్మగారు, వారి కుటుంబికులు మొదటిగా ప్రభువును స్వీకరించారు. దరిమిలా కొన్ని కాపు కుటుంబాలు సంఘంలో చేరాయి. ఈ సంఘం కారణాంతరాలవల్ల రెండుగా విడిపోయి, యిటీవలే మళ్ళీ

కలుసుకున్నాయి. ప్రస్తుతం ఈ సంఘాన్ని చెట్టిపేట, నిడదవోలు సహోదరి సహోదరులు, శ్రీమతి ఆశీర్వాదమ్మగారు, పడాల సత్యంగారు, గంటా సూర్యారావుగారు తదితరులు సంఘాభివృద్ధికి పాటుపడుతున్నారు. సహో. నవుడూరి విల్యాంస్‌గారు ప్రస్తుతం యిక్కడేవుంటూ సేవ చేస్తున్నారు.

## నందమూరు:

టిల్‌స్లీగారు నాయకత్వంలో ఎలీషా, అబ్రాహాంగార్ల పరిచర్యవల్ల ఈ సంఘం ఏర్పడింది. ఆరంభంలో గెడ్డం ఏసుదాసుగారు ఈ సంఘాన్ని చూసారు. సహో. గెడ్డం ఏసుదాసుగారు ఆ మధ్య వేరే సంఘంలోకి వెళ్ళిపోయిన కారణంగా చాలాకాలం యిక్కడ సంఘం చూడ్డానికి ఎవ్వరూ లేకపోగా సంఘస్థులు పెంతెకోస్తు సంఘంలోకి వెళ్ళిపోయారు. ఆలయం శిథిలమై పోయింది. 1979లో ఏస్ హార్డింగ్‌గారు, చెట్టిపేట (బౌడెన్‌పేట) సంఘస్థుల సహకారంతో,సహో. సి. జెఫన్యాగారి కృషివల్ల యిక్కడ చక్కని ఆలయం నిర్మించబడింది. సంఘం దినదినాభివృద్ధి చెందుతోంది. సహో. సి. జెఫన్యా, ముప్పిడి శాంతారావుగార్లు, కోనాల సహోదరులు ఈ సంఘాభివృద్ధికి పాటుపడుతున్నారు.

## మారంపల్లి, గాంధీనగరం, ఆరుళ్ళ:

మారంపల్లిలో ఆకుమర్తి వరదయ్యగారు 1943లో ఒక స్కూలు ప్రారంభించి గళ్ళా ప్రకాశంగారిని టీచరుగా ఉంచారు. టిల్‌స్లీగారు కొద్దిపాటి సహాయంచేస్తూండగా గ్రామస్థులే ప్రకాశంగారి పోషణార్థం సహాయపడేవారు. సంఘంకూడా అభివృద్ధి అయింది. ప్రకాశంగారి తరువాత గెడ్డం యేసుదాసు గారు సంఘభారం వహించారు. యేసుదాసుగారు ఈ పని చాలించుకుని వేరొక సంస్థలో చేరి హాస్టలు స్థాపించారు. పెంతెకోస్తు సంఘం ప్రస్తుతం ఈ గ్రామంలో నడిపించబడుతోంది. జి.డి.యం. సంఘం బలంగాలేదు.

టిల్‌స్లీగారు, వారివద్ద పనిచేసిన సేవకుల కృషిఫలితంగా ఈ సంఘాలు ఏర్పడ్డాయ్. ఆదిలో గళ్ళా ప్రకాశంగారు గెడ్డం యేసుదాసుగారు ఈ సంఘాన్ని కాసారు. ప్రస్తుతం ఈ యేసుదాసుగారు వేరే సంఘానికి వీటిని అప్పగించి ఆ సంఘాల్ని చూచుకొంటున్నారు.

## కోనాల

కోనాల గ్రామంలో 1940లో టిల్‌స్లీ, చెట్టే ఎలీషాగార్లు సువార్త సేవ ఆరంభించగా ముప్పిడి పోలయ్య, ఆకుల పసలయ్య (గాబ్రియేలుగారి తండ్రి), కందెట్ల గంగరాజుగార్లు ప్రథమంగా విశ్వసించారు. చెట్టిపేటనుండి పడవాల ఇస్మాయేలుగారువచ్చి కోనాలలో ఒక స్కూలు స్థాపించి సంఘాన్ని అభివృద్ధి చేసారు. వీరి తరువాత గెడ్డం యాకోబుగారు సంఘాన్ని నడిపించారు. ఆకుల గాబ్రియేలు, గంగరాజుగార్లు పెద్దలుగా ఉన్నారు. ఈ సంఘానికి చెందిన ఆకుల జాన్‌పాల్‌గారు సత్తుపల్లి ప్రాంతంలోను, ఆకుల గాబ్రియేలుగారు శ్రీకాకుళం ప్రాంతంలోను, మార్లపూడి యోసేపుగారు చెట్టిపేట ప్రాంతంలోను సేవ చేస్తున్నారు. ప్రార్థనశాలకోసం టిల్‌స్లీగారు 5వేల రూపాయలు, చెట్టిపేట పాతమేడ తలుపులు, కిటికీలు ఇవ్వగా జాన్‌పాల్‌గారు తదితర సహోదరులు ఆలయాన్ని నిర్మించారు. ప్రస్తుతం సంఘపెద్దలుగా రాచర్ల డేవిడ్‌రాజు, గెడ్డం దానియేలు, కొడమంచిలి మంగన్నగార్లు సేవ చేస్తున్నారు.

కోనాల గ్రామానికి చెందిన కుంట్ల సీతారామయ్యగారి ధర్మపత్ని వెంకమ్మగారు. ఇద్దరు కుమారులు, కుమార్తె చివరికి భర్త మరణించడంతో కృంగిఉన్న వెంకమ్మగారు లక్ష్మీకాంతమ్మగారి సేవవల్ల రక్షణపొందిన ఒక స్త్రీ మూలంగా ప్రభువును తెలుసుకొని స్వరక్షకునిగా అంగీకరించింది. నిడదవోలునుండి లక్ష్మీకాంతమ్మగారుకూడావెళ్ళి వెంకమ్మగారిని బలపరిచారు. తరువాత వెంకమ్మగారు తన అక్కగారి ఊరువెళ్ళి కులస్థులమధ్య బలమైన సేవ జరిగించారు. టిల్‌స్లీగారుకూడా వీరిపట్ల శ్రద్ధవహించి వాక్యంలో బలపరిచారు. లక్ష్మీకాంతమ్మగారి మరణం తరువాత 1967 నుండి ఉపవాస, స్త్రీల కూటాలు నడిపిస్తూ నిడదవోలు సంఘంలో సేవచేస్తున్నారు. ప్రస్తుతం నర్సాపురం కుష్టురోగుల ఆస్పత్రి జనరల్ సూపరింటెండెంట్ సత్యనారాయణగారు వెంకమ్మగారి కుమారులే. ఈ గ్రామం ప్రత్యేకత ఏమిటంటే—ఎందరో సేవకులు, సేవకురాండ్రు, నాయకులుగా సంఘం నుండి వెళ్ళి ఇతర ప్రాంతాలో గణనీయమైన సేవచేస్తున్నారు.

## నిడదవోలు:

నిడదవోలు ప్రాంతంలో అన్యులమధ్యను, సంఘంలోను ఎనలేని సేవ చేసిన అన్య సహోదరి దాంతోజు లక్ష్మీకాంతమ్మగారు. కంసాలి కుటుంబంలో మునగంటి సుబ్బయ్య, సుబ్బమ్మగార్లకు జన్మించారు. బాల్యంనుండే ఆధ్యాత్మిక దాహం కలిగిఉండి తన 16వ ఏట వైద్యం నిమిత్తం ప్రత్తిపాడులోఉన్న బ్రయంట్ సతీమణి దగ్గరకు వెళ్ళారు. ఆమె ఇచ్చిన యోహాను సువార్త, కరపత్రికల మూలంగా క్రీస్తును గురించి తెలుసుకుని రక్షకునిగా అంగీకరించడమేకాక తల్లిని, అమ్మమ్మనుకూడా సత్యమార్గంలోకి నడిపించారు. లక్ష్మీకాంతమ్మగారు నిడదవోలులో తన ధనాన్ని వెచ్చించి విశ్వాసుల సహకారంతో ఒక ప్రార్థనాలయం నిర్మించి ప్రభువుకు బలమైన సాక్షిగా వాడబడ్డారు. 1966లో వీరు సేవ చాలించి ప్రభువు సన్నిధికేగారు. ఈ ఆలయాన్ని సహోదరీలు కుంట్ల వెంకమ్మ, రామాయమ్మగార్లు చూచు కొంటున్నారు.

## కాటకోటేశ్వరం:

టెల్స్లీగారు, అబ్రహాంగారు, ముసునూరి సూర్యనారాయణ, లక్ష్మీకాంతమ్మగార్ల సేవవల్ల యిక్కడ కులస్థులమధ్య సంఘం ఆరంభ మయ్యింది. ఆరంభంలో ఎం. అబ్రహాంగారు యిక్కడ కులస్థులకు బాప్తిస్మం యివ్వబోగా గ్రామస్థులు కొట్టవచ్చారు. బాప్తిస్మాలు అప్పుడు ఆపివేశారు. తరువాత కొంతకాలానికి అంతా సద్దుమణిగింది. బాప్తిస్మాలిచ్చి సంఘం కట్టారు. తర్వాత ఇది రెండుగా విడిపోయింది. ఒక సంఘాన్ని మృత్యుంజయాచార్యులుగారి కుమార్డు సుబ్బయ్యాచారిగారు, రెండవదాన్ని ఘంటా సూర్యారావుగారు చూస్తున్నారు. వీరభద్రపురానికి చెందిన మేరుపో వెంకన్నగారు యిక్కడ హరిజనవాడలో సేవ ఆరంభించి సంఘాన్ని కట్టారు.

## తణుకు ప్రాంతం:

తణుకు జి.డి.యం. సంఘంలో చదలవాడ బ్రైటన్‌గారి అనంతరం పాలూరి యెలియేజరుగారు నియమించబడి 1961లో ప్రభువు సన్నిధి

కేగారు. చింతపాడులో పనిచేస్తున్న మార్లపూడి ఫిలిప్పుగారిని తణుకులో సేవకునిగా నియమించారు. వీరి తరువాత చదలవాడ బారాకుగారు ఈ సంఘంలో సేవ చేసారు. మిస్ లిన్ మరణం తరువాత వీరి మిషనెరీ బంగళా అమ్మేసి 1947లో పేటలో ఒక ఆలయం దైవసేవకుని కొరకు తాటాకుల ఇల్లు ఎలియాజరుగారి కాలంలోను, బారాకుగారి కాలంలో ప్రహరీగోడ నిర్మించ డం జరిగింది. ప్రతియేడూ ఇక్కడ చెట్నీపేట ప్రాంతీయ మహాసభలు జరుగు తున్నాయి. కె. ఆబేలు, సి. లూకా, టైటస్, ఎలియాజరు, ఎం. ఫిలిప్పు దిద్దే మలాకీ, చెట్టే ఆనందం, కంకిపాటి దావీదు, దిద్దే నోవహు, సిర్రా బోయజు, మార్లపూడి సత్యానందంగార్లు ఇక్కడ సేవచేసిన వారిలో అగ్రగణ్యులు. ప్రస్తుతం సి. బారాకు, సి. యోవేలురాజు, ఎస్. పేతురు, టి. పౌలు సంఘపెద్దలు.

వీరభద్రపురం, వేల్పూరు సంఘ ఆరాధనలనుకూడా ఇంతకుముందే వివరించడం జరిగింది. వీరభద్రపురంలో కూనవరపు ఆబేలు, చదలవాడ టైటస్‌గార్ల తరువాత 1937లో టిల్స్లీగారి ప్రోద్బలంతో పెద్ద ఆలయాన్ని నిర్మించి మిస్. బౌడెన్‌గారిద్వారా ప్రతిష్టించడం జరిగింది. తదనంతరం బోయజుగారు, సిర్రా దానియేలుగారు, దైవసహాయంగారు, వి. కృపానందంగార్లు ఇక్కడ పని చేశారు. ఆయా కాలాల్లో సంఘ నాయకు లుగామల్లిపూడి పేతురు, బ్రహ్మయ్య, రామస్వామి, మార్లపూడి జేమ్సు, మల్లిపూడి సామ్యేలు, జకరయ్య, అబ్రహాము, వెంకన్న, పల్లికొండ సమూయేలు, మల్లిపూడి సుబ్బయ్య, మార్లపూడి సామ్యుయేలు, మెరిపో వెంకన్న పెనుమాక అబ్రహాము, గనపాల అపాల్లోను, మల్లిపూడి అగస్టీను, గనపాల సత్యంగారు సేవ చేసారు. 1948 నుండి యం. జాషువాగారు పనిచేశారు. వీరికిముందు వీరి అన్న మోషేగారు సేవ చేశారు. గెద్దాడ మోషే, వి. కృపాదానం, కె. లక్ష్మ్నుడుగార్లు అసిస్టెంట్లుగా పనిచేశారు. వీరంతా ఒరిగేడు, కావలిపురం, వేల్పూరు ప్రాంతాల్లో సేవచేశారు. 1954లో సంఘస్థులంతా కలిసి వేల్పూరుకు సువార్త దండయాత్ర జరిపారు. యం. మత్తయి, యం. గమానియేలుగార్లు వీరభద్రపురం స్కూల్లో అసిస్టెంట్లుగా పనిచేశారు.

1966లో మరింత స్థలంకొని ఆలయాన్ని పెద్దదిగా కట్టించారు.

ముఖ్యంగా జాషువాగారి నాయకత్వంలో ఈ సంఘం ఉచ్ఛస్థితిలోకి వచ్చింది. వీధి కూటాలు, బైబిలు తరగతులు, ఉజ్జీవ సభలు, స్త్రీల ఉపవాస ప్రార్థనలు క్రమంగా జరిగేవి. ప్రస్తుతం ఎం. గమానియేలు, పి. అబ్రహాం, యం. కృపావరంగార్లు పెద్దలు.

తణుకు బైపాస్ రోడ్‌లోని సజ్జాపురం సంఘానికి కె. అబ్రహాం, సుదర్శనంగార్లు పెద్దలు.

వేల్పూరు సంఘ పునరుద్ధరణ పూర్తిగా వీరభద్రపాడు సంఘస్థుల చేతిమీదుగానే జరిగింది. 1952లో జాషువా, వి. కృపాదానంగార్లు సేవనారంభించి మాణిక్యమ్మ, ముత్యాల సుబ్బాయమ్మగార్ల ఇళ్ళ దగ్గర స్త్రీలకు వాక్యపరిచర్య చేసేవారు. ఇదిగాక తణుకులో మిస్. హేస్టన్‌గారితో యం. ఎలీషాగారు వచ్చి సువార్త ప్రకటిస్తూ ఉన్న కారణంగా వేల్పూరు సుబ్బాయమ్మగారి ఇంటిదగ్గర సమావేశంలో మత్తుర్తి సత్యం, కొండదాసు వీరమ్మగార్లు, తదుపరి యం. నరసింహమూర్తి, బి. పనస రామయ్య, యం. సత్యానారాయణ, వరహాలమ్మ, వంగేటి సత్తెమ్మ, వంక రామన్న, రెడ్డి నారమ్మ, వదచర్ల రామమ్మ, నున్న మాణిక్యమ్మ, నూనె లక్ష్మణమ్మ, కొండదాసు వీరమ్మగార్లు రక్షణపొంది 1955లో ఎలీషాగారిద్వారా బాప్తిస్మం పొందగా వేల్పూరు సంఘం వెలిసింది. ములగలేటి ప్రకాశంగారి వాక్యపరిచర్య వల్ల రెడ్డి పూర్ణమ్మగారి ఇంటివారు రక్షణ పొందారు. కాటి పాపమ్మ గారింట్లోని విగ్రహాలను పెద్దోజు మృత్యుంజయాచారిగారు స్వయంగా తొలిగించి బస్తాలో మూటగట్టి పారేసారు. వంక బుల్లెమ్మాయి, గున్నాం బుల్లెమ్మ, గొకా మహాలక్ష్మమ్మ, వేరుకొండ రామాంజనమ్మ, రవిసెట్టి శేషమ్మ, పెనుగొండ సీతమ్మ, ముంగండ మాణిక్యమ్మ, పానకాల సత్తెమ్మ, రెడి పూర్ణమ్మగార్లకు 1956లో పాలూరి యెలియేజరుగారు బాప్తిస్మ మిచ్చారు. వేల్పూరులో ఆలయం లేనందువల్ల పూర్ణమ్మ, పనసరామన్నగార్ల ఇళ్ళదగ్గర విశ్వాసులు సమావేశమయ్యేవారు. టిల్‌స్లీగారు, సి. జోసెఫ్‌గారు తదితరుల సహాయంతో ఒక ఇంటిని కొని ఆరాధన నడిపించేవారు. 1968లో బూల అజరయ్యగారి అధ్యక్షతన ప్రార్థనశాల నిర్మాణంకోసం ఒక కమిటీ సమావేశమై ప్రార్థించి ప్రయత్నాలు మొదలుపెట్టడం జరిగింది. టిల్‌స్లీ సతి కొంత ధనసహాయం చెయ్యడమేకాక చెట్టిపేట పాతమేడనుండి యిటుక, పెంకు, కలప మొదలైన వాటిని ఇవ్వడానికి అంగీకరించారు. వీటన్నిటినీ

పడవలో నేల్సూరుతెచ్చి దాదాపు 6 వేల రూపాయల ఖర్చుతో ఆలయం నిర్మించారు. టిల్స్లీ సతి 1969 ఏప్రిల్ 18న చనిపోగా 19వ తేదీన అంత్యక్రియలు జరిగినాయి. అయితే 20న తేదీనే వారి కుమార్తె మిస్. బి.జె.సి. టిల్స్లీ, షార్ప్ దంపతులు వచ్చి ఆలయాన్ని ప్రతిష్టించారు. వీరభద్రపాడు యం. జాషువాగారే ఈ సంఘభారం వహించి దీన్ని అభివృద్ధి చేశారు. కొన్ని సంవత్సరాల తర్వాత స్త్రీలు సంఘంలో ప్రార్థన చేయడాన్ని వీరు ప్రోత్సహించడంవల్ల సిద్ధాంతపరమైన భేదాభిప్రాయాలతో ఒక వర్గం ఎం. జాషువాగారితో వెళ్ళిపోయి, వేరుగా వీరభద్రపురంలో ఆలయం కట్టుకుని ఆరాధనలు జరుపుకొంటున్నారు.

ఆధునిక కాలంలో చెట్టిపేట ప్రాంతంలో కనిపించిన ఒక ముఖ్యమైన పరిణామం 1957లో స్థాపించబడిన టైక్స్‌టైల్స్ వై.యం.సి.ఏ. టైక్స్‌టైల్స్ మిల్లులో పనిచేసే కార్మికుల్లోని కొందరు జి.డి.యం. విశ్వాసులు తమ తీరిక సమయాల్లో సువార్త ప్రచారాలు, సమావేశాలు జరుపుతున్నారు. వీరిని ఆరంభంలో మిస్. హేంప్టన్, సహో. మెట్టపల్లి ఎలీషాగార్లు ప్రోత్సహించారు. చెట్టిపేట జి.డి.సి.వై.యఫ్.సి.ని ఈ ప్రాంతంలో రక్షించబడిన యువకులు కొందరు 1976లో కోడవల్లిలో జరిగిన ప్రాంతీయపెద్దల సమావేశంలో పెద్దలతో సంప్రదించి వారి అనుమతిపై యువకులమధ్య సేవ నిమిత్తం ఏర్పాటు చేసారు. ప్రథమంగా దీని ప్రసిడెంటుగా మోగల్లుకు చెందిన వై. కొర్నేలియస్‌గారు, సెక్రటరీగా ఎన్. ఇల్లింద్రపర్రుకు చెందిన టి. సమూయేలుగారు, కోశాధికారిగా దమ్మెన్నుకు చెందిన టి. తుమ్మన్నగారు ఏర్పాటయ్యారు. 1976లో వీరభద్రపాడులో యువతీయువకులకు ఒక పెద్ద యువజన సభను జరిపించారు. ఈ ప్రథమ కన్వెన్షన్‌లో ఎం.ఎ. ప్రసాద్, వి. లూకా, వి. సెంబాబుగార్లు దైవవర్తమానాన్ని అందించారు. 1977లో రెండవ కన్వెన్షన్ రేలంగిలోను, 1978లో వీరభద్రపాడులోనూ జరిగినాయి. ఇవి ప్రతియేడూ డిశంబరు నెలలో జరుగుతూనేవున్నాయ్.

## పెరవలి:

పెరవలి సంఘస్థాపన గురించి ముందే చర్చించాము. ఆటుతరువాతి కాలంలో సంఘపెద్దలుగా రాపాక కృపానందం, కాపవరం యోహానుగార్లు

ఉన్నారు. అటుతరువాత హెడ్మాష్టరుగా చెట్టేడేవిడ్‌గారు,మెరిపో యెషయా గారు పనిచేసారు. ఆదిలో గళ్ళా రాజారావు, సి. లూకాగార్లు యిక్కడ సేవ చేశారు. 1950లో టిల్‌స్లీగారి ఆధ్వర్యంలో 9వేల రూపాయలవ్యయంతో ప్రార్ధనాలయం నిర్మాణం జరిగింది. రాపాక కృపానందంగారు పెద్దగాను యెషయ్య, కంకిపాటి యేసుదాసు, యార్లగడ్డ వీరాస్వామి, సువసానందం గార్లు పరిచారకులుగాను పనిచేసారు. ప్రస్తుతం కాకర్లపూడి జయరాజు రాపాక సాలోమోను, రాపాక సుగుణరావుగార్లు పరిచారకులుగా ఉన్నారు.

మెరిపో యెషయుగారు చెట్టిపేటలో అచ్చయ్య గంగమ్మగార్లకు జన్మించారు. చెట్టిపేట, ఉంగుటూరు, నిడదవోలుల్లో విద్యాభ్యాసంచేసి జుత్తుగ, చెరుకువాడ, శృంగవృక్షం, పెరవలి తదితర గ్రామాల్లో టీచరుగా ఉండి 1976లో రిటైరైనారు. 1944లోనే మారుమనస్సుపొంది ఉపాధ్యాయవృత్తి నిర్వర్తిస్తూ రాత్రింబవళ్ళు శక్తివంచనలేకుండా ప్రభువు పక్షంగా సేవచేసారు. పెరవలిలో స్థిరపడి సంఘకాపరిగా, సువార్త సేవకునిగా శ్రమిస్తూ చివరిదినాల్లో కేన్సర్ వ్యాధిసోకి మరణించారు.

మారెమ్మగూడెం (పెనుగొండ) గ్రామానికి 1930 ప్రాంతంలో సిర్రా యాకోబుగారు టీచరుగా ఉన్నారు. వీరికాలంలో ఇద్దరు వ్యక్తులు ప్రభువును అంగీకరించారు. తదనంతరం సిర్రా యోహాను, పుల్లిపూడి పౌలు, చదలవాడ మార్కుగార్లు స్కూల్లో పనిచేస్తూ సేవచేసారు. చదలవాడ లూకాగారు ఈ ప్రాంతపు సువార్తికునిగా ఈ సంఘాభివృద్ధికి పాటు పడ్డారు. సిర్రా బోయజుగారు సంఘ భారాన్ని వహించి అభివృద్ధి చేసారు. ఈ గ్రామంలో కొమ్మర తిమోతిగారు 1953 నుండి టీచరుగాను, 1960 నుండి హెడ్మాష్టరుగాను పనిచేసారు. వీరు ఆరవల్లిలో షడ్రకు రూతమ్మ గార్లకు జన్మించారు. కాకిలేరులో నివాసముంటూ మారెమ్మగూడెంలోనే కాక పండితవిల్లూరు, రామన్నపాలెం, ఐతంపూడి సంఘాలకువెళ్ళి వాక్యం బోధించేవారు. రిటైరైన తరువాత మారెమ్మగూడెం సంఘాన్ని శ్రద్ధగా నడిపించేవారు. సిర్రా బోయజుగారు శివదేవునిచిక్కాలలో షడ్రక్, నాంచారమ్మగార్లకు జన్మించి నర్సాపురం బ్రాహ్మీగారి బోర్డింగులో చదువుకుని చెట్టిపేట ప్రాంతంలో టిల్‌స్లీగారి యాజమాన్యంలో దాదాపు 15 సంఘాల్లో టీచరుగా సంఘ సేవకుడుగా పనిచేసారు. అనేక సంఘాలను

ఆత్మీయంగా నడిపించి 1959లో నిత్య విశ్రాంతిలో ప్రవేశించారు. వీరు ప్రస్తుతం మిషన్ హైస్కూలు హెడ్మాస్టరుగా పనిచేస్తున్న సిర్రా జాన్‌గారి తండ్రి. ప్రస్తుతం పెనుమాక ప్రకాశం, కె. నరిశింహులు, కె. రాజారావు గార్లు దీనికి పెద్దలు.

1947లో కొత్తపాడు గ్రామానికి టిల్‌స్లీగారి నాయకత్వాన చదలవాడ క్రైటన్‌గారు, తదితరులు, అటుపైన క్రమంగా దైవదాసులువెళ్ళి సువార్త పరిచర్య చేసినందువల్ల మొదటగా సి. మత్తయిగారు తదుపరి మరి ఏడుగురు ప్రభువును అంగీకరించారు. టిల్‌స్లీగారు కొంతస్థలంకొని అనువాజిపాలెంలోఉన్న స్కూలును ఇక్కడికి మార్చారు. సంఘం క్రమంగా అభివృద్ధి పొందింది. చదలవాడ పరమానందంగారు సంపూర్ణ సేవకు సమర్పించుకుని ఈ ప్రాంతపు సంఘాలమధ్య మంచి సేవ జరిగిస్తున్నారు. సిర్రా సాముయేలు, ఎం. పౌలు, టి. అబ్రాహాము యం. ఆశీర్వాదం, ఎన్. దైవసాయంగార్లు ఉపాధ్యాయులుగా పనిచేశారు. పెద్దలు టి. మందులియ్య, కె. పౌలు, సిహెచ్. ముసలయ్యగార్లు.

ఈ ప్రాంతంలోని మరి కొన్ని సంఘాలను గురించి క్లుప్తంగా చర్చిద్దాము. మెరిపో యెషయిగారు శృంగవృక్షంలో పనిచేస్తూ వేండ్ర గ్రామంలో సువార్త ప్రకటించగా పెనుమాక పాపయ్య, రత్తయ్య, రత్తయ్య గారిభార్య గంగమ్మగారు ప్రభువును విశ్వసించారు. 1953నుండి గళ్ళా సమూయేలుగారు, యం. మత్తయిగారు సంఘాన్ని అభివృద్ధిలోకి తెచ్చారు. వీరి పరిచర్యవల్ల క్రీస్తును నమ్ముకున్నవారిలో గుత్తుల సుబ్బమ్మగారు ఈ గ్రామంలో ప్రభువుకు గొప్ప సాక్షిగా నిలిచింది. ప్రస్తుతం వై. కొర్నేలియస్‌గారు ఈ సంఘాన్ని చూచుకొంటున్నారు.

## తణుకు ప్రాంతంలోని మిగిలిన సంఘాలు

*ఉండ్రాజవరం:*

ఈ సంఘస్థాపనకు విశేషంగా కృషిచేసినవారు ఎ. అబ్రాహాము, మార్లపూడి సాముయేలుగార్లు.

పైడిపర్రు:

ఎన్. దానియేలు, కె. సత్తిరాజు, టి. చంద్రరావుగార్ల సేవవల్ల ఈ సంఘం ఏర్పడింది.

కాపవరం:

ఇక్కడ ఆరంభంలో దిద్దే శాంతరావుగారు, ఉపాధ్యాయులు, సిర్రా యోసేపుగారు, సిర్రా దానియేలుగారు, కాటూరి దానియేలు, ఒ. ఫ్రాన్సిస్, యం. యెహోషువా, యం.ఆశీర్వాదంగార్ల సేవాఫలితంగా యిక్కడ సంఘం ఏర్పడి కొనసాగుతున్నది. ప్రస్తుతం కె. మోషేగారు, రావూరి చిట్టియ్యగారు, ఈ సంఘాన్ని చూస్తున్నారు.

కోడవల్లి:

(కె. కుముదవల్లి) — సంఘ ఆరంభానికి కారకులు—యం.ఫిలిఫ్, యం. ఆశీర్వాదం, సిర్రా బోయజు, యు. దానియేలుగార్లు. ప్రస్తుతం సంఘపెద్దలు—కె. శాంతారావు, టి. దేవదానం, టి. ఆదియ్య.

కండవల్లి:

సంఘారంభానికి కారకులు: పాలూరి ఎలియేజరు, సిర్రా యోసేపు, సత్తి సత్యం, గాలింకి మహాలక్ష్మి, గాలింకి శాంతారావుగార్లు. ప్రస్తుతం మామూడూరి ఎడ్వర్డ్‌గారు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

అయింతంపూడి:

ఆరంభకులు : సిర్రా యోసేపు, సి. బారాకు, యం. ఆశీర్వాదం. ఇప్పుడు నూతంగి మోషే, నూతంగి ఆశీర్వాదంగార్లు చూస్తున్నారు.

చెఱుకువాడ:

ఆరంభ సేవకులు : సి. లూకా, ఎన్. మోషే, తానేటి సుబ్బన్న గళ్ళా సాముయేలు, ఎం. ఇశ్రాయేలుగార్లు. ప్రస్తుతం పెద్దలు : టి. జయ దర్శనం, మంద జాను, సిహెచ్. పరమానందంగార్లు పెద్దలు.

కాకిలేరు:

ఆరంభ సేవకులు: టి. ఎఫ్రాయిము, గళ్ళా అమృతంగార్లు. తా. సాముయేలు, వేపూరి యిస్సాకుగార్లు పెద్దలు.

సత్యవరం:

ఆరంభ సేవకులు: సి. లూకా, ముప్పిడి యాకోబు, ముప్పిడి జీవరత్నం.

పండితవల్లూరు, రామన్నపాలెం:

ఆరంభ సేవకులు: నవుడూరు విల్యంస్, చెట్టే ఆహోజు, కె. సమూయేలు, కె. ఇస్సాకు, కె. దావీదుగార్లు, కె. పౌలుగారు సంఘకాపరి.

మునమర్రు

సిద్ధాంతం సంఘకాపరి సహో. కె. పౌలుగారి సేవాఫలితంగా ఈ గ్రామంలో సంఘం యిటీవల ఆరంభమైంది.

సిద్ధాంతం:

ఆరంభ సేవకులు: తా. ఎఫ్రాయిము, యం. ఫిలిప్పు, యం. సైలస్ యం. సమూయేలు, నవుడూరి విల్యంస్‌గార్లు. ప్రస్తుతం సంఘపెద్దలు టి. మందులియ్య, కె. పౌలుగార్లు.

పి. వేమవరం:

ఆరంభసేవకులు: సహో. కె. పౌలుగారు.

కె. ఇలెంద్రపర్రు:

ఆరంభసేవకులు: తుంపిరి యోనా, మిస్ హేంప్టన్. ఇప్పుడు వడలావ సుందర్రావు, ఏ. జీవదానంగార్లు పెదలు.

తాండ్రపర్రు:

రంభకులు : చీలి పెదవెంకన్న, చీలి మోషే, చీలి ఆశీర్వాదం,
్ర, చీలి ఇస్సాకుగార్లు. ఇప్పుడు టి. సాముయేలు, చీలి ఆశీర్వాదం,
ర్వాదంగార్లు పెద్దలు.

్రరం:

రంభకులు : తవిటికి వెంకటస్వామి, సి. మార్కుగార్లు, ఇప్పుడు
య్యగారు ఈ సంఘానికి కాపరి.

ం.వి.పేట — ఆరంభకులు : యం. రామయ్య, చెట్టే ఆనందం
ు, సి. మార్కు, గెడ్డం కన్నయ్య, గెద్దాడ కన్నయ్య, నేకూరి
ార్లు, ఇప్పుడు యం. దానియేలుగారు, యం. బెంజమిన్, చెట్టి
గార్లు పెద్దలు.

.వి. పేట — ఆరంభకులు : వై. ఐజక్, బి. భూషణంగార్లు
. ఆనందం, దిద్దే సాముయేలుగార్లు పెద్దలు.

డు :

ఆరంభకులు : జకర్య, కన్నిపాముల సామ్యేలుగార్లు. ఇప్పుడు
రయ్యగారు పెద్దలు.

డు :

ఆరంభకులు : తానికొండ రాజు కె. ఆనందరాజుగార్లు.

ర్ గోస్తనదీ ప్రాంతం:

లోయర్ గోస్తనది ప్రాంతమంతా సేవచేసినవారిలో సిర్రా దానియేలు
గురించి ఇంతకుముందే ప్రస్తావించాము. వీరు టిల్స్లీగారి
ాన్యంలో చెట్టిపేట ప్రాంతపు అనేక గ్రామాల్లో పనిచేసి 1961లో
నారు. పాలమూరు సంఘకాపరిగాఉంటూ లోయర్ గోస్తనది ప్రాంత

మంతా తిరిగి సేవ చేసారు. నవుడూరు తోటలో నూతన వత్సర కూటాలు జరిగించేవారు. దీర్ఘకాలం వివాహపట్కాదారుగా సువార్త సేవకునిగా పనిచేసారు. ఆరవల్లికి చెందిన కన్నిపాముల బెన్యామీనుగారి కుమారుడు సమూయేలుగారు దానియేలుగారి కుమార్తెను వివాహమాడారు. సమూయేలు గారు ఎఱ్రనీలి గుంటలో పనిచేసి వీరభద్రపురం స్కూలుకు బదిలీ అయ్యారు. ఒరిగేడు సంఘంపట్ల శ్రద్ధవహించి అక్కడ ఆలయాన్ని నిర్మింప జేసారు. వీరు లోయర్ గోస్తనది ప్రాంతపు టీచర్లనందరిని సమకూర్చి లోయర్ గోస్తనది ఇవాంజిలికల్ ఫెలోషిప్ అనే పేరుతో ఒక సహవాసాన్ని స్థాపించారు. గొంతు కేన్సర్‌వల్ల వీరు వీరభద్రపురంలో మరణించారు. ఈ సహవాసానికి సహో. జి. సత్యానంద డేవిడ్‌రాజుగారు అధ్యక్షులు, సహో. వై. కొర్నేలియస్‌గారు కార్యదర్శి, సహో. జె. డేనియల్‌గారు కోశాధికారి, వై. ఎబినేజరుగారు పాస్టరుగా పనిచేస్తున్నారు.

నార్కిమెర్లి మోషేగారు నర్సాపురంలో చదువుకుని చెట్టిపేట ప్రాంతంలో బలుసులగోయి గ్రామానికి టీచరుగా వచ్చి సేవ ప్రారంభించారు.

నవుడూరు, మాముడూరు, ఆరవల్లి, చెరుకువాడ, కొత్తపాడు గ్రామాల్లో పనిచేసి 1961 నుండి సంపూర్ణంగా సేవలోకి ప్రవేశించారు. మల్లిపూడి రూబేనుగారికి కొంతకాలం సహాయకులుగాఉండి జుత్తుగలో స్థిరపడి సంఘం స్థాపించారు. అర్జనపాలెం, మల్లిపూడి, పెనుమంట్ర, రామేశ్వరం, మాముడూరు, బ్రాహ్మణచెరువు గ్రామాల్లో కూటాలు జరుపుతూ రక్షణ సువార్త ప్రకటించారు. రూబేనుగారి కుమార్తె దీనమ్మ గారిని వివాహమాడారు. రూబేనుగారి మరణం తరువాత దుద్దే సుబ్బన్న గారితో కలిసి సువార్తసేవ చేసారు. తన 80వ యేట 1980లో జుత్తుగలో తనువు చాలించారు.

నార్కిమెర్లి మోషేగారి ప్రయత్నాలవల్ల జుత్తుగ గ్రామంలో సంఘం ఏర్పడిందని తెలుసుకున్నాము. సుబ్బన్నగారు, రూబేనుగారు ఇక్కడ వాక్య హెచ్చరికలు చేస్తుండేవారు. ఆరంభంలోఉన్న ప్రార్థనకుటీరం కాలిపోగా టిల్‌స్లీసతి ఇక్కడ పెంకుడు శాల నిర్మాణానికి సహాయం చేసారు. మోషే గారికి ముందు గళ్ళా ప్రకాశంగారు, పాలూరి యెలియేజరుగారు తదితరులు

సువార సేవకులుగా ఇక్కడ సేవచేసారు. రామేశ్వరం గ్రామంలో ప్రతియేటా జరిగే శివరాత్రి తీర్థంలో ఈ సంఘ విశ్వాసులు సువార్తను ప్రకటిస్తున్నారు.

వెదుళ్ళపాలెంలో టిల్స్లీగారికాలంలో ఒక స్కూలు స్థాపించబడింది. గెద్దాడ మోషేగారు, కండవల్లి దానియేలుగారు, ఉప్పాటి ఫ్రాన్సిస్‌గారు, గళ్ళా సమూయేలుగారు, గెడ్డం విలియమ్సుగారు మొదలైన వారు ఇక్కడ పనిచేసారు. కన్నిపాముల యాకోబుగారు ఇక్కడ సంఘపెద్దగా పనిచేసారు. ప్రస్తుతం ఇక్కడ దిగుమర్తి సుబ్బారావు, ఖండవల్లి తాతయ్యగార్లు సంఘపెద్దలుగా ఉన్నారు. దిగుమర్తి రత్తయ్యగారు చాలాకాలం సంఘాన్ని నడిపించి ప్రభువు సన్నిధికి వెళ్ళిపోయారు. ప్రస్తుతం కె. తాతారావు, సిహెచ్. రూబేనుగార్లు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

కొణితివాడ గ్రామంలో టిల్స్లీగారికాలంలో సంఘం ఏర్పడింది. స్కూల్లో పనిచేస్తూ సంఘాన్ని నడిపించడానికి సిర్రా దానియేలుగారిని ఏర్పాటు చేశారు. తదనంతరం దుద్దే సుబ్బన్న గెద్దాడ సలాతియేలు, తానేటి సుబ్బన్నగార్లు సంఘాన్ని ఆత్మీయంగా అభివృద్ధి చేసారు. కొంతకాలం విశ్వాసులు లూథరన్ సంఘానికి హాజరయ్యారు. అయితే తణుకుకు చెందిన మార్లపూడి యోబుగారు ఇక్కడ స్థిరపడి గ్రామ సంఘానికి పెద్దగా వాక్యపరిచారకునిగానుఉండి అభివృద్ధి చేసారు. వీరితోబాటు కొడమంచిలి ప్రసాదరావుగారు ఎస్. అబ్రహాముగార్లు పనిచేసు న్నారు. ఆలయ నిర్మాణానికి టిల్స్లీగారు సహాయపడ్డారు.

## లోయర్ గోస్తనది ప్రాంతపు యితర సంఘాలు.

జుత్తిగ:

ఆరంభకులు : నారికమెల్లి మోషే, పి. ఎలియాజరుగార్లు. ఇప్పుడు పి. లాజరస్‌గారు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

పెనుమంట్ర:

ఆరంభకులు : ఎన్. మోషే, జి. మోషే, యం. ఆశీర్వాదంగారు

బట్లమోటూరు:

ఆరంభకులు : ఎన్. మోషే, యం. దైవాశీర్వాదం. ఇప్పుడు డి. చిట్టియ్యగారు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

పంజావేమవరం:

ఆరంభకులు : టి. యోహోను, ఎన్. ప్రకాశంగార్లు.

బ్రాహ్మణవెలుప్రు:

ఆరంభకులు : యం. రూబేను, యం. మోషే, యం. ఆశీర్వాదం గార్లు.

పాలమూరు:

ఆరంభకులు : ఖండవల్లి దానియేలు, డి. సుబ్బన్న, ఎస్. దానియేలుగారు, డి. మహంకాళిగార్లు.

నవులూరు:

ఆరంభకులు : దుద్దే సుబ్బన్న, సిర్రా దానియేలు, తానేటి సుబ్బన్న సిహెచ్. రూబేనుగార్లు. ఇప్పుడు వై. ఎబినేజరు, జి. ఆనందరావుగార్లు ఈ సంఘాన్ని చూస్తున్నారు.

మోగల్లు:

ఆరంభకులు : కె. కరుణమ్మ, కె. దావీదు, కె.జె. నథానియేలు, కె. సమూయేలు, కె. చంద్రయ్య, జి. సామూయేలు, సి. బారాకు, బి. గంగన్న వై. కార్నేలియస్, గళ్ళా దావీదు, యం. చంద్రహాసు, ఎన్. ఆనందం, ఎన్. కృపానందంగార్లు.

కోడకొల్లు:

ఆరంభకులు : దుద్దే సామూయేలు, కొల్లి దావీదు, డి. పల్లయ్య, కె.జె. నథానియేలు, వై. కార్నేలియస్, యం. పౌలుగార్లు.

మాప్లపూరు:

ఆరంభకులు : యం. రూబేను, సిర్రా యోసేపు, సి. మార్కు, సి. యాకోబు, సిర్రా దానియేలు, జె. దానియేలు, యు. జఖర్యా, వై. ఎబినేజరు, యు. మనోహరంగార్లు.

ఆఫ్ తోలేరు:

ులు : ఎన్. మోషే, కె. కృపానందం, యం. పౌలు,
ఎస్. గమాలియేలు, వై. ఎబినేజరు, యం. అబ్రాహాము,
ర్లు.

య్యా:

కులు : యు. యెషయ, యు. దానియేలు, కె. దానియేలు
వై. ఏలియా.

కన్నిపాముల యాకోబు, కె. సుబ్బారావు కె. తాతారావు
ను.

కులు : పి. లాజరస్‌గారు.

# 24

# ధవిళేశ్వరం ఫీల్డు

మధ్యకాలం (1886–1936) ను చర్చిస్తూ ధవిలేశ్వరం ప్రాంతంలో రాసన్, బ్రయంట్, ఆడమ్సు, మిస్ బ్రీలీ తదితరుల సేవను గురించి తెలుసుకున్నాము. ఆ కాలంలో ఈ మిషనెరీల సేవ మూలంగా స్థాపించబడిన ప్రత్తిపాడు, అత్తిలి మొదలైన సంఘాల ప్రస్తావన ధవిలేశ్వరం అధ్యాయంలో వచ్చింది. అయితే ప్రస్తుత కాలంలో ప్రత్తిపాడు, ధవిలేశ్వరం ప్రాంతాలను వేర్వేరు ఫీల్డులుగా గుర్తించడం జరిగింది. ఇప్పుడు ధవిలేశ్వరం ఫీల్డులోని సంఘాలు, ఈ ప్రాంతపు ప్రముఖుల గురించి తెలుసుకుందాము.

ఆధునికుల గురించి చర్చించేముందు ధవిలేశ్వరం ప్రాంతంలోకూడా సేవలో పాటుపడిన ఒక ప్రముఖ మిషనెరీ మిస్ రెవింగ్టన్ అనుభవాలను సేవాసక్తినీ మరోసారి ధ్యానించవలసిన అవసరం ఉంది. 1928–36 కాలంలో రెడ్డిసీమ ప్రాంతాన్నంతటినీ కలియదిరిగి సువార్త ప్రకటించిన ఈ సహోదరి కొంతకాలం ధవిలేశ్వరంలో మిస్ బ్రీలీ, మిస్ మోరిస్‌లకు కూడా సహాయంగా పనిచేసింది. వీరంతా కలిసి హవున్ బోటులో రామచంద్రపురం, తాతపూడి, ఆలమూరు, జొన్నాడ, పెనికేరు, కపిలేశ్వరం, కోటిపల్లి మొదలైన ప్రాంతాలు పర్యటించి సేవ చేశారు. ఆ కాలంలో కోడి కృపమ్మ, ప్రత్తిపాటి మంగమ్మగార్ల సహాయంతో మిస్ రెవింగ్టన్ ప్రతి శుక్రవారం రాజమండ్రి సెంట్రల్ జైలులోని ఖైదీలకు సువార్త వినిపిస్తూ ఉండేది. ఒక గురువారంనాడు మిస్ రెవింగ్టన్ కృపమ్మగారిని వెంటబెట్టుకుని 3 మైళ్ళ దూరానఉన్న భీమవరంకు ఒక మనియార్డరు తీసుకునేందుకు వెళ్ళారట. పోస్టాఫీసులో అడిగితే మనియార్డరు ఇంకా రాలేదన్నారట. చేతిలో ఒక్క పైసా లేదు. చేసేదేమీలేక వేల్పూరు కాలవ గట్టున 20 మైళ్ళుదూరం నడిచి రాత్రి 8 గం.లకు తణుకులోఉన్న

మిస్ లిన్ దగ్గరికి చేరుకున్నారట. భోజనంచేసి మిస్ లిన్ దగ్గర చేబదులు పుచ్చుకుని రాత్రికి రాత్రే రైలుబండి ఎక్కి రాజమండ్రి చేరి శుక్రవారం ఉదయం యథాప్రకారం జైలులో సువార్త సందేశాన్నిచ్చి సాయంత్రానికి గొల్లల కోడేరులోఉన్న తమ బోటు దగ్గరికి చేరుకున్నారట. రెవింగ్టన్ గారి జైలు సువార్త సేవవల్ల నేరస్థులెందరో రక్షణ వార్తను విని మారు మనస్సు పొందారు.

మిస్ స్టార్క్, మిస్ టేలర్, మిస్ మన్రో, మిసెస్ కూపర్ తదితరులుకూడా ఈ ప్రాంతపు సువార్తీకరణలో పాత్ర వహించారు. ఆస్‌బోర్న్‌గారు వివాహానికి ముందు 1946లో నర్సాపురంలో తెలుగు భాష నేర్చుకుని 1948లో ధవిలేశ్వరంలో స్థిరపడి పాటశాలల నిర్వహణ కోసు గ్రామీణ సంఘాల క్షేమాభివృద్ధి నిమిత్తము పాటుపడ్డారు. 1949లో వివాహానంతరం వీరు చాగల్లు వెళ్ళిపోయారు.

రాయ్ జి. జర్మన్‌గారు క్రైస్తవ వాఙ్మయసేవను అజమాయిషి చేస్తూ రాజమండ్రికి 1947లో వచ్చి 1952లో స్థిరపడి 1974 వరకు ఈ ప్రాంతాల్లో సేవ చేశారు. అటుతరువాత 1974లో వీరు అనంతపురం, ఆపైన బెంగుళూరు వెళ్ళిపోయారు. రాజమండ్రిలో ఉన్న కాలంలోనే జర్మన్‌గారు నేస్మిత్‌గారి క్రొత్తనిబంధన విషయ సూచిక ముద్రితమైంది. ఫెయిర్, మోరిసన్, వెబ్, మెక్లీరీగార్లుకూడా ఈ ప్రాంతాల్లో నివాసముండి ఆయా కాలాల్లో సేవ చేసారు.

ఆడమ్సుగారు మిస్ బ్రీలీ మిస్ మోరిస్‌ల సేవ ఫలితంగా ధవిలేశ్వరంలో సంఘం స్థాపించబడింది. నర్సాపురం వాస్తవ్యులైన తొత్తరమూడి రూబేనుగారి కుమారులు జోన్సుగారు యవ్వనప్రాయంనుండే సువార్తలో ఆసక్తిగలిగిఉంటూ రంగూన్‌వెళ్ళి వచ్చిన తరువాత మిస్ బ్రీలీ మిస్ మోరిస్‌ల పిలుపునందుకుని ధవిలేశ్వరంలో స్థిరపడి ఈ ప్రాంతమంతా కాలినడకన తిరిగి సువార్త ప్రకటించారు. సంగీతంలో వీరికి మంచి ప్రవేశం ఉంది. గంభీరంగా వీధి ప్రసంగాలు చేసేవారు.1939లో వీరి హఠాన్మరణం తరువాత వీరి కుమారుడు దేవదానంగారు అన్నగారితో కలిసి లేసువ్యాపారం చేస్తూ ధవిలేశ్వరంలో మిస్ బ్రీలీ, మిస్ మోరిస్‌గార్లవల్ల రక్షణలోకి నడిపించబడ్డారు. వ్యాపారాన్ని నిరసించి కాకినాడ రక్షణోదయ ప్రెయినింగు

స్కూలులో చదువుకుని చింతల నామవరంలో టీచరుగా ఉంటూ సంఘాలను దర్శించారు. వేమగిరి స్కూల్లో కొంతకాలం పనిచేసి 1944లో ధవిళేశ్వరం స్కూలుకు వచ్చారు. 1972లో రిటైరైన తరువాతనుండి పూర్తి సమయాన్ని సువార్త సేవకు వెచ్చిస్తున్నారు. సంఘ కార్యక్రమాలను దక్షతతో నిర్వర్తిస్తున్నారు. తెలుగు కాన్ఫరెన్సుకు చాలాకాలం వీరు కార్యదర్శిగా పనిచేశారు.

1963లో జెడ్. మేడపాడు గ్రామానికి వి. లూకా, ఎన్. కృపానందం యం. ఫిలిప్పుగార్లువచ్చి సువార్త బోధించగా టి. దాసు, జె. పెదమోషే కొల్లపు ఐజక్ గార్లు, మరికొందరు విశ్వసించి బాప్తిస్మం పొందారు. వీరిలో ఐజక్‌గారు 1965లో సంపూర్ణంగా సేవకు సమర్పించుకుని స్వగ్రామంలోని సంఘంలోను, పరిసర గ్రామాల్లోనూ ఆత్మల సంపాదనకు కృషి చేస్తున్నారు.

బిక్కవోలు గ్రామంలో ఆర్. వీరరాజుగారు మొదటగా రక్షించబడ్డారు. జెడ్. మేడపాడు,ద్వారపూడినుండి విశ్వాసులు వచ్చి వీరికి సహకరించి పనిచేయగా 1969లో డి. చెల్లక్కమ్మగారు, శాంతమ్మగారు మరికొందరు రక్షించబడి బాప్తిస్మం పొందినప్పుడు ఇక్కడ సంఘం వెలిసింది. కొద్ది కాలానికి డి. సత్యానందం, యం. రాములు, డి. వెంకట్రావు తదితరులు ప్రభువును విశ్వసించారు. నేదూరి జాన్ కృపారావుగారిది జన్మస్థలం ద్వారపూడి.1968లో మారుమనస్సుపొంది1970లో సేవలో ప్రవేశించారు. బిక్కవోలు స్థానిక సంఘంగా ఈ ప్రాంతపు సంఘాలన్నీ తిరిగి ఆత్మలను సంపాదిస్తున్నారు.

ద్వారపూడి గ్రామంలో 1960లో జెడ్. మేడపాడు నుండి సువార్తికులు వచ్చి సేవ ప్రారంభించగా నేదూరి మరియమ్మ, యం, నాగమ్మ సి.హెచ్. నాగరత్నమ్మ, ఇంకా మరికొందరు రక్షణ పొందారు. మరికొంత కాలానికి జాన్ కృపారావు, టి. చంద్రరావు, ఎ. ఆశీర్వాదంగార్లు ప్రభువు నంగీకరించి బాప్తిస్మాలు పొందగా సంఘం స్థాపించబడింది.

పెదబ్రహ్మదేవం గ్రామంలో పరిసర గ్రామసంఘాల విశ్వాసుల కృషివల్ల యోహానుగారు, వారి భార్య సూరమ్మగారు మరికొందరు రక్షణ పొంది సంఘంగా ఏర్పడ్డారు. మహేంద్రవాడలోకూడ కాకిలేటి లక్ష్మయ్య

మార్తమ్మ, ఇంకా మరికొందరు క్రైస్తవులై సంఘంలో చేర్చ
ఇప్పనపాడులో కె. ఐజక్, ఎన్. జాన్ కృపారావుగార్లు ఇతర
తో కలిసి సేవచేస్తుండగా రోజమ్మ, మరియమ్మ, లక్ష్మయ్య
వరు రక్షించబడి సంఘంగా ఏర్పడ్డారు.

రాధాయపాలెం గ్రామానికి మిస్ బ్రీలీ, మిస్ మోరిన్‌గార్లు
ా వెళ్ళి సువార్త బోధిస్తూఉండగా గోసాల పెదపోతయ్యగారు
ేకి వచ్చారు. మిషనెరీ సహోదరీలు ఇక్కడ ఒక స్కూలు స్థాపించి
ల్లి అబ్రహాముగారుని టీచరుగా నియమించారు. అబ్రహాముగారు
భివృద్ధికోసం పాటుపడుతూఉండగా గోసాల చినపోతయ్య దంపతులు,
సమర్తయ్య దంపతులు, అటుపైన కొన్నాళ్ళకు, సమర్తయ్యగారి
ులు రత్తయ్య, యోసేపు అనేవారు రక్షణపొంది బాప్తిస్మం
న్నారు. ఆలయనిర్మాణంకోసం సమర్తయ్య, నల్ల పోతయ్య,
య్యగార్లు సహకరించారు. అబ్రహాముగారి అనంతరం పెందుర్తి
ుగారు టీచరుగా, సంఘకాపరిగా వచ్చి చేరారు. ప్రస్తుతం ముసలయ్య
ు, రత్తయ్యగార్లు సంఘపెద్దలుగా ఉన్నారు.

దివాన్ చెరువు గ్రామానికి గళ్ళా చంద్రయ్యగారు (యోవేలు
రి తండ్రి) స్కూలు మాస్టరుగా వచ్చి సేవ ప్రారంభించి మందపెల్లి
ంకటస్వామిగారిని ప్రభువులోకి నడిపించారు. అటుపైన వీరి
మరిణమ్మగారుకూడా రక్షణ పొందారు. తరువాత మందపెల్లి
య్య, పెదపూడి గంగయ్య, మందపెల్లి సూరయ్య, మందపెల్లి పేరయ్య
మ అచ్చియ్య, నేదూరి దేవానందం, వేమగిరి పుల్లయ్య, వేమగిరి
్యగార్లు కుటుంబసమేతంగా రక్షణ పొందారు. రాజమండ్రికి చెందిన
ి కులస్థులు వంకాయల వెంకటరత్నంగారు ఆలయం నిమిత్తం
్థ్ల ఇచ్చారు. మందపెల్లి ఫిలిప్పు, వీధి దండయ్యగార్లుకూడా కుటుంబ
ంగా విశ్వాసుల గుంపులో చేరారు. వీరుగాక పేరయ్య, మహాలక్ష్మి
కుటుంబాలుకూడా ప్రభువులో విశ్వాసముంచారు. మందపెల్లి
ెంకటస్వామిగారు ప్రభువులో బహు ఆదర్శవంతమైన జీవనాన్ని గడిపి
24లో ప్రభువు సన్నిధికేగారు. గళ్ళా చంద్రయ్యగారు 20 యేళ్ళు
సంఘంలో సేవ చేశారు. వీరి తరువాత ఒరిగేటి సూరయ్య, మెరిపో

వ్రజాగార్లు పెద్దలుగాను, మెరిపో వెంకయ్య, అబ్రహాముగార్లు సువార్తికులు గాను పనిచేసారు. ఆ తరువాత టి. జోన్సు, సి. సూరయ్య, గొల్లపల్లి యాకోబుగార్లు సువార్తికులుగా పనిచేశారు. పాటశాల లేబరు స్కూలుగా మారినప్పుడు అక్కడ పనిచేస్తున్న వేమగిరి వెంకన్నగారు రిటైరై సువార్తికునిగా పని ప్రారంభించారు. పెదపూడి గంగయ్యగారుకూడా ఇన్‌స్పెక్టర్ పనిచేసి రిటైరై శివాన్‌చెరువు సంఘంలో సేవ చేస్తున్నారు. ప్రథమంగా గళ్ళా ఏంబ్రయ్యగారు స్థాపించిన సంఘంతోబాటు క్రమేపీ లూథరన్ పెంతెకొస్తు ప్రపంచ సంఘం మొదలైన సంఘాలు వెలిసినాయి. జి.డి.యం. సంఘానికి పెద్దలుగా పెదపూడి గంగయ్య, మందపెల్లి లాజరు, మందపెల్లి దావీదు, కొమ్ము ఆమోసు, మందపెల్లి దేవదాసు, జుత్తుగ వెంకన్నగార్లు ఉన్నారు.

కడియం గ్రామంలో ఆడమ్సుగారు, తదుపరి మిస్ బ్రీలీ, మిస్ మోరిస్‌ల సేవ ఫలితంగా పలివిలి వనమయ్య, భార్య మహాలక్ష్మమ్మ, కడిపల్లి వీరన్న, భార్య మాసరమ్మగార్లు రక్షణ పొందారు. వీరుగాక మళ్ళ పోలయ్య దంపతులు, పలివిలి సూరయ్య దంపతులుకూడా రక్షణ పొందారు. సంఘం స్థాపించబడింది. అటుతరువాత మామిడి యోసేపు వారి భార్య సన్నెమ్మ అనేవారు రక్షణ పొందారు. వీరంతా ఆదివారం కూటానికి ధవిలేశ్వరం వెళ్ళేవారు. ఆడమ్సుగారు కొంత భూమినికొని చిన్న పాక వేయించి ప్రార్థనలు నడిపారు. ఫెయిర్‌గారు కడియం గ్రామంలో అద్దె ఇంట్లో ఉంటూ చుట్టుప్రక్కల గ్రామాల్లో సువార్త నందించేవారు. మోరిసన్, వెబ్, జర్మన్, మెక్లేరీగార్లు ధవిలేశ్వరంలో నివాసముండి ఈ ప్రాంతంలో వాక్యపరిచర్య చేసేవారు. మెరిపో వెంకయ్యగారు చాగల్లు నుండీ, తొత్తరమూడి జోన్సుగారు ధవిలేశ్వరంనుండీ వచ్చి సంఘాన్ని దర్శిస్తూ ఉండేవారు. వీరుగాక సూరయ్య, నవుంద్రుడు నర్సయ్య, వీరాస్వామి సిద్దెం బుల్లెయ్య, బొల్లిపో గంగయ్యగార్లు వచ్చి ఇక్కడ సేవ చేసారు. జర్మన్‌గారి సహాయంతో పెద్ద ప్రార్థనాలయం ఈ సంఘం కొరకు నిర్మించబడింది. ధవిలేశ్వరంనుండి గళ్ళా సత్యానందం, డేవిడ్‌రాజు, సంసోను, దేవదానం, యోసేపుగార్లు వచ్చి సండేస్కూలు, సంఘారాధన నడిపించేవారు. ప్రస్తుతం మోజెస్‌గారు ఈ బాధ్యత నిర్వర్తిస్తున్నారు. వీరు మామిడి

యోసేపుగారి కుమారులు. యోసేపుగారు సంఘపెద్దగాఉండి పరిసర గ్రామాల్లో మంచి సేవ జరిగించారు.

ములకల్లంక గ్రామానికి చెందిన విశ్వబ్రాహ్మణ కుటుంబంలో రామచంద్రుని రామయ్యగారు జన్మించారు. వీరి తల్లి, పినతల్లి రక్షణ పొందినవారు కావడంవల్ల రామయ్యగారికి చిన్నతనంనుండే వాక్యం బోధించారు. రామయ్యగారు సతీమణితోసహా 1950లో స్వగ్రామంలో బాప్తిస్మం పొందారు. నిడదవోలులో పినతల్లి లక్ష్మీకాంతమ్మగారు స్థాపించిన సంఘంలో ప్రతినెల మొదటివారంవెళ్ళి వాక్యం చెప్పేవారు. 1963లో ములకల్లంక నుండి రాజమండ్రివచ్చి స్థిరపడ్డారు. 1955నుండే రాజమండ్రి సెంట్రల్ జైలులోని ఖైదీలకు సువార్త నందించడానికి అనుమతిపొంది దీర్ఘకాలం ఈ సేవలోఉండి 1980లో తనువు చాలించారు. ప్రస్తుతం ఈ సేవను వీరి కుమారులు, వీరి అల్లుడు నరసాపురం కుష్ఠురోగుల ఆస్పత్రి జనరల్ సూపరింటెండెంట్‌గారయిన సహో. కె. సత్యానారాయణ గారు చూస్తున్నారు.

విప్పర్తి లూకా గారి కుమారులు సెంబాబుగారు రాజమండ్రిలో కాపురముంటూ స్వచ్ఛందసేవకునిగా ప్రభువు పక్షాన పాటుపడ్డారు. వీరు ఎం.ఎ. వరకు చదువుకుని 1966లోనే రక్షించబడినవారై నందువల్ల విద్యార్థి దశలోనే యువకులు కొందర్ని ప్రభువులోకి నడిపించారు. ప్రస్తుతం కడపలో కాపురముంటూ దక్షిణ ఆంధ్ర బ్రదరెన్ సంఘాల్లో సువార్త సేవకులుగా ఉంటూ ప్రభువుచేతిలో బలమైన సాధనంగా వాడబడుతున్నారు. గోదావరి ప్రాంతీయ మహాసభల్లో అనువాదకులుగా, ఆయా కూటాల్లో ప్రసంగికులుగా సహాయపడుతున్నారు.

ఈ ఫీల్డులోని సంఘాలు దిగువ గ్రామాల్లో ప్రభువు కార్యాభి వృద్ధిలో ముందుకు సాగుతున్నాయ్.

కడియం, నామవరం, ధవళేశ్వరం, రాధాయపాలెం, పిడిద, పుణ్య క్షేత్రం, బాలాజీపేట, సుబ్బపుబట్లీపేట, కేశవరం బిక్కవోలు, పెదబ్రహ్మ దేవం, ద్వారపూడి, మహేంద్రవాడ, ఇప్పనపాడు, దివాన్‌చెరువు, జమిందారు మేడపాడు, వేమగిరితోట, చింతలనామవరం.

ఈ సంఘాల పరిచర్యలో సహో.ఎన్. నథానియేలు,సహో.టి.జోసెఫ్, సహో.టి.దేవదానంగార్లు సంఘపెద్దలకు చేదోడువాదోడుగా సహకరిస్తున్నారు.

# 25

# అంతర్వేదిపాలెం ఫీల్డు

1910నుండి 1965 వరకు పి.సి.వైట్ హౌస్‌గారు అంతర్వేదిపాలెం ఫీల్డు మిషనెరీగా ఉంటూ రాజోలు తాలూకా నగరం మొదలుకొని గన్నవరం దాకా సంఘాల స్థాపనకు కృషి చేశారు. వాడ్రేవుపల్లిలో నివాసముంటూ విశాఖపట్నం నుండి క్రాటు సమూయేలుగారిని రప్పించి అంతర్వేదిపాలెం ఫీల్డులో పెళ్ళిళ్ళు చెయ్యడానికీ, బాప్తిస్మాలివ్వడానికీ నియమించారు. సంఘసేవకు, పాటశాలల్లో బోధించడానికీ వైట్‌హౌస్‌గారే కొందరు యువకులను నర్సాపురం పంపించి చదువుకయ్యే ఖర్చంతా భరించేవారు.

1920 నాటికి ఈ ఫీల్డులో పన్నెండు సంఘాలుండేవి. 1930లో వైట్‌హౌస్‌గారు వీటిని రెండు భాగాలుగాచేసి తూర్పువైపు సంఘాలకు సికిలే వెంకటరెడ్డిగారిని, పడమరవైపు సంఘాలకు కె.సి. లాజరుగారిని పాస్టర్లుగా నియమించి పెళ్ళిళ్ళు, బాప్తిస్మాలిచ్చేందుకు సంఘాల్లో అధికార మిచ్చారు. 1931 నుండి వీటన్నిటిని కలిపి జి.డి.యం సెనెడ్ (ఫీల్డు కౌన్సిలు) ను ఏర్పాటుచేసి 1966దాకా వైట్‌హౌస్‌గారు తానే దానికి ప్రసిడెంటు, ట్రజరరుగా ఉన్నారు. 1957దాకా సికిలే వెంకటరెడ్డిగారు దీనికి సెక్రటరీగా ఉన్నారు. 1959 నుండి 1966దాకా జి. పెద సమూయేలుగారు 1966నుండి జి. చిన సమూయేలుగార్లు సెక్రటరీ బాధ్యత నిర్వహించారు. 1931 నుండి ఉపాధ్యక్షులుగా డి. జాషువా, జె. అబ్రహాం, కె. జగన్నాధరావు, బి. యోసేపుగార్లు పనిచేసారు. 1965 డిసెంబరు 11వ తేదీన వైట్‌హౌస్‌గారు సేవ ముగించి ప్రభుపాద సన్నిధికి చేరారు. తదనంతరం బీర యోసేపుగారు ప్రసిడెంటుగా ఉన్నారు. 1972 నాటికి

ఈ ప్రాంతంలో మొత్తం 40 సంఘాలున్నట్టు జి.సి. సమూయేలుగారు రాసారు.*

వైట్‌హౌస్‌గారికి గ్రామాల్లో వాక్యపరిచర్య చెయ్యడంలో ఉదప్పు గారు 1945 వరకు సహాయపడేవారు. 1965లో వైట్‌హౌస్‌గారి మరణానంతరం 1968లో డి.బి. బర్టుగారు వాడ్రేవుపల్లికి వచ్చారు. వీరు అంతర్వేదిపాలెం ఫీల్డంతా తిరిగి సేవ చేసారు. 1969లో వచ్చిన తుపాను తాకిడికి దెబ్బతిన్న గ్రామీణ ఆలయాలకు సహాయపడ్డారు. వాడ్రేవుపల్లిలో బైబిలు స్కూలు స్థాపించి ఉచిత సదుపాయాలు కల్పించి ఎందరో బైబిలు శిక్షణ పొందడానికి దోహదం చేసారు. అంతర్వేదిపాలెం ఫీల్డంతటినీ వాదాపు నాలుగేళ్ళపాటు ఆత్మీయంగా బలపరచి చిరస్మరణీయమైన సేవచేసారు. అంతర్వేదిపాలెం ఫీల్డుకి కేంద్రస్థానం సెంట్‌పాల్ న్యూచర్చి సంఘం అంతర్వేదిపాలెం. ఇంతకుక్రితం అంతర్వేదిపాలెం విశ్వాసులు ఆలయనిర్మాణం కోసం స్థలం నిర్ణయించెయ్యడందాకా తెలుసుకున్నాము. ఆలయ నిర్మాణ కమిటీకి కొల్లాబత్తుల జ్ఞానప్రకాశంగారు ప్రసిడెంటుగాను, బీర యోసేపు గారు సెక్రటరీగాను, దొండపాటి దావీదుగారు ట్రజరరుగానూ నియమించ బడ్డారు. కొల్లాబత్తుల జగన్నాథరావుగారు నిర్మాణ పనిని అజమాయిషీ చేసే డైరెక్టరు బాధ్యత తీసుకున్నారు.

రంగూన్‌లోను, మురీలోను కాపురమున్న ఈ ప్రాంతపు విశ్వాసులు కొంత చందా పంపించారు. వైట్‌హౌస్‌గారు కొంత విరాళమిచ్చి ప్రార్థనతో పునాది వేసారు.

1941లో పెంతెకోస్తు వారివల్ల సంఘంలో కొంత అలజడి రేగింది. సుమారు 80 మంది సభ్యులు పెంతెకొస్తు సంఘంలో కలిసి పోయారు. రెండేళ్ళపాటు ఆలయంపని ఆగిపోయింది. మళ్ళీ సంఘస్థులు విరాళాలు పోగుచేసి ఇటుక, కర్రకొని శ్రమదానంచేసి నిర్మాణాన్ని కొన సాగించారు. కొల్లాబత్తుల బుల్లి నర్సమ్మగారు లక్షపెంకు విరాళంగా ఇచ్చారు. ఎందరెందరో త్యాగబుద్ధితో చేసిన సహాయంవల్ల 1947

* గోదావరి డెల్టా క్రైస్తవ సంఘము శతవార్షిక చరిత్ర, సెంట్ పాల్‌చర్చి రజతోత్సవము. పాస్టర్ జి. సి. సమూయేలు.

డిసెంబరు 15 నాటికి ఆలయం పూర్తయింది. దీనికి సుమారు 37 నెలలు ఖర్చయింది.

కొల్లాబత్తుల సాలోమోను, వారిగారి సుబుద్ధి, కొల్లాబత్తుల జ్ఞానప్రకాశం, వేదిది ఇస్సాకుగార్లు, మొదలైనవారంతా మధ్యకాలంలో సంఘాన్ని నడిపించినవారు. పాస్టరు కె.పి. లాజరస్‌గారు 1920 లో ఆరంభించి 50 సంవత్సరాలపాటు ఏకధాటిగా ప్రభుసేవలో ఉన్నారు. ఫీల్డు పాస్టరుగా ఈ ప్రాంతమంతటిలోను సేవచేసారు. కొల్లాబత్తుల జగన్నాథరావుగారు జి.డి యం. సెనెడ్ ఉపాధ్యక్షునిగా పనిచేసారు. దాదాపు 40 సంఘాలకు పదమూడేళ్ళపాటు సేవచేసి 1958లో చనిపోయారు. వీరి వాసుదేవుగారు ఆలయ నిర్మాణంలో ప్రధానపాత్ర వహించిన వ్యక్తి. వీరు ఒక గ్రంథాలయాన్ని సెంట్‌పాల్‌చర్చిలో నెలకొల్పడంలో తోడ్పడారు. సెనెడ్ ఉపాధ్యక్షునిగాను, అధ్యక్షునిగాను 1958నుండి పనిచేసారు. వీరు, కె. సూర్యారావుగారు, జి.సి. సమూయేలుగారు ఏకమై జి.డి.యం. తెలుగు కాన్ఫరెన్సు, 1966లో అబ్దుల్‌హక్‌గారి మహాసభలు అంతర్వేదిపాలెంలో జరిగించారు.

కొండపాటి దావీదుగారు 30 యేళ్ళు దైవజ్ఞానంతో సంఘాన్ని నడిపించి కలహాలను సులువుగా పరిష్కరంచేస్తూ ఆలయనిర్మాణంలోకూడా ప్రముఖపాత్ర వహించి సేవ చేసారు. 1960లో ప్రభువు చెంతకేగారు.

జి. సమూయేలుగారు టీచరు ట్రెయినింగుపాసై 1925నుండి అంతర్వేది బుంగ పాపమ్మగారి సంఘంలో స్కూలు, సంఘం నడిపించి 1928నుండి అంతర్వేదిపాలెం హయ్యర్ ఎలిమెంటరీ స్కూల్లో పనిచేస్తూ సంఘ పరిచారకునిగా ఉన్నారు.1960లో రిటైరై సువార్తికునిగా జి.డి.యం సెనెడ్ సెక్రటరీగా అంతర్వేదిపాలెంమధ్య గ్రూప్ సంఘానికి సంఘకాపరిగా సేవ చేసారు. 1965లో ప్రభువు సన్నిధికి చేరుకున్నారు. కొల్లాబత్తుల బుల్లి నర్సయ్యగారు వెంకటస్వామిగారి పుత్రులు. ఉదార స్వభావంతో ఆలయ నిర్మాణానికి, సువార్త వ్యాప్తికి ధనసహాయం చేసారు. సుమారు ఇరవై యేళ్ళపాటు సంఘపెద్దగా ఉన్నారు. వీరి సోదరులు జయానందంగారు కూడా సంఘపెద్దగా ప్రసిడెంటుగా సంఘ క్షేమంకోసం పాటుబడ్డారు.

సండేస్కూలు వై.ఇ.ఎఫ్. సేవాభారం జి. చిన ఆశీర్వాదంగారు
వహించారు. కోటి షేముగారు 1966నుండి సంఘ సెక్రటరీగా పని
సారు. ఆలయ నిర్మాణం, రిపేరింగు విషయాల్లో సహకరించారు.

వోగూరి దానియేలు, కోటి సారహుగారు చాల యేళ్ళు సెంట్‌పాల్
ర్చికి పెద్దలుగా ఉండి దివంగతులైనారు. సారహుగారి సోదరులు ఇస్సాకు
రు వాక్యానుసారమైన జీవితంకోసం విశ్వాసులను హెచ్చరిస్తూ 30 యేళ్ళు
ంఘ పెద్దగా పనిచేసి తన 75వ యేట మరణించారు. వోగూరి యోహాను
రు సంఘపెద్దగా ఉంటూ దూర ప్రాంతాలకు సువార్త దండయాత్రలు
సిన దైవజనుడు. గొంది గ్రామంలో తన స్థలంలో ఆలయ నిర్మాణం
యించి ఆ సంఘ క్షేమాన్ని చూసుకున్నారు. వీరి కుమారుడు ఒ.యం.
పసాదరావుగారు ఉన్నతవిద్య నభ్యసించి గవర్నమెంటు ఉద్యోగాన్ని విడిచి
దాంత విద్య నేర్చుకుని ఈ ప్రాంతంలోనేగాక దేశ వ్యాప్తంగా ప్రసిద్ధి
ందిన సువార్తికునిగా సేవ చేస్తున్నారు. సండేస్కూలు, యువజన సేవ,
ంఘ సేవలలో బహు సమర్థవంతంగా సేవ చేస్తున్నారు. 1966 నుండి
ఈ ప్రాంతంలోను, ఆంధ్రదేశమంతటా అబ్దుల్‌హక్‌గారి మీటింగుల్లో
నువాదకునిగా కార్యకర్తగా మంచి సేవచేసి అనేక ఆత్మలకు రక్షణ
రణమైనారు. యూత్ ఫర్ క్రైస్ట్‌లో యూత్ లీడరు ట్రెయినింగు
ందారు. వై.ఇ.ఎఫ్. కన్వీనరుగా 1966 నుండి యేటేటా యూత్
న్వెన్షన్లు జరుపుతున్నారు. వీరి ప్రోత్సాహంవల్ల కొందరు యువకులు
పభువు సేవకు సమర్పితులై వేదాంత విద్యనభ్యసించి సువార్త సేవకులుగా
నిచేస్తున్నారు. పాస్టరు జి.సి. సమూయేలుగారి కుమార్తె జననీ సుగంధం
రిని వీరు వివాహమాడారు. ఈమెకూడా స్త్రీల సమాజంలో వై.ఇ.ఎఫ్.
ండేస్కూలు సేవలలో సేవ చేసారు. భర్తతో కలిసి యావత్‌మాల్ బైబిల్
లేజిలో ట్రెయినింగు పొందారు.

గెడ్డం పెద జాను, మేడిది గాబ్రియేలు, గొల్లమందల జాన్,
ల్లాబత్తుల యోసేపు, చొప్పల కృష్ణ స్వామిగార్లు ఆయా సమయాల్లో
ంఘపక్షంగా బహు నమ్మకమైన సేవ చేసినవారు. వోగూరి సుబుద్ధిగారి
ుమారులు ఇశ్రాయేలుగారు సంఘపెద్దగా ఉత్సాహంతో సంఘకార్య

కలాపాలు నిర్వర్తించేవారు. చొప్పాల దావీదుగారు బాల్యంనుండి వై.ఇ.ఎఫ్. మెంబరుగా, ఆటుపైన సంఘపెద్దగా సేవచేసారు. ప్రత్తిపాడు బైబిలు స్కూలులో చదువుకున్నారు.

గంటా చినసమూయేలుగారు గంటా అబ్రహాముగారి కుమారుడు. బాల్యంనుండి సంఘ కార్యక్రమాల్లో, వాక్యంలోను ఆసక్తిగలిగి ఉండేవారు. 1930లో సండేస్కూలు స్థాపన వీరి చేతిమీదుగానే జరిగింది. ఆయా సమయాల్లో ఈ బాధ్యతను కె. జాషువా, జి. ప్రభుదాసు, ఒ.యం. ప్రసాదరావు, ఒ.జె. సుగంధం, కె. సువర్ణలత, జి. విక్టర్‌బాబు, కె.జి.విజయ జి.సి. శ్యామ్‌కుమార్, ఆర్.ఎల్. సమూయేలు, కె. పౌలు రాజు తదితరులు నడిపించారు. జి.సి. సమూయేలుగారు సంఘసెక్రటరీగా, పి. లాజరుగారి తరువాత సంఘకాపరిగా అంతర్వేదిపాలెం ఫీల్డు సెనెడ్ కమిటీ సెక్రటరీగా ఎనలేని సేవచేస్తున్నారు. ఈ సంఘ శతవార్షిక ఉత్సవాల సందర్భంగా చరిత్ర పుస్తకాన్ని రచించిన వారు వీరే. ఈ పుస్తకమే ప్రస్తుతం 150 యేళ్ళ చరిత్ర గ్రంథానికి విషయ సేకరణ నిమిత్తం ఉపయోగపడింది. జి.సి. సమూయేలుగారు 1932లో వై.ఇ.ఎఫ్.ను స్థాపించి సుమారు 17 సంవత్సరాలు నడిపించారు. దాన్లో జి. చిన ఆశీర్వాదం, జి. మెషక్ జి. ఆనందం, జి. గాబ్రియేలు, ఆడిదెల మోషే మొదలైన యువకులు ఈ కార్యభారం వహించారు. 1941లో పెంతెకోస్తువారి తాకిడికి సంఘంలో ఏర్పడిన గలిబిలిని ఎదుర్కొని ఈ యువకులు సంఘాస్థుల్ని హెచ్చరిస్తూ ఉండేవారు. దూరప్రాంతాలకువెళ్ళి సువార్త దండయాత్రలు చేసేవారు. జి.సి. సమూయేలుగారి కుమారుడు సేంకుమార్‌గారు బైబిలు ట్రెయినింగు పొంది ప్రస్తుతం నర్సాపురం జి.డి.యం. బైబిలుస్కూలు ప్రిన్సిపాల్‌గా ఉన్నారు.

కె. మనష్షే జ్ఞాన విజయంగారు, కె. సూర్యారావుగారి కుమారులు మద్రాసులో బైబిలు శిక్షణపొంది ఈ ప్రాంతపు ఉజ్జీవ కూటాల్లో ప్రసంగికునిగా, మహాసభల్లో అనువాదకునిగా, అంతర్వేదిపాలెం ఫీల్డుకు ప్రెసిడెంటుగా, సువార్తికునిగా యోగ్యమైన సేవచేస్తున్నారు. ఆర్.ఎల్. సమూయేలుగారు, రావి. లాజరస్‌గారి కుమారులు, రక్షణపొంది బైబిలు ట్రెయినింగుపొంది డబ్ల్యు.ఎం.ఇ. సేవలో ఉన్నారు.

1930లో సిహెచ్. మరియమ్మగారు స్త్రీల సమాజం (YWEF) స్థాపించారు. కె. జయానందంగారి సతి కమలమ్మగారు దీనికి అధ్యక్షులుగా కొల్లాబత్తుల సూర్యారావుగారు సతీ నీలమ్మగారు ట్రజరరుగాను స్త్రీలమధ్య ధన్యకరమైన సేవ జరిగించారు. బలి నరసయ్యగారి పుత్రిక చింతా శారమ్మ గారు చిన్ననాడే భర్తృవియోగం పొంది దైవసేవకు సమర్పించుకుని చెట్టిపేట మిషనెరీ స్త్రీలతో కలిసి అన్ని ప్రాంతాలు తిరిగి సువార్త ప్రకటిస్తున్నారు. నర్సాపురం స్త్రీల బైబిలుస్కూల్లో శిక్షణ పొందారు.

* * *

ఇక ప్రాంతీయ సంఘాల విషయానికొస్తే అంతర్వేదిపాలెం, వాడ్రేవుపల్లి ప్రాంతాలు కలిపి 1920 నాటికి మొత్తం పన్నెండు సంఘాలున్నట్టు చదివాం. అంతర్వేదిపాలెం సంఘానికి కె.పి. లాజరుగారు, సఖినేటిపల్లికి స్థానిక ఉపాధ్యాయుడు, రామేశ్వరంకు వేదాల వెంకటరత్నం గొల్లమందల ఇశ్రాయేలుగార్లు, గుడిమూల సంఘానికి క్రాటు ఏలియాగారు, గొంది సంఘానికి గెడ్డం నతానియేలుగారు, అంతర్వేదిపాలెంకు గంటా సమూయేలు, బత్తుల యోసేపుగార్లు, కేసవదాసుపాలెంకు డి. సమ్మయ్య గారు, మల్కిపురం సంఘానికి సికిలే వనమరాజుగారు, మోరి, వాడ్రేవుపల్లి, కందాలపాలెం, మోరిపోడు సంఘాలకు సికిలే వెంకటరెడ్డిగారు సువార్తికులుగా పాటశాల ఉపాధ్యాయులుగా ఉండేవారు.

వోసూరివారి చెరువుగట్టున 1946లో సువార్త వినిపించబడి అడ్డాలపాలెంలో సంఘం స్థాపించబడింది. బత్తుల నతానియేలుగారు సంఘ కాపరిగా ఉన్నారు. సఖినేటిపల్లి గ్రామంలో వైట్‌హవుస్‌గారి సేవాఫలితంగా చింతా తిరమలయ్య, క్రాటు ఏలియా, ఈద రెడ్డి, యెషయా మొదలైన వారు రక్షించబడి అంతర్వేదిపాలెంకు ఆరాధనకోసం వెళ్లేవారు. క్రమేపీ ఆలయం నిర్మించుకొన్నారు. బళ్ళ రత్నరాజు అనే అంధ సహోదరుడు సంఘకాపరిగా ఉన్నారు. వీరు నర్సాపురం అంధుల పాటశాలలో చదువుకున్నారు. రామేశ్వరం గ్రామంలోకూడా వైట్‌హవుస్‌గారు మొదటగా వాక్యపరిచర్య చేసారు. అగర్తిపాలెంకు చెందిన వేదాల వెంకటరత్నంగారు వచ్చి ఇక్కడ సేవ చెయ్యగా పిల్లి యోహాను, పిల్లి గాబియేలు మొదలైన వారు రక్షించబడ్డారు. ప్రస్తుతం సంఘం మూడుచోట్ల నడుస్తున్నది.

గొంది గ్రామంలో ఆది మిషనెరీలైన బౌడెన్ బీరుల సువార్త పరిచర్యవల్ల జిల్లేళ్ళ పాలుగారు, వీరి అన్నదమ్ములు, కుటుంబమంతా రక్షణ వెలుగులోకి వచ్చారు. చొప్పల దానియేలు, ఫిలిప్పు, యాకోబు తదితర 20 కుటుంబాలు క్రీస్తులోకి వచ్చారు. పెద్ద సంఘంగా ఏర్పడ్డారు. జిల్లేళ్ళ సీమోను నర్సమ్మగార్లకు 1912లో సమూయేలుగారు జన్మించారు. స్వగ్రామంలో చదువుకుని బర్మావెళ్ళి తిరిగివచ్చి రక్షించబడ్డారు. సువార్త సేవాభారం కలిగి స్వయం పోషణ చేసికొంటూ పరిసర ప్రాంతాల్లో సేవ చేసారు. ప్రత్తిపాడు, అంబాజీపేట బైబిల్ స్కూళ్ళలో శిక్షణపొంది ప్రస్తుతం గొంది సంఘ కాపరిగా ఉన్నారు.

గొంది తూర్పు సంఘం 1960లో వోగూరి యోహానుగారి సువార్త పరిచర్యవల్ల స్థాపితమైంది. బూసి యోహాను, గెడ్డం యోహాను మొదలైనవారు ఆది విశ్వాసులు. వోగూరి యోహానుగారు స్వయంగా స్థలం కొని ఇవ్వగా వీరి కుమారుడు ఒ.యం.ప్రసాదరావుగారు ఆలయం కట్టించారు. చొప్పల ఇశ్రాయేలుగారు సంఘ కాపరి. అడిదల దావీదుగారు 1976లో కొందరిని రక్షణ వెలుగులోకి నడిపించినందువల్ల గొంది పడమర సంఘం స్థాపించబడింది. లిల్లీగారి సాయంతో ఆలయం కట్టించారు.

నుదిమూల గ్రామంలో 1915 ప్రాంతాల్లో ఆగర్తిపాలెంనుండి మత్తి చిట్టియ్యగారు వచ్చి పాటశాల ప్రారంభించారు. పిల్లి యోహాను, కొండపాటి కిష్టయ్యగార్లు ఇక్కడ పని చేసారు. చిట్టియ్యగారు ధైర్యంగా సువార్త ప్రకటించిన ఫలితంగా మేడిది దావీదు, యోహాను, కొన లాజరు, జీవరత్నం, కొన సామ్యేలుగార్లు ప్రభువునంగీకరించారు. అటుపైన సఖినేటి పల్లినుండి కొట్రు ఏలియాగారు వచ్చి వీరిని స్థిరపరచి బాప్తిస్మమిచ్చి ఆలయ నిర్మాణంకూడా కావించారు. 1933లో కొల్లా బత్తుల నందనం, వడ్డి యేసురత్నంగార్లు ఈ గ్రామంలో టీచర్లుగాఉంటూ సంఘాభివృద్ధికి పాటుపడ్డారు. పాలపర్తి యోసేపు పంతులుగారు సంఘాన్ని నడిపించేవారు. 1940లో వడ్డి యేసురత్నంగారు టీచరు ట్రెయినింగు పొంది నుదిమూల స్కూలుకు హెడ్మాస్టరుగా వచ్చారు. వీరి హయాంలో సంఘం మరింతగా అభివృద్ధి చెందింది. 1979లో డాక్టరు లీజరుగారి ఋణ సహాయంతో విదేశాల్లో ఉన్న విశ్వాసులు, లిల్లీగారు సహాయంచెయ్యగా

పెద్ద ప్రార్థనాలయం నిర్మించడం జరిగింది. ప్రస్తుతం సైమన్, రూబేన్ సోదరులు సంఘం తరుపున సేవ చేస్తున్నారు.

అంతర్వేది కప్ప సంఘం సుమారు 90 యేళ్ళ క్రితం బుంగ పాపాయమ్మగారి వాక్యపరిచర్యవల్ల వెలిసింది. బుంగ కృపానందంగారు పాతికేళ్ళపాటు సంఘపెద్దగాఉండి 1977లో కన్నుమూసారు. ఈ సంఘం ప్రస్తుతం నాలుగు భాగాలైంది. అంతర్వేది కప్ప మొదటిది. రెండవది బుంగవారిపేట. ఇక్కడ బుంగ జాన్‌గారు సేవకుడుగా ఉన్నారు. మూడవది అంతర్వేది సెంటరు, కొల్లాబత్తుల ఇశ్రాయేలుగారు దీని బాధ్యత వహించారు. నాలుగవది పెంతెకొస్తువారి గ్రూపు. అంతర్వేది సెంటర్ చర్చిలో రక్షించ బడిన కె.యస్. లాజరుగారు మిలటరీ నుండి తిరిగి వచ్చి దాదాపు ఇరవైయేళ్ళ క్రితం అంతర్వేది కర సంఘాన్ని స్థాపించారు. వీరికి వివాహ పట్టా ఉన్నది.

1919లో సికిలే వెంకటరెడ్డి, వనమరాజుగార్లు మోరిగ్రామంలో టీచర్లుగా వచ్చారు. ఆరంభంలో జిల్లెళ్ళ అబ్రహాముగారు సువార్తికునిగా ఉన్నారు. తదుపరి సంఘం అభివృద్ధి అయింది. పై ఇద్దరివలననే మోరిపాడు చింతలమోరి జి.డి.యం. సంఘాలు ఆరంభమైనాయి. మోరిపాడులో కోరుకొండ ఇమ్మానుయేలు, పేతురు అనేవారు విశ్వసించి మోరి గ్రామానికి ప్రార్థనకు వచ్చేవారు. ప్రస్తుతం ఆలయం నిర్మించబడి సంఘ కార్యక్రమాలు జరుగుతున్నాయి.

మల్కిపురంలో సికిలే వనమరాజుగారి సువార్తవల్ల గంటా మారియ్యగారు ప్రథమంగా క్రైస్తవులైనారు. సంఘం అభివృద్ధి చెందింది. వనమ రాజుగారే ఈ సంఘ కాపరి. గొల్ల పౌలుగారు ఈ ఊళ్ళో మరొక సంఘం స్థాపించి నడిపిస్తున్నారు. వనమరాజు, వెంకటరెడ్డి సోదరుల స్వగ్రామం కందాలపాలెంలోకూడా వీరిద్దరి సేవవల్ల సంఘం అభివృద్ధి చెందింది. ఈ గ్రామానికి మొదటి విశ్వాసి రెడ్డిగారే. ఈ సంఘంలో ముడకల రామన్న సికిలే పెద చిట్టియ్యగార్లు సేవకులుగా సంఘకాపరులుగా ఉన్నారు. ఈ గ్రామం ప్రభుత్వ జూనియర్ కాలేజీలో అధ్యాపకులుగా పనిచేస్తున్న ఎస్. భాస్కరరావుగారు అంతర్వేదిపాలెం, అమలాపురం, అంబాజీపేట ప్రాంతాల సంఘాల్లో కాళీ సమయాల్లో విశేషంగా సేవచేస్తున్నారు. వీరు ఇలపకుర్రు ఎస్. గమానియేలు మాస్టారి కుమారులు.

సికిలే వనమురాజుగారు టీచరుగా పనిచేసిన రోజుల్లో నల్లివారి గ్రూప్ జి.డి.యం. సంఘం, శృంగవరపాడు, కేశవదాసుపాలెం తదితర స్థలాల్లో సంఘాలు వెలిసినాయి. కేశవదాసుపాలెంలో రెండవ సంఘంకూడా ఉంది. 1950లో మూలపాడు (గుడిమెళ్ళంక) గ్రామంలో సంఘం వెలిసింది. వైట్‌హౌస్‌గారు సహాయంతో ఆలయం నిర్మించబడింది.

కందాలపాలెంకు చెందిన సికిలే చిట్టియ్యగారి రెండవ కుమారుడు వనమురాజుగారు, వైట్‌హవున్‌గారు ఈ గ్రామంలో సండేస్కూలు నడిపిస్తుంటే వీరు క్రమంగా హాజరయ్యేవారు. వాడ్రేవుపల్లి కూటాలకుకూడా క్రమేణా వెళ్తుండేవారు. 1914లో వైట్‌హవున్‌గారు వీరిని నర్సాపురం పంపించి చదువు చెప్పించారు. నర్సాపురంలో మాముడూరి సైమన్, సత్యం వాసా యోహానుగార్లతో కలిసి సేవకు వెళ్తుండేవారు. తల్లిదండ్రులు వీరిని, అన్నగారు వెంకటరెడ్డిగారిని త్యజించగా వైట్‌హవున్‌గారి ప్రాపకంలోనేఉంటూ మోరి గ్రామంలోను పరిసర గ్రామాల్లో సంఘాలు స్థాపించారు. 1950లో రిటైరై పూర్తి సమయం సేవకు వెచ్చించ సాగారు. మల్కిపురంలో నిండు వృద్ధాప్యంలో సంఘభారం నిర్వహిస్తూ ఉన్నారు.

వాడ్రేవుపల్లి సంఘంగురించి ఇంతకుముందే చదివాం. వైట్‌హవున్‌గారి తరువాత బర్టుగారు వీరి స్థానంలో వచ్చారు. వాడ్రేవుపల్లిలో సమావేశమయ్యే విశ్వాసులు కడలికి కొందరు, కనకాయలంకకు కొందరు వేరుచేయబడ్డారు ఎస్.వి. రెడ్డిగారు స్థానిక సంఘంలోనేకాక పరిసర గ్రామాల్లోకూడా నమ్మకమైన సేవ జరిగించి 1979లో ప్రభువు సన్నిధికేగారు. తాళ్ళా బత్తుల సత్యంగారు 1904లో జన్మించారు. చదువు ముగించి మద్రాసులో కొంతకాలం పనిచేశారు. 1926లో వాడ్రేవుపల్లికి తిరిగివచ్చి కాకినాడలో మారుమనస్సు పొందారు. పెదకందాలపాలెంలో మొదలుపెట్టి పదిహేనేళ్ళు టీచరుగా సువార్తికునిగా పనిచేసారు. మళ్ళీ 1941 నుండి 1946 వరకు ఎయిర్‌ఫోర్సులో పనిచేసి రిటైరై వాడ్రేవుపల్లిలోఉంటూ పరిసర సంఘాల్లో సువార్త సేవ చేసారు. వైట్‌హవున్ మెమోరియల్ బైబిల్‌స్కూల్లో వార్డెన్‌గా పనిచేసారు. గోదావరిజిల్లా సంఘాల అసోసియేషన్ మెంబరుగా, వాడ్రేవుపల్లి సంఘకాపరిగా బహుకాలంగా సేవచేస్తున్నారు.

కనకాయలంక సంఘానికి గెద్దాడ సమూయేలు, సిద్రా జీవరత్నం,

దుద్దే యాకోబుగార్లు సంఘకాపరులుగా పనిచేసారు. చాల కుటుంబాలు ఆయా ప్రాంతాలకు చెదరిపోయారు. 1969లో గాలివానకు ఆలయం పడిపోగా సిర్రా జీవరత్నం, డి. యాకోబు, జి. సమూయేలు, ఎన్.బి. కృపా దానంగార్లు భారంతో ప్రార్థించి విరాళాలు సేకరించి 1974లో క్రొత్త ఆలయం కట్టించారు. ప్రస్తుతం సిర్రా జీవరత్నంగారు దీనికి పెద్దగా ఉన్నారు. ఈ గ్రామానికి చెందిన పెనుమాక కృపమ్మగారు 1936 నుండి మిస్ టేలర్‌తో కలిసి బోటులో గ్రామగ్రామాలు తిరిగి సేవ చేసారు. బోటులో తిరిగి సేవ చేస్తున్నందున ఈమెను 'బోటమ్మ' అని కూడా పిలిచేవారు. దుద్దే యాకోబుగారుకూడా చాలాకాలం టేలర్ మిసమ్మగారి బోటుమీద తిరిగి సేవచేసి యిటీవల వృదాప్యంలో 14.11.1985 తేదీన ప్రభువులో నిద్రించారు.

గెద్దాడ మోషేగారు గెద్దాడ స్వామి, మాణిక్యమ్మగార్లకు 1902లో జన్మించారు. నర్సాపురంలో చదువుకుని ఆయా గ్రామాల్లో టీచరుగా సువార్తికునిగా పనిచేసారు. వీరభద్రపురంలో వీరు తనువు చాలించారు. వీరి కుమార్తెను వీరభద్రపురం మల్లిపూడి అగస్టీను గారికిచ్చి వివాహం చేశారు. గెద్దాడ ప్రేమమ్మగారు సలాతియేలుగారి భార్య. వీరు తునిలో బైబిల్ ట్రెయినింగుపొంది మిస్ టేలర్‌తో కలిసి చాలాకాలం బోటుమీద తిరిగి బైబిల్‌స్త్రీగా పనిచేసారు. అటుపైన సత్తుపల్లివెళ్ళి సువార్త ప్రకటనలో పాల్గొన్నారు. కనకాయలంకలోనే ప్రస్తుతం హిందూ స్త్రీల మధ్య సేవ చేస్తున్నారు. వీరి కుమారుడు సెంబాబుగారు గోదావరిడెల్టా విశ్వాసులందరికీ గాయకుడుగా, సువార్తికుడుగా, మహాసభల ఉపన్యాసకుడుగా పరిచితుడు. తునిలోను, నర్సాపురంలోను చదువు ముగించి 1960లో మారు మనస్సుపొంది మద్రాసులో బైబిలు ట్రెయినింగు పొందారు. 1966లో కేరళకు చెందిన సూసమ్మగారిని వివాహమాడారు. వీరు చిన్నపిల్లల మిషనెరీగా కొంతకాలం పనిచేసి అమెరికా వెళ్ళి వచ్చారు. నర్సాపురం బ్యూలా బైబిలు స్కూలుకు ప్రిన్సిపాల్‌గాఉంటూ 1981 డిసెంబరు నెలలో హటాన్మరణం చెందారు. వీరి అనంతరం కనకాయలంకకు చెందిన జి. సుగుణరావుగారు ఈ స్కూలులో టీచరుగా నియమించబడ్డారు.

పుట్టంగ జి.డి.యం. సంఘాన్ని సికిలే వెంకటరెడ్డి, సత్యంగార్లు 1960లో ప్రారంభించారు. కువైట్‌నుండి విశ్వాసులు పంపిన సహాయంతో ఆలయం కట్టారు. దీపాటి డేవిడ్‌గారు ఈ సంఘ కాపరి. కడలి గ్రామంలో 1920లో కోరుకొండ ప్రసాదరావు, మానుకొండ దేవదాసుగార్లు విశ్వాసులై పెందుర్ల్ల సంఘం ఏర్పడింది. మొగలి కుదురులో 1965లో ఎస్.వి. రెడ్డి గారి సేవవల్ల గొనుపాటి సుబ్బారావు, ఎన్నాబత్తుల అబ్రహాంగార్లు ప్రభువు లోకి రాగా సంఘం స్థాపించబడింది. వాడ్రేవుపల్లినుండి బి. సత్యం మరికొందరు తరుచుగావెళ్ళి సేవ చేస్తున్నారు. శంకరగుప్తంలో జిల్లెళ్ళ కృపానందం, భార్య కమలమ్మగార్లు విశ్వసించగా సంఘం సా పించబడింది.

# 26

# ప్రత్తిపాడు ఫీల్డు

1900 సంవత్సరంలో ప్రత్తిపాడువచ్చి స్థిరపడి ఈ ప్రాంతపు సేవకు వెన్నెముకగా నిలిచిన బ్రయంట్ దంపతులు 1944లో వృద్ధాప్యంలో ఇంగ్లండు వెళ్ళిపోయారు. కొంతకాలం జె. వెబ్‌గారు ప్రత్తిపాడు మిషన్ బంగళాలో ఉంటూ ఈ చుట్టుప్రక్కల సంఘాలను చూస్తూ ఉండేవారు. వెబ్‌గారు వివాహం చేసుకుని తూర్పు గోదావరి ప్రాంతానికి ఇక్కడినుండి వెళ్ళిపోయిన తరువాత వీరి స్థానంలో ఫెయిర్ దంపతులు వచ్చి చేరారు. తర్వాత, డి.జె. డ్రాన్ దంపతులుకూడా ఈ ప్రాంతపు సంఘాల క్షేమాన్ని పర్యవేక్షించారు.

ఫెయిర్‌గారు ప్రత్తిపాడులో ఉన్నకాలంలో మెరిపో వెంకన్నగారు నాళం నరిసింహమూర్తిగారు, పెనుమాక నాగన్నగారు, పెదముత్తి గంగయ్య గారు మొదలైన వారు ప్రత్తిపాడు సంఘాన్ని నడిపించారు. మెరిపో వెంకన్న గారు ఖండవల్లికి చెందిన మెరిపో స్వామి, మంగమ్మగార్లకు జన్మించారు. దుద్దే మలాకీగారితో కలిసి సువార్త సేవలో పాల్గొనేవారు. కోరుమిల్లి, కొండేపాడు గ్రామాల్లో ప్రార్థన మందిరాలు కట్టించి నెలలో 3 వారాలు కాలినడకనవెళ్ళి సంఘాలను హెచ్చరించేవారు. ప్రత్తిపాడు ప్రాంతీయ పెద్దల్లో ఈయన ప్రముఖుడుగా ఉండేవాడు.

డ్రానుగారి కాలంలో గెడ్డం జేమ్సు, పెనుమాక సిద్దయ్యగార్లు పెద్దలుగా ఉండేవారు. వీరి కాలంలో ఆలయం పడగొట్టించి మిస్ హెడ్సు గారి సహకారంతో సిద్దెల జోసెఫ్‌గారు తదితరుల పర్యవేక్షణక్రింద పెద్దలు పదివేల రూపాయల వ్యయంతో క్రొత్త మందిరం నిర్మించారు. కిష ంపాలెం, కాకులంపాడు గ్రామాలనుంచి విశ్వాసులు ఈ మందిరానికి హాజరవుతూ

ఉండేవారు. ఈ సంఘానికి ప్రస్తుతం పెనుమాక ఇస్సాకుగారు, పెనుమాక గంగయ్యగారు, వీరికి ముందు బొల్లిపో సమూయేలుగారు, పెనుమాక బ్రహ్మయ్యగారు సంఘ పెద్దలుగా ఉన్నారు. పెనుమాక ప్రకాశంగారు, యాడంగి ఆశీర్వాదంగారు ఈ సంఘంలో వాక్యపరిచర్యచేస్తూ పరిసర ప్రాంతాల్లోకూడా సేవచేస్తూ ఉన్నారు.

పెనుమాక సిద్దయ్య, ఇస్సాకుగార్లు సోదరులు. సిద్దయ్యగారు బర్మాలో 1932లో ప్రభువులో విశ్వాసముంచి బాప్తిస్మం పొందారు. 1936లో తిరిగివచ్చి బ్రయంట్‌గారి మూలంగా సంఘ సహవాసంలో చేర్చబడ్డారు. వీరు కొండ్రుపోలు, ఉమామహేశ్వరం, పెంటపాడు, కోరుమెల్లి కొండేపాడు మొదలైన ప్రాంతాల్లో మెరిపో వెంకన్నగారితోవెళ్ళి సేవ చేసేవారు.

ఈ ప్రాంతంలో ప్రఖ్యాతి చెందిన మరొక సంఘం అత్తిలి. దీని విషయం ఇంతకుముందే కొంతవరకు చూసాం. ప్రత్తిపాడులో డ్రౌను గారు స్థిరపడిన కాలంలో అత్తిలి సంఘానికి గెడ్డం విలియంగారు కాపరిగా ఉన్నారు. దేవునిమీద ఆధారపడి 15వేల రూపాయల వ్యయంతో వీరి కాలంలో ప్రస్తుతం నిలిచిఉన్న ప్రార్థన మందిరాన్ని, ప్రహరీని కట్టించడం జరిగింది. దీన్ని డ్రౌనుగారు ప్రతిష్ఠ చేసి దీనికి 'షిలోహు' అని పేరు పెట్టారు. 1949లో గెడ్డం విలియంగారు సంఘపెద్దగా ఉన్నకాలంలో అత్తిలిలో సభలు జరిగినాయి. అప్పటినుండి మూడు నాలుగేళ్ళకొకసారి జరుగుతూ ఉన్నాయి. క్రాఫర్డు, టిల్‌స్లీగారు, వి. లూకాగారు, పాల్‌రెడ్డి గారు, మెట్టుపల్లి ఎలీషాగారు, బూల అజరయ్యగారు, అగ్గిప్పగారు తదితర ప్రముఖులు ఈ సభల్లో వాక్యోపదేశాలు చేశారు.

ఆరంభంలో గెడ్డం తాతయ్యగారు సంఘకాపరిగాను, స్వామి, బుల్లియ్య, నల్లయ్యగార్లు పెద్దలుగాను ఉండేవారు. బుల్లియ్యగారు 1894లోను వెనువెంటనే స్వామిగారు పరమపదించడంతో మోషేగార్ని పెద్దగా నియమించారు. మోషేగారు సంఘ క్రమశిక్షణ గురించి శ్రద్ధ వహించి సక్రమంగా సంఘాన్ని నడిపించారు. 1934 జనవరి ఒకటవ తేదీన వీరు మరణించారు. నల్లయ్యగారి స్థానంలో గెడ్డం చినవెంకయ్యగారిని పెద్దగా నియమించారు. వీరి తరువాత గెడ్డం సత్తియ్యగారు. వీరు

బాదంపూడిలో టీచరుగా పనిచేసిన పేతురుగారి తండ్రి. వీరి తరువాత గెడ్డం మోషేగారి తండ్రి, జేమ్సుగారి తాత గెడ్డం చిన సత్తియ్యగారు పెద్దగా ఉన్నారు. సంఘపెద్ద గెడ్డం మోషేగారి అనంతరం గెడ్డం థామస్‌గారిని నార్కిమెల్లి పోలీసుగారిని సంఘపెద్దలుగా నియమించడం జరిగింది. అటుతరువాత జి.ఆర్. సమూయేలుగారు, జి.ఎన్. సమూయేలుగార్లను పరిచారకులుగాను, గెడ్డం థామస్, మాముడూరి యెషయ్య, జి.ఆర్. మోషేగార్లు పెద్దలుగా వ్యవహరించారు. గెడ్డం తాతయ్యగారు తదితరులంతా ప్రస్తుతం నిత్యవిశ్రాంతిలో ఉన్నారు.ఆవెనుక కండవల్లి సమూయేలు, మార్లపూడి దేవదానం, గెడ్డం కృపాదానంగార్లు, సంఘ పెద్దలుగాను, గెడ్డం గమానియేలు, గెడ్డం ఆనందరాజుగార్లు పరిచారకులుగాను, గెడ్డం విలియంగారు సంఘకాపరిగాను, సంఘ కార్యక్రమాలు నడిపిస్తున్నారు. విలియంగారు చిన్నవయసునుండి సంఘకార్యక్రమాల్లో ఆసక్తిగలవాడై ఎదిగి తణుకు గవర్నమెంటు ఆస్పత్రిలో కాంపౌండరుగాను, ఆయా గ్రామాల్లో మిషన్‌స్కూలు టీచరుగాను పనిచేస్తూ అత్తిలివచ్చి సువార్త, ఆరాధన కూటాలు నడిపించేవారు. 1947లో అత్తిలి స్కూల్లో ఉపాధ్యాయుడుగా సి రపడి తన తండ్రి వృద్ధాప్యంలో సంఘభారం చేపట్టి నడిపిస్తున్నారు.

సండేస్కూలు స్థాపన 1890లో జరిగింది. వరుసగా మంగమ్మగారు లక్ష్మి విలాసమ్మగారు, బతూయేలు, మార్లపూడి దేవదానం, వసంతాడ ఇశ్రాయేలుగార్లు నడిపించారు. ప్రస్తుతం గెడ్డం విలియంగారే ఈ భారాన్ని చేపట్టారు. మంగమ్మగారు స్త్రీల కూటాన్నికూడా ఆరంభించారు. వీరి అనంతరం లక్ష్మి విలాసమ్మ, పుల్లమ్మ, నవోమి, గెడ్డం రాజేశ్వరి, వంగలపూడి ఎలీసబెతు మొదలైనవారు ఈ బాధ్యత నిర్వహించారు.

గెడ్డం విలియంగారు 1939 నుండి 1942 వరకు ఉమా మహేశ్వరంలోను, 1944నుండి 1947 వరకు వెదుళ్ళపాలెంలోను, పనిచేసి అక్కడ ఆలయ నిర్మాణం కావించారు. 1970లో కొమ్మరంలో కూడా వీరే ఆలయ నిర్మాణానికి పాటుబడ్డారు.

1922లో స్థాపించబడిన జి.డి.యం. సంఘం అప్పటి సంఘకాపరి చెందుకూరి మత్తయిగారు చనిపోవడంతో అక్కడి లూథరన్ మిషన్‌తో కలిసిపోయింది. అటుతరువాత పాలి ఎయిడెడ్ పాటశాలలో పనిచేస్తున్న

మెరిపో జాషువాగారి తోడ్పాటుతో గెడ్డం విలియంగారు జి.డి.యం. విశ్వాసులను వేరుచేసి విశ్వాసుల సహకారంతో అక్కడ ప్రార్ధనా మందిరం కట్టించారు. ప్రతి ఆదివారం అత్తిలినుండి పాలి నడిచివెళ్ళి కూటాలు నడిపించేవారు. అయితే అక్కడి విశ్వాసి మెరిపో సమూయేలుగారు వాక్యాను భవంపొంది తానే సంఘ బాధ్యతను చేపట్టారు. ఇలా మూడేళ్ళు జరిగిన తరువాత సమూయేలుగారు సంపూర్ణ సేవకు సమర్పించుకుని సిద్ధాంతం వెళ్ళిపోయారు. తిరిగి పాలి గ్రామ సంఘ బాధ్యత విలియంగారిమీద పడింది. ఇవికాక కొమ్మర, పాలూరు దాసుళ్ళ కోడవల్లి తదితర సంఘాలనుకూడా విలియంగారు దర్శించేవారు.

అత్తిలి ప్రాంతపు ప్రముఖులు కొందరి జీవిత విశేషాలు చూద్దాం. గెడ్డం సమూయేలుగారు అత్తిలిలో గెడ్డం నల్లయ్యగారి కుమారులు. రక్షణపొందిన తరువాత సంఘపెద్దగాఉంటూ తన సాత్వీకంతో మృదువైన మాటలతో సంఘాన్ని పోషించేవారు. వీరి ఆదర్శప్రాయమైన జీవితం సంఘంలో గొప్ప సాక్ష్యంగా నిలిచింది. మాముడూరి యెషయ్యగారు తన 20వ యేట రంగూన్‌వెళ్ళి తిరిగివచ్చి చెట్టిపేటలో పోస్టుమేన్‌గా పనిచేస్తూ అత్తిలికి బదిలీ అయినారు. మారుమనస్సుపొంది పెద్దగా నియమితుడై విలియంగారితో కలిసి హిందువులమధ్య సేవ చేసారు. గోగులమ్మ పేటలో వీరు సంఘాన్ని స్థాపించారు. మెరిపో వెంకన్నగారి అల్లుడు గెడ్డం పీటర్‌గారు 1912లో జన్మించి అత్తిలి, బాదంపూడి గ్రామాల్లో విద్యభ్యాసం పూర్తిచేసారు. 1972 వరకు ఆయా పాఠశాలల్లో టీచరుగా పనిచేస్తూ సంఘాల్లో సేవచేసారు.

గెడ్డం నల్లయ్యగారి కుమారులు జేమ్సుగారు బ్రయంట్‌గారి తోడ్పాటుతో విద్యాభ్యాసం,టీచరు ట్రెయినింగు ముగించి ఆయా గ్రామాల్లో టీచరుగా పనిచేసారు. ప్రత్తిపాడుకు చెందిన మెరిపో స్వామిగారి కుమార్తెను వివాహమాడారు. జగన్నాధపురం, కొండ్రుపోలు, నీలాద్రిపురం, ఉంగుటూరు ముక్కిరాలపాడు, నారాయణపురం మొదలైన గ్రామాల్లో ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ సంఘాలను నడిపించారు. కొంతకాలం ప్రత్తిపాడు సంఘ బాధ్యతను చేపట్టారు.

* * *

ఆలంపురం గ్రామంలో 1932లో పోసుపో పుల్లయ్య, పెనుమాక లక్ష్మీదేవి అనేవారు బ్రయంట్‌గారిద్వారా వాక్యం విని రక్షణపొంది ప్రత్తిపాడులో ఆరాధనకు హాజరవుతుండేవారు. వీరి తరువాత పెద్దోజు మృత్యుంజయాచార్యులు, కోరుమెల్లికి చెందిన ముప్పిడి లాజరుగార్లు రక్షణ పొందారు. ఆది క్రైస్తవులు, పోసుపో రుద్రయ్య, రామన్న, నేకూరి సుగుణ రావు తదితరులు మృత్యుంజయాచార్యులుగారింట్లో సమావేశమవుతుండే వారు. 1938లో విప్పర్తి లూకాగారు ఆలంపురంలో స్థిరపడ్డారు. ఈ కాలంలోనే చెట్టిపేట బైబిల్‌స్కూల్లో లూకాగారు రక్షణపొంది ఉద్యోగానికి రాజీనామాచేసి మృత్యుంజయాచార్యులుగారితో కలిసి డెల్టా ప్రాంతమంతా తిరిగి సేవచేసారు. 1955లో యేజర్ల ఇశ్రాయేలుగారు లూకాగారివల్ల రక్షించబడి లూకాగారు తేతలి వెళ్ళిపోయిన తరువాత మృత్యుంజయాచార్యులు గారితో కలిసి ఆలంపురం సంఘ క్షేమం కోసం ప్రయాస పడ్డారు. నేకూరి సుగుణరావుగారు ధనసహాయం చెయ్యగా సంఘస్థులు మరికొంత పోగుచేసుకొని మిస్ హెడ్స్‌గారుకూడా 500 రూపాయలు ఇవ్వగా మందిరం నిర్మాణం జరిగింది. ఈ యేజర్ల ఇశ్రాయేలు, పోసుపో రామన్న. కందవల్లి పౌలు, పోసుపో కృపానందంగార్లు సంఘాన్ని నడిపిస్తున్నారు. ఇశ్రాయేలుగారు 1973 నుంచి సంపూర్ణ సువార్త సేవకునిగా పనిచేస్తున్నారు.మృత్యుంజయా చార్యులుగారింట్లో కొందరు విశ్వాసులు సమావేశమై ఆరాధన జరిగించు కొంటున్నారు.

ఈ ప్రాంతానికేగాక గోదావరిడెల్టా ప్రాంతం, ఆంధ్రదేశమంతటి లోను ప్రఖ్యాతి చెందిన భక్తుడు, ప్రసంగికుడు విప్పర్తి లూకాగారు. వీరు వేల్పూరులో విప్పర్తి ప్రకాశం, సత్యవతమ్మగార్లకు జన్మించి వేల్పూరు, తాడేపల్లిగూడెం, తణుకు మొదలైన ప్రాంతాల్లో చదువుకుని టీచరు ట్రెయినింగు పూర్తిచేసారు. గుమ్మంపాడు, ప్రకాశరావుపాలెం, సరిగేడు గ్రామాల్లో టీచరుగా పనిచేసి చివరిగా రాచర్లలో పనిచేస్తూ ఉండగా ప్రభువునంగీకరించారు. తదుపరి జగన్నాధపురం, ముద్దాపురం, నవాబుపాలెం రాచర్ల, కృష్ణాయపాలెం, కోరుమెల్లి, కొండేపాడు, దువ్వ, ఆలంపురం గ్రామాల్లో సువార్త సేవచేస్తూ 1945లో సంపూర్ణసేవ చేపట్టారు. అప్పటినుండి బొంబాయి, కలకత్తా, మద్రాసు వరకు వీరు సువార్త బోధ

చేస్తూ వచ్చారు. 1936లో తక్కెళ్ళపాడు వాస్తవ్యురాలు అమృతమ్మగారిని వివాహమాడారు. లూకాగారు పరిశుద్ధాత్మ, పలకలలోని పాటలు అనే పుస్తకాలు రాసారు. ఈ ప్రాంతంలో క్రైస్తవ వేదాంత పండితుడిగా వాసికెక్కారు. అమృతమ్మగారు ఆలంపురంనుండి తేతలికి బదిలీ అయినందు వల్ల లూకాగారు తేతలిలో స్థిరపడి అక్కడ నిర్జీవ స్థితిలో ఉన్న సంఘాన్ని ఉజ్జీవింప జేసారు. లూకాగారు ప్రస్తుతం డెల్టా ప్రాంతమంతటిలో మహాసభల్లో ప్రసంగికునిగా, బైబిలు టీచరుగా యోగ్యమైన సేవ చేస్తున్నారు. చెట్టిపేటలోని బైబిలు స్కూలుకు వీరు గౌరవ ప్రిన్సిపాలుగాకూడా సహకరిస్తున్నారు.

బాదంపూడి సంఘాన్ని గెడ్డం పీటర్‌గారు చాలాకాలం నడిపించిన తరువాత ప్రస్తుతం భారం వహించి పనిచేస్తున్నవారిలో కొల్లి వెంకటరత్నం, దుద్దే సీతారామయ్య (సైమన్) వీరన్న, వెంకటరత్నంగార్లు ముఖ్యులు. వెంకటరత్నంగారు కొవ్వూరుకు చెందిన ఎర్ర వెంకయ్య, సత్యవతమ్మగార్లకు జన్మించారు. టీచర్ ట్రెయినింగు పాసై బాదంపూడిలో నివాసముంటూ రేలంగిస్కూల్లో, అటుతరువాత కొవ్వూరు, రామన్నపాలెం, కాగుపాడుల్లో పనిచేసి 1969 నుండి బాదంపూడిలో పనిచేస్తున్నారు. బాదంపూడి, పెంటపాడు, రాచర్ల, పెదతాడిపల్లి మొదలైన గ్రామాల్లో సేవచేసారు. వీరు గెడ్డం పీటర్‌గారి కుమార్తెను వివాహమాడారు. వీరి అధ్వర్యంలో క్రొత్తగా ప్రార్థన మందిరం నిర్మాణం జరిగింది. దుద్దే సీతారామయ్య (సైమన్)గార్లు బాదంపూడిలో దుద్దే గంగయ్య, పోలమ్మగార్లకు జన్మించారు 1934లో రక్షించబడి చాలాకాలం రైల్వేలో పనిచేస్తూ రిటైరైనారు. బాదంపూడి సంఘపెద్దగా ప్రస్తుతం సంఘాన్ని నడిపిస్తూ ఉన్నారు.

యర్రోజు సూర్యప్రకాశంగారు పశ్చిమగోదావరిజిల్లా, తాడేపల్లిగూడెం తాలూకా బాదంపూడి గ్రామ కాపురస్తులు. విశ్వబ్రాహ్మణ కుటుంబమునకు చెందినవారు. వీరి వృత్తి బంగారు పని. వీరు రాముణ్ణి, కృష్ణుణ్ణి పూజించేవారు. షేక్‌పీరాబీ అనే ముస్లిం స్త్రీ ప్రభువును స్వీకరించి తరువాత ఒకరోజు వీరికి సువార్త చెప్పింది. వీరు, తమ 45వ సం. లో బంగారు వ్యాపారములో చాలా నష్టపోయారు. అప్పుడు భార్య సత్యవతమ్మ అక్క రామాయమ్మ, వదిన రామశేషమ్మగార్లు ప్రార్థన చేసికొనమని చెప్పారు.

మరియు దేవుని వాక్యముచెప్పి ధైర్యపరిచిరి. అప్పుడు ప్రస్తుతానికి ఆ ఆపద తొలిగేవరకు నమ్మకొందామని అనుకొన్నారు. ప్రార్థన చేసికొని, వెళ్ళిన తరువాత షరాబులు కట్టవలసిన డబ్బు కట్టనక్కరలేదని చెప్పారు. వారి మనసులో ఈ మార్పువలన క్రీస్తునందు విశ్వాసము కలిగినది. గాని ధైర్యముగా బయలుపడుటకు ఇష పడలేదు. ఇట్లుండగా 1950 డిశంబరు నెలలో ప్రత్తిపాడు జి.డి.యం. చర్చిలో సభలు జరుగుచున్నవి. ఆ సభలకు ఇంటిదగ్గరవారు ప్రోత్సాహపరిచి పంపించినారు. అచట కాకినాడ, మెక్లారిన్ హైస్కూలు హెడ్‌మాష్టరుగారైన శ్రీ. జి.ఎ. సామ్యూల్‌గారు వాక్య పరిచర్యచేసారు. వాక్యము ఆయన హృదయములో పనిచేసి మారుమనసు పొంది, ప్రభువును రక్షకుడుగా అంగీకరించారు. గాని బాప్తిస్మము పొందలేదు. ఈ మార్పు బంధువులకు ఇష్టంలేక, వీరికి చాలా శ్రమలు కల్గించారు.

ఆ సమయంలో అల్లంపురంలోనున్న మృత్యుంజయాచార్యులుగారు, నిడదవోలు జి.డి.యం.చర్చి స్థాపకురాలు లక్ష్మీకాంతమ్మగారు తరుచుగా బాదంపూడివెళ్ళి వారిని హెచ్చరించి ధైర్యపరిచి దేవునిలో స్థిరముగా నిలిచేలా బలపరిచారు. ఆత్మీయంగా బలపడిన తరువాత బంధువులకు భయపడక ధైర్యముగా మృత్యుంజయాచార్యులగారివల్ల బాప్తిస్మము పొందారు. గెడ్డం పేతురుగారు వీరిని జి.డి.యం. సహవాసానికి నడిపించి ప్రభువులో స్థిరపరిచారు. క్రీస్తునందు తను పొందిన ఆదరణ ఆనందము ఇతరులకు చెప్పవలెననెడి ఆశతో ఒకపూట తన కులవృత్తి చేసికొని రెండవపూట సేవ చేయుచుండెడివారు. ఒకరోజు ప్రార్థనలో ప్రభువు ఈవిధముగా మాట్లాడి నారు. "అన్ని స్థలములలో సువార్త వినిపించుచున్నది. గాని జైలులో సువార్త వినిపించుటలేదు." ఈ మాటలు ఆయన హృదయములో పనిచేసి, ఆత్మ ప్రేరేపణతో నడిపింపబడి ప్రభుత్వంవారినుండి అనుమతిపొంది మొదటగా తాడేపల్లిగూడెం జైలులో సువార్త ప్రారంభించారు. తరువాత ఏలూరు కొవ్వూరు, తణుకు, భీమవరం, నరసాపురం, రాజమండ్రి, కాకినాడ, విజయవాడ హైదరాబాదు, గుంటూరు మొ. ఆంధ్రప్రదేశ్‌లోగల జైళ్ళలో ఆర్డరు పొంది ఆయా టైములు ప్రకారం, సువార్త ప్రకటించేవారు. వారికి అనారోగ్యము కలిగినప్పటికి ఈ సేవ ఆంధ్రప్రదేశమంతా తిరిగి, దేవుడు అప్పగించిన పని నమ్మకముగా జరిగించవలెనన్న కోరికతో చివరవరకు

నమ్మకముగా చేసిరి. కొన్నాళ్ళకు కాకినాడ జగన్నాధపురంలో కుమార్తె దగ్గర స్థిరపడ్డారు. 1978 సెప్టెంబరు 17వ తారీఖు వరకు సేవలో కొనసాగారు తరువాత అక్టోబరు 2వ తేదీని ప్రభువునందు నిద్రించారు.

ఏ. లూకా, మృత్యుంజయాచార్యులుగార్ల సువార్త పరిచర్యవల్ల మానుకొండ మందారియ్య, వీరి తల్లి, మానుకొండ నాగయ్యగారు, మరి కొందరు ప్రభువును విశ్వసించి బ్రయంట్‌గారిద్వారా బాప్తీస్మం పొందగా రాచర్లలో సంఘం ఏర్పడింది. ఫెయిర్ లూకా, మృత్యుంజయాచార్యులు గార్ల శ్రద్ధవల్ల సంఘం అభివృద్ధిచెంది మానుకొండ రాజారావు, కృపానందం, శాంతమ్మ, ఆశీర్వాదం, గ్రేసమ్మ, పెద బుల్లెమ్మ, అబ్బదాసరి వెంకన్న, ఉండ్రాజవరపు తాతయ్య, ఆంజనేయులుగార్లు ఇంకా మరికొందరు సంఘంలో చేరారు. షేక్ నబీన్ సాహెబు, అబ్బదాసరి వెంకన్నగార్లు సంఘాన్ని ప్రోత్సహించి సుమారు 22వేల రూపాయలతో పెద్ద ఆలయం కట్టడానికి పాటుబడ్డారు. కొంతకాలానికి మానుకొండ ఆశీర్వాదంగారి ప్రోద్బలంవల్ల కొందరు విశ్వాసులు వేరైపోయి పెంతెకొస్తు సంఘంగా సమావేశం కాసాగారు.

1925లో స్థాపించబడిన పెంటపాడు సంఘానికి ప్రస్తుతం గెద్దాడ ఈసాకుగారు పెద్దగా సంఘకాపరిగా ఉన్నారు. గాజుల వ్యాపారం చేసుకుంటూ ప్రాంతీయ కమిటీలో మెంబరుగాఉండి గ్రామాల్లో కూటాలు, దండయాత్రలు జరిపిస్తున్నారు.

బ్రయంట్ దంపతులు స్వదేశానికి వెళ్ళిపోయిన తరువాత జగన్నాధ పురం సంఘంలో కొన్ని కలతలు ఏర్పడినాయి. ఇలా ఉండగా సిర్రా ఇశ్రాయేలుగారు ఫెయిర్‌గారి సహకారంలో 1967లోఅందరికీ అనుకూలంగా ఒక మందిరం నిర్మాణం జరగడానికి పాటుపడ్డాడు. బ్రౌనుగారు ఈ ఆలయ ప్రతిష్ట గావించారు. ఇశ్రాయేలుగారు మరొండపాడులో గంగారపు వెంకయ్య, మాతయ్యగార్లకు జన్మించి జగన్నాధపురం వాస్తవ్యులు సిర్రా జీవరత్నంగారి పెంపకంలోకి వచ్చారు. ఇశ్రాయేలుగారు బ్రయంట్‌గా యాజమాన్యంలో వల్లూరిపల్లి, పెంటపాడు, నీలాద్రిపురం స్కూళ్ళలో టీచరుగా పనిచేసారు. అటుతరువాత టీచరు ట్రెయినింగు పొందేకాలంలో ఉమామహేశ్వరంలోఉంటూ విలియమ్సుగారితో కలిసి సేవ చేసారు.

1942లో చెట్టే బ్రహ్మయ్యగారివల్ల మారుమనస్సుపొంది అదేయేట జగన్నాథపురం స్కూలులో పని మొదలుపెట్టారు. 1971లో పదవీ విరమణచేసి సంఘ బాధ్యతను పూర్తిగా చేపట్టి ఉజ్జీవ కూటాలు, సండేస్కూలు, సంఘకార్యక్రమాల్లో ఆసక్తిగా పాల్గొంటున్నారు.

వాకపల్లి గ్రామానికి చెందిన సిరా నరసయ్య వీరమ్మగార్ల కుమారుడు ఆశీర్వాదంగారు. టీచరు ట్రెయినింగుపాసై 1943లో చాగల్లు జి.డి.యం. స్కూల్లో హెడ్మాస్టరుగా చేరారు. 1962లో అంతర్వేది దగ్గర సముద్రంలో మునిగి చనిపోయిన ఎనిమిదిమంది మిస్ టిల్స్లీ హాస్టలు యువతులలో వీరి పెద్ద కుమార్తె మిర్యాముకూడా ఉంది. ఆశీర్వాదంగారు 1962లో ఉద్యోగానికి రాజీనామాఇచ్చి సంపూర్ణ సువార్త సేవకునిగా పనిచేస్తున్నారు. కీర్తనలు పాడడంలో వీరు ప్రసిద్ధులు. అగ్రకులస్థులమధ్య బలమైన సేవను జరిగిస్తూ ఉండడమేకాక సంఘాలను దర్శిస్తూ, సభలలో ప్రసంగిస్తూ ఆదర్శప్రాయమైన సేవ చేస్తున్నారు.

వల్లూరిపల్లి (ముక్కిరాలపాడు) గ్రామ స్కూలులోను, సంఘం లోను దీర్ఘకాలం పనిచేసిన బాదంపూడి రామన్నగారు అదే గ్రామంలో బాదంపూడి వెంకయ్య, అచ్చమ్మగార్లకు జన్మించి బ్రయాంట్ సతీమణి బోర్డింగులో నరెళ్ళ యోసేపుగారి దగ్గర చదువుకున్నారు. 1933లో చెట్టె బ్రహ్మయ్యగారిద్వారా బాప్తిస్మం పొందారు. వల్లూరిపల్లిలో జి.డి.యం. స్కూలులో పనిచేస్తూ సంఘసేవకూడా నిర్వర్తించారు. దుద్దే మలాకీగారితో కలిసి సేవచేసారు. గోదావరి డెల్టా మిషన్ అసోసియేషన్ లో ఎగ్జిక్యూటివ్ మెంబరుగాను, ప్రత్తిపాడు ప్రాంతీయ కార్యదర్శిగాను ఉన్నారు. వీరి కుమార్తెను సిద్ధాంతం వాస్తవ్యులు డాక్టర్ మునియ్య గారికిచ్చి వివాహం చేసారు.

నవాబుపాలెం గ్రామంలో బ్రయంట్గారి వాక్యపరిచర్యవల్ల ఉండ్రాజవరపు సుబ్బన్నగారు ప్రభువులో విశ్వాసముంచారు. అటుపైన మరికొందరు విశ్వాసులు వచ్చి చేరగా సంఘం స్థాపించబడింది. ఈ గ్రామానికి చెందిన ఉండ్రాజవరపు వీరాస్వామిగారికి జాన్ మోషేగారు జన్మించారు. 1950లో వీరు మారుమనస్సుపొంది నాటినుంచి ప్రభువు

సేవలో ఉన్నారు. 1958నుండి నవాబుపాలెం సంఘంలో నమ్మకంగా వాక్యపరిచర్య చేస్తున్నారు. వీధి సువార్తల్లో, కూటాల్లో, బైబిలుక్లాసుల్లో సువార్తను బోధిస్తున్నారు. ఇంతేకాక జీవజలములు రేడియో కార్యక్రమం ద్వారా ఆంధ్రదేశమంతటికీ వీరిద్వారా సువార్త ప్రకటించబడుతున్నది. వీరు పరమ గీతము గ్రంథవ్యాఖ్యానం వ్రాసారు.

బ్రయంట్‌గారు ప్రత్తిపాడు ఫీల్డులోని సంఘాలన్నిటికీ ఆత్మీయ తండ్రి. ఈ యోగ్యతను క్రాఫర్డు టిల్‌స్లీగారుకూడా కొంతవరకు పంచుకున్నారు. ఈ ఫీల్డులోని విశ్వాసులు చాలామట్టుకు మిషనెరీలపై ఆధారపడక స్వంత ప్రయత్నాలతో దేవునిపై ఆధారపడి తమ సంఘాలను అభివృద్ధి చేసుకున్నారు. ఈ ఫీల్డుకు చెందిన క్రైస్తవ నాయకులు, వేదాంతులు, బైబిలు టీచర్లు, ప్రసంగికులను దేవుడు బహుబలంగా వాడుకుంటున్నాడు.

ఇంతవరకు ప్రస్తావించిన సంఘాలుకాక పెదతాడేపల్లి, క్రిష్ణయ్యపాలెం, కొమటిపాలెం, నారాయణపురం, దర్శిపర్రు, కొమ్మొగూడెం, చోడవరం, ఉంగుటూరు, దువ్వ మొదలైన గ్రామాల్లో సంఘాలు ఉన్నాయి.

# 27

# చాగల్లు ఫీల్డు

ఒక్కొక్క ఫీల్డు ప్రాంతాన్ని ఒక్కొక్క మిషనెరీ భారం వహించి సుదీర్ఘకాలం శ్రమించి తీర్చిదిద్దిన సంగతి మన గోదావరి డెల్టా ప్రాంతంలో కనిపిస్తూ ఉంటుంది. చెట్టిపేటకు టిల్స్లీగారు, వాడ్రేవుపల్లికి నైట్ హావున్‌గారు, కొయ్యలగూడెంకు బాస్లీగారు, ఈ విధంగా ప్రతి ఫీల్డు విశ్వాసులూ ముఖ్యంగా ఒక్కొక్క మిషనెరీ భక్తుని విషయం ప్రత్యేకించి దేవుణ్ణి స్తుతిస్తూ ఉంటారు. చాగల్లు ఫీల్డుకి ఈ స్థానాన్ని భర్తీచేసి చిరస్మరణీయుడుగా చాగల్లు ప్రాంతీయుల మనస్సుల్లో నిలిచిపోయిన వ్యక్తి ఇ.సి. ఆడమ్సుగారు.

చాగల్లు ప్రాంతంలో చెట్టిపేటనుండి దైవసేవకులువచ్చి సువార్త చెప్పగా బొల్లిపో మంగమ్మగారు, అటుతరువాత క్రైస్తవులైన వారందరి గురించి సవిస్తరంగా ఇంతకుముందే తెలుసుకున్నాము.

ఆడమ్సుగారు 1901లోను వీరి సతీమణి 1903లోను గోదావరి ప్రాంతానికి వచ్చి ముందు కొంతకాలం తాటిపాకలో ఉన్నారు. అటుతరువాత ధవిలేశ్వరంవెళ్ళి ఆ ప్రాంతాల్లో సేవ చేశారు. వడ్రంగం స్కూలును కొంతకాలం నడిపారు. ఆడమ్సుగారు 1911లో రాయబారి పత్రికను పునరుద్ధరించారు. 1920లో చాగల్లు వచ్చి స్థిరపడ్డారు. వీరికి ముందే మిస్ హైండ్సన్, మిస్ బ్రిడ్జర్‌గార్లు చాగల్లు ప్రాంతంలో మామిడి చెట్లక్రింద డేరాలు వేసుకుని సువార్త ప్రకటించేవారు. రెండెడ్ల బండిలో కాపురముంటూ దానిమీదనే తిరుగుతూ గజ్జరం, యాడవోలు, చాప్పరామన్న గూడెం, బోడిగూడెం తదితర గ్రామాల్లో సేవచేశారు.

ఆడమ్సుగారు వచ్చిన తరువాత కొందరు ఈ ప్రాంతపు ఆరంభ విశ్వాసులతో కలిసి పాపికొండల ప్రాంతాలకు సువార్త యాత్రలకు వెళ్లేవారు.

వీరు భార్య, కుమార్తెతో చాగల్లులో తాటాకుల ఇల్లు నిర్మించుకుని అందులో ఉండేవారు. చాగల్లులో ప్రార్థనాలయం ఎనిమిదిసార్లు ఎనిమిది స్థలాల్లో మార్చి కట్టారట. ఆడమ్సుగారు స్థానిక విశ్వాసులను అన్ని విషయాల్లో స్వయం సమృద్ధి సాధించవలసిందని ప్రోత్సహించేవారు. "దేశం మీది, ప్రజలు మీరు, సంఘం మీది, దీనికి సంబంధించిన అన్ని విషయాలూ మీరే చూసుకోవాలి" అంటూ ఉండేవారు.

మిస్ హ్యాండ్సన్ 1909 ఆస్ట్రేలియానుండి వచ్చి మిస్ బిడ్మర్‌తో కలిసి సువార్త సేవ చేస్తూ 1921లో కలరావల్ల చనిపోయింది. వీరిద్దరూకలిసి స్త్రీలు, అనాథ బాలుర నిమిత్తం ఎనలేని సేవ చేసారు. మిస్ బిడ్మర్ తన స్నేహితురాలి మరణం తరువాత చాగల్లులోఉంటూ వైద్యం, సువార్త సేవ నిర్వహించారు. ఇక్కడ ఒక బోర్డింగు స్థాపించాలని మిస్ బిడ్మర్ కలప, రాయి సమకూర్చి ఉంచారు. వీరి ఆరోగ్యం చెడినందున స్వదేశంవెళ్ళి తల్లికి పరిచర్యలు చెయ్యవలసి వచ్చినందునా, ఆ సామాగ్రి అంతటినీ వీరు ఆడమ్సుగారి పరంచేసి తన సేవను చాలించి 1928 స్వదేశంవెళ్ళిపోయారు.

ఇది ఇలా ఉండగా 1927లో ఆడమ్సుగారికి ప్రెస్‌కు సంబంధించిన ఒక మిషన్ కానుకగా అందింది. ఇది దైవచిత్తంగా భావించి, ఆడమ్సుగారు ఒక ప్రెస్‌ను కట్టించి కావలసిన సరంజామా అంతా కొని 'రాయబారి' మాసపత్రికను స్వయంగా ప్రింటుచేయడం మొదలుపెట్టాడు. అంతకు ముందే సైకిలు మీదనుండిపడి ఆడమ్సుగారి కాలు విరిగిందట. అందువల్ల చాగల్లులో స్థిరనివాసంఉంటూ ప్రెస్ పనిలో నిమగ్నమయ్యారు ఆడమ్సు గారు. ఆడమ్సుగారు తెలుగుభాషా కోవిదుడు. అస్తమానమూ ఏదో ఒక తెలుగు సామెత చెప్తూ ఉండేవాడట. ప్రెస్‌లో గళ్ళా గంగరాజు, మేరిపో వెంకన్న, బొల్లిపో తాతయ్య, మొదలైనవారు పనిచేసేవారు. ప్రెస్‌సేవ గురించి సంస్థలు అనే భాగంలో సవిస్తరంగా వ్రాసాము.

1949 వరకు ప్రెస్‌ను నడిపిస్తూ ప్రాంతీయ సంఘాల్లోనూ కులస్థుల మధ్యను ఆడమ్సుగారు పనిచేసారు. రోగులకు ఆడమ్సుగారు, వీరి సతీమణికూడా మందు లిచ్చేవారు. ఆడమ్సు సతి స్త్రీలకు కుట్టు పని నేర్పడం, స్త్రీల సమాజాలను నిర్వహించడం చేసేవారు. వీరికి ఇద్దరు

కుమారులు, ఒక కుమార్తె. పెద్ద కుమారులు ప్రస్తుతం జీవించే ఉన్నారు.

కుమార్తె మిస్ గ్రేస్ ఆడమ్సు తల్లిదండ్రులు తాటిపాకలో ఉండగా జన్మించి పన్నెండేళ్ళ ప్రాయంలో ఇంగ్లండువెళ్ళి విద్యనభ్యసించిరి. ఫార్మసిస్టుగా, బైబిలు బోధకురాలిగాకూడా శిక్షణపొంది 1931లో చాగల్లువచ్చి తన తల్లిదండ్రులతో చేరింది. చాగల్లు మిషన్ కాంపౌండులో 39 సంవత్సరాలు అమోఘమైన సేవ చేసింది. ఆడమ్సుగారు 1949లో ఇంగ్లండులో మృతిచెందారు. వీరి సతికూడా 1955 ఫిబ్రవరి 1వ తేదీన చాగల్లులోనే మరణించి మిషన్ కాంపౌండులో సమాధి చెయ్యబడింది. వీరి కుమార్తె తన 70వ యేట 1972 ఫిబ్రవరి నెలలో ఇంగ్లండులో చనిపోయింది.

న్యూజీలాండు దేశసు డైన కెవిన్ ఆస్‌బోర్న్ 1942లో ఇండియాకని బయలుదేరగా అవి రెండవ ప్రపంచయుద్ధకాలం అయినందువల్ల వీరు ప్రయాణంచేస్తున్న నౌకను ముంచివేసి వీరిని జపాన్‌కు యుద్ధ ఖైదీగా తీసుకువెళ్ళి 1945 అక్టోబరులో న్యూజీలాండు పంపేసారు. 1946లో నర్సాపురం చేరుకుని తెలుగు భాష నేర్చుకుని 1948లో ధవిలేశ్వరం వచ్చారు.

1949 మే 27 న వీరు మిస్ జీన్ ఫిట్జ్‌రాల్డ్‌ను వివాహమాడి దంపతులిద్దరూ చాగల్లులో కాపురంపెట్టి ఆడమ్సుగారు వదిలివెళ్ళిన బాధ్యతలను చేపట్టారు. ప్రెస్, గ్రామీణ స్కూళ్ళ అజమాయిషి, కొవ్వూరు మొదలైన పరిసర ప్రాంతాల సువార్తీకరణ తదితర విషయాలను చూసుకునే వారు. 1951లో కొయ్యలగూడెం ప్రాంతానికివెళ్ళి చాగల్లు ప్రెస్‌ను మాత్రం అక్కడినుండే నడిపిస్తూ ఉండేవారు. 1954లో క్రొత్త యంత్రాలు కొన్నివచ్చి చేరినాయి. ఆ యేడు 10,00,000 కరపత్రాలు ఈ ప్రెస్‌లో ముద్రితమైనాయి. 1962 నుండి మద్రాసు నగరంలో హిందూస్థాన్ బైబిలు ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేస్తూ 1965లో స్వదేశం వెళ్ళిపోయి వెల్లింగ్టన్‌లో స్కూలు టీచరుగా ఉన్నారు.

1913 ఫిబ్రవరి 27న మిస్ ఐవీ బర్నార్డ్ ఇంగ్లండులో జన్మించారు. 1947 నవంబరులో చాగల్లు చేరుకున్నారు. అప్పటికి

ఆడమ్సు దంపతులు, మిస్ గ్రేస్ ఆడమ్సు అక్కడ ఉన్నారు. మిస్ బర్నార్డ్ 1927లో పన్నాలుగవయేట ప్రభువు నంగీకరించారు. నర్సుగా పదేళ్ళు పనిచేస్తూ ప్రభువు పిలుపునందుకుని ఇండియాకి వచ్చారు. మిస్. ఆడమ్సుతో కలిసి వీరు చాగల్లు క్లినిక్‌ను నిర్వహించారు. ఆడమ్సుగారి మరణం తరువాత ప్రెస్‌లో కొంత భాగాన్ని డిస్పెన్సరీగా మార్చి వైద్యసేవ చేసారు. చాగల్లు ప్రార్థనామందిరం 1969లో తుఫానుకు పడిపోగా మిస్ బర్నార్డ్ పెద్ద ప్రార్థనా మందిరం కట్టించారు. చాగల్లు జి.డి.యం. కాంపౌండులో తూర్పువైపున బంగళాలో ఆసుపత్రి, పడమర వైపున ప్రెస్ ఉండేవి.1981 దాకా ఆస్పత్రిలో నిస్వార్థమైన సేవచేసి పని విరమించుకున్నారు. చాగల్లు ప్రాంతపు సంఘాలమధ్య నిలిచి పనిచేసి ఉన్నత స్థితికి తీసుకురావడానికి మిస్ బర్నార్డ్ ఎంతగానో ప్రయాసపడింది. ఆస్పత్రి సేవలో బచ్చు బుల్లమ్మ మెరిపో రత్నమ్మగార్లు వీరికి సహాయపడ్డారు.

ఆస్‌బోర్న్ దంపతులనుండి ప్రెస్ యాజమాన్యం మిస్ సిల్వియా రైట్‌గారికి సంక్రమించింది. వీరిది నర్సు వృత్తి. 1957 ఫిబ్రవరిలో న్యూజిలాండు నుండి వచ్చి కొయ్యలగూడెంలో ఆస్‌బోర్న్ దంపతులతో ఉంటూ తెలుగు నేర్చుకుని నర్సాపురం స్త్రీల ఆస్పత్రిలో పనిచేసారు. 1962లో స్వదేశం వెళ్ళి బైబిలు శిక్షణ పొంది తిరిగివచ్చి చాగల్లులో స్థిరపడ్డారు. చాగల్లు క్లినిక్‌కి వచ్చేవారి సంఖ్య విపరీతంగా పెరిగిపోవడంతో 'రోజుకి ఇంత మందినిమాత్రం చూస్తాం' అని ఒక పరిమితి నియమించవలసి వచ్చింది. వచ్చినవారంతా సువార్త వినేవారు. స్థానిక స్త్రీలు స్వంతంగా ఏడాదికోసారి బైబిలు తరగతులు నడిపించేవారు. వారికి బోధించడం, వాక్యం చదివించడం మొదలైన బాధ్యతలను మిస్ రైట్ ఆనందంగా నెత్తిన వేసుకున్నారు. 1965లో ప్రెస్ యాజమాన్యం వీరి చేతికి వచ్చింది. ఆయేడే ప్రెస్‌కు ఎలక్ట్రిసిటీ పెట్టించడం, ఒకప్రక్క క్లినిక్ నడిపించడం క్రొత్త కరపత్రాలను రాయించడం మొదలైన పనులను చేపట్టిందీమె. ప్రెస్ చాగల్లునుండి నర్సాపురంకు తరలించబడిన తరువాత చాగల్లులోనే ఉంటూ మిస్ రైట్ పరిసర గ్రామాలను దర్శించడానికి ఆసక్తి చూపించింది. ఆటుపైన వీరు అంబాజీపేటకు వెళ్ళిపోయారు. మిస్‌రైట్ తరువాత డేవిడ్

డౌనుగార కొంతకాలం ప్రెస్‌ను నిర్వహించి 1969లో దీన్ని నర్సాపు రం తరలించడంలో పాత్రవహించారు.

* * *

ఆడమ్సుగారు మిషన్ బంగళా కట్టించేటప్పుడు తాడి ముత్తన్నగారు బండిమీదరాయి తోలుకువస్తూ ఉండేవారు. ఆడమ్సుగారు వీరికి వాక్యం చెప్పగా మారుమనస్సుపొంది తోటి కులస్థుల భయంవల్ల ఎనిమిదేళ్ళు బాప్తిస్మం పొందలేదు. వీరితోబాటు నిమ్మగడ్డ వెంకన్న, భార్య చంద్రమ్మ, ముత్తయ్యగారి భార్య నారాయణమ్మగార్లు ప్రభువును నమ్ముకున్నారు. కొన్నాళ్ళకి పెద బుచ్చియ్యగారిచే ముత్తయ్యగారు బాప్తిస్మం తీసుకున్నారు. కొప్పర్రు గ్రామానికి చెందిన కస్తూరి సాంబమూర్తిగారు ఈ సంఘంలో వాక్యం విని రక్షించబడ్డారు. భార్య చనిపోగా ఇద్దరు బిడ్డలను వెంటబెట్టు కుని చాగల్లువచ్చి ఏడేళ్ళు కాపురముండి నర్సాపురం తిరిగి వెళ్ళారు. వేగేశ్న భగవాన్‌రాజుగారు కొంతకాలం ప్రెస్‌లో పనిచేస్తూ చాగల్లులో ఉన్నారు.

ఊనగట్ల గ్రామానికి చెందిన మెరిపో వెంకయ్యగారు సంఘకాపరిగా ఉండేవారు. బొర్లిపో బుచ్చియ్యగారు, బొర్లిపో సుబ్బన్నగారు సంఘకార్య క్రమాలను నడిపించేవారు. మెరిపో అబ్రహాముగారు ఆడమ్సుగారిదగ్గర బట్లరుగా పనిచేసేవారు. వీరి కుమార్తెను కొడమంచిలి సత్తెమ్మగారి కుమారుడు కృపానందంగార్కి ఇచ్చి పెళ్ళి చేసారు.

గొల్లపల్లి నథానియేలు, వాసా యోహాను తదితర భక్తులు తరుచు వచ్చి సత్తెమ్మగారింట్లోఉంటూ సంఘంలో వాక్య పరిచర్య చేస్తుండేవారు. గౌరీపట్నంలో డేరావేసి పరిసర గ్రామాల్లో సువార్త చెప్పేవారు.

కొంతకాలం తరువాత చాగల్లు సంఘాన్ని ముసునూరి సూర్య నారాయణగారు నడిపించారు. వీరు చిక్కాల గ్రామానికి చెందిన కంసాలి కులస్థుడు. ప్రభువును నమ్ముకున్నందున గ్రామంనుండి వెలివేస్తే చాగల్లు వచ్చి స్థిరపడ్డారు. ఇతను అగ్రకులస్తుడు. కాబట్టి ఆడమ్సుగారు ఈయన్ని చేరదీసారు. పరిసర సంఘాలలో చాల సేవచేసారు. ఆరంభంలో జీవజలముల రేడియో కార్యక్రమాల్లో ప్రసంగించేవారు. స్థానిక సంఘపెద్దగా వీరిని అందరూ గౌరవించేవారు. ఫేర్ దొరగారివద్ద కారుకొని లూకా, అగ్గిప్ప, పాల్‌రెడ్డిగార్ల సహాయంతో ఆంధ్రాలో సువార్తయాత్రలు చేశారు.ఇంతగొప్ప

సేకరించు వాగల్లు ఆలయ పునర్నిర్మాణ కార్యక్రమం చేపట్టి, వసూలైన 26వేల రూపాయలు సొంతం చేసుకొని సంఘానికి దూరమయ్యారు.

వాగల్లులో మిస్ హైండ్‌మన్, మిస్ బ్రిడ్జర్‌లు ఉంటున్న రోజుల్లో గారిపట్నంనుండి 8 మంది పేద, అనాథ పిల్లలను తెచ్చి సత్తెమ్మగారి సంరక్షణలో వారినుంచి వీరే ఆ పిల్లల పోషణ బాధ్యతను వహించారు. వీరు గళ్ళా సంగరాజు, డేవిడ్, చంద్రమ్మ, సుందరమ్మ, మహాలక్ష్మి, బుల్లియ్య, రామన్న, చంద్రమ్మ ఇంకా తోగుమ్మి, పల్లంట గ్రామాలనుండి కూడా ఇద్దరు పిల్లల్ని తెచ్చారు. మిస్ బ్రిడ్జర్ అనుమతితో వీరిలో మహాలక్ష్మిని బొల్లిపో సుబ్బన్నగారికిచ్చి ఆడమ్స్‌గారు వివాహం చేసారు.

బచ్చు రామన్న ధవిలేశ్వరంకు చెందిన ఉల్లంపర్తి భీమన్న, మెరిపో అబ్రహాంగార్లు ఆడమ్స్‌గారి ఇంట్లో సహాయం చేసేవారు.

ఇంతక్రితం పేజీల్లో ఈ ప్రాంతపు ప్రముఖుల జీవిత చరిత్రలు కొన్ని చూసాము. మరికొందరి జీవిత విశేషాలు ఇవి.

సిద్దెల బుల్లియ్యగారు అన్య కుటుంబంలో పుట్టి కొన్నాళ్ళకు వాగల్లులో ప్రభువును తెలుసుకున్నారు. 1934లో ఆడమ్స్‌గారు వీరిని పెదవాడపల్లికి సేవనిమిత్తం పంపారు. ఆ సంఘానికి బుల్లియ్యగారు పెద్దగాను, కాపరిగాను పనిచేసారు. వీరికి ముందు ఇక్కడ పోసుపో ఎలిషా, చదలవాడ లూకాగార్లు సేవచేశారు. బుల్లియ్యగారు పెదవాడపల్లిలోనే మృతిచెందారు. గళ్ళా వంశంవారు ఆదిలో ఈ గ్రామవాస్తవ్యులే. గళ్ళా సోదరులు అందరూ గణనీయమైన సేవచేశారు. గళ్ళా సమూయేలుగారు పేరవలి, పాలకొల్లులోనూ, గళ్ళా యోసేపుగారు వాడపల్లిలోనూ, గళ్ళా యాకోబుగారు జి.ఉ.యం. సంఘంల్లో కోల్పోర్టరుగాను, గళ్ళా చంద్రయ్య గారు దివాన్ చెరువు సంఘకాపరిగాను సేవచేశారు. గళ్ళా జోయల్‌రాజుగారు వీరి కుమారులే. ఈ గ్రామంలో 1924 మార్చి 24న లక్కవరపు జన్నయ్యగారు జన్మించారు. సండేస్కూలు సేవద్వారా వీరు ప్రభువును అంగీకరించి, విగ్రహారాధనమాని, విశ్వాసంలోకి వచ్చారు. ఆ దినాల్లో ఆ గ్రామంలో గళ్ళా రత్తమ్మగారి కుమార్తె కిత్తపల్లి హెలీనమ్మగారు సండేస్కూలు టీచరు. వడ్రంగపు వృత్తి చేసుకుంటూ సంఘాన్ని నడిపించారు.

1967 నుండి సంపూర్ణ సేవకు వచ్చి చాగల్లు ఫీల్డు కౌన్సిలు జాయింటు సెక్రటరీగా పనిచేసి ఈ ప్రాంతపు సంఘాల్లో తిరిగి సేవచేస్తున్నారు. సుమారు 1924లో ఆడమ్సుగారు ఈ గ్రామంలో ఒక పాటశాల స్థాపించారు. ఆ స్కూల్లో వైటన్‌గారు, లూకాగార్లు ఉపాధ్యాయులుగా పనిచేశారు. తర్వాత కొన్నేళ్ళకు ఈ పాటశాల మూతపడింది. 1952లో పెదవాడపల్లిలో సహో. ఆజ్‌బోర్న్‌గారు ఒక మిషన్‌స్కూలు స్థాపించారు. ఆ స్కూలులో టీచరుగా యిప్పుడు మద్దూరు సంఘకాపరిగా సేవచేస్తున్న ఉండ్రాజవరపు వీరన్నగారు పనిచేశారు. చెటి పేట దగ్గరున్న వరిగేడు గ్రామ వాస్తవ్యుడు. అన్యుడైనప్పటికి సండేస్కూలులో వాక్యం నేర్చుకుని ప్రభువును విశ్వసించారు. వీరు ఈ ప్రాంతపు ఫీల్డు కౌన్సిలు కార్యదర్శిగా వున్నారు. పరిసర గ్రామాల్లో సేవ చేస్తున్నారు. మద్దూరు సంఘానికి పూర్వం నూతంగి దానియేలుగారు సంఘకాపరిగా వుండేవారు. ఆయన చాగల్లు నుండి వెళ్ళి అక్కడ సేవ ఆరంభించారు. ప్రస్తుతం సహో. వీరన్నగారి సేవలో సంఘం సంఖ్యలోనూ, ఆధ్యాత్మికంగానూ అభివృద్ధి చెందుతున్నది.

గోపాలపురం గ్రామంలో లూథరన్ సంఘం ఉంది. కనుమూరి సంసోను, వీరి సహోదరులు సమూయేలుగార్ల వాక్య పరిచర్యవల్ల 1957లో కొందరు యువకులను రక్షణానుభవంలోకి నడిపించారు. చాగల్లులో ఆ కాలంలో ఉంటున్న ఆస్‌బోర్న్‌గారు ఈ విశ్వాసులను దర్శిస్తూ హెచ్చరిస్తూ ఉండేవారు. 1958లో ఇక్కడ జి.డి.యం. సంఘస్థాపన జరిగింది. మొయ్యేటి బుల్లబ్బాయిగారింట్లోనే ప్రార్థన జరిగేది. తిగిపెరిల్లి పౌలు, సామ్యేలుగార్లు భారం వహించి పనిచేసేవారు. పౌలుగారు 1959లో చాగల్లు చక్కెర ఫ్యాక్టరీలో పనిచేస్తూ మీనా నగరం సంఘం స్థాపించారు. అంతేకాక గోపాలపురం ప్రాంతంలో తొక్కిరెడ్డిగూడెం, వాదాలకుంట, పెద్దాపురం మొదలైనచోట్ల వీరు సంఘాల క్షేమానికి పాటు పడుతున్నారు. గోపాలపురం సంఘానికి ఊనగట్లనుండి కృపానందంగారు, రాజారావుగారు, తేతలినుండి లూకాగారు వచ్చి వాక్యపరిచర్యచేస్తూ ఉంటారు.

తిగిరిపెల్లి పౌలుగారి మూలంగా సంఘం అభివృద్ధియైన మీనా నగరం గ్రామంలో మొదట చాగల్లునుండి కొడమంచిలి సత్తెమ్మ, బొల్లిపో బుచ్చయ్య, పుల్మానమ్మ, ఆడమ్సుగార్లు వచ్చి వాక్యం

ప్రకటించారు. ప్రారంభంలో బుంగా పైళ్ళమ్మ, కొక్కిరిపాటి చిన అబ్బాయి బుంగా సూరయ్యగార్లు రక్షణపొందారు. ప్రస్తుతం ఇక్కడ కొక్కిరిపాటి సుబ్బారావు, వీర్రాజు, చిన్నబ్బాయిగార్లు సంఘపెద్దలుగా ఉన్నారు.

కొయ్యా తాతారావుగారు 1930లో ధర్మవరం గ్రామంలో ఒక అన్యకుటుంబంలో జన్మించారు. 1953 లో అగ్రిప్పగారిద్వారా రక్షించబడి 1955లో నిమ్మగడ్డ వెంకన్నగారిద్వారా బాప్తిస్మం పొందారు. ధర్మవరం సంఘానికి చాగల్లునుండి ప్రతి ఆదివారం ఒకరువచ్చి వాక్యం బోధించేవారు. ఈ సంఘపు ఆరంభ విశ్వాసులు పాతగోలుసు మునియ్య, పాలువూటి వెంకన్న పాలువర్తి రామయ్య, పార్వతమ్మ దాకే సుబ్బమ్మ, పడ్డి ముత్తమ్మ, ఆరుగోలను నర్సమ్మ తదితరులు. వీరంతా తాతారావుగారి సేవవల్ల క్రైస్తవులైనారు. మొదట్లో కొంతకాలం మలకపల్లికి, చాగల్లుకూ ఆరాధనకై వెళ్లేవారు. 1957 నుంచి ధర్మవరంలోనే కృపమ్మగారింట్లో ఆరాధనలు జరగసాగాయి. 1959లో చిన్న ప్రార్థనశాల నిర్మించారు. క్రమంగా సంఘం పెరిగి 1974లో మిస్ బర్నార్డ్ సహాయంతో ఆలయనిర్మాణము జరిగింది. తాతారావుగారు 1965లో సంపూర్ణంగా సేవకు సమర్పించుకొని పరిసర గ్రామాల్లో కోయ ప్రాంతాల్లోకూడా తిరుగుతూ సేవను జరిగిస్తున్నారు. 1977లో వీరు పంగిడిలో సంఘాన్ని స్థాపించారు.

బొల్లిపో మంగమ్మ, కొడమంచిలి సత్తెమ్మగార్ల వాక్యపరిచర్యవల్లను, తదుపరి ఆడమ్సుగారిచే పంపబడ్డ మెరిపో వెంకయ్యగారి కృషిఫలితంగాను మలకపల్లి గ్రామంలో బొల్లిపో గంగమ్మ, కోడి రామమ్మ అనేవారు ప్రభువు నంగీకరించారు. కొడమంచిలి భిక్షంగారు ఈ గ్రామంలో స్థిరపడి దర్జీవృత్తి చేసుకుంటూ బొల్లిపో వెంకన్నగారితో కలిసి పట్టిసీమ ప్రాంతపు సువార్త యాత్రల్లో పాల్గొనేవాడు. మలకపల్లి సంఘకాపరిగా ఉంటూన్న ముప్పిడి రాజారావుగారి కుమార్తెను భిక్షంగారి కుమారుడు జార్జిగారు వివాహమాడారు 1940లో ఆబ్‌బోర్న్‌గారి కృషివల్ల ఆ గ్రామంలో కుంటముక్కల సూరన్న గారి స్థలంలో 3 సెంట్లు ఆలయ నిర్మాణం కొరకు ఉచితంగా కేటాయించబడింది. ఇక్కడ ఆలయ నిర్మాణం జరిగింది.

జొన్నలగడ్డ శేషమ్మగారు జగన్నాథపురంలో జన్మించి మలకపలి వాస్తవ్యులు జొన్నలగడ్డ సోమరాజుగారిని వివాహమాడారు. వీరు కమ్మవారు.

మొదట లూథరన్‌వారిద్వారా రక్షణ వెలుగులోకి నడిపించబడి 1968లో మునచడం బాప్తిస్మం పొంది స్వంత ఖర్చుతో 8000 రూపాయల వ్యయంతో ఆ గ్రామం కొత్తపేటలో మరొక జి.డి.యం ఆలయం నిర్మించి ఆరాధన, ప్రార్థన కూటాలు, స్త్రీల సహవాస కూటాలు మొదలైన కార్యక్రమాల్లో సహాయం చేస్తున్నారు. వీరిని రక్షణ వెలుగులోకి నడిపించినది ముప్పిడి రాజారావుగారు. కొంతకాలం శేషమ్మగారింట్లోనే సంఘ సమావేశాలు జరిగేవి.

ఊనగట్ల గ్రామంలో కడియాలమ్మ, మర్లపూడి సుబ్బయ్య దంపతులు కాపురం ఉండగా కడియాలమ్మ అంతకుముందే క్రీస్తును ఎరిగినదైనందువల్ల ముప్పిడి బులివెంకమ్మ, మెరుపో వెంకమ్మగార్లు ప్రభువునంగీకరించారు. కడియాలమ్మగారి అల్లుడు గళ్ళా దావీదుగారు ఈ గ్రామంలో సువార్త ప్రకటించగా ముప్పిడి చినవెంకన్న అనే ఆయన రక్షణ పొందాడు. వీరి ప్రోత్సాహంవల్ల తాటాకుల చావడి నిర్మించుకుని విశ్వాసులు ప్రార్థన సమావేశాలు జరుపుకుంటూ వచ్చారు. వెంకన్నగారు చాగల్లు వాస్తవ్యులైన బొల్లిపో బుచ్చియ్యగారి కుమార్తె పెద్ద బుల్లెమ్మను వివాహమాడారు. 1963లో అగ్ని ప్రమాదంవల్ల ఆలయం కాలిపోగా సంఘకాపరి మెరిపో చినవెంకన్నగారి కృషివల్ల విరాళాలు పోగై ఇటుక గోడలతో పెంకుల పైకప్పుతో మంచి ఆలయం నిర్మించబడింది. ఈ గ్రామంలోనే దేవుడు యిద్దరు సేవకుల్ని సంఘాల్లో వాక్యపరిచర్య కొరకు లేపాడు. నూతంగి కృపానందం,తిగిరిపెల్లి రాజారావుగార్లు. వాక్యం చెప్పడంలో దేవుడు వీరికి ప్రత్యేకమైన కృపావరం యిచ్చాడు.

గజ్జరం సంఘ బాధ్యతను వహిస్తూ సూరయ్యపేట, గోపవరం' హుకుంపేట గ్రామాల్లోకూడా సేవ చేస్తున్న కంకటి పాలుగారు చొప్ప రామన్నగూడెంలో ఒక అన్య కుటుంబంలో జన్మించారు. సండేస్కూలులో దైవవాక్యం విని బొల్లిపో వీరన్నగారివల్ల ప్రభువును అంగీకరించాడు. వాక్యం చదవడం, కీర్తనలు పాడడం, సేవచెయ్యడంలో వీరి ఆసక్తినిబట్టి వీరన్నగారు వీరిని గజ్జరం సంఘబాధ్యత వహించవలసిందిగా కోరి ఇక్కడికి పంపించారు. వీరికి ఆరాధనలు జరుపుకోడానికి మంచి ఆలయం అవసరంగా వుంది. ప్రస్తుతం వోయింటి పంచన ఆరాధనలు జరుగుతున్నాయి.

అడివి చిక్కాల దుద్దుకూరు, గౌరీపట్నం తదితర గ్రామాల్లో సంఘ స్థాపన గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం. దుద్దుకూరులో, ప్రస్తుతమున్న సంఘపెద్దలు పెదముత్తి యోహాను, గాలింకి దానియేలు, స్కిరా పౌలు మొదలైనవారు. గాలింకి వెంకమ్మ, పెదముత్తి సుందరమ్మ రత్నమ్మ, హెలీనమ్మ, కాంతమ్మ, గాలింకి చిలకమ్మ, రాపాక గంగమ్మ దొండపాటి మంగమ్మ మొదలైన స్త్రీలు విశ్వాసులుగా ఉన్నారు.

గళ్ళా గంగరాజు, దావీదుగార్లు సోదరులు. గౌరీపట్నంకు చెందిన గళ్ళా రాజయ్య, గంగమ్మగార్లకు జన్మించారు. గంగరాజుగారిని మిస్ హైండ్ మన్, మిస్ బ్రిడ్జర్‌లు చాగల్లు తీసుకువచ్చి పెంచారు. దావీదుగారిని ఆడమ్సుగారు చదివించి కొంతకాలం తనకు డ్రైవరుగా నియమించారు. గంగరాజుగారు ప్రెస్‌లో పనిచేశారు. వీరు యుటీవలే కాలంచేశారు. వీరు చాగల్లు సంఘాల్లోకూడా చాల సేవచేశారు.

గౌరీపట్నం సంఘంలో కొడవటి సంపతిగారు జీవితాంతం నమ్మకంగా సేవ చేసారు. ఉండ్రాజవరపు రాములుగారు ఎస్. ఆనందంగారిద్వారా రక్షించబడి దొమ్మేరులో కాపురముంటూ సంఘ కాపరిగా దొమ్మేరు సంఘాన్ని నడిపించారు కొంతకాలం చిగురుపల్లి బెంజమిన్‌గారింట్లో ప్రార్థన సమావేశాలు జరిగేవి. 1973లో చిన్న ప్రార్థన మందిర నిర్మాణం జరిగింది. సంఘకార్యక్రమాలు రాములుగారిద్వారా జరిపించబడుతున్నాయి.

కలవలపల్లి గ్రామంలో 1925లో చాగల్లునుండి ఆడమ్సుగారు మరికొంతమంది సువార్తికులువచ్చి వాక్యాన్ని అందించగా చాపల కాంతమ్మ, పసుపూడి పెదవీరయ్య, చాపల కొవ్వూరియ్య, చాపల శేషయ్య అనేవారు రక్షించబడ్డారు. మరికొంతకాలానికి పసలపూడి చినవీరయ్య, నేకూరి మహాలక్ష్మి తదితరులుకూడా రక్షణ వెలుగులోకి వచ్చారు. టి. రక్షణానందం గారు కాపరిగాఉండి నడిపిస్తున్న ఈ సంఘానికి ఆలయం ఇంకా నిర్మించ బడలేదు.

దేవెర్ల గ్రామానికి చెందిన వల్లూరి గంగరాజుగారు 1962లో మునుమూరి సూర్య నారాయణగారిద్వారా రక్షణ పొందారు. ఈ గ్రామంలో సూర్యనారాయణ, బచ్చు రామన్న, మిస్ ఆడమ్సు, రోజామణిగార్లు

వాక్యపరిచర్య చేయగా చిన్న సంఘం ఏర్పడింది. గంగరాజాగారే ఈ సంఘాన్ని నడిపిస్తున్నారు.

ఇటుకలకుంట గ్రామం కన్నాపురం సమీపంలోఉంది. 1977లో నర్సాపురం మిషన్ హైస్కూలు టీచర్ల సహకారంతో బొబ్బిలి లాజరస్‌గారు ఈ గ్రామానికివెళ్ళి సేవ ప్రారంభించారు. 1978లో కోయదొర చీమల రాముడు అనే అతను ప్రభువును నమ్మి సి. మలాకీగారివల్ల బాప్తిస్మం పొందాడు. ఇక్కడున్న చిన్న సంఘాన్ని లాజరస్‌గారు నడిపిస్తున్నారు.

పంగిడిలో కె. తాతారావుగారి సేవవల్ల 1977లో కొందరు బాప్తిస్మం పొందడంవల్ల సంఘం ఏర్పడింది.

పులిరామన్న గూడెంలో 1955నుండి 1970 వరకు పట్నం డేవిడ్‌గారు నిలకడగా సేవచేసారు. నర్సాపురం మిషన్‌హైస్కూలు టీచర్లు వీరికి ఆర్థిక సహాయం చేసేవారు. 1970లో మడికి వెంకన్నగారు వీరిస్థానే ఈ గ్రామానికి వెళ్ళారు. ప్రథమంగా సూత్రుం చినరెడ్డి, కొపెల్ల గ్రామస్థుడైన చొడుం బుచ్చియ్య, ఆయన భార్య, సూత్రుం గంగరెడి సుబ్బిరెడ్డి, వోగురెడి , పండమ్మ లక్ష్మమ్మ అనేవారు రక్షించబడి బాప్తిస్మం పుచ్చుకున్నారు.

ఆడమ్స్‌గారు, బ్రామ్లీగారు, అజ్‌బోర్న్‌గారు ఆదిలో ఆరంభించిన ఏజన్సీ సేవను చాగల్లు ప్రాంతీయ సేవకులు విడవకుండా చేస్తూనేవున్నారు. ఇటీవల వీరి సేవమూలంగా సింగనపల్లి గడ్డపల్లిలో బుల్లమ్మ, గంగమ్మ— అనే కోయ సోదరీలు రక్షణపొంది, బాప్తిస్మంపొంది ప్రభువుసేవ జరిగిస్తూ వున్నారు. బచ్చురామన్నగారు, బొల్లిపో తాతయ్య, వి. వీరన్నగారు, ఎల్. జన్నయ్యగార్లు 40 గ్రామాలు తిరిగి ఈ సేవను క్రమంగా జరిగిస్తూ వున్నారు.

# 28

# కొయ్యలగూడెం ఫీల్డు

ఆరంభంలో ఎ.జి. ఫెయిర్,బర్ట్సుగార్లు కోయప్రాంతాలన్నీ స్థానిక సువార్తికులసహాయంతో తిరుగుతూ వాక్యం ప్రకటిస్తూ ఉండేవారు. కోయలగూడెం బంగళాలో ఫెయిర్‌గారు నివాసమున్న రోజుల్లో గెద్దాడ సలాతియేలుగారు వీరిదగ్గర పనిచేసేవారు. ఆటుతరువాత ఫెయిర్‌గారు ప్రత్తిపాడు ప్రాంతానికి వెళ్ళిపోయారు. బర్ట్సుగారు నర్సాపురం వెళ్ళిపోయారు. ఫెయిర్‌గారి తరువాత బర్ట్సుగారుకూడా ఈ ప్రాంతాలు పర్యటించి కోయలగూడెం చుట్టుప్రక్కల కోయగ్రామాలను దర్శించారు.

బ్రాష్లీగారు బ్రతికిఉన్న రోజుల్లోనే కెవిన్ ఆస్‌బోర్న్‌గారికి ఉత్తరం రాసి ఇండియాకు సేవ నిమిత్తమై రమ్మని ప్రేరేపించారట. చివరికి ఆస్‌బోర్న్‌గారు నర్సాపురం, ధవళేశ్వరం, చాగల్లులో కొంతకాలముండి 1951లో కొయ్యలగూడెంలో స్థిరపడ్డారు. బ్రాష్లీగారు వాడిన సైకిల్‌ను బ్రాష్లీ సతి వీరికి ఇచ్చారట. ఆటుతరువాత దీన్ని గొల్లపల్లి యాకోబు, బొల్లిపో తాతయ్యగార్లు సువార్తసేవకోసం వాడుకున్నారు. 1956 వరకు ఆస్‌బోర్న్‌గారు కొయ్యలగూడెంలోనే ఉంటూ తన కారుపైవెళ్ళి చాగల్లు పెప్ బాధ్యతను నిర్వర్తిస్తూ కొండజాతులవారిమధ్య సువార్త కేంపులు చేస్తూ సేవచేసారు. యాదవోలు ఆలయం స్థలం సేకరణలోను, గవరవరంలో చిన్న ప్రార్థనాశాలను నిర్మించడంలోను తోడ్పడ్డాడు. మిస్ సిల్వియా రైట్ 1957లో కొయ్యలగూడెంవెళ్ళి వీరితోఉంటూ వైద్యసేవలో సహాయపడింది.

ఆస్‌బోర్న్‌గారు వెళ్ళిపోయిన తరువాత మిస్ రాజర్స్ 1958లో కొయ్యలగూడెం వచ్చారు. మిస్ వెయిట్‌కూడా ఇదే సమయంలో ఇక్కడ

ఉండి తెలుగు నేర్చుకున్నారు. మిస్ రాజర్స్ గ్రామీణ సంఘపెద్దల భార్యలు తదితర స్త్రీలకు స్వల్పకాలిక బైబిలు తరగతులను నిర్వహించేవారు. 1963 లో వీరు నర్సాపురం వెళ్ళిపోయారు.

మిస్ పాట్రిషియా హెడ్సుగారు న్యూజిలాండునుండి 1951లో వచ్చి మిస్ బ్లాక్, మిస్ హేమ్టన్ గార్లతో కలిసి లెప్రసీ ఆస్పత్రిలో పనిచేసారు. 1954కల్లా మిస్ హేమ్టన్‌తో కలిసి 7 గ్రామీణ కేంద్రాల్లో వైద్య కేంద్రాలు స్థాపించారు. తణుకు ప్రాంతంలోకూడా కొంతకాలముండి 1963లో కొయ్యలగూడెంవచ్చి క్లినిక్ స్థాపించారు. ఈ సమయంలో వీరికి మేజర్ ఆపరేషన్ జరిగినందువల్ల అంత చురుకుగా సేవలో పాల్గొనలేక పోయారు. 1965లో అడవిజాతుల స్త్రీలకోసం ఒక కాంపు వీరి ఆధ్వర్యంలో జరిగింది. వైద్యసేవేగాక సండేస్కూళ్లు, స్త్రీల సమాజం తదితర వ్యవహారాలు వీరు నిర్వరిస్తూ ఉండేవారు. 1970లో వీరు ప్రత్తిపాడు ప్రాంతానికి వెళ్ళిపోయారు. 1966 నుండి మిస్ హేమ్టన్, మిస్ హెడ్స్, మిస్ టేలర్‌గార్లు లెప్రసీ వైద్యకేంద్రాలను నిర్వహిస్తూ పర్యటించారు.

1933–54 మధ్యకాలంలో కామవరపుకోట కేంద్రస్థానంగా రెడిసీమలో సేవచేసిన మిస్ వాకర్ నర్సాపురంలో తెలుగు నేర్చుకుంటూ పింజర్ల ఆనందరాజుగారి ఇంట్లో అద్దెకుండేవారు. కామవరపుకోటలో స్థిరపడి, స్థానికులతో, సన్నిహితంగా మెలిగేవారు. అయితే తోటి మిషనెరీలు ఈ పద్ధతినిపూర్తిగా వ్యతిరేకించేవారు. 1954లో మిస్ వాకర్ నూతిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నారు. వీరి మరణం యిప్పటికీ అంతుబట్టని రహస్యంగానే మిగిలిపోయింది.

ప్రాంతీయ సంఘాలు ప్రముఖుల విషయానికి వద్దాము. వాసా యోహానుగారి జ్ఞాపకార్థం ఆజ్‌బోర్న్‌గారు నిర్మించిన ఆలయం పాతబడి పోయి పాడైపోయింది. ఈ ప్రాంతపు ప్రజలు ఆర్థిక స్తోమతులేని వారైనందువల్ల ఈ సంఘ ఆలయనిర్మాణం విషయం కొంత వెనకబడింది. రాయ్, జర్మన్‌గారు ఆలయనిర్మాణానికి ఆర్థిక సహాయం చేస్తానన్న వాగ్దానాన్ని బట్టి ఈ గ్రామానికిచెంది ఆయా ప్రదేశాల్లోఉన్న ఈ గ్రామ వాస్తవ్యులు కొంతమట్టుకు చందాలు వసూలుచేసి ఆలయ పునర్నిర్మాణాన్ని చేపట్టారు. ఈ ఆలయానికి 1981లో డాక్టర్ ప్రభాకర్‌గారు శంకుస్థాపన

చేసి సహకరించగా గోడలవరకు నిర్మాణం అయి అలానే ఉన్నది. నూతంగి సత్యానందంగారు 70యేళ్ళప్రాయంలో ఈ సంఘంపట్ల భారం వహించి ప్రయాసపడుతున్నారు. సంఘపెద్దలుగా బొబ్బర మంగయ్య, బొబ్బర ముత్యాలు, ఐనపర్తి వీరన్న, నూతంగి ఎబినేజరుగార్లు వ్యవహరిస్తున్నారు. జాతీయ రహదారి ప్రక్కను నిర్మించబడుతున్న ఈ ఆలయాన్ని అనేకుల రక్షణార్థం దేవుడు త్వరగా పూర్తిచేయాలని ప్రార్థిస్తున్నాం. ఇక్కడే మూడు నెలలకోసారి ఈ ఫీల్డు సంఘాలన్నీ కలిసికొని ఆరాధనలు జరుపుకొంటాయి. నూతంగి ఎబినేజరుగారిభార్య కాంతమ్మగారు సండేస్కూలు సేవలో సహకరిస్తున్నారు. కంకటి దారమ్మ, మర్రి గవరమ్మ, బొబ్బిలి చంద్రమ్మ గార్లు ఎడ్లబండిమీద తిరిగి సంచార సువార్తికురాళ్ళుగా ఈ ప్రాంతాల్లో సేవచేసారు.

బొబ్బర ముత్యాలుగారికి యవ్వనంలో పాముకాటువల్ల మోకాలు వరకు ఆపరేషన్‌చేసి కాలు తీసెయ్యవలసి వచ్చింది. అటుతరువాత వీరు ప్రభువును అంగీకరించి కులవృత్తి మానివేసి చంక కర్రలసాయంతో దేవుని సేవ చేస్తున్నారు.

చొప్పరామన్నగూడెంలో బ్రాష్లీగారి అండదండలతో నిర్మితమైన ఆలయం 1972లో అగ్నిప్రమాదానికి గురైంది. 1977లో ఈ ఆలయ పునర్నిర్మాణం పూర్తయ్యేవరకు సంఘం ఓ చిన్న పాకలో ఆరాధనలు జరుపుకుంది. ఆ గ్రామంలో పెరిగి, విద్యాభ్యాసంచేసి ఆయా ఉద్యోగాల్లో ఉన్న స్త్రీ పురుషులు ఈ దుసి తిని సహో. బి. వీరన్న మాస్టారిద్వారావిని వుదారంగా విరాళాలుపంపి ఆలయ నిర్మాణానికి యితోధికంగా తోడ్పడ్డారు. 1972 సం. లో శ్రీ బి. వీరన్నగారు ఈ ఆలయానికి పునాదిరాయివేసి ఆలయునిర్మాణాన్ని ఆరంభించారు. 1977 నవంబరు 15న ఆయన పరమపదించారు. మిషనెరీ సహో. ఎ.జె.రిల్లీగారు తదితరులు చేసిన ఆర్థిక సహాయంతో పైకప్పువేసి మందిరాన్ని ప్రభువుకు ప్రతిష్ఠచేశారు. ఈలోగా శ్రీ వీరన్నగారు కాలధర్మంచెందారు. ఈ సంఘాన్ని వీరన్నగారి మరణం తరువాత ఉప్పాటి చిరంజీవిరావుగారు భారం వహించి నడిపిస్తున్నారు. చమటపల్లిలాజరు, బొబ్బిలి సమూయేలుగార్లు సండేస్కూలు సేవలోను, బి. కృపమ్మ, ఏ. రత్నమ్మగార్లు స్త్రీల సమావేశాల్లోనూ నాయకత్వం



బొల్లిపో పెదబుచ్చియ్యగారు, చాగల్లు



కొడమంచిలి సత్తమ్మగారు, చాగల్లు



బొల్లిపో మంగమ్మగారు, వాగల్లు



పి. ఎలియాజరు దంపతులు, తణుకు



మసునూరి సూర్యనారాయణగారు,



చాగల్లు మిషన్ ప్రెస్ స్టాఫ్
మిస్‌రైట్. శ్రీయుతులు ఒత్నియేలు, ఆశీర్వాదం, మునెయ్య,
సుందరరావు, తాతయ్యగార్లు



శెట్టిపేట – ఉపాధ్యాయుల, సేవకుల సదస్సు



మిస్ టిల్‌స్లీ నిర్వహిస్తున్న హాలెండ్ వార్ఫ్ బాలికల
హాస్టలు, నరసాపురం



శ్రీ కొలిన్ టిల్‌స్లీ దంపతులు, కుటుంబం -ఆస్ట్రేలియా
[టిల్‌స్లీగారి కుమారుడు]



సత్యానందంగారు-ధవిళేశ్వరం-1932
(బ్రీలీగారి బోటుసరంగు,సువార్తికుడు



లిన్ మిసమ్మగారు [తణుకు]



టి. జోన్స్‌గారు, ధవిళేశ్వరం - 1931
(టి దేవదానంగారి తండ్రి)



లిన్ మిసమ్మగారి బంగళా [తణుకు]



బేతనీ ప్రథమ వై. యం. సి. ఏ సభ్యులు. కార్యవర్గం.



మిస్ ఎస్. ఉలర్‌గారు
విడదవోలు



మిస్ బ్రీలీ, ధవళేశ్వరం, శ్రీ ఎ. జి.
ఫేయిర్, మిస్ మోరిస్‌గార్లు
ధవళేశ్వరం



చెట్టే ఎలీషాగారి కుటుంబం



మెరువో అబ్రహాంగారు, చెట్టిపేట



శ్రీమతి గెద్దాడ ప్రేమమ్మగారు



పెనుమాక కృపమ్మగారు



మిస్ హెడ్స్, టిల్‌స్లీ దంపతులు, మిస్ మోరీస్
వెనుక కూర్చొన్నవారు మిస్. బ్రీలీ
ముందుకూర్చొన్న వారు మిస్ టిల్‌స్లీ ఆజ్‌టోర్న్‌గార్లు



వేగేసిన భగవాన్‌రాజు దంపతులు (నరసాపురం)



బర్డ్ దంపతులు



వెనుక : మిస్ మోర్గన్, హేంటన్, బ్లేక్, ౹్రలీ, మోరిస్ మిసమ్మగార్లు
కూర్చున్నవారు : బ్రియింట్ దంపతులు.
ఆఖరు యిద్దరు : అపరిచితులు



ఇ. సి. ఆడమ్స్‌గారు. బాగల్లు



సి. జె. టిల్‌స్లీ, పేషంట్, మిస్ గ్రేస్ ఆడమ్స్. శ్రీమతి ఆడమ్స్, శ్రీమతి పేషంట్‌గార్లు



మిస్ లెవింగ్టన్



చదలవాడ దానియేలుగారు,
ఎంబేరియన్ పేట



శ్రీమతి సుబ్బలక్ష్మమ్మగారు
మిస్ మోర్గన్‌తో కలిసి
సేవచేసిన సోదరి.



మిషనెరీ కాన్ఫరెన్సు—

నిలుచున్నవారు : మిస్, థారన్‌హిల్, డా. లీజర్, మిస్. ఆజ్‌బోర్న్, శ్రీ జర్మన్, డా. షార్ట్, శ్రీ ఆల్బర్ట్ లిల్లీ, మిస్ ప్రిచార్ట్, మిస్. మెడ్‌లాండ్‌గార్లు

కూర్చున్నవారు : 1. డా హోల్ట్, శ్రీమతి జర్మన్, మిస్. టేలర్, బర్ట్ దంపతులు, శ్రీమతి లిల్లీ, మిస్. బర్నార్డ్, మిస్. రాజర్స్‌గార్లు

కూర్చున్నవారు : 2. మిస్. హార్టింగ్, డా. మన్స్, మిస్. హెడ్స్, మిస్. రైట్, మిస్. ఏండర్సన్, మిస్. హోల్ట్, మిస్. హాడ్జికిన్‌సన్, మిస్, థామ్సన్, మిస్. టిల్‌స్లీ



జాసన్‌గారు, పాలకొల్లు



షి.రా బోయజుగారు, పెనుగొండ



ఆల్బర్ట్ జె. లిల్లీగారి కుటుంబం, నరసాపురం

వహించేవారు. వీరన్నగారి సతీమణి బి. కృపమ్మగారు 1981లో నర్సాపురంలో ప్రభువులో నిద్రించారు.

చిరంజీవిరావుగారు ఉప్పాటి పెంటయ్య, వీరమ్మగార్లకు 1930లో జన్మించారు. చాగల్లులో ఇ.సి. ఆడమ్సుగారి యాజమాన్యంలో టీచరుగా పనిచేసి పెదవాడపల్లిలో వి. చిన వీరన్నగారితో కలిసి జి.డి.యం. స్కూలు స్థాపించి అక్కడ టీచరుగా ఉంటూ బి. వీరన్నగారి మరణం తరువాత ఈ ప్రాంతపు సేవాభారాన్ని తలకెత్తుకున్నారు. వీరు ఈ ఫీల్డు కౌన్సిలు అధ్యక్షునిగా బాధ్యత వహించారు.

యాదవోలులో పెంకుటిశాల ప్రార్థనాలయం మద్దిపాటి లక్ష్మమ్మ దంపతుల సహాయంవల్ల నిర్మించబడింది. వీరే ఆ సంఘభారాన్ని చేపట్టి పనిచేస్తున్నారు. ఇక్కడ నూతనంగా ఆలయనిర్మాణానికి నర్సాపురం కాపురస్తులు మట్టా లూథర్‌కుమార్‌గారు సహాయం చేసారు. 1983లో సికిలే మోజెస్‌గారు ఆలయప్రతిష్ఠ చేసారు. అచ్చియ్యపాలెం గ్రామంలో 1930లో బ్రాహ్మీ, వీరన్నగార్లు సువార్త ప్రకటించగా కడిమి గంగమ్మ, చిడిపి బులి వెంకమ్మగార్లు రక్షణపొందారు. సంఘం ఏర్పడింది. 1942 నుండి నూతంగి యోసేపుగారు రెండేళ్ళు ఈ గ్రామంలో సేవచేసారు. 1960లో మిషనెరీలు బొబ్బర ముత్యాలు గారిని ఇక్కడికి పంపించారు. సంఘం అభివృద్ధిచెంది ప్రస్తుతం ఉప్పాటి సువార్తమ్మగారు స్త్రీల మధ్యను గంధిపోం రాజారావు, తాళ్ళూరి దావీదు, యోహానుగార్లు సంఘపెద్దలుగాను సేవచేస్తున్నారు. ఈ సంఘం కేంద్రంగా పరిసరాల్లోని కోయలమధ్య విస్తారంగా సేవ జరుగుతున్నది.

శీతంపేట గ్రామంలో బ్రాహ్మీగారి కాలంలో గళ్ళా ఆశీర్వాదంగారు వీరి తల్లిదండ్రులు ప్రభువును విశ్వసించారు. ఆశీర్వాదంగారు విద్యనభ్యసించి ఈ గ్రామంలోనే టీచరుగా పనిచేస్తూ మార్లపూడి మంగమ్మగారి కుమార్తె హేమలతగారిని వివాహమాడారు. ఈ దంపతులు పదవీ విరమణ అనంతరం సంఘ భాధ్యత వహించి సేవచేస్తున్నారు. అంకాలగూడెంలో బ్రాహ్మీగారి వాక్యపరిచర్యవల్ల మాదాసు జీవరత్నం, భార్య రామమ్మగార్లు రక్షణ

పొందారు. ఆ తరువాత కూనపో గంగమ్మ, ఆమె కోడలు రక్షించబడ్డారు. వీరంతా కొయ్యలగూడెం ఆలయానికి ప్రార్థన సహవాసానికై వెళ్తున్నారు.

మంగపతిదేవీపేటలో ఆస్‌బోర్న్‌గారి కృషివల్ల గంజి సుందరరావుగారు మన సంఘంలోచేరి కుటుంబసమేతంగా కొయ్యలగూడెంకు ఆదివారం ఆరాధనకు వస్తుండేవారు. గోపాలపురంలో 1958లో ఆ గ్రామ టీచరు కనుమాచారి సమూయేలుగారు రక్షణ సువార్త ప్రకటించినందువల్ల సంఘం ఏర్పడింది. వీరి తరువాత భాస్కరరావుగారు ఇక్కడ సేవచేసారు. పొంగుటూరులో ఆబోతు నోబుల్‌ముల్లర్ దంపతులు ఉద్యోగరీత్యా స్థిరపడి సండేస్కూలు నడిపిసున్నారు. దిప్పకాయలపాడులో బ్రాహ్మిగారి వాక్యపరిచర్య వల్ల బొబ్బర అరవాలు, భార్య అప్పలమ్మగార్లు ప్రభువును నమ్మి బాప్తిస్మం పుచ్చుకున్నారు. బొబ్బర ఇశ్రాయేలుగారిభార్య సంఘకార్యక్రమాల్లో ఆసక్తి గలిగి సేవ చేస్తున్నారు.

గవరవరంలో కె. ప్రేమానందంగారు మొదట్లో సేవచేశారు. దూలపెల్లిరాయుడుగారి కృషివల సంఘస్థాపన, ఆలయ నిర్మాణం జరిగినాయి. 1967లో రాయుడుగారు మరణించిన తరువాత బొబ్బిలి సామ్యేలు, వెంకమ్మగార్ల సహకారంతో నూతనంగా ఆలయం నిర్మించ బడింది. ప్రస్తుతం చుక్కల వెంకట్రావుగారు, వీరి సతీమణి ఈ సంఘ భారాన్ని నిర్వహిస్తున్నారు.

బోడిగూడెంకు చెందిన బోడిగూడెం రామమ్మగారి మేనల్లుడు చిడిపి యాకోబుగారు బ్రాహ్మిగారి సహాయంతో చదువుకుని చాప్పరావన్న గూడెంలో టీచరుగా పనిచేస్తూ బోడిగూడెంలో సంఘం స్థాపించి ఆలయాన్ని నిర్మించారు. 1974లో యాకోబుగారు మరణించగా భార్య జెస్సీకమ్మ, చిడిపి యేసుదాసు, కోరుకొల్లు యోసేపుగార్లు సంఘ బాధ్యతలు నెరవేరుస్తున్నారు.

ఆకుల జాన్‌పాల్‌గారు తాడేపల్లిగూడెం కొనాల గ్రామ వాస్తవ్యులు. చదలవాడ ఇష్మాయేలుగారిదగ్గర సండేస్కూలు పాటాలు నేర్చుకుని 1956లో మెరిపో అబ్రాహాముగారిద్వారా బాప్తిస్మంపొందారు. పాలకొల్లులో తెలుగు కాన్ఫరెన్స్‌కు సంఘం తరపునవెళ్ళి ప్రాణాపాయకరమైన స్థితిలో సంపూర్ణ

సేవకునిగా తన జీవితాన్ని సమర్పించుకొని చెట్టిపేట, తాడేపల్లిగూడెం ప్రాంతాలో సేవచేస్తుండగా మిస్ హెడ్స్ వీరిని 1970లో సత్తుపల్లిలో సేవకునిగా నియమించారు. మిస్ హెడ్స్‌గారే సత్తుపల్లిలో 10సెంట్లస లం 1100 రూపాయలకు కొని మందిరం నిమిత్తం కేటాయించారు. సత్తుపల్లి ఖమ్మం జిల్లాలోఉంది. ఇక్కడ అనేక గ్రూపులకు చెందిన క్రైస్తవులు ఉన్నారు. వీరిమధ్య జాన్‌పాల్‌గారు జి.డి.యం సంఘానికి నాయకత్వం వహించి నడిపిస్తున్నారు. ఈ గ్రామానికే చెందిన కంచర్ల భాస్కరరావుగారు 1978లో పక్షవాతపీడితుడై ఆస్పత్రిలోఉండగా ప్రభువు వీరిని అద్భుత మైన రీతిలో స్వస్థపరచగా ఆయనలో సంపూర్ణ విశ్వాసముంచి జి.డి.యం. సహవాసంలో ఉంటున్నారు. వీరు వైశ్య కుటుంబంలో పుట్టారు. అదేవిధంగా మరొక వైశ్య కులస్థుడు మద్దుల వెంకటేశ్వరరావుగారికి కనుదృష్టి మందగించింది. వీరుకూడా జాన్‌పాల్‌గారి మూలంగా వాక్యం విని ఉన్నందు వల్ల ప్రభువును ప్రార్థించగా పోయిన చూపు తిరిగి వచ్చింది. వీరుకూడా మన సహవాసంలోఉంటూ ప్రభువుకు మంచి సాక్షిగా ఉన్నారు.

మడికి అప్పారావుగారు మిస్ వాకర్‌వల్ల సువార్త విని మారుమనస్సు నొందారు. కామవరపుకోటలో సి రపడి అగ్రిప్పగారిద్వారా బాప్తిస్మంపొంది 13 సంవత్సరాలు మిస్‌వాకర్‌తోకలిసి సేవలో పాల్గొన్నారు. 1953లో దమ్మపేటవచ్చి అక్కడ సంఘాన్ని స్థాపించారు. అంతేగాక పట్టువారిగూడెం గంగులగూడెం, మంకారం, రాబారుపల్లి, అశ్వారావుపేట, అనంతారం, గుళ్ళాయి, నర్సాపురం, జగన్నాథపురం, సంద్రకుంటు, కొమ్ముగూడెం, ములకలపెల్లి మొదలైన గ్రామాల్లో వెలమలు, కోయలు, కాపులు, కంసాలులు కోమట్లు మొదలైన వారిమధ్య సేవచేసారు.

ఈ ప్రాంతపు నారాయణపురంలో మిస్ రెవింగ్టన్ ఒక సంఘాన్ని స్థాపించారు. (ఇది అశ్వారావుపేటకు 14మైళ్ళ దూరంలో ఉంది.) అనంతారంలో లక్ష్మీనారాయణ అనే సేవకుడు పనిచేస్తున్నారు. అడవిరామన్న పేటలో విజయరావు అనే కోయ, గుళ్ళాయి సంఘంలో చాకలి రాముడుగారు ఉండి సేవ చేస్తున్నారు.

# 29

# కొత్తపేట ఫీల్డు

కొత్తపేట ప్రాంతానికి చెందిన వాడపాలెంలో సంఘస్థాపన గురించి ఇంతకుముందే ప్రస్తావించాము. మక్రే దంపతులు అమలాపురంలో నివాసముంటూ ఈ ప్రాంతంలో సువార్త ప్రకటించిన ఫలితంగా 1890లో ఈ సంఘస్థాపన జరిగింది. తదుపరి మిస్ లిన్ కూనపరపు ఆబేలుగార్లు కూడా ఈ ప్రాంతమంతా నమ్మకమైన సేవ చేసారు. ఆరంభంలో జుత్తికవారి కుటుంబం, బండి పల్లినమ్మ, ఇసుకపట్ల వెంకయ్య మొదలైనవారు ప్రభువులో విశ్వాసముంచారు. మక్రేగారి కాలంలోను, ఆటు తరువాతను ఆచంట సుబ్బారాయుడు, వాసా యోహాను, బూల సోదరులు, నాగాబత్తుల వీరాస్వామి, అంబటి ఆంద్రూ, యేళ్ళ సోదరులు, గూటం జాన్‌తాతయ్య, నరెళ్ళ తామస్ బెంజిమన్, ప్రొద్దుకు వెంకన్న, జంగ బసవయ్య, నేతల అర్జున్నగార్లు సువార్తికులుగాను, టీచర్లుగాను పనిచేసినవారిలో ప్రముఖులు.

వాడపాలెం సంఘకాపరిగా బహుకాలం పనిచేసిన నేతల అర్జున్నగారు 1904లో జన్మించి నర్సాపురం బ్రాన్నీగారి బోర్డింగులోఉండి చదువుకున్నారు. 1926లో వాడపాలెం జి.డి.యం. స్కూలులో టీచరుగా ప్రవేశించి వాడపాలెం సంఘాన్ని, పరిసర సంఘాలను వాక్య హెచ్చరికలద్వారా పోషిస్తూ వచ్చారు. 1953లో వీరు తనువు చాలించగా అప్పటికి అమలాపురంలో మిషనెరీగాఉన్న బక్‌గారి ప్రోత్సాహంవల్ల 1954లో నేతల చంద్రపాల్‌గారిని టీచరుగాను, సంఘకాపరిగాను నియమించడం జరిగింది. వీరు గంటి గ్రామంలో నేతల గెర్షయ్య, నరసమ్మగార్లకు జన్మించారు. కొత్తపాలెంలో చదువుకుని అమలాపురంలో టీచరు ట్రెయినింగు పాసై కాకినాడలో బ్రహ్మ సమాజ సభ్యునిగా సర్వమత సహనంతో ఉంటున్న పరిసి తుల్లో ప్రసంగి 12:12 చదవడంద్వారా యేసే నిజమైన దేవుడని

గ్రహించి వెబ్‌గారి మూలంగా గంటిపెదపూడిలో 1957లో బాప్తిస్మం పొందారు. నేతల అర్జున్నగారి అనంతరం వాడపాలెం సంఘాన్ని అభివృద్ధి చేసారు. ఉద్యోగ విరమణ తరువాత సంపూర్ణ సువార్త సేవకునిగా పాటు పడుతున్నారు. గోదావరి డెల్టా మిషన్ అసోసియేషన్ మెంబరుగా, కొత్తపేట ఫీల్డు ప్రసిడెంటుగా ఉన్నారు. అంబాజీపేటలో ఫీల్డు తరుపున బైబిలు స్కూలు నడిపించారు.

మక్రేగారు ఈసంఘం కొరకు సంపాదించిన స్థలంలో కొంత ప్రభుత్వంవారి వశమైపోగా మిగిలిన స్థలంలో చంద్రపాల్‌గారి కృషివల్ల, మోరిసన్‌గారి ఆర్థిక సహాయంవల్ల 1967లో ఆలయ నిర్మాణం జరిగింది. ప్రస్తుతం నేతల చంద్రపాల్‌గారు కాపరిగాను, బూల తాతారావు, కుసుమ పల్లయ్యగార్లు పెద్దలుగాను ఉన్నారు.

కొత్తపేట ప్రాంతపు సంఘాల్లో అడపాదడపావెళ్ళి ఆ సంఘ క్షేమాల బాధ్యతవహించిన మిషనెరీలను ప్రస్తావించడం ఇక్కడ సమంజసం. నర్సాపురం లెప్రసీ ఆస్పత్రిలో కొంతకాలం పనిచేసిన బర్‌గారు అమలాపురం పద్మినీపేటలో మిషన్ బంగళాలోఉంటూ కొత్తపేట ప్రాంతాల్లో సేవ చేసారు. బ్రౌన్ దంపతులు 1904లో, స్కాట్లాండునుండి మక్రే దంపతు లకు సహాయంగా వచ్చారు. అటుతరువాత వీరు అంబాజీపేటకు వెళ్ళి పోయారు. బ్రౌన్ సతి అక్కడ ఒక డిస్పెన్సరీ నడిపించింది. డాక్టర్ మిస్ శీజర్ అంబాజీపేటలో ఆస్పత్రి ప్రారంభించి కొత్తపేట ప్రాంతీయ సంఘాలపట్లకూడా భారం వహించి సేవ చేసింది. మోరిసన్ దంపతులు 1925-1951 1965-66 కాలంలో గోదావరి ప్రాంతంలో సేవ చేసారు. మొదట్లో మిస్ స్టార్క్, మిస్ మన్రోలతో తూర్పుగోదావరిప్రాంతం పర్యటించి సువార్త ప్రకటించారు. అమలాపురంలో స్థిరపడి బ్రౌన్‌దంపతుల సేవను కొనసాగించారు. వెబ్‌గారుకూడా 1921—1953 కాలంలో అమలాపురంలో స్థిరపడి కొత్తపేట ప్రాంతపు అసెంబ్లీల క్షేమానికి కృషి చేసారు. వీరుగాక ఆస్‌బోర్న్, మిస్ మన్రో, మెక్లీయరీ, జర్మన్ తదితర మిషనెరీలు ఈ ప్రాంతపు సేవలో సంఘాల స్థాపనలో పాలుపంచుకున్నారు.

ఈ ఫీల్డులో ఆరంభసేవ చాలామట్టుకు అమలాపురం సంఘాల పెద్దలు, సువార్తికులవల్ల జరిగింది. అంబాజీపేటలో ఉన్న డాక్టర్

మిస్ లీజర్‌గారు ఈ ప్రాంతపు సంఘాలకు ఆర్థికంగా సహాయంచేసి కొన్ని ఆలయాల నిర్మాణానికి తోడ్పడ్డారు. ఇది ఉన్న ఫీల్డు లన్నిటిలోకీ చిన్నదిగా కనిపిస్తున్నది. అయితే అక్కడి విశ్వాసులు బహు ఉత్సాహంతో స్వంత బాధ్యతమీద ప్రభువునే గురిగా పెట్టుకుని పరిసర గ్రామాల్లోకి సువార్తవ్యాప్తి, సంఘ స్థాపనల నిమిత్తం పాటుపడ్డారు. అయితే ముందుగానే ప్రస్తావించినట్లు కొత్తపేట ఫీల్డు స్థాపనకు పితామహుడుగా చెప్పదగినవాడు జేమ్సు నార్మన్ మక్రేగారు. హవుస్‌బోటు సువార్తసేవ మూలంగాకూడా ఇక్కడ గొప్ప ఉజ్జీవం కలిగింది.

* * *

యేనుగు మహాల్ గ్రామంలో మొదటిసారిగా మిస్ మన్రో హవుస్ బోటు సువార్త పథకం మూలంగా సువార్తధ్వని వినిపించింది. వెబ్‌గారు ఈ గ్రామంపట్ల శ్రద్ధవహించి పాటుపడగా వారరెడ్డి, సుబ్బమ్మ, నక్కా సీతమ్మ అనేవారు ఆరంభంలో ప్రభువును విశ్వసించారు. 1929లో గుమ్మడి సమూయేలుగారు పాటశాలను స్థాపించి వెబ్‌గారు, వారరెడ్డిగారు, బ్రౌనగార్ల సహాయంతో సంఘస్థాపనకు కృషిచేసారు. వీరికి సహాయంగా కంబత్తుల జేమ్సుగారు పనిచేసారు. గుమ్మడి సమూయేలుగారు గంటి గ్రామంలో వెంకయ్యగారికి జన్మించారు. బూల దానియేలు, గూటం జాన్‌తాతయ్యగార్ల వాక్యపరిచర్యవల్ల సమూయేలుగారు రక్షణ వెలుగులోకి వచ్చారు. కొత్తపేట బోర్డు హైస్కూలులో చదువుకున్నారు. ఏనుగు మహాల్ సంఘాన్ని అభివృద్ధి చెయ్యడంలో, ఆలయం నిర్మాణంలో కంచర్ల ప్రకాశంగారితో కలిసి వీరు పనిచేసారు. 1950లో వీరు ప్రభువు సన్నిధికేగారు. తరువాత వారరెడ్డిగారి అల్లుడు కుంచే మీరయ్యగారు టీచరు గాను, సంఘకాపరిగాను సేవ ప్రారంభించారు. 1953లో గోదావరి వరద వల్ల ఆలయం పాడైపోతే మీరయ్యగారి ఆధ్వర్యంలో మళ్ళీ నిర్మించడం జరిగింది. మీరయ్యగారు 1978లో పదవీ విరమణపొంది సంఘపాలనలోను వాక్యోపదేశంలోను మరింత శ్రద్ధవహించి పనిచేస్తున్నారు.

అవిడి గ్రామంలోకూడా 1890లోనే మక్రేగారు సువార్త ప్రకటన ఆరంభించారు. ఆదిలో నక్కా కన్నయ్య, సుబ్బయ్య, సబ్బితి సమూయేలు గడ్డి నరసయ్య మొదలైనవారు బాప్తిస్మం పొందారు. బూలరెడ్డి,

సామ్యుయేలు, గూటం జాన్‌తాతయ్య, అంబటి ఆంద్రూ, దేవరపల్లి సోమన్నగార్లు ఈ సంఘాన్ని దర్శిస్తూఉండేవారు. గెడ్డం ఏలియాగారు టీచరుగాఉంటూ ఈ సంఘంకోసం పాటుపడ్డారు. ఆయా సమయాల్లో కూటాల్లో అగ్రిప్ప, టిల్‌స్లీ, బర్ట్సు, ఫెయిర్, నేస్మిత్‌గార్లు వాక్యపరిచర్య చేసారు. బ్రౌనగారి సహకారంతో గెడ్డం ఏలియాగారు సండేస్కూలు స్థాపించారు. వీరికాలంలో నిర్మించిన ఆలయం 1969లో గాలితుఫానుకు కూలిపోయింది. తిరిగి ఆలయం నిర్మించడానికి కాంద్రు ఇశ్రాయేలుగారి ద్వారా కొంత ఆటంకం కలిగిందని తెలుస్తోంది. అయినప్పటికీ ఈ ప్రాంతపు విశ్వాసులంతా సమావేశమై 1971లో బాదంపుడి రామన్నగారిద్వారా శంఖుస్థాపన చేయించి ఆలయ నిర్మాణంపూర్తిచేసారు. చంద్రపాల్, సోమన్న గార్లు ఆర్థిక సహాయం చెయ్యగా సి.జి. ప్రకాశరావుగారు ప్రతిష్ఠించారు. మాగాపు సుబ్బన్న, ముంగండ పల్లయ్య, గెడ్డం యోహాను, వర్షాల వెంకట్రావు, సబ్బితి దావీదుగార్లు సంఘపెద్దలుగా ఉంటున్నారు.

గంటి పెదపూడిలో మక్రే,ఆచంట సుబ్బారాయుడుగార్ల సేవాఫలితంగా 1880–90 ప్రాంతాల్లో గూటం అర్జయ్యగారు ఆదిలోను.అటుతరువాత అమలాపురం ప్రాంతపు సేవకుల కృషి ఫలితంగా సరెళ్ళ నరసయ్య, ఉమ్మితి అచ్చెయ్య చింతపల్లి వెంకటరత్నం, చిల్లి వీరయ్య మొదలైనవారు రక్షించ బడగా సంఘస్థాపన జరిగింది. 1895లో మక్రే, బ్రౌన్‌గార్లు పాటశాలను స్థాపించారు. చదలవాడ థామస్‌గారు ఇక్కడ టీచరుగా పనిచేసి సండేస్కూలు స్థాపించి చాలామందిని ప్రభువులోకి నడిపించారు. 1910నుండి సరెళ్ళ షేము, లాజరస్, థామస్, బూల దానియేలుగార్లు ఉపాధ్యాయులుగా సంఘ కాపరులుగా పనిచేసి సంఘాన్ని అభివృద్ధి చేసారు. అటుతరువాత పెద్దలుగాఉన్న కాంద్రు ఇశ్రాయేలు, గూటం నరసయ్య, గూటం అప్పారావు విప్పర్తి ప్రకాశం, వుమ్మితి డేవిడ్ మొదలైనవారు ఉజ్జీవ సభలు నిర్వహిస్తూ క్షేమాభివృద్ధి చేసారు. బ్రౌన్, వెబ్, మోరిసన్, బర్ట్సు, నేస్మిత్, జోనా, అగ్రిప్పగార్లు ఆయా సమయాల్లో ఇక్కడ వాక్యపరిచర్య చేసారు. 1949లో నిర్మితమైన ఆలయానికి మోరిసన్‌గారు ఎర్విన్‌హాల్ అని నామకరణంచేసి ప్రతిష్ఠించారు. అటుతరువాత కాంద్రు ఇశ్రాయేలుగారి విషయంలో కొంత గలిబిలి తలెత్తినందువల్ల చదలవాడ జోసెఫ్‌గారు, అమలాపురం

సంఘపెద్దలు వచ్చి సంగతి విచారించి 1967లో గూటం జోసెఫ్, సరెళ్ళ డేవిడ్, సత్యాల వెంకటరెడ్డి, నేలపూడి మహాలక్ష్మిగార్లను పెద్దలుగా నియమించారు. నేతల చంద్రపాల్‌గారు క్రమంగా ఈ సంఘాన్ని దర్శిస్తూ వాక్యోపదేశాలు చేస్తున్నారు.

వెబ్, జర్మన్, మెక్లేరీ, బర్ మొదలైన మిషనెరీలు, చంద్రపాల్, జాన్‌తాతయ్య, బాల దానియేలు, డి. సోమన్న తదితర ప్రాంతీయ భక్తులు సువార్త ప్రకటించినందువల్ల దేవరపల్లి గ్రామంలో దాక నాగభూషణం, సాకా సుబ్బారావు, సాకా నాగన్న, గన్నవరపు గద్దయ్య, దాకే అంజమ్మ, సాకా సీతమ్మ, సాకా సుందరమ్మ, గన్నవరపు సుబ్బాయమ్మ అనేవారు. 1957లో గూటం జాన్‌తాతయ్యగారివల్ల బాప్తిస్మం పొందారు. మోరిసన్ దంపతుల కృషివల్ల ఇక్కడ ఆలయం వెలిసింది. దాకే నాగభూషణం, ఎన్. ప్రసాదరావు, యం. సమూయేలు, నీతిపూడి తాతారావుగార్లు సంఘ కాపరులుగా ఉన్నారు. దేవరపల్లి గ్రామంలో నీతిపూడి తాతారావుగారు టీచరుగా వచ్చి సంఘ బాధ్యతనుకూడా స్వీకరించి పనిచేసేవారు. వీరు గంటి గ్రామానికి చెందిన వెంకన్నగారి పుత్రుడు. బాల్యంలోనే సండేస్కూలులో గూటం అప్పారావుగారిద్వారా రక్షణ పొందారు.

గూటం అప్పారావుగారుకూడా గంటి గ్రామ వాస్తవ్యులే. మిషనెరీల సువార్త సేవవల్ల రక్షించబడి కాకినాడలో టీచరు ట్రెయినింగు పాసై గంటిలో ఒక స్కూలు స్థాపించి పనిచేస్తూ దాన్ని జి.డి.యం. స్కూలుగా మార్చారు. క్రౌస, వెబ్, మిస్ మన్రో, ఇంకా అమలాపురం పెద్దలు వచ్చి సభలు నడిపించగా 1926–38 సంవత్సరాలకాలంలో గూటం కన్నయ్య, గూటం లక్ష్మన్న, పాలమాటి చిట్టి వెంకయ్య, కొండేపూడి రామన్న, నిమ్మది సమూయేలు, వెంకటస్వామి మొదలైనవారు రక్షణ పొందారు. అప్పటికి గంటిలో సంఘం లేనందువల్ల మైలు దూరంలో ఉన్న గంటి పెదపూడికి ప్రార్థనకు వెళ్తుండేవారు. 1954లో నేస్మిత్, బర్న్సగార్లు వచ్చి గంటిలో సంఘాన్ని స్థాపించారు. అంబటి అంద్రూ, ఆస్‌బోర్న్, మృత్యుంజయాచార్యులు, అగ్రిప్ప జి.ఎ. సమూయేలు, దేవదాసు, సి. యోబు, బాల జాన్, దానియేలు, గూటం జాన్‌తాతయ్య, జర్మన్, మెక్లేరీ,

వి. లూకా, డి. సోమన్న, వై. విక్టర్, సి. జోసెఫ్‌గార్లు, ఇంకా ఎందరో భక్తులు ఇక్కడ నూతన వత్సర కూటాలు నడిపించి సంఘాన్ని బలపరిచారు. 1963లో సి. మలాకీగారు ఇక్కడ కట్టబడిన ఆలయాన్ని ప్రతిష్ఠచేసి బేతేలు అని పేరుపెట్టారు. 1966లో గూటం అప్పారావుగారు జి.డి.యం. సంఘాన్ని చర్చ్ఆఫ్ క్రైస్ట్ సంఘంగా మార్చేసారు. కొద్దిమంది విశ్వాసులతో జి.డి.యం. సంఘం ఇంకా నడిపించబడుతోంది.

గంటి పెదపూడి దగ్గర గోదావరి మధ్యనున్న పూడిమూడిలంకలో 1920లో మిషనెరీలు జి.డి.యం. స్కూలు స్థాపించారు. విప్పర్తి ప్రకాశంగారు టీచరుగా పనిచేస్తూ అమలాపురంనుండి మిషనెరీలను పెద్దలను రప్పించి వాక్యపరిచర్య చేయించగా గాది వెంకన్న, యల్లమెల్లి ప్రకాశం, కాకమ్మ మొదలైనవారు రక్షణ పొందారు. ప్రకాశంగారి స్వగ్రామం అవిడి. ప్రతి ఆదివారం ప్రకాశంగారు పూడిమూడిలంక సంఘాన్ని గంటి పెదమూడికి ఆరాధన నిమిత్తం నడిపించేవారు. 1944లో ప్రకాశంగారు కాలధర్మం చెందిన తరువాత పండు ఇశ్రాయేలురాజుగారు సంఘ బాధ్యతను వహించారు. వీరిది కాకినాడ. 1944లో లంక లేబరు స్కూలుకు బదిలీ అయినారు. 1953దాకా లంకలో ఆలయంలేదు. 1954లో వీరి కృషివల్ల ప్రార్థనశాల నిర్మించడం జరిగింది. రిటైరైన వెనుక వీరు నర్సాపురంలో స్థిరపడిపూడిమూడిలంక సంఘంపట్ల ఇంకా బాధ్యత కలిగి పాటుపడుతున్నారు. ప్రస్తుతం గాడి వెంకన్న మొదలైనవారు సంఘ పెద్దలుగా ఉన్నారు.

రావులపాలెం జి.డి.యం. సంఘం గూటం పాల్సన్‌గారి కృషి ఫలితం వీరు గూటం నందయ్యగారి కుమారులు. కలపవర్తకంచేస్తూ మద్రాసు హిందూస్థాన్ బైబిల్ ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందారు. పల్లి సత్యానందం కాండ్రు ఇశ్రాయేలు గార్లవల్ల హెచ్చరిక పొంది ప్రభువు సేవలో ఆసక్తి పెంచుకున్నారు. చాలాకాలం స్వగృహంలోనే ప్రార్థనలు నడిపించి 1969లో తాటాకులతోను, 1976లో పెంకుతోను ఆలయం నిర్మించారు.

మెర్లపాలెం గ్రామంలో పల్లి ముసలయ్యగారి కుమారులు పల్లి సంతానందంగారు. వీరుకూడా మద్రాసులో బైబిలు శిక్షణ పొందారు. 1956–58లో వడ్డియ్య అనే పెంతెకొస్తు సేవకునివల్ల ప్రభువును తెలుసుకున్నారు. 1965 నుండి సంపూర్ణ సువార్త సేవకునిగా పనిచేస్తున్నారు.

ఆర్థిక సహాయంతో ఆలయనిర్మాణం జరిగింది. ఈ సంఘంలో సత్యానందం గారు భారంతో సేవచేస్తున్నారు.

వీరి సువార్త ఫలితంగా 1966లో ఊబలంకలో సంఘం ఆరంబమైంది. నిర్మించబడ్డ చిన్న ప్రార్థనశాల 1969లో తుఫానుకు కూలిపోగా ఇసుకపట మోషేగారు, స్థలాన్నిచ్చారు. మిస్ లీజరు, స్టాన్లీగార్లు ఆర్థిక సహాయం చెయ్యగా 1974లో ఆన్‌బోర్గ్‌గారు ఆలయ ప్రతిష్ఠ గావించారు ప్రథమ క్రైస్తవులు చీకట్ల కాంతమ్మ, ఇసుకపట్ల సూరమ్మ సబ్బితి వీరాయమ్మ, మొదలైనవారు. పల్లి సత్యానందంగారు క్రమం తప్పక ఇక్కడ వాక్య పరిచర్య చేస్తున్నారు. వీరి సేవా ఫలితంగా యిటీవల రంపచోడవరం ఫోక్స్‌పేటలో నూతనంగా సంఘాలు ఏర్పడ్డాయ్.

నేతల అర్జున్నగారు ఆవిడి సంఘపెద్ద కాంద్రుడు లచ్చన్నగారు బొడ్డమెల్లిపాలెం గ్రామంలో సువార్త ప్రకటించినందువల్ల చింతా జీవరత్నం చింతా సమూయేలు, చింతా ఇశ్రాయేలు, అంబటి కట్లమ్మ నక్కా కృపానందం, జొన్నాడ వీరమ్మ అనెవారు ప్రభువును విశ్వసించారు. వీరంతా మొదట్లో ఆదివారం కూటాలకు వాడపాలెం సంఘానికి వచ్చేవారు. అమలాపురంనుండి గూటం జాన్‌తాతయ్యగారు, కొత్తపేట ప్రాంతీయ సువార్త సమాజంవారు, మెక్లేరీ జర్మన్,మోరిసన్‌గార్లు ఇక్కడ వాక్యపరిచర్య చేసేవారు. ప్రస్తుతం ఈ సంఘానికి చింతా ఇశ్రాయేలు, గొసంగి పోలు బుడితి యేసురత్నం, ఎన్. మనోహరంగార్లు సంఘ పెద్దలుగా ఉన్నారు. మిస్ లీజరుగారి ఆర్థిక సహాయంవల్ల ఆలయ నిర్మాణం జరిగింది

1967లో వైతేనయుం గ్రామంలో సంఘస్థాపన జరిగింది. మోరిసన్‌గారు ఈ గ్రామంలో సువార్తను బోధిస్తూ ఇక్కడ స్కూలు స్థాపించి పాతళ్ళదిబ్బ వాస్తవ్యులైన బి.ఆర్. ఇశ్రాయేల్‌గారిని టీచరుగా నియమించారు. ఇశ్రాయేల్‌గారు బ్రాంచి పోస్టు మాస్టారుగాకూడా పనిచేస్తూ ఉండేవారు. సంఘకాపరిగాఉండి సంఘాన్ని అభివృద్ధి చేసారు. సరెళ్ళ వెంకటరత్నం అనే సహోదరుడు ప్రభువుచేత ప్రేరేపించబడి 4 సెంట్ల భూమిని ఆలయంకోసం ఇవ్వగా ఇక్కడ ఆలయ నిర్మాణం జరిగింది. ఈ సంఘానికి చెందిన బడుగు కుటుంబం వారైన జేసురత్నం, నెహెమ్యా, ఎజ్రాగారు ఉన్నతోద్యోగాల్లోఉంటూ సంఘాభివృద్ధికోసం శ్రద్ధకలిగి

పాటుపడుతున్నారు. సరెళ్ళ వెంకటరత్నంగారు సంఘ అధ్యక్షునిగాను, బడుగు జేసురత్నంగారు సెక్రటరీగాను, బి.ఆర్. ఇశ్రాయేల్ గారు సంఘకాపరి గాను ఉంటున్నారు.

ఇవిగాక ఈ ప్రాంతంలో మసాయ్‌పేట, అద్దంకివారిలంక, నడిపూడి, పూజారిపాలెం మొదలైన గ్రామాల్లో సంఘాలున్నాయి.

# 30

## అనుబంధం

# ఇంగ్లండులో

### ఆది బ్రదరెన్ సంఘాలు నమ్మి అనుసరించిన సిద్ధాంతాలు

సి. జోనాగారు తమ గోదావరి డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర (1936) గ్రంథం చివరి అధ్యాయం "సంఘములు వృద్ధినొందుట అవి యనుసరించు సిద్ధాంతములు" లో ఇలా రాసారు--* "మన మిషన్ వృత్తాంతములన్నియు, వరుసను వ్రాసిన పిదప చివరను మనపని యొక్క సిద్ధాంతములను కొంతవరకు తెలియజేయుట ప్రయోజన కరము. అవి బహు నిరాడంబరమైన (simple) సిద్ధాంతములు..."

ఈ చరిత్ర గ్రంథంలోని చరిత్ర పురుషులంతా తమ నమ్మకాన్ని, సేవను ఎలాటి విశ్వాసపు పునాదులమీద కట్టుకున్నారో ఆ ప్రాథమిక సిద్ధాంతాలను చివరలో ఉదహరించడం ఎంతైనా సమంజసం. సమంజసమే గాక అవసరంకూడా. ఎందుకంటే ఉభయ గోదావరులుదాటి బయటకువెళ్ళి ఇతర సంఘాల క్రైస్తవులను "బ్రదరెన్ సంఘాల సిద్ధాంతాలేమిటి" అని అడిగితే "స్త్రీలను ప్రార్థన, ప్రసంగాలు చెయ్యనివ్వరు" అని జవాబు వస్తుంది. బ్రదరెన్ సిద్ధాంతాల గురించి చాలా మందికి తెలిసినది అంతమట్టుకే. పోనీ ఎవరైనా ఒక బ్రదరెన్ విశ్వాసివెళ్ళి "అయ్యా, మీ సంఘ సిద్ధాంతాలేమిటి?" అని గనక అడిగితే "బ్రదరెన్ సిద్ధాంతాలంటూ ప్రత్యేకంగా ఏమీలేవు, క్రొత్తనిబంధన సిద్ధాంతాలే బ్రదరెన్ సిద్ధాంతాలు"

---

*గోదావరి డెల్టా మిషన్ శతవత్సర జ్ఞాపకార్థ చరిత్ర 1836–1936.
సి. జోనా 1936.

అని జవాబు వస్తుంది. ఇది ఏకైక బ్రదరెన్ సిద్ధాంతం—క్రొత్తనిబంధన పద్ధతిని అక్షరాల సంఘ నిర్వహణలో అనుసరించడం. అయితే ఇతర డినామినేషన్ల సిద్ధాంతాలనుండి బ్రదరెన్‌వారి నమ్మకాలను ప్రత్యేకించి చెప్పడం కోసం క్రొత్తనిబంధన సూత్రాల్లోనుంచి కొన్ని ముఖ్యమైనవి బ్రదరెన్ సంఘాలకు వెన్నెముక అనదగిన సూత్రాలు కొన్నిటిని వాక్యాను సారంగా ఎత్తి రాసుకోవడం తప్పని సరి. ఇది క్రొత్తగా బ్రదరెన్ సిద్ధాంతాలను సృష్టించడంకాదుగాని బ్రదరెన్‌వారు క్రొత్త నిబంధనలోని ఏయే మూలసూత్రాలను తమ సంఘాల నిర్వహణకు ప్రధాన ఆధారాలుగా గుర్తిస్తారో వాటినే ఎత్తిరాయడం అని స్పష్టంగా అర్థం చేసుకోవలసిఉంది.

జి.డి.యం. సంఘాల్లో పాటించే సిద్ధాంతాలను తెలుసుకోవాలంటే అసలు బ్రదరెన్ సంఘాలు ఇంగ్లండులో ఆవిర్భవించిన రోజుల్లో ఆదిమ బ్రదరెన్ విశ్వాసులు ఇతర డినామినేషన్లనుండి ప్రత్యేకించబడిన సందర్భంలో వారు గుర్తించిన సిద్ధాంతాలను తెలుసుకోవడం ముఖ్యం.

It will be clearly seen from these points that the tenets held by the Godavari Delta Mission which distinguish it and indeed all independent Bretheren Churches throughout the world from other Missions and Churches lay not in the area of doctrine, but in that of ecclesiology.* వీటిని ఆరు అంశాలుగా విభజించి అధ్యయనం చెయ్యవచ్చు.

1. వాక్యానికిఉన్న అధికారం తిరుగులేనిది. మత సంబంధమైన మరి యే అధికారమూ దీన్ని త్రోసిపుచ్చలేదు.
2. గురువులను (పాస్టర్లు) అభిషేకించడమన్నది వాక్యానుసారంకాదు.
3. సంఘ సభ్యులందరిలోనూ ఆత్మవరాలుంటాయి. సంఘక్షేమాభి వృద్ధి నిమిత్తం వీటిని ప్రోత్సహించి ఉపయోగించుకోవాలి.

ఎ. ప్రతివారం రొట్టె విరిచే సమయాన నిర్దేశించబడిన ఆరాధనా క్రమం ఉండకూడదు కాని, పరిశుద్ధాత్మ వరాలను అక్కడ ఉపయోగించు కోవాలి.

---

*The origins of the Godavari Delta Mission and its distinctive tenets. B.D. Thesis. Serampore univ. 1980

బి. బోధ, ప్రవచన వరాలను ఉపయోగించుకోవాలి.

4. సంఘ నిర్మాణం పరిపాలన ఇత్యాది విషయాలకు అపొస్తలుల కార్యముల గ్రంథము, ఆ తరువాత వచ్చే లేఖలు మూలాధారాల్లుగా ఉండాలి.

ఎ. సంఘ నాయకత్వం.

బి. సంఘాల స్వతంత్ర ప్రతిపత్తి .autonomy)

సి. సంఘాల మధ్య సహవాసం.

డి. సంఘంలో క్రమశిక్షణ.

5. సంఘం అన్నది అందరు నిజమైన విశ్వాసుల సహవాసం. విశ్వాసులంతా కొత్తనిబంధన చూపిన ఆదర్శం ప్రకారం ఒకటే.

6. క్రైస్తవ భక్తి విశ్వాసిని తన జీవితానికి, సేవకూ అవసరమైన వాటికోసం కేవలం దేవునిమీదనే ఆధారపడేందుకు ప్రేరేపించాలి.

1. వాక్యానికిఉన్న అధికారం తిరుగులేనిది. మతసంబంధమైన మరి యే అధికారమూ దీని త్రోసిపుచ్చలేదు.

బ్రదరెన్ ఉద్యమం ఆరంభం కాకముందు దాదాపు ఒక శతాబ్దం క్రితం వెస్లీ, విట్‌ఫీల్డు మొదలైనవారు "పవిత్ర లేఖనాలు రక్షణార్థమైన సందేశాన్ని కలిగి ఉన్నాయి". అనే సూత్రాన్ని గుర్తించారు. అయితే ఈ సూత్రాన్ని సంఘక్రమం, పరిపాలన, ఆర్గనైజేషన్‌కు వర్తింప జెయ్యటంలో మందకొడిగా ప్రవర్తించారు. ఇదిగాక "సంఘపరమైన ఆచారాలు, సంప్రదాయాలను నిర్ణయించే అధికారం సంఘానిదే" అన్న సూత్రాన్ని వీళ్ళు ఒప్పుకున్నారు. ఇక్కడే రిఫార్మేషన్ నాయకులకీ బ్రదరెన్ నాయకుల అభిప్రాయాలకూ తేడా వచ్చింది. మార్టిన్ లూథర్‌కూడా దేవుని వాక్యంమీద తప్ప మరిదేనిమీదా నేను విశ్వాసముంచను అని స్థిరంగా నిలిచాడు. విశ్వాసుల సంఘాలన్నీ వేరువేరుగా తమ స్వంత క్రమశిక్షణను స్వతంత్ర ప్రతిపత్తిని కలిగి ఉండడమే ఆది అపొస్తలుల ఉద్దేశం అని గుర్తించాడు గాని విశ్వాసులు ఇంక ఇలాటి పథకానికి సిద్ధం కాలేదంటూ సంఘపరిపాలన రాజాధిపత్యం క్రిందే ఉండాలనే దానికి అంగీకరించాడు. ఈవిధంగా ఈ బ్రహ్మాండమైన రిఫార్మేషన్‌లో లొసుగులు ఏర్పడ్డాయి.

అయితే బ్రదరెన్‌వారు ఇంతకుముందున్న అధికారాలనూ, సంప్రదాయాలనూ పూర్తిగా త్రోసిపుచ్చి పవిత్ర లేఖనాలమీదే అక్షరాలా ఆధారపడ్డారు. సత్య స్వరూపియైన ఆత్మ తమకు సత్యాన్ని వెల్లడి పరుస్తుందని నమ్మి వాక్యం, దేవుని ఆత్మల నడిపింపులవైపే దృష్టిని ఉంచారు.

బ్రదరెన్‌లు అంటే ఎవరు అనే వ్యాసంలో హెచ్.డబ్యు. సోల్టౌ ఇలా రాసారు. "వీరు గతంలోని సంప్రదాయాలనూ, వ్రాతలన్నిటినీ ప్రక్కకినెట్టి వాక్యాన్ని ఉన్నది ఉన్నట్టుగా ప్రకటించారు. వారిలో చాలామంది మేధావులు, విద్యాధికులు. అయితే వీరంతా గతంలోని ఆలోచనా విధానాలనూ కామెంటరీలనూ విడనాడి వాక్యంద్వారా పరిశుద్ధాత్ముడు తమకు నేరుగా ఏమి బోధించాడో దాన్నే అనుసరించారు." *

2. పాస్టర్లను అభిషేకించడమన్నది వాక్యానుసారంకాదు.

మనుషులు సృష్టించిన సంప్రదాయాలను దూరంగానెట్టి వాక్యాన్ని అర్థం చేసుకునే ప్రయత్నంలో ఒక వాక్యభాగానికీ మరొక వాక్యభాగానికీ పోలికలు వెతుకుతూ బ్రదరెన్‌లు చివరికి ఒక తీర్మానానికి వచ్చారు. క్రొత్త నిబంధనలో ఎక్కడా సూచన ప్రాయంగానైనాసరే సంఘాన్ని గురువులు (clergy) సామాన్యులు (laymen) అని రెండు భాగాలుగా విభజించినట్లు ఎక్కడాలేదు. పరిశుద్ధాత్ముడు ప్రసాదించిన వేర్వేరు వరాలవల్ల సంఘంలో వేర్వేరు బాధ్యతలను స్వీకరించి పరిచర్యలు చెయ్యడానికిఉన్న విశ్వాసులంతా సమానులే. అంతియొకయకు చెందిన ఇగ్నేషియస్ వ్రాతలనుబట్టి రెండవ శతాబ్దంనాటికి మతగురువులు [పాస్టర్లు] అంటూ కొందరిని ప్రత్యేకించే ఆచారం పొడచూపుతున్నట్టు అర్థం అవుతుంది. కాలక్రమేణా అభిషేకం పొందినవారే ప్రభురాత్రి భోజన సంస్కారాది బాధ్యతలను నిర్వహించాలన్న శాసనం ఏర్పడింది. రొట్టె ద్రాక్షారసం పంచడమన్నది ప్రధానమైన మతాచారంగా మారింది. వీరు లేకుంటే ఆరాధన గడవదు కాబట్టి వీరి చేతిలోకి అధికారంవచ్చి వీరు నిరంకుశులైనారు. సామాన్యులు వీరిమీద ఆధారపడ్డవారైనారు. రిఫార్మేషన్‌కూడా ఈ ఆచారం నుండి సంఘాన్ని పూర్తిగా విముక్తం చెయ్యలేకపోయింది మరో నాలుగు శతాబ్దాల తరువాత గ్రోవ్స్ తదితరులు పూనుకుని విశ్వాసు

*Soltau H.W. "They Found it written." Undated pamphlet.

అంతా యాజకులే' అన్న సిద్ధాంతాన్ని వెతికి గుర్తించి ఆచరణలో పెట్టడం జరిగింది. విశ్వాసంలో ఇంత ముందడుగు వెయ్యడం బహుశా క్రీస్తు పుట్టినప్పటినుండి ఇదే మొదటిసారేమో.* ఇది ప్రపంచ క్రైస్తవ సమాజాన్నంతటినీ ప్రభావితం చేసింది.

మొదట్లో ఇది రేకెత్తించిన అలజడి అంతా ఇంతా కాదు. అయితే నేడు అన్నిదేశాల్లోనూ లక్షలకొద్ది విశ్వాసులు ఈవిధంగా కూడుకొంటున్నారు. విశ్వాసి అయిన ప్రతి సహోదరుడికీ రొట్టె విరిచే అధిక్యత ఉంది. పౌలుకూడా ఈ విషయాన్నే కొరింథీయులకు హెచ్చరించి చెప్పాడు. తన మూలంగా క్రైస్తవులైనవారికి తాను స్వయంగా బాప్తిస్మం ఇవ్వకుండా తోటి విశ్వాసుల చేత ఇప్పించాడు.

రోమన్‌కాథలిక్‌వారు తమ అభిషేకాచారాలకు ప్రమాణంగా వాక్యాన్ని కాక ఆది సంఘ సంప్రదాయాన్ని చూపిస్తారు. కొన్ని రిఫార్మ్‌డ్ చర్చిలయితే వాక్యాధారాలనే చూపి వాదిస్తారు. చర్చ్ ఆఫ్ ఇంగ్లండు మరికొన్ని సంఘాల అధిపతిని రాజే నియమించేవాడు. క్రీస్తు తాను బోధించడంకోసం పిలాతును అనుమతి అడిగాడా లేక పౌలు ఫేలిక్సునో ఫేస్తునో వాక్యం ప్రకటించేందుకు అనుమతి కోరాడా? మరి దైవ సంబంధమైన కార్యాలలో ప్రభుత్వాల జోక్యం దేనికి? అ.కార్యములు 5:27–29లో ప్రధానయాజకులు అపొస్తలులతో "ఈ నామంలో బోధించకూడదని ఖండితంగా అజ్ఞాపిస్తున్నాను" అని చెప్పే వారు"మేము మనుష్యుల మాటకంటే దేవునిమాటనే లక్ష్య పెడతాము" అని జవాబిచ్చారు. కాబట్టి ప్రభుత్వానికీ క్రీస్తు సంఘానికి ఎలాటి పొత్తూ లేదని అర్థమౌతున్నది. ప్రభుత్వ పరిపాలనాక్రింద ఉన్న విశ్వాసి ప్రభుత్వా దేశాలకు లోబడవలసిందేగాని దేవునివాక్యం ఇచ్చే ఆదేశాలను త్రోసిపుచ్చి స్వంతంగా ఆదేశాలిచ్చే అధికారం ప్రభుత్వానికిలేదు. ఈవిధంగా ఆదిలో బ్రదరెన్ వారిలో అప్పటికే అభిషిక్తులైనవారున్నప్పటికీ వారు సత్యవాక్యాన్ని గుర్తించి తమ బిరుదులు, సంఘాధికారాలనూ విస్మరించి అందరు విశ్వాసులతో సమంగా ఆరాధనకు కూడివచ్చారు.

*Lang. G.H. Anthony Norris Groves. Thynne & Co London 1939. Pp 22

క్రీస్తే సంఘానికి శిరస్సు, ఆయన వాక్యే సంఘ పరిపాలన గురించిన అన్ని విషయాల్లోనూ తిరుగులేని ఆదేశం.

3. ఆత్మవరాలు, సంఘక్షేమాభివృద్ధికోసం వాటిని ఉపయోగించడం.

ఎ. నిర్దిష్టమైన ఆరాధనాక్రమంలేకుండా రొట్టె విరిచే కార్యక్రమంలో ఆత్మ వరాల ఉపయోగం.

బి. బోధించడం, ప్రవచించడం మొదలైనవి.

ఎ. దేవుని ఆత్మే ఆరాధనా క్రమాన్ని నడిపించే ఏకైకశక్తి. క్రొత్తనిబంధన ప్రకారం రొట్టె విరిచే కార్యక్రమం ప్రతివారం జరగాలి. ఆత్మతో ఆరాధించాలి గనుక నిర్దిష్టమైన ఆరాధనాక్రమం అనవసరం. పైగా క్రొత్తనిబంధన సంఘాల్లో ఇది కనిపించదు.

పాతనిబంధనలో అనేకమైన ఆచారాలు ఆరాధనా పద్ధతులు ఉన్నాయి గదా అనవచ్చు. పాతనిబంధన ప్రజలకు దేవుడు 'యెహోవా'గానూ విమోచించే దేవుడుగానూ,తన ప్రజలను తనకోసం ప్రత్యేకించుకున్న విధానం మాత్రం వీరికి తెలుసు. అయితే ఆయన్ను తన ప్రజలకు తండ్రిగా చూపించినవాడు యేసుక్రీస్తే. కాబట్టి శిష్యులంగా కుమారులంగా మనం తండ్రిని ఆరాధిస్తున్నాము పిల్లలు తండ్రిని సమీపించడానికి ప్రత్యేకమైన పద్ధతులు తంతులు అనవసరం. గౌరవం, భక్తి ఉండాలి. ఘనుడు, పరిశుద్ధుడు, ప్రేమామయుడైన రక్షకుడిగా గుర్తించడంద్వారా కలిగే భక్తి ఉండాలి. సామాన్య ప్రజలు నడిపే ఆరాధన గాబట్టి దీన్లో అజాగ్రత్త, చులకన భావం పనికిరావు. స్వేచ్ఛగా ఎవరికివారు ప్రభువును ఆరాధించడంలో మరింకే విధంగానూ రాని పవిత్రత చేకూరుతుంది. ఒకరు ప్రార్థన చెయ్యగా, మరొకరు వాక్యం చదవవచ్చు, మరొకరు ఒక కీర్తన ప్రకటించవచ్చు. ఒక క్రమం లేకపోయినా నడిపింపుకోసం మౌనంగా ప్రభువు ఎదుట వేచి ఉండడంలో మౌనంగానూ, బిగ్గరగానూకూడా స్తుతి, ఆరాధన ఫలిస్తాయి.

బి. ఆరాధనకు లేక బోధలకు సంబంధించివాక్యం ముందుగా సిద్ధపడాలా లేక అప్పటి ప్రేరణననుసరించి మాట్లాడాలా? వాక్యంలో ప్రవచించడానికి,

బోధించడానికి స్పష్టమైన తేడా చెప్పబడింది. సంఘ విశ్వాసాన్ని స్థిరపరచి వాక్యం, దాన్లోని సిద్ధాంతాలను విప్పిచెప్పే పద్ధతిని 'బోధ' అనవచ్చు. 1తిమోతి 4:11–14లో, ఒక బోధకుడు వాక్య సిద్ధాంతాలను అధ్యయనం చేసి వాటిని ధ్యానించి తన బోధ ద్వారా సంఘ క్షేమానికి కారకుడవ్వాలని చూస్తున్నాము. ప్రవచనం అంటే బైబిల్లో లేని సంగతులను వెల్లడిచెయ్యడం కాదుగాని, దేవుని వాక్యాన్ని అప్పటి సంఘంలోఉన్న పరిస్థితికి అనుగుణంగా విప్పిచెప్పి విశ్వాసాన్ని ప్రోత్సహించి బలపరిచి, దేవుని ప్రజలను నిజమైన ఆరాధనలోకి నడిపించడం. సంఘమంతా ఈ రెంటికీ మధ్యనున్న తేడాను గుర్తించి చెప్పబడుతున్న మాటలు వాక్యానుసారమోకాదో పరిశీలించి చూస్తూ ఉండాలి. (1కొరింథీ 14:29, 1యోహాను 4:1).

4. సంఘ నిర్మాణం, పరిపాలనకు అపొస్తలుల కార్యములు, పత్రికలు మూలాధారాలు—

ఎ. సంఘ నాయకత్వం

సంఘ నాయకులను నిర్దేశిస్తూ క్రొత్తనిబంధనలో 2 మాటలు కనిపిస్తున్నాయి.

1. పెద్దలు (పైవిచారణకర్తలు, కాపరులు) తీతు 1:5, 1తిమో 4:14. **(Elders, Presbyters)**

2. అధ్యక్షులు **(Bishops)** 1తిమోతి 3:1,2.

పైన ఉపయోగించిన మాటలన్నిటికీ ఒకటే అర్థం. అపొస్తలులలో అంతస్తులులేవు. పేతురు తాను సహ పెద్ద (లేక తోటి పెద్ద) నని చెప్పుకున్నాడు. (1పేతురు 5:1). అపొస్తలుడు కాని బర్నబాతో కలిసి పనిచేసాడు పౌలు. తన అపొస్తలత్వాన్ని గురించి తననుతాను హెచ్చించుకోలేదు. (2కొరింథీ 6:1–11, కొలస్సీ 4:10,11).

క్రొత్తనిబంధన కాలంలో కొన్ని సంఘాలు స్థాపించబడిన తరువాత పెద్దలెవరూ లేకుండా కొంతకాలం నడిచినట్టుంది. పెద్దల నియామకం జరిగినప్పుడు ఈ నిబంధనలను అన్నివేళలా పాటించాలి అన్న

ధోరణిలేదు. పౌలు బర్నబాతో కలిసి ఆయా సంఘాలు దర్శించి విశ్వాసులలో ఆత్మ సంబంధంగా నాయకులను గుర్తించి వాళ్ళని పెద్దలుగా నియమించాడు.

అంటే విశ్వాసులమధ్య నాయకులుగా గుర్తింపు పొందినవారినే వారు కొనసాగిస్తున్న ఆ పని నిమిత్తమే అధికారికంగా పెద్దలుగా నియమించడం జరిగిందన్నమాట. వారి క్రైస్తవ సాక్ష్యం నిలకడైన జీవితం, సేవ వీరిలా నియమించడానికి కారణమైనాయి. క్రేతు ఎఫెసు సంఘాలకు పౌలు తన అపొస్తలిక అధికారం చొప్పున తిమోతి, తీతులను పెద్దలుగా పంపాడు. థెస్సలోనిక సంఘానికి పెద్దలను నియమించే పని పరిశుద్ధాత్మ నడిపింపు కింద ఆ సంఘానికే వెయ్యడం జరిగింది. (1కొరింథి 16:15,16, 1థెస్స 5:12,13). యెరూషలేము సంఘంలో పెద్దల నియామకం ఎలా జరిగిందో చెప్పబడలేదు. బహుశా రెండు మూడు సంఘాలు అక్కడ ఉండి ఉండవచ్చు. (అ. కార్యములు 12:12 ను 12:17 తో పోల్చి చూడండి) పెద్దలను పెద్దలుగా నియమించినది పరిశుద్ధాత్మ దేవుడే అన్నది తేట తెల్లమే (అ.కార్యములు 20:28). తరువాతి కాలంలో తిమోతికి తీతుకురాస్తూ పౌలు పెద్దగా నియమించబడాలంటే ఒక విశ్వాసిలో ఉండవలసిన లక్షణాలను వివరించాడు. (1తిమోతి 3:1–13, తీతు 1:5–11). కాబట్టి ఈ సూత్రాలను టూకీగా చెప్పాలంటే.

1. పెద్దలు సంఘానికి శిరస్సయిన క్రీస్తుచే నేరుగా అనుగ్రహించబడిన బహుమానాలు. వీరు పరిశుద్ధాత్మ నడుపుదల క్రింద సంఘపు ఆధ్యాత్మిక అవసరాలను చూసుకుంటారు.

2. సంఘంలోని విశ్వాసులు వీరిని గుర్తించి, వారికి లోబడి వారిపట్ల గౌరవ మర్యాదలతో మెలగాలి (హెబ్రీ 13:17).

ఆదిమ బ్రదరెన్ సంఘాల్లో ముఖ్యమైనదైన బేతెస్థ ఛాపెల్‌లో ముల్లర్, క్రెయిక్‌లు పాస్టర్లుగా వ్యవహరించారు. అయితే సంఘపరిపాలనలో బాధ్యత వహించవలసిన మిగతా పెద్దలతోబాటే తాముకూడాఅన్న విషయాన్ని వారు స్పష్టంగా గుర్తించారు. వీరిద్దరుకూడా తమ సేవకు జీతం పుచ్చుకోలేదు. 1తిమోతి 5:17, 18లోని సూత్రాన్ని గుర్తించారుగాని ఆర్థిక

సహాయమన్నది, సంఘస్థులు తమ ప్రేరేపణ కనుగుణంగా తమకై తామే చెయ్యాలని అభిప్రాయపడ్డారు. బార్న్‌స్టేపుల్‌లోని రాబర్ట్ ఛాప్‌మన్‌కూడా తన ఆదాయాన్ని వదులుకుని అసెంబ్లీకార్యక్రమాలను చూసుకుంటూ పోషణార్థం, కేవలం విశ్వాసంతో దేవునిపైననే ఆధారపడ్డాడు. పాస్టరు పోషణా బాధ్యత ఆ సంఘం మీదనే ఉంది. ఇలాటి విశ్వాసపు పునాదిమీదనే భౌడన్ బీరులు తమ సేవాదృక్పథాన్ని కట్టుకున్నారు.

విశ్వాసులంతా దైవార్చనలో ప్రాతవహించడానికి అర్హులే అని గ్రోవ్స్ గారు అంగీకరించినప్పటికీ విశ్వాసులచేత గుర్తింపు పొందిన పాస్టర్లు ప్రతి సంఘంలోను ఉండాలని అలా ఉంటేనే సంఘాలలో క్రమం తప్పకుండా సాఫీగా పరిపాలన జరగడానికి అవకాశముంటుందనీ వీరు త్రికరణశుద్ధిగా నమ్మారు.*

గమనించవలసిందేమిటంటే ఆరంభంలో ఇంగ్లండులో అప్పటికే వేదాంత విద్యనభ్యసించి చాలినంత సంపదఉన్న మత గురువులు బ్రదరెన్ ఉద్యమంలో చేరడాన్నిబట్టి వీరు కేవలం తమ సంఘాన్ని కాయడానికి, బోధించడానికే తమ కాలాన్ని వెచ్చించి పాస్టర్లుగా ఉండడానికి సిద్ధపడ్డారు. అయితే బ్రదరెన్ ఉద్యమం ప్రపంచ వ్యాప్తమౌతున్నకొద్దీ ఇలాటి సంభవాలు పూర్తిగా అంతర్ధానమైనాయి. సంఘాన్ని నడిపించడానికి, సంఘంలో బోధ జరగడానికీ పరిశుద్ధాత్ముడు చాలు అన్న విషయం తేటతెల్లమైంది. సంఘాన్ని కాపరిగాఉండి నడిపించే వ్యక్తులను పరిశుద్ధాత్ముడే అభిషేకించాలి. గాని మనుషులవల్ల అభిషేకం Ordination అన్నది వాక్య విరుద్ధమన్న గ్రహింపు కలిగింది.

బ్రదరెన్ సంఘాల్లో ప్రజాస్వామ్యం Democracy లేదు. పాలితులు పాలకులను ఎన్నుకునే సంప్రదాయలేదు.అధికారాలను ఇచ్చేదాత దేవుడే అన్న సూత్రానికి ఇది విరుద్ధం" అని ముల్లర్ రాసాడు. సంఘంలో స్థానాల కొరకు వోట్లువేసే పద్ధతి, చేతులుఎత్తే పద్ధతి లేదు. పెద్దలను వారి కార్యాలద్వారా మాత్రమే గుర్తించడం జరుగుతుంది.

(బి) సంఘాల స్వతంత్ర ప్రతిపత్తి (autonomy)

*That the world may know. The challange of India Fred. Tatford Echoes of Service Vol 3. 1953

సంఘాలమీద పెత్తనంచేసే పై అధికారం ఏదీ ఉండకూడదు. ప్రతి సంఘానికి స్వతంత్ర ప్రతిపత్తి ఉంది. సంఘ నిబంధనలు అంటూ ఏవీ ఉండకూడదు. సంఘాలమధ్య సంబంధ బాంధవ్యాలుండవచ్చుగాని వీటన్నిటికీపైగా శాసనాలుచేసే అధికారం ఏదీ ఉండకూడదు. సంఘాలు నేరుగా క్రీస్తుకే విధేయత చూపాలి.

సంఘము అనే పదానికి రెండే రెండు అర్థాలున్నాయి. ఒకటి విశ్వాసుల గుంపువల్ల ఏర్పడిన స్థానిక సంఘం, రెండు భూమి పుట్టినది మొదలు విశ్వవ్యాప్తంగా ఉన్న విశ్వాసులమంద. ఇదిగాక వాక్యంలో సభ లేక కౌన్సిలు అన్న పదం వచ్చిన సందర్భం (ఉదా. యెరూషలేము కౌన్సిలు) ఏదంటే ఒక ప్రత్యేకమైన విషయాన్ని చర్చించి ఒక నిర్ణయానికి రావడం కోసం ఏర్పడిన సంస్థ. ఇది శాశ్వతంగా ఉండకూడదు. దీనికి కేంద్రీకృత అధికారాలు అసలే ఉండకూడదు.

ఈవిధంగా సంఘాలమధ్య లోకసంబంధంగా ఎలాంటి సంబంధం ఉండదుగాని విశ్వాసులందరిమధ్య సహవాసపు అనుబంధం నిలిచిఉండాలి.

అపొస్తలుల కాలంలోను, సంఘం ఆరంభదశలోమాత్రమే అపొస్తలిక సూత్రాలు పనికివస్తాయిగాని ఇప్పుడాసూత్రాలను పట్టించుకోనక్కరలేదనే వాదం ఉంది. అయితే బ్రదరెన్‌వారు తమకు వాక్యంలోఉన్న గట్టి నమ్మకం చొప్పున అన్ని కాలాలకు సందర్భాలకూ వాక్యమే ఆధారమని నమ్మి, సంఘ క్రమం, వ్యక్తిగత జీవనం, మొదలైన వాటిల్లో వాక్యంమీదనే ఆధారపడలారు. యూదా 3వ వచనంలో ఉన్నట్టు "ఒక్కసారే అప్పగించబడిన బోధ" ప్రకారమే బ్రదరెన్‌వారు అపొస్తలిక పద్ధతులమీద సంఘ నిర్మాణం చేసుకుంటారు.

సి. ఇతర సంఘాలమధ్య సహవాసం.

క్రొత్తనిబంధనకాలంలో సంఘాలమధ్య సహవాసం ఉన్నట్టే ఒకరినొకరు ఆదుకున్నట్టే (2కొరింథి 9:1–5). బ్రదరెన్ సంఘాల్లో సంఘాలను ఒకటిగా నిలిపే సహవాసబంధం ఉంది. గోదావరి డెల్టా మిషన్‌లో సిద్ధాంతపరమైన ఐక్యతేకాక, బైబిలుబోధ, సువార్త సంబంధమైన సమావేశాల మూలంగా, మానసిక ఐక్యత, ఆది మిషనరీలు, తమ పితరులు

ఇచ్చివెళ్ళిన సిద్ధాంతాలపట్ల నమ్మకం శ్రద్ధ అందరిలోనూ ఉంటాయి.

డి. సంఘంలో క్రమశిక్షణ.

బ్రదరెన్ సంఘాల్లో పై అధికారమంటూ ఎవరికీ లేనందువల్ల ఇతర డినామినేషన్ల సంఘాల్లో తలెత్తే అనేక రకాలైన సమస్యలు ఈ సంఘాల్లో కనిపించవు. అయితే ఇందువల్ల కొన్ని దుష్ఫలితాలుకూడా లేకపోలేదు. సంఘ క్రమశిక్షణకు పెద్దలంతాకూడా వాక్యాన్ని చదివి సందర్భానికి అన్వయించుకోవడం తప్ప వేరే మార్గంలేదు. ప్రతి సంఘమూ తన సమస్యలను తానే పరిష్కరించుకోవాలి. అయితే కొందరిని వెలివేయ వలసిన సందర్భాలు వస్తాయి. వాక్యం ప్రకారం మితిమీరిన అవినీతి, తప్పుడు సిద్ధాంతాలను బోధించి అనుసరించడం ఇవి రెండూ వెలివేతకు తగిన నేరాలే. ఇవి మద్య అంతటినీ ఘలియబెట్టే పాపాలు. (1కొరింథీ 5:6,7, గలతి 5:9), ఇలాటివాటిని తీవ్రంగా ఖండించాలేగాని 'ప్రేమ' పేరుతో తేలిగ్గా వదిలెయ్యకూడదు. ఇలాటి ప్రేమ మాటవరసకు ప్రేమేగాని నిజమైన ప్రేమ కానేరదు. వెలివెయ్యడం అన్నది నిజానికి వెలివెయ్యబడిన వ్యక్తి మేలుకోసమే. అతడు, లేక ఆమె పశ్చాత్తాపపడి తిరిగి మందలో చేరాలనే దీని ఉద్దేశం.

విశ్వాసులు ఒక చోటనుండి మరొక చోటుకు వెళ్ళాలంటే వారికి సిఫారసు పత్రికలు ( Commendation letters 2 కొరింథీ 3:1—3) ఇవ్వాలి.

గోదావరి ప్రాంతంలో ఈ సిద్ధాంతాలన్నిటినీ పాటించడం తేలికకాదు. చిన్నచిన్న సంఘాలు సలహాకోసం పెద్ద సంఘాలను సంప్రదించవలసిన పరిస్థితిలో అలా చెయ్యడం యోగ్యమే. ఎందుకంటే కొన్ని సంఘాల్లోని పెద్దలు బొత్తిగా చదువులేక, వాక్యంలోని లోతైన విషయాలను తెలుసుకో లేని స్థితిలోఉండి ఉండవచ్చు. కాబట్టి సమస్యా పరిష్కారాలకు ఇతర సంఘ పెద్దలను సంప్రదించడం అవసరమౌతున్నది.

5. విశ్వాసులంతా క్రొత్తనిబంధన బోధప్రకారం సమానులే.

ఎ. ఆదిమ బ్రదరెన్ సంఘాలవారి దృక్పథం.

ఆ కాలంలో కొన్ని బాప్టిస్టు సంఘాలు తమదగ్గర బాప్తిస్మం

పొందినవారినే ప్రభువు బల్లదగ్గరికి రానిచ్చేది. ఇతర సంఘాల్లో ఎక్కడా రొట్టె విరిచే కార్యక్రమంలో పాల్గొనని మాట ఇస్తేనే అవకాశం ఉండేది.

అయితే కొందరు బ్రదరెన్‌లు తమతమ అధికారిక సంఘాల్లో సభ్యులుగా ఉంటూనే ఒకచోట సమావేశమౌతూ రొట్టె విరిచేవారు. వేరే డినామినేషన్ స్థాపించాలన్న తలంపు ఎవరికీలేదు. ఛాప్‌మన్ బాప్టిస్టు, జార్జిముల్లర్ లూథరన్, క్రెయిక్ చర్చ్ ఆఫ్ స్కాట్‌లాండు, ఇతరులు అనేకమైన ఇతర డినామినేషన్లవారు. అయితే వీరంతా ఒకే సత్యపు నీడలో కూడుకున్నారు. "శరీరమొక్కటే, ఆత్మయు ఒక్కడే. ఆ ప్రకారమే మీ పిలుపు విషయమై ఒక్కటే నిరీక్షణ యందుండుటకు పిలువబడిరి. ప్రభువు ఒక్కడే, విశ్వాసమొక్కటే. బాప్తిస్మమొక్కటే. అందరికి తండ్రియైన దేవుడొక్కడే" (ఎఫెసీ 4:4) అన్నది ఆ సత్యం.

చిన్నచిన్న విషయాల్లో ఏకీభావంకంటే క్రీస్తుపట్ల ప్రేమకలిగి యుండడాన్ని ప్రాతిపదికగా తీసుకుని విశ్వాసులమధ్య సహవాసం ఉండాలి అని గ్రోవ్స్ ప్రతిపాదించాడు. ఇదే ఎందరో విశ్వాసుల ప్రేమపూర్వక పరిశుద్ధ సహవాస ఐక్యతకు దారితీసింది.

ఆ ప్రకారం ముల్లర్, క్రెయిక్, ఛాప్‌మన్ ముంచడము బాప్తిస్మంలో నమ్మకముంచినప్పటికీ అప్పటిలోఉన్న ఏ సంఘంలోనైనా ఏవిధంగానైనా బాప్తిస్మం పొందిన ఎవరినైనా తమ సహవాసంలోకి రానిచ్చేవారు. 1899 ఆగస్టులో డబ్యు. కొలింగ్‌వుడ్ ఇలా రాసాడు. "బ్రదరెన్‌వారి ముఖ్యోద్దేశమేమంటే వాక్యానుసారంగా విశ్వాసులందరి సహోదరత్వాన్ని తెలియజేయడమే. ప్రత్యేకమైన సభ్యత్వాన్ని వీరు గుర్తించరు. తాము క్రీస్తువారమన్న సూత్రమొక్కటే వారిని కలిపే బంధం. ఒకరియెడల ఒకరికున్న ప్రేమే వారి సహవాసంలోని రహస్యం. తమకు ఆత్మీయ జీవితం ఉంది అని తమ విశ్వాసం ద్వారానూ, నడత ద్వారానూ చూపిన వారందరినీ వీరు కలుపుకున్నారు.

సహవాసానికి క్రీస్తులో జీవితం తప్పించి మరే ఇతర నిబంధననైనా నియమిస్తే అది క్రీస్తు దేహాన్ని వికారంగా చెయ్యడమేనని గ్రోవ్స్‌గారి అభిప్రాయం.

అయితే ఈ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. సిద్ధాంతపరమైన ఐక్యత, అనుదిన జీవితంలో క్రైస్తవ విశ్వాస విధానం మొదలైనవే సంఘ

సహవాసానికి పునాది కావాలన్న డాబేగారి బోధలు క్రమేపీ బ్రదరెన్లలో వ్యాపించాయి. ఇతర డినామినేషన్లవారితో సాంగత్యం పెట్టుకోవడం అంటే ఆ డినామినేషన్ల పొరపాటు సిద్ధాంతాలను సమర్థించినట్టే అవుతుందని ఆయన వాదించారు. కాబట్టి ఇలాటి సిద్ధాంతాలనుండి వీటిని అనుసరించే వారినుండీ దూరంగా తొలగిపోవాలని ఈయన ప్రబోధించాడు. 'శిథిల మౌలిక్య సంఘాలు' అనే పేరున ఈయన ప్రతిపాదించిన సిద్ధాంతం. ఇతర డినామినేషన్లన్నీ నాశనానికి సిద్ధంగా ఉన్నాయని, వీటిని సంస్కరించడం అసాధ్యమని చెప్పుచున్నది. విమర్శలో కఠినంగా అభిప్రాయాల్లో బిరుసుగానూ ప్రవర్తనలో అమానంగానూ డాబె వ్యవహరించాడు. అసలు బ్రదరెన్ వారిని ఒకచోటికి చేర్చిన సిద్ధాంతాలను మొత్తంగా త్రోసిపుచ్చడమే డాబేగారు చేసిన పని. ఇందువల్ల 1844లో ప్రత్యేక బ్రదరెన్లు (Exclusive Bretherens) , స్వతంత్ర బ్రదరెన్లు (Open or Independent Bretherens) గా బ్రదరెన్ సంఘాలు చీలిపోయినాయి.

ఈ ప్రమాదాన్ని ముందుగానే పసిగట్టిన గ్రోవ్స్‌గారు డాబేగారికి నచ్చజెప్పుతూ ఎప్పటికప్పుడు ఉత్తరాలురాస్తూనే ఉన్నాడు. "ఇతరుల మనస్సాక్షిని తీర్పు తీర్చకూడదనే అపొస్తలుల సిద్ధాంతాన్ని అనుసరించాలని మీకు తోచడంలేదా? అయితే మనకేదన్నా స్వాతంత్ర్యం అంటూ ఉంటే వారిలో ఉన్న మంచి నుండి దూరమై పోవడంకంటే వారి చెడుగును భరించడం మేలుకదా?" అనేవాడు.

బ్రదరెన్ సంఘాల ప్రధాన వ్యవస్థాపకుడైన గ్రోవ్స్ దృక్పథాన్ని "That the world may know" అనే Echoes of service వారి ప్రచురణలో ఫ్రెడరిక్ టాట్‌ఫోర్డు తేటగా రాసారు" One of the fundamental principles of his life was the recognition of unity of all believers. He constantly endeavoured to demonstrate his fellowship with all who belonged to Christ and paid no regard to denominationalism. He stated clearly that one of his purposes in going to India, when invited by Arthur Cotton was "to become united more truly in heart with all the missionary band there, and to show that, not withstanding all differences, we are one in Christ"*

*That the world May Know-The challange of India. Fred. Tatford Echoes of Service vol. 3 1983 pp 84

క్రైస్తవ భక్తి విశ్వాసిని తన జీవితానికీ సేవకూ అవసరమైన వాటికోసం పూర్తిగా దేవునిమీదే ఆధారపడేందుకు ప్రేరేపించాలి.

ఇంతకు క్రితమే సంప్రదాయ క్రైస్తవ్యం మూలంగా మనసులో చోటుచేసుకున్న ఆలోచనలను ప్రక్కకినెట్టి తనకు తానుగా దేవుని వాక్యాన్ని చదవడంవల్ల గ్రోవ్స్ వాక్యంలోని కొన్ని విప్లవాత్మకమైన సత్యాలను వెలికి తీయగలిగాడు. అవి ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా అంగీకారయోగ్యాలైనాయి. ఈయన ఆలోచనలు బ్రదరెన్ ఉద్యమానికి ఒక రూపాన్ని ఇచ్చినాయి. వీటిలో ముఖ్యమైనది అవసరాలకోసం దేవునిమీద ఆధారపడడం.

గ్రోవ్స్ అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టి జార్జిముల్లర్ తన అనాథ శరణాలయం విషయంలో గొప్ప విశ్వాస విజయాలను సాధించాడు. ఇదే గోదావరి ప్రాంతపు సేవకు బౌడెన్ బీరుల్ని పురికొల్పిన ప్రేరేపణ.

సమయం, సామర్థ్యతలు, సంపద, డబ్బు ఇవన్నీ దేవునినుండి వచ్చినవేననీ వాటిని దేవునికోసం పొదుపుచేస్తూ వాడుతూ ఉండాలనీ విశ్వాసులు గ్రహించారు. వీటన్నిటిలెక్క ఆయనకే అప్పగించాలి.

దాతృత్వం ఒక బాధ్యత కాదు ఒక ఆధిక్యత. బ్రదరెన్ సంఘాల్లో దాతృత్వం 2కొరింథి 8:9 ఆధారంగా ఉంటూ వచ్చింది. ఉన్న అవసరాన్ని బట్టికాదుగాని ప్రభువుపట్ల ఒకరికి ఉన్న భక్తి శ్రద్ధలనుబట్టి ఇవ్వడం జరుగుతుంది.

చాలామంది రోమా 12:1 ననుసరించి తమ శరీరాలను సజీవయాగాలుగా అర్పించాలని ముందుకి వచ్చారు. అందుకే బ్రదరెన్ వారినుండి ఎక్కువమంది స్వదేశంలో, విదేశాల్లోకూడా మిషనెరీ సేవకులు బయలు దేరారు. తమ పోషణకోసం వీరు దేవునిమీదనే ఆధారపడినవారు.

సేవకొరకు ఒక మిషనెరీని ఒక సంఘంలోనుండి పంపించడానికి అ. కార్యములు 13:1–4, 16:1–4– ఈ రెండు వాక్య భాగాలనూ ప్రమాణాలుగా తీసుకోవడం జరుగుతుంది.

○○ ○○

పైన చర్చించిన సిద్ధాంతాలన్నిటికీ బ్రదరెన్ సంఘాలు ఆదిలో ఏర్పడిన కాలంలో ఆదిమ బ్రదరెన్‌లు నమ్మి ఆదరించారు. గోదావరి డెల్టా ప్రాంతానికి వచ్చిన మిషనెరీలు ఈ బోధలోనే స్థానిక విశ్వాసులను పెంచి స్థిరపరిచారు. సాంఘిక సాంస్కృతిక పరమైన తేడాలవల్ల అక్కడక్కడా స్వల్పమైన తేడాలున్నప్పటికీ మొత్తంమీద గోదావరి డెల్టా సంఘాలు ఈ క్రమంలోనే నడిపించబడుతున్నాయి.

అయితే ఆదిలోనే జార్జిముల్లర్, ఆంథోనీనోరిస్ గ్రోవ్స్ తదితరులకూ, జె.ఎన్. డాబే బృందానికీ ఏ సమస్యమీద వివాదం పుట్టిందో ఆ సమస్యే ఈనాడూ జి.డి.యం. సంఘాల్లో పెద్ద సమస్యగా పరిణమించింది. ఇతర డినామినేషన్లవారితో సహకరించే ప్రశ్నమీద అనేకమైన తర్జన భర్జనలు జరుగుతున్నాయి. ఇదిగాక ముందునుంచి బ్రదరెన్ సంప్రదాయంగా వస్తున్న స్త్రీ ప్రార్థన నిషేధంకూడా కొంత వివాదానికి దారి తీసింది. మొత్తంమీద స్థానిక విశ్వాసులు తమ గ్రామ, సంఘ పరిస్థితులకు అనుగుణంగా బ్రదరెన్‌వారు నమ్మిన సిద్ధాంతాలను అన్వయించుకుని ఆచరణలో పెడుతున్నారు.

సమాప్తం.

# ప్రేమ కానుక

పాలకొల్లు సంఘాలలో గణనీయమైన సేవ చేసి, నూతనంగా
సంఘాలు స్థాపించిన దైవజనుడు
ముప్పిడి జాకబ్ రాబర్ట్సన్ కాన్‌గారి
జ్ఞాపకార్థం వారి సతీమణి
శ్రీమతి ముప్పిడి విలాసమ్మ రాబర్ట్సన్ కాన్‌గారు (నరసాపురం)
వారి కుమారులు
శ్రీ ఎం. పెర్సీపాల్‌గారు (లండన్)
అందజేసిన ప్రేమ కానుక రు. 7000/-లు.
వీరి కుటుంబానికి మా కృతజ్ఞతాభివందనాలు.

జి. డి. యం. సంఘాల మొదటి విశ్వాసి
మార్లపూడి ఎంబేరు,
[ఎంబేరియన్ పేట, పాలకొల్లు] వారి జ్ఞాపకార్థం వారి కుటుంబికులు
శ్రీ మార్లపూడి న్యూటన్ బాబుగారు, ఎం ఏ. (నరసాపురం)
రు. 116/- లు ప్రేమకానుక యిచ్చారు.
వీరికి మా అభివందనాలు తెలియజేస్తున్నాం.



కిప్పల యాకోబు మాస్టారు, నరసాపురం



యం. సైమన్‌గారు, పాలకొల్లు



వాసా మనోహరంగారు
నరసాపురం



జేమ్స్ పీటర్‌సన్‌గారు
పాలకొల్లు



కూర్చున్నవారు : శ్రీమతి శారా, శ్రీమతి ఎ నేస్మిత్, శ్రీ ఎ. నేస్మిత్
కె. దానమూర్తి. ఇ. బి. బ్రామ్లీ, డి.బి. బర్ట్‌గారు
నిల్చున్నవారు : ఎ.మోజెస్, వి.జి. సామ్యూల్; జి ఎ. సామ్యూల్,
బి. సోమసుందరం, బి. ఆశీర్వాదం, కె.టి.సామ్యూల్ కె. జాకబ్,
బి. జాన్. వై. సుందరరావుగార్లు వెనుక : జి. డేవిడ్‌గారు



మిషన్ హైస్కూలు — జోనా మెమోరియల్
బిల్డింగ్ ప్రారంభోత్సవం
గౌ. గ్రంధి వెంకటరెడ్డినాయుడు, [న్యాయ శాఖామాత్యులు]
శ్రీమతి జోనాగారు, ప్రకాశరావుగారు, కలెక్టర్, ప. గో. జిల్లా,
శ్రీ సి. జోసెఫ్‌గారు, శ్రీ ఎ. నేస్మిత్‌గారు



మిషన్ హైస్కూలు స్టాఫ్, నరసాపురం



నేస్మిత్ దంపతులకు వీడ్కోలు



సండేస్కూలు సేవాభివృద్ధికి సంఘాల్లో విస్తృతంగా పర్యటించి
ప్రోత్సహించిన సండేస్కూల్ టీచర్స్ ఫెలోషిప్

జీవజలములు – రేడియో కార్యక్రమాలు



సహో. టి. జే. సిడ్నీగారు, పాలకొల్లు.
ఆరంభంలో రికార్డింగ్ స్టూడియోను నిర్వహించినవారు



జీవజలములు ప్రస్తుత స్టూడియో డైరెక్టర్
సహో. టి. కె. జార్జిగారు, నరసాపురం



గళ్ళాసాముయేలుగారు, సగంచెర్వు



జీవన్ జ్యోతి ప్రెస్, నరసాపురం.



'గొప్ప సాక్షి సమూహం' - గ్రంథ ప్రచురణకు
అమూల్య సలహాల నిచ్చిన పెద్దలు

నిలుచున్నవారు : శ్రీయుతులు బి. థియోడర్
టి. కె. జార్జి, కె. జోబ్ సుదర్శన్ (రచయిత)
స్పర్జన్ పీటర్‌సన్, పి. లాజరస్‌గార్లు

కూర్చున్నవారు : శ్రీయుతులు పి.జోబ్ మోజెస్. ఒ. ఫ్రాన్సిస్.
కె. విల్సన్ (సంపాదకుడు).
పి. జ్ఞానప్రకాష్ (ఎ.జి డి ఎం.ఏ అధ్యక్షులు)
కె.ఎస్. జాక్సన్ (ఎ. జి. డి. ఎం, ఏ.
కోశాధికారి) గార్లు



పి. ఆనందరాజుగారు
నరసాపురం



బి. వీరన్నగారు
చొప్పరామన్నగూడెం



జి. సేంబాబుగారు
నరసాపురం

